# అమృతవాహిని

**1**


శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రులు

ముముక్షుజన మహాపీఠాధిపతులు

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః
ఓం శ్రీ కృష్ణాయ నమః
శ్రీ సంపత్కుమార యతీంద్రాయ నమః



# పీ ఠి క

మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిమ్
య త్కృపా తమహం వందే
పరమానంద మాధవమ్ ॥

శ్రియఃపతియును, సకలకల్యాణగుణ పరిపూర్ణుడును, దయాంబురాశియును, క్షేత్రక్షేత్రజ్ఞ నియామకుడును, బ్రహ్మరుద్రేంద్రాది సకల సురగణ సేవిత చరణకమలుడును, ప్రణత క్లేశ విభంజనుడును, అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడును, నిరతిశయానంద స్వరూపుడును, సకలభువన జన్మస్థితిలయ కారణుడును, మోక్షాధిపతియును, మోక్షప్రదాతయును, తృణాదిబ్రహ్మపర్యంత సమస్తవస్తు బాహ్యాభ్యంతర వ్యాపకుడును, శరణాగతరక్షైకదీక్షుడును, ధర్మపరిపాలకుడును, అధర్మనాశకుడును, పరాత్పరుడును, గుణాతీతుడును, గుణాధిపతియును, అనంతకోటి భాస్కరప్రకాశుడును నైన నారాయణుని ధ్యానించి, -

యతిలోకనాథులును, శమాదిషడ్గుణ సంపన్నులును, జ్ఞానభక్తి వైరాగ్యములకు సముద్రమువంటివారును, శిష్య వాత్సల్యైక జలధులును, అపరరామానుజులును, మద్గురు నాథులునునైన శ్రీ శ్రీ శ్రీ సంపత్కుమార యతీంద్రులను సంస్తుతించి, -

పరమాత్మ పాదారవిందములయందలి భక్త్యతిశయముచే, బ్రహ్మాధిపత్యమును సైతము తృణప్రాయముగ జూచునట్టి పరమవిరాగులును, కేవల కరుణామూర్తులు కనుక చేతనోద్ధరణమే పరమప్రయోజనముగ నెంచి, అవతరించునట్టి వారునునైన శ్రీమద్రామానుజాచార్యుల శ్రీపాదముల నొదలదాల్చి, -

సకల ప్రపన్నజన సముదాయమునకును నమస్కరించి,-

సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, అఘటిత ఘటనా సమర్థుడును, ఆనందమయ స్వరూపుడును, సకలకల్యాణగుణ సాగరుడును, భక్తవాత్సల్యైకజలధియునునైన నారాయణుడు, గోపాలకృష్ణపరబ్రహ్మము నా హృదయమున నధివసించి, తన సంకల్పముచే నాచేత వ్రాయించు విధమున, శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన శ్రీమద్భగవద్గీతతోపనిషత్తునకు ముముక్షు జనోపయోగముగా వ్యాఖ్యానము వ్రాయుచున్నాను.

లోకకల్యాణప్రదుడైన పరమాత్మ నా యందుండి, ఈ వ్యాఖ్యానము వ్రాయుటకు ప్రేరేపించుటచే, నాకు పరమాత్మ స్ఫురింపజేసిన విధమున వ్రాయుటకు స్థిరసంకల్పుడనై యున్నాను.

నేను గ్రహించిన అర్థము ఎట్లు నాకు సమంజసముగా తోచుచున్నదో, దానికి విరుద్ధమైనవి ఎట్లు నాకు అసమంజసములుగా తోచుచున్నవో, వ్యక్తిగత సంప్రదాయగత రాగద్వేషములకు ఏమాత్రమును పాల్పడకుండ, వ్యక్తిగత సంప్రదాయగత దూషణలుగాని, అగౌరవ సూచకవాక్యములుగాని లేకుండ త్రికరణశుద్ధిగ, సాత్త్వికమైన భాషలో ముముక్షువుల యెదుట పెట్టుటకే సర్వవిధముల ప్రయత్నించెదను. నా యీ కర్తవ్యనిర్వాహణములో కృతకృత్యుడనగునట్లు కరుణాదృష్టులు పరపి, ఆశీర్వదింపవలసినదిగా భగవంతుని, పరమభాగవతులను చేతులుజోడించి వేడుచున్నాను.

శ్రీమద్భగవద్గీతామాహాత్మ్యమును వర్ణింప బ్రహ్మకును సహస్ర జిహ్వాలుగల ఆదిశేషునకునుగూడ వశముకాదన, నింక నెవనికి శక్యము ! సాక్షాత్పరిపూర్ణావతారమైన గోపాలకృష్ణ పరబ్రహ్మముయొక్క ముఖకమలమునుండి వెలువడిన దీ గీతా గంగాస్రవంతి.

ఈ శరీరమును ప్రాకృతజలముతో కడిగికడిగి శ్రమించి యేమిఫలము! మానవుడు ఈ గీతాగంగాజలములో మ్రుంకులిడి, తనివిదీర త్రావి, స్థూల సూక్ష్మ కారణ శరీరములనెడి మలినమును పోగొట్టుకొని, పునరావృత్తి రహితమైన శాశ్వత బ్రహ్మానందము ననుభవింపగలుగుచున్నాడు.

సకల నదులకును సమావేశస్థానము సముద్రమైనట్లు, జడచేతనయుక్తమైన సమస్త చరాచర జగత్తుయొక్క సృష్టి కంతకును మూలస్థానము బ్రహ్మమైనట్లు, సమస్త విజ్ఞానములకును నుద్భవస్థానము నిత్యవిజ్ఞానమైనట్లు, సకల దార్శనిక విద్యలకన్నిటికిని సమావేశస్థానము - సార్వభౌమభక్తియొక్క సృష్టికి మూలస్థానము - మోక్షసాధనభూతములైన వివిధ విజ్ఞానములకు నుద్భవస్థానము శ్రీమద్భగవద్గీతయే.

శ్రీమద్భగవద్గీత అనంతములైన రత్నముల కాకరమగు అగాధసముద్రము. ఆ సముద్రమున మునిగి రత్నములనన్నిటిని ఎవడు ఏరుకోగలడు! ఎన్ని రత్నములు ప్రోగుచేసికొన్నను, అందున్న రత్నములలో కోట్యంశముకూడ తరుగవు. ఎవరి కెంతవరకు శక్తికలదో అంతవరకు రత్నములను మోసికొని పోయి ఆనందింపవలసినదే. తీసినకొలది రత్నములు దొరకుచునే యుండును.

ఇంతవరకు ఎంతమంది మహాత్ములో ఈగీతకు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. ఎన్నెన్ని భావరత్నములనో మన కందించియున్నారు. కాని, ఎవరును, నేను గీతలోని భావరత్నముల నన్నిటిని వెలార్చితిని, ఈ విజ్ఞానరాశి నాపోశనము పట్టితిని అని చెప్పగలవారు లేరు. నాశక్తికొలది, పరమాత్మ ఆజ్ఞచేత ఆయన అందించినంతలో స్వల్పరత్నములను ఏరుకొన ప్రయత్నింతును. ఆ కొలది రత్నములే ముముక్షువులకు ఏకొంచమైనను ఉపయోగపడినయెడల నేనెంతయో ధన్యుడను.

కృష్ణపరమాత్మ ముఖకమలమునుండి ప్రవహించిన అమృతప్రవాహమైన శ్రీగీతాగంగాస్రవంతి నిరతిశయానంద దాయకము. ఇది శ్రీ మహాభారతములో భీష్మపర్వమున హార ములో నాయకమణివలె వ్యాసభగవానునిచేత సంఘటింప బడినది.

భారతయుద్ధసమయమున కౌరవ పాండవ బలములు రెండును, యుద్ధాభిలాషతో ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున చేరి, యుద్ధమునకు సిద్ధములైయుండగా, తనకోరికమీాద కృష్ణపరమాత్మ తన రథమును ఉభయసైన్యముల మధ్యకు నడిపి నిలుపగా, ఉభయసైన్యములను బాగుగా పరిశీలించి చూచిన అర్జునునకు "అయ్యో! ఈ ఉభయసైన్యములలోను గలవారందరును నాస్వజనమే- తాతలు, తండ్రులు, అన్నలు, తమ్ములు, కుమారులు, మేనమామలు, మామలు, గురువులు, బావమరదులు మొదలగువారు- వీరినందరిని చంపుట ధర్మమా? ఈ రీతిగా చంపి పొందునదేమి? ఛీ! యుద్ధముచేయను" అని కలిగిన నిర్వేదమే గీతావతరణమునకు మూలము.

ఆ నిర్వేదము విషమసమయములో కలిగినది, అజ్ఞాన జన్యము, అస్వర్గ్యము, అకీర్తికరము అని పరమాత్మనిర్ణయము. కాబట్టి, తన కనన్యభక్తుడైన పార్థుని ఈవిషమసంకటమునుండి ఉద్ధరింపవలసినబాధ్యతగల కృష్ణపరమాత్మ, ఆ యుద్ధరంగమున, దివ్యప్రబోధముజేసి, పార్థుని అంతరంగమున జ్ఞానజ్యోతిని

వెలిగించి, ఐహికసామ్రాజ్యమునకును పారమార్థికసామ్రాజ్యమునకును-అనగా మోక్షసామ్రాజ్యమునకును - అర్హునిగా చేసెను. ఆ దివ్యప్రబోధామృతప్రవాహమే ఈ గీత.

ఈ దేశము, ఈ కాలము, ఈ పరిస్థితి, ఈ వ్యక్తి అను భేదము లేకుండ, సర్వదేశములందును, సర్వకాలములందును, సకల పరిస్థితులలోను, సర్వులకును ఐహిక పారమార్థిక సుఖశాంతులను ప్రసాదించునది ఈగీతామాత.

కనుకనే వ్యాసభగవానులు

"గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర సంగ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా ॥"

అనగా 'గీత చక్కగా అధ్యయనము చేయదగినది. అట్లు గీతను అధ్యయనము చేసిననాడు, ఇంక ఇతర శాస్త్రములతో అవసరమేమి? అక్కరలేదు. మిగిలినశాస్త్రములకంటె దాని వైలక్షణ్యమేమనగా ఈ గీతాశాస్త్రము కేవలము 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అని స్తుతింపబడిన సాక్షాత్ పరమాత్మ ముఖకమలమునుండి వెలువడినది' అని చెప్పియున్నారు.

కాబట్టి, ముముక్షువైన సాధకుడా! నీకు ప్రకృతి బంధమునుండి బయటపడి, పరమాత్మానుభవరూపమైన శాశ్వత బ్రహ్మానంద మనుభవించవలయునని ఆపేక్ష ఉన్నచో, గీతామృతమును సేవించుము!

ఈ గీతామృతము మధురాతిమధురమైన ఒక దివ్యరసాయనము. భవరోగమునకు దివ్యౌషధము. ఈ రసాయనము కామధేనువునుండి పిదుకబడినది. శ్రీకృష్ణపరమాత్మ ఉపనిషత్తులను కామధేనువుగా చేసి, పిదుకుటకు తానే గొల్లవాడైనాడు. అర్జునుడే దూడ. బుద్ధిమంతులైన ముముక్షువులు భోక్తలు. పాలు గీతామృత దివ్యరసాయనమే. ఇట్టి పరమ దివ్యరసాయనము సులభసాధ్యమైయుండగా, దీనిని కాదని ఇతర ఔషధములకు ప్రాకులాడుట వెఱ్ఱితనముకాదా!

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్"

కనుక ప్రకృతి బంధమునుండి విడివడి శాశ్వత బ్రహ్మానంద మనుభవింప కాంక్షగలవారెల్లరును రండు! ఈ గీతామృతమను దివ్యౌషధమును సేవించి కృతకృత్యులుకండు అని వ్యాసభగవానులు ఆహ్వానించుచున్నారు.

శ్రీమద్భగవద్గీతను పఠించునప్పుడు మహావిశ్వాసము, శ్రద్ధ, భక్తి కలిగి గీతను సమీపించుము. గీతావక్తయందు గాని, శ్రోతయందుగాని, గీతలోని విషయమునందుగాని అశ్రద్ధ,అవిశ్వాసము, లోపములు కనిపెట్టవలయుననెడి తలంపు, తిరస్కారభావము అణుమాత్రమైనను ఉండరాదు. తనకున్న లౌకిక విజ్ఞానమునకు అహంకరించి, నా యీ విజ్ఞానపూర్ణమైనబుద్ధితో గీతను విమర్శింతును అని గీతను సమీపించినచో

ఏమియును ప్రయోజనము లేదు. భక్తిశ్రద్ధలతో, మహా విశ్వాసముతో గీతామాత చరణాబ్జములకు శరణాగతుడవు కావలయును. అప్పుడు ఆతల్లి అనంతములైన రత్నములకు నిలయమైన తన హృదయద్వారము తెరచి ఎదుట పెట్టును. పరమాత్మ సృష్టిలోని అపార భౌతికజ్ఞానములో ఏ కోట్యంశమో తెలియుటతోడనే, తనకు తెలిసినదే సర్వస్వమనుకొని, తనకు తెలియనిది లేనేలేదనెడి భావముతో మోహాంధుడై ఆధ్యాత్మికజ్ఞానభాండారమును విమర్శింపరాదు. తనబుద్ధికందని దానిని త్రోసిపుచ్చుటకు ముందంజ వేయుటలో ప్రతివాడును సమర్థుడుగనే ఉండును. మానవుని బుద్ధి ఎంత, విజ్ఞానమెంత! ఇంద్రియములకు,బుద్ధికి అందనిదిగదా పరమార్థతత్వజ్ఞానము! దానిని తెలిసికొనుటకు బుద్ధిలో రాగద్వేషము లుండరాదు. మనకు తెలియకుండ బుద్ధిలో రాగద్వేషములు దాగియుండును. బుద్ధిని, ఇంద్రియములను ఆధారముగా చేసికొని రాగద్వేషము లుండును. కాబట్టి ఇంద్రియములద్వారమున జరిగిన ప్రతి పనిలోను, బుద్ధిచేయు ప్రతి ఆలోచనమునందును రాగద్వేషముల యొక్క ప్రభావము ఇంతయో అంతయో ఉండకపోదు. రాగద్వేషము లున్నంతవరకు యథార్థసత్యము తెలియదు. కనుక భక్తిశ్రద్ధలు, విశ్వాసము కలిగి వినయవిధేయతలతో గీతామాతను ఆశ్రయింపవలయును. అట్లు ఆశ్రయించిన సర్వమును సిద్ధించును.

పరమార్థవిజ్ఞానవారాశియైన వేదమునే పరమప్రమాణముగా అంగీకరించి, దానివలననే పరమార్థజ్ఞానము బడయువల

యును. వేదము రెండుకాండలుగా నున్నది - కర్మకాండ, జ్ఞానకాండ అని. జ్ఞానకాండనే ఉపనిషత్తులనియును, వేదాంతములనియును, శ్రుతిశిరస్సులనియును అందురు. ఆ ఉపనిషత్తులన్నియును బ్రహ్మజ్ఞానామృతరసముతో నిండి యుండును.

ఆ ఉపనిషత్తులను కూడ మానవబుద్ధితో విచారించుట అవగతము చేసికొనుట అసంభవము గనుక, ద్వాపర యుగాంతమున ఉపనిషత్ ప్రతిపాద్యమైన ఆ సచ్చిదానంద ఘనపరబ్రహతత్త్వమే, యదువంశభాగ్యరాశియై శ్రీకృష్ణుడుగ అవతరించి, ఉపనిషత్సారమంతయును - ఒక్కచుక్కకూడ మిగిలిపోకుండ - గీతాపాత్ర యందు పట్టి ముముక్షుజనులకొరకు భద్రముచేసినాడు. కనుక ముముక్షువులెల్లరును గీతనే ఆశ్రయించినారు. పరమార్థ సత్యము తెలియవలయుననిన గీతనే ఆశ్రయింపవలయును. "యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా" గీత కేవలము సాక్షాత్పరబ్రహ్మ ముఖకమలము నుండి వెలువడిన అమృతస్రవంతి. అందుచేతనే గీతలో భ్రమ ప్రమాదములకు తావులేదు.

వేదము పరబ్రహ్మముయొక్క నిశ్వాసరూపముగా వెలువడినది. కల్యాణగుణ మహోదధియు, సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడునునగు శ్రీకృష్ణపరమాత్మ ముఖకమలము నుండి వెలువడిన వాగమృతస్రవంతి గీత. వేదమునను, గీతయును పరమాత్మనుండి సరాసరి వెలువడుటలో తుల్యములే కనుక,

మాహాత్మ్యము, విలువ రెంటికిని సమానమే అయినను, గీతయందు సౌలభ్యము ఒక విశేషము. కనుక వైదిక మత ప్రవర్తకులందరును తమతమ మతములను గీతయను నికషోపలముపై గీసియే వన్నె కట్టుకొనినారు.

గీతను పఠించుట రెండువిధములు. ఒకటి- గీతలో ఏమి చెప్పబడియున్నది అని, దానిలోని సత్యమును తెలిసికొను బుద్ధితో పఠించుట. రెండు-తాను ఒక అభిప్రాయము కలిగియుండి, దానిని సమర్థించుకొనుటకు గీతను ఉపయోగించుకొనుటకు పఠించుట. మొదటివిధానము ఉత్తమమైనది. రెండవ విధానము ఆచరింపరానిది. రెండవతరగతివారు గీతలలోని శ్లోకములకు సహజముగా అర్థములు చెప్పక, తమ తమ భావములను సమర్థించుకొనుటకు తమభావముల కనుగుణముగా విరిచి విరిచి అర్థములు చెప్పుదురు. ఆవును పాలుపిదుకువారు సహజముగా పిదుకవలయును. అట్లు పిదికినయెడల చక్కగ పాలు లభించును. కాని, బలమున్నదికదాయని, అవసరమైనదానికన్న ఎక్కువబలమును ఉపయోగించి గట్టిగ పిదికినయెడల పాలకు బదులు రక్తమువచ్చును. అట్లే విరిచి విరిచి అర్థములు తీయుటచే, అవి విపరీతార్థములే కాగలవు. కావున సక్రమముగ గీతను అధ్యయనముచేసి, దానిలోని సత్యసిద్ధాంతమును గ్రహింపవలయును.

వ్యాసులు "గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైశ్శాస్త్ర సంగ్రహైః" అని చెప్పియున్నారు. కాబట్టి ఎవరు ఏయే

మతములను సమర్థించుకొనవలయుననన్నను వైదిక శాస్త్రము లందు విశ్వాసముకలవారు ఐనచో, గీతనే ఆశ్రయింప వలయును.

గీతకు వక్త "కృష్ణస్తు భగవాన్ స్వయం" అనబడిన, కల్యాణగుణ మహోదధియును, సర్వజ్ఞుడును, సర్వశక్తి మంతుడును, దయామృతరాశియును ఐన శ్రీకృష్ణపరబ్రహ్మము. రామచంద్రమూర్తి అనుష్ఠానావతారము; కృష్ణపరమాత్మ ఉపదేశావతారము అని కొంతమంది చెప్పుచున్నారు. అది ఒక దృష్టితో చూచిన యథార్థమేగాని, సర్వవిధముల అట్లే తలంపరాదు. ఉపదేశావతారమనగనే కృష్ణపరమాత్మ బోధయే గాని అనుష్ఠానములేనివాడని అర్థముచేసికొనుచున్నారు కొంతమంది అల్పమేధస్కులు. అనుష్ఠాన శూన్యమైన ఉపదేశమునకు విలువఉండునా ? ఎవరు ఏది ఉప దేశించుచున్నారో, వారు దానిని అనుష్ఠానమందుంచుకొని ఉపదేశించిననే దానికి విలువ. ఇద్దరు బ్రాహ్మణులు "సంభావ న"కుపోయిరి. అందులో ఒకడు సంస్కృత భాషాప్రావీణ్యము, బహుశాస్త్రపరిచయము కలిగి, తనను తాను పండితుడుగా భావించుకొనువాడు. రెండవవాడు సామాన్యుడు. సంభావన చేయువారు ఈ ఉభయులకును చెరిఒకరూపాయను ఇచ్చిరి. అప్పుడు పండితమ్మన్య బ్రాహ్మణుడు "ఆత్మస్తుతి, పరనింద, ధనకాంక్ష లేని నాకును ఒకరూపాయ, ఆ శుంఠకును

ఒకరూపాయయేనా" అని కేకలు వైచినాడట. ఆచరణలేని ఉపదేశకులు ఇట్టివారి కోవకే చేరుదురు. కృష్ణపరమాత్మ తాను ఎంత చెప్పెనో అంతయును తాను ఆచరించెను; తాను ఏది అచరించెనో అదియే చెప్పెను. కృష్ణపరమాత్మ పరిపూర్ణావతారము. రామచంద్రమూర్తి మాయామానుష విగ్రహుడు. కృష్ణపరమాత్మ లీలామానుష విగ్రహుడు. రామచంద్రమూర్తి తన పరత్వమును దాచుకొని, ఉత్తమ మానవుడుగా ప్రవర్తించెను. అట్టి ఆచరణనే చూపెను. కృష్ణపరమాత్మ తన పరత్వమును ప్రకటించుకొనుచు, దైవత్వమును ఆచరణలో ప్రదర్శించెను. అందుచేత సామాన్య మానవులందరకును రామచంద్రమూర్తి ఆచరణ సరిగా అర్థము చేసికొని, అనుసరించుటకు అందుబాటులో నుండెను. కృష్ణ పరమాత్మ ఆచరణను మన బుద్ధి అందుకొనలేదు. మనకు కావలసినదానిని కృష్ణపరమాత్మ ఆచరణలోనుండి ఏరికొనుట కష్టసాధ్యము. కనుక మనము ఆయన ఉపదేశములే ఆధారములుగా ఆచరణమును రూపొందించుకొనవలయును. జాగ్రత్తగ ఆలోచించిన కృష్ణపరమాత్మ జీవితములోని ఆచరణ అంతయును, గీతలో చెప్పినదానికి పరమలక్ష్యముగా నుండును. మానవజీవితములో నిత్యము గోచరించు ధర్మములు పుత్రధర్మము, శిష్యధర్మము, మిత్రధర్మము, గృహస్థధర్మము, దూతధర్మము మొదలగునవి. వాటిని శ్రీకృష్ణపరమాత్మ ఎట్లు పాలించెనో చూడుడు :

పుత్రధర్మము : దేవకీవసుదేవులకు పుత్రుడుగా అవతరించినాడు. కాని వారు కృష్ణపరమాత్మ అవతారకాలమున

కారాగారమందు, సంకెలలు వేయబడి, బంధింపబడి యుండిరి. పాపము వారు పుత్రుని ఆటపాటలు, అద్దుముద్దుజూచి, గారాబముచేసి పెంచుకొను భాగ్యమునకు నోచుకోరైరి. ఈ మహాభాగ్యము యశోదానందులకు కలిగినది. అంతకంటె సుకృతవిశేష మేమి కావలయును! సర్వకాల సర్వావస్థల యందును ఆ దంపతులు కృష్ణపరమాత్మను, బలరాముని ఆడించుచుండిరి. కాని యథార్థమాలోచించిన కృష్ణుని వారాడించలేదు. వారినే కృష్ణుడు తన ఇష్టమువచ్చినట్లు ఆడించినాడు. ఒక్కక్షణమైనను వారు కృష్ణుని మరచి యుండలే కుండిరి. కృష్ణుడు మరువనిచ్చినగదా! ఆడించి ఒకపరి ఏ పనిమీదనైనను అటుపోయెనా, ఇకచూడుడు, ఏదియో ఒక అల్లరిపనిచేయుట - ఏమిరా కృష్ణా అనుచు యశోదమ్మ పరుగెత్తుకొని వచ్చుట; ఇంతే. ఒక్కక్షణము ఎడబాయుటకు వీలులేదుగదా! ఎప్పుడైనను ఇంటిలో పనిచేసికొనుటకు పోయిన, ఆ కొన్నిక్షణములైనను, కృష్ణుడు ఎక్కడకు పోయినాడో! ఎవరియింటిలో దొంగతనము చేయుచున్నాడో! ఏ యే వివాదములు తెచ్చునో అను ఆలోచనలలో మునిగి యుండును. "ఏమిచేసినావురా కృష్ణా?", "ఎక్కడకు పోయినావురా కృష్ణా!" "నీళ్ళుపోయనా కృష్ణా?" "పాలు ఈయనా కృష్ణా!" "దుస్తులు వేయుదునురా కృష్ణా!" "దుమ్ములో ఆడుకొనకు కృష్ణా!" "మా కృష్ణుడు మీయింటికి వచ్చినాడా అమ్మా?" "మా కృష్ణుని చూచినావా అక్కా!"-

ఇట్లు సర్వకాల సర్వావస్థలయందును "కృష్ణా! కృష్ణా!" అను స్మరణయే. కృష్ణునికి నీళ్ళుపోయను, అన్నముపెట్టను, వస్త్రాలు తొడుగను, కృష్ణుని తిట్టను, కృష్ణుని కొట్టను, కృష్ణుని తప్పులు విచారించను యశోదకు సమయము చాలకుండెను. ఈ విధముగ సత్పుత్రుడు తల్లిదండ్రుల నెంత సంతోషింప జేయుట సాధ్యమో అంత సంతోషమును యశోదానందులకు కలిగించుటకు ఎన్నియో బాల్యలీలల నాచరించుచు నటించెను. అవి వారి మనసున నెంతవరకు నాటినవనిన, తరువాతి కాలములో, కృష్ణపరమాత్మ గోకులమువిడిచి, మధుర, ద్వారక చేరినతరువాతకూడ, ఆ బాల్యలీలలే తలచుకొని, తలచుకొని, కృష్ణవియోగము భరింపలేక, దుఃఖపడినను, ఆ దుఃఖము వారి ముక్తికే కారణమయ్యెను.

కంససంహారమైన పిమ్మట దేవకీవసుదేవుల వద్దకు చేరి జీవితమంతయు వారి ఆజ్ఞావశుడై ప్రవర్తించెను. బాల్యదశలో యశోదానందులవద్దను,తరువాత దేవకీవసుదేవులవద్దను పుత్రధర్మమును సక్రమముగా నిర్వర్తించెను.

శిష్యధర్మము : సాందీపమునియొద్ద శిష్యత్వమును నెరపుచు విద్యనేర్చిన కాలమున తన శిష్యధర్మమును ఎంత నిర్వంచనముగ, నిర్దుష్టముగ నెరవేర్చెనో చూడుడు. గురుసన్నిధానములో అత్యంతభయభక్తులతో గురువునకును, గురుపత్నికిని శుశ్రూషచేసెను. తన గొప్పతనమును ఎంత

మాత్రమును మనసునకు తెచ్చికొనక అడవికిపోయి, కట్టెలు కొట్టి, నెత్తిపై మోసికొని వచ్చెడివాడు. ఎండయనక, వానయనక, రాలనక, రప్పలనక, చిన్నదనక, పెద్దదనక, ఉచ్చమనక, నీచమనక సేవలుజేసి, విద్యలగడించి, చివరకు గురుదక్షిణ సమర్పించి శిష్యధర్మమును నెరవేర్చుకొనెను. ఆదర్శశిష్యుడని పేరందెను.

మిత్రధర్మము : మిత్రధర్మమును నెరవేర్చిన వా రందరిలోను అగ్రగణ్యుడు శ్రీకృష్ణపరమాత్మ. బృందావనములోని బాల్యదశలో గోపీగోపకుల విషయమున తాను ప్రదర్శించిన నిష్కామమిత్రధర్మము పరమాశ్చర్యకరము. ఎన్నెన్ని ప్రమాదపరిస్థితులనుండి, ఎన్నెన్ని విధముల రక్షించినాడు! దురాగ్రహము చెందిన ఇంద్రుడు కురిపించిన మహాభయంకర శిలావర్షమునుండి, గోవర్ధనపర్వతమెత్తి కాపాడినాడు. బ్రహ్మమాయనుండి కాపాడినాడు. అఘాసురుడు పెద్దఅజగర రూపముతో గోపబాలురనందరను మ్రింగగా అఘాసురుని సంహరించి, వారందరిని కాపాడినాడు. కాళీయుని బారినుండి రక్షించినాడు.

పెద్దవాడైనతరువాత పాండవులవిషయమున తన మిత్రత్వము ఎంతనిర్వంచనముగ నెరవేర్చినాడో చూడుడు! కేవలము సేవకునివలెనే వర్తించినాడన్నచో అతిశయోక్తి ఈషణ్మాత్రమును లేదు.

ఉన్నాడుగదా కర్ణుడు - దుర్యోధన మిత్రుడు! ఘోష యాత్రలో తన్ను నమ్ముకొనియున్న దుర్యోధనుని పుత్రమిత్ర కళత్రాదులతో కట్టి గంధర్వులు తీసికొని పోవుచున్న సమయములో- తాను భుజబలమును చూపించవలసిన సమయములో- పిక్కబలమును చూపించి, ప్రాణభీతిచే ఇంటివద్ద దాగినాడు తాను అర్జునునితో గెలువలేనని అనుభవపూర్వకముగా అనేకమార్లు తెలిసికొనికూడ, తన డంబములచే దుర్యోధనుని మోసగించినాడు. తన కక్ష, తన స్వార్థము, తన పేరుప్రతిష్ఠలు చూచుకొనినాడు కాని, దుర్యోధనుని మేలు చూచినవాడు కాడు. సమయమువచ్చినప్పుడు పారిపోవుచుండుట, మరల దుర్యోధనునితో "నేనున్నానుగదా, నీకేమియును భయము వలదు" అని అభయమిచ్చుచుండుట- ఇది కర్ణుని మిత్రత్వము. పోనీ, ఇన్నియును తెలిసి తెలిసి, దుర్యోధనుడు నమ్ముట ఆశ్చర్యము!

ద్రోణాచార్యుడును, ద్రుపదమహారాజును బాల్య మిత్రులు. అట్టి మిత్రత్వము, ఎట్లు పరిణమించినదో చూడుడు! ద్రోణుడు పెద్దవాడైన తరువాత పిల్లవానిపాలకు ఆవు కావలసి వచ్చి, తన బాల్యమిత్రుడు ద్రుపదుడున్నాడని ఎంతో విశ్వాసముతో వచ్చి, అవమానముపొంది పోయినాడు.

కృష్ణపరమాత్మ మిత్రత్వ మట్టిదికాదు. మిత్రధర్మము లన్నియును హృదయపూర్వకముగ నిర్వహించిన ఆదర్శ మిత్రుడు శ్రీకృష్ణుడు.

కుచేలుడు, కృష్ణపరమాత్మ ఒక గురువునొద్ద విద్య నభ్యసించిరి. ఆ కాలమున వారు చాల మిత్రులుగా నుండెడి వారు. విద్యాభ్యాసము పూర్తిఅయినపిమ్మట చాలకాలము గడచిపోయెను. కుచేలుడు చాల బీదతనమున బాధపడు చుండెను. బహుసంతానము. తినుటకు సరియైన తిండి, కట్టుటకు సరియైన గుడ్డ కూడ లేకుండెను. కాని కుచేలుడు మహాభక్తుడు. ఈ దారిద్ర్యబాధ ఆతనిని ఏమాత్రమును చలింపజేయ లేకుండెను. ఆయనభార్య మహాపతివ్రత. ఆమె పిల్లలకుకూడ కడుపునిండుగ తిండి లేకుండుటచూచి ఓర్వలేక, భర్తయొద్దకు పోయి "మీకు కృష్ణపరమాత్మ బాల్యమిత్రుడు అని వింటిని. ఆయన మహైశ్వర్య సంపన్నుడై యుండెనుగదా ! ఒకసారి మీరు పోయి దర్శించిన మీకు సహాయము దొరకదా !" అని అనేక విధముల పోరగా, భార్యాబిడ్డలచేతను, పోనీ, ఈ రూపముననైన బాల్యమిత్రుని ఒకమారు చూచివచ్చు అదృష్టము కలుగును అనియు, బయలుదేరి వెళ్ళినాడు. త్రోవలో ఆలోచించుకొనుచున్నాడు - శ్రీకృష్ణుని దర్శనము అగునా ? ద్వారపాలకులు నన్ను లోనికి పోనిత్తురా ? ఆ భవనములో అడుగు పెట్టుటకు నాకధికారము ఉండునా - ఇట్లు ఏవేవో ఆలోచనలతో ద్వారమునొద్దకు వచ్చునప్పటికి కుచేలుడు వచ్చుచున్నట్లు కృష్ణునకు తెలియగనే, అకస్మాత్తుగ, ఆతురతతో హంసతూలికాతల్పమునుండి దూకి, పరుగు పరుగున ఎదురేగి, చెమటలుకారు మిత్రుని తన పట్టుపీతాంబ

రములతోడనే కౌగిలించుకొని, అత్యాదరముతో లోనికి తీసికొనివచ్చి, సింహాసనముపై కూర్చుండబెట్టి, కాళ్ళుకడిగి, శిరముపై చల్లుకొని, భార్యల శిరములపై చల్లి, భవనమంతయు మూలమూలల చల్లి మిత్రుని తాను పరుండు హంసతూలికా తల్పముపైన పరుండబెట్టి, రుక్మిణీసత్యభామాదులు వింజామరలువీవ, తాను పాదములొత్తుచు కుశలప్రశ్నలు వేయుచుండెను. అనంతరము మహైశ్వర్యమును ప్రసాదించెను.

మిత్రుడన కృష్ణుడే మిత్రుడు. కష్టసుఖములు గణింపక కీర్తిప్రతిష్ఠలయందు దృష్టి లేక, అవసరము కలిగినయెడల తన నియమములకును, వ్రతములకును భంగముకలిగినను, కేవలము మిత్రకార్యమునే ప్రధానముగ నెంచుకొని పాండవులకు తోడ్పడెను. అర్జునునికి సారథ్యము చేసినాడు. రథాశ్వములను కడుగుట, మేపుట, మొదలగుచర్యలు స్వయముగా ఆయనయే చేయువాడు. ఇట్లు చేయుటకు ఎంత అహంకార రాహిత్య ముండవలయునో ! పాండవులయందు ఎంత ప్రీతి యుండవలయునో ! ఎన్నెన్ని ఆపత్సమయములందు పాండవులను రక్షించెనో ! ద్రౌపదిని నిండుసభకు లాగుకొని వచ్చినప్పుడు, దుర్వాసుడు సశిష్యుడై అడవిలో అతిథిగా వచ్చినప్పుడు, భగదత్తుడు వైష్ణవాస్త్రమును ప్రయోగించినప్పుడు, కర్ణుడు నాగాస్త్రము వేసినప్పుడు, సైంధవవధ సమయమున, ఇంకను ఇట్టి అనేక ఆపత్సమయములలో కంటికిరెప్పవలె కాచి

రక్షించెను. మిత్రకార్యమును ఇంత శ్రద్ధాసక్తులతో, సక్రమముగా నెరపినవారు కలరా కృష్ణుడుతప్ప !

గృహస్థధర్మము : గృహస్థధర్మమునుకూడ ఏ లోపములును లేక పూర్ణముగ నిర్వహించెను. పదునారువేల నూటఎనమండ్రు భార్యల విషయమునను సమభావముతో మెలగి దక్షిణనాయకుడని పేరుపొందెను. అతిథుల నభ్యాగతుల నాదరించెను.

ధర్మసంరక్షణార్థము దుష్టశిక్షణ జేసెనేగాని, శత్రుత్వము పాటించువాడుకాడు. తప్పనిసరియైనప్పుడు సంహరించుటయే కాని, ఊరక శత్రుత్వమును పురస్కరించుకొని ఎవరిని చంపినవాడుకాడు. నరకాసురునిచంపి, ఆ రాజ్యము అతని కుమారుడైన భగదత్తునికిచ్చెను. శిశుపాలునిచంపి, ఆ రాజ్యము అతని కుమారునకే ఇచ్చెను. అట్లే జరాసంధాది దుష్టులను సంహరించుట. ఆ సంహరించుటలో దుష్టశిక్షణమును ధర్మరక్షణమును మాత్రమే సంకల్పముకాని స్వార్థము ఈషణ్మాత్రమును లేదు.

దూతధర్మము : పాండవులపక్షమున కౌరవసభకు దూతగా పోయినప్పుడు నిర్వంచనముగ నిర్దుష్టముగ ప్రయత్నించి, తన ధర్మమును నెరవేర్చుకొనెను. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అను ధర్మము నెంతో జాగ

రూకతతో పాలించినాడు. ప్రయత్నలోపము ఏమాత్రము చేయలేదు. ఎవరితో, ఏమేమి, ఎంతెంతవరకు, ఎట్లెట్లు చెప్ప వలయునో వారివారితో, అన్నియును, అట్లే చెప్పెను. సామ దాన భేదము లన్నియును ప్రయోగించెను. సామముగా వారి తప్పులు తెలిపెను. దానముగా రాజ్యమంతయును మీరే తీసికొనుడు, అయిదు ఊళ్ళిచ్చినచాలును అని చెప్పి చూచెను. భేదముకూడ ఉపయోగించి కర్ణునితో సంభా పించెను. కృష్ణునకు సంధి కుదురునది కాదని తెలియును. ఆంత ర్యమున ఇష్టముకూడ లేకపోవచ్చును. కాని ప్రయత్నములో మాత్రము ఏమాత్రమును లోపములేదు. కృష్ణపరమాత్మ ఏ గడియలో అవతరించెనోకాని, ప్రతివిషయములోను ఆయన ఆచరణను శంకించుటయే జరుగుచున్నది. కాని జాగ్రత్తగ, వాసనారహితబుద్ధితో చూచిన, ఆయనయొక్క చరిత్ర అర్థము కాగలదు.

ఆ కృష్ణభగవానుని పవిత్రవాణి ఈ గీత.

భగవద్వాణి అత్యంత మహిమకలదిగా నుండును. ఒకప్పుడు, ఒక వ్యక్తికొరకు ఏకదేశముగా ఉపదేశించినట్లు కనపడినను, అది అన్నికాలములలోను, అన్ని దేశములలోను, అన్ని పరిస్థితులలోను, అందరికిని, వారివారి అధికారమునుబట్టి ఉపయోగించు సదర్థములే ప్రసాదింపగలదు.

ఒకప్పుడు దేవతలు, మానవులు, దానవులు బ్రహ్మ వద్దకు శిష్యభావముతో శిక్షపొందుటకుపోయిరి. నియమముతో

బ్రహ్మచర్యమును పాలించుచుండిరి. వారి దీక్ష పూర్తిఅయిన తరువాత సంతోషించి బ్రహ్మ మీకేమి కావలయును అని అడిగెను. అప్పుడు వారు "ప్రభూ! మాకేది అవసరమో దానిని మీరే ఉపదేశింపుడు" అని ప్రార్థించిరి. బ్రహ్మ దేవతలను, మానవులను,దానవులనుకూడ ఉద్దేశించి ఒకేఒక అక్షరమును- "ద" అని ఉపదేశించెను. తరువాత బ్రహ్మ ఆ ముగ్గురను - విడివిడిగా అడిగినాడు - " 'ద' అనగా మీరు ఏమి అర్థము చేసికొనినారు ?" అని. అప్పుడు దేవతలు "ప్రభూ ! మేము దేవతలము. అనగా భోగప్రియులము. మాకు వృద్ధాప్యమనునది లేదు. కనుక ఇంద్రియములద్వారమున విషయము లనుభవించి ఆనందించుటయే పరమప్రధానముగా ఎంచుకొనువారము. కనుక మాకు 'ద' అనగా దమమును - అనగా ఇంద్రియ నిగ్రహమును-ఉపదేశించినారు" అని చెప్పినారు. "అవును - బాగుగ గ్రహించినారు" అని బ్రహ్మ సంతోషించినాడు. తరువాత మానవులను అడిగినాడు. వారు "ప్రభూ ! మేము ఎంతవరకును కర్మ చేయుటయును, ధనమును సంపాదించుట యును, పరమప్రధానముగా ఎంచుచుందుము. కనుక మాకు 'ద' అనగా దానమును ఉపదేశించినారు" అని చెప్పినారు. బ్రహ్మ సంతోషించి దానవులను అడిగినాడు. దానవులు "ప్రభూ ! మాకు క్రూరత్వము ప్రధానముగా నున్నది. ఇతరులను హింసించుట, నరకుట, బాధించుట [illegible] పరమప్రధానములుగా నున్నవి. కనుక మాకు 'ధ' అనగా

దయను ఉపదేశించినారు" అని చెప్పినారు. బ్రహ్మ ఆనంద భరితుడైనాడు. బ్రహ్మ ఈ ముగ్గురకును ఉపదేశించినది ఒకే అక్షరము. కాని ముగ్గురును వారివారి అధికారమునుబట్టి వేరు వేరు అర్థములు తీసికొనినారు. అది సమంజసమే. అది వారికి కల్యాణదాయకమే అయినది. ఇట్టిది మహాత్ముల వాణిలో నున్న మహిమము. ఇక భగవద్వాణిని గురించి ఎంతని చెప్ప గలము !

ఇక గీత సర్వశాస్త్రములకు ఆధారమైన దనుటలో అతిశయోక్తిలేదు. గీత అన్ని కాలములందును, అన్ని దేశము లందును, అన్ని పరిస్థితులలోను, అందరకును కల్యాణ దాయకమే. అన్ని తరగతులవారికిని, వారివారి అధికారమునకు తగినట్లు, ప్రబోధమును కలిగించి, కల్యాణ పథమున నడిపించి సర్వులకును గమ్యస్థానమైన భగవత్ప్రాప్తిని కలిగించును.

భ్రమప్రమాదరహితమైన గ్రంథము గీత. కేవలము మానవుడు తన బుద్ధిబలముమీదను, లౌకిక విజ్ఞానము మీదను, భాషాప్రావీణ్యముమీదను, బహుశాస్త్ర పరిచయము మీదను ఆధారపడి, అంతమాత్రముననే అహంకరించి, దీనిని లౌకిక విమర్శదృష్టితో అధ్యయనము చేసినయెడల, సత్త్వ రజస్తమోగుణ ప్రవాహరూపమైన ఈ మాయయొక్క సుడి గుండములో తగుల్కొనవలసినదే. భగవంతుని విశ్వసించి భగవంతునియందే భారముంచి, ఆయనకే శరణాగతుడై,

భగవద్వాణియైన ఈ మహోత్కృష్ట గీతాతత్త్వమును విధి విధానము ప్రకారము అధ్యయనము చేసినచో గీతలోని యథార్థము అరచేతిలోని ఉసిరికపండువలె సాక్షాత్కరించును.

గీతయొక్క ప్రతి అధ్యాయమునకు చివర "ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగ శాస్త్రే" అని ఉన్నది. గీత యోగశాస్త్రమనికూడ చెప్పబడి యున్నది. గీత యోగశాస్త్ర మెట్లు అయినది ? గీతలో చెప్పబడిన యోగమేమి ? పరిశీలింపవలయును.

యోగ సంప్రదాయమునకు మూలగ్రంథమైన పాతంజల యోగసూత్రములలో "యోగ శ్చిత్తవృత్తి నిరోధః" - యోగమనగా చిత్తవృత్తులను నిరోధించుట- అని చెప్పబడి యున్నది, యోగసూత్రములలోని యోగముయొక్క ప్రయోజనము కేవలము చిత్తవృత్తులను నిరోధించుట మాత్రమే. యోగ సంప్రదాయము ప్రకారము మానవుని గమ్యస్థానము ముక్తి- అనగా ఆత్యంతిక దుఃఖనివృత్తి. దుఃఖము ఏమాత్రమును- దుఃఖలేశముకూడ - లేకుండుటయే ముక్తి అని సిద్ధాంతము. అయితే, ఇట్టిస్థితి కలుగవలయుననిన, దుఃఖమునకు కారణము ఏమి అని ఆలోచించవలసియున్నది. దుఃఖమునకు కారణము చిత్తమే. చిత్తముయొక్క వృత్తులు ప్రపంచ విషయముల వైపు ప్రవహించుటయే దుఃఖమునకు కారణము. కనుక దుఃఖములు లేకుండ ఉండవలయుననిన, చిత్తవృత్తులను

ప్రపంచ విషయములవైపునకు పోనీక నిరోధించవలయును. అట్లు నిరోధించిన, ఇక ఆ దుఃఖము పూర్తిగ నివృత్తియగును. కనుక పాతంజల యోగము దుఃఖనివృత్తికి ఏకైక ఉపాయము చిత్తవృత్తి నిరోధమే అని నిర్ణయించుటచే, యోగముయొక్క ప్రయోజనము చిత్తవృత్తి నిరోధము అని ఏర్పడినది.

గీతయొక్క ప్రయోజనము అంతమాత్రమే కాదు. గీతలో చెప్పబడిన యోగమునకు అర్థము చిత్తవృత్తి నిరోధము మాత్రమే కాదు. ప్రయాణము చేయవలయుననిన, గుఱ్ఱము కావలయును. గుఱ్ఱముతో పాటు మిగిలిన సౌకర్యములు-జీను, రికాబులు, కళ్ళెము మొదలగునవి అన్నియును ఉండును. కాని ప్రయాణమునకు సాధనము గుఱ్ఱము అనియే అనవలయును. గుఱ్ఱమునే ఆశ్రయించవలెను. అట్లుకాక, ప్రయాణమునకు జీను పరికరము అనిన ఎట్లుండును ? జీను ప్రయాణము చేయుటలో సౌకర్యమునకు ఉపకరించు ఒక పనిముట్టు. అంతే గాని, దానిచేతనే ప్రయాణము సాగదు. గుఱ్ఱమే ప్రయాణ సాధనము. గుఱ్ఱములేకుండ ఒక్క జీనుతో ప్రయాణము చేయగలడా ? అయితే జీనులేకుండ గుఱ్ఱముతో ప్రయాణము చేయగలడా అని ప్రశ్నించరాదు. ఆ ప్రశ్న తెలివిగలవారు వేయతగినదికాదు. గుఱ్ఱముతో జీనును ఉండును. ఒకవేళ వాదనకొరకు మాట్లాడినచో, జీనులేకపోయిన సౌకర్యమునకు కొరతయే కాని, ప్రయాణమున కభ్యంతరమేమి ? - అంత

దూరము అతివాదము చేయరాదు. గుఱ్ఱముతోపాటు జీనును సిద్ధించును. ప్రయాణ పరికరమైన గుఱ్ఱమును ఆశ్రయించు నప్పటికి, ఆ గుఱ్ఱముయొక్క ఏర్పాటులోనే జీనుకూడ ఉండును. కనుక ఒక్క జీనుకొరకు ప్రత్యేకముగా ప్రయత్నము చేసి, ఆ ఒక్క జీనుతోనే ప్రయాణము నెరవేరు ననుకొనుట ఉచితముకాదు.

జీనుకొరకు వేరే ప్రయత్న మక్కర లేకపోయినమానె, జీను అవసరమని ఒప్పుకొనినారుకదా, మీరుకూడ పాతంజల యోగమును ఒప్పుకొనినట్లే అనవచ్చును.

పతంజలి అనిన మాకు విరోధములేదు. ఆ మహాపురుషుడు ఆదరణీయుడుకూడ. ఈ ఉపమానములో జీను అనగా చిత్తవృత్తి నిరోధరూపమైన ఫలము. యోగసాధనచేత చిత్తవృత్తి నిరోధము లభించుచున్నది. చిత్తవృత్తి నిరోధమునకు ప్రయత్నముచేయుట యోగసాధన. కాబట్టి మేము చిత్తవృత్తి నిరోధరూపమగు ఫలమును నిషేధించుటలేదు. దానికి ప్రత్యేక సాధనమైన పాతంజల యోగసాధన మాకు అనివార్యముగా అనుసరణీయము కాదు అనుచున్నాము.

ప్రభువు మీ ప్రయాణమునకు గుఱ్ఱము పంపించినారు అనిన, తాను మరల ఎవరిదగ్గరకైనపోయి, పలుబాధలుపడి, జీను సంపాదించుకొని, అది చంకలో పెట్టుకొని పోవలయునా? అది ఎంత తెలివితక్కువ! గుఱ్ఱముతోనే జీనును వచ్చును,

ఆ సౌకర్యముతోనే, ప్రభువు గుఱ్ఱమును పంపును. కనుక జీనుకొరకు వేఱప్రయత్నము అక్కరలేదు. ఆ ఒక్క జీను తోనే పని అగునని అనుకొనువారు సంపాదించుకొనవచ్చును.

గీత అన్ని సౌకర్యములు కల ఉపాయమును చెప్పు చున్నది. ఆ ఉపాయమే గీతయొక్క యోగము. ఆ యోగము పాతంజల యోగముకంటె అత్యంతము విలక్షణమైనది. సమగ్రమైనది. గీతాప్రతిపాదితమైన యోగమునకు లక్ష్యము భగవత్ప్రాప్తి. పాతంజలయోగమునకు లక్ష్యము చిత్తవృత్తి నిరోధము. మోక్షమనగా, ఆత్యంతిక దుఃఖనివృత్తి మాత్రమే అనువారికి పాతంజల యోగము సరిపోవచ్చును. చిత్తవృత్తులు పూర్తిగ నిరోధింపబడిననాడు దుఃఖనివృత్తి అగుటలో సందేహము లేదు. మనోవృత్తులు ఇంద్రియముల ద్వారమున ప్రాపంచిక విషయములందు ప్రవహించిననేగాని ప్రపంచము యొక్క అనుభవము రాదు. ప్రపంచము అనుభవములోనికి వచ్చిననేగాని దాని లక్షణమైన దుఃఖము సంభవించదు. దుఃఖాలయము ఈ ప్రపంచము. కనుక దుఃఖాలయమైన ఈ ప్రపంచమందు మనోవృత్తులు ప్రవర్తించనీయక నిగ్రహించ వలయును. అట్లు నిగ్రహించగలిగిననాడు ప్రపంచమందలి దుఃఖము అనుభవమునకురాదు.

వైద్యుడు మత్తుమందు ఇచ్చి, తరువాత శరీరమును శస్త్రములతో కోసినను బాధ తెలియుటలేదు. మత్తుమందు ప్రభావము పోయిన తరువాత మరల బాధ తెలియుచున్నది.

కారణము - అప్పుడు చిత్తము చేష్టారహితమై మొద్దుబారి పోవుటచే దాని వృత్తులు అణగిపోయినవి. కనుక బాధ తెలియుటలేదు. అట్లే యోగప్రభావముచేత చిత్త వృత్తులు నిరోధింపబడినప్పుడు ప్రపంచమందలి దుఃఖము తెలియదు. కనుక ఆసమయములో దుఃఖనివృత్తియగును. మత్తుమందుచేత కలిగిన వృత్తినిరోధము తాత్కాలికము; అక్రమ విధానము. తాత్కాలికము కనుక మరల మనస్సు చేష్టావంతమగుటయు, దుఃఖము తెలియుటయు ఉన్నది. సక్రమమైన పద్ధతులలో యోగము సాధించినవారికి కలిగిన చిత్తవృత్తి నిరోధమునకు మరల భంగము లేదు. కనుక మరల దుఃఖము అనుభవమునకు రాదు. కాబట్టి దానిని ఆత్యంతిక దుఃఖనివృత్తి అన్నారు. మత్తుమందుచేత కలిగినదానిని ఆత్యంతిక దుఃఖనివృత్తి అనలేదు. అది తాత్కాలిక దుఃఖనివృత్తి. యోగమునొక్క ఫలము ఆత్యంతిక దుఃఖనివృత్తి. మత్తుమందుచేత మనోవృత్తుల నదికట్టుట అక్రమము. యోగముచేత నిరోధించుట అక్రమముకాదు కాని, బలాత్కారము. గీతాప్రతిపాదిత యోగములో చిత్తవృత్తి నిరోధము సహజముగా కలుగును. కాని ఈ యోగము యొక్క లక్ష్యము అంతమాత్రమే కాదు. దీని ప్రయోజనము ఆత్యంతిక దుఃఖనివృత్తి మాత్రమేకాదు. ఈ యోగములో చిత్తవృత్తి నిరోధము సహజముగా ఎట్లు కలుగునో, అట్లే దాని ఫలమైన ఆత్యంతిక దుఃఖనివృత్తి కూడ కలుగును. కాని దీని ప్రయోజనము సచ్చిదానంద ఘనపరబ్రహ్మమును పొందుట, శాశ్వత బ్రహ్మానందప్రాప్తి.

కనుక గీతాయోగము, ప్రయోజనము- అన్నియును అత్యంత విలక్షణములైనవి అని మాత్రమే ఇక్కడ ప్రతిపాదించ దలచినది. అస్తు.

(శ్రీ) భగవద్గీత ఉపనిషత్తే. ప్రతి అధ్యాయమునకును "శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు" అని యున్నది. ఈపాఠము పరంపరగా అనాదినుండియును ఆచారముగావచ్చుచున్నది. వ్యాసభగవానులే ఇట్లు పఠింపించి యుండురనుట నిస్సంశయ మని మావిశ్వాసము. "ఉపనిషత్తులు అపౌరుషేయములు. పౌరుషేయములు అయిన గ్రంథములు ఉపనిషత్తులుకానేరవు. భగవద్గీత శ్రీకృష్ణునిచేత పలుకబడినది గనుక పౌరుషేయమే. అపౌరుషేయ మెట్లుకాగలదు ? 'స్మృతి' యనవచ్చును" అని కొందరివాదము. స్మృతి అని అనుటలో మాకెట్టి అభ్యం తరము లేదుగాని, ఉపనిషత్తు అనికూడ అనవలెను. పరిపూర్ణ పరబ్రహ్మతత్త్వమే లీలామానుష విగ్రహుడుగా అవతరించి చెప్పుటచేత దీనిని స్మృతి అని అనుటలో ఏమియు అభ్యంత రము ఉండదు. లీలామానుష విగ్రహుడుగా అవతరించినను, ఆ వస్తువు పరిపూర్ణబ్రహ్మతత్త్వమే కనుకను, ఆయన గీతలో కూడ "ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ" అని చెప్పి, తరువాత

"యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః"

అని చెప్పుకొని యున్నాడు. కనుక లోకములో పురు షులు ఇద్దరే కలరనియును, ఆపురుషు లిద్దరికంటెను తాను

విలక్షణుడైన వాడును, ఉత్తముడును కాబట్టి పురుషోత్తము డనియును చెప్పుకొని యున్నాడు. 'పురుషోత్తమః' - పురుషాభ్యాం ఉత్తమః పురుషోత్తమః' అని విగ్రహము. కనుక శ్రీకృష్ణపరమాత్మ సామాన్యముగా లోకమునందు చెప్పబడు పురుషుడు కాడు. కనుక ఆయనచేత చెప్పబడిన గీత పౌరు షేయము కాదు. కాన ఉపనిషత్తే.

"కృష్ణస్తు భగవాన్ స్వయం" అని శ్రీభాగవతము, "బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః, సర్వ భూతస్థ మేకో నారాయణం కారణరూప మకారపరబ్రహ్మోం" అని నారాయణోపనిషత్తు. కనుక కేవలము సచ్చిదానందఘున పరబ్రహ్మముయొక్క ముఖకమలమునుండి వెలువడిన గీతా స్రవంతి ఆ పరబ్రహ్మముయొక్క నిశ్వాస రూపమున వెలువడిన వేదముకంటె ఏ విషయమునను విలువలో తక్కువది కాదు. తక్కువది అనుకొనుట గొప్ప అపచారము కూడ కాగలదు. విషయము చూచినను, ఉపనిషత్సారమే గీత.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్".

ఉపనిత్తులయొక్క యథార్థతత్త్వమును తెలియలేనిస్థితికి మానవులు వచ్చుటచేత, మానవులయందు పరిపూర్ణాను గ్రహము కలిగి, ఆ పరబ్రహ్మతత్త్వమే యదువంశ భాగ్య రాశియై, సాక్షాన్మన్మథమన్మథుడై, లోకకల్యాణ ప్రదమైన దివ్యమంగళ స్వరూపముతో శ్రీ కృష్ణ పరమాత్మగా అవతరించి ఆ ఉపనిషత్తుల యథార్థసారమును గీతామృతముగా

ప్రసాదించినాడు. కాన ఈ గీతలో వేదముకంటె, సౌలభ్య గుణము ఒకటి అధికముగా కలదు. సౌలభ్యగుణ మున్నచోట సామాన్య ప్రపంచములో విలువతగ్గును. గీతను ఉపనిషత్తనక పోవుట కిదే కారణమై యుండవచ్చును.

గీత అటు ఉపనిషత్తుగాను, ఇటు స్మృతిగాను కూడ అధికారము కలిగి యున్నది. కాన, పరమార్థ విజ్ఞానమునం దభిలాష కలవారు విజ్ఞానభాండారమైన ఈ గీతనే ఆశ్రయించవలయును.

"గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా"

అని చెప్పినారు వ్యాసభగవానులు. భూదేవితో విష్ణుమూర్తి ఇట్లు చెప్పినాడు -

"గీతా మే పరమావిద్యా బ్రహ్మరూపా నసంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా సా నిర్వాచ్యపదాత్మికా"

ఇందు గీతయొక్క స్వరూపమును తెలియజేసినారు. గీతయొక్క మహిమను ఇంతకంటె ఎవరు ఎట్లు చెప్పగలరు!

దుర్ముఖి సంక్రాంతి } సర్వజనశ్రేయోఽభిలాషి
శ్రీ కృష్ణ శ్రమము } సీతారాం.

ఓం శ్రియఃపతయే నమః

ఓం శ్రీ పరమాత్మనే నమః

## శ్రీమద్భగవద్గీతా — ప్రథమోఽధ్యాయః

# అర్జున విషాద యోగః

ధృతరాష్ట్ర ఉవాచ :—

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ
కిమకుర్వత సంజయ ? ॥ ౧

ప. వి :—ధర్మక్షేత్రే, కురుక్షేత్రే, సమవేతాః, యుయుత్సవః, మామకాః, పాండవాః, చ, ఏవ, కిం, అకుర్వత, సంజయ

టీక :—

సంజయ = ఓ సంజయుడా !
ధర్మక్షేత్రే = ధర్మభూమియైన,
కురుక్షేత్రే = కురుక్షేత్రమునందు,
సమవేతాః = సమావిష్టులైనట్టియు,
యుయుత్సవః = యుద్ధమునందభిలాష కలిగినట్టియును,
మామకాః = నావారును,
పాండవాశ్చైవ = పాండవులును,
కిం = ఏమి,
అకుర్వత = చేసిరి ?

ధృతరాష్ట్రుడు అడుగుచున్నాడు -

తా. ఓ సంజయా ! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున నావారైన దుర్యోధనాదులు, పాండురాజు కుమారులైన ధర్మరాజాదులు యుద్ధము చేయ సంకల్పము కలవారై గుమిగూడినారు గదా ! ఏమిచేసినారు ?

## అ మృ త వా హి ని :-

ధృతరాష్ట్రుడు, పాండురాజు అన్నదమ్ములు. ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డి. ఆ హేతువుచే అతనికి రాజ్యాధికారము లేకుండపోయినది. పాండురాజునకే పట్టాభిషేకము చేసి, సింహాసన మెక్కించినారు. పాండురాజు అన్నగారిమీది భక్తివిశ్వాసములచేత, సింహాసనముమీద అన్నగారినే అధిష్ఠింపజేసి, తన బాహుబలశౌర్య పరాక్రమములచేత రాజ్యమును విస్తరింపజేయుచు, ప్రజలను కన్నబిడ్డలవలె చూచుచు న్యాయ్యముగా పరిపాలన చేయుచుండెను. కొంత కాలమునకు పాండురాజు కారణాంతరములచే అరణ్యవాసము నేర్పరచుకొని, తపస్సు చేసికొనుచుండగా కాలక్రమమున నాతనికి కుంతివలన ముగ్గురు కుమారులును, మాద్రివలన ఇద్దరుకుమారులును కలిగిరి. ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు అని వారిపేర్లు. ఇక్కడ ధృతరాష్ట్రునికి నూరుమంది కుమారులు కలిగిరి. వారే దుర్యోధన దుశ్శాసనాదులు. ధర్మరాజాదులు పాండురాజు కుమారులగుటచే వారికి పాండవులని పేరువచ్చినది. పాండవుల చిన్నతనమునందు శాపవశమున, పాండురాజు అరణ్యముననే చనిపోయినాడు. మాద్రి భర్తతో సహగమనము చేసినది. మహార్షు లందరు

కుంతిని సహగమనము చేయకుండ ఆపి, ఓదార్చి, జ్ఞానోప దేశమునుచేసి 'ఈ బాలురను జాగ్రత్తగా పెంచవలసినది'అని ఆదేశించినారు. ఆ మహర్షుల ఆదేశము ప్రకారము కుమారుల నయిదుగురను తీసికొని ఆమె హస్తినాపురము వచ్చినది. ధృతరాష్ట్రుడు కూడ భీష్ముని ఉపదేశమున తమ్ముని బిడ్డలను ప్రేమతో పెంచి, విద్యలు చెప్పించి పెద్దవారిని చేసినాడు. చిన్నతనమునుండియును పాండవులు అన్నివిధములను సమర్థు లగుటచే దుర్యోధనాదులకు వారియందు అసూయ పెరిగినది. వారిలోను భీమార్జునులను జూచిన భయమును, అసూయ యును కూడ ఎక్కువే. ఆ భయాసూయలే పెద్దవారైన తరువాత మరియు నెక్కువైనవి. ఆ కారణమున, కలిసియున్న కష్టముగా నున్నదని, ధృతరాష్ట్రుడు రాజ్యమును రెండుగా భాగించి, ఒక భాగమునకు ధర్మరాజును, రెండవభాగమునకు దుఃర్యోధనుని రాజులుగా చేసెను. పాండవులు తమ ధర్మము చేతను, బాహుబల శౌర్యపరాక్రమములచేతను రాజ్యమును బహువిస్తారము చేసికొని ధర్మముగా పరిపాలించుచు ప్రజల మన్ననలకు పాత్రులైరి. దేశములోని చాలమంది రాజులు పాండవులకు సామంతరాజులైరి. వారి కీర్తిప్రతిష్ఠలు మిక్కుటముగా పెరిగిపోవుచుండెను. వారి రాజ్యము, బలము, కీర్తి ప్రతిష్ఠలు పెరుగుచున్నకొలది వానితోపాటు పందెము వైచికొని దుర్యోధనుని హృదయములో అసూయాద్వేష ములు కూడ పెరుగుచుండెను. చివరకు అసూయ పట్టలేక ఏ విధముననైన పాండవుల రాజ్యము అపహరింపవలయునని

క్షత్రియులు వస్తుచుండెను. బాహుబలముచేత జయించి రాజ్యమును తీసికొనలేను.

శకుని మున్నగువారి సాహాయ్యమున మాయోపాయములు అనేకములు పన్నినాడు. ఇంటికి నిప్పుపెట్టినాడు. భీమునికి విషము పెట్టించినాడు. చివరకు జూదమునకు పిలిచి, మాయ జూదములో సర్వమును అపహరించి, పాండవుల భార్యయైన ద్రౌపదిని నిండుసభలో అవమానము చేయుటకు ప్రయత్నించినాడు. భీష్మాదులు మందలించుటచేత మరల ధృతరాష్ట్రుడు పాండవుల రాజ్యము పాండవులకిచ్చి పంపించినాడు. అయిన నేమి ? పుత్త్రమోహము మిక్కుటమౌటచే, దుర్యోధనుడు వచ్చి ఏమేమో చెప్పికొని దుఃఖించుటతో, మరల పాండవులను జూదమునకు పిలిపించినాడు ధృతరాష్ట్రుడు. పెద్దలెందరో జూదము పనికిరాదని ధృతరాష్ట్రునికిని దుర్యోధనునకిని గట్టిగా చెప్పినారు. కాని,వారు వినలేదు. పెదతండ్రిమాట తీసివేయలేక జూదమునకు దిగినాడు ధర్మరాజు. ఆ ద్యూతనియమము లేనియన-ఓడినవారు తమరాజ్యమును, ధనమును సర్వమును గెలిచినవారి కిచ్చివైచి కట్టుగుడ్డలతో అరణ్యమునకు పోవలయును. పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసమును, ఒక సంవత్సరము అజ్ఞాతవాసమును-మొత్తము పదమూడుసంవత్సరములు సక్రమముగా గడిపి, వచ్చిన తరువాత ఎవరి రాజ్యము వారు తీసికొనవలెను. అజ్ఞాతవాసములో శత్రువులకు తెలియకుండ నుండవలయును. వీరు తెలిసికొనుటకు ప్రయత్నింతురు. అట్లు శత్రువులు తెలిసికొన్న యెడల మరల అరణ్యవాసము,

అజ్ఞాతవాసము చేయవలయును. ఇది నియమము. పాండవులు జూదములో ఓడిపోయిరి. పరమాత్మ అనుగ్రహమున ఈ పదమూడు సంవత్సరములను సక్రమముగా నెరవేర్చివచ్చి, తమ రాజ్యము తమ కిమ్మని అడిగినారు. సూదిమొనమోపు భూమినైన ఈయనని దుర్యోధను డనినాడు. పెక్కుమంది పెద్దలు చెప్పినారు. చివరకు కృష్ణపరమాత్మ కూడ రాయబారిగా వెళ్ళి చెప్పినాడు. ఎవ రెవ రేమేమి చెప్పినను దుర్యోధనుడు చెవిని పెట్టలేదు. చివరకు యుద్ధమే నిర్ణయమైనది.

ప్రపంచములోని రాజులందరును ఉభయపక్షముల చేరినారు. దుర్యోధనునిది పదునొకండు అక్షౌహిణుల సైన్యము. పాండవులది ఏడక్షౌహిణుల సైన్యము.

దుర్యోధనుని సైన్యముపై ఆధిపత్యము భీష్మునిది. పాండవుల సైన్యమున కాధిపత్యము ధృష్టద్యుమ్నునిది. ఉభయులు తమ తమ సైన్యములను తీసికొని ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు చేరినారు. యుద్ధసమాచారము లన్నియును ఎప్పటి కప్పుడు ధృతరాష్ట్రునికి తెలియచెప్పుటకు వ్యాస భగవానుని అనుగ్రహమున దివ్యదృష్టిని పొందిన సంజయుడు నియోగింపబడినాడు. యుద్ధము పదిదినములు జరిగినది. యుద్ధప్రారంభ దినముననే అర్జునునకు కృష్ణపరమాత్మ గీతను ఉపదేశము చేసినాడు. కాని, ధృతరాష్ట్రునకు ఆ గీత ఎప్పుడు చెప్పుటయా అని సమయమునకై ఎదురుచూచుచున్నాడు సంజయుడు. సంజయునకు వ్యాసభగవానులు దివ్యదృష్టి

నిచ్చుటలో ఈ అభిప్రాయము ప్రధానముగ నున్నది. గీత లోకోత్తరమైన గ్రంథము. దాని ప్రచారముచే లోక కల్యాణము చేకూరగలదు. అది బయటకు రావలయును. ఎక్కడనో రణరంగమున ఏకాంతముగా కృష్ణపరమాత్మకును అర్జునునకును జరుగబోవు సంవాదరూపమైనది గీత. మిగిలిన రాజులు, సైన్యములలోనివ్యక్తులు వారివారి గందరగోళములో వారుందురు. కనుక ఆ గీత సంజయుని ముఖతః బయటికి తెప్పించుట వ్యాసభగవానుల అభిప్రాయము. సంజయునికి వ్యాసులవారు దివ్యదృష్టినిచ్చి "చాటునగాని బహిరంగముగ గాని జరుగుపనులు, మాటలాడు మాటలు, అంతరంగములోని అభిప్రాయములు సర్వము నీకు నీ కూర్చున్నచోటునే తెలియ గలవు" అని అనుగ్రహించుటచే వెంటనే వ్యాసభగవానుల అభిప్రాయముకూడ తెలిసిపోయినది. దానికి సమయము ఎప్పుడా అని వేచియున్నాడు సంజయుడు. సరే. పదిదినములు యుద్ధము జరిగినది. సంగతులు సంక్షిప్తముగా చెప్పుచు, భీష్ముని పతనముకూడ చెప్పినాడు. భీష్ముని పతనవార్త వినునప్పటికి ధృతరాష్ట్రునికి భరింపలేని విచారము కలిగినది. మూర్ఛపోయినాడు. మూర్ఛ తేరిన తదుపరి "ఏమి? ఏమి జరిగినది ? ఎవరు ఎవరు ఏమి ఏమి చేసిరి ?" అని ప్రశ్న వేసి నాడు. ఆ ప్రశ్నయే ఇపుడు ప్రచారములో ఉన్న గీతకు ప్రథమశ్లోకముగా ఎన్నబడుచున్నది. అసలు భగవద్గీత రెండవ అధ్యాయములోని పదునొకండవ శ్లోకమునుండి, పదునెనిమిదవ అధ్యాయములోని అరువదిఆరవశ్లోకమువరకే.

మొదటి అధ్యాయములోని నలుబదియేడు శ్లోకములును, రెండవ అధ్యాయములోని మొదటి పదిశ్లోకములును కలసి ఏబదియేడు శ్లోకములును గీతకు పూర్వపీఠిక. పదునెనిమిదవ అధ్యాయములోని చివరి పన్నెండు శ్లోకములును ఉత్తరపీఠిక.

కురుక్షేత్రమును గురించి మహాభారతములో చెప్పబడి యున్నది. ఆక్షేత్రము సరస్వతీనదికి దక్షిణమున, దృషద్వతీనదికి ఉత్తరమున అనగా ఆ రెండునదుల మధ్యభాగమున ఉన్నది. దాని పొడవు నలుబదిమైళ్ళు, వెడల్పు నలుబదిమైళ్ళు. ఢిల్లీకి ఉత్తరముగా నున్నది. బదరీయాత్రాసమయములో కురుక్షేత్రమునుకూడ సేవించుకొను భాగ్యము మాకుకలిగినది. ఈ కురుక్షేత్రమునకే 'శ్యమంత పంచకము' అనికూడ పేరుకలదు. ఇక్కడ అగ్ని, ఇంద్రుడు, బ్రహ్మ మొదలగు దేవతలు తపస్సుచేసినట్లు శాస్త్రములందు కలదు. కౌరవ వంశమునకు మూలపురుషుడైన కురురాజు ఇక్కడ బహుకాలము తపస్సు చేయుటచేతను, ఈ భూమిని దున్ని అనేక యజ్ఞములు చేయుటచేతను ఆయనపేరుమీద ఈ భూమికి 'కురుక్షేత్రము' అను నామము కలిగినది. ఈ క్షేత్రములో మరణించినవారికి ఉత్తమగతులు కలుగునని బ్రహ్మాదిదేవతలచే ఈయబడిన వరములుండుటచేతను, ఇంకను అనేక కారణములచేతను ఈ కురుక్షేత్రమునకు ధర్మక్షేత్రమనియు, పుణ్యక్షేత్రమనియు ప్రసిద్ధికలిగెను. ఇది పుణ్యక్షేత్ర మగుటచేతను, ఇక్కడ మరణించినవారికి ఉత్తమగతులు కలుగునని వరములుండుట చేతను పూర్వపురాజులలో యుద్ధములు కలిగినపుడు ఇక్కడకు

వచ్చియే యుద్ధములు చేసెడివారు. ఇక్కడనే యుద్ధములు చేయుటకు ఇంకొక కారణ మేమన - ఈ ప్రదేశము చాల విశాలముగానుండుటచే, యుద్ధముల మూలమున, యుద్ధమునకు సంబంధించని ప్రజలకు ఏమియు ప్రమాదముండదు. ఈ కారణమున ఎక్కువగ యుద్ధములు ఇక్కడనే జరుగు చుండెడివి. ఈ అభిప్రాయముతోనే కౌరవులు, పాండవులు వారి వారి సేనలను తీసికొని ఈ కురుక్షేత్రమునకు చేరి యున్నారు.

ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులు తన కుమారులైన, పాండవులు తమ్ముని కుమారులు. అయినప్పుడు ఉభయులు తనవారేగదా! పుత్రవ్యామోహము, రాజ్యము తన కుమారులకే రావలయుననెడి దురాశ, అసూయ - ఇవన్నియు అతని అంతఃకరణములోచేరి, పుట్టుకలోనే చర్మచక్షువులకున్న అంధత్వముతోబాటు విజ్ఞానచక్షువునకు కూడ అంధత్వమును కలుగజేసినవి. కాబట్టియే ధృతరాష్ట్రుడు అన్నివిధములుగను గ్రుడ్డివాడు అని మహాత్ములందురు. ఈ మోహరూప మూఢత్వముచేత తనవారైయైన పాండవులను పరాయివారినిగా తలచి చెప్పినాడు.

'సంజయుడు' అనగా 'ఇంద్రియములను చిత్తమును బాగుగా జయించినవాడు' అని అర్థము. కాన సంజయుని చరిత్రకూడ కొంచెము పరిచయము చేయవలసిన ఆవశ్యకత మున్నది. శ్రీభగవద్గీతలో సంజయుడుకూడ ఒక ప్రధానవ్యక్తి.

ఈ మహాత్ముని ముఖమునుండియే మహోత్కృష్టమైన గీతాశాస్త్రము ధృతరాష్ట్రునికి వినిపించుట రూపమున లోకమునకు లభించినది.

సంజయుని తండ్రి వల్గణుడను సూతుడు. ఈయన మంచి విద్యావంతుడు. ఈయన కుమారుడు సంజయుడు. గొప్ప శాంతుడు, శిష్టుడు, జ్ఞాన విజ్ఞాన సంపన్నుడు, సదాచారుడు, నిర్భయుడు, సత్యవాది, జితేంద్రియుడు, ధర్మాత్ముడు, శ్రీకృష్ణపరమాత్మయొక్క పరమభక్తుడు. చిన్నతనమునుండియు అర్జునునకు సంజయునకు మిత్రత్వము కలదు.

భారతయుద్ధము ప్రారంభమగుటకు పూర్వము వ్యాస భగవానులు సంజయునికి దివ్యదృష్టినిచ్చి సర్వమును ధృతరాష్ట్రునికి వినిపించుటకై నియోగించినారు.

'కిమకుర్వత సంజయ?' 'ఏమి చేసిరి సంజయా?' అని అర్థము. అనగా ధృతరాష్ట్రుడు ఈ పది దినములనుండియును జరిగిన భీషణయుద్ధము వివరముగా తెలిసికొనవలయునని కోరినాడు. యుద్ధముకొరకై వెళ్ళిన వీరాధివీరులందరును, యుద్ధము ఎట్లు ప్రారంభించినారు? ఎవరు ఎవరితో పోరిరి? ఎవరు ఎవరిద్వారా ఎట్లు చంపబడిరి? మొదలగు వివరముల కొరకు వేసిన ప్రశ్న యిది.

పూర్తి వివరములు తెలియకపోయినను, భీష్మపతనము జరుగునప్పటికి పదిరోజులనుండి మహాభయంకరయుద్ధముజరుగు

చున్నట్లు ధృతరాష్ట్రునికి తెలియును. ఈ ప్రశ్నయొక్క భావమ
కొందరు వ్యాఖ్యాతలు ఇట్లు వ్రాసిరి - "కురుక్షేత్రమ
ధర్మక్షేత్రము కనుక, దాని ప్రభావముచే నాకుమారుల బు
బాగుపడి, పాండవులకు వారిరాజ్యమును యిచ్చి యుద్ధమ
నుండి విరమించిరా? లేక ధర్మరాజు, క్షేత్రమాహాత్మ్యముచే
పూర్వముకంటెను విరక్తికలిగి, యుద్ధమునుండి విరమిం
కొనినాడా ? ఏమి జరిగినది ?" అని. కాని ఆ వ్యాఖ్యానమ
అంతసమంజసముగా లేదు. ఈ అభిప్రాయము ధృతరాష్ట్రునకు
కలుగుటకు వీలులేదు. ఎందువల్లననగా ఈ పదిరోజులనుండియు
యుద్ధము జరుగుచున్నట్లు తెలియును గనుక.

ధృతరాష్ట్రుడు జన్మాంధుడగుటతో పాటు అజ్ఞానాంధుడు
కూడ నౌటచేత, ఇట్లు తన పుత్రులకే జయము సమకూరు
నను తలంపు గట్టిగా ఉన్నవాడగుటచేత, ఇప్పుడు భీష్ము
పతనవార్త వినగానే అత్యంతమైన దుఃఖము, ఆశ్చర్యముకూడ
కలిగి, 'ఏమి ? ఏమి ? ఎవరు ఎవరు ఎట్లు యుద్ధముచేసినారు
ఎవరు ఎవరితో పోరినారు ? సవిస్తరముగా చెప్పవలసినది
అను భావముతో ప్రశ్న వేసినాడు అని అమృతవాహి
అభిప్రాయము.

సంజయ ఉవాచ :-

శ్లో॥ దృష్ట్వాతు పాండవానీకం
వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య
రాజా వచన మబ్రవీత్ ॥

ప. వి. :-దృష్ట్వా, తు, పాండవానీకం, వ్యూఢం, దుర్యోధనః, తదా, ఆచార్యం, ఉపసంగమ్య, రాజా, వచనం, అబ్రవీత్.

టీక :-

తదా = అప్పుడు,
రాజా = రాజైన,
దుర్యోధనః = దుర్యోధనుడు,
వ్యూఢం = వ్యూహముగా రచింపబడిన,
పాండవానీకం = పాండవులయొక్క సేనను,
దృష్ట్వా = చూచి,
ఆచార్యం = ద్రోణాచార్యుని,
ఉపసంగమ్య = సమీపించి,
వచనం = మాటను,
అబ్రవీత్ = పలికెను.

సంజయుడు చెప్పుచున్నాడు :-

తా. అప్పుడు రాజైన దుర్యోధనుడు, వ్యూహముగా పన్నబడియున్న పాండవసేననుజూచి, ఆచార్యుడైన ద్రోణుని సమీపించి ఇట్లు పలికెను.

## అమృతవాహిని :-

ఉభయుల సైన్యములు కురుక్షేత్రమునకు చేరుటతోడనే కౌరవుల సైన్యమును భీష్ముడు చక్కని వ్యూహముగా పన్నుటనుజూచి పాండవుల సేనాధిపతియైన ధృష్టద్యుమ్నుడు తన సైన్యమును 'వజ్ర'మను వ్యూహముగా పన్ని నిలిపియున్నాడు. దుర్యోధనుడు పాండవుల సైన్యమును

జూచి, ద్రోణాచార్యులవద్దకేగి, ఇట్లు చెప్పుటకు ప్రారంభించినాడు.

దుర్యోధనుని ఈ సంభాషణకు కారణము - పాండవుల సైన్యమును జూచి భయపడివచ్చి ద్రోణాచార్యులవారికి హెచ్చరిక కలిగించుట కొరకు చెప్పుచున్నాడని కొందరును, పాండవుల సైన్యమును జూచి 'మనసైన్యముకంటె చిన్నదియును, శారీరకబలముతప్ప బుద్ధిబలములేని భీమునిచేత రక్షింపబడుచున్నదియునైన పాండవులసైన్యము, పెద్దదియును శారీరకబలముతోపాటు అపరిమిత బుద్ధిబలమునుగల భీష్మునిచే, రక్షింపబడు మన సైన్యమునకు చాల'దని సంతోషముతో ద్రోణాచార్యులతో చెప్పుచున్నాడని కొందరును వ్యాఖ్యానించిరి. ఈ రెండు వ్యాఖ్యానములలో ఏది సరియైనదో పరమాత్మ ఇచ్చిన నా బుద్ధిబలమునకు తగినట్లు వ్యాఖ్యానించెదను.

దుర్యోధన ఉవాచ :-

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్త్రాణా
మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్త్రేణ
తవ శిష్యేణ ధీమతా ॥ 3

ప. వి :-పశ్య, ఏతాం, పాండుపుత్త్రాణాం, ఆచార్య, మహతీం, చమూం, వ్యూఢాం, ద్రుపదపుత్త్రేణ, తవ, శిష్యేణ, ధీమతా,

టీక :—

ఆచార్య ! = గురుదేవా !
ధీమతా = బుద్ధిమంతుడును,
తవశిష్యేణ = నీశిష్యుడును ఐన,
ద్రుపదపుత్రేణ = ద్రుపదుని కుమారుడగు
ధృష్టద్యుమ్నునిచే,
వ్యూఢాం = వ్యూహముగ రచింపబడిన,
మహతీం = గొప్పదైన,
పాండుపుత్రాణాం = పాండవులయొక్క,
ఏతాం = ఈ,
చమూం = సేనను,
పశ్య = చూడుము.

ధుర్యోధనుడు చెప్పుచున్నాడు :—

తా. ఓ ఆచార్యా! ద్రుపదుని కుమారుడును, నీ శిష్యుడును, గొప్ప బుద్ధిమంతుడును అగు ధృష్టద్యుమ్నునిచేత వ్యూహముగా పన్నబడియున్న పాండవుల మహాసైన్యమును చూడుము.

అమృతవాహిని :—

ఈ శ్లోకమునుండి, పదునొకండవ శ్లోకము వరకు తొమ్మిది శ్లోకములును, దుర్యోధనుని వాక్కులు. అయినను ఇక్కడ 'దుర్యోధన ఉవాచ' అనలేదు. కారణమేమి? దీనికి శంకరానందీయములో "ఉవాచ మధుసూదనః ఇత్యత్ర శ్రీభగవానువాచేతి యథాతథా అత్రాపి దుర్యోధన ఉవాచేతి నివేశనీయం పరం తథా పాఠో నదృశ్యతే, తత్రాప్రమాదికం"

అని ఉన్నది. "రెండవ అధ్యాయములో మొదటి శ్లోకములో చివరిపాదము 'వాక్య మువాచ మధుసూదనః' అని ఉన్నను, రెండవశ్లోకమునకు 'శ్రీభగవానువాచ' అని ఉన్నది. అట్లే ఇక్కడకూడ దీనిపై శ్లోకములో 'రాజా వచన మబ్రవీత్' అని యున్నను ఈశ్లోకమునకు 'దుర్యోధన ఉవాచ' అని ఉండవలసినది. కాని ఎక్కడను కనబడుటలేదు. ఇది ప్రమాదముచేత కలిగినది" అని భావము.

ఇది ప్రామాదికమైన యెడల శంకరానందులవారు స్వతంత్రించి 'దుర్యోధన ఉవాచ' అనవలసినది. ప్రమాదము వలన కలిగిన పొరపాటు అని తెలిసినప్పుడు, దానిని చెప్పి 'దుర్యోధన ఉవాచ' అనినయెడల, దానితో గీతకు వచ్చిన నష్టమేమియును లేదుగదా ! గీతాభిప్రాయమును మార్చుట లేదుగదా ! ఎందువలన వారు అనలేదో ! ఒకవేళ వారు వ్రాసినను తరువాతివారు తీసివేసినారో !

కొంతమంది పండితులనినారు - దుర్యోధనుడు దుర్మార్గుడు కనుక ఈ గీతలో దుర్యోధనుని పేరుఎత్తుట ఇష్టములేక అనలేదు అని. శ్లోకములోనే ఆయన పేరు ఎత్తుకొన్నప్పుడు 'దుర్యోధనఉవాచ' అనిన ప్రమాదమువచ్చిపడునా ఏమి! ఎంత మహాపాపియైనను,ప్రసంగమువచ్చినపుడు ఆతని పేరు ఎత్తిననే పాపమని భయపడుట ఎంతదుర్బలత్వము ! అన్నిశాస్త్రముల యొక్క సారమేమన 'పాపమును ద్వేషించుముగాని పాపిని ద్వేషించకుము, ప్రేమించుము' అనియు, 'రోగమును ద్వేషించుముగాని, రోగిని ద్వేషించకుము, ప్రేమించుము' అనియును. ఇట్లే ఇక్కడను.

ఈ గీతలోనే ముందు పరమాత్మచేత చెప్పబడును - "సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే" 'పరమార్థానుభవముగలిగిన సాధువులయందు, మహాపాపులయందు సమముగా ప్రేమకలిగియుండుము' అని. ఈ గీతాప్రబోధమును వ్యాసానుగ్రహముచేత సాక్షాత్ శ్రవణముచేసిన సంజయుడు దుర్యోధనుడు పాపిగదా యని మానడు. శ్లోకములో అననే అన్నాడు గదా !

యథార్థముగ చూచిన దుర్యోధనునికన్న ధృతరాష్ట్రుడు పాపి అనవలయును. చేసినది అంతయును దుర్యోధనుడే అయినను, నివారించగలిగికూడ, పుత్రవ్యామోహముతో నివారించకపోవుట మహాపరాధము. క్షమించగూడని పాపము. దుర్యోధనుడు ఏది చేసినను, తండ్రిని బతిమాలియో, బామాలియో, అదలించియో, బెదరించియో చివరికి అనుజ్ఞ తీసికొనియే చేసెడివాడు. తప్పనుకున్నప్పుడు, పాపమనుకున్నప్పుడు, ఈ కార్యముచేత కులమంతయును నాశనమౌననుకున్నప్పుడు, తాను అనుజ్ఞ నివ్వకుండనున్నయెడల ఇంతపని జరిగియుండదుగదా ! దుర్యోధనుడు, చెప్పినమాట వినునా ఏమి అందురు కాబోలు ! వినక స్వతంత్రించి చేయునదిలేదు. పోనీ, చేసినను, ఆ నింద తనమీదకు రాదుగదా ! ఎట్లును జరుగుదానికి మాత్రము తాను నిమిత్తమాత్రుడయి, ఆ పాపమును తన నెత్తిమీదికి ఎందులకు తెచ్చుకొనుట ? గాంధారి అన్నది; భీష్మాదులు అన్నారు- "ఒక్క దుర్యోధనుని

వదలుకొని కులమును రక్షించుకొనుము" అని. "నా కుమారుని నేను విడిపించుకొనలేకుండనున్నా" నని ధృతరాష్ట్రుడు సమాధానము చెప్పినప్పుడు "నాకు అప్ప చెప్పుము. నేను చక్క చేయగలను" అని కృష్ణపరమాత్మ చెప్పినాడు. పుత్రవ్యామోహముతో అంధుడగుటచేత అట్లు చేయలేదు. చూచుచు చూచుచు కుమారుని చంపుకొనునా అందురు. ఒక్క కుమారుని చంపుకొనుటకు ఇష్టపడుట మంచిదా ? కులమంతయును నశింపచేసికొనుట మంచిదా ? కులమంతయును పోయినను, దుర్యోధనుడైనను, దక్కినాడా ? అదియును లేదు. ఎంతమంది చెప్పినను వినక ఇంతవరకు తెచ్చిన పాపి ధృతరాష్ట్రుడు. గీతప్రారంభములోనే 'ధృతరాష్ట్ర ఉవాచ' అనవచ్చునుగాని, ఇక్కడ 'దుర్యోధన ఉవాచ' అనరాదా ? అట్లు అనిన ఏమియును మునిగిపోదు. 'దుర్యోధన ఉవాచ' అనకపోవుటకు శంకరానందులవారి అభిప్రాయము ప్రకారము ప్రామాదికమేనా, ఇంకొక కారణమేమైన నున్నదా అని ఆలోచించిన, ఇంకొక కారణము గోచరించుట లేదు. కనుక అది ప్రామాదికమేనని తోచినపుడు 'దుర్యోధన ఉవాచ' అనుటయే సమంజసము. కనుకనే, 'దుర్యోధన ఉవాచ' అని వ్రాసితిని. అస్తు.

ద్రోణాచార్యులవద్దకుపోయి దుర్యోధనుడు అనుచున్నాడు- "ఓ ఆచార్యా! పాండవుల సైన్యమును చూడుడు - ఎంత గొప్పదిగానున్నదో ! ఆ పన్నబడిన వ్యూహము వజ్రము. ఇంత అభేద్యముగా ఇంతగొప్పగా ఆ సైన్యమును

పన్నినదెవరో తెలియునా ? ద్రుపదరాజుగారిని ఎరిగి యుంటిరి కదా ! మీ బాల్యస్నేహితుడు. బాల్యస్నేహితుడుగదా యని ఆశతో కుమారునికి పాలకొరకై ఒకగోవును అడుగుటకై వెళ్ళితిరిగదా ! అప్పుడు ఎంత అవమానము చేసినాడు ! జ్ఞాపకమున్నదిగదా ! అతని కుమారుడు. మీ శిష్యుడే. మిమ్ములను చంపు పుత్త్రుడు కావలయునని యజ్ఞము చేసి, యజ్ఞకుండమునుండి ఈ ధృష్టద్యుమ్నుని పుత్త్రునిగా పొంద గలిగినాడు. అయినను మీరు శత్రువుని కుమారుడని చూడక, ఉదారభావముతో అస్త్రవిద్య సరహస్యముగా చెప్పినారు. మీ శిక్షణచేతనేగదా ఇంత బుద్ధిశాలి అయినది! మీ అనుగ్రహముచేత గలిగిన తన ఆ బుద్ధిబలమును, యుద్ధ నైపుణ్యమును, ఆ శౌర్య ధైర్య పరాక్రమములును, పురస్క-రించుకొని, కృతజ్ఞతయైనను లేక మిమ్ములను చంపుటకై, మీయెదుట నిలబడియున్నాడు. చూడుడు" అని, ఈ మాట లతో ద్రోణాచార్యుని చిత్తములోనున్న ప్రాతకాలమునాటి వైరభావమును మరల రాజి పెనుమంటలెగయునట్లు, ఆజ్యము పోయుచున్నాడు. ద్రోణాచార్యునకు సహజముగా పాండవుల యందు పక్షపాత మున్నదనియును, ఆ కారణమున, తనశక్తి నంతయు నుపయోగించి యుద్ధము చేయుడేమోనని భయ ముతో, ఆ వెనుకటి ద్వేషాగ్నిలో మరికొన్ని కట్టెలువేసి, నేయిపోయుచున్నాడు. 'పాండవులు కూడ నీవలన యింత ధనుర్విద్యాపారంగతులై, చివరికి నిన్ను చంపుటకై పుట్టిన

ధృష్టద్యుమ్నుని సేనాధిపతిగచేసి, నిన్ను చంపుటకై నీకు ఎదుట నిలబెట్టియున్నారు. చూడుడు ఆచార్యా!' అను భావమును సూచించి పాండవులయందు కూడ ద్వేషము కలిగించుచున్నాడు. దుర్యోధనుడు గొప్ప రాజనీతి కలవాడే-కాని, ఆ నీతి కుటిలనీతి.

ఇప్పుడు పాండవుల సైన్యములోని కొంతమంది మహావీరులను, అతిరథులను చెప్పుచున్నాడు మూడు శ్లోకములలో.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా
భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ
ద్రుపదశ్చ మహారథః ॥ ४

శ్లో॥ ధృష్టకేతుశ్చేకితానః
కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్కుంతిభోజశ్చ
శైబ్యశ్చ నరపుంగవః ॥ ५

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాంత
ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ
సర్వఏవ మహారథాః ॥

ప. వి :—అత్ర, శూరాః, మహేష్వాసా, భీమార్జునసమాః, యుధి, యుయుధానః, విరాటః, చ, ద్రుపదః, చ, మహారథః. ४

టీక :—

అత్ర = ఈ కనపడు పాండవ సైన్యములో,
మహేష్వాసా = గొప్ప ధనుస్సులు గలవారును,
యుధి = రణమునందు,
భీమార్జునసమాః = భీమునితోను, అర్జునునితోను తుల్యులును అగు,
శూరాః = గొప్పశూరులు,
(సంతి = ఉన్నారు.) (వారెవరనగా)
యుయుధానః = సాత్యకియును,
విరాటశ్చ = విరాటరాజును,
మహారథః = మహారథుడైన,
ద్రుపదశ్చ = ద్రుపదుడును;

ప. వి :—ధృష్టకేతుః, చేకితానః, కాశిరాజః, చ, వీర్యవాన్, పురుజిత్, కుంతిభోజః, చ, శైబ్యః, చ, నరపుంగవః. ५

టీక :—

ధృష్టకేతుః = శిశుపాలకుమారుడైన ధృష్టకేతువును,
చేకితానః = చేకితానుడును,
వీర్యవాన్ = వీరత్వము బాగుగా కలిగిన,
కాశీరాజశ్చ = కాశీరాజును,
పురుజిత్ = పురుజిత్తును,
కుంతిభోజః = కుంతిభోజుడును,

నరపుంగవః = మానవులలో శ్రేష్ఠుడగు,
శైబ్యశ్చ = శైబ్యుడును;

ప. వి :— యుధామన్యుః, చ, విక్రాంతః, ఉత్తమౌజాః, చ, వీర్యవాన్, సౌభద్రః, ద్రౌపదేయాః, చ, సర్వే, ఏవ, మహారథాః.

టీక :—

విక్రాంతః = మహావీరుడైన,
యుధామన్యుశ్చ = యుధామన్యువును,
వీర్యవాన్ = పరాక్రమశాలియైన,
ఉత్తమౌజాశ్చ = ఉత్తమౌజుడును,
సౌభద్రః = సుభద్రాతనూజుడైన అభిమన్యుడును,
ద్రౌపదేయాశ్చ = ద్రౌపదీసూను లైదుగురును,
కలరు. (వీరే ఉపపాండవులు, మహావీరులు.)
సర్వే = ఆ సైన్యములోని వారెల్లరును,
మహారథాః ఏవ = మహారథులే.

తా. పాండవసేనలో గొప్ప గొప్ప ధనుస్సులు గలవారును, యుద్ధమునందు భీమార్జునులతో సమానమైన శూరులు, వీరులు నగువారిని చెప్పుచున్నాను వినుడు. సాత్యకి, విరటుడు, మహారథుడైన ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడును : గొప్పబలముగల కాశీరాజును, పురుజిత్తు, కుంతిభోజుడు, మానవులలో శ్రేష్ఠుడైన శైబ్యుడు, విక్రమశాలియైన యుధామన్యువు, గొప్పబలముగల ఉత్తమౌజుడు, సుభద్ర కుమారుడైన అభిమన్యుడు, ద్రౌపదీదేవయొక్క అయిదుగురు కుమారులును కలరు. ఎంతమంది పేర్లని చెప్పను ? ఆ పాండవసేనలోని సర్వులును మహారథులే.

## అమృతవాహిని :—

దుర్యోధనునిచేత చెప్పబడిన పాండవసేనలోని ఈ వీరుల యొక్క చరిత్ర సంక్షిప్తముగా పాఠకులకు పరిచయము చేయుట ఆవశ్యకమని తోచి వ్రాయుచున్నాను.

1. యుయుధానుడు :—ఈయనయే సాత్యకి. అర్జునుని శిష్యుడు. ఇతడు యాదవవంశములో సత్యకుడు అను రాజునకు కుమారుడు. ఈ సాత్యకి కృష్ణపరమాత్మకు బంధువును, భక్తుడును, అనుచరుడును కూడ. గొప్ప శౌర్యబల పరాక్రమ సంపన్నుడు. అతిరథుడు. మహాభారత యుద్ధములో పాండవ సేనలో పాండవు లైదుగురు కృష్ణపరమాత్మతో ఒక సాత్యకియే బ్రతికియున్నాడు చివరికి యాదవులు పరస్పరము పోట్లాడుకొన్న యుద్ధములో చనిపోయినాడు. యుయుధాను డను పేరుగల యాదవవీరు డింకొకడుకూడ కలడు. కాని, ఇక్కడ యుయుధానుడు సాత్యకియే.

2. విరాటరాజు :—మత్స్యదేశమును న్యాయ్యముగా పరిపాలించు ధార్మిక ప్రభువు. పాండవులు ఒకసంవత్సరము అజ్ఞాతవాసములో గడిపినది ఈయనవద్దనే. ఈ విరాటరాజు తనకుమార్తె నుత్తరను అర్జునుని కుమారుడైన అభిమన్యున కిచ్చి వివాహము చేసినాడు. ఈయన మహాభారతయుద్ధములో ఉత్తరుడు, శ్వేతుడు, శంఖుడు అను తన ముగ్గురు కుమారు లతో కూడ చనిపోయెను.

3. ద్రుపదుడు :—ఈయన మహారథుడు. పాంచాల దేశ ప్రభువైన 'పృషత్' అను రాజుయొక్క కుమారుడు.



రెండవశ్లోక వ్యాఖ్యానములో 'ద్రుపదపుత్రేణ' అను సందర్భములో ఉటంకింపబడిన ద్రుపదుడే ఈయన. ఈయన తండ్రికిని, భరద్వాజమునికిని చాల స్నేహము. ద్రుపదుడు చిన్నతనములో తనతండ్రి స్నేహితుడైన భరద్వాజుని ఆశ్రమములోనే యుండి, భరద్వాజుని కుమారుడైన ద్రోణునితోకూడ చదువుకొనుచుండువాడు. ఈ ఇద్దరికినీకూడ గాఢస్నేహము కుదిరినది. కొంతకాలమునకు పృషత్తు చనిపోగా, ద్రుపదుడు సింహాసనమెక్కెను. ఇట్లు చాలకాలము గడచిపోయినది. తరువాత ఒకప్పుడు పిల్లవాని పాలకొరకు ఆవు కావలసివచ్చినది ద్రోణునికి. తన బాల్యస్నేహితుడున్నాడుగదాయని ద్రోణుడు ద్రుపదుని సన్నిధికి పోయి తన మిత్రత్వము చెప్పుకొనెను. రాజ్యమదాంధతతో ఉన్న ద్రుపదునికి, ఒక పేదపారుడు వచ్చి తనకు మిత్రుడనని చెప్పుకొనుట అవమానముగా తోచినది. అవమానించి పలికినాడు. ద్రోణునకు హృదయములో చాల కష్టము తోచినది. అది హృదయములో పనిచేయుచుండగా వెళ్ళిపోయినాడు. చివరికి ద్వేషాగ్నిగా పరిణమించినది. ఎట్లైనను ప్రతిక్రియ చేయవలయునని సమయముకొరకు ఎదురుచూచుచుండెను. కౌరవులకును, పాండవులకును ధనుర్విద్యాగురువై, గురుదక్షిణ నివ్వ వారుకోరినప్పుడు 'ద్రుపదునిపట్టి కట్టితెచ్చి నాముందర నుంచవలయును. ఇదియే నాకు గురుదక్షిణ' అని ద్రోణుడు కోరెను. దానికి కౌరవులలో ఒక్కడును సమర్థుడు కాడాయె. చివరకు అర్జునుడు వెళ్ళి, ద్రుపదుని రథమునకుకట్టి, తెచ్చి ఆచార్యునిమ్రోలనుంచెను. అది చూచి ద్రోణుడు తన కోపము తీరునట్లు పలికి, చివరకు

విడిచిపుచ్చెను. ద్రుపదుడు ఇదితనకు భరించరాని పరిభవంబుగా నుండుటచే, బ్రాహ్మణులను ఆశ్రయించి, ద్రోణుని చంపు పుత్త్రుడును ఇట్టిమహాబాహుబలశాలి, అస్త్రవిద్యానిపుణుడు నైన అర్జునునికి పత్నికాగల కుమార్తెయును కావలయునని యజ్ఞముచేసెను. ఆ యజ్ఞకుండమునందు, ధృష్టద్యుమ్నుడను కుమారుడును, ద్రౌపది అను కుమార్తెయును లభించిరి. ఈ ద్రౌపదికే 'కృష్ణ' యనియును, 'యాజ్ఞసేని' యనియును నామములు ప్రసిద్ధములై యుండెను. స్వయంవరములో ద్రౌపదిని గెలుచుకొని పాండవులు వివాహము చేసికొనిరి. ఈ ద్రుపదరాజు గొప్పశూరుడు, వీరుడు, మహారథుడు. మహాభారత యుద్ధములో ద్రోణునిచే సంహరింపబడినాడు.

4. ధృష్టకేతువు:—ఇతడు చేదిదేశపురాజైనట్టియును, పాండవులవలెనే కృష్ణునకు ఒక మేనత్త కుమారుడునైన శిశుపాలుని పుత్త్రుడు. ఇతడుకూడ మహాభారతయుద్ధములో ద్రోణునిచేతనే మరణించెను. ఇతని సహోదరినే పాండవులలోని నకులుడు వివాహము చేసికొన్నట్లు శ్రీమళయాళస్వాముల వారు అచ్చువేయించిన గీతార్థదీపికలో ఉన్నది. కాని ఆలోచింపగా అది పొసగుటలేదు. ఎందులకనగా ధర్మరాజాదులు, శిశుపాలుడు అక్కచెల్లెండ్ర కుమారులు. కావున అన్నదమ్ములగుదురు. నకుల సహదేవులు ధర్మరాజునకు సవతితమ్ములు. కాన శిశుపాలుని కూతురు నకులునకును కూతురగును. దీనిని బట్టి వివాహము నిషిద్ధము. కాన, అది పొసగదని అమృతవాహిని అభిప్రాయము.

5. చేకితానుడు:—ఇతడు ఒక యాదవ వంశీయుడైన మహారథుడు. గొప్ప శౌర్యబలపరాక్రమములు కలవాడు. పాండవుల ఏడక్షౌహిణులసేనకును ఒక్కొక్క అక్షౌహిణికి ఒక్కొక్క సేనాపతి చొప్పున ఏడుగురు సేనాపతులు గలరు. వారిలో ఇతడు ఒక సేనాపతి. మహాభారతయుద్ధములో దుర్యోధనుని చేతిలో మడిసినాడు.

6. కాశీరాజు :—ఇతడు గొప్పవీరుడు. మహారథుడు. అప్పుడు కాశీరాజ్యమును పరిపాలించుచున్నాడు. కాబట్టి ఇతనికి 'కాశీరాజు' అను పేరు ప్రసిద్ధమైయున్నది. అసలు పేరేమో సరిగా తెలియదు. ఇతడు కర్ణునిచేత మరణించినాడు.

7. పురుజిత్తు : (8) కుంతిభోజుడు:-వీరు ఇద్దరని కొంతమందియు, అసలు పేరు పురుజిత్తుడును, వంశనామము కుంతిభోజుడని కొంతమందియును చెప్పుచున్నారు. ఇద్దరనువారి మతము ప్రకారము వీరిద్దరును కుంతీదేవికి సోదరులు. ఒక్కడే అనువారల అభిప్రాయము ప్రకారముకూడ ఇతడు కుంతీసోదరుడనియే. అయితే వీరిద్దరును అన్నదమ్ములని వారును, ఒక్కడే, ఒకటి పేరు, ఒకటి విశేషణము అని వీరును. ఇంతియే భేదము. చివరికి వీరు (లేక) ఇతడు, ధర్మజ భీమార్జునులకు మేనమామలు, లేక మేనమామ అని నిర్ణయమైనది. "వీరు ఇద్దరు కాదు - ఒకడే" అని తిలక మహాశయుడు తన గీతారహస్యములో వ్రాసియున్నాడు. మహాభారతములో కర్ణపర్వములో

> "కృత్వాన సుకరం కర్మ గతా వైవస్వతక్షయమ్
> పురుజిత్, కుంతిభోజశ్చ మాతులౌ సవ్యసాచినః॥

అ 6 శ్లో 22.

"సంగ్రామ నిర్జితాన్ లోకాన్ గమితౌ ద్రోణసాయకైః."
అ 6 శ్లో 23.

అని ఉన్నది.

"పురుజిత్కుంతిభోజశ్చ - మాతులౌసవ్యసాచినః"
పురుజిత్తు, కుంతిభోజుడుకూడ అర్జునునికి మేనమామలు అని ద్వివచనముప్రయోగింపబడియున్నది. కాబట్టి వీరు ఇద్దరనియే భారతాభిప్రాయము. "సంగ్రామ నిర్జితాన్ లోకాన్-గమితౌ ద్రోణసాయకైః" అనగా 'వీరిద్దరు ద్రోణుని బాణములచేత, యుద్ధములో చచ్చినవారికి రావలసిన పుణ్యలోకములకు పోయిరి. 'గమితౌ' అని ద్వివచనములో నుండుటచేత వీరు ఇద్దరనియే నిర్ణయించవలసి యున్నది.

కనుక వీరిద్దరును, కౌంతేయులకు మేనమామలు. మహాభారతయుద్ధములో ద్రోణునిచేత మరణించిరి.

9. శైబ్యుడు:- ఈయనను దుర్యోధనుడు, 'నరపుంగవః 'మానవులలో శ్రేష్ఠుడు' అని చెప్పినాడు. గొప్పబలము కలవాడు. వీరుడు. మహాయోద్ధ. ధర్మరాజు ఈయన కుమార్తె అయిన 'దేవికా'అను నామెను వివాహమాడినట్లు తెలియుచున్నది.

10. యుధామన్యుడు.

11. ఉత్తమౌజుడు.

ఈ ఇద్దరును అన్నదమ్ములు. పాంచాలదేశ రాజకుమారులు. మహావీరులు. శౌర్యబలపరాక్రమములసంపన్నులు. వీరిరువురును పార్థునకు చక్రరక్షకులుగా నియమించబడిరి.

"వామచక్రం యుధామన్యు రుత్తమౌజాశ్చ దక్షిణమ్
గోప్తారౌ ఫాల్గునం ప్రాప్తౌ ఫాల్గునోఽపి శిఖండినః".
(మహా భా॥భీ॥ 15-11)

అర్జునుని రథచక్రరక్షకులుగానున్నట్లు మహాభారతములో భీష్మపర్వమున కలదు. చివరకు వీరిరువురును రాత్రి సమయమున నిద్రలోనుండగా అశ్వత్థామచేత చంపబడిరి.

12. సౌభద్రుడు:-సుభద్రయొక్క కుమారుడుగనుక అభిమన్యునకు సౌభద్రుడని పేరువచ్చినది. అర్జునునిపుత్రుడు కృష్ణపరమాత్మకు మేనల్లుడు. మత్స్యదేశప్రభువైన విరటుని కుమార్తె ఉత్తర, అభిమన్యునిభార్య. ఇతడు మేనమామవద్ద శిక్షణపొంది, ధనుర్విద్యయందు మేటియై పేరుగాంచెను. అస్త్రములన్నియును తండ్రివద్దనే లభించెను. అసాధారణ వీరుడు. మహారథులకు, అతిరథులకు తలమానికము. ద్రోణాచార్యులు ఒక దినమున పద్మవ్యూహము పన్నెను. ఒక్క అర్జునునకుతప్ప ఎవరికిని ఆ వ్యూహములో జొచ్చుట తెలియదు. అర్జునుడు ఇంకొకప్రక్క చాలదూరమున యుద్ధములో తత్పరుడై యుండెను. అభిమన్యునకు జొచ్చుటమాత్రము తెలియును. మరల వచ్చుట తెలియదు. భీమునకు మాత్రము వచ్చుట తెలియును. జొచ్చుట తెలియదు. ఒకరికొకరుతోడుగా బయలుదేరినారు. మిగిలిన నకులసహదేవులు, ఇతర వీరులు సాహాయ్యముగాబయలుదేరినారు. ఆనాడు'ఒక్క అర్జునునితప్ప పాండవుల నిలుపగలవు' అని సైంధవునకు శంకరునివరమున్నది.

ఆ వరబలమున పాండవుల నిలుపుచేసినాడు. ఎంత ప్రయత్నించి యును ఎవరును సైంధవు నతిక్రమించిపోలేకపోయిరి. వెన్క వీరు వచ్చుచున్నారన్న ధైర్యముతో అభిమన్యుడు అందరిని అతిక్రమించి పద్మవ్యూహములోనికి జొరబడినాడు. ఆనాటి అభిమన్యునియుద్ధము మహాశ్చర్యకరము. అతిభయంకరము. కౌరవసైన్యముల చించి చెండాడుచుండెను. అతనికార్ముకము నుండి వెడలు శరములకు శత్రుసైన్యములోనివారు చాప చుట్టలుగ కూలుచుండిరి. దిక్కు తెలియక పరుగెత్తుచుండిరి. హాహాకారములు చెలరేగి, మిన్నుముట్టుచున్నవి. కర్ణుడు దొరికినారు, దుర్యోధనుడు దొరికినాడు. దుశ్శాసనుడు దొరికినాడు. వీరాధివీరులందరును అతనిచేతి శరవాలమునకు ఎరగా దొరికినారు. కాని 'వీరినందరిని తండ్రి, పెదతండ్రులు చంపుటకు ప్రతిజ్ఞ చేసిరి'అని సారథి హెచ్చరించుటచే, 'బ్రతికి పోయినారు' అని మెడమీదచేయివేసి త్రోసివదలిపెట్టినాడు. "ఇంక ఇతనినిన్యాయ్యమని ధర్మమనిచూచిన ఇక మనయుద్ధము నేటితో సమాప్తి"అని ద్రోణునిఅంతవాడు అధర్మమైన సలహా యివ్వగా "వీరాధివీరులము, అతిరథులము, మహా రథులము"అని తొడలు చరచుకుని, బీరములు పల్కిన కర్ణ, దుర్యోధన, దుశ్శాసన, అశ్వత్థామాది వీరులందరును ద్రోణుడుకూడ బాసటకాగా అధర్మముగా అభిమన్యుని చుట్టుముట్టి, వెనుకనుండి, ప్రక్కనుండియునుకూడ దొంగ యుద్ధము, కుటిలయుద్ధముచేసి, అతనిని సంహరించినారు. అప్ప టికి ఉత్తర గర్భవతియైయున్నది. ఆమె గర్భమందు ఉద్భ

వించినవాడే మహాభాగవతశిఖామణి, ధర్మప్రభువు, కలిని నిగ్రహించిన ప్రభావసంపన్నుడునైన పరీక్షిత్తు.

ద్రౌపదేయులు అయిదుగురు.

13. ప్రతివింధ్యుడు :—(ధర్మరాజుకుమారుడు)
14. సుతసోముడు :—(భీమునికుమారుడు)
15. శ్రుతకర్ముడు :—(అర్జునునికుమారుడు)
16. శతానీకుడు :—(నకులునికుమారుడు)
17. శ్రుతసేనుడు :—(సహదేవునికుమారుడు)

వీరు ద్రౌపదియందు కలిగిన పుత్రులు. కనుక వీరికి ద్రౌపదేయులు అని పేరువచ్చినది. వీరందరును మహారథులు. అతిరథులు. పాండవులతో సమానమైన బలపరాక్రమ సంపన్నులు. వీరిని రాత్రిసమయమున నిద్రపోవుచుండగా అశ్వత్థామ సంహారించినాడు. దుర్యోధనుడు ద్రోణాచార్యులకు పాండవుల సైన్యమునుజూపి, ఆసైన్యములోని వారందరును 'మహేష్వాసాః' గొప్పగొప్ప విండ్లు కలవారే. అందరును శూరులే. యుద్ధమునందు భీమార్జునులతో సమానులుసుమా!

అందఱును భీమార్జునులతో సమానులని భయముతో చెప్పుచున్నాడు. అదివరకు యుద్ధమురానంతవరకు యథార్థముగా తన అంతఃకరణములో 'పాండవులతో ఏ ఒక్కరితోను మనము గెలువలేము' అని తెలిసినను పైకిమాత్రము బీరములుపలికినాడు. కారణమేమనగా 'భీమార్జుననకులసహదేవు లెట్టివారలైనను, ఎంతపరాక్రమ సంపన్నులైనను ధర్మరాజు మాటను

అతిక్రమించి నడువలేరు. జూదమాడుట పెద్దలందరును కూడదని చెప్పినను, మిగిలిన నలుగు రన్నదమ్ములకును ఎంత మాత్రము ఇష్టములేకున్నను, ధర్మరాజు ఆడుటకు ఒప్పుకున్న ప్పుడు ఎవరైనను మాట్లాడగలిగినారా ? నిండుసభలో మనము ద్రౌపదిని అవమానపరచుటకు ప్రయత్నించిన సమ యమున ఎంత కోపతాపములతో ఒడలు తెలియక గంతులు వేసియును, నలుగురు తమ్ములు ధర్మరాజు ఆజ్ఞను అతిక్రమించి ఏమైనను చేయఁగలిగినారా ? ఆ సమయముకంటె మానవు నకు భరించలేని స్థితియుండునా ? అప్పుడే ఏమియును చేయ లేక ధర్మరాజు ఆజ్ఞచే కట్టుబడియున్నారు. నేడు మాత్రము ఆయన ఆజ్ఞను ఉల్లంఘించగలరా ? అది ఎట్లును జరుగదు. 'ఇక ధర్మరాజు స్థితిని జూచిన యుద్ధము చేయకుండ తమ రాజ్యమును తీసుకొనుటకు ప్రయత్నించునేగాని, ఇంత ఘోర హింసకు అతని మనస్సు ఎట్లును ఒప్పుకొనదు' అను ఒక ధైర్యముమీద ఉండి, ఎన్నైనను బీరములు పలికినాడు. అంతియుకాని, శౌర్యపరాక్రమములు చూచిన, పాండవులలో ఏ ఒక్కరికిని తామందరును చాలరని బాగుగా తెలియును. ధర్మరాజు రాజసూయ యజ్ఞము చేసిన తరువాత దుర్యోధను నకు వారి ఐశ్వర్యము, ప్రతిభ, వైభవము, మయసభను చూచినది మొదలు "అది ఎట్లు హరించుటయా" అను దురాశ బాగుగా కలిగి, దురాలోచనలో మునిగియుండి, ఒక సమయ ములో మేనమామయైన శకునితో అనును.

"సీవును జూచి తట్టి సభ నేని వినంబడ దే యుగంబులన్
భూవలయంబులోన నది యపూర్వము సర్వమనోజ్ఞ మిష్టభో
గావహ మే క్రియంబడసెనయ్యమహాత్ముడు దాననేమి సం
భావిత భాగ్యుడయ్యెను ప్రభాకరతేజుడు ధర్మజుండిలన్."
(భారత. సభాపర్వం. ద్వి. అ. ౧౮వ పద్యము)

అనియును,
తంద్రితో

"సాగరసారవారి రుహశౌక్తిక మౌక్తిక విద్రుమద్రుమై
లాగరుచందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత
శ్రీగుణయుక్తమై బరగు సింహళ కేరళ చోళ పాండ్య దే
శాగతరాజపుత్త్రులు మహాగుణశాలి కజాతవైరికిన్."
(110వ పద్యము)

అనియును,

"హరియును గిరీటియును నొం
దొరుల కభీష్టములు సలుపుచుండుదు రంద
ఱ్యరువురు నేకాత్ములు జన
శరణ్యు లుత్తములు నిత్యసాంగత్యమునన్."
(112వ పద్యము)

అనియును,

"భావిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పాండవేయు ల
క్ష్మీవిభవంబుతోడ నుపమింప సమంబులుగా వశేష రా
జావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిజూచియే
జూవె సహింపనోపక కృశుండ వివర్ణుడనైతి నెంతయున్."
(114వ పద్యము)

అనును,

ఏకాంతములో పాండవుల గుణాతిశయములు మొదలగు వాటిని మెచ్చుకొన్నాడు. మెచ్చుకొని సంతోషించక, అసూయతో కుమిలి కుమిలి కృశించినాడు.

ఆ రాజ్యము, ఆ వైభవము అంతయును హరించవలె నని దురూహకలిగినది. ఎట్లు హరించుట ? యుద్ధముచేసి గెలువ వలయునా ? అదిచేతగాదు. ఇట్లన్నమాత్రమున దుర్యోధనుడు పిరికిపందయనిగాని, యుద్ధనైపుణ్యము, రాజనీతి తెలియనివా డనిగాని మా అభిప్రాయముగా ఎవరును పొరపడవద్దని ప్రార్థన. దుర్యోధనుడు ఇతరులతో పోల్చిన ఎంత గొప్పవాడైనను, పాండవులతో పోల్చినయెడల సూర్యునిముందు చమురుదీపమే. యుద్ధముచేయు విషయములో అతని అభిప్రాయము చూడుడు.

"భూవిదితప్రతాప పరిభూత విపక్షుడు సవ్యసాచి గాం
డీవముగొన్న భీముడు వడిన్ గదగొన్న గదల్ కృపాణ చ
ర్మావరణాదిభాసిత మహాభుజ విక్రములైన వారలన్
లావె రణంబులో మన కలంఘ్యబలాఢ్యుల నింకనోర్వగాన్"

(273వ పద్యము)

"యుద్ధములో జయించి, వారిరాజ్యము గొనుట అసంభవము. కనుక మరల జూదములోగెలిచి, వారలఅరణ్యము లకు తోలవలయును" అని అనును. ఆ భీమార్జునులను కవలను జూచిన ఎంతభయమో ? పోనీ ఇంత భయమున్నవాడు ద్రౌప

దిని సభలో కీడ్చిననాడు భీమార్జునులు రౌద్రమూర్తులై శపథములు చేసినప్పుడు దుర్యోధనుడు, కర్ణుడు, ఎంతో నిర్లక్ష్యముగా అపహాస్యము చేయుదురు. ద్రౌపదిని తన యంకమెక్కవలసినదని తొడచరచుకొని చూపును దుర్యోధనుడు. ఇట్టిసమయములో భీముడు రౌద్రమూర్తియై రెండు శపథములు చేయును. మొదట దుశ్శాసనుడు బట్టలు ఒలుచుచున్నప్పుడు

"కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపది నిట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర మూర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"

అనియును,

దుర్యోధనుడు ద్రౌపదికి తన తొడలు చరచుకొని సంజ్ఞ చేసినప్పుడు,

"ధారుణి రాజ్యసంపద మదంబున గోమలి కృష్ణజూచి రం
భోరు నిజోరుదేశమున నుండగ బిల్చిన యుద్ధరాత్మ దు
ర్వార మదీయ బాహు పరివర్తిత చండ గదాభిఘాత భ
గ్నోరుతరోరు జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్."

అనియును శపథము చేయును. నిజముగా అప్పుడు ధర్మరాజు ఆజ్ఞయే అడ్డులేకపోయిన పార్థుని గాండీవమునుండి వెలువడు ఒక్కబాణాగ్ని ధార్తరాష్ట్రకుల సాగరము నింకించదే దుర్యోధనాది సోదర పర్వతశతమును భీమసేనుని ఒక్క గదాఘాతము పిండిపిండి చేయదే! దుర్యోధనాదుల ఆయుశ్శేషము ఇంతకు మిగిలియుండుటచే, ధర్మరాజుయొక్క ఆజ్ఞాపాశంబున

బంధింపబడి, భీమార్జున సింహములు రౌద్రావేశమున గర్జించి, అణగి మణగి పడి ఉండవలసివచ్చినది. ఇట్టి మహా సంకట సమయములోనే ధర్మరాజు 'శాంతము, శాంతము' అనుచు సింహచతుష్టమును గుప్పిలిలోనుంచుకొని శాంతింప జేసినవాడు, క్షుద్రమైన రాజ్యభోగముల కొరకు ఇంత మహాఘోరమైన హింసాకాండకు ఓర్చి, యుద్ధముసేయునా ? చేయడు అని దుర్యోధనుని నిశ్చయము. కనుక ఎటులను యుద్ధము సాగదనుకొన్నప్పుడు ఎన్నిబీరములు పలికిననేమి ? లోపల మాత్రము, ఈ నాలుగు సింహములలో ఏ ఒక్క సింహమును వదలినను, "గొప్పఆకలియంటలోనున్న సింహమును లేళ్ళ గుంపుమీదకు వదలినయెడల లేళ్ళపని ఏమగునో మనపని కూడ నంతియ" యని తెలియుటచేత భయమున్నది. అయినను వదలరు అని ధైర్యము. ఇప్పుడు తానొకటి తలచిన ఇంకొకటి అయినది. జరుగదు అనుకొన్న యుద్ధము నెత్తిమీదకు వచ్చినది. పాండవులతో తూచునప్పుడు దుర్యోధనుని ఇట్లు వర్తి వేయుచున్నాము కాని, పాండవులను వేరుగా ఉంచిన, దుర్యోధనుడు సామాన్యుడా ! మరణమును కోరువాడు కాకపోయినను, దురభిమానికదా ! చివరకు గత్యంతరము లేకపోయిన చావనైన చచ్చునుగాని రాజ్యమిచ్చునా? సాధ్యమైనంతవరకు చావకుండ నుండుటకును, రాజ్యము ఈయకుండ నుండుటకును అవకాశములు వెదకును. యుద్ధము తప్పని సరియైె, సంధికి ఒడంబడి రాజ్యము ఇచ్చుటయా, చచ్చుటయా ? - ఈ రెంటిలో ఏదియో ఒకటి ఎన్నుకొమ్మనిన

మాత్రము ఆ దురభిమాని చచ్చుటకే ఒప్పుకొనునుగాని, సంధికిమాత్రము ఒప్పుకొనడు. దురభిమాన ముండవలయునే గాని, అభిమానము వదలుకోవలసివచ్చినయెడల చావుకు జంకక నూతిలో దూకి చనిపోవు అబలలు ఎంతమందిలేరు ? కాబట్టి "దుర్యోధనునికి భయమే ఉన్నచో సంధికే ఒడంబడు వాడు. అది జరుగలేదు. కనుక భయమున్నదని ఊహించుటకు వీలులేదు" అన్న శంకరానందుల అభిప్రాయము అంత సమంజసముగాలేదు. భయములేదు అనుటకు 'సంధికి ఒప్పుకొనకపోవుట' యన్న ఈ ఒక్క కారణము చాలదు. పాండవ సైన్యమును జూచి భయపడియే ద్రోణాచార్యుల వద్దకు పోయినట్లూహించుటకు ఇంకొక కారణముకూడ కలదు. మూడవశ్లోకములో దుర్యోధనుడు చెప్పునప్పుడు "మహతీం చమూం" అని గొప్పసైన్యముగా వర్ణించును. ఆ సైన్యము, వ్యూహముగ పన్నిన ఆ నైపుణ్యము జూచునప్పటికే భయముతో చిత్తము చలించినది. ఆ సైన్యమును రక్షించు కొనుచు, గద చేబూని మహాభయంకరముగా రౌద్రముచే బుసలు కొట్టుచు "ఎప్పుడు శత్రుసైన్యముమీదపడి నెత్తురు త్రాగుదుమా" అన్నట్లు భీమన్న నిలబడియున్నాడు. వేసవిలో మధ్యాహ్నమార్తాండునివలె తేరిచూడరాక గాండీవమును ధరించి ఒకప్రక్క అర్జునుడు కనుపడుచున్నాడు. ఇక వీరిని చూచునప్పటికి పుట్టిన భయముతో ఆ సైన్యము లోని అందరును భీమార్జునులవలె భయంకరముగా తోచు చున్నారు. కనుకనే 'భీమార్జునసమా యుధి' అనినాడు

కొంతమంది వీరుల పేర్లను చెప్పి 'ఇంతఎందుకు ఆచార్యా ఆ సైన్యములో ఉన్నవారందరును మహారథులే. ఒక్కరును తక్కువవారు లేరు' అను భావముతో "సర్వఏవ మహారథాః" అని చెప్పుచున్నాడు. ఇక్కడ దుర్యోధనుడు 'భీమార్జున సమా యుధి' అని, ప్రయోగములో 'యుధి' యుద్ధమునందు అను పదము ఉపయోగించినాడు. అనగా ఉన్న వీరులందరును భీమార్జునులతో దేనిలో సమానులు ? ఇప్పుడు దుర్యోధను నకు కావలసినది సైన్యములోని వారందరు యుద్ధముచేయు టలో భీమార్జునులతో సమానమైన వీరత్వము. పరాక్రమము, శౌర్యము, బలము కలవారని భావమేగాని, అన్ని విధములను అనగా జ్ఞానభక్తి వైరాగ్యములలోగాని, అందచందములలో గాని, ఐశ్వర్యము వైభవములలోగాని కాదు. మిగిలిన స్వభా వములు గుణములలోగాని కాదు. యుద్ధమునందు మాత్రమే సమానత్వము అని అతని భావము.

అవతారిక :—

ఇట్లు పాండవ బలములోని కొంతమంది వీరులను వర్ణించి చెప్పి, ఇప్పుడు ఇంక తన సేనలోని ముఖ్యమైన వీరులను గురించి చెప్పుచున్నాడు.

శ్లో॥ అస్మాకంతు విశిష్టాయే
తాన్నిబోధ ద్విజోత్తమ !
నాయకా మమ సైన్యస్య
సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ ౭

ప. వి :— అస్మాకం, తు, విశిష్టాః, యే, తాన్, నిబోధ, ద్విజోత్తమ, నాయకాః, మమ, సైన్యస్య, సంజ్ఞార్థం, తాన్, బ్రవీమి, తే.

టీక :—

ద్విజోత్తమ ! = విప్రశ్రేష్ఠా !
యే = ఏవరు,
అస్మాకం = మనకు,
విశిష్టాః = ముఖ్యులో,
మమ = నాయొక్క,
సైన్యస్య = సైన్యమునకు,
నాయకాః = నాయకులో,
తాన్ = వారలనుగూర్చి,
తే = నీకు,
సంజ్ఞార్థం = తెలియుటకు,
బ్రవీమి = చెప్పుచున్నాను,
నిబోధ = తెలిసికొనుము.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ! మన సైన్యములోని ప్రధానవీరులను మీరు తెలిసికొనుడు. మీకు తెలియుటకై మన సైన్యములోని నాయకులను చెప్పుచున్నాను.

అ మృ త వా హి ని :—

ఓ ద్విజోత్తమా ! పాండవుల సైన్యములోని వీరులను చెప్పియున్నాను. వింటివిగదా ! ఇదిగో ! మన సైన్యములోని వారలనుకూడ కొంతమంది నాయకులను మీకు తెలియుటకై చెప్పుచున్నాను- వినవలసినది. 'విశిష్టాయే' అనుటచేత 'మన సైన్యమున ఉన్నవారిలో శ్రేష్ఠులను చెప్పుచున్నాను' అను

భావము స్ఫురించుచున్నది. ఈశ్లోకములో 'తు' ప్రయోగము చేత, 'అస్మాకంతు' మనసైన్యములోకూడ అని అర్థము. 'తు' 'కూడ'అనునర్థములో ప్రయోగించబడినది. 'మనసైన్యములో కూడ' అనుటచేత 'మీకింతవరకు పాండవ సైన్యములోని మహావీరులను చెప్పియున్నాను. అంతమాత్రమున మన సైన్యములో లేరని అభిప్రాయముకాదు. మన సైన్యములో కూడ అందరు వీరులే!' అని దుర్యోధనుని అభిప్రాయము కావచ్చును. లేక "పాండవుల సైన్యములో మహావీరులను చెప్పితిని. మన సైన్యములోకూడ చెప్పెదను వినుడు" అను అభిప్రాయము కావచ్చును. ఆ 'తు' అనుదానిని అటు, ఇటు కూడ చెప్పవచ్చును. ఈ రెండు అభిప్రాయము లలో, రెండవదే దుర్యోధనుని అభిప్రాయమయి ఉండ వచ్చును. ఎందువలన అనగా పాండవుల సైన్యమును గూర్చి చెప్పునప్పుడు పాండవుల సేనలోని శ్రేష్ఠులను చెప్పెద ననకుండ "అత్రశూరాః" ఆ సేనలో శూరులు అని ప్రారంభించి, "సర్వ ఏవ మహారథాః" అనగా అక్కడ సర్వులును మహా రథులే అనుటచేతను, ఇక్కడ 'మనసేనలోని శ్రేష్ఠులను చెప్పెదను' అని ప్రారంభించి తరువాతి రెండు శ్లోకములలో కొంతమంది పేర్లుచెప్పి, "అన్యేచ బహవశ్శూరాః" ఈ చెప్పిన వారు కాక ఇంకను చాలమంది శూరులు కలరుఅని అనుటచేతను మన సేవలోని అందరును శూరులు అన్న భావము దుర్యోధనునికి కలుగుటలేదు. లేకున్న "బహవశ్శూరాః" చాలమందిశూరులు అనుట ఎందుకు? "సర్వఏవశూరాః" అనువాడే. అయితే

"సర్వే యుద్ధవిశారదాః" 'అందరు యుద్ధవిశారదులే' అని అనలేదా అనవచ్చును. కాని ఈ "సర్వే" అన్నది సైన్యము లోని అందరికి వర్తించదు. పైన 'బహవశ్శూరాః' అని ఉండుటచేత 'ఏ' చాలమంది శూరులు ఉన్నారు అని అన్నాడో, వారందరును యుద్ధవిశారదులు అన్న అర్థమునే తీసికొనవలయును. పోనీ ఇంతమంది ఉన్నప్పటికిని "త్యక్తజీవితాః" జీవితమును వదలిపెట్టినవారిని అర్థము. అనగా భావము. ప్రాణములు త్యజించినవారని. అనగా నాకొరకై ప్రాణములు కూడ వదలిపెట్టుటకు సిద్ధముగా నున్నారని భావము తీసికొనవచ్చును. లేదా, ప్రాణములు వదలిపెట్టినవారని తీసికొనవచ్చును. విశ్వరూపసందర్శన యోగములో కూడ కృష్ణపరమాత్మ "మయైవైతే నిహతాః పూర్వమేవ" 'వీరందరును నాచేత ఇంతకుముందే చంపబడినవారు' అని చెప్పియున్నాడు. అయితే కృష్ణుడు అనుటలో భావము వేరు, దుర్యోధనుడు అనుటలో భావము వేరు. "ఎట్లును చచ్చెడివారే" అని దుర్యోధనుని భావము. ఎందువలననిన ద్రోణాచార్యులు పాండవపక్షపాతి.పాండవులను చంపడు. అంతియకాక పాండవులకే జయముచేకూరుననియును, చేకూరవలయుననియును, ధర్మరాజే రాజ్యమేలవలయు నని యును, బలమైన అభిమానము కలవాడు. తనదగ్గర విద్య చెప్పించుకొన్న శిష్యులని అభిమానముతప్ప కౌరవులయందు గాని, పాండవులయందుగాని, ఇంకొక అభిమానము ఉండుటకు కారణము లేదు. ఎందువలననగా ద్రోణాచార్యులకు వీరిలో

ఎవరితోను దేహసంబంధమైన బాంధవ్యము లేదు. ఆ బాంధవ్య మున్నచో దుష్టుడైనను తన కుమారుడనియో, ఎవరనియో అభిమానము, మమకారము ఉండి ఉండెడిది ధృతరాష్ట్రునికి వలె, అది లేదు. ఈ ఉన్న అభిమానమైనను 'కేవలము ధర్మాత్ములు, మంచివారు, కష్టములు పడుచున్నారు' అనెడి కారణముచేత పాండవులయందు గాఢముగా యున్నది. దేహసంబంధము లేనప్పుడు ఇంక దుర్యోధనునియందు ఆయనకు అభిమానము ఉండుటకు కారణమేమున్నది ? ఇంక దుష్టుడని ద్వేషముకూడ నున్నది. అయితే పాండవులవైపు ఎందుకు వెళ్ళలేదు ? కొంత మంది "దుర్యోధనుని ఉప్పుతినుచుండుటచేత వెళ్ళలేకపోయి నాడు" అందురు. "రాజ్యము దుర్యోధనునిది కాదు. ధర్మ రాజుదే. దుర్యోధనుడు అన్యాయ్యముగా లాగుకొనినాడు" అని అభిప్రాయముకల ద్రోణాచార్యులకు దుర్యోధనుని ఉప్పు తినుచున్నామనెడి భావము ఉండదు. అయిన ఎందులకున్నాడు? చాలకాలమునుంచి పాంచాలురు మొదలైనవారిమీద బాగా ద్వేషమున్నది ద్రోణాచార్యులకు. ఎవరైతే ద్రోణాచార్యులకు ప్రబలశత్రువులో, ఎవరిని ద్రోణాచార్యులు సర్వనాశనము చేయవలెనని ఎప్పటినుంచియో సమయముకొరకు ఎదురు చూచుచున్నాడో, ఆ పాంచాలురు మొదలైనవారికిని పాండవు లకును బలమైన సంబంధములు ఏర్పడియున్నవి. కాబట్టి వారంద రును పాండవులవైపు వచ్చెదరు. వారిని సంహరించుటకు ఈయన దుర్యోధనుని పక్షమున ఉండిననేగాని వీలు లేదు. ఆ అభిప్రాయముతో పాండవుల పక్షమున వెళ్ళలేదు. అయినను

పాండవులకు జయము చేకూరవలయునని మాత్రము బలమైన అభిప్రాయము కలదు. తమ శత్రుసంహారము మాత్రము జరిగిన, దానికి అడ్డము లేనంతలో పాండవులకు ఆయన చేయగల సాహాయ్యమంతయును చేయుటకు సిద్ధముగానున్నాడు. ఇది దుర్యోధనునికి తెలియును. తాను చచ్చు నుపాయముకూడ ధర్మరాజునకు చెప్పియున్నాడు. అందుచేత, ఇక ద్రోణాచార్యులు ఇప్పుడుకాకపోయిన రేపైనను చచ్చువాడే. భీష్ముడుకూడ తనవధోపాయము చెప్పుటకు "ఇప్పుడుకాదు. ఇంకొకసారిరమ్ము, చెప్పెదను" అని వాగ్దానమిచ్చియున్నాడు. అందువల్ల ఆయన కూడ చచ్చినట్లే. కర్ణుడున్నాడనిన, ఇతడు మహావీరుడును, మహారథుడును అయినప్పటికి, అతని అస్త్రవిద్య సమయమునకు ఉపయోగపడకుండ మరచిపోవునట్లు పరశురాముని శాపమున్నది. పైకి చెప్పకపోయినను, అభిమానముతో, మోహముతో సరిగా విచారించుకొనలేకపోయినను, ఇప్పుడు సమయము వచ్చినది-యుద్ధమువచ్చి నెత్తిమీదపడినది - ఇప్పుడు ఆలోచించుకొనిచూచుకొన్నచో కర్ణునకు అర్జుననకుగల తేడా దుర్యోధనునికి మాత్రము తెలియదా ? ఉత్తరగోగ్రహణ సమయములో ఈ భీష్ముడు, ఈ ద్రోణుడు, ఈ కర్ణుడు లేరా ? చతురంగబలసమేతముగా వెళ్ళలేదా ? ఎదురువచ్చిన అర్జునుడు ఏకాకిగా, వెంట చక్రరక్షకులైననూ లేక, సారథ్యములో ఎంతగొప్ప నైపుణ్యమున్నను ధైర్యసాహసములలో శత్రుసైన్యమును చూడగనే రథముదిగి పరుగెత్తువాడు, భీష్మాదివీరులు చేయు సింహనాదములను వినునప్పటికే

మాటిమాటికి మూర్ఛ చెందువాడు - ఉత్తరుడు సారథి. ఇటు వీరితో యుద్ధముచేయుచు, అటు గోవులను మరల్చుకొనుచు విజయము సాధించికొనిపోలేదా విజయుడు ? అప్పుడు ఘోష యాత్రలో తనను గంధర్వులు కట్టి తీసికొనుపోవు సమయములో పిక్కబలము చూపించిన దీ కర్ణుడేగదా ! అప్పుడు భీమార్జునులుకదా వచ్చి విడిపించినవారు! ఇట్లు చూచుకొనినచో దుర్యోధనునికి మాత్రము తెలియదా కర్ణార్జునులలో నున్న వాసి! కనుక భయము కలుగక ఏమౌను? కర్ణునకు యుద్ధములో అసలు సమయము వచ్చునప్పటికి రథము క్రుంగిపోవునని ఒక శాపము కలదు. ఇవన్నియును తెలియును. కనుక ఇతడుకూడ త్యక్తజీవితుడే. ఇట్లు ఆలోచించుకొని, 'మన సైన్యములోని శ్రేష్ఠులను చెప్పెదను. ఆ శ్రేష్ఠులస్థితి ఇటులున్న మనకు జయ మెట్లు కలుగగలదు?' అని దుర్యోధనుని భావము.

అవతారిక :—

పై శ్లోకములో మన సైన్యములోని శ్రేష్ఠులను చెప్పెదను వినుమని, ఇప్పుడు రెండుశ్లోకములలో వీరులను చెప్పు చున్నాడు.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ
కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ
సౌమదత్తి స్తథైవచ ॥ 8

ప. వి:—భవాన్, భీష్మః, చ, కర్ణః, చ, కృపః, చ, సమితింజయః, అశ్వత్థామా, వికర్ణః, చ, సౌమదత్తిః, తథా, ఏవ, చ.

శ్లో॥ అన్యేచ బహవ శ్శూరా
మదర్థే త్యక్త జీవితాః।
నానాశస్త్ర ప్రహరణా
స్సర్వే యుద్ధ విశారదాః ॥

ప. వి :— అన్యే, చ, బహవః, శూరాః, మదర్థే, త్యక్తజీవితాః, నానాశస్త్రప్రహరణాః, సర్వే, యుద్ధవిశారదాః.

టీక :—

భవాన్ = తమరును,
భీష్మః + చ = భీష్మాచార్యులును,
కర్ణః + చ = కర్ణుడును,
సమితింజయః = రణమున జయము గాంచుట స్వభావముగా గలిగిన,
కృపః + చ = కృపాచార్యులును,
అశ్వత్థామా = అశ్వత్థామయును,
వికర్ణః + చ = వికర్ణుడును,
సౌమదత్తిః = సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడును,
తథా + ఏవ + చ = అట్లే,
మదర్థే = నా ప్రయోజనము కొరకు,
త్యక్తజీవితాః = విడువబడిన జీవితాశ గలవారు,
అన్యే + చ = పైన పేర్కొనబడినవారుగాక ఇతరులును,

బహవః = చాలమంది,
శూరాః = శూరులు (సంతి = కలరు.)
సర్వే = (వారు) ఎల్లరును,
నానాశస్త్రప్రహరణాః = అనేకవిధములగు శస్త్ర ప్రయోగ కుశలురును,
యుద్ధవిశారదాః = యుద్ధమునందు నేర్పరులును.

తా. తమరు (ద్రోణాచార్యులు), భీష్ముడు, కర్ణుడు యుద్ధమునందు విజయమునే సాధించు కృపాచార్యులు, అశ్వత్థామ, వికర్ణుడు, సౌమదత్తి-అనగా సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు, ఇంతే కాక నా కొరకు ప్రాణములుకూడ లెక్కచేయక యుద్ధమునకు వచ్చిన వీరులు చాలమంది యున్నారు. వీరందరునుకూడ అనేక శస్త్రాస్త్రములతో వచ్చియున్నారు. అందరును యుద్ధము చేయుటలో మంచినైపుణ్యము కలవారే. ౮, ౯

**ఆ ఖ్యా త వా హి ని :—**

1. ద్రోణాచార్యులు : భరద్వాజమహర్షి కుమారుడు. ఈయన, మహర్షి అగ్నివేశ్యుని దగ్గరను, పరశురాముని దగ్గరను సమస్తమైన అస్త్రములను, శస్త్రములను సరహస్యముగా ఉపదేశము నందినవాడు. వేదవేదాంగములు కూడ సాంగోపాంగముగా తెలిసినవాడు. గొప్ప తపశ్శాలి. ధనుర్వేదము సంపూర్ణముగా తెలిసినవాడు. శస్త్రాస్త్రముల యొక్క మర్మములన్నియును బాగుగ నెరిగినవాడు. యుద్ధకళయందు సాటిలేని మేటి. అతిసాహసి. మహారథుడు. ఇతని చేతిలో ఆయుధమున్నంతవరకు దేవ దానవ మానవ సంఘములలో ఎవరును ఈతనిని జయింపలేరు. అజేయుడు.

కృపాచార్యుల సహోదరి ఈయనధర్మపత్ని. ఆమెపేరు కృపి. శరద్వంతమహర్షి కుమార్తె. అశ్వత్థామ ఈ ద్రోణాచార్యుల కుమారుడే. ఈ ద్రోణాచార్యులను గురించి నాల్గవశ్లోక వ్యాఖ్యానములో కొంతచూడనగును. మహాభారత యుద్ధములో ఈయన చూపిన బలపరాక్రమములు, సాహసము ఆశ్చర్యకరములైనవి. సింహము లేళ్ళగుంపుమీదపడి చెండాడినట్లే. చివరకు అశ్వత్థామ మరణించినట్లు భ్రమ మూలకమైన ఒక సమాచారము విని అస్త్రసన్న్యాసముచేసి, ధ్యానమగ్నులై యుండగా ధృష్టద్యుమ్నుడు ఒక పదనైన కత్తితో తల నరకినాడు. ఆయన శరీరమునుండి ఒక కాంతి పుంజము ఆకాశమంతను ప్రకాశింపజేయుచు పైకిపోయినది. ఇక్కడ ఒక సందేహము వ్యాపించి యున్నది. చాలమంది, ద్రోణాచార్యులు ప్రాణములు పిడిచిపెట్టిన తరువాత ధృష్టద్యుమ్నుడు ఆయనయొక్క తలనరకినాడని అనుచున్నారు.

కాని అట్లు జరుగలేదు. ప్రాణములు పోయిన తరువాత నరకిన యెడల, అతడు యజ్ఞకుండమునుండి పుట్టుట, అతని చేతిలో ద్రోణునికి మరణముండునట్లు వరముండుట వృథయేగదా!

యుద్ధప్రారంభములో ధర్మరాజు పాదచారియై భీష్ముని వద్దకును, ద్రోణునివద్దకును పోయి ఆశీర్వాదములను బడసి, 'మీవధకు ఉపాయము చెప్పవలయు'నని ప్రార్థింపగా, ద్రోణుడు "నేను అత్యంతమైన కీడును సూచించువార్త వింటినేని అస్త్ర సన్న్యాసముచేసి ప్రాయోపవేశమునందుదును. అప్పుడు శత్రువు

నన్ను చంపుటకు అదను దొరకును" అని చెప్పినాడు. ఆయన ఎంత యోగియైనను సమాధిలో నుండగలడుగాని, కూర్చుండగనే ప్రాణములుపోవు. ద్రోణునికి స్వచ్ఛందమరణము లేదు. కనుక అస్త్రములు వదలిపెట్టి, ప్రాయోపవేశమున నున్నవానిని చంపుట శవమును నరకినట్లే. కాని, ఏమి జరిగినదో చెప్పికొనవలయుననిన మాత్రము, సమాధినిష్ఠుడై, ప్రాయోపవేశములోనున్న ద్రోణుని ధృష్టద్యుమ్నుడు చంపినాడు. ప్రాణము పోయినతరువాత మాత్రము కాదని మా అభిప్రాయము. ప్రతిపక్షులలో ఉన్నను ద్రోణాచార్యులకు పాండవుల యందు అపారమైన ప్రేమాభిమానములున్నవి. పాండవులకు ద్రోణాచార్యులమీద అపారమైన భక్తిగౌరవ విశ్వాసము లున్నవి. ఆ కారణమున అట్లు ధృష్టద్యుమ్నునిచే ద్రోణాచార్యులకు చావు విధినిర్ణయమై యున్నప్పటికిని, అది తెలిసినవారు కూడ తాత్కాలిక సానుభూతికి లోబడిపోయి "చంపకు, చంపకు" అనిగాని, "దుష్టుడా! చనిపోయిన తరువాత తలనరకి నావా!" అనిగాని పలుకుదురు. తాత్కాలికోద్రేకములకు పాల్పడుదురు. అంతేగాని, విధినిర్ణయము ఆలోచించినచో, ధృష్టద్యుమ్నుని చేతిలోనే ద్రోణాచార్యులకు మరణమునన్నట్లు గోచరమగును. కనుక ప్రాణముండగా నరకినాడుగాని, ప్రాణము పోయినతరువాతమాత్రము కాదు అని మా నిర్ణయము.

**2.** భీష్ముడు : ఈయన శంతను మహారాజు కుమారుడు. ఈ శంతను మహారాజు తన యౌవనకాలములో

వేటకు వెళ్ళి, గంగానదీసమీపమున సంచరించుచుండగా, సకలలోకసుందరియగు ఒక యువతి ఆ సమీపమున విలాసముగా తిరుగుచుండుటగని, మోహించి, దగ్గరకుపోయి, సకలసమాచారములు తెలిసికొని, 'నాకు భార్యగా ఉండవలసినది' అని అర్థించి వేడినాడు. ఆయమ, పరమపావని గంగాభవాని. మానవరూపముతో సంచరించుచు ఈ రాజుగారిదృష్టిపథమున బడినది. రాజుకోరిక మన్నించినది ఒక షరతుమీద. తనకు పుట్టిన కొడుకులను తన ఇష్టమువచ్చినట్లు చేసికొనుటకు అధికారముండవలయును. ఆ నిర్ణయమునకు రాజు ఒప్పనినాడు, ఆ రోజుతో ఆమె వెళ్ళిపోవును. ఆ నిర్ణయమునకు రాజు సరేనని ఆనందముతో అంగీకరించినాడు. తరువాత కొంతకాలమునకు వరుసగా ఏడుగురు కొడుకులు కలిగిరి. పుట్టినవారిని పుట్టినట్లు ఒక్కొక్కరినే ఆమె గంగానదిపాలుచేసెడిది. శంతనునకు ఇష్టములేకున్నను ఆమెయందలి మోహముచే అంగీకరించి ఊరకొనెడివాడు. అట్లు ఏడుగురుకొడుకులు అయినతరువాత ఎనిమిదవకుమారుడు కలిగినాడు. అతనినికూడ తీసికొనిపోవుచుండగా, అడ్డమువచ్చి "ఈఒక్కకుమారునైనను ఉంచవలసినది" అని ప్రార్థించినాడు. సరేనని, ఆమె "ఇక మనకు సంబంధము తీరిపోయినది" అనిచెప్పి వెళ్ళిపోయినది. ఆ మిగిలిన కుమారుడే ఈభీష్ముడు. గంగాపుత్త్రుడుగనుక 'గాంగేయుడు' అనికూడ అందురు. అసలు మొదటినామము 'దేవవ్రతుడు.' తరువాత కొంతకాలమునకు ఒకనాడు శంతనుడు గంగానది సమీపమున పడవను నడపుచున్న ఒక యువతినిగని

మోహించి, తనను వివాహమాడ ప్రార్థించెను. ఆమె "నా తండ్రి దాశరాజు ఇష్టప్రకారము జరుగవలసినదే" అని సమాధానము చెప్పెను. దాశరాజునడుగగా "ఈమె గర్భమందు పుట్టిన బిడ్డనికి రాజ్యాధికారము ఇవ్వవలయును" అని కోరెను. దానికి "గాంగేయుడు పెద్దవాడుండగా చిన్నవాని కెట్లు ఇచ్చుట?" అని, ఏమియును చెప్పక శంతనుడు తిరిగివచ్చి ఆమెయందలి మోహము చే తిండికూడ మాని కృశించుచుండెను. అది కనిపెట్టి గాంగేయుడు దాశరాజువద్దకు వెళ్ళి, "ఈమెగర్భవాసమందు పుట్టిన బిడ్డకే రాజ్యాధికారము రాగలదు. నేను ఆ అధికారమును వదలుకొనుచున్నాను" అని ప్రతిజ్ఞ చేసెను. దానికి దాశరాజు సంతసించి "నీ పితృ భక్తికి, త్యాగమునకు మెచ్చుకొనినాను. కాని నీకు పుట్టిన బిడ్డలు ఊరకొందురా? మరల ఇది యొక తగాదాకు కారణము కాదా?" అనిన, దానికి గాంగేయుడు "నేను వివాహమే చేసికొనను. జీవితమంతయును పవిత్రబ్రహ్మచర్యదీక్షతో నుండెదను" అని భీష్మప్రతిజ్ఞ చేసెను. దానికి సర్వులు ఆనందించి ప్రశంసించిరి. దేవతలు సంతోషముతో "భీష్ముడవు" అనిరి. అప్పటినుండి 'భీష్ముడు' అను నామము ప్రసిద్ధమయ్యెను. తన కొరకై, మానవులనేకాదు దేవతలనుసైతము లోభపెట్టి చిత్త క్షోభము కలుగజేసెడి రాజ్యసుఖమును, అంతకు మించిన స్త్రీసుఖమును వదలిపెట్టుటచేత, తండ్రి సంతోషించి "నీకు ఇష్టములేకుండ మృత్యువు నీదరికి రాదు" అని స్వచ్ఛంద మరణమును వరముగా ప్రసాదించెను. ఈయన ఆబాల్య

బ్రహ్మచర్యదీక్షాపరుడు. మహాతేజస్వి. శస్త్రములయందును, శాస్త్రములయందును కూడ అపారమైన ప్రజ్ఞావిశేషములు కలవాడు. మహాజ్ఞాని. ఈయనయందు సకలసద్గుణములు ప్రకాశించుచుండెడివి. శౌర్యము, ధైర్యము, వీర్యము, త్యాగము, తితిక్ష, క్షమ, దయ, సత్యము, అహింస, శమము, దమము, సంతోషము, శాంతి, ఔదార్యము, స్పష్టముగా చెప్పుట, సాహసము, జ్ఞానము, విజ్ఞానము, మాతాపితృభక్తి, గురు, వృద్ధసేవనము మొదలైన గుణములు ఈయనయందు పూర్ణముగా వికసించినవి. కృష్ణపరమాత్మయందలి భక్తిచే ఈయన జీవితమే పావనమైనది. కృష్ణుని స్వరూపము, తత్త్వము పూర్తిగా తెలిసినవాడు. కృష్ణునియందీయనకున్న భక్తి, శ్రద్ధ, నిష్ఠ అపారము. భారతయుద్ధములో ఈయనను ఎదిరించగల వీరుడు ఒక్కడును లేడన్నచో అతిశయోక్తి కాదు. ఈయన దుర్యోధనునివద్ద ఒక ప్రతిజ్ఞ చేసినాడు. "నేను పాండవులను ఎవరిని, ఎప్పుడును, ఎట్టిపరిస్థితులలోను సంహరించను. కాని ప్రతిరోజును రోజుకు పదివేలమందివీరులచొప్పునసంహరించెదను. ఈ విధముగ నేను పడిపోనంతవరకును యుద్ధము చేయుదును" అని. ఈయన కౌరవపక్షమున సేనాపతులందరిపైన ప్రధాన సేనాపతిగ పదిరోజులు అద్భుతమైన మహాఘోరయుద్ధము చేసి, తరువాత శిఖండికారణముగా అర్జునుని వలన పడిపోయినాడు. సర్వులకును ప్రధానుడగుటచే, ఆయన పతనముతో అందరును యుద్ధమును నిలిపి, ఆయనవద్దకు చేరినారు. ఆయన ఆజ్ఞమీద అర్జునుడు అంపశయ్య నొనర్ప

అంపశయ్యాయందే అక్లేశకుండి, అనేకధర్మములను, జ్ఞానమును ఉపదేశించి, ఉత్తరాయణము వచ్చిన తరువాత మాఘశుద్ధ ఏకాదశినాడు కృష్ణభగవానుని ముఖకమలము నందు దృష్టి నిగిడ్చి స్వేచ్ఛతో, ఆనందముతో దేహత్యాగము చేసినాడు.

౮. కర్ణుడు : ఈ కర్ణుని సర్వులును సూతపుత్రుడనియు, రాధేయుడనియును భావించుచుండిరి. ఈ కర్ణుడు కూడ కుంతీకుమారుడే. కుంతి దుర్వాసునివలన చిన్నతనములోనే దేవతలను ఆహ్వానించగల మంత్రమును ఉపదేశమును పొందెను. "ఏ దేవతాంశమునపుత్రుని కావలయుననుకొందువో, ఆ దేవతఅనుగ్రహముకొరకు, ఆ దేవతను యీ మంత్రము ద్వారా ఆహ్వానించుము. అతడు సాక్షాత్కరించి నీ మనోరథమును నెరవేర్చును" అని చెప్పి దుర్వాసుడు తనత్రోవను తాను వెడలిపోయెను. ఈమె నదిలో స్నానముచేయుటకు వెళ్ళినప్పుడు అప్పుడే ఉదయించుచున్న సూర్యునిగని, చిన్నతనముగుటచే, తన మంత్రముయొక్క ప్రభావమును పరీక్షించుకొందమను తలంపుతో ఆమంత్రముద్వారా సూర్యుని ఆహ్వానించినది. వెంటనే సూర్యుడు అద్భుతదివ్యస్వరూపముతో తన సన్నిధిని సాక్షాత్కరించుటజూచి, కుంతి ఆశ్చర్యభయములతో వణకిపోయినది- "స్వామీ! నేను తెలియక మంత్రప్రభావమును పరీక్షించుకొనుట కిట్లు పిలిచితిని. దయయుంచి తాము దయచేయవచ్చును."అని ప్రార్థించినది. "నాసాక్షాత్కారము వృథాకారాదు. కాబట్టి నాఅంశతో నీకు ఒక కుమారుడు కలుగగలడు. కాని, నీ కన్యాత్వమున కేమాత్రము

భంగములేకుండ వరమిచ్చితిని" అని చెప్పి అంతర్థానము
చెందెను. ఆమె సద్యోగర్భము ధరించినది. చూచుచుండగనే
గర్భము పెరుగుట, కుమారుడు జన్మించుటకూడ జరిగినది;
కుమారునిచూచిన, రెండవసూర్యునివలె వెలిగిపోవుచున్నాడు.
ఆమెకు ఏమిచేయుటకు పాలుపోక చాల భయపడిపోయినది.
లోకనిందకు జడిసిపోయినది. సూర్యుని కుమారుని ఆయనయే
కాపాడుకొనగలడని విశ్వసించి, ఆ బాలుని ఒకపెట్టెయందు
చక్కని ప్రక్కమీద పరుండబెట్టి, రక్షపెట్టి, సూర్యుని
ప్రార్థించి గంగానదిలో వదలినది. బాలుడు నదిలో తేలిపోవు
చుండ, పట్టలేని దుఃఖమును దిగమ్రింగి, వదలివెళ్ళలేక వెళ్ళ
లేక వెళ్ళిపోయినది. ఆ పెట్టె ఆ నదిలో అటులే తేలిపోవుచూ
హస్తినాపురము చేరినది. అక్కడ అధిరథుడు అను సూతునికి
భాగ్యవశమున ఆ పెట్టెదొరకినది, ఆ బాలునిజూచి ఆనంద
భరితుడై, ఇంటికి తీసికొనివెళ్ళి తన భార్యయైన రాధ కిచ్చి
నాడు. ఆమెకూడ ఈబాలుని తన పుత్రునిగనే పెంచి పెద్ద
చేసినది. ఈ బాలుడు కవచకుండలములతో పుట్టినాడు. కవచ
కుండలరూపమైన ధనముతో పుట్టుటచేత అధిరథుడు ఈ
బాలునికి "వసుషేణుడు" అని నామకరణము చేసెను. బాలుడు
తగినవయస్సువచ్చినతరువాత ద్రోణాచార్యునివద్దను, పరశు
రామునివద్దను శస్త్రాస్త్రవిద్యల నభ్యసించెను. ఈయన
శాస్త్రము లందును, శస్త్రములయందునుకూడ గొప్ప
పండితుడు. ఇతని సాహాయ్యముకోరి దుర్యోధనుడు ఇతనిని
అంగదేశమునకు రాజుగాచేసెను. దుర్యోధనునకు ఇతనికి

అపారమైన మైత్రి. ఒక్కక్షణముకూడ విడిచియుండు వారు కారు. పాండవులరాజ్యము అన్యాయ్యముగా అపహరించుట కును, ఎవరు చెప్పినను, భీష్మద్రోణాదులేకాక చివరకు కృష్ణపరమాత్మ రాయబారిగావచ్చి చెప్పినను, దుర్యోధనుడు సంధికొడబడకపోవుటకును కారణ మితడే. ఎవరు ఏది అడిగినను లేదనక ఇచ్చెడిస్వభావ మితనిది. సూర్యపుత్రుడు అగుటచే అతనికి తెలియకుండనే అతని అంతఃకరణము సూర్యోపాసనకు అనుగుణమైనదై, ఎప్పుడును సూర్యోపాసన చేయు చుండెడిది. ఒకనాడు ఇంద్రుడు తన కుమారుడైన అర్జునుని సహాయార్థమై బ్రాహ్మణవేషములోవచ్చి, ఇతనికి పుట్టుకతోనే సహజముగా కలిగిన కవచకుండలములు అర్థించినాడు. కర్ణుడు ఆనందముతో సహజములైన కవచకుండలములుఒలిచి ఇంద్రుని కిచ్చినాడు. ఇంద్రుడుకూడ సంతోషించి,'వీరఘాతిని' అను ఒక దివ్యశక్తిని ప్రసాదించివెళ్ళినాడు. కాని, "ఇది ఒక్కమారు మాత్రమే ఉపయోగించును. నీవు ఎవరిమీాదనైన ఒకసారి ఉపయోగించిన తరువాత అమోఘముగాపనిచేసి, మరల నా వద్దకు వచ్చివేయును"అని చెప్పియున్నాడు.అది అర్జునునికొరకై దాచి, దాచి, ప్రతిరోజును మరచిపోయి వెళ్ళువాడు. చివరకు తనవారందరును జ్ఞాపకముచేయగా ఒకనాడు జ్ఞాపకముఉంచు కొని ఆశక్తిని తీసికొని యుద్ధమునకు పోయినాడు. కాని ఆరోజు ననే భీమునికుమారుడైన ఘటోత్కచుడు అ[illegible] ఘటోత్కచుని తట్టుకొనలేక, కౌరవసైన్యమ[illegible]యును, అతని క్రోపాగ్నిలో, అతని మాయాయుద్ధకౌశలము[illegible]



మాడిపోవుచుండిరి. కర్ణుడుకూడ దక్కునట్లులేదు. ఇక కౌరవ సైన్యములోని వారందరును, దుర్యోధనునితో సహా, "కర్ణా! ఈశక్తిని ఘటోత్కచునిమీద ప్రయోగించుము. నీవు, మేము బ్రతికియున్నచో అర్జునునిసంగతి చూచుకొనవచ్చును" అని భయకంపితులై బొబ్బలుపెట్టిరి. ఇక గుక్కత్రిప్పికొనలేక, గత్యంతరరహితుడై, ఇష్టములేకపోయినను ఆ శక్తిని ఘటోత్కచుని మీద ప్రయోగించినాడు కర్ణుడు. ఆ శక్తి ఘటోత్కచునికూల్చి ఇంద్రునివద్దకు వెళ్ళిపోయినది. ద్రోణాచార్యుడు మరణించిన తరువాత రెండుదినములవరకును ప్రధానసేనాధిపత్యమును స్వీకరించి. చివరకు అర్జునుని చేతిలో మరణించినాడు కర్ణుడు.

4. కృపాచార్యుడు : ఈయన గౌతమవంశములోని శరద్వంతుడను ఒక బ్రాహ్మణుని కుమారుడు. ఇతడు ధనుర్విద్యలో అపారప్రజ్ఞావిశేషములు కలవాడు. ఈయన సహోదరి పేరుకృపి. ఈయమయే ద్రోణాచార్యుని ధర్మపత్ని. ఈ కృపాచార్యుడు వేదశాస్త్రములయందుకూడ మహాపండితుడు. సకల సద్గుణ సంపన్నుడు. సదాచారుడు. కౌరవులకు, పాండవులకు, యాదవులకుకూడ, ద్రోణాచార్యునికి ముందు ఈయనయే ధనుర్విద్యయందు శిక్షణ నిచ్చిన ఆచార్యుడు. ఈయన చిరంజీవిత్వ వరమును పొందినవాడు. మహాభారత యుద్ధములో కౌరవపక్షములో అందరును చనిపోగా జీవించిన ముగ్గురిలో ఈయనఒకడు. తరువాత, అర్జునుని మనుమడైన పరీక్షిత్తునకు ఈయనయే ధనుర్విద్య నేర్పినాడు. మహా

వీరుడు. శౌర్యబలపరాక్రమములయందు అసమానుడు. ఎప్పుడును శత్రువులను జయించెడివాడు. కనుకనే ఇతని పేరుతో 'సమితింజయః' అను విశేషణము చేర్చబడినది.

5. అశ్వత్థామ : ఈయన ద్రోణాచార్యుని కుమారుడు. కృపాచార్యుని మేనల్లుడు. శస్త్రాస్త్ర విద్యలలో బహు నిపుణుడు. యుద్ధకళలోకూడ అపారమైన ప్రజ్ఞ కలవాడు. గొప్పశూరుడు. మహారథుడు. ఈయన తన తండ్రియైన ద్రోణాచార్యునివద్దనే విద్యనభ్యసించెను. ఈయుద్ధము తరువాతకూడ జీవించినవారిలో ఈయనకూడ ఒకడు. ఇంత ప్రజ్ఞా విశేషములుకలవాడై కూడ చివరకు, ఉపపాండవులు మొదలగు వీరులను రాత్రిసమయములో దొంగవలెపోయి ఘోరముగా అన్యాయ్యముగా సంహరించినాడు.

6. వికర్ణుడు : ధృతరాష్ట్రుని నూరుమంది కుమారులలో ఇతడు ఒకడు. ఇతడు మహావీరుడు. ధర్మాత్ముడు. మహారథుడు. కౌరవసభలో ద్రౌపదిని అవమానించు సమయములో - దుర్యోధనుని భయముతో ఎవరును ఏమియు అనలేక మిన్నకున్నను - ఒక్క యీ వికర్ణుడే ధైర్యసాహసములతో ఆ అన్యాయ్యమును తీవ్రముగా ఖండించినాడు చివరకు ఎవరును వినకుంటచే సభను దూషించుచు వెడలిపోయినాడు.

7. సౌమదత్తి : ఈయనయే భూరిశ్రవుడు. సోమదత్తుని కుమారుడగుటచే సౌమదత్తియని అందురు. ఈయన

భీష్ముని పినతండ్రియైన బాహ్లీకుని మనుమడు. ఈయన కూడ గొప్ప ధర్మాత్ముడు. యుద్ధకళయందు మంచినైపుణ్యము కలవాడు. శూరుడు, వీరుడు, మహారథుడు. గొప్ప గొప్ప దక్షిణలు ఇచ్చి, అనేకములైన యజ్ఞములు చేసినవాడు. ఈ యుద్ధములోనే సాత్యకిచేతిలో మరణించినాడు. శ్లోకము చివర 'తథైవచ' అనుటచేత అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు కూడ కృపాచార్యుని వలెనే యుద్ధమునందు ఎవరిచేతను జయింపబడని వీరులు, శూరులు అని భావము.

తొమ్మిదవ శ్లోకములో - 'ఇంక చాలమంది శూరులు కలరు. అందరును నా కొరకై ప్రాణములు కూడ త్యజించుటకు సిద్ధముగ నున్నారు' అని ఇక్కడ "త్యక్తజీవితాః" అనినప్పుడు 'నా కొరకై ప్రాణములు వదలుటకు కూడ సిద్ధముగ ఉన్నవారు'అని భావార్థము. కాని కేవలము మూలమును చూచిన, త్యక్త=త్యజింపబడిన, జీవితాః=జీవితముకలవారు - అనగా, పోయిన ప్రాణములు కలవారు అని. అనగా చచ్చిన వారు అని అర్థము. ఏడవశ్లోకములో ఈ సందర్భమును గురించి వ్రాయబడినది. నేడు చచ్చిననేమి? రేపు చచ్చిన నేమి? చచ్చినవారి క్రిందనే జమవేసినాడు దుర్యోధనుడు. కనుక వీరెంతశూరులైననేమి, ఎంత వీరులైననేమి - జయము మాత్రము సందేహామే. ఇదివరకు భీష్ముడు చెప్పిన వన్నియును ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. పాండవులు అందరును అతిరథులు, మహారథులనునది వేరు. యుద్ధము చేయుటకు ఏర్పడిన కారణ మూలోచించిన - దెబ్బతినిన

శార్దూలములవలె, ఆకలిగొన్న సింహములవలె వచ్చు చున్నారు. భీష్ముడనుచున్నాడు -

వారందరును ధర్మ । వైభవంబున, దప
స్సంపద నెక్కుడు జనులకెల్ల
ధనువు నారంగంబు లను బిరిణతులు దా
కోర్తురు పరులకు నోర్వరాని
కోల్తల గలరు పెక్కులు పరాక్రమములు
వేర్వేర చేచేసిన వీరు లాక్క
మొగమయి తాకిన వెగడందకుండునే
మనసేన మున్నవమానపాటు

దుఃఖపాటు గలిగి తొడరంగ వచ్చిన
వారుగాన యలతిబోరు ప్రాణ
మాసపడక యోపినంతయు బెనగుదు
రది సహించి నిలుచు టరిది మనకు.

ఇన్నియు తలంపునకు ఒక్కసారి వచ్చుచున్నవి. భయ మున్న సంధికి ఒప్పుకొనకుండునా అనుట సరికాదు. చివరకు భయపడియేగదా కొలనులో దాగుకొన్నది! అప్పు డైనను మరల ధర్మరాజాదుల పలుకులు వినిగదా రోషము పుట్టి భీమునితో గదాయుద్ధమునకు తలపడి చచ్చినది! నీటిలోనుండి రాకున్న ఎవరేమి చేయుదురు? దాగికొనిన వారిని లాగి బలవంతముగా - యుద్ధము చేయననుచుండగా - చంపరుగదా! ధర్మరాజునకు తెలియును - ఎంత రాజ్యకాంక్ష

యున్నదో, ఎంతపిరికితనమున్నదో, అంతకన్న మిగిలి దురభి మానము రోషముకూడ ఉన్నవి. ఆకారణముననే అతనికి రోషము పుట్టునట్లు మాటలాడినది. అట్లు మాట్లాడిన అతడు రోషముచే బయటకువచ్చునని తెలిసియే. దుర్యోధనుడు బయటకు రాకపోయినను లాగియైనను చంపుదురనికొందరు అందురు. పాండవులంత అధర్మయుద్ధము చేయువారుకారు. కాని ధర్మరాజునకు దుర్యోధనునిమీద అభిమానముపోలేదు. ఆ అభిమానము అనేకఘట్టములలో చూపినాడు. సందర్భము వచ్చినప్పుడు చెప్పబడును. ధర్మరాజు ఆ అభిమానము చూపుటయే దుర్యోధనునికి దురభిమానముపెరిగి ఇంకను వారియందు ద్వేషము పెరుగుటకు కారణమైనది. క్షత్రియుడు యుద్ధమునకు వచ్చుటయో, రాకపోవుటయో మొదటే నిర్ణయించుకొన వలయునుగాని వచ్చినతరువాత, జయించిన జయించవలయును, లేకున్న చావవలయును. గాని క్షత్రియుడు రణరంగమునుండి పారిపోయి బ్రతుకుటకంటె మించినహీనము లేదు. దుర్యోధనుడు న్యాయమో అన్యాయమో యుద్ధమునకు దిగినాడు. మధ్యలోనైనను అశ్వత్థామ మొదలగువారు ఇకమనము జయించలేము. ఇప్పటికైనను సంధికోరంబడుము. ధర్మరాజాదుల నెట్లయినను మేముఒప్పించెదము అనిబోధించినారు. అప్పుడుకూడ దురభిమానమే అడ్డమువచ్చినది. "సంధి చేసికొన్న, మొదటనే చేసికొనవలయును గాని, ఇంతదూరముజరిగి, ప్రధానులైనవారు అందరును చచ్చినతరువాత సంధిచేసి

కొనుటయేమి? సంధికొడబడను" అని దుర్యోధనుడు గట్టిగా చెప్పినాడు. అది ఇప్పుడేమైనది ? తనదాక వచ్చునప్పటికి, ఇక చావునకుజంకియే కదా పారిపోయి నీళ్ళలోదాగినది ! అది ధర్మ రాజునకు ఇష్టములేదు. 'ఈరాజ్యమంతయు నీవే తీసికొనుము. అందరును చచ్చిరిగదా! ఈ శ్మశానమును నీవే పరిపాలించుము అని కూడ దుర్యోధనుడు నీటిలోనుండి పైకిరాకుండ సమా ధానము చెప్పినాడు. ఇంక అతనిని బయటకు పిలిచి చంపుటకు కారణమేమి?

ధర్మరాజు అభిప్రాయము ఇది - దుర్యోధనుడు సుక్ష త్రియకులమున ఉద్భవించినాడు. న్యాయమో అన్యాయమో రారాజుగా అనేక భోగములు అనుభవించినాడు. భూమి నేలినాడు. ఇప్పుడు చివరకు ఆతనికి ముఖ్యమైనవారందరును చచ్చిరి. చెట్టుకొమ్మలన్నియును కొట్టివేయగా, మొదలు మాత్రము మొండెముగా దిగబడినట్లు దిగబడినాడు. ఇప్పుడు రాజ్యము మనకిచ్చి తల్లిదండ్రుల మొగము చూడగలడా! ఇప్ప టికి వీడొక్కడైనను బ్రతికి బయటపడినాడు అని తల్లిదండ్రులు సంతోషింతురా! అదియులేదు. పోనీ, మనదగ్గరకు వచ్చి ఏదో సుఖముగా జీవితము గడుపుకొనునా అనిన, దురభిమానము చేత అట్లుచేయడు. పోనీ ఈలోకములో కీర్తి యుండునా అనిన, అందరును యుద్ధములో చచ్చువరకు యుద్ధముయుద్ధమని, తన చావు దగ్గరకు వచ్చునప్పటికి పారిపోయిన పిరికిపంద, దుర్మార్గుడు అని లోకము నిందించును. ఈచీకుతో బాధపడి, బాధపడి చని పోకతప్పదు. అటు వీరస్వర్గమూ లేదు. ఈ చేసిన పాపములకు

నరకబాధలు తప్పవు. కాబట్టి ఇవన్నియుతప్పి వీరస్వర్గమైన దొరకును అను అభిమానముతో, ఎట్లైనను రోషముపుట్టి బయటకు వచ్చునట్లుచేసి, యుద్ధముచేయించి, ఆ యుద్ధములో చంపినాడు. యథార్థమాలోచించిన ఇప్పుడు దుర్యోధనుని చంపకపోయినను ఇక ధర్మరాజునకు నష్టమేమియును లేదు. అయినను ఈచేసినది దుర్యోధనునిమీదనున్న అభిమానముతోనే. చివరకు క్షత్రియోచితమైన చావైనను చచ్చును అను భావముతో, మడుగులోనున్నవానిని పిలిచిమరీ చంపించినాడు. గదాయుద్ధములో భీముని చేతిలో మరణించిన దుర్యోధనుడు వీరస్వర్గ మలంకరించినాడు. కేవలము చివరియుద్ధము దుర్యోధనుని వీరస్వర్గముకొరకై మాత్రమే ధర్మరాజు ఏర్పాటుచేసినట్లు కన్పించును.

మధ్యలో ప్రసంగాంతరముగా వచ్చినదిది. అసలు విషయమేమనగా, పాండవులతో యుద్ధమన్నను, చావన్నను దుర్యోధనునికి భయములేకపోలేదు. జరుగదు అనుకొన్నాడు, వచ్చి మీదపడినది. భయమును మించిన దురభిమానము, దురభిమానమును మించిన భయము - రెండును హృదయములో పెనగులాడుచునేయున్నవి. దేనికి బలముగలిగినప్పుడు అది క్రియారూపములో బయటపడుచు వచ్చినది. అంతే - సంధికి ఒడబడనంతమాత్రమున భయములేదని అనుకొనరాదు. ఈభయముననే ద్రోణాచార్యులతో ఈ రెండు సేనలలోని వీరులనుచెప్పి, తమసేనకంటె పాండవసేన శక్తిమంతముగానున్నది అని చెప్పుచున్నాడు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం
బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం
బలం భీమాభిరక్షితమ్. ౧౦

ప. వి. అపర్యాప్తం, తత్, అస్మాకం, బలం,
భీష్మాభిరక్షితం, పర్యాప్తం తు, ఇదం, ఏతేషాం,
బలం, భీమాభిరక్షితం.

టీక :-

తత్ = ఆ కనపడు,
అస్మాకం = నాయొక్క,
భీష్మాభిరక్షితం = భీష్మునిచే రక్షింపబడుచున్న,
బలం = సైన్యము,
అపర్యాప్తం = (శత్రుసైన్యమును జయించుటకు) చాలదు.

ఇదం = ఈ,
ఏతేషాం = వీరియొక్క (పాండవులయొక్క),
భీమాభిరక్షితం = భీమునిచే రక్షింపబడుచున్న
బలం = సైన్యము,
పర్యాప్తం = (మనలను జయించుటకు) చాలినది.

తా. భీష్మునిచేత రక్షింపబడుచున్న ఈ మనసేన పాండవసేనను జయించ అసమర్థమైనదిగా నున్నది. భీమునిచేత రక్షింపబడుచున్న ఆ సేన మనలను జయించ సమర్థమైయున్నది.

## అ మృ త వా హి ని :—

ఈశ్లోకమునకు కొంతమంది ఒకవిధముగాను, మరి కొంతమంది ఇంకొకవిధముగాను అర్థముచెప్పుచున్నారు. అపర్యాప్తం అనగా అసమర్థమైనది అనియును, పర్యాప్తం అనగా సమర్థమైనది అనియును కొంతమంది చెప్పు చున్నారు. అపర్యాప్తం అనగా సమర్థమైనది అనియును, పర్యాప్తం అనగా అసమర్థమైనది అనియును కొంతమంది చెప్పుచున్నారు. ఈ రెంటిలో ఏది సమంజసము అని ప్రశ్న. దీనికి సమాధానము చెప్పుట చాలకష్టమే. సాధ్యమైనంత వరకు అభిమానరహితముగ పరమాత్మ యిచ్చిన బుద్ధిబలమును దుర్వినియోగము చేసికొనకుండ విచారించుటకై ప్రయ త్నింతము.

అభిమానము వదలుట చాలకష్టమైన విషయమే. అభిమానమునకును పూర్వజన్మ సంస్కారములకును బలమైన సంబంధమున్నది. భారతయుద్ధకాలమునాటికి ఎవరైనను ఉండి, దుర్యోధనునియందు అభిమానముగా, ఆయనయం దిష్టముగా నున్నచో, ఆ అభిమానము ఇప్పటికిని వదలదు. తమ భాషా ప్రావీణ్యము, శాస్త్రపరిచయము, లోకజ్ఞానము మొదలగు సామర్థ్యములన్నియును, దుర్యోధనుని సమర్థించుటకే ఉప యోగింపబడును. పాండవులతో అప్పటి సంబంధమున్న వారున్నచో, వారికిని అంతే. వారు తమ శక్తిసామర్థ్యము లన్ని యును వినియోగించి పాండవులనే సమర్థించ ప్రయత్నింతురు. కాని, సత్యము వీరివీరిసమర్థనములమీాద ఆధారపడి యుండదు. అయితే, ఎవరివాదము సత్యమును అందుకోగలు

గునో, అది సత్యమును అందుకొనుటచేత యథార్థము. అంతేగాని సమర్థించుకొనగలుగుటచేత కాదు. ఇద్దరును సందులేకుండ సమర్థించుకొనగలుగుచున్నప్పుడు, ఇక అది ఎట్లు తేలవలయునన్నచో, దుర్యోధనుని భావమును గ్రహించగలిగిన వారెవరైనను ఉన్నయెడల, వారు చెప్పినది ప్రధానము. ఆ అవకాశము మనకు చిక్కినయెడల, అప్పుడు దుర్యోధనుని వాఙ్మూలమునకు బలమే ఉండదు. ఏలయన కుటిలరాజనీతికలవాడు సాధ్యమైనంతవరకు తన మనోభావము లను వెలికి తోచనీయక మాటలాడుచుండును. భయమున్న పుడు సందర్భమునుబట్టి, భయములేనివానివలె, అతిధైర్య సంపన్నునివలె, ముఖాది అవయవములలో భావమును గుర్తించుటకు ఎంతమాత్రమును అవకాశ మీయకుండ మాటలాడగలడు. భయములేకపోయినను, అవసరమునుబట్టి అతిభయపడువానివలె గోచరించును. కనుక వాని మాటలు మనకు ప్రమాణములుకావు.

ఇక, దుర్యోధనాదుల భావములు ఉన్నవి ఉన్నట్లు కనిపెట్టగలిగినవారున్నారా? ఉన్నచో ఎవరు అని అడుగ వచ్చును. ఉన్నారు అని ధైర్యముగా చెప్పగలము. అందరికివి తెలియును. వ్యాసులు, వ్యాసానుగ్రహముచే దివ్యదృష్టి ప్రసాదింపబడిన సంజయుడు - చాలు, వీరిద్దరిని తీసికొనిన చాలును. వీరు పక్షపాతరహితులు. ఉన్నదున్నట్లు భయము లేక చెప్పగల ధీరులు. ఆ దివ్యదృష్టి తనవద్ద స్థిరముగా నిలుపుకో గల సద్గుణము లన్నియును కలవాడు సంజయుడు. సంజయునికి దివ్యదృష్టి అనుగ్రహించగల సామర్థ్యమున్న వ్యాసుని విష

యము చెప్పవలయునా ? వారిద్దరును ఎక్కడైనను దుర్యో ధనునికి ఈ సందర్భములో భయమున్నట్లు చెప్పినారా - చూడ వలసియున్నది. అది మనకు దొరకనప్పుడు ఎవరికి ఏదిఇష్టమో అట్లు వ్రాసికొనవచ్చును. అది అంత బాధాకరమైన విషయము కాదు. ప్రతివిషయమును జాగ్రత్తతో పరిశీలించుట యనునది మానవునకు ఉండవలసిన మంచి లక్షణములలో ఒకటి. అవసరము వచ్చినది కనుక విచారించుటయే కాని, దుర్యో ధనునికి భయమున్నను, లేకపోయినను గీతాప్రబోధమువలన కలుగవలసిన ఫలమునకుగాని, గీతలోని పరమార్థతత్త్వమును గ్రహించుటకుగాని అది ఎంతమాత్రమును ప్రతిబంధకము కాదు. అయినను విచారించుదము.

తన సేనయే అజేయముగా నున్నదని దుర్యోధనుని అభి ప్రాయము అనువారు ఆనందగిరి - "పదకొండు అక్షౌహిణులు గల మన బలము అపరిమితము. ప్రసిద్ధమైన మహిమగల వాడును, సూక్ష్మబుద్ధియునైన భీష్మునిచేత అన్నివిధములను రక్షింపబడుచున్నది. కాన, పర్యాప్తము - అనగా శత్రు సైన్యమును పరిభవించుటకు సమర్థమైనది. ఏడుఅక్షౌహిణుల అల్పసంఖ్యగల ఈ పాండవసేన, చపలబుద్ధియు, సామర్థ్య హీనుడునైన భీమునిచేత రక్షింపబడుచున్నది. కనుక, మనలను అవమానపరచుటను అపర్యాప్తమైనది. అసమర్థ మైనది" అని వ్రాసి యున్నారు.

వీరు శ్లోకముయొక్క అర్థము నొప్పుటలో పదములను తారుమారుచేసియున్నారు. ఎందుచేతనన పర్యాప్తం అనగా సమర్థమైనది అన్న అర్థమే వీరిదృష్టిలో సమంజసమైనది. కాని,

దుర్యోధనుని సైన్యము అసమర్థమైనది అని ఒప్పుకొనుటకు మాత్రము మనస్కరించలేదు. ఆ కారణముచే పర్యాప్తం అన్న పదమును తీసికొనివచ్చి, భీష్మునిచే రక్షింపబడుచున్న సేనకును, అపర్యాప్తం అన్న పదమును తీసికొనివచ్చి, భీమునిచే రక్షింపబడుచున్న సేనకును చేర్చినారు ఇక్కడ మన మాలోచింపవలసినది అపర్యాప్త, పర్యాప్త శబ్దములకు వీరేమి అర్థము చెప్పినారు అని మాత్రమే. పర్యాప్త శబ్దమునకు సమర్థమైనది అను అర్థమును వీరు ఒప్పుకున్నచో, ఇక ఆ పదములు దానిది దీనికి, దీనిది దానికి అంటించి అర్థము చెప్పుటకన్న సరసముగా అర్థము చెప్పుట సరసులు మెత్తురుగదా!

ఇంక ఈ పక్షమువారు దుర్యోధనుడు భయపడినట్లు భారతములో ఎక్కడ ఉన్నది అని అడుగుదురు. భీముడు చపలబుద్ధి, సామర్థ్యము లేనివాడు అని భారతములో ఎక్కడనైన వీరికి కనపడినది కాబోలు!

ఈ ఆనందగిరులే "అథవా" అని ఇంకొక అర్థము చెప్పినారు.

'తదిద మస్మాకం బలం భీష్మాధిష్ఠిత మపర్యాప్తం అపరిమితం అధృష్యమక్షోభ్యం, ఏతేషాంతు పాండవానాం బలం భీమేనాభిరక్షితం పర్యాప్తం పరిమితం సోఢుం శక్య మిత్యర్థః' ఇందునను భావము ఒకటే. దుర్యోధనుడు తనబలమును మెచ్చుకొనుచున్నట్లే వ్రాసినారు. కాని, పర్యాప్త, అపర్యాప్త శబ్దములకు అర్థములుమార్చి ఇందులోమాత్రము అపర్యాప్తం అనగా సమర్థమైనది అనియును, పర్యాప్తం అనగా అసమర్థ

మైనది అనియును వ్రాసినారు. స్వతంత్రులు - వారు ఎట్లు వ్రాసినను బాధలేదు.

మధుసూదన సరస్వతీ స్వాములవారుకూడ ఇట్లే పదములను తారుమారుచేసి అర్థమువ్రాసియున్నారు. అపర్యాప్త శబ్దమును పాండవులసైన్యమునకు తెచ్చి అంటించినారు. "తత్పాండవానాం బలం అపర్యాప్తం" అన్నారు. పాండవులబలము అసమర్థము - అని; పర్యాప్తశబ్దమునకు సమర్థము అను అర్థము వీరును ఒప్పుకొనివారు. కాని, పాండవుల సైన్యము సమర్థమైనది అనుటకు ఏలకో వీరిమనస్సు ఒప్పుకొనలేదు. కనుక, మూలములో పాండవులసైన్యమునకు చేర్చబడిఉన్న పర్యాప్త శబ్దమును వీరి వ్యాఖ్యానములో దుర్యోధనుని సైన్యమునకు చేర్చినారు. 'మహాభారతములో ఆదిపర్వతము' అన్నారు ఒకరు. తెలివిగలిగి సద్దుకుపోవువారు ఆ 'త' ఎక్కడో అక్కడ వచ్చినదిలే' అని తృప్తిపడినారట. అట్లే పర్యాప్తశబ్దమును వీరు ఎక్కడకు తీసికొనిపోయిపెట్టినను మా అర్థముమాత్రము ఒప్పుకొనినారు. మాకు చాలును. వీరికికూడ భీమునిమీద కోపమే - "భీమోఽతి దుర్బలహృదయః తేన రక్షితః" భీముడు అతిదుర్బల హృదయుడు అన్నారు. భీమునిమీద ఎందుకింత కోపమో తెలియకున్నది. శంకరానందులవారు ఇంకను తికమకలు పెట్టినారు. 'భాష్యోత్కర్షదీపిక' అనువ్యాఖ్యానములోకూడ ఇట్లే మార్చినారు. కాని పర్యాప్త శబ్దమునకు సమర్థమను అర్థమే అంగీకరించి గ్రహించినారు.

పాండవులబలమే సమర్థమైనది అని దుర్యోధనుని అభిప్రాయముగా సమర్థించినవారు - శంకరభాష్యమునకు వ్యాఖ్యానము చేసినవారిలో ఆధునికులు బెల్లంకొండ రామారావుగారు తమ భాష్యార్కప్రకాశికలో "భీష్మాభిరక్షిత మస్మాకం బల మపర్యాప్త మసమగ్రం పరబల విజయాక్షమ మిత్యర్థః; భీష్మస్య వృద్ధత్వా దితి భావః, ఇదంచ భీష్మ సామర్థ్యపరిజ్ఞాన మూలకం వాక్యం, భీష్మస్య ధర్మిష్ఠత్వేన పాండవ పక్షపాతిత్వా దితివా భావః, ఇదం దృశ్యమానం భీమాభిరక్షిత మేతేషాం పాండవానాం బలం తు పర్యాప్తం భీమస్యతరుణత్వాత్, సర్వ ధార్తరాష్ట్ర వధ దీక్షితత్వాత్, ఆబాల్యాత్సహోదరస్య దుర్యోధనస్య భీమేన బహుశో నిర్జిత త్వాచ్చ, భయ హేతు ర్భీమో దుర్యోధన స్యేతి భావః" అని అన్నారు. అనగా సారాంశము : భీష్ముని చేత రక్షింపబడుచున్న మనసైన్యము శత్రుసైన్యమును జయించుటకు అసమర్థమై యున్నది. ఎందువలన అనగా, భీష్ముడు వృద్ధుడు గనుక. ఈవాక్యము, దుర్యోధనునికి భీష్ముని సామర్థ్యము తెలియుక పలుకబడినది. భీష్ముడు ధర్మనిష్ఠుడు, పాండవపక్షపాతియు నగుటచేతనుకూడ. ఈ కనపడు పాండవ సేన, భీముని చేత రక్షింపబడుచున్నది. మనలను జయించుటకు సమర్థమై యున్నది. కారణమేమన, భీముడు భీష్మునికంటె తరుణ వయస్కుడు. అదియునుగాక, ధార్తరాష్ట్రులను నూరుమందిని సంహరించుటకు దీక్షపూనియున్నాడు. బాల్యమునుండియును కూడ అనేకసారులు సోదరులతో సహా దుర్యోధనుడు భీముని

చేత పరిభవింపబడినవాడు. ఈ కారణములచేత దుర్యోధనునికి భీమునిచూచిన అపరిమిత భయము."

శ్రీ భగవద్రామానుజులు, దుర్యోధనుడు భయపడి పలికిన పలుకుగానే నిర్ణయించినారు. "దుర్యోధనః స్వయమేవ భీమాభిరక్షితం పాండవానాం బలం ఆత్మీయంచ భీష్మాభిరక్షితం బలం ఆలోక్య ఆత్మవిజయే, తస్యబలస్య పర్యాప్తతాం, ఆత్మీయస్య బలస్య తద్విజయే, చాపర్యాప్తతాం ఆచార్యాయ నివేద్య, అంతరే విషణ్ణః అభవత్" అని వ్రాసినారు.

"దుర్యోధనుడు స్వయముగ భీమునిచేత రక్షింపబడుచున్న పాండవులసేనను, భీష్మునిచేత రక్షింపబడుచున్న తన సేనను జూచి, పాండవుల సేనను జయించుటకు సమర్థముగానున్నదనియును, తనసేన వారిని జయించుటకు చాలదనియును ఆచార్యులకు నివేదించి, మనస్సులో ఖిన్నుడాయెను" అని. శ్రీధరులుకూడ ఇదే భావమును వ్రాసియున్నారు. "తత్ తథా భూతైః వీరైః యుక్తమపి, భీష్మేణాభిరక్షిత మప్యస్మాకం బలం సైన్య మపర్యాప్తం, తైస్సహ యోద్ధుమసమర్థం భాతి, ఇదంతు ఏతేషాం పాండవానాం బలం భీమేనాభిరక్షితం పర్యాప్తం సమర్థంభాతి, భీష్మస్య ఉభయపక్షపాతిత్వాత్ అస్మద్బలం పాండవసైన్యం ప్రతి అసమర్థం, భీమస్య ఏకపక్షపాతిత్వాత్ ఏతద్బలం అస్మద్బలం ప్రతి సమర్థంభాతి." 'ఇట్టి వీరులతో కూడినదైనను భీష్మునిచేత రక్షింపబడుటచేత మన సైన్యము వారితో యుద్ధముచేయ సామర్థ్యములేనిదిగ ఉన్నది. ఈ పాండవసైన్యమన్ననో,

భీమునిచేత రక్షింపఁబడుచున్నది. కాన, మనలను జయించ సామర్థ్యము కలదిగ నున్నది. భీష్ముఁడు ఉభయపక్షపాతి అగుటవలన మనసైన్యము పాండవులసైన్యమును గెలుచుటకు చాలదు. భీముఁడు ఏకపక్షపాతియగుటవలన వారిసైన్యము మనలను జయించ చాలియున్నది' అని పై వ్యాఖ్యానము యొక్క భావము.

మహాభారతము తెనిగించిన కవిత్రయములో, తిక్కన కవీంద్రుఁడుకూడ అపర్యాప్తం అనగా అసమర్థము అనియును, పర్యాప్తం అనగా సమర్థము అనియును అర్థము వ్రాసి యున్నాఁడు. ఈ సందర్భమునే తెనిగించుచు "భీమాభిరక్షితం బగు నబ్బలంబు సాలసమర్థంబునుంబోలె మెరసె" అనియును, "ఇట్లు బెరసి భీష్మపరిపాలితంబయిన యీసైన్యంబు పెద్ద యసమర్థంబై తోఁచుచున్నయది" అనియును తెనుగుచేసి యున్నాఁడు. మహాభారతము సంతను తెనుగువచనకావ్యముగ రచించిన శ్రీమాన్ భ. తి. రాఘవాచార్యులుగారు "అట్టి పరాక్రమవంతులుగల మన సైన్యము, గంగాపుత్రుఁడగు భీష్మునిచేత అంతట రక్షింపబడుచున్నదిగా నుండినను సంపూర్ణము గాకయున్నది. కావున, పాండవులను జయింప జాలదని తోఁచుచున్నది. అల్ల పాండవుల సైన్యమైతే భీమునిచేత అంతట రక్షింపబడుచున్నదై సంపూర్ణముగా నున్నది" అని వ్రాసియున్నారు. మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ ఇత్యాద్యనేకబిరుదాంకితులును, ఇప్పుడు ప్రభుత్వ ఆస్థానకవిగా నున్నవారు, మహాభారత, రామాయణ భాగవత గ్రంథములను పద్యకావ్యములుగా

ఆంధ్రములో రచించినట్టివారు, ఇంకను శతాధిక గ్రంథములు రచించిన మ హా మ హు లు - శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి కవీంద్రులు తమ మహాభారతములో -

"...................................
భీష్మరక్షితమయి వెలసిన మన బల
గమ్ము చాలకయుండెగాదె తెలియ,
భీమరక్షితమయి వెలసిన రిపు బల
గము చాలియుండెనుగాన..." అని వ్రాసినారు.

ఇంతకును దుర్యోధనుని అభిప్రాయమేమి? "పాండవుల సైన్యమును జూచి భయపడియుండునా అన్నది. అమృతవాహిని అభిప్రాయమును నాలుగు, అయిదు, ఆరు శ్లోకముల వ్యాఖ్యానములో చూడనగును. తరువాత పండితప్రకాండుల అభిప్రాయములు కూడ దొరికినంతవరకు ఇచ్చియున్నాను. ఎంత పరిశీలించినను తన సైన్యము పాండవ సైన్యమును జయించ జాలదేమో అన్న భావముతో దుర్యోధనుడు చెప్పినాడన్నదే సమంజసముగా కనబడుచున్నది. అట్లుగాక భయములేదను కొన్నను, అట్లు చెప్పుటలో పొరపాటులేదు. ఇంకను మేలే పిరుడకు. మహారథులు, అతిరథులు అయినవారికి, మనలను శత్రువులు జయించునట్లు కనపడుచున్నదే అనునప్పటికి పౌరుషము, రోషము, శత్రువులయందు ద్వేషము పెల్లుబుకును. ఆ అభిప్రాయముతోనైనను చెప్పవచ్చునుకాని, అర్థము మాత్రము ఇదే సమంజసముగా కనపడుచున్నది. ఇట్లు చెప్పి, ఈ కారణమున మీరందరును అన్నివిధముల భీష్మునే కాపాడ వలయు ననుచున్నాడు.

శ్లో॥ అయనేషుచ సర్వేషు
యథాభాగ మవస్థితాః
భీష్మమేవాభిరక్షన్తు
భవన్త స్సర్వఏవహి. ౧౧

ప. వి. అయనేషు, చ, సర్వేషు, యథాభాగం,
అవస్థితాః, భీష్మం, ఏవ, అభిరక్షంతు, భవంతః,
సర్వే, ఏవ, హి,

టీక :-

భవంతః = మీరు,
సర్వే + ఏవ = అందరును,
అయనేషు సర్వేషుచ = సైన్యముయొక్క అన్ని మార్గములయందును,
యథాభాగం = మీకుమీకు ఏర్పడిన యుద్ధ స్థానములయందు,
అవస్థితాః = ఉన్నవారై,
భీష్మమేవ = భీష్మునే,
అభిరక్షంతు = అన్ని వైపులనుండియు రక్షింతురుగాక.
హి = ఇదే ముఖ్యము.

తా. కనుక వ్యూహముగా వన్నబడిన సైన్యముయొక్క అన్ని ప్రవేశ మార్గములయందును, మీరందరునుకలసి, జాగ్రత్తతో నిలచియుండి అన్నివిధములను భీష్మునే రక్షింపవలయును.

అమృతవాహిని :-

'ఓ ఆచార్యా ! మీరందరును జాగ్రత్తతో భీష్మునే కాపాడవలసియున్నది. ఎంతపాండవపక్షపాతియైనను, పాండ

పులను సంహారించనని దీక్షపట్టినాడుగాని, ఇతరసైన్యమును చంపనని ప్రతిజ్ఞ చేయలేదు. రోజుకు పదివేలమంది సైన్యమును చంపుదునని నాకు వాగ్దానమిచ్చియున్నాడు. పాండవులు శిఖండిని ఎదురుగ పెట్టుకొని యుద్ధముచేయుదురు. శిఖండితో యుద్ధముచేయనని ప్రతినయున్నట్లు చెప్పియున్నాడు. మొదటి రోజుననే శిఖండిని అగ్రము పెట్టుకొని మహారథికోత్తముడు అర్జునుడు వచ్చినయెడల, ఒకవీరాధివీరుని చేతులార పోగొట్టుకొన్న వార మగుదుము. కాన మీరందరును, అట్లు ఎవరును ప్రక్కనుండియు వచ్చికొట్టకుండ అన్నివైపులనుండియును కాపాడవలయును. కాన, ఈవ్యూహమునకున్న అన్ని ప్రవేశద్వారములయందును, గట్టిదిట్టమైన జెట్టీలను నిలుపవలయును. మీబుద్ధులను, చిత్తములను ఏకాగ్రములుగ చేసికొని భీష్మునే కాపాడవలయును. అజాగ్రత్తగానున్న, ఒకనక్కకూడ సింహము నైనను చంపగలుగును. అట్లే భీష్ముడు ఎంతపరాక్రమశాలియైనను, యుద్ధము చేయకున్న ఎవరైనను చంపగలరు. ఇంక పాండవులసేనలో అందరును మహారథులే. యుద్ధవిశారదులే. అయినపుడు మనము ఎంతజాగ్రత్తతో భీష్ముని కాపాడవలయును!' అనుచు, భీష్ముని అన్నివిధముల అన్నివైపుల కాపాడవలసినదిగ హెచ్చరించుచున్నాడు.

భీష్ముడు శిఖండితో యుద్ధము చేయకపోవుటకు కారణము కలదు.

శిఖండి ద్రుపదరాజు కుమారుడు. ధృష్టద్యుమ్ననికి అన్నగారు. పుట్టినపుడు స్త్రీగా పుట్టెను. అట్లు పుట్టుటకు హేతువు కలదు.

కాశీరాజు కుమార్తెలు అంబ, అంబిక, అంబాలిక. వారిలో పెద్దది అయిన అంబ సాళ్వరాజును వరించెను. తరువాత, కొన్ని దినములకు కాశీరాజు మిగిలిన ఇద్దరు కుమార్తెలకును స్వయంవరము చాటించెను. ఆ స్వయంవర వేళ చిన్నకుమార్తెలు ఇద్దరితో, అంబ కూడ అలంకరింపబడి ఆ స్వయంవర వేదికపై నుండెను. ఆ స్వయంవరములో రాజుల నందరిని గెలిచి, రాక్షస వివాహక్రమముతో భీష్ముడు తన తమ్మునికై ఆబాలికలను బలవంతముగ తీసికొని వచ్చెను. ఆ తీసికొనివచ్చుటలో, అంబ అదివరకే సాళ్వరాజును వరించుట తెలియక, ముగ్గురను తీసికొని వచ్చెను. వచ్చినతరువాత అంబ తనవృత్తాంతముచెప్పి, సాళ్వరాజునొద్దకు పంపమని ప్రార్థింపగా, భీష్ముడుకూడ గౌరవమర్యాదలతో ఆమెను సాళ్వుని వద్దకు పంపెను. కాని ఆయన భీష్మునిమీది కోపమున "పర పురుషుడు పట్టితీసికొనివెళ్ళిన నిన్నొల్ల"నని పలికెను. ఆమె మరల భీష్ముని యొద్దకువచ్చి, "నన్ను సాళ్వుడు పరిగ్రహించ లేదు. మీ తమ్మునికిచ్చి వివాహముచేయుడు" అని అడిగెను. భీష్ముడు "అది ఎట్లు కూడును ? మొదటనే తెలియకపోయిన ఏమి జరిగెడిదో! నీవు స్వయముగా సాళ్వుని వరించితినని చెప్పితివి. పరపురుషుని వరించినయామెను నాతమ్మునికి వివాహము చేయుటకు ఎట్లొప్పుకొందును? వాడైనను ఎట్లు స్వీకరించును?" అని తిరస్కరించెను. అపుడు అంబ "నాగతి నీవలననే ఇట్లు అయినది కనుక, నీవే వివాహముచేసికొమ్ము" అని అడిగినది. దానికి భీష్ముడు కినిసి "అమ్మా! ఇది నీకు తగదు పొమ్ము" అని పంపివేసెను.

అంబ భీష్మునిపై పగసాధించదలచి, అనేక యత్నములు చేసి, అన్నియును విఫలములుకాగా, చివరకు శివునిగూర్చి తపస్సు చేసి, తాను మరుజన్మమున ద్రుపదరాజుకు కుమార్తెగా పుట్టి, తరువాత పురుషుడై భీష్ముని చంపగలుగునట్లు శివునిచే వరము పొందినది.

ద్రుపదరాజు పుత్రులు లేక, శివుని ఆరాధించి, భీష్ముని మీాద చిరకాలముగా పగయుండుటచే, భీష్ముని వధింపగల పుత్రుడు కావలయునని వరమడిగెను. శివుడును అట్లే వర మిచ్చెను. ముందు పుత్రికగాపుట్టి, పురుషుడై, యుద్ధమున భీష్ముని చంపగలడని వివరించి అంతర్ధానము చెందెను.

అంబ శివునివరముపొంది, వెంటనే ఎండుకట్టెలు ప్రోగుచేసి, అగ్నిరగిల్చి, భీష్మునిమీాదికోపమున, మరు జన్మమున భీష్ముని చంపగలుగుదును అను మహావాంఛతో, చితిలో పడి ప్రాణములు విడిచెను. తరువాత ఆ చైతన్యము వచ్చి ద్రుపదునిభార్య గర్భమున ప్రవేశించెను. ద్రుపదునిభార్య సకాలమున ఒకపుత్రికను ప్రసవించెను. తల్లిదండ్రులు ఈ విషయమును బహురహస్యముగానుంచి, మగపిల్లవాడు కలిగినట్లు ప్రకటించి, మగపిల్లవానికి చేయవలసిన జాతకకర్మాది కృత్యములు నెరవేర్చి శిఖండి అని నామకరణము చేసిరి. తరువాత జాగ్రత్తగా, ప్రచ్ఛన్నముగా పెంచుచు, ఈ విషయమంతయును రహస్యముగా నుంచుటకు కారణమును ఆ బాలికకుకూడ చెప్పి జాగ్రత్తగ ఉండుమనిరి. అక్షరా భ్యాసముచేసి, మరికొంత కాలమునకు ద్రోణాచార్యులవద్ద

శస్త్రాస్త్రపరిశ్రమ చేయించుచుండిరి. కొంతకాలమునకు ఆ బాలికకు యౌవనమంకురించుచుండ, తల్లిదండ్రులు ఆమెను జూచి ఏమిచేయుటకు తోచక, శివుని వరముతలచి, ధైర్యము వహించి, నిజము బయటపడకమునుపే, వివాహము చేసిన యెడల, తరువాత నేమగునో, శివుని ఇచ్ఛ అని, దశార్ణవ దేశాధీశుడగు హేమవర్మ యను రాజుయొక్క కుమార్తెనిచ్చి వివాహముచేసిరి. తరువాత కొంతకాలమునకు ఆ కోడలు మంచి చతురతగలది యగుటచే, తనభర్త పురుషుడు కాడనియు, ఇందులో ఏదో మోసమున్నదనియును గ్రహించి తనవ్రాతను తానే నిందించుకొనుచు, గుట్టుగనేయున్నది. కాని, కొంతకాలమునకు ఎట్లో ఆమెదాసికి తెలిసి, హేమవర్మకు చెప్పగా, కోపించి, ద్రుపదరాజు ఇట్లు మోసముచేయునా అని యుద్ధమునకు బయలుదేరెను. ఒకరోజు మహాయుద్ధము జరిగినది. సాయంకాలము యోధులందరును విశ్రాంతిగా నిద్రించుచుండిరి. ఎవరికిని తెలియకుండ శిఖండి నెమ్మదిగా అరణ్యమునకు పారిపోయి, ఒకచోట రహస్యముగా ప్రాయోపవేశము చేసి మరణమునకు సిద్ధపడియుండెను. అక్కడనే నివసించుచున్న స్థూలకర్ణుడను ఒక యక్షుడు ఇది తెలిసి, వచ్చి, "ఏమి ఇట్లు నడిచావు చావనేల? నాకు చెప్పిన నేను చేయగల సాహాయ్యమున్న చేసెదను" అనెను. దానికి ఆమె 'ఈస్థితిలో నాకెవ్వరును సాహాయ్యము చేయలేరు. ఒక్క శివుడే చేసిన చేయవలెను' అని తనస్థితినంతను వివరించెను. అప్పుడు అతడు "అబలా! ఇంతమాత్రమునకే ఇంత భయపడవలయునా? నీ స్త్రీత్వము

నాకిచ్చి నా పుంస్త్వమును గ్రహించి, నీవారి కందరకును నీపుంస్త్వము ప్రకటించుకొని, ఈ విపత్తునుండి బయటపడి, పదిరోజులలో మరల నాపుంస్త్వము నాకిచ్చి, నీస్త్రీత్వమును నీవు గ్రహించుము. సత్యము తప్పకుము" అని, ఆమె స్త్రీత్వమును తాను గ్రహించి, తన పుంస్త్వమును ఆమెకిచ్చి పంపివేసెను. ఆమె తెల్లవారులోపల ఇంటికిపోయి తల్లితండ్రుల కీ సమాచారమంతయును చెప్పగా, వారు చాల సంతోషించి. హేమవర్మను పిలిపించి, మమ్ముల నడుగకుండ తొందరపడ వచ్చినా అని మందలించి, శిఖండి పుంస్త్వమును పరీక్ష చేసికొనుటకు అనుమతించిరి. దానితో ఆరాజు సిగ్గుపడి, ఎవరో చెప్పినమాటలు విని మోసపోయితిమి అని, ద్రుపద రాజుచే గౌరవ మర్యాదల బడసి తన త్రోవను తాను పోయెను.

స్థూలకర్ణుని పుంస్త్వమును తీసికొని శిఖండి అటు వెళ్ళగనే, మరునాడు, స్థూలకర్ణుని దొరయైన కుబేరుడు సపరి వారముగా అక్కడకు వచ్చెను. అతడు స్త్రీరూపముతో కుబేరునకు కనపడుటకు సిగ్గుపడి, ఎదుటపడక దాగియుండెను. దానికి కుబేరుడు గర్వముచే ఇతడు తనను లక్ష్యముచేయక ఎదురురాలేదు అనుకొని కుపితుడై, తన సేవకులను పంపెను. ఆ సేవకులు యథార్థవిషయమును తెలిసికొనివచ్చి, "స్వామీ! అతడు శిఖండి స్త్రీత్వమును గ్రహించి తన పుంస్త్వమును శిఖండికి ఇచ్చియున్నాడు. మరల పదిరోజులలో అతడు వచ్చి ఇతని పుంస్త్వమును ఇచ్చివేయునట. ఇప్పుడు స్త్రీరూపముతో మీకు ఎదురుబడ సిగ్గుపడుచున్నాడు. కాని గర్వముచే కాదు" అని విన్నవించిరి. అదివిని, భయములేదు రమ్మని పిలిపించి,

"సరే ఈ స్త్రీత్వముతోనే ఉండిపొమ్ము" అని శపించెను. దానికి అతడు పాదములపైబడి ప్రార్థింపగా, "శిఖండి బ్రతికియున్నంత కాలము నీపురుషత్వము శిఖండికే ఉండి, తరువాత మరల నీకు సంక్రమించును" అని అనుగ్రహించి పోయెను. తరువాత తన మాట ప్రకారము శిఖండి పదిరోజులకు రాగా, స్థూలకర్ణుడు తన సమాచారమంతయును చెప్పి, "నీలోప మేమియును లేదు. నాకర్మ ఇట్లున్నది, పోయిరమ్ము" అని పంపివేసెను. శిఖండి యును అతి సంతోషమునవచ్చి, తల్లిదండ్రులతో ఈవార్త చెప్పగా, వారందరును శివుని అనుగ్రహమునకు మెచ్చుకొని ఆనందించిరి. ఇది శిఖండియొక్క వృత్తాంతము.

భీష్ముడు స్త్రీలతోను, మొదట స్త్రీగానుండి, తరువాత పురుషుడైనవానితోను, పురుషుడైయుండి స్త్రీ లక్షణములు కలవానితోను యుద్ధము చేయనని తనకు ప్రతిజ్ఞయున్నట్లు దుర్యోధనునితో మొదటనే చెప్పియున్నాడు. కనుక దుర్యోధనునకు భయము. భీష్ముడు పాండవులలో ఎవరిని చంపనని ప్రతిజ్ఞ చేసియున్నాడు. ఆ ప్రతిజ్ఞ లేకపోయినను పాండవులలో ఏఒక్కరును జంకువారుకారు. తాతగారు, అల్లారుముద్దుగా పెంచి విద్యాబుద్ధులు చెప్పించినారు అను గౌరవ మర్యాదలుతప్ప జయించలేము అని భయపడువారు పాండవులలో ఒక్కరునులేరు. సామాన్యముగ క్షత్రియ రక్తము ప్రవహించువాడే, జయించిన జయించును, లేకపోయిన వీర మరణము చెంది వీరస్వర్గము పొందును. అంతేకాని, యుద్ధము నకు భయపడడు. అట్టిది పాండవులా జంకునది! ఇక చంపనని

కూడ ప్రతిజ్ఞయున్నప్పుడు చంపకుండ ఊరకే బాణములు పెట్టి గ్రుచ్చుచు పోదువా, పోవా అనిన పోవువారా పాండవులు! కనుక భయము దుర్యోధనునికి. పైన శిఖండి యున్నాడు. కాబట్టి మీరందరను జాగ్రత్తతో శిఖండి భీష్మునియొద్దకు రాకుండ కాపాడకపోయినచో, మొదటిదినముననే ఆ శిఖండిని అడ్డుపెట్టుకొని పార్థుడు వచ్చిన, ఇక మనకును భీష్మునికిని నాటితోనే ఋణము తీరినట్లు. ఎన్ని దినములు బ్రతికిన అన్ని దినములైనను నాకిచ్చిన వాగ్దానము ప్రకారము పదివేలమంది యోధులుచొప్పున సహరించగలడు. ఈ వ్యూహముయొక్క ఏద్వారమునుండి శిఖండి ప్రవేశించి, భీష్మునిచేరు వీలున్నదో పరిశీలించుచు సావధానచిత్తులై కాచికొని యుండవలయును” అని దుర్యోధనుడు పలికెను.

అవతారిక :—

ద్రోణాచార్యులతో దుర్యోధనుడు ఇట్లు పలుకుట విని, భీష్ముడు ఏమిచేసినదియు సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ :

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం
కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః
శంఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨

ప. వి. తస్య, సంజనయన్, హర్షం, కురువృద్ధః, పితామహః, సింహనాదం, వినద్య, ఉచ్చైః, శంఖం, దధ్మౌ, ప్రతాపవాన్.

టీక :-

కురువృద్ధః = కౌరవులలో పెద్దయును,
ప్రతాపవాన్ = ప్రతాపవంతుడును,
పితామహః = ధార్తరాష్ట్రులకును, పాండవులకును తాతయు నైన భీష్ముడు,
తస్య = ఆ దుర్యోధనునకు,
హర్షః = సంతోషమును,
సంజనయన్ = కలిగించుచున్నవాడై,
ఉచ్చైః = గట్టిగా,
సింహనాదం = సింహనాదమును,
వినద్య = ధ్వనింపజేసి,
శంఖం = శంఖమును,
దధ్మౌ = పూరించెను.

తా. కౌరవవృద్ధుడై నట్టియును, గొప్పప్రతాపముగలవాడు నైన భీష్మపితామహుడు, దుర్యోధనుని హృదయములో కలిగిన భయమును పోగొట్టి ఆనందోత్సాహముల కలుగజేయుటకై, సింహనాదముచేసి గొప్పధ్వనితో శంఖమును పూరించెను.

అమృతవాహిని :-

భీష్ముడు అప్పటికి ఉన్న కౌరవులలో వృద్ధుడు. కాని, ఒక్క బాహ్లీకుడు మాత్రము భీష్ముని కన్న పెద్ద. పాండవులును, కౌరవులునుకూడ భీష్మునికి ఒక్కటే. తాతగారను

పూజ్యభావము ఇరుకక్ష్యలవారికిని కలదు. కాబట్టి కురువృద్ధుడు పితామహుడు అనుచున్నాడు సంజయుడు. వయస్సులో వృద్ధుడైనను, శౌర్యబలపరాక్రమములలో మహావీరులనిపించుకొనిన యువకులకంటె మించినవాడు. ఈ భావముతోనే 'ప్రతాపవాన్' అనుట. కట్టి భీష్ముడు, దుర్యోధనుడు ద్రోణాచార్యుల యొద్ద నిలబడి పాండవసేనను చూచి ఆశ్చర్యభయములు పొందుటచూచి, అతనికి ఉత్సాహము కలిగించుటకై, "నీవేమియు భయపడకుము; నా శక్తిసామర్థ్యములుచూడుము" అనుచున్నట్లు సింహనాదముచేసి, పెద్దగ శంఖమును పూరించెను.

శ్లో॥ తత శ్శంఖాశ్చ భేర్యశ్చ
పణ వానక గోముఖాః
సహసై వాభ్యహన్యంత
సశబ్ద స్తుములో౽భవత్. ౧౩

ప. వి. తతః, శంఖాః, చ, భేర్యః, చ, పణవానక గోముఖాః, సహసా, ఏవ, అభ్యహన్యంత, సః, శబ్దః, తుములః, అభవత్.

టీక :-

తతః = పిమ్మట,
శంఖాశ్చ = శంఖములును,
భేర్యశ్చ = దుందుభులును,
పణవానకగోముఖాః -
పణవ = తప్పెటలును,
ఆనక = మృదంగములును,
గోముఖాః = బూరలును,

సహసైవ = ఒక్కసారిగానే,
అభ్యహన్యంత = మ్రోయింపబడినవి.
సశబ్దః = ఆధ్వని,
తుములః = భయంకరమైనది.
అభవత్ = ఆయెను.

తా. భీష్ముడు ఈప్రకారము శంఖమును పూరించగనే, ఆకౌరవ సైన్యములో అనేకములైన శంఖములు, నగారాలు, డోళ్ళు, తప్పెటలు, మొదలగు రణవాద్యములు ఒక్కసారిగ మ్రోయింపబడినవి. ఆశబ్దము ఆకాశమంతయును మార్మ్రోగునట్లు చాలభయంకరమైనదిగ నుండెను.

అమృత వాహిని :—

భీష్మపితామహుడు ఉత్సాహముతో శంఖమును పూరించి సింహనాదము చేయునప్పటికి, అదియే యుద్ధప్రారంభమునకు సంజ్ఞగ తెలిసికొని, అన్నివైపులను ఉత్సాహము, వీరత్వము వ్యాపించి పొంగిపొరలగా, కౌరవ సైన్యములోని సకలసేనాధిపతులును తమతమ శంఖములను పూరంచిరి. అనేకవిధములైన రణవాద్యములు ఒక్కపెట్టున మ్రోయింపబడు నప్పటికి ఆ గొప్పమ్రోతతో ఆకాశము, భూమియును భయంకరముగా మారుమ్రోగెను.

అవతారిక :—

మొదట ధృతరాష్ట్రుడు నావారు, పాండవులు ఏమి చేసిరని అడిగిన ప్రశ్నకు, ఇంతవరకు సంజయుడు ధృతరాష్ట్రుని పక్షమువారు ఏమిచేసినది చెప్పినాడు. ఇప్పుడు పాండవులు ఏమిచేసినదియు అయిదు శ్లోకములలో చెప్పు చున్నాడు.

శ్లో॥ తతశ్శ్వేతైర్హయైర్యుక్తే
మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ
దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. ౧౪

ప. వి. తతః, శ్వేతైః, హయైః, యుక్తే, మహతి, స్యందనే, స్థితౌ, మాధవః, పాండవః, చ, ఏవ, దివ్యౌ, శంఖౌ, ప్రదధ్మతుః.

టీక :-

తతః = తదనంతరము,
శ్వేతైః = తెల్లని,
హయైః = గుఱ్ఱములతో,
యుక్తే = కూడుకొన్నట్టియును,
మహతి = గొప్పదియును అగు,
స్యందనే = రథమునందు,
స్థితౌ = కూర్చొనియున్న,
మాధవః = శ్రీకృష్ణుడును,
పాండవశ్చైవః = అర్జునుడును,
దివ్యౌ = దివ్యములైన,
శంఖౌ = శంఖములను,
ప్రదధ్మతుః = పూరించిరి.

తా. తరువాత తెల్లని గుఱ్ఱములను అమర్చిన గొప్పదగు రథముమీద అధివసించియున్న శ్రీకృష్ణపరమాత్మయును, అర్జునుడును కూడ, దివ్యములైన తమతమ శంఖములను పూరించిరి.

అమృతవాహిని :—

శ్రీకృష్ణార్జునులు అధివసించిన రథము చాలగొప్పది. దివ్యమైనది. ఖాండవవన దహనసమయమున ప్రసన్నచిత్తుడైన అగ్నిదేవుడు అర్జునునికి సమర్పించుకొనినాడు. ఈ రథము బంగారముతోడను, మణులతోడను మహాప్రకాశమానముగ అలంకరించబడినది. వాయువేగమనోవేగములుగల దివ్యహయములు కూర్చబడినది. ఈ రథముయొక్క గమనమునకు ఎక్కడను అడ్డులేదు. భూలోకములోగాని, స్వర్గ పాతాళాదిలోకములలోగాని - ఎక్కడికైనను అప్రతిహతముగ పోగలదు. చెట్లు, పర్వతములు, నదులు, సముద్రములు - ఏవియును దాని గమనమును అడ్డలేవు. దివ్యపతాకము రెపరెపలాడుచుండగా, ఆ పతాకముపై రామభక్తాగ్రేసరుడు ఆంజనేయుడు విజయముచేసి యున్నాడు. ఆరథమునకు దివ్యములైన నాలుగు తెల్లని గుఱ్ఱములు పూన్చబడియున్నవి. ఆ దివ్యరథములో అధివసించియున్న కృష్ణార్జును లిరువురును తమ తమ శంఖములు పూరించినారు. ఆశంఖములు దివ్యములైనవి. భీష్ముడు మొదలగువారు యుద్ధారంభసూచకముగ శంఖములు పూరించినమీదట, ఆ సింహనాదములకు సమాధానముగ, తాముకూడ యుద్ధమునకు సిద్ధముగనే ఉన్నామనుచు వీరును ఈ దివ్యశంఖములను పూరించిరి.

అవతారిక :—

పాండవుల పక్షమున కృష్ణార్జునులు శంఖములు పూరిం

చుట, తరువాత ఇతరులు వారివారి శంఖములను పూరించుటయు వివరముగ చెప్పుచున్నాడు సంజయుడు.

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో
దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం
భీమకర్మా వృకోదరః. ౧౫

ప. వి. పాంచజన్యం, హృషీకేశః, దేవదత్తం, ధనంజయః, పౌండ్రం, దధ్మౌ, మహాశంఖం, భీమకర్మా, వృకోదరః.

టీక :-

హృషీకేశః = శ్రీకృష్ణుడు,
పాంచజన్యం = పాంచజన్యమను శంఖమును,
ధనంజయః = అర్జునుడు,
దేవదత్తం = దేవదత్తమను శంఖమును,
భీమకర్మా = భయంకరకృత్యములను చేయునట్టి,
వృకోదరః = భీముడు,
పౌండ్రం = పౌండ్రమను పేరుగల,
మహాశంఖం = గొప్పశంఖమును,
దధ్మౌ = పూరించిరి.

తా. పాంచజన్యమను శంఖమును కృష్ణుడును, దేవదత్తమను శంఖమును అర్జునుడును, పౌండ్రమను పేరుగల మహాశంఖమును భయంకర కర్మలుచేయు భీముడును పూరించిరి.

అ మృ త వా హి ని :—

హృషీకేశుడు పాంచజన్యమును పూరించెను. శ్రీకృష్ణ పరమాత్మకు హృషీకేశుడు అనికూడ పేరు. హృషీకాణాం - ఇంద్రియాణాం ఈశః = హృషీకేశః. హృషీకములు అనగా ఇంద్రియములు. వానికి ఈశుడు కనుక హృషీకేశుడు. ఈయన శంఖముపేరు పాంచజన్యము. పంచజను డనెడి శంఖరూప రాక్షసుడు. వానిని చంపి శంఖముగ ఉపయోగించుకొనినాడు పరమాత్మ. అందువలన ఆ శంఖమునకు పాంచజన్యము అని పేరువచ్చినది. దేవదత్తమను శంఖమును అర్జునుడు పూరించెను. ధర్మరాజు రాజసూయ యజ్ఞము చేసి నప్పుడు అర్జునుడు దిగ్విజయముచేసి, అనేకమంది రాజులను జయించి, అపారమైన ధనము తీసికొనివచ్చుటచే ధనంజయుడు అను పేరు కలిగినది. అర్జునుని శంఖముపేరు దేవదత్తము. దేవతల పక్షమున నివాతకవచాది దైత్యులతో యుద్ధముచేయునప్పుడు, ఇంద్రునిచేత ఈయబడినది. కనుక దేవదత్తమని పేరు వచ్చినది. ఈశంఖమును పూరించిన, శత్రువుల హృదయములు బ్రద్దలగును. పౌండ్రమను మహాశంఖమును భీముడు పూరించెను. భీమునికి భీమకర్ముడనియు, వృకోదరుడనియు పేర్లు కలవు. భీమునిచేత చేయబడు ప్రతికర్మయును శత్రుభయంకరముగానుండును. అందువలన భీమకర్ముడని పేరు. భీముడు అపరిమితముగ ఆహారము భుజించువాడు. అంత భోజనము జీర్ణింపజేసికొనెడి జఠరాగ్ని ఉండుటచే వృకోదరుడు అని పేరుకలిగినది. అతని శంఖము పౌండ్రము. అది చాల పెద్దది. అది పూరించిన చాల గొప్ప శబ్దము వచ్చును. ఆశబ్దమును

వినునప్పటికే శత్రుసైన్యములోని వీరుల హృదయములు బ్రద్దలగును. కాబట్టి ఆశంఖమునకు మహాశంఖమని విశేషణము కూర్చబడినది.

శ్లో॥ అనంతవిజయం రాజా
కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవశ్చ
సుఘోష మణిపుష్పకౌ. ౧౬

ప. వి. అనంతవిజయం, రాజా, కుంతీపుత్రః, యుధిష్ఠిరః, నకులః, సహదేవః, చ, సుఘోషమణిపుష్పకౌ.

టీక :-

కుంతీపుత్రః = కుంతీదేవి కుమారుడును,
రాజా = ప్రభువు అయినవాడును అగు,
యుధిష్ఠిరః = ధర్మరాజు,
అనంతవిజయం = అనంతవిజయమను శంఖమును,
నకులః = నకులుడును,
సహదేవశ్చ = సహదేవుడును,
సుఘోషమణిపుష్పకౌ = సుఘోషము,
మణిపుష్పకము అనుశంఖములను,
(దధ్మౌ = పూరించిరి)

తా. కుంతీపుత్రుడైన ధర్మరాజు అనంతవిజయమను శంఖమును పూరించెను. నకులుడును, సహదేవుడును, తమ తమ సుఘోషము, మణిపుష్పకము అను శంఖములను పూరించిరి,

## అమృతవాహిని :—

కుంతీపుత్రుడైన యుధిష్ఠిరమహారాజు - ధర్మరాజు - అనంతవిజయమను శంఖమును పూరించెను. ఇక్కడ ధర్మరాజు కుంతీపుత్రుడనియు, యుధిష్ఠిరుడనియు, రాజనియు విశేషణములతో చెప్పబడినాడు. యుధిష్ఠిరుడనగా యుద్ధమునందు స్థిరముగా నుండువాడు అని అర్థము. ఈ శబ్దప్రయోగముచే సంజయుడు, యుద్ధములో ధర్మరాజును ఎవరును జయించలేరు. ఆయనకే విజయమని సూచించుచున్నాడు. 'రాజా' అని ప్రయోగించి, ఇదివరకు రాజ్యము చేసియుండుట చేతనేకాక, ఇప్పుడుకూడ యుద్ధములో ఆయనకే జయము సంప్రాప్తించి, ఆయనయే రాజు కాగలడనియును, సంజయుడు ధృతరాష్ట్రునికి సూచించుచున్నాడు. నకులుడును, సహదేవుడును కూడ సుఘోషము, మణిపుష్పకము అను తమ తమ శంఖములను పూరించిరి.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసః
శిఖండీచ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ
సాత్యకి శ్చాపరాజితః. ౧౭

ప. వి. కాశ్యః, చ, పరమేష్వాసః, శిఖండీ, చ, మహారథః, ధృష్టద్యుమ్నః, విరాటః, చ, సాత్యకిః, చ, అపరాజితః.

టీక :-

పరమేష్వాసః = గొప్పవిల్లుగల,
కాశ్యశ్చ = కాశీదేశపురాజును,

మహారథః = మహారథికుడైన,
శిఖండీచ = శిఖండియును,
ధృష్టద్యుమ్నశ్చ = ధృష్టద్యుమ్నుడును,
విరాటశ్చ = విరటుడును,
అపరాజితః = అపజయము లేనివాడగు,
సాత్యకిశ్చ = సాత్యకియును,

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ
సర్వశః పృథివీపతే!
సౌభద్రశ్చ మహాబాహుః
శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్. ౧౮

ప. వి. ద్రుపదః ద్రౌపదేయాః, చ, సర్వశః, పృథివీపతే, సౌభద్రః, చ, మహాబాహుః, శంఖాన్, దధ్ముః, పృథక్, పృథక్.

టీక :-

పృథివీపతే = ఓ రాజా!
ద్రుపదః = ద్రుపదరాజును,
ద్రౌపదేయాశ్చ = ఉపపాండవులును,
మహాబాహుః = బాహుబలసంపన్నుడైన,
సౌభద్రశ్చ = అభిమన్యుడును,
సర్వశః = అందరును,
పృథక్ పృథక్ = వేరువేరుగా,

శంఖాన్ = శంఖములను,
దధ్ముః = పూరించిరి.

17, 18, తా. గొప్పధనుస్సుగల కాశీరాజును, మహారథుడైన శిఖండియును, ధృష్టద్యుమ్నుడును, విరాటుడును, పరాజయములేని సాత్యకియును, ద్రుపదుడును, ద్రౌపదేయులును (ద్రౌపది కుమారులైదుగురు), మహాబాహుబల సంపన్నుడు అభిమన్యుడును - అందరును తమ తమ శంఖములను వేరువేరుగ పూరించిరి.

## అ మృ త వా హి ని :—

కాశీరాజు, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదియొక్క అయిదుగురు కుమారులు, అభిమన్యుడు-వీరినిగురించి నాలుగు, అయిదు, ఆరు శ్లోకముల యొక్క వ్యాఖ్యానములోను, శిఖండినిగురించి పదునొకండవ శ్లోక వ్యాఖ్యానములోను పాఠకులకు పరిచయము చేయుట జరిగినది. సర్వశః- అందరును అనుటలో ఇక్కడ పేర్లు చెప్పబడినవారుగాక, పాండవసేనలోని అతిరథులు, మహారథులు, సర్వులును, తమతమ శంఖములను పూరించిరి అని భావము. సంజయుడు, కౌరవపక్షములోని వీరులు శంఖములు పూరించినట్లు చెప్పియున్నాడు. పాండవులపక్షములోని వీరులుకూడ శంఖములు పూరించినట్లు చెప్పియున్నాడు. కాని, కృష్ణుడు, పాండవులు అయిదుగురు-మొత్తము ఈ ఆరుగురి శంఖముల పేర్లుమాత్రమే ఉగ్గడించియున్నాడు. పాండవుల పక్షములోని ఇంకెవరి శంఖముల పేర్లను చెప్పలేదు. కౌరవపక్షములోని ఏ ఒక్క మహావీరుని శంఖముపేరును చెప్పలేదు. ఏమికారణము? మిగిలిన అన్నిశంఖములకంటె ఈ ఆరుగురి శంఖములను

విశిష్టతకలదు. ఈ శంఖములు పూరించి, ధ్వనిచేసినయెడల ఆ ధ్వని చాలపెద్దదిగ ఉండుట మాత్రమేకాదు, శత్రువుల హృదయములు బ్రద్దలగును. భీముడు సింహనాదము చేసి నప్పుడెల్లను, శత్రుసైన్యములోని పదివేలమంది వీరులు గుండెలుపగిలి చనిపోయిరని మహాభారతములో నున్నది.

శ్లో॥ సఘోషో ధార్తరాష్ట్రాణాం
హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ
తుములోవ్యనునాదయన్ —౧౦

ప. వి. సః, ఘోషః, ధార్తరాష్ట్రాణాం, హృదయాని, వ్యదారయత్, నభః, చ, పృథివీం, చ, ఏవ, తుములః, వ్యనునాదయన్.

టీక :-

తుములః = భయంకరమైన,
స ఘోషః = ఆశబ్దము,
నభశ్చ = ఆకాశమును,
పృథివీంచైవ = భూమినీ,
వ్యనునాదయన్ = మారుమ్రోగించుచు,
ధార్తరాష్ట్రాణాం = దుర్యోధనాదులయొక్క,
హృదయాని = గుండెలను,
వ్యదారయత్ = బ్రద్దలుచేసెను.

తా. ఆధ్వని ఆకాశమును, భూమినికూడ వ్యాపించి మారుమ్రోగించుచు దుర్యోధనాదుల హృదయములను బ్రద్దలుచేసెను.

అమృతవాహిని :—

సంజయుడు చెప్పుచున్నాడు- ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇంకను నీపుత్రులు జయింతురని ఆశతో ఉన్నావేమో! శ్రీకృష్ణార్జునులు మహానుభావులు, నరనారాయణులు ఆదివ్యరథముమీద అధిష్ఠించి ఆశంఖములు పూరించిన, ఆ భీముడు, ఆ ధర్మరాజు, ఆ నకులసహదేవులు వారివారి శంఖములు పూరించిన శత్రువుల గుండెలు బ్రద్దలుకావా! వారి శంఖములు సామాన్యములా! మిగిలిన మానవులకంటె, వారెట్లు విలక్షణమైనవారో, దేవతాంశ సంభూతులో, వారిశంఖములు కూడ అట్లే. నీ కుమారులు ఎప్పుడును శంఖధ్వనులు వినలేదా! వారు మాత్రము పిరికివారా! ఇదివరకు యుద్ధములు ఎరుగరా! అయిననేమి- కృష్ణుడు, పాండవులు సామాన్యులుకారు. వారి శంఖములు సామాన్యములుకావు. వారు పూరించుట సామాన్యముకాదు. ఆ వెడలిన ధ్వని సామాన్యముకాదు. ఏమో తెలియదు- ఆ శంఖములధ్వని చెవుల బడునప్పటికి, నీకుమారులు యొక్కయు వారి పక్షమువారి యొక్కయు హృదయములు విదీర్ణములై పోయినవి. గుఱ్ఱములు, ఏనుగులు మలమూత్రములు విడిచినవి. ఆ శంఖనాదములు ఒక్కసారిగా కలిసి ధ్వనించునప్పటికి, ఆధ్వని భూమిఅంతయు వ్యాపించినది. పర్వతములు, నదులు, సముద్రములతో కూడుకొన్న భూమియంతయు దద్దరిల్లిపోయినది. ఆకాశమంతయును, పర్వతగుహలును మారుమ్రోగిపోయినవి. అదివరకే పాండవుల సేనను చూచునప్పటికే భయముతో కొందలమందుచున్న నీవారి హృదయములు ఇప్పుడు ఎఱ్ఱగా కాలియున్న పదనైన శస్త్రములతో చీల్చ

బడుచున్నట్లు బాధపొందినవి. అయితే నీ కుమారుడు దుర్యోధనుడు ఎన్నోమార్లు, పాండవులను సులభముగా జయించగలము అని నీవద్ద పలికియున్నాడు - నిజమే ! ఇంతవరకు రాజ్యముకొరకై ధర్మరాజు హింసారూపమైన యుద్ధమునకు దిగడు అను ఆశ బాగుగా ఉన్నది నీకుమారునికి. కాబట్టి యుద్ధము జరుగదన్న భావమే ఉండుటచే, ఎన్నైనను ప్రజ్ఞలు పలికిఉండవచ్చును. మీవారి సైన్యములు చూచువరకును ఉత్తరగోగ్రహణములో ఉత్తరుడు పలుకలేదా! ఆ ఉత్తరకుమారప్రజ్ఞలే మీవాడును పలికినాడు. ఆ ఉత్తరునకు మీసైన్యములను చూచునప్పటికి భయముతో వణకు పుట్టినది. అయితే నీ కుమారుడు దురభిమానము కలవాడగుటచే ఎంత భయము పుట్టినను, ఉత్తరునివలె పారిపోయిరాలేదు. ఇది ఉత్తరునికన్న వీనికున్న సుగుణము. అభిమానముకొలది పట్టుదలకు చచ్చుటకైనను సిద్ధపడుచున్నాడు. కాని హృదయములో ఆవేదన, భయము పెనగొని వేధించుట మొదలుపెట్టినవి.

అవతారిక :_

తరువాత ఏమి జరిగినదో వినగోరు ధృతరాష్ట్రునికి సంజయుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా
ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే
ధనురుద్యమ్య పాండవః. _20

ప. వి. అథ, వ్యవస్థితాన్, దృష్ట్వా, ధార్తరాష్ట్రాన్, కపిధ్వజః, ప్రవృత్తే. శస్త్రసంపాతే, ధనుః, ఉద్యమ్య, పాండవః.

టీక :-

అథ = అనంతరము,
శస్త్రసంపాతే = ఆయుధప్రయోగము,
ప్రవృత్తే(సతి) = ఆరంభము కాబోవుచుండగా,
కపిధ్వజః = కపిధ్వజుడైన,
పాండవః = అర్జునుడు,
వ్యవస్థితాన్ = యుద్ధసన్నద్ధులై యున్న,
ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను,
దృష్ట్వా = చూచి,
ధనుః = ధనుస్సును,
ఉద్యమ్య = పైకెత్తి,

శ్లో॥ హృషీకేశం తదా వాక్య
మిద మాహ మహీపతే !

ప. వి. హృషీకేశం, తదా, వాక్యం, ఇదం, ఆహ, మహీపతే.

టీక :-

మహీపతే! = ఓరాజా!
తదా = ఆసమయమున,
హృషీకేశం = శ్రీకృష్ణునిగూర్చి,
ఇదం వాక్యం = ఈవాక్యమును,
ఆహ = పలికెను,

అర్జున ఉవాచ :—

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే
రథం స్థాపయ మేఽచ్యుత ! —౨౧

శ్లో॥ యావ దేతా న్నిరీక్షేఽహం
యోద్ధుకామా నవస్థితాన్
కై ర్మయా సహ యోద్ధవ్య
మస్మిన్ రణసముద్యమే. —౨౨

ప. వి. సేనయోః, ఉభయోః, మధ్యే, రథం, స్థాపయ, మే, అచ్యుత, యావత్, ఏతాన్, నిరీక్షే, అహం, యోద్ధుకామాన్, అవస్థితాన్, కైః, మయా, సహ, యోద్ధవ్యం, అస్మిన్, రణసముద్యమే॥

టీక :—

హేఅచ్యుత = ఓకృష్ణా!
అస్మిన్ = ఈ,
రణసముద్యమే = యుద్ధసందర్భమునందు,
మయా = నాచేత,
కైస్సహ = ఎవరితో,
యోద్ధవ్యం = యుద్ధముచేయవలసియున్నదో,
అవస్థితాన్ = ఎదుట నిలచియున్న,
యోద్ధుకామాన్ = యుద్ధముచేయకోరికగలవారలైన,
ఏతాన్ = వీరిని,
యావత్ = ఎంతలో,
అహం = నేను,

నిరీక్షే = చూతునో, (తావత్ = అంతవరకు)
ఉభయోః = రెండగు,
సేనయోః = సేనలయొక్క,
మధ్యే = నడుము,
మే = నాయొక్క,
రథం = రథమును,
స్థాపయ = నిలుపుము.

తా॥ 20,2122: ఓ ధృతరాష్ట్ర మహారాజా! తరువాత కపిధ్వజుడైన అర్జునుడు, నీపుత్రులైన దుర్యోధనాదులు యుద్ధమునకు సిద్ధముగానుండుట జూచి, ఒకరిమీదఒకరు శస్త్రప్రయోగము చేసికొను సమయము రాగా విల్లెక్కు పెట్టి కృష్ణపరమాత్మతో ఇట్లు చెప్పెను.

యుద్ధము చేయుటకు సంసిద్ధులైన వీరందరిని నేను చూచి చః యుద్ధమునందు నేనెవరితో యుద్ధము చేయవలయునో నిర్ణయించు కొందును. అందుకు వీలుగా, రథమును రెండుసేనలమధ్య నిలుపుము.

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం
యఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే
ర్యుద్ధే ప్రియచికీర్షవః —23

ప. వి. యోత్స్యమానాన్, అవేక్షే, అహం, యే,ఏతే,అత్ర, సమాగతాః, ధార్తరాష్ట్రస్య, దుర్బుద్ధేః, యుద్ధే, ప్రియచికీర్షవః.

టీక :-

దుర్బుద్ధేః = దుష్టబుద్ధి అయిన,
ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునికి,
ప్రియ చికీర్షవః = ఇష్టముచేయదలచినవారై,

యుద్ధే = యుద్ధమునందు,
యే ఏతే = ఎవరు (కౌరవసేనలోని వీరులు),
అత్ర = ఇచ్చట,
సమాగతః = వచ్చియున్నారో,
యోత్స్యమానాన్ = యుద్ధసన్నద్ధులైన అట్టివారిని,
అహం = నేను,
అవేక్షే = చూచెదను.

తా॥ దుర్బుద్ధియగు దుర్యోధనునికి యుద్ధమునందు ప్రియముచేయు నభిప్రాయముతో ఏయే వీరపురుషులు ఇక్కడ (ఈ కురుక్షేత్రములో) సమావిష్టులై యున్నారో చూచెదను. అంతవరకు ఉభయ సేనామధ్యమ క్షోణిలో రథమును నిల్పుము.

## అ మృ త వా హి ని :-

ఇట్లు కౌరవవీరులు, పాండవవీరులు ఒకరికొకరు మేము యుద్ధమునకు సిద్ధముగా నున్నామనగ మేమును యుద్ధమునకు అంతకంటె ముందుగనే సిద్ధముగ నున్నామని శంఖధ్వనులతో, సింహనాదములతో తెలుపుకొన్న తరువాత, ధార్తరాష్ట్రులు శస్త్ర ప్రయోగమునకు సిద్ధముగా నున్న సమయమున కపిధ్వజుడైన అర్జునుడు తన గాండీవమును పైకెత్తి పట్టుకొని హృషీకేశునితో ఈ వాక్యమును పలుకుచున్నాడు :

అర్జునుడు కపిధ్వజుడు. అరణ్యవాసముచేయు సమయములో, ఒకప్పుడు పాండవులు గంధమాదన పర్వతమునకు పోయి బదరీనారాయణమున ఉన్న సమయమున, ఒకనాడు వాయువశమున ఒక సౌగంధిక కమలము ద్రౌపది సమీపమునకు

పడినది. దానినిజూచి పాండవు లందరును ఆశ్చర్యపోయిరి. దానికి సహస్రదళములు. ఏ పుష్పములకును ఉండని అద్భుత సౌరభమును, ఎప్పుడును వాడక వికసించి సౌరభమును వెదజల్లు చుండుట-ఈ లక్షణములుగల సౌగంధికమును జూచునప్పటికి ద్రౌపదికి దానిమీాద మక్కువగలిగి భీమసేనుః తో "ఇక్కడకు కొలదిదూరముననే ఇట్టి కమలములు చాల ఉండవచ్చును. లేకున్న గాలికి ఈ ఒక్కపుష్పము ఎట్లు కొట్టుకొనివచ్చును? కాన ఈ పుష్పములు ఎక్కడ ఉన్నవో చూచి, ఇట్టి పుష్పము లను ఎక్కువగా తెచ్చి ఇచ్చి నా మనస్సునకు ఆనందము కలిగింపుము" అని అర్థించెను. భీమసేనుడు వానికొరకు ఆ గంధమాదన పర్వతముమీాద వెదుకుచు పోయిపోయి, ఒకచోట తన అన్నగారైన హనుమన్నను దర్శించినప్పుడు, ఆ హను మన్న తమ్ముడైన భీమన్ననుజూచి సంతసించి "భారతయుద్ధ ములో అర్జునుని రథమున ధ్వజముమీాద కూర్చొని, నీవు సింహనాదము చేసినప్పుడు నీ సింహనాదములో కలిపి నేనుకూడ చేయుదును. ఆ ధ్వనికి శత్రువుల గుండెయలవియ చత్తురు" అని వరమిచ్చెను. ఆ వరము ప్రకారము హను మంతుడు అర్జునుని జెండాపై ఉండును. కనుక అర్జునునికి కపిధ్వజుడు అని పేరు వచ్చినది.

హృషీకేశుడు అనగా పదిహేనవ శ్లోక వ్యాఖ్యాన ములో వివరింపబడినది.

దుర్యోధనాదులు శస్త్రములు పైకెత్తి యుద్ధమునకు సిద్ధముగానుండుట జూచునప్పటికి అర్జునునకు వీరరసము ఉప్పొంగినది. ఉడుకురక్తము నాడులవెంట వేగముగ

ప్రవహించసాగినది. వెంటనే తన గాండీవమునుకూడ పైకెత్తి "అచ్యుతా! ఒకసారి మన రథమును ఉభయసేనామధ్యము క్షోణిలోనికి గొనిమ్ము" అనినాడు. 'అచ్యుతా!' అని సంబోధన చేయుటలో ఎంతో భావము ఇమిడియున్నది. అచ్యుతుడు - చ్యుతి లేనివాడు. చ్యుతి అనగా జారుట, పడుట, నాశము, మార్పు, తొలగుట - ఇవి లేనివాడు అచ్యుతుడు. ఎవడు తన సిద్ధాంతమునుండి, తన స్వరూపము నుండి, తన మహాత్త్వమునుండి, ఎప్పుడును, ఎట్టి సందర్భము లోను స్ఖలితుడుకాడో, మార్పుచెందడో, నాశములేనివాడో, వికారములులేనివాడో వాడు అచ్యుతుడు. "స్వస్వరూపాత్, స్వసామర్థ్యాత్, స్వపదాత్, నచ్యవతే. ఇతి అచ్యుతః, షడ్వికారరహితత్వాత్ అచ్యుతః".

తనకు సారథియైనవాడు ఈ అచ్యుతుడు. సాక్షాత్ పరమాత్మ కనుక కృష్ణునితో, "నీవు నారథమును తోలు చున్నావు. నాభాగ్యము ఏమి చెప్పను! కనుక నారథమునకు నాకు ఎప్పుడును ఎక్కడను పరాభవము, పరాజయము కలుగదు. నీచేత నడుపబడు ఈ రథము సంగ్రామములో అజేయము" అను భావమును సూచించుచు, 'అచ్యుతా!' అని సంబోధించినాడు.

"యుద్ధము చేయుటకై ఎవరెవరు వచ్చియున్నారో, నే నెవరితో యుద్ధము చేయవలయునో ముందు నిర్ణయించుకొన వలయును. అంతవరకు ఎక్కడ నిలబడియున్నచో ఇట్లు చూడ గలుగుదునో, అక్కడ- ఉభయసేనమధ్య-రథము నిలుపుము". ఎంతసేపు? ఎవరితో యుద్ధము చేయవలయునో నిర్ణయించుకొను

వరకును రథము నిలుపవలసినది అని కృష్ణపరమాత్మతో చెప్పుచున్నాడు. శరీరమొక రథము ఆత్మ రథికుడు. ఇంద్రియములు గుఱ్ఱములు. బుద్ధి సారథి. సారథిస్థానములో తనబుద్ధిని తొలగించి కృష్ణపరమాత్మను పెట్టినవాడు-ఆయన హృషీకేశుడు గనుక, అనగా ఇంద్రియములకు ప్రభువు, నియమించువాడు గనుక - ఈరథముయొక్క గుఱ్ఱములను ఎప్పుడు ఎట్లు నడుపవలయునో అప్పుడు అట్లు నడుపగలడు. ఎప్పుడు ఎట్లు ఎక్కడ నిలుపవలయునో అప్పుడు అట్లు అక్కడ నిలుపగలడు. కనుక కృష్ణునే సారథిగా ఎన్నుకొని రథము నడుపుమనుచున్నాడు.

"దుర్యోధనుడు దుర్బుద్ధి. తనహితము పరులహితము కూడ తెలిసికొనలేనివాడు. దురభిమానము, మూర్ఖపు పట్టుదల కలవాడు. ఇతరుల ఉన్నతినిచూచి ఓర్వలేనివాడు. ఇతరులు తనకు ఉపకారముచేసినను, అది అవమానముగా తలచి, విరోధము వహించి కక్షసాధించువాడు. కనుక నే ఇంతయు వచ్చినది. అట్టి దుర్యోధనునికి యుద్ధములో సాహాయ్యము చేయుటకై ఏయే రాజులు వచ్చియున్నారో, వారినందరను చూడవలసియున్నది. మాయజూదములో ఓడించి, ద్రౌపదిని నిండుసభలో అవమానపరచి, మరల రెండవమారు జూదములో అన్యాయముగా రాజ్యమునంతయును తీసికొనునప్పుడు, పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము సక్రమముగా నిర్వర్తించి వచ్చినయెడల మరల మా రాజ్యము మాకిచ్చునట్లు ఏర్పాటు చేసికొనికూడ, ఇప్పుడుఎంతమంది పెద్దలుచెప్పినను ఈయననుట మూర్ఖత్వము,

దుర్బుద్ధి కాదా! ఇది తెలిసి తెలిసికూడ ఆ దుర్బుద్ధియైన దుర్యోధనునికి సహాయము చేయుటకై ఏయేరాజులు వచ్చి యున్నారో వారిది అన్యాయముకాదా!

అయితే, క్షత్రియులకు యుద్ధము ధర్మము కనుక, ఎవరి ఇష్టము వచ్చినపక్షమునకు వారువచ్చి యున్నారు అనిన యెడల అదియును కాదు. క్షత్రియులకు ధర్మయుద్ధమున్యాయము గాని, అధర్మయుద్ధము. న్యాయ్యము కాదే! ఇప్పుడు మనము చేయునది ధర్మయుద్ధము. ఏలయన, మనము జూదములో ఓడి పోయినప్పుడు యథార్థముగా శక్తిసామర్థ్యములుండికూడ మనరాజ్యము వారికిచ్చి, అడవులకుపోయి, ఎన్ని బాధలోపడి, నిర్ణయముప్రకారమువచ్చి, మనరాజ్యము మనకిమ్మని అడిగి నాము. ససేమిరా ఈయనన్నాడు. మనము క్షత్రియులము గనుక, క్షత్రియధర్మము ప్రకారము మనరాజ్యముకొరకు యుద్ధము చేయుచున్నాము. అందుచేత మనది ధర్మయుద్ధము. అధర్మయుద్ధమునకై దుర్యోధనునికి సహాయముగావచ్చిన ఈ రాజులు ఎట్టి వివేకవంతులు! ఎవ్వరైనను కూలికి విషము త్రాగుదురా! కాబట్టి, యీ వచ్చిన రాజు లెవరో, నేనెవరితో యుద్ధము ప్రారంభించవలయునో చూచుకొనవలయును. కనుక మనరథమును ఒకసారి అచ్యుతా! అటు నడుపుము" అనుచున్నాడు అర్జునుడు.

అ వ తా రి క :-

అర్జునుడు ఇట్లు చెప్పినమీదట కృష్ణపరమాత్మ ఏమి చేసినాడు అను విషయమును సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ :—

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో
గుడాకేశేన భారత!
సేనయో రుభయో ర్మధ్యే
స్థాపయిత్వా రథోత్తమమ్॥ ౨౪

శ్లో॥ భీష్మ ద్రోణ ప్రముఖతః
సర్వేషాంచ మహీక్షితామ్
ఉవాచ పార్థ ! పశ్యైతాన్
సమవేతాన్ కురూ నితి ॥ ౨౫

ప. వి. ఏవం, ఉక్తః, హృషీకేశః, గుడాకేశేన, భారత, సేనయోః, ఉభయోః, మధ్యే, స్థాపయిత్వా, రథోత్తమమ్॥24
భీష్మద్రోణప్రముఖతః, సర్వేషాం, చ, మహీక్షితాం, ఉవాచ, పార్థ, పశ్య, ఏతాన్, సమవేతాన్, కురూన్ ఇతి.॥25

టీక :-

హేభారత = ఓ ధృతరాష్ట్రమహారాజా !
గుడాకేశేన = అర్జునుని చేత,
ఏవం = ఈ ప్రకారముగా,
ఉక్తః = చెప్పబడిన,
హృషీకేశః = కృష్ణపరమాత్మ,
ఉభయోః సేనయోః = రెండు సేనలయొక్క,
మధ్యే = నడుమ,
భీష్మద్రోణప్రముఖతః = భీష్ముడు, ద్రోణుడు మున్నగు

సర్వేషాం=సమస్తమైన,
మహీక్షితాంచ = రాజులయొక్క,
(పురతః = ఎదుట)
రథోత్తమం=శ్రేష్ఠమైన రథమును,
స్థాపయిత్వా=నిలిపి,
హేపార్థ = అర్జునా !
సమవేతాన్=చేరియున్న,
ఏతాన్ = ఈ,
కురూన్=కౌరవులను,
పశ్య = చూడుము,
ఇతి=అని,
ఉవాచ=పలికెను.

తా. సంజయుడు చెప్పుచున్నాడు : ఓ ధృతరాష్ట్రమహారాజా అర్జునుడు కృష్ణునితో ఇట్లు చెప్పగా, కృష్ణుడు ఉభయసేనలమధ్య, భీష్ముడు, ద్రోణుడు, ఇంకను ఇతరులైన మహీపతులయొక్క సమ్ముఖమున తన రథోత్తమమును తీసికొనిపోయి నిలిపి, అర్జునా ! యుద్ధము చేయుటకై కూడిన ఈ కౌరవులను చూడుము అనిచెప్పెను.

అ మృ త వా హి ని :-

గుడాకేశుడు అనగా అర్జునుడు. గుడాకా + ఈశః = గుడాకేశః;గుడాకా = నిద్రకు, ఈశః = ప్రభువు, అనగా నిద్ర మీద అధికారము కలవాడు. నిద్రను జయించినవాడు. నిద్ర అనగా సర్వసామాన్యమైన నిద్రనే అర్థముగా తీసికొన్నప్పుడు నిద్రను స్వాధీనములో ఉంచుకొన్నవాడు అని అర్థము. శరీరమునకు సహజముగా ఎంతకావలయునో, ఎంత తక్కువ

నిద్రతో శరీరారోగ్యమును బాగుగ కాపాడుకోగలమో, అంత కంటె ఎక్కువ నిద్రపోనివాడు. ఆ నిద్ర అయినను తన స్వాధీనములో ఉండును. తాను నిద్రపోవలయును అని సంకల్పించి నిద్రపోవుటకాని, అవశముగా శరీరము నిద్రావశ మగుట జరుగదు. అట్టివాడే నిజముగా నిద్రను జయించినవాడు.

నిద్ర అనగా హెచ్చరిక తప్పియుండుట. అది లేనివాడు గుడాకేశుడు. అర్జునుడు ఎట్టిపరిస్థితులలోను హెచ్చరికతప్పి ఒక్క క్షణమైనను ఉండువాడుకాడు. ఎప్పుడును ఉత్సాహ పూరితుడై యుండును. మందముగా నుండుట, ఆలస్యము - సోమరితనము, కునికిపాట్లు పడుచుండుట, పొరపడు చుండుట - ఇవన్నియును హెచ్చరిక తప్పియుండువాని లక్షణ ములు. ఇవి ఏమాత్రమున్నను, అట్టివాడు ఐహికము గాను, పారమార్థికముగాను తన్నుతానే అధోగతికి త్రోసి కొన్నవాడగును. కనుక ప్రతిసాధకుడును అర్జునునివలె గుడాకేశుడు కావలయును. ఏమాత్రము ఏమరియున్నను, ప్రకృతి సాధకుని తన సుడిగుండములోనికి లాగుకొనును. ఈ జీవితమే ఒక కురుక్షేత్రము, జీవితములో అనేక విరుద్ధ విషమ పరిస్థితులను ఎదుర్కొనుటయే యుద్ధము. శరీరమే రథము. ఇంద్రియములే గుఱ్ఱములు. మనస్సే కళ్ళెము. బుద్ధి సారథి. జీవుడే రథికుడు. ఇరుకుదారిని నడువవలసియున్నది. రెండు ప్రక్కలను అగాధము. ఏమాత్రము హెచ్చరిక తప్పియున్నను అధఃపతనమే. ఇట్టియెడ, గుఱ్ఱములు మంచి సాత్త్విక బలము కలిగి క్రమశిక్షణలో ఆరితేరి యుండవలయును. రథము చాల

గట్టిదిగ నుండవలయును. సారథి మంచి సమర్థుడుగను, సాత్త్వికుడుగను ఉండవలయును. అప్పుడైన గమ్యస్థానమును సురక్షితముగ చేరవచ్చును. అంతేకాని, చేరితీరవలయునను నిర్ణయము లేదు. మాయ అంత బలమైనది. కనుకనే సారథి స్థానములో తన బుద్ధిని అవతలకు నెట్టి, అక్కడ పరమాత్మను స్థాపన చేసిన మొదల, ఆ రథికుడు సవ్యముగా, సక్రమముగా, తప్పక గమ్యస్థానము చేరగలడు. ఏలయన మానవ జీవిత రథమును నడుపువాడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, అనంతుడు, నిత్యుడు అయిన పరమాత్మయే. కనుక అర్జునుడు అజ్ఞానదగ్ధుడు. ఆతని జీవితములో హెచ్చరిక తప్పియుండుట లేదు. ఒకవేళ ఎప్పుడైన ఒక క్షణము వచ్చినను, కృష్ణపరమాత్మ ఆ గుఱ్ఱములను తోలు కొరడాతో, ఆ కునికిపాట్లను, ఆ పొరపాట్లను అంటించిన - అంతే, ఆ కునికిపాట్లు, ఆ పొరపాట్లు పటాపంచలు అగుటయే. కాబట్టి అర్జునుడు గుడాకేశుడు. ఈ గుడాకేశ శబ్దమున కిప్పటి ప్రస్తుతము ఈ అర్థమే సమంజసము. సంజయుడు "అర్జునుడు గుడాకేశుడు. ఇక నీవు పుత్రులకు జయమెట్లు కలుగునని ఆశించుచున్నావు!" అను భావమును ప్రకటించుచున్నాడు. అస్తు.

పరమాత్మ అర్జునుని రథమును ఉభయసేనామధ్యమున క్షోణిలో నిలిపి "అర్జునా! ఈ కౌరవులను చూడుము" అన్నాడు. ఏల అనవలెను? "అర్జునా! నీవు చెప్పినట్లు రథమును ఎక్కడ నిలబెట్టిన నీవు అందరిని చూడగలవో, అక్కడ నిలబెట్టితిని. బాగుగా చూడుము. నీవు చూచు పర్యంతమును ఈ రథమును

ఇక్కడనే కదలకుండ నిలుపుదును" అన్నాడు, భీష్మ ద్రోణాది బంధువులు, పూజనీయులు, ఆదరణపాత్రులు, ప్రేమపాత్రులు అయినవారి దగ్గరకు తీసికొనివెళ్ళి. కృష్ణుని అభిప్రాయ మేమి ? -

లోకకల్యాణసాధకమైన తన లీలలో అర్జునుని నిమిత్త మాత్రునిగ తీసికొనదలచినాడు. అంతఃకరణములో ఎంత మాత్రమును ప్రాపంచికవాసనలు లేనివాడే దానికి యోగ్యుడు. ఉన్నవారిలో అర్జునుడే యోగ్యుడు. కాని ఇంకను బంధువులు, పూజనీయులు అను వాసన బీజప్రాయముగ ఉన్నది. అది అట్లే ఉండిపోయినయెడల, తాత్కాలికముగ పనిజరిగినను, ఈపనికి నిమిత్తమాత్రుడైనవాడు, తగినంతగ పరమార్థ ఫలమును పొందలేడు. పని జరుగుచున్నది. ఫలములేకుండ పోవుచున్నది. ఈస్థితి తన భక్తుడైన అర్జునునకు రారాదు. దానిని తీసివేయుటకు, అది తన అంతఃకరణములో ఉన్నట్లు అర్జునునికి తెలియవలె. ఆ బీజమును మొలకరూపములోనికి తీసికొనివచ్చి, గిల్లి వేయవలెను. బీజము దొరకకపోవచ్చును. కాని ఆ బీజము మొలకెత్తుటకు తగిన అవకాశమును కల్పించిన, అది మొలకగా పైకివచ్చును. అప్పుడు ఆ మొలకను గిల్లి వేసిన మొలకచచ్చుట ఒక్కటే కాదు - దానికి కారణమైన బీజము కూడ ఇంక ఉండదు. తనవారు, పెరవారు అన్న భావమునకు కారణమైన బీజము అర్జునుని అంతఃకరణములో ఉన్నది. దానిని మొలకెత్తించవలయును. ఆ అభిప్రాయముతోనే

ముఖ్యమైనవారి ఎదుటకు తీసికొనిపోయి, "ఇదుగో - ఈ కౌరవులను చూడుము అర్జునా!" అనునప్పటికి ఆ బీజము మొలకెత్తుట ప్రారంభమయినది. అప్పుడు దానికి చికిత్సచేసి లోకకల్యాణప్రదమైన తన లీలలో తగినపాత్రగా ఉపయోగించుకొనినాడు.

అ వ తా రి క :—

కృష్ణపరమాత్మ మాటను విని అర్జునుడు ఏమిచేసినది చెప్పుచున్నాడు.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా ॥ ౨౬

శ్లో॥ శ్వశురాన్ సుహృదశ్చైవ
సేనయో రుభయోరపి
తాన్ సమీక్ష్య స కౌంతేయః
సర్వాన్ బంధూ నవస్థితాన్ ॥ ౨౭

శ్లో॥ కృపయా పరయావిష్టో
విషీద న్నిద మబ్రవీత్

ప. వి. తత్ర, అపశ్యత్, స్థితాన్, పార్థ, పితౄన్, అథ, పితామహాన్, ఆచార్యాన్, మాతులాన్, భ్రాతౄన్, పుత్రాన్, పౌత్రాన్, సఖీన్, తథా:

శ్వశురాన్, సుహృదః, చ, ఏవ, సేనయోః, ఉభయోః, అపి,
తాన్, సమీక్ష్య, సః, కౌంతేయః, సర్వాన్, బంధూన్,
అవస్థితాన్,
కృపయా, పరయా, ఆవిష్టః, విషీదన్, ఇదం, అబ్రవీత్ ॥

టీక :-

అథ = అనంతరము,
పార్థః = అర్జునుడు,
తత్ర = అక్కడ,
ఉభయోః సేనయోః = రెండుసేనలయందును,
స్థితాన్ = ఉన్నట్టి,
పితౄన్ = భూరిశ్రవసుడు మొదలగు తండ్రివరుస వారలను,
పితామహాన్ = భీష్ముడు మొదలగు తాతవరుస వారలను,
ఆచార్యాన్ = ద్రోణుడు మొదలగు గురువులను,
మాతులాన్ = మేనమామవరుసవారిని,
భ్రాతౄన్ = సోదరులను,
పుత్రాన్ = పుత్రులను,
పౌత్రాన్ = మనుమలను,
తథా = అట్లే (ఇంకను అను అర్థములో ప్రయోగింపబడినది.)
సఖీన్ = స్నేహితులను,

శ్వశురాన్ = మామవరుసవారిని,
సుహృదశ్చైవ = సుహృత్తులను,
అపశ్యత్ = చూచెను,
సః = ఆ,
కౌంతేయః = అర్జునుడు,
అవస్థితాన్ = (యుద్ధరంగమున) నిలిచియున్న,
తాన్ బంధూన్ = ఆ బంధువులను,
సర్వాన్ = అందరిని,
సమీక్ష్య = బాగుగా చూచి,
పరయా కృపయా = అధికమైన కృపతో,
ఆవిష్టః = కూడుకొన్నవాడై,
విషీదన్ = దుఃఖించుచు,
ఇదం = ఈ వాక్యమును,
అబ్రవీత్ = పలికెను.

తా॥ అప్పుడు పార్థుడు ఉభయ సేనలలోనున్న తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, సోదరులను, కుమారులను, మనుమలను, మిత్రులను, మామలను, సుహృదులనుకూడ చూచెను. అక్కడ ఏర్పడిన ఆ బంధువుల సందరను చూచి,అర్జునుడు అత్యంతమైన, కృపతో కూడుకొన్నవాడై దుఃఖించుచు ఇట్లు పలికెను.

అ మృ త వా హి ని :-

కృష్ణపరమాత్మ అట్లు రథమును తీసికొనివెళ్ళి రెండు సేనలమధ్యను నిలిపి, చూడుమని అర్జునునకు చూపించుసరికి అర్జునునికి కనపడినవారందరు ఎవరు ? ఎక్కడ చూచినను

తండ్రివరుసవారు, భీష్ముడు మొదలగు తాతలును, ద్రోణుడు, కృపాచార్యుడు మొదలగు ఆచార్యులును, పురుజిత్తు, కుంతిభోజుడు, శల్యుడు మొదలగు మేనమామలును, దుర్యోధనుడు మొదలగు సోదరబృందమును, లక్ష్మణకుమారుడు, అభిమన్యుడు, ద్రౌపదేయులు మొదలగు కుమార సముదాయమును, మనుమలవరుసవారును, అశ్వత్థామ మొదలగు మిత్రులును, ద్రుపదుడు, శైబ్యుడు మొదలగు మామలును, తనకు ఏమియు సంబంధములేకపోయినను, తనవలన ఎట్టి ప్రయోజనము లేకపోయినను కేవలము తనహితమునే అపేక్షించి, సహాయము చేయుటకై వచ్చిన సుహృదులును కనపడినారు. వీరినందరిని చూచునప్పటికి, అర్జునునిహృదయము కృపతో ద్రవించిపోయినది. ఇంతమంది బంధువులను చంపవలసివచ్చినదే అను విచారము ఒక్కసారి అతని బుద్ధిని ఆవరించినది. రెండుసేనలలో అటుచూచినను, ఇటుచూచినను అందరును తనవారే. 'వీరందరును ఈయుద్ధములో చావవలసినవారేగా! అటు పదునొకండక్షౌహిణులసేన, ఇటు ఏడు అక్షౌహిణులసేన - మొత్తము పదునెనిమిది అక్షౌహిణులు అబ్బ! రక్తము ప్రవహించవలసినదే!' అను భావము బుద్ధిని ఆవరించినకొలది, విచారము మిక్కుటమయ్యెను. ఆ విచారముతో, క్షత్రియోచితమైన తన వీరస్వభావమునుకూడ మరచిపోయినాడు. ఆ మోహముతో, ఏవేవో తనకు తోచిన వెల్ల ధర్మములనుకొని రాబోవు శ్లోకమునుండి అనగా ఇరువదిఎనిమిదవ శ్లోకముయొక్క ఉత్తరభాగమునుండి నలుబదిఆరవ

శ్లోకమువరకు - పదునెనిమిదిన్నర శ్లోకముల విషయము ఆవేశపూరితుడై ఉపన్యసించును.

అ వ తా రి క :-

తనవారి యందున్న మమకార మోహాములచేత, అర్జునున కెట్టి స్థితి కలిగినదో అర్జునుని ఈ రెండున్నర శ్లోకము లలో మనకు గోచరమగును.

అ ర్జు న ఉ వా చ :-

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ !
యుయుత్సుం సముపస్థితమ్॥ ౨౮

శ్లో॥ సీదంతి మమ గాత్రాణి
ముఖంచ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే
రోమహర్షశ్చ జాయతే॥ ౨౯

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్
త్వక్చైవ పరిదహ్యతే
నచ శక్నో మ్యవస్థాతుం
భ్రమతీవ చ మే మనః॥ ౩౦

ప. వి. దృష్ట్వా,ఇమం,స్వజనం,కృష్ణ, యుయుత్సుం,సముపస్థితం, సీదంతి, మమ, గాత్రాణి, ముఖం, చ, పరిశుష్యతి, వేపథుః, చ, శరీరే, మే, రోమహర్షః, చ, జాయతే. 28,29

గాండీవం, స్రంసతే, హస్తాత్, త్వక్, చ, ఏవ, పరిదహ్యతే, న, చ, శక్నోమి, అవస్థాతుం, భ్రమతి, ఇవ, చ, మే, మనః, 30

టీక :-

హేకృష్ణ = ఓకృష్ణా !
యుయుత్సుం = యుద్ధముచేయు ఆలోచనతో,
సముపస్థితం = ఎదుటనిలబడియున్న,
ఇమం స్వజనం = ఈబంధుజనమును,
దృష్ట్వా = చూచి,
మమ = నాయొక్క,
గాత్రాణి = అవయవములు,
సీదంతి = శిథిలములై పోవుచున్నవి.
ముఖంచ = నోరును,
పరిశుష్యతి = ఎండిపోవుచున్నది.
మే = నాయొక్క,
శరీరే = దేహమునందు,
వేపథుశ్చ = కంపమును (వణకును),
రోమహర్షశ్చ = గగుర్పాటును,
జాయతే = పుట్టుచున్నది.
హస్తాత్ = చేతినుండి,
గాండీవం = గాండీవము,
స్రంసతే = జారుచున్నది.
త్వక్చైవ = చర్మముకూడ,
పరిదహ్యతే = బాగుగ దహింపబడుచున్నట్లున్నది.

మే=నా యొక్క,
మనః= మనస్సు,
భ్రమతీవ = తిరుగుచున్నట్లున్నది.
అవస్థాతుంచ = (రథమున) నిలుచుటకును,
నశక్నోమి = శక్తి లేకయున్నాను.

తా॥ అర్జునుడు చెప్పుచున్నాడు-కృష్ణా ! యుద్ధముచేయుటకువచ్చిన ఈ స్వజనసముదాయమునుచూచి, నా అవయవములన్నియు శిథిలములై పట్టుతప్పిపోవుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. శరీరమంతయును వణకుచున్నది. రోమాంచము కలుగుచున్నది. చేతినుండి గాండీవము జారిపడిపోవుచున్నది. చర్మమంతయు మండుచున్నది. నామనస్సు గిఱ్ఱున తిరుగుచున్నదా అన్నట్లున్నది. నేనింక నిలువలేకుండనున్నాను.

అ మృ త వా హి ని :—

అర్జునుని గాండీవము దివ్యము. అది తాళప్రమాణము కలది. ఈగాండీవమును గురించి విరాటపర్వములో ఉన్నది. అర్జునుడు బృహన్నలగా ఉన్నప్పుడు ఉత్తరకుమారునితో ఇట్లు వర్ణించిచెప్పెను- "ఇది అర్జునునియొక్క జగత్ప్రసిద్ధమైన ధనుస్సు. ఇది బంగారుకట్లు కలిగినది. శస్త్రములన్నిటిలో ఉత్తమమైనది. ఇతర ఆయుధములు లక్ష అయినను దీనితో సరిపోవు-అంత శక్తి కలది."

ఈ ధనుస్సువల్లనే దేవతలతోను, మానవులతోను అర్జునుడు విజయము సాధించినది. అద్భుతమైన, విశాలమైన, విచిత్రమైన ఈధనువును దేవతలు, దానవులు, గంధర్వులు చాలకాలము ఆరాధించినారు. ఈ ధనుస్సును బ్రహ్మ వెయ్యిసంవత్సరములు, ప్రజాపతి అయిదువందలమూడు

సంవత్సరములు, ఇంద్రుడు అయిదువందల సంవత్సరములు, చంద్రుడు అయిదువందల సంవత్సరములు, వరుణుడు వందసంవత్సరములు ఉంచుకొనిరి - వరుణుడు అగ్నికి ఇచ్చెను. అర్జునుడుచేసిన అద్భుతకర్మకు మెచ్చుకొని అగ్ని ఈ గాండీవమును అర్జునునకు ఇచ్చెను. ఇది గాండీవము యొక్క చరిత్ర.

ఈయుద్ధమువలన కలిగెడి పరిణామమును ఆలోచించినకొలది అర్జునునికి మహాభయంకరముగా కనపడుచున్నది. అందరును స్వజనము. ఇందులో వృద్ధులు, బాలురు - సర్వులు కలరు. పదునారు పదునెనిమిది సంవత్సరముల బాలుర దగ్గర నుండి, భీష్మపితామహునివంటి వృద్ధులవరకును ఉన్నారు. వీరినందరను చూచిన అర్జునునకు, వీరందరును ఒక్కపెట్టున మహాభయంకర కరాళముల తెరచి యుంచుకొన్న మృత్యువు ముఖమున ప్రవేశించబోవుచున్నట్లు తోచినది. ఇక తరువాత మిగులున దెవరు ? స్త్రీలు. ఎంత వర్ణసంకరము కాగలదు ! ఈవిషయమును ఆలోచించినకొలది అర్జునుని హృదయము ఏదో చెప్పరాని బాధతో దుఃఖపడుచున్నది.

"ఆ విషమపరిణామము తలచుకొనిన భయము వేయుచున్నది. ఈ కారణమున నాశరీరమునకిట్టి దురవస్థ సంప్రాప్తమైనది కృష్ణా!" అనుచున్నాడు అర్జునుడు. ఏమి ఆ దురవస్థ ? దురవస్థకాదా ! అవయవము లన్నియు పట్టుతప్పిపోవుచున్నవే! ఇంతవరకును బాగుగనే యున్నవే! జబ్బులేదే ! అకస్మాత్తుగ ఇదేమి- నోరు ఎండిపోవుచున్నది. నాలుక లాగుకొనిపోవుచున్నది. పెదవులు తడుపు కొందమనిన నాలుకమీద

తక్తి ఉండినగదా! ఏమో తెలియదు, ఎందులకో తెలియదు - శరీరము కంపించిపోవుచున్నది. రోమములు నిక్కపొడుచుకొనుచున్నవి. ఎంత నిగ్రహించుకొందమన్నను చేతకాకయున్నది. చేతినుండి గాండీవము జారిపడిపోవుటయా! ఎప్పుడైన కలదా! ఈ గాండీవమును మోయు శక్తి నాచేతికి లేదా! ఇంతలో ఎందువల్ల ఇట్లు మారవలెను? చేతితో పట్టుకొనలేకుండ నున్నాను. వ్రేళ్ళు బిగించిన బిగియుట లేదు. దేహము మీద చర్మమంతయును ఎవరో దహించుచున్నారేమో అనిపించుచున్నది. లేనిచో ఈ మంటలేమి! భరించలేను. మనస్సు చక్రమువలె తిరిగిపోవుచున్నది. మనస్సు స్వాధీనముతప్పి అట్లు తిరుగుచు ఉన్నచో శరీరము ఎట్లు నిలుచును? నిలువలేకుండ ఉన్నాను. రథముమీద నిలబడి ఎట్లు యుద్ధము చేయుట? చేతులు పట్టులేవాయె! శరీరము అంతకుముందే మెత్తబడి కూలబడుచున్నది. మూర్ఛరాదుగదా! రథముమీదనుండి క్రింద పడిపోనుగదా!

"కృష్ణ!" అనగా

(1) "కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః
తయో రైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇ త్యభిధీయతే."

కృషి భూవాచకము - అనగా సత్తావాచకము. 'ణ' నిర్వృతివాచకము. అనగా ప్రత్యక్షానందవాచకము. ఈ సత్తాయొక్కయును, ఆనందముయొక్కయును ఏకత్వమే పరబ్రహ్మమైన కృష్ణుడు.

(౨) 'కర్షయతి సర్వాన్ స్వకుక్షౌ ప్రలయకాలే ఇతి కృష్ణః' ప్రళయకాలములో సర్వజీవులను తన కుక్షియందు లీనము చేసికొనువాడు కనుక కృష్ణుడు.

(3) 'దోషాన్ కృషతి నివారయతి ఇతి కృష్ణః' జీవుల యొక్క పాపాదిదోషములను పోగొట్టువాడు కనుక కృష్ణుడు.

(౪) 'పురుషార్థాన్ ఆకర్షయతి ప్రాపయతి ఇతి కృష్ణః' భక్తులకు దుర్లభములైన పురుషార్థములను పొందింపజేయు వాడు కనుక కృష్ణుడు.

(౫) 'భక్తాన్ ఆకర్షయతి ఇతి కృష్ణః' భక్తులను తన వైపునకు ఆకర్షించువాడు కనుక కృష్ణుడు.

(౬) 'భక్తానాం పాపాన్ కృషతి నివారయతి ఇతి కృష్ణః' భక్తుల పాపములను పోగొట్టువాడు కనుక కృష్ణుడు.

(౭) 'శ్యామవర్ణత్వాత్ కృష్ణః' శ్యామవర్ణము కలవాడగుటచే కృష్ణుడు.

అవతారిక :-

తరువాత, అర్జునుడు తనకు అపశకునములుకూడ కనపడుచున్నట్లు చెప్పుచున్నాడు.

శ్లో॥ నిమిత్తానిచ పశ్యామి
విపరీతాని కేశవ !
నచ శ్రేయోఽనుపశ్యామి
హత్వా స్వజన మాహవే 3౧

ప. వి. నిమిత్తాని, చ, పశ్యామి, విపరీతాని, కేశవ,
న, చ, శ్రేయః, అనుపశ్యామి, హత్వా, స్వజనం, ఆహవే.

టీ క :-

హే కేశవ = ఓ కృష్ణా !
విపరీతాని = అనర్థసూచకములగు,
నిమిత్తాని = శకునములను,
పశ్యామి = చూచుచున్నాను,
ఆహవే = యుద్ధమునందు,
స్వజనం = బంధుజనమును,
హత్వా = చంపుటచేత,
శ్రేయశ్చ = మేలును,
నానుపశ్యామి = చూడలేకున్నాను. (మేలు ఎంత మాత్రమును కనపడుటలేదు అని భావము)

తా॥ ఓ కేశవా ! అమంగళకరములైన అపశకునములుకూడ చూచుచున్నాను. స్వజనులందరను యుద్ధమునందు చంపుటచేత కలుగబోవు మంచికూడ నాకేమియును కనపడుటలేదు.

అ మృ త వా హి ని :—

"ఏదిదైననను ఒకపని చేయబోవునప్పుడు ఆపనివలన కలుగబోవు పరిణామమును సూచించు శకునములను నిమిత్తములందురు. ఆనిమిత్తములు శుభసూచకములుగాను, అశుభసూచకములుగాను ఉండవచ్చును. అశుభసూచకములైన నిమిత్తములను విపరీత నిమిత్తములు లేక అపశకునములు

అందురు. భూమి అదురుట, సూర్యుడు కనపడకపోవుట; పురుషులకు ఎడమకన్ను, ఎడమభుజము అదురుట, మంగళకరమైన వస్తువులు చేతిలోనుండి జారిపడిపోవుట మొదలగునవి అపశకునములు. ఇప్పుడు నాకు అట్టి అపశకునములు కనపడుచున్నవి. కాన మనము చేయబోవు యుద్ధమువలన అమంగళము తప్ప, కలుగుమంచి ఏమియును ఉన్నట్లు తోచుటలేదు.

"కృష్ణా! మనము ఇప్పుడు యుద్ధము చేయకుండుటయే శ్రేయస్కరము. బంధుజనులను చంపుటచేత హృదయములో తీరని చింత ఒకటి; ఆత్మీయులు, ప్రియులు అయినవారు లేకపోవుటచేత, ఎన్ని ఉన్నను మిగిలిన జీవితమంతయు నను దుఃఖమయముగానే ఉండుట రెండు; బంధువులైనవారిని చంపుటచేత గొప్పపాపము కలుగుట మూడు. ఇదియంతయును చూచిన, ఈ లోకములోగాని, పరలోకములోగాని మనకు సుఖము, హితము కూడ లేదు. కాబట్టి నా అభిప్రాయమున యుద్ధము మానుటయే మంచిది" అనుచున్నాడు అర్జునుడు.

శుభశకునములు, అశుభశకునములు కలవు. వీటినే అనుకూల నిమిత్తములు, విపరీత నిమిత్తములు అనియు అందురు. ఈ శకునములు కనపడుటకు మన భ్రమప్రమాదములు కారణము కాకూడదు. ఆకాశమున సూర్యుడు కనపడను- మనము అన్నివిధములను స్వస్థచిత్తులమై యున్నప్పుడు; నేత్రదోషము లేనప్పుడు ఇట్టి స్థితి కలిగినయెడల దానిని

శకునము అందురు. కండ్లకు పైత్యముచేత బైర్లుక్రమ్మి కనపడకపోయిన అది శకునముకాదు. ప్రయాణమగునప్పుడు పాము కనపడరాదు. అయితే భ్రమచేత పాములేనిది పామువలె కనపడిన, అది భ్రమకాని, శకునముకాదు. మంగళకరమైన ఒక పదార్థము చేతినుండి జారిపడినచో అది అశుభశకునము. కాని జబ్బుచేత పట్టులేకనో, తాత్కాలిక మనోవికల్పముచేత అవయవములలో పట్టుతప్పియో జారిపోవుట జరిగిన, ఇదంతయు అశుభశకునము అనుకొన్నచో, అది హృదయ దౌర్బల్యము. ఇది తెలిసికొనకపోవుటచేత మానవులు అక్కరలేని భయములకు లోనౌచున్నారు.

ఇప్పుడు అర్జునునకు కలిగిన శకునములు ఇట్టివి. నోరు ఎండుచున్నది అనగా ఏల ఎండదు ? దడపుట్టినచో, భయము కలిగినచో, భరింపలేని విచారము వచ్చిమీదపడినచో నోరెండును. అట్లే శరీరములో పటుత్వము తప్పిపోయిన చేతిలోని గాండీవము జారిపోవును. ఇది అపశకునము అన నక్కరలేదు. ఇట్లే అన్నియు ఊహించుకొనవలయును. ప్రతి దానికిని భయపడరాదు.

శ్లో॥ నకాంక్షే విజయం కృష్ణ !
నచ రాజ్యం సుఖానిచ
కిం నో రాజ్యేన గోవింద !
కిం భోగై ర్జీవితేనవా॥ ౩౨

ప. వి. న, కాంక్షే, విజయం, కృష్ణ, న, చ, రాజ్యం, సుఖాని, చ, కిం, నః, రాజ్యేన, గోవింద, కిం, భోగైః, జీవితేన, వా,

టీక :-

హేకృష్ణ = ఓకృష్ణా!
విజయం = విజయమును,
నకాంక్షే = కోరను;
రాజ్యంచ = రాజ్యమును,
సుఖానిచ = సుఖములనుకూడ,
న (కాంక్షే) = కోరను;
హేగోవింద = ఓగోవిందా !
నః = మనకు
రాజ్యేన = రాజ్యముచేత,
కిం = ఏమి? (ప్రయోజనము ఏమి?)
భోగైః = భోగములచేతగాని,
జీవితేనవా = బ్రతికియుండుటచేతగాని,
కిం = ఏమి? (ప్రయోజనము ఏమి?)

తా॥ కృష్ణా! నాకు విజయమక్కరలేదు. రాజ్యము, సుఖములు కూడ కోరను. ఓ గోవిందా! మనకు ఈ రాజ్యములోగాని, భోగములతో గాని, ఈ జీవితముతోగాని ఏమి ప్రయోజనము!

అమృతవాహిని :-

"కృష్ణా! ఇంతమంచి బంధుజనమును మారణహోమము చేసిన తరువాత ఈ కలిగెడి విజయము ఎవరికి కావలయును!

ఈ రాజ్యము, ఈ సుఖములు ఎవరికి? నాకు అక్కరలేదు. అందరును పోయినతరువాత చూచి సంతోషించునది? ఎవరు మనము ఏపనిచేసినను ఈలోకమున ఆనందము, సుఖమును, పరలోకమున ఆనందము, సుఖమును కోరియే కదా! ఇప్పుడు ఈ యుద్ధము చేయుటచేత కలుగునదేమి? అందరును మృత్యుదేవత పాలగుటయే. తరువాత మనకు వచ్చిన రాజ్యమును, ఇండ్లు వాకిండ్లు, అన్నియును చూచిన కొలది, మనతో ఎవరుండి ఇవన్నియును అనుభవించవలసిన వారో, వారు లేకపోవుటచే, దుఃఖమునకే కారణము లగుచుండును. చివరకు నా ఒక్కనికొరకా ఇంతమంది ప్రాణములు తీయునది! కనుక ఈలోకములోను, పరలోకములోను కూడ ఆనందమును, హితమును లేని ఈ యుద్ధము ఎందుకు చేయవలయును? ఎవరికొరకు చేయవలయును? ఇంతమందిని దేనికొరకు చంపవలయును? ఇంతమంది చచ్చినతరువాత మనకు రాజ్యము చేతగాని, ఈ భోగములచేతగాని, ఈ జీవితముచేతగాని ఏమి ప్రయోజనము గోవిందా!" అనుచున్నాడు.

'గోవింద' అనగా- గో = వేదాంతములచేత, విందః = తెలియబడువాడు. గో = వేదములను, విందః = తెలిసినవాడు. వేదవేత్త- కనుక 'గోవిందా' అని సంబోధనచేసి అర్జునుడు ఈ భావమును వ్యక్తము చేయుచున్నాడు. 'గోవిందా! నీవుకూడ ఇట్టి ఘోరపాపకర్మకు పాల్పడజేయుచున్నావేమి?' అని.

శ్లో॥ యేషా మర్థే కాంక్షితం నో
రాజ్యం భోగా స్సుఖానిచ
త ఇమేఽవస్థితా యుద్ధే
ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ॥ 33

ప. వి. యేషాం, అర్థే, కాంక్షితం, నః, రాజ్యం, భోగాః, సుఖాని, చ, తే, ఇమే, అవస్థితాః, యుద్ధే, ప్రాణాన్, త్యక్త్వా, ధనాని, చ.

టీక :-

నః = మనకు,
రాజ్యం = రాజ్యము,
యేషాం = ఎవరియొక్క,
అర్థే = ప్రయోజనముకొరకు,
కాంక్షితం = కోరబడినదో,
భోగాః = భోగములును,
సుఖానిచ = సుఖములునుకూడ,
(యేషామర్థే కాంక్షితాని = ఎవరినిమిత్తము కోరబడినవో)
తే ఇమే = అట్టి వీరు,
ప్రాణాన్ = ప్రాణములను (ప్రాణములమీది ఆశను),
ధనానిచ = ధనములను (ధనములమీది ఆశను),
త్యక్త్వా = విడిచిపుచ్చి,
యుద్ధే = యుద్ధమునందు,
అవస్థితాః = నిలిచియున్నారు.

తా॥ మనము ఎవరికొరకై రాజ్యమును, భోగములను, సుఖములను కోరుచున్నామో వారందరును-ఇరుగో : ధనములమీదను, ప్రాణముల మీదను ఆశను త్యజించి, యుద్ధమునందు నిలబడియున్నారు.

## అ మృ త వా హి ని :-

కృష్ణా! నాకు ఈ రాజ్యము, భోగములు, సుఖములు ఎంతమాత్రమును ఆవశ్యకములుకావు. వీనిలో దేని యందును నిలుకడ కల ఆనందములేదు. ఇవి నిత్యములుకూడ కావు. అయితే, ఎవరికొరకు అందువా ? ఇరుగో ! ఈబంధువులు, కుమారులు, సోదరులు మొదలైన స్వజనముకొరకై ఈ రాజ్యము మొదలగువానిని కోరుచుంటిని. కాని ఇప్పుడు వీరందరును యుద్ధములో చనిపోవుటకు సిద్ధముగానున్నారు. వీరందరును చనిపోయిన తరువాత, వీరికొరకై నేను కోరు ఈ రాజ్యాదులతో నాకేమి ప్రయోజనము! కాబట్టి ఎన్నివిధముల చూచినను యుద్ధముచేయుట మంచిదికాదు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రాః
తథైవచ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్రాః
శ్యాలా స్సంబంధిన స్తథా॥ 38

ప. వి. ఆచార్యాః, పితరః, పుత్రాః, తథా, ఏవ, చ, పితామహాః, మాతులాః, శ్వశురాః, పౌత్రాః, శ్యాలాః, సంబంధినః, తథా.

టీ క :-

ఆచార్యాః = గురువులును,
పితరః = తండ్రులును,

పుత్రాః = కుమారులును,
తథైవ = అట్లే,
పితామహాః = తాతలును,
మాతులాః = మేనమామలును,
శ్వశురాః = మామలును,
పౌత్రాః = మనుమలును,
శ్యాలాః = భార్యతో పుట్టినవారైన బావమరదులును,
తథా = అట్లే,
సంబంధినః = చుట్టములును (అయిఉన్నారు.)

తా॥ గురువులు, తండ్రులు, పుత్రులు, పితామహులు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరదులు, వియ్యంకులు - ఇంకను అనేకమంది స్వజనులు- వీరేగదా ఉన్నది !

అమృతవాహిని :—

ప్రపంచములో ఎవరైనను ఇట్టి తనవారికొరకే గదా రాజ్యములు, ధనములు, సుఖములు, భోగములు కోరునది ! వీరందరును చనిపోయిన తరువాత సుఖదాయకములు అనుకొనుచున్న రాజ్యములు, భోగములు దుఃఖమునకే కారణములగును గదా! ఇట్టి పరిస్థితిలో ఈ రాజ్యములు, భోగములు ఎందులకు, కనుక యుద్ధము చేయను అని చెప్పుచున్నాడు అర్జునుడు.

శ్లో॥ ఏతాన్న హంతు మిచ్ఛామి
ఘ్నతోఽపి మధుసూదన !

అపి త్రైలోక్యరాజ్యస్య
హేతోః కిన్ను మహీకృతే ॥ 35

ప. వి. ఏతాన్, న, హంతుం, ఇచ్ఛామి, ఘ్నతః, అపి, మధుసూదన,
అపి, త్రైలోక్యరాజ్యస్య, హేతోః, కిం, ను, మహీకృతే.

టీ క :—

హేమధుసూదన = ఓ కృష్ణా !
ఘ్నతో౽పి = (వీరు మనలను) హింసించువారలైనను,
త్రైలోక్యరాజ్యస్య = మూడు లోకముల రాజ్యము,
హేతోరపి = కొరకైనను,
ఏతాన్ = వీరిని,
హంతుం = చంపుటకు,
న ఇచ్ఛామి = ఇష్టపడను.
మహీకృతే = భూలోక రాజ్యముకొరకు,
కింను = చెప్పవలసినదేమి !

తా॥ ఓ మధుసూదనా ! దుర్యోధనాదులు మనలను చంపుటకు సిద్ధముగానున్నను, వీరిని చంపుటచే త్రైలోక్యాధిపత్యము లభించినను వీరిని చంపను. ఇక అల్పమైన ఈ భూమండలాధిపత్యము కొరకు అట్టి నీచకృత్యము చేయుదునా !

## అ మృ త వా హి ని :—

మధుసూదనా ! ఈ దుర్యోధనాదులు యుద్ధము చేయకుండ తిరిగి పోయెడి నన్ను చంపిన చంపుదురుగాక ! నేను మాత్రము వీరిని చంపను. 'ఘ్నతో౽పి' అనుటచేత మనము యుద్ధము చేయకున్నచో, మనలను వీరు చంపవలసిన పనిలేదు.

చంపరు. ఒకవేళ మూర్ఖులై చంపుదురుగాక, అయినను నేను మాత్రము వారిని చంపను. త్రైలోక్య రాజ్యము కొరకును చంపను సుమా! ఇక నేడు ఉండి రేపుపోవు అశాశ్వతమైన తుచ్ఛమైన ఈ అల్పభూమండల రాజ్యము కొరకా వీరిని చంపుట! ఎప్పుడును చంపను.

అవతారిక :—

త్రైలోక్యాధిపత్యము వచ్చినను వీరిని ఎందుకు చంపనో తెలియునా?

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః
కా ప్రీతి స్స్యా జ్జనార్దన!
పాపమే వాశ్రయే దస్మాన్
హత్వైతా నాతతాయినః ॥ 36

ప. వి. నిహత్య, ధార్తరాష్ట్రాన్, నః, కా, ప్రీతిః, స్యాత్, జనార్దన, పాపం, ఏవ, ఆశ్రయేత్, అస్మాన్, హత్వా, ఏతాన్, ఆతతాయినః.

టీక :—

హే జనార్దన = ఓ కృష్ణా!
ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను,
నిహత్య = చంపి (చంపుటచేత),
నః = మాకు,
కా ప్రీతిః = ఏమి సంతోషము,
స్యాత్ = అగును!
ఆతతాయినః (అపి) = ఆతతాయులు అయినను,

ఏతాన్ = వీరిని,
హత్వా = చంపి, (చంపుటచేత),
అస్మాన్ = మనలను,
పాపమేవ = పాపమే,
ఆశ్రయేత్ = ఆశ్రయించును.

తా॥ ఓ జనార్దనా! దుర్యోధనాదులను చంపుటచేత మనకు కలిగెడి సుఖమేమున్నది? అతతాయులైనను వీరిని చంపిన మనకు లభించునది పాపమే.

అ మృ త వా హి ని :—

జనార్దన శబ్దార్థము :

(౧) 'జనాన్ అర్దయతి హినస్తి నరకా(దీ)న్ గమయతి వా జనార్దనః' జనులను దండించువాడు; లేక పాపులను నరకములలో త్రోయువాడు కనుక జనార్దనుడు.

(౨) 'జనైః పురుషార్థం అభ్యుదయ నిశ్శ్రేయసలక్షణం యాచ్యతే ఇతి జనార్దనః' జనులు పరమ కల్యాణరూపమైన పురుషార్థమును ఎవనిని యాచించుచున్నారో వాడు జనార్దనుడు.

(3) 'జనయత ఇతి జనో దృశ్య వర్గస్తం అంతర్బహిశ్చ సర్వదోఽర్దతి వ్యాప్నోతి ఇతి జనార్దనః' జగత్తులోని సర్వము నందును లోపల బయట వ్యాపించియుండుటచే జనార్దనుడు.

(౪)'జనాన్ అర్దతే గతికర్మణోఽనురూపం ఇతిజనార్దనః' మానవులకు వారివారి కర్మానురూపమైన గతి ప్రసాదించు వాడు కనుక జనార్దనుడు.

(౫) 'సర్వజనై రర్దయతే యాచ్యతే స్వాభిలషితసిద్ధయే ఇతి జనార్దనః' సర్వులచేతను తమతమ కోర్కెలు సిద్ధించుటకై యాచింపబడువాడు కనుక జనార్దనుడు.

(౬) 'జనం జననం తత్కారణ మజ్ఞానంచ స్వసాక్షాత్కారేణ అర్దయతి హినస్తి ఇతి జనార్దనః' పుట్టుకను, దానికి కారణమైన అజ్ఞానమును కూడ తన సాక్షాత్కారముచేత, నశింపజేయువాడు కనుక జనార్దనుడు.

(౭) 'జన మాయా అర్దన పీడనకారి ఇతి జనార్దనః' మాయనుబాధించువాడు కనుక జనార్దనుడు. అనగా భక్తులకు మాయను తొలగించి మోక్షప్రదానము చేయువాడు అని భావము.

'ఆతతాయి'అనగా :

"అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః
క్షేత్రదారోపహారీచ షడేతే ఆతతాయినః"

ఇంటికి నిప్పుపెట్టువాడు, విషముపెట్టువాడు, చంపుటకై శస్త్రములు ధరించి సిద్ధముగా వచ్చినవాడు, ధనమును సర్వమును దోచుకొనువాడు, భూమిని అపహరించువాడు, భార్యను హరించువాడు- ఈ ఆరుగురును ఆతతాయులు అనబడుదురు. అనగా ఇందులో ఏఒక్కటిచేసినను ఆతతాయి అనబడును, ఇంక ఈ ఆరును చేసినవారిని గూర్చి చెప్ప

వలయువా! దుర్యోధనాదులు పాండవుల విషయములో ఈ ఆరును చేసినారు.

(౧) లక్క-యింటిలో పెట్టి నిప్పుపెట్టినారు. పరమాత్మ కరుణ వీరియందుండుటచే బ్రతికినారుకాని, లేకపోయిన ఏమై పోవలసినది! (౨) భీమున్నకు విషము పెట్టినారు. (3) ఇప్పుడే కాదు-అనేకమారులు పాండవులమీదికి యుద్ధమునకు బయలు దేరుట జరిగినది. (౪) కపటజూదములో ధనమంతయును కట్టు గుడ్డలతో సహా హరించినారు. (౫) రాజ్యమంతయును అన్యాయముగా కపటజూదములోనే హరించినారు. (౬) ద్రౌపదిని నిండుసభలో చీరలొలుచుటకు ప్రయత్నించి అవమానముచేసినారు. ఇంతకంటె ఇక చేయవలసినఘోరములు ఏమున్నవి! కాబట్టియే ధార్తరాష్ట్రిలను ఆతతాయులు అనుట.

'జనార్దనా! దుర్యోధనాదులు ఆతతాయులు. అయినను వారిని చంపిన మనకు పాపమేవచ్చును. అంతకంటె మనకు వచ్చునది ఏమియునులేదు' అనుచున్నాడు.

అర్జునుడు మోహావిష్టుడై సత్యమునుమరచి మాటాడుచున్నాడు. కాని యథార్థమాలోచించిన

"ఆతతాయిన మాయాంతం హన్యాదే వావిచారయన్
నాతతాయివధే దోషో హంతు ర్భవతి కశ్చన॥"

అని మనువు అనినాడు. అనగా "ఆతతాయి అనిష్టము చేయుటకు వచ్చినయెడల, అతనిని వెనుకముందులు

ఆలోచింపక చంపివేయవలయును. ఆతతాయిని వధించుటచేత చంపినవానికి ఏమాత్రమును దోషమంటదు". పరమాతతాయులైన దుర్యోధనాదుల నెట్లు వధించినను దోషములేదని భావము.

అయితే, అర్జునుడుకూడ శాస్త్రములు చదువుకొన్న వాడే కనుక, "సఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్ కుల నాశనమ్" - "ఎవడైతే కులనాశనము చేయునో వాడే పాపిష్ఠతముడు. వానికంటె ఇంకపాపిలేడు" అని శాస్త్రవచనము- కాబట్టి కులనాశనము చేయరాదు అని వాదింపవచ్చును. కాని ఈ సందర్భము వేరు. వేరొక సందర్భమున ఇది వివరణ చేయబడును.

శ్లో॥ తస్మాన్నార్హా వయం హంతుం
ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనంహి కథం హత్వా
సుఖినస్స్యామ మాధవ! 32

ప. వి. తస్మాత్, న, అర్హాః, వయం, హంతుం, ధార్తరాష్ట్రాన్, సబాంధవాన్, స్వజనం, హి, కథం, హత్వా, సుఖినః, స్యామ! మాధవ.

టీక :—

హేమాధవ = ఓకృష్ణా!
తస్మాత్ = అందువలన,
వయం = మనము,
సబాంధవాన్ = బంధువులతో కూడుకొనిన,

ధా ర్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను,
హంతుం = చంపుటకు,
నార్హాః=అర్హులముకాము (అట్లుచేయుటతగదు);
స్వజనం = స్వజనమును,
హత్వా=చంపి,
కథం = ఎట్లు,
సుఖినః = సుఖముగలవారము,
స్యామ = అగుదుము ?
హి=ఇట్లు భావించుట ఉచితమే గదా !

తా॥ ఓమాధవా ! బంధువులతోకూడిన ధార్తరాష్ట్రులను చంపుట మనకు తగదు. స్వజనులనుచంపి ఏమిసుఖము అనుభవించగలము !

అ మృ త వా హి ని :—

మాధవా ! సబాంధవముగా ధార్తరాష్ట్రులను సంహరించుట మనకు తగనిపని. వారు మన కెన్ని ద్రోహములు, మోసములు చేసినను, ఎన్నెన్ని బాధలుపెట్టినను వారందరును మన స్వజనమేకదా! వారందరిని చంపి ఏమి సుఖము పొందగలము ? ఐహికసుఖమా ? పరలోకసుఖమా ? రెండును శూన్యములే. ఇంక మహాపాపముకూడ చుట్టుకొనగలదు. "సఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్ కులనాశనమ్" అనగా వినలేదా? కులమును నాశనముచేసినవానికంటె పాపి ఎవరు ? ఎటుజూచినను మనము ఈ యుద్ధముచేయుట మంచిదికాదు.

అ వ తా రి క :—

'కుటుంబనాశనమువలన గలుగు పాపము ఉభయపక్షములకును సమానమే. ఈ పాపమును గురించి విచారించి దుర్యో

ధనుడు యుద్ధమునుండి విరమించిపోవుట లేదే! నీ కెందుల కీ విచారము?' అని కృష్ణపరమాత్మ అనునేమోఅని ఊహించుకొని, సమాధానము రెండుశ్లోకములలో చెప్పుచున్నాడు.

శ్లో॥ యద్య ప్యేతే న పశ్యంతి
లోభోపహత చేతసః
కులక్షయకృతం దోషం
మిత్రద్రోహేచ పాతకమ్ 39

శ్లో॥ కథం నజ్ఞేయ మస్మాభిః
పాపా దస్మా న్ని వర్తితుమ్
కులక్షయ కృతం దోషం
ప్రపశ్యద్భి ర్జనార్దన! 39

ప. వి. యది, అపి, ఏతే, న, పశ్యంతి, లోభోపహతచేతసః, కులక్షయకృతం, దోషం, మిత్రద్రోహే, చ, పాతకం.॥39॥

ప. వి. కథం, న, జ్ఞేయం, అస్మాభిః, పాపాత్, అస్మాత్, నివర్తితుం, కులక్షయకృతం, దోషం, ప్రపశ్యద్భిః, జనార్దన. ॥39॥

టీక :—

లోభోపహతచేతసః = పేరాసచేత చెడిపోయిన చిత్తముగల,

ఏతే = ఈ దుర్యోధనాదులు,

కులక్షయకృతం = కులక్షయమువలన కలుగు,

దోషం = దోషమును,

మిత్రద్రోహే = మిత్రద్రోహమునందలి,
పాతకంచ = పాపమునుకూడ,
నపశ్యంతి = చూచుటలేదు (తెలియకున్నారు);
యద్యపి = అయినను,
హేజనార్దన = శ్రీకృష్ణా!
కులక్షయకృతం = కులక్షయమువలన కలుగు,
దోషం = దోషమును,
ప్రపశ్యద్భిః = బాగుగ చూచుచున్న (తెలిసికొన్న),
అస్మాభిః = మనచేత,
అస్మాత్ = ఈ,
పాపాత్ = పాపమునుండి,
నివర్తితుం = బయటపడుటకు,
కథం = ఏవిధముగ,
నజ్ఞేయం = తెలియకుండుట ?

తా॥ వీరు రాజ్యలోభముచేత బుద్ధిచెడి, కులక్షయమువలన కలుగు దోషమును, మిత్రద్రోహముచేత వచ్చెడి పాపమును గ్రహించలేకుండ నున్నారు. కులక్షయమువలన కలిగెడి దోషమును కాంచుచున్న మన మా పాపమునుండి తొలగుటకు ఎందుకు విచారించరాదు ?

అ మృ త వా హి ని :—

ఆ! నిజమే. దుర్యోధనునికికూడ ఈ యుద్ధముచేయుట ఎంతమాత్రము తగనిపనియే. కాని, అతడు ఇంత క్రూరమైన, ఈ కులక్షయమునకు కారణమైన ఈ యుద్ధము చేయుట, మిత్రద్రోహము చేయుట ఆశ్చర్యపడతగినదికాదు. ఆబాల్యము అతని స్వభావమే అంత. అతనికి కావలసినది రాజ్యము. ఆ రాజ్య

కాంక్ష అతని బుద్ధిని పూర్తిగ చెడగొట్టినది. కనుక ఇది చేయ తగినది, ఇది చేయతగనిది అను నిర్ణయము చేసికొనుట ఆతనికి చేతగాదు. ఆతని వివేకము నశించినది. కులక్షయ కారణమైన ఈ యుద్ధమువలన ఎంతపాపము సంభవింపనున్నదో, ఈఉభయసేనలలోను కల బంధువులలో, మిత్రులలో వైరము కల్పించి, ఒకరినొకరు చంపుకొనునట్లు చేయుటచే కలుగు మహాపాతకము ఎట్టిదో దుర్యోధనాదులు విచారించుటలేదు. కాని, ఇన్నియు తెలిసిన మనముకూడ వారివలెనే అంధులము ఎందుకు కావలయును? కులనాశనముచేత కలుగు దోషము మనకు. బాగుగా తెలియును తెలిసి తెలిసి, ఇట్టి మహాపాపములో ఎందుకు దిగవలయును? మనము చక్కగ విచారించి, ఈ పాపమునుండి బయటపడవలయును. ఈ రాజ్యమును వారికే విడిచి, మనము సుఖముగా నుందుముగాక.

అవతారిక :—

కులక్షయముచేత ఏయే దోషములు కలుగునో చెప్పుచున్నాడు.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి<br>కులధర్మా స్సనాతనా:<br>ధర్మే నష్టే కులం కృత్స్న<br>మధర్మోఽభిభవ త్యుత॥ ౪౦

ప. వి. కులక్షయే, ప్రణశ్యంతి, కులధర్మాః, సనాతనాః, ధర్మే, నష్టే, కులం, కృత్స్నం. అధర్మః, అభిభవతి, ఉత.

టీ క :-

కులక్షయే (సతి) = కులక్షయము కాగా,
సనాతనాః = సనాతనములైన,
కులధర్మాః = కులధర్మములు,
ప్రణశ్యంతి=పూర్తిగా నశించుచున్నవి.
ధర్మేనష్టే (సతి) = ధర్మము నశించగా,
అధర్మః = అధర్మము,
కృత్స్నం కులం= కులమునందంతటను,
అభిభవత్యుత = వ్యాపించుచున్నదిగదా !

తా॥ కులము నశించుటచేత సనాతనములైన కులధర్మములు నశించుచున్నవి. ధర్మము నాశనమగుటచేత కులమంతయును అధర్మము వ్యాపించి కలుషితమైపోవును.

## అ మృ త వా హి ని :-

కృష్ణా! కులమునశించుటచేత ఎంత ప్రమాదమో భావించితివా! తనకులములో పూర్వమునుండియును పరంపరగా శాస్త్రసమ్మతము శిష్టసమ్మతమునైన ఏమర్యాద జాగ్రత్తగా వచ్చుచున్నదో, ఏ మర్యాద జాగ్రత్తగ సురక్షితముగ నుండుటచేత సదాచారము బాగుగా కాపాడబడి అనుష్ఠానములో నుంచబడుచున్నదో, ఏ మర్యాద పెట్టనికోటవలె నున్నంతకాలము స్త్రీలలోను పురుషులలోను అధర్మము ప్రవేశింప వీలుకాకుండనుండునో అట్టి శుభప్రదమైన శ్రేష్ఠమైన సనాతన ధర్మరూపమైన కులమర్యాద నశించిపోవుచున్నది. ఇప్పుడు ఈ యుద్ధములో అనేకమంది పెద్దలు, పిన్నలుకూడ

మరణించుటచేత మిగిలిన స్త్రీలకు, బాలురకు ఇది మర్యాద, ఇది అమర్యాద; ఇది ధర్మము, ఇది అధర్మము అను విషయములు బోధించువారే మిగులకపోవుటచే, చివరకు స్త్రీ పురుషుల యందు అమర్యాద వ్యాపించిపోవును. ఇట్టిస్థితిలో అధర్మము వ్యాపించుట సహజమేగదా ! ఎంతశోచనీయమైన దశ కలుగ నున్నది ! ఎప్పుడు ధర్మము నశించినదో కులములన్నియును కట్టుబాట్లులేక మర్యాద నతిక్రమించి చెడిపోవును. దానితో కులమంతయును పాపమే వ్యాపించగలదు. కారణమేమనగా మానవుడు ధర్మమును జాగ్రత్తగా రక్షించుకొనుటకు అయిదు ముఖ్యకారణములు.

(౧) ఆస్తికత- పరమాత్మ ఉన్నాడు. తప్పుచేసిన శిక్షించును అను భయము. (౨)శాస్త్రవిశ్వాసము. అన్ని శాస్త్రము లందును ఇట్లు చెప్పబడియున్నది అని జాగ్రత్తగ నడుచుకొన గలుగుట. (3) ప్రభుత్వము శిక్షించునను భయము. (౪) కుల మర్యాదలు చెడిపోవునను భయము. (౫) శారీరకముగాను, ఆర్థికముగాను అనేక నష్టములు, కష్టములు కలుగునన్న భయము. ఈ ఐదు కారణములును ఎట్లు చెడిపోవునో చూతుము -

(౧)పరమాత్మ ఉన్నాడను విషయమును, (౨) శాస్త్రములు యథార్థముగా సత్యమే అయినను, అవి మానవుని శ్రద్ధమీదనే ఆధారపడియున్నవి. హేతువాదముచేతగాని, ప్రత్యక్షముగాగాని ఋజువు చేయుదగినవికావు. (3) ప్రభుత్వ

భయము - ప్రభుత్వము కేవలము ప్రజలకొరకే ఏర్పడినది. కాని ఎవరిచేతిలో ప్రభుత్వమున్న వారికి ఈవిశ్వాసము ఉండవలెను కదా ! సామాన్యముగ అది ఉండదు. చెప్పువారు ఉండరుగదా ! ఆ కారణమున చిన్నతనములో తెలియదు. తెలియకపోయిన మానె, తనకు తెలిసినదే సర్వము అనుకొందురుగదా ! వారే పెద్దవారైన తరువాత ఇక ఎవరు చెప్పినను వినరు. కాబట్టి ప్రభుత్వములోకూడ భగవంతుడన్నను, శాస్త్రములన్నను, కులమర్యాదలన్నను విశ్వాసము లేకుండ పోయిన ఇక వీటికొరకు ప్రభుత్వము శిక్షించునా ! ఇంక ఈ భయమేల ఉండును ? (౪) కుల మర్యాద వ్యక్తిగతముగాగాక కుటుంబముమీద వంశముమీద ఆధారపడియుండును. చెప్పువారు లేకపోవుటచే ఎవరికివారే స్వతంత్రులయిపోదురు. ఒకరు చెప్పువారు మిగిలినవారు విని నడుచుకొనువారుగా నున్నప్పుడుతప్ప, కులమర్యాదలు ఎట్లు రక్షింపబడును ! సమాజము మొత్తముయొక్క ఏకాభిప్రాయము మీద ఆధారపడి ఆ కులధర్మము ఉండును. ఎవరికివారే స్వతంత్రులై, ఎవరిఇష్టము వారికి ధర్మమైనప్పుడు, ప్రతివారును స్వేచ్ఛాచారులైనప్పుడు, ఆ కులధర్మములు నిలువవు. కళ్ళెము లేని, పొగరెక్కిన గుఱ్ఱమువలె స్వేచ్ఛాచారులు ఏ నియమమును సహించుకొనలేక అనేక అనర్థములకు కారకులయ్యెదరు. ఈస్థితి మానవుని నిరంకుశునిగా, స్వేచ్ఛాచారునిగా, రూపొందిన స్వార్థముగా తయారుచేయును. కులములోగాని, సమాజములోగాని ఏనాడిట్టి విశృంఖలత, నిరంకుశత్వము,

స్వేచ్ఛాచారత వ్యాపించునో, ఇంక పాపమునకును, అధర్మము నకును కొరత ఏముస్నది ! అంతయును పాపమయమే కాగలదు. ఇంక (౫) శారీరక ఆర్థికపరిస్థితులు, ఇంత స్వేచ్ఛాచారత, నిరంకుశత్వము ప్రబలినప్పుడు ప్రత్యేకము వ్యక్తి మీద ఆధారపడియుండును. కాన అది ఎన్నిపతనములందునో ఎవరికి ఎరుక ? ఇట్లు చివరకు కులములు, సమాజములు అధర్మముతో, పాపముతో నిండిపోవును కృష్ణా. ఇన్ని అనర్థములకు కారణమైన ఈ యుద్ధము మనము చేయకపోవుటయే శ్రేయస్కరము.

అవతారిక :—

ఇప్పుడు కులములు, సమాజములు ఇంత పాపము, అధర్మముతో వ్యాపించిపోయిన కలుగు నష్టము చెప్పచున్నాడు.

శ్లో॥ అధర్మాభిభవాత్ కృష్ణ !
ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ !
జాయతే వర్ణసంకరః ॥ ౪౧

ప. వి. అధర్మాభిభవాత్, కృష్ణ, ప్రదుష్యంతి, కులస్త్రియః, స్త్రీషు, దుష్టాసు, వార్ష్ణేయ, జాయతే, వర్ణసంకరః.

టీక :—

హేకృష్ణ = ఓకృష్ణా !
అధర్మాభిభవాత్ = అధర్మముచేత బాగుగా
పరిభవింపబడుటవలన్న

కులస్త్రియః = కులస్త్రీలు,
ప్రదుష్యంతి = పూర్తిగా చెడుచున్నారు.
హేవార్ష్ణేయ = ఓ కృష్ణా !
స్త్రీషు దుష్టాసు (సత్సు) = స్త్రీలు చెడినవారుకాగా,
వర్ణసంకరః = వర్ణసంకరము,
జాయతే = కలుగుచున్నది.

తా॥ ఇట్లు అధర్మము వ్యాపించుటచేత కులస్త్రీలు చెడిపోదురు. స్త్రీలు చెడిపోయినయెడల వర్ణసంకరస్థితి ఏర్పడును.

## అ మృ త వా హి ని :—

మానవ సమాజములో, కులములో విశృంఖలత, స్వేచ్ఛాచారత, స్వార్థము, భోగలాలసత్వము ప్రబలినచో, స్త్రీపురుషులు స్వతంత్రులై, వారిచేత చేయుబడు ప్రతిక్రియయును స్వార్థము, భోగలాలసత్వముచు పరమ ప్రయోజనములుగా ఎంచుకొని చేయబడుచు. కనుక అధర్మముగనే యుండును.వారిచేత చేయుబడు ప్రతి చిన్న పనియును, స్వార్థము, భోగలాలసత్వముయొక్క ప్రేరణ చేతనే జరుగును. ఇంక అధర్మమునకు ఇంతకంటె మించిన అవకాశమేమి కావలయును? ఈ కారణమున పాపము త్రివిక్రమావతారమువలె పెరిగిపోయి కులములు, సమాజములు నిండిపోవును. ప్రతిచోటను పాపమే వ్యాపించుటచేత ఇక స్త్రీలలోను, పురుషులలోను ఒకమర్యాద, కట్టుబాటు, ధర్మము అనిన ఎంతమాత్రమును విలువలేకుండ పోవును. ధర్మము ఆచరించకపోయినమానె, అసలు తెలిసి

కొందమను అభిప్రాయమే ఉండదు. ఎవరైననొకరు పెద్దలు ఉండి చెప్పబోయినయెడల వారిని ఇష్టమువచ్చినట్లు మాట్లాడుట, పిచ్చివారిగా భావించుట జరుగును. లేక అట్టివారిని ద్వేషించుటయైనను జరుగును. ఇట్టిపరిస్థితిలో ఇంక కులధర్మముయొక్క, సమాజధర్మముయొక్క, మానవధర్మముయొక్క రక్షణకు ఆధారభూతమైన పవిత్ర సతీధర్మము నశించిపోగలదు. పవిత్రమైన ధర్మసంస్థాపనకు మూలాధారమైన సతీధర్మము - పాతివ్రత్యము-ఎప్పుడునశించినదో, అప్పుడే స్త్రీపురుషులలో వ్యభిచారదోషము ప్రబలిపోవును. దానితో కులస్త్రీలందరును చెడి, వర్ణసంకర మేర్పడును. ఒకజాతిలోనిస్త్రీకి ఇంకొకజాతిలోని పురుషునకు సంయోగమేర్పడిననాడు, ఆ సంతానము సంకరమైనది. ఇట్లు తల్లితండ్రులు వేరు వేరు జాతివారైనప్పుడు వర్ణసంకర మేర్పడును. ఈవిధముగా కులముయొక్క పరంపరానుగతమైన ధర్మములన్నియును నశించిపోవును. వర్ణసంకర స్థితికంటె దుస్థితి ఉండునా !

అ వ తా రి క :–

ఇట్లు వర్ణసంకర సంతానమేర్పడుటచేత కలిగెడి హానిని గూర్చి వివరించుచున్నాడు.

శ్లో॥ సంకరో నరకాయైవ
కులఘ్నానాం కులస్య చ
పతంతి పితరో హ్యేషాం
లుప్తపిండోదకక్రియాః॥ 42

ప. వి. సంకరః, నరకాయ, ఏవ, కులఘ్నానాం, కులస్య, చ, పతంతి, పితరః, హి, ఏషాం, లుప్తపిండోదకక్రియాః.

టీక :-

సంకరః = వర్ణ సంకరము,
కులఘ్నానాం = కులమును నాశము చేసినవారికిని,
కులస్యచ = కులమునకును,
నరకాయైవ = నరకముకొరకే,
(భవతి = అగుచున్నది)
హి = కారణమేమన,
ఏషాం = వీరియొక్క,
పితరః = పితృదేవతలు,
లుప్తపిండోదకక్రియాః = పిండోదకక్రియలు లేనివారలౌచు,
పతంతి = అధోగతికి పోవుచున్నారు.

తా॥ ఈ వర్ణసంకరము కులమును నశింపజేసినవారికిని, కులము నకును కూడ నరకహేతు వగుచున్నది. పిండములు వేయువారును, ఉదకము వదలువారును లేక పితరులు నరకమున కూలుచున్నారు.

## అ మృ త వా హి ని :—

పై శ్లోకములో అధర్మము వ్యాపించి కులస్త్రీలు చెడి పోదురు. స్త్రీలు చెడుటచేత వర్ణ సంకర మేర్పడును అని చెప్పబడినది. వర్ణ సంకరము కులనాశకులను, కులమును కూడ నరకమున త్రోయుననియు చెప్పబడినది. పైశ్లోకములో

చెప్పబడిన అనేక కారణములచేత వర్ణ సంకరము కులమునకం దంతటను అధర్మము, పాపము వృద్ధిపొంది వ్యాపించునట్లు చేయును. అధర్మముచేత, పాపముచేత వ్యాప్తమైన కులము నరకమునబడక ఏమగును! ఇక వర్ణసంకరమునకు కారణమైన కులఘాతుకుల విషయము వేరుగ చెప్పవలయునా !

పితృదేవతలుకూడ నరకమున కూలుదురు. వారేమి చేసిరి? వీరు చేసినదానికి పితృదేవతలకు ఈపతనమెందులకు ?- పితృదేవతలకు పిండము వదలువారుగాని, ఇన్నినీళ్ళు వదలు వారుగాని లేక వారు అధోగతిని పడుచున్నారు. పిండము వదలుట అనగా పితరులనుద్దేశించి శ్రాద్ధమున పిండప్రదానము చేయుట. ఉదకక్రియ అనగా నీళ్ళువదలుట - అనగా తర్పణ ములు వదలుట అని అర్థము. ఈ రెండును కలిసి మూలమున "పిండోదకక్రియాః" అని ప్రయోగించబడినది. ఇవి రెండును చేయువారు లేక, ఏ పితరులకు ఇవి రెండును లోపించినవో, వారు "లుప్తపిండోదక క్రియులు"; అట్టి పితరులు అధోగతికి కూలుదురు. శాస్త్రములందు విశ్వాసము కలవారు పితరుల నుద్దేశించి పిండోదకక్రియలు చేయుచుందురు. వీటినే శ్రాద్ధములు అని వ్యవహరింతురు. ఉదకక్రియను తర్పణములు వదలుట అందురు. ఒక్కొక్క విశేషకాలములలో 'ధర్మోద కములు' 'తిలోదకములు' అని వదలుచుందురు. ఇవి అధికారులు సకాలమున క్రమమైన పద్ధతులలో చేసినయెడల పితృ దేవతలకు వాని ఫలము ముట్టునని శాస్త్రమూలకమైన విశ్వా

సము. కులమంతయును అధర్మము, పాపము వ్యాపించిననాడు, కులస్త్రీలు చెడి వర్ణసంకర మేర్పడిననాడు, శాస్త్రములందు విశ్వాసము నశించుటచేత, ఆ విధానమే తెలియదు. ఎవరైనను చెప్పినను శ్రద్ధ-విశ్వాసము-ఉండదు. కాబట్టి చేయరు. పోనీ ఎవరైన చేసినను శాస్త్రరీత్యా చేయుటకు వారికి అధికారము లేకపోవుటచే, అది పితృదేవతలకు ముట్టదు. ఈ విధముగా పితృదేవతలకు తమ సంతానముద్వారా పిండోదకములు ముట్టనినాడు, లేక ఇచ్చువారు లేనినాడు ఆ పితరులకు నరకమే గతి. అధోగతికి కూలుదురు.

శ్లో॥ దోషై రేతైః కులఘ్నానాం
వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః
కులధర్మాశ్చ శాశ్వతాః 43

ప. వి. దోషైః, ఏతైః, కులఘ్నానాం, వర్ణసంకరకారకైః ఉత్సాద్యంతే, జాతిధర్మాః, కులధర్మాః, చ, శాశ్వతాః.

టీక :-

కులఘ్నానాం = కులమునునాశము చేసినవారియొక్క,
వర్ణసంకరకారకైః = వర్ణసంకరమునకు
కారణములైన,
ఏతైః దోషైః = ఈ దోషములచేత,
శాశ్వతాః = సనాతనములైన,

జాతిధర్మాః = వర్ణధర్మములు,
కులధర్మాశ్చ = కులధర్మములును,
ఉత్సాద్యంతే = నష్టమైపోవుచున్నవి.

తా॥ కులనాశకులయొక్క వర్ణసంకరకారణములగు దోషముల వలన, సనాతనములైన జాతిధర్మములను, కులధర్మములును నష్టములై పోవుచున్నవి.

అమృతవాహిని :-

వర్ణసంకరమునకు కారణములగు దోషములు అనగా (౧) కులమునశించుట, (౨) కులము నశించుటచే కులధర్మము నశించిపోవుట, (3) మిగిలినకులమునందంతటను పాపము వృద్ధి పొందుట, (౪) పాపము వృద్ధిపొందుట కారణముగ స్త్రీలు చెడిపోవుట-ఈ నాలుగును వర్ణసంకరమునకు కారణములైన దోషములు. ఈ నాలుగు దోషములచేతను ప్రధానముగ వర్ణసంకరము ఏర్పడుచున్నది. ఈ దోషములవలన శాశ్వతములైన జాతిధర్మములును, కులధర్మములును నశించుచున్నవి. వంశపరంపరానుగతములైన సదాచారములు, మర్యాదలు సనాతన కులధర్మము లనబడును. వేదశాస్త్రములచేత ప్రసాదించబడిన వర్ణాశ్రమధర్మములు జాతి ధర్మము లనబడును.

కులధర్మములను- అనగా వంశపరంపరానుగతములైన ధర్మములను-చెప్పెడిపెద్దలు, వృద్ధులు లేకపోవుటచే కుల

ధర్మము లన్నియును నశించిపోవును. ఈ కారణమున దోషము వ్యాపించి వర్ణసంకరమునకు కారణమగుచున్నది. జాతి ధర్మములుకూడ నశించుచున్నవి. కులధర్మములు నశించి, స్త్రీలు చెడి, వర్ణసంకరస్థితి యేర్పడుటచే, ఆ సంతానమునకు వర్ణాశ్రమధర్మములందు అధికారము ఉండదు కనుక, అధికారము లేనివారు ఆచరించినను అది ధర్మమనబడదు కనుక, ఆచరించువారు లేకపోవుటచే వర్ణాశ్రమధర్మములు కూడ నశించుచున్నవి. ఈవిధమున జాతిధర్మము నశించుటకుకూడ వర్ణసంకరమే కారణమగుచున్నది.

శ్లో॥ ఉత్సన్న కులధర్మాణాం
మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో
భవతీ త్యనుశుశ్రుమ ॥ ४४

ప. వి. ఉత్సన్నకులధర్మాణాం, మనుష్యాణాం, జనార్దన, నరకే, నియతం, వాసః, భవతి, ఇతి, అనుశుశ్రుమ.

టీక :-

హే జనార్దన = ఓ కృష్ణా!
ఉత్సన్నకులధర్మాణాం-
ఉత్సన్న=చెడిన, లేక నశించిన,
కులధర్మాణాం = కులధర్మములుగల,

మనుష్యాణాం=మానవులకు,
నరకే = నరకమునందు,
నియతం = సదా,
వాసః=ఉనికి,
భవతి = అగుచున్నది,
ఇతి=అని,
అనుశుశ్రుమ = వినియున్నాము.

తా॥ కులధర్మములు నశించిన మానవులకు అవధిలేని కాలము అనగా దీర్ఘకాలము నరకమున ఉండుట కలుగునని మనము వినియున్నాము.

## అమృతవాహిని :-

జనార్దనా ! ఏమానవులకు కులధర్మములు నశించినవో, ఆ మానవులు ఎల్లప్పుడును అధర్మములోనే ఉందురు. ఆపాప ఫలము ననుభవించుటకు వారు కుంభీపాకము, రౌరవము మొదలగు నరకములలో అనేకములైన మహాభయంకర యాతనల ననుభవించవలయును. ఇట్లని పరంపరగా పెద్దలైన వారివలన వినుచున్నాము. శ్రుతులలోకూడ వినబడుచున్నది.

మానవుడు మరణించగనే ఆతివాహికము అను దేహము ఆతనికి లభించుచున్నది. మానవుడు ఈ స్థూలదేహమును విడిచి, సూక్ష్మదేహముతో ఆ శరీరములో ప్రవేశించును. ఇది పదిరోజులు కర్మయగువరకును ఉండి, ప్రేతపిండ ప్రదానము కాగానే, దీనికి బదులు భోగదేహము లభించును

ఆ దేహమున జీవుడు ఈ సూక్ష్మదేహముతోనే ప్రవేశించును. సంవత్సరాంతమున సపిండీకరణము అను శ్రాద్ధము జరుగుటతోనే ఈ భోగదేహముపోయి, మరియొక దేహము-భోగానుకూలదివ్యశరీరమో, బాధానుకూలయాతనా శరీరమో లభించును. సూక్ష్మదేహముతో ఆ దేహమున ప్రవేశించి, తన కర్మానుసారము స్వర్గమునకో, నరకమునకో పోయి, అక్కడ ఆయా భోగములనో, బాధలనో అనుభవించును. స్వర్గాది ఊర్ధ్వలోకములకు పోవువాడు దివ్యశరీరమునను, నరకలోకములకు పోవువాడు యాతనా దేహమునను ప్రవేశించును.

అవతారిక :—

అర్జునుడు ఇంతవరకును స్వజనులను వధించుటచేత కలిగెడి అనర్థములను, పాపములను చెప్పి, ఇప్పుడు యుద్ధమును గూర్చి తన దుఃఖమును వెలిబుచ్చుచున్నాడు.

శ్లో॥ అహో బత మహత్పాపం
కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్యసుఖలోభేన
హంతుం స్వజన ముద్యతాః ॥ ౪౫

ప. వి. అహో, బత, మహాత్పాపం, కర్తుం, వ్యవసితాః, వయం, యత్, రాజ్యసుఖలోభేన, హంతుం, స్వజనం, ఉద్యతాః.

టీక :-

యత్ = ఏ,
రాజ్యసుఖలోభేన = రాజ్యసుఖములందలి పేరాసచేత,
వయం = మనము,
స్వజనం = బంధుజనమును,
హంతుం = చంపుటకు,
ఉద్యతాః = సిద్ధమైనామో,
అహో = ఆశ్చర్యము !
బత = అయ్యో !
మహత్పాపం = మహాపాపమును,
కర్తుం = చేయుటకు,
వ్యవసితాః = పూనుకొన్నవారమైనాము.

తా॥ అహో ! అయ్యో ! ఎంత పాపము చేయుటకు మనము సిద్ధపడుచున్నాము ! రాజ్యసుఖమందలి లోభముచేత స్వజనులైన ధార్తరాష్ట్రాదులను సంహరించుటకుకూడ సిద్ధమగుచున్నామే !

## అమృతవాహిని :-

కృష్ణా ! ఆశ ఎంతటి ఘోరకార్యములనైనను చేయించును గదా ! రాజ్యసుఖములందలి లోభముచేతనేగదా, ప్రాణముకంటెను కూడ ప్రియులైన ఈ స్వజనులను దయాదాక్షిణ్యములులేక చంపుటకు సిద్ధముగానున్నాము ! అహో !

ఏమి ఆశ్చర్యము! అయ్యో! ఆలోచించినచో ఎంతఘోరము! పెద్దలవలన శ్రవణముచేసి, శాస్త్రములను అధ్యయనము చేసిన మనము - తెలిసినవారమనుకొనుచున్న మనముకూడ - సమయము వచ్చునప్పటికి ఎంతఘోరపాతకమునకు కాలు దువ్వుచుంటిమి ! ఆశ్చర్యము ! దీనిచేత కుంభీపాకరౌరవాది నరకములకుపోయి, ఎన్నెన్ని మహాభయంకరయాతనల ననుభవించవలయునో ! అయ్యో ! తలచుకొన్నమాత్రముననే ఎంత భయము, దుఃఖము కలుగుచున్నవి ! మనము చివరికిట్లు ఇంత నీచులమై, ఇంత నీచపు పనికి తలపడితిమా !

అ వ తా రి క :-

ఈ విధముగ సిద్ధపడినపనికి దుఃఖమును వెలిబుచ్చి ఇక తన నిర్ణయమును చెప్పుచున్నాడు.

శ్లో॥ యది మా మప్రతీకార
మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః
తన్మే క్షేమతరం భవేత్ ॥ ౪౬

ప. వి. యది, మాం, అప్రతీకారం, అశస్త్రం, శస్త్రపాణయః, ధార్తరాష్ట్రాః, రణే, హన్యుః, తత్, మే, క్షేమతరం, భవేత్.

టీ క :-

శస్త్రపాణయః = చేతులయందు ఆయుధములుగల,
ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు,

అశస్త్రం = ఆయుధములు లేనట్టియును,
అప్రతీకారం = ప్రతిక్రియ చేయనట్టియును,
మాం = నన్ను,
రణే = యుద్ధమునందు,
హన్యుః యది = చంపినను,
తత్ = అది,
మే = నాకు,
క్షేమతరం = మిక్కిలి క్షేమమే,
భవేత్ = అగును.

తా॥ ఆయుధములు ధరించనట్టియును, ఎదుర్కొననట్టియును, నన్ను ఆయుధములు ధరించిన ధార్తరాష్ట్రులు యుద్ధమునందు సంహరించినచో అదియు నాకు మిక్కిలి క్షేమమే యగును.

## అమృతవాహిని :-

కృష్ణా! ఇన్ని కారణములు, అనర్థములు ఉండుటచేత మనము యుద్ధమునకు పాల్పడవద్దు. వారు దుష్టులు, నీవు యుద్ధము చేయకున్నను నిన్ను వధించకమానరు అందువా! అట్లైనను నాకు మేలేయగును. కాని వారిని వధించుట మాత్రము ఏవిధముగ చూచినను మంచిదికాదు.

అందరును యుద్ధమునకు సిద్ధపడియున్నారు. యుద్ధ ప్రారంభమునకు సూచనగా సింహనాదములు, రణవాద్యములు మ్రోగినవి. ఉభయపక్షములవారును ఆయుధములు ధరించి సిద్ధముగనున్నారు. ఇక ఇప్పుడు నేను యుద్ధము చేయక

పోయినను నన్ను వధించెదరు అను భయము నాకులేదు. నేను శస్త్రములు ధరించకయును, యుద్ధము చేయకయును ఉన్న యెడల, ధార్తరాష్ట్రులుకూడ, యుద్ధము చేయకపోవచ్చును. అట్లు జరిగినయెడల ఆత్మీయులైన బంధువులు రక్షింపబడు దురు. కాక వారు యుద్ధమునకే సిద్ధపడినను నేను యుద్ధము చేయను. యుద్ధముచేయని నన్ను వారు చంపినచో, అది నాకు అధికమైన మేలేయగును. కారణమేమనగా, కులఘాతుక రూపమైన మహాభయంకర పాపమునుండి బయటపడిన వాడనగుదును. ఇంకొకటి-వారు నన్నొక్కనినే సంహరించెదరు. మిగిలిన ప్రియబాంధవు లందరును రక్షింపబడుదురు. ఈ యుద్ధములో చనిపోవుటకు సిద్ధముగానున్న ఇంత బంధులోకమును మృత్యుముఖమునుండి రక్షించిన మహాపుణ్యముచేత, మహాఫలమైన పరమగతి నాకు అతిసులభముగా దొరకగలదు. కాన వారు నన్ను చంపినను నాకు అపారమైన క్షేమమే యగును.

అవతారిక:—

'కృష్ణపరమాత్మతో ఇన్నిమాటలను చెప్పి, చివరకు ఏమి చేసినాడు' అని ధృతరాష్ట్రునకు కలుగు జిజ్ఞాసకు సమాధానముగా సంజయుడు అర్జునునిస్థితిని వర్ణించి చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే<br>రథోపస్థ ఉపావిశత్<br>విసృజ్య సశరం చాపం<br>శోక సంవిగ్న మానసః ॥ ౪౭

ప. వి. ఏవం, ఉక్త్వా, అర్జునః, సంఖ్యే, రథోపస్థే, ఉపావిశత్, విసృజ్య, సశరం, చాపం, శోకసంవిగ్నమానసః.

టీక :-

సంఖ్యే = యుద్ధరంగమునందు,
అర్జునః = అర్జునుడు,
ఏవం = ఈ ప్రకారముగా,
ఉక్త్వా = పలికి,
శోకసంవిగ్నమానసః = దుఃఖముచేత బాగుగా చలించిన మనస్సుగలవాడగుచు,
సశరం = బాణములతో కూడిన,
చాపం = ధనుస్సును,
విసృజ్య = జారవిడిచి,
రథోపస్థే = రథముపైన,
ఉపావిశత్ = కూర్చుండెను.

సంజయుడు చెప్పుచున్నాడు :

తా॥ ఇట్లు అర్జునుడు శోకముతో చలించిన మనస్సుకలవాడై, శర చాపములను జారవిడిచి, రణభూమిలో రథముపై చతికిలపడెను.

అమృతవాహిని :-

ధృతరాష్ట్ర మహారాజా ! అర్జునుడు కృష్ణభగవానునితో ఇట్లుచెప్పి, ఇక నేను యుద్ధముచేయను అని అమ్ములపొది, గాండీవము క్రిందికి జారవిడిచి, కన్నీరు మున్నీరుగా

వలవల దుఃఖించుచుఆ ఉభయసేనామధ్యమక్షోణిలో, పాండవులు, నీవారుకూడ చూచుచుండగా రథముమీద కూలబడినాడు. ఈ యుద్ధముచేత ఇంత బంధునాశము జరుగుచున్నదే అను ఆవేదన, కులములు కులధర్మములు నాశనమగుచున్నవే అను దుఃఖము, వీనివలన కలుగబోవు మహాపాపమును, ఆ పాపముయొక్క ఫలములైన మహాభయంకర కుంభీపాక రౌరవాది నరకయాతనలను తలంచుకొనుటచేత కలిగిన భయము - ఇవన్నియు అర్జునుని చిత్తములో చెలరేగి, ఇష్టమువచ్చినట్లు కలతపెట్టగా, శోకవివశుడై రథముమీద కూలబడినాడు.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
విషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం,
యదుగిరి యతిరాజ సంపత్కుమార మునీంద్రాణాం
శిష్యేణ సీతారామయతినా విరచితాయాం
అమృతవాహినీనామ శ్రీ గీతావ్యాఖ్యాయాం
ప్రథమోఽధ్యాయః



# అమృత వాహిని







శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రులు

ముముక్షుజన మహాపీఠాధిపతులు

ఓం శ్రియఃపతయే నమః

ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీమద్భగవద్గీతా – ద్వితీయోఽధ్యాయః

# సాంఖ్యయోగః

సంజయ ఉవాచ :—

శ్లో॥ తం తథా కృపయావిష్ట
మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య
మువాచ మధుసూదనః॥ ౧

ప. వి :- తం, తథా, కృపయా, ఆవిష్టమ్, అశ్రుపూర్ణాకులేక్షణమ్, విషీదంతం, ఇదం, వాక్యం, ఉవాచ, మధుసూదనః

టీక :—

కృపయా = కృపతో,

ఆవిష్టం = కూడుకొనినవాడై,

అశ్రుపూర్ణాకులేక్షణమ్=కన్నీళ్ళతో నిండి వ్యాకులము లైన నేత్రములు కలవాడును,

తథా = అట్లు (మొదటి అధ్యాయములో చెప్పబడిన ప్రకారము),

విషీదంతం = దుఃఖించుచున్నవాడును (అయిన),

తమ్ = ఆ అర్జునునిగూర్చి,

మధుసూదనః = కృష్ణభగవానుడు,
ఇదం వాక్యం = ఈవాక్యమును,
ఉవాచ = పలికెను.

సంజయుడు చెప్పుచున్నాడు.

తా. ఆ విధముగ కృపచేత కలగిన చిత్తముగలవాడై, కన్నుల వెంట నీరు ధారలుగ కార్చుచు దుఃఖించుచున్న అర్జునునితో కృష్ణ పరమాత్మ ఇట్లు పలికెను -

**అ మృ త వా హి ని :—**

సంజయుడు ధృతరాష్ట్రునితో -

"ఓ మహారాజా ! ఇప్పుడు నేను చెప్పినట్లు - ఈ యుద్ధము చేయుట మహాభయంకరములయిన అనేక అనర్థములకు కారణమనియును, అత్యంత మహాపాపము మనలను ముంచివేయు ననియును, దానికి ఫలమైన రౌరవాది నరక యాతనల ననుభవించవలసి యుండుననియును, బంధుస్నేహము వలన భ్రాంతిమూలకమైన కృపచేత ఆవరింపబడినవాడై ఏమేమియో చెప్పి, తలంచుకొని, తలంచుకొని రథములో చతికిల బడి, కన్నీరు మున్నీరుగ కార్చుచు అపారముగ దుఃఖించుచున్న అర్జునుని చూచి కృష్ణపరమాత్మ ఇట్లుపలుకుచున్నాడు" అని చెప్పుచున్నాడు.

ఇప్పుడు అర్జునునకు ఆవేశించినది యథార్థమైన కృప కాదు. కృపారూపమున వచ్చిన మోహపిశాచము.

పిశాచము పట్టినవాడు స్వాధీనము తప్పి ఎట్లు ప్రేలునో అట్లే ఇచ్చట అర్జునుడుకూడ స్వాధీనము తప్పి, కృపారూపమున వచ్చి ఆవేశించిన మోహపిశాచము ఎట్లు మాట్లాడించిన అట్లు మాట్లాడుచున్నాడు.

కృప ఇతరుల దుఃఖమును జూచి సహించలేకపోవుటతో ఆగదు. వారి దుఃఖమును పోగొట్టుటకును, వారికి హితము చేయుటకును తగిన సామర్థ్యమునిచ్చి, ఆ హితమును చేయుటకు ప్రేరేపించును. ఇది కృపయొక్క లక్షణము.

ఇతరుల దుఃఖములను జూచియో, తనకు రాబోవు కష్టములను నష్టములను తలంచుకొనియో, ఏపనిని చేయలేక, కర్తవ్యవిమూఢుడై, శరీరము జావకారగా, నిలువలేక కూలబడుట కృపకాదు. అది హృదయ దౌర్బల్యము. ఈ హృదయ దౌర్బల్యము అర్జునునకు కలుగుటకు కారణము కృపారూపముతో వచ్చి పట్టుకొనిన మోహపిశాచమే. పిశాచము పట్టిన వాడు తన సహజమైన స్వభావ శక్తి సామర్థ్యములను కోల్పోయి, పిశాచము ఎట్లు మాట్లాడించిన అట్లు మాట్లాడును; ఎట్లు ఆడించిన అట్లు ఆడును. ఇప్పుడు అర్జునుని స్థితి ఇట్లే ఉన్నది.

అంతియే కాని, నిజముగ అర్జునునకు కృపయే ఉన్నచో కృప పనికిరాదని కృష్ణపరమాత్మ ఆక్షేపణ చేయునా ? ఆయనను కృపాసింధువు అని మహాత్ములు చెప్పుచున్నారు; సకల

శాస్త్రములును వాకొనుచున్నవి. అట్టి పరమాత్మ అర్జునునితో
కృపను కాదని ఎందులకు చెప్పెను? అది కృపకాదు కనుకను,
కృపావేషముతో మోహపిశాచము పట్టుకొని ఏడిపించు
చుండుటచేతను, ఆ మోహపిశాచమును పట్టి ఖండించుటయే
ఇప్పుడు కృష్ణపరమాత్మ చేయవలసినది. అయితే, ఇంతపని
ఆయన చేయగలడా అనినచో - అది ఆయనకు ఒక పెద్దపని
కాదు. ఆయన మధుసూదనుడాయె. మధువను రాక్షసుని-
లోకముల నన్నిటిని హాహాకారము లెత్తించిన ఆ ఘోర
రాక్షసుని- గోటితో గిల్లి పారవేసిన కృష్ణునికి ఈ పిశాచము
ఒక లెక్కయా !

అర్జునునకు కలిగిన కృప ఇంకను ఎట్టిదనిన - ఒకనికి చేతి
మీదనో కాలిమీదనో ఒక మహావ్రణము లేచినది. అది
అతి ప్రమాదపరిస్థితికి వచ్చినది. ఇక ఒక గంట తడవైనచో
మిగిలిన శరీరమున కంతకును ప్రాకి ప్రాణమే పోగలప్రమాదము
వాటిల్లగలదు. వెంటనే వైద్యుడు 'ఇక శస్త్రచికిత్స చేసిన
గాని ఇతడు బ్రతుకడు' అని చెప్పి, ఆతని బంధువులను ఒప్పించి,
శస్త్రచికిత్సకై కత్తుల కఠారుల నన్నిటిని పట్టుకొనివచ్చి, తీరా
వ్రణచ్ఛేదనము చేయు సమయమునకు "అయ్యో! ఈతడని
నచో నాకెంతయో కృప. ఈతనిని ఎట్లు కోయగలను, కోయ
లేనండీ ! ఈతని కింత అపకారము ఎట్లు చేయగలను ? ఈతడు
నాకు మిత్రుడు; బంధువుకూడ. ఏమైనను సరియే- నేను కోయ

జాలను. నాకు కాళ్ళు వణకుచున్నవి. శరీరము కంపించుచున్నది. హృదయములో దడపుట్టుచున్నది. నోరెండిపోవుచున్నది. చేతులనుండి కత్తులు జారిపోవుచున్నవి" అనినచో ఏమన వలెను ? అది నిజముగ కృపయగునా ? దాని పేరు కృపకాదు. ఒక రకమైన గుండెజబ్బు. అట్టివాడు వైద్యవృత్తికి పనికి రాడు. అట్లే ఇక్కడను. ధర్మయుద్ధము చేయుటే క్షత్రియులకు స్వధర్మము. అట్టి స్వధర్మమునుండి అర్జునుని విముఖునిగజేసి దుఃఖములో ముంచిన ఆతని ఈ స్థితికి కారణము కృపకాదు - హృదయదౌర్బల్యమే. కనుక, కృష్ణపరమాత్మ ఆ హృదయ దౌర్బల్యరూపమైన వ్యాధికి చికిత్స మొదలుపెట్టినాడు.

ఇతరుల కష్టములను, దుఃఖములను చూచినప్పుడు వాటిని నివారణజేయుటకును, వారికి హితము చేయుటకును తగిన శక్తి సామర్థ్యములను, వివేకమును ఇచ్చి, వాటిని కార్యరూపము లోనికి తెచ్చుటకు ఉత్సాహమునిచ్చి ముందుకు నెట్టునది కృప. కృపారూపమున వచ్చిన మోహమో - తనవారి కష్టములను నష్టములను చూచినప్పుడు హృదయదౌర్బల్యము కలిగించి, అదివరకున్న శక్తిసామర్థ్యములను వివేకమునుకూడ నశింపజేసి పిరికివానినిగనొనర్చి 'అయ్యో! బాబో!' అనిపించి, వెనుకకు పరుగెత్తజేయును. ఈస్థితిలో తగిన సమర్థుడుండి ఉద్ధరించ వలసినదేగాని, తనకు తానై ఎవడును సంబాళించుకొనజాలడు. ఇట్టి స్థితియే ఏర్పడినది అర్జునునకు. ఆ హృదయదౌర్బల్య

మును పోగొట్టుటకు శ్రీకృష్ణపరమాత్మ ఒక ఘనవైద్యుడై ఎదుట నిలబడినాడు. ఆ మోహపిశాచమును సంహరించుటకు ఆ మధుసూదనుడు సుదర్శనాయుధమును చేత ధరించి పాంచజన్యమును పూరించుచున్నాడు. ఇక నీ కుమారులకు విజయ మెక్కడిదయ్యా మహారాజా!" అనుచున్నాడు సంజయుడు.

శ్రీభగవానువాచ :-

శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం
విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య
మకీర్తికర మర్జున !॥ ౨

ప. వి :- కుతః, త్వా, కశ్మలమ్, ఇదమ్, విషమే, సముపస్థితమ్, అనార్యజుష్టమ్, అస్వర్గ్యమ్, అకీర్తికరమ్, అర్జున.

టీక :—

అర్జున ! = ఓ అర్జునా !
అనార్యజుష్టమ్ = అజ్ఞానులచే నవలంబింపబడదగినదియును,
అస్వర్గ్యమ్ = స్వర్గలోక సుఖము నష్టపరచునట్టిదియును,
అకీర్తికరమ్ = అపకీర్తిని కలుగజేయునట్టిదియును అగు,
ఇదమ్ కశ్మలమ్ = ఈ మనోవ్యాకులత (దుఃఖము),

కుతః = ఎందుచేత,

విషమే = అకాలమందు,

త్వా = నిన్ను,

సముపస్థితమ్ = పొందినది ?

శ్రీకృష్ణ పరమాత్మ అనుచున్నాడు -

తా. అర్జునా! ఆర్యులకు తగనిదియును, అధోగతికి త్రోయునదియును, అపకీర్తిని కలిగించునదియును అగు ఈ మోహము ఈ అకాలమున నీకు ఎక్కడనుండి సంప్రాప్తమైన దోయి !

**అ మృ త వా హి ని :–**

'అర్జునా! ఈ కశ్మలము-దిక్కుమాలిన ఈ మోహము-ఎక్కడనుండి దాపురించినదోయి ఈ కాలమున! ఇంతవరకును యుద్ధమున కుఱ్ఱూతలూగి, అందరిలోను వీరరక్తమును పసుగులు వారించి, తీరా యుద్ధరంగమున నిలబడి ఉభయసైన్యములును శస్త్రప్రయోగము చేసికొనబోవు ఈ సమయములో నీకెక్కడ నుండి దాపురించిన దీ పాడు విషాదము!' అని కృష్ణపరమాత్మ పార్థునితో గద్దించి పలికి, మరల ఆశ్చర్యముగా ఇట్లు అడుగుచున్నాడు -

యుద్ధరంగమునకు రాకముందే మొదటనే 'నేను యుద్ధముచేయను' అని చెప్పియుండినయెడల- తప్పో- ఒప్పో-

కొంత సమంజసముగ నుండెడది. నీ పసుగులుచూచి, నీ గర్జనలు చూచి, గాండీవమును పైకెత్తి పలుకు నీ బీరములు చూచి, నీమీాద కొండంత ఆశపెట్టుకొని, వీరందరును రణరంగమునకు వచ్చిన తర్వాత, సమయముకాని సమయములో ఈ బీద అరుపులేమి ? ఈ దుర్యోధనాదులయందు ఇదివరకు లేని ఈ దిక్కుమాలిన దయ ఇప్పుడు అకస్మాత్తుగ ఎక్కడనుండి ఊడిపడినది! సమయమునకును, ప్రదేశమునకును విరుద్ధమైన ఈ దయ ఎందుకోయి ! రణరంగములో జాలికి స్థానమేది ? ఇది నీబోటి ఆర్యునికి తగనిది. అనార్యులు, ధర్మాధర్మములు తెలియని అవివేకులు చేయతగినది. ఇది ధర్మమునకు విరుద్ధమగుటచే అధోగతిపాలుచేయునది. నీ శత్రువులందరును ఏమందురు - 'అర్జునుడు మమ్ములను చూచి భయపడి యుద్ధరంగమునుండి పారిపోయినాడు' అని పలుకుదురు. అది అపకీర్తికాదా ! కనుక ఈ విషాదము అనార్యులకు తగినది. రౌరవాది నరకముల ద్రోయునది. శాశ్వతమైన అపకీర్తిని కలిగించునది. ఇట్టి విషాదము నీకు తగదు. మహారథులలో శ్రేష్ఠుడవు. వీరుడవు. శూరుడవు. పరాక్రమసంపన్నుడవు. అట్టి నీకు, పిరికిపందలకుకూడ తాత్కాలికముగనైనను వీరరసమును పొంగించి పారలింపజేయు ఈ రణరంగమున ఈ రణవాద్యములమధ్య ఈ పాడు విషాదము ఎటుల దాపురించినదో ! దీనిచేత నీకు ఈ లోకమునగాని, పరలోకమునగాని, కించిన్మాత్రముకూడ శ్రేయస్సులేదు

సరిగదా ఫలము దుఃఖము, అధఃపతనము. నీవు ఇంత బుద్ధిశాలివై యుండికూడ ఇప్పు డిట్లు వెఱ్ఱివానివలె ఈ ఏడు పేమి ? ఛీ! లెమ్ము! ధైర్యమును వహింపుము! అరిభయంకర మైన నీ గాండీవమునెత్తి శత్రువుల హృదయములు బ్రద్ద లగునట్లు గుణటంకారము చేయుము. అదిగో! అటు చూడుము - నీ స్థితిచూచి శత్రువు లెట్లు పరిహాసములు పలుకుచు, ఉత్సాహముతో నున్నారో! ఇటు చూడుము - నీ వారందరును ఎట్లు దిగులుపడి కృంగిపోయిరో! లేచి నీ వారికి మరల రక్తము వేడెక్కునట్లు, ఆనందోత్సాహములు పొంగి పొరలునట్లు- ఏదీ! ఒకసారి సింహగర్జనము చేయుము!

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ !
నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరంతప ! ॥ 3

ప. వి :—క్లైబ్యం, మా, స్మ, గమః, పార్థ, న, ఏతత్, త్వయి, ఉప పద్యతే, క్షుద్రమ్, హృదయదౌర్బల్యమ్, త్యక్త్వా, ఉత్తిష్ఠ, పరంతప.

టీక :—

పార్థ ! = ఓ అర్జునా !
క్లైబ్యమ్ = భయమును,

మాస్మగమః = పొందకుము,
త్వయి = నీయందు,
ఏతత్ = ఈమనోవ్యాకులత (దుఃఖము),
న + ఉపపద్యతే = తగదు,
పరంతప! = శత్రువులను తపింపజేయువాడా!
క్షుద్రమ్ = నీచమైన,
హృదయదౌర్బల్యమ్ = హృదయమునందలి దుర్బలత్వమును,
త్యక్త్వా = విడిచి,
ఉత్తిష్ఠ = లెమ్ము! (యుద్ధసన్నద్ధుడవుకమ్ము!)

తా. పిరికితనము వహింపకు మర్జునా! ఇది ఎంతమాత్రమును నీకు తగదు. నీవా శత్రువులను తపింపజేయువాడవు. కనుక, ఈ క్షుద్రమైన హృదయదౌర్బల్యమును విడిచిపెట్టి లెమ్ము!

**అమృత వాహిని :-**

శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని 'పార్థ' అని సంబోధించుటలో గల ప్రాధాన్యమేమన - అర్జునుని తల్లియైన కుంతికి 'పృథ' అని మరొక పేరు గలదు. పృథకుమారుడు కనుక 'పార్థుడు' అని పేరు కలిగినది అర్జునునకు.

నీవు పృథకుమారుడవై యుండికూడ ఇట్టి బీద అరుపులు అరవతగునా! ఆమె వీరమాత అని భావము.

కౌరవులకును పాండవులకును సంధిచేయు నిమిత్తము కృష్ణపరమాత్మ హస్తినాపురమునకు వెళ్ళి, రాయబారము విఫలమైన తదుపరి, మేనత్తయైన కుంతియొద్దకు బోయి 'ఏమత్తా! నీ కుమారులకు ఏమి సందేశమిచ్చెదవు?' అని అడిగినాడు. అప్పుడామె "నా కుమారులు ధర్మము ధర్మ మనుచు, స్వధర్మము నెఱుగక అడవులపాలగుట పనికిరాదు. వారు తమ క్షాత్త్రధర్మమును గుర్తెరిగి, పిరుటు కాన, తమ పరాక్రమమునకు అనుగుణమైన జీవనము చేయవలయునుగాని, శాంతము శాంతమని ఇట్లూరకుండుట తగునా?

రాజులకెందు నారయ పరాక్రమ జీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధమంద్రు మును లుత్తమసత్త్వులు వంశ
ధర్మముల్
పూజితభంగి జేయుదురు, బుద్ధివిహీనులు వాని దక్కని
స్తేజపు గూటి కియ్యకొని దీనతబొందుదు రంబుజోదరా!॥

నిజవంశోచిత వీరవృత్తమున కున్మేషంబుగా నా కపి
ధ్వజు డుత్సాహము సేయకున్న నకటా! దైన్యంబు
వాటిల్లదే!
భుజదర్పోద్ధతుడైన భీమునకు నీ పొందొప్పునే! నీవు స
ర్వ జగన్మాన్యుడ వెందు రాదగునె! దైవం బిట్లు
తప్పించునే!॥
(మహాభారతము - ఉద్యో)

అని ఈ విధముగ యుద్ధమునకు పురికొల్పిన వీరమాత యొక్క కుమారుడవే! ఇట్లు పలుకుట తగునా ? అని గుర్తు చేయుటకు 'పార్థా' అని సంబోధన చేసినాడు.

క్లైబ్యమ్ అనగా నపుంసకత్వము అని అర్థము. పిరికితన మని భావార్థము. ఈ క్లైబ్య శబ్దమును ప్రయోగించి అర్జును నకు వెనుక జరిగిన సంఘటనను జ్ఞాపకము చేయుచున్నాడు కృష్ణపరమాత్మ.

ఊర్వశి యొక్క శాపవశమున అర్జునుడు అజ్ఞాతవాస సమయమున ఒక సంవత్సరము నపుంసకత్వము కలిగి, బృహ న్నల వేషముతో విరటుని కుమార్తెయైన ఉత్తరకు సంగీతము, నాట్యము నేర్పెను.

అర్జునునకు శాపకారణ మేమనగా -

పాండవులు అరణ్యవాసము చేయుసమయమున ఒకతరి ఇంద్రుని పంపున మాతలి ఇంద్రుని రథమును తోలుకొని భూలోకమునకు వచ్చి, అర్జునుని స్వర్గలోకమునకు తీసికొని పోయెను. అప్పు డింద్రుడు పార్థుని తనసింహాసనమున తనతో పాటు కూర్చుండబెట్టుకొని గౌరవించి, కొంతకాలము తన లోకమున ఉంచుకొనెను. అప్పుడు అర్జునుడు సమస్తమైన మహాస్త్రములు సంపాదించెను. ఆ దినములలో ఊర్వశి అర్జునుని కామించి, మోహించి, ఇంద్రుని ఆజ్ఞమీద సమస్తాలంకార

భూషితయై వచ్చి, తన మనోరథమును తెలిపికొనగా, ఇంద్రియ నిగ్రహము కలవారిలో ఋషులకన్నను అధికుడైన అర్జునుడు 'తల్లీ!' యని సంబోధన చేసి, ఆమె కోరిక నెర వేర్చుట కియ్యకొనలేదు. అంత ఆమె అనేకవిధముల వేడి వేడి, చివరకు నిరాశ చెంది 'నీవు భూలోకములో నపుంసకుడవై స్త్రీలమధ్య తిరుగుచుందువుగాక!' అని శపించినది. అది విని దేవేంద్రుడు అర్జునుని ఇంద్రియనిగ్రహమునకు అత్యాశ్చర్య మును, అపరిమితానందమును పొంది, ఆ శాపమును అర్జునునకు అనుకూలముగ మార్చుచు, 'అర్జునా! ఊర్వశి ఇచ్చిన శాపము తప్పదు. కాని, నీ అజ్ఞాతవాస సమయములో ఈ నపుంసకత్వ మును పొంది బృహన్నలరూపముతో స్త్రీలకు సంగీతము, నాట్యము చెప్పుచు, నీజాడ ఒరులకు తెలియకుండ నుండి, అజ్ఞాతవాసము పూర్తికాగనే మరల శాపవిముక్తిని పొందె దవుగాక!' అని పలికెను. అట్లే అజ్ఞాతవాస సమయములో అర్జునున కా శాపము ఉపకరించెను.

అజ్ఞాతవాససమయములో విరటునివద్ద పాండవులందరును మారురూపములతో దాగి పనులు చేయుచుండిరి. అర్జునుడు బృహన్నల రూపముతో ఉత్తరకు సంగీతమును, నాట్యమును నేర్పుచుండెను. ఆ సమయమున ఒకసారి కౌరవులు 'పాండవులు ఇక్కడ ఉండవచ్చును' అని పడికట్టి, 'మనము విరటుని మీదికి దండెత్తి పోయినచో అచ్చట పాండవులున్న

చెందిరి, వారు వీరులు గావున, అతనికి సహాయము రాకుండ నుందురా!' అను ఆశతో చతురంగబలసమేతులై వెళ్ళిరి. అంతకుముందే కౌరవుల పంపున విరటుని పట్టణము మీదికి దక్షిణపువైపున సుశర్మ చతురంగబలములతో ముట్టడి చేయు చుండె, విరటుడు సర్వసైన్యమును తీసికొని అతని మీదకు యుద్ధమునకు బోవుచు, పట్టణమును రక్షించుటకు తనకుమారుడైన ఉత్తరుని మాత్ర ముంచి, ధర్మజుని కోరికమీద భీమ, నకుల, సహదేవులను గూడ, వారి మారురూపములతో తీసికొని వెళ్ళినాడు. అది అట్లుండ, ఇప్పుడు ఈ వైపునుండి కౌరవులు భీష్మ ద్రోణాది మహావీరులందరితో చతురంగ బల సమేతులై వచ్చి ముట్టడించి, గోధనములను తోలుకొని పోసాగిరి. సేవకులవలన ఈసమాచారమువిని, ఉత్తరుడు ఉండి పోవుచు, 'నాకు తగిన సారథియున్నచో, కౌరవవీరుల పీచ మణంచనే! భీష్ముడన నెంత! ద్రోణుడెంత! కర్ణుడెంత! దుర్యోధనుడెంత!' అనుచు చిందులు త్రొక్కుచుండ, చివరకు అతనిని ఒప్పించి,బృహన్నల సారథ్యమునకు వచ్చెను. బృహన్నల సారథ్యము చేయగా ఉత్తరుడు రణరంగమునకు వెడలెను. రథము వాయువేగమున తోలుచున్నాడు బృహన్నల. కనుచూపుమేరలో కౌరవసేనాసాగరము ఘోషించుచు కనుపించు చున్నది. చూచునప్పటికి ఉత్తరునకు అపరిమితమైన భయము కలిగినది. 'బృహన్నలా! రథము ఆపుము! ముందుకు పోనీయకుము! ఇంటివైపునకు మరల్పుము. ఈ యుద్ధము

నేను సేయలేను. భీష్మాదులెక్కడ! నేనెక్కడ!' అని వేడుకొనసాగెను. కాని రథము అపుటలేదు బృహన్నల. చివరకు ఉత్తరుడు ప్రాణభీతి మిక్కుటముకాగా, రథమునుండి దూకి పరుగుతీయ ప్రారంభించెను. ఏమిచేయును బృహన్నల! యుద్ధరంగమునకు వచ్చిన తరువాత యుద్ధము చేయునని పారిపోవుట తగునా? మరి ఉత్తరుడు పారిపోవుచున్నాడు. ఏమి చేయవలె? ఏమి చెప్పుటకును అవకాశములేదు. అతడు వినునట్లులేడు. నిలబడినగదా చెప్పుట, అతడు వినుట జరుగుటకు! ఒక్కటే పరుగాయె! ఇక లాభము లేదని బృహన్నల రథమునుండి దూకి, పరుగెత్తి, నూరు అడుగులలో ఉత్తరుని జుట్టు పట్టుకొని ఆపి, రథము మీద బలవంతముగ కూర్చుండబెట్టి, నిర్బంధముగ తీసికొనిపోయినాడు. ఉత్తరుడు ఎంత గోలచేసినను వినలేదు. 'నేను రాజకుమారుడను గదా! నా ఆజ్ఞ పాలించవా?' అని ఉత్తరుడు. 'రాజకుమారుడైతే యుద్ధమున పారిపోవుదురా!' అని బృహన్నల. ఏమి చేయవలె ఉత్తరుడు! చేయునదిలేక ఊరుకొనినాడు. చివరకు ఈ బృహన్నలను అర్జునునిగా తెలిసికొని గుండె దిటవు చేసికొని, యుద్ధమునకు పోవుటకు సమ్మతించి ఉత్తరుడు సారథ్యము చేయగా, అర్జునుడు ఒక్కడు కౌరవ వీరుల నందరను జయించి, విజయము సాధించి, తిరిగి పట్టణమునకు పోవుట జరిగెను. ఇది చరిత్ర.

వీని నంతను ఉద్దేశించుకొని క్లైబ్యశబ్దముతో "నీవు నపుంసకుడవుగ నున్నప్పుడే వీర్యశౌర్యము లుల్లసిల్లగ కౌరవసైన్యము నంతను ఒక్కరుడవు జయించితివే! ఇప్పుడు ఆ నపుంసకత్వము లేదు కదా! శాపవిముక్తి కలిగినది కదా! అప్పుడే లేని ఈ పిరికితనము ఇప్పుడెందులకు?" అను భావమును సూచించినాడు.

ఇంకొకటి - "యుద్ధము చేయనని పారిపోవు ఉత్తరుని పోనివ్వక నీవు ఊరకుంటివా? అతనికి నచ్చనైన చెప్పకుండ రథమునకు కట్టి బలవంతముగ తీసికొనిపోయితివే! అట్లు పారిపోవచ్చునాయని నీతులు, ధర్మములు పలికితివే! ఇప్పుడు నిన్ను ఏమిచేయవలె? నీది ధర్మమా" అని ఎత్తిపొడుపుగ మాట్లాడినాడు.

"అర్జునా! ఈ పిరికితనము మహావీరుడవైన నీకు తగదు. నీవు శత్రువులను తపింపచేయువాడవు. నీపేరు తలంచినమాత్రముననే శత్రువులకు సింహస్వప్నము. అట్టి నీకు అల్పమైన ఈ హృదయదౌర్బల్యమేమి? పనికిరాదు. లెమ్ము! యుద్ధమునకు సంసిద్ధుడవై గాండీవమును సారించుము" అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని హెచ్చరించుట ధ్వనించుచున్నది 'పరంతప' యను పదములో.

అవతారిక :—

యుద్ధము చేయననుటకు తనకు ఎన్ని కారణములు కనబడినవో, అన్ని కారణములను చెప్పినాడు అర్జునుడు. ఈ చెప్పిన కారణములను, యుక్తులను కృష్ణపరమాత్మ విని, తనను పిరికివాడనియును, ఇప్పుడు యుద్ధము చేయనని చెప్పుట తగదనియును, తెలిసినవాడెవడును యుద్ధము చేయనని అనడనియును, ఇది అజ్ఞానుల లక్షణమనియును, అపకీర్తికరమనియును, అధోగతికి త్రోయునది అనియును చెప్పి ఖండించినాడు. అయితే ఇప్పుడేమిచేయవలయును అని ఆలోచించి యుద్ధము చేయుట ఉచితముకాదేమో అని రెండుశ్లోకములలో చెప్పుచున్నాడు అర్జునుడు.

అర్జున ఉవాచ :—

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే
ద్రోణంచ మధుసూదన !
ఇషుభిః ప్రతియోత్స్యామి
పూజార్హా వరిసూదన ! ౪

ప. వి :—కథం, భీష్మం, అహం, సంఖ్యే, ద్రోణం, చ, మధుసూదన, ఇషుభిః, ప్రతియోత్స్యామి, పూజార్హౌ, అరిసూదన.

టీక :-

అరిసూదన = శత్రువులను చంపునట్టి,
మధుసూదన ! = ఓ కృష్ణా !
పూజార్హౌ = పూజింపబడదగినవారలైన,
భీష్మం = (నాకు తాతయగు) భీష్మాచార్యులను,
ద్రోణం చ = (అస్త్రగురువైన) ద్రోణాచార్యులను,
సంఖ్యే = యుద్ధమున,
అహం = నేను,
ఇషుభిః = బాణములతో,
కథం = ఎట్లు,
ప్రతియోత్స్యామి = ఎదిరించి యుద్ధము చేయగలను ?

తా. అర్జునుడిట్లనుచున్నాడు - ఓ మధుసూదనా ! రణరంగములో భీష్ముని, ద్రోణుని, ఎట్లు నేను బాణములతో ఎదిరించి యుద్ధముచేయగలను ? అరిసూదనా ! వారిద్దరును నాకు పూజనీయులుగదా !

అమృతవాహిని :-

"ఓ మధుసూదనా ! అరిసూదనా ! భీష్ముడు నాకు ప్రియమైన తాతగారు. ఆయనకు నేను ప్రియమైన మనుమడను. చిన్నతనమున ఎత్తుకొని లాలించి, ప్రేమతో పెంచినవాడు. కొంచెము పెద్దవాడనయినతరువాత విద్యాబుద్ధులు చెప్పి, శస్త్రాస్త్రవిద్యకూడ నేర్పినాడు. అందుచేత గురువుకూడ అయి

నాడు. ఈ కారణమున రెండువిధముల పూజనీయుడేకదా !

ఇక ద్రోణుడు కులమున బ్రాహ్మణుడు. నన్ను ధనుర్విద్యలో పారంగతునిగ చేసిన గురూత్తముడు. ఇంతమాత్రమే కాక, శిష్యులందరిలోను నాయందు ఎక్కువ మక్కువతో చివరకు తన కుమారుడైన అశ్వత్థామకుకూడ చెప్పనిరహస్యములన్నియును నాకు చెప్పినాడు. కాబట్టి ఈయనకూడ రెండు విధములను పూజనీయుడేగదా !

వీరి విషయమున కటువచనములను ప్రయోగించుటయే మహాపాతకముగ తలచెడి నేను ఇక బాణములు ప్రయోగించియా యుద్ధము చేయుట ! ఎట్లు పోరాడగలను ? ఇంత పాపకర్మలో నీవే ఎట్లు ప్రవేశింపచేయుచున్నావు కృష్ణా ! వీరు పూజనీయులగుటచే పుష్పములతో పాదపూజలు చేయవలయునేగాని, బాణములతో కొట్టి ఎట్లు బాధించగలనయ్యా ! నీవు మధుసూదనుడవు. మధువనువాడు రాక్షసుడు గనుక సంహరించితివి. అరిసూదనుడవు. శత్రువులను సంహరించితివి. ఇప్పుడు వీరిద్దరును రాక్షసులుగారు; నాకు శత్రువులునుకారు. ఇట్టి వీరితో యుద్ధముచేయుటకు నన్నెందులకు ప్రేరేపించుచున్నావు ? నీవు మధుసూదనుడవు, అరిసూదనుడవుగాని, బంధుసూదనుడవును, ప్రియసూదనుడవును కావుగదా ! ఏల నన్నిట్లు బంధుసూదనునిగను, ప్రియసూదనునిగను చేయదలచుకొనినావు ? నాకర్థమగుటలేదు కృష్ణా !"

ఇక్కడ, "అర్జునుడు ఈ చిన్న శ్లోకములో కృష్ణుని గూర్చి రెండు సంబోధనలు చేసి యున్నాడు. అపార దుఃఖము చేత పదసౌష్ఠవము తప్పెను. అర్జునుని మనస్సు భరించలేని కలవరము చెంది యున్నదని దీనినిబట్టి తెలియవలెను" అని ఒకరు వ్రాసియున్నారు. కాని "అర్జునుని మనస్సు బాగుగా కలవరపడి యున్నది. దుఃఖము చేత స్థితితప్పి యున్నది" అనుటకు ఇదిమాత్రము కారణము కాదు. ఒక చిన్న శ్లోకములో రెండు సంబోధనలు చేయుటచేతనే ఇట్లు నిర్ణయించెడి పక్షమున ఆ స్థితినే శ్రీకృష్ణపరమాత్మకు కూడ అంటగట్టవలసి వచ్చును. ఏలయనగా, ఈ శ్లోకమునకు పూర్వశ్లోకముననే, శ్రీకృష్ణుడుకూడ అర్జునుని 'పార్థ' 'పరంతప' యని ఒకే శ్లోకములో రెండు పర్యాయములు సంబోధించియున్నాడు. అయితే కృష్ణునకు కూడ మనస్సు కలవరపడి యున్నదనియు, ఆ దుఃఖముచేత పదసౌష్ఠవము తప్పినదనియు నిర్ణయించ వచ్చునా ? అట్లు నిర్ణయించగలిగియెడల ఇక మనము గీతకు విలువ ఈయవలసిన పనియే ఉండదు. కనుక ఆ అభిప్రాయము అంత సమంజసముగ లేదని అమృతవాహిని అభిప్రాయము.

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే ।
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥ ౫

ప. వి :— గురూన్, అహత్వా, హి, మహానుభావాన్, శ్రేయః, భోక్తుం, భైక్ష్యం, అపి, ఇహ, లోకే, హత్వా, అర్థ కామాన్, తు, గురూన్, ఇహ, ఏవ, భుంజీయ, భోగాన్, రుధిర ప్రదిగ్ధాన్.

టీక :—

మహానుభావాన్ = మహాత్ములైన,
గురూన్ = ఆచార్యులను,
అహత్వా = చంపక,
ఇహలోకే = ఈ ప్రపంచమునందు,
భోక్తుం = అనుభవించుటకు,
భైక్ష్యమపి = భిక్షాన్నమైనను,
శ్రేయః = మేలు;
గురూన్ = ఆచార్యులను,
హత్వాతు = చంపినయెడల,
ఇహైవ = ఇక్కడనే (ఈ జన్మములోనే),
రుధిర ప్రదిగ్ధాన్ = రక్తముచే పూయబడినవియును,
అర్థకామాన్ = అర్థకామరూపములునగు,
భోగాన్ = భోగములను,
భుంజీయ = భుజించువాడనగుదును.

తా. మహానుభావులగు గురుజనులను వధించక, భిక్షాన్నమును భుజించుట యైనను నాకు శ్రేయస్కరమే కాగలదు. అంతియకాని,



వారినిచంపినయెడల, వారి నెత్తుటిలో పూయబడిన భోగములను అనుభవించవలసి యుండును గదా!

అమృతవాహిని :-

"కృష్ణా! మహానుభావులైన గురుజనులను చంపుటయా! దుర్యోధనుని సైన్యములో ద్రోణాచార్యులు, మొదలైన ఆచార్యులను చూడుము! వారు నామీద ఎంతయో వాత్సల్యము కలవారై, ధనుర్విద్యాపారంగతుని జేసిరి. బాహ్లీకుడు, భీష్ముడు, సోమదత్తుడు, భూరిశ్రవుడు, శల్యుడు మొదలగు గురుజనులు ఎంతమందియో ఉన్నారు. అందరును కూడ ఉదారమైన, ఉత్కృష్టమైన భావములు కలవారు; శ్రేష్ఠులు. నాకు అన్నివిధముల పూజనీయులు. ఇట్టివారిని యుద్ధములో చంపి వీరినెత్తుటితో సంపాదించబడిన - వీరినెత్తుటితో పూయబడిన - ఈ నెత్తురు కూటిని తినుటకంటె, సుఖముగ పరమపవిత్రమైన భిక్షాన్నమును భుజించి బ్రతుకుట అన్నివిధముల నాకు శ్రేయస్కరమని తోచుచున్నది.

క్షత్రియులకు భిక్షాన్నజీవనము నింద్యమని అనినప్పటికిని ఇటువంటి పూజనీయులైన గురుజనులను వధించి రాజ్యభోగములననుభవించుటకంటె, ఈ భిక్షాన్నజీవనమే శ్రేయస్కరము. క్షత్రియులకు భిక్షాన్నభోజనము పరధర్మమని అఖి

ప్రాయమా ? ఆపద్ధర్మము ప్రకారము ఇట్టిస్థితిలో భిక్షాన్నము శ్రేయస్కరమే కాగలదు. లాక్షాగృహము నుండి తప్పించుకొనినప్పుడు మేము భిక్షావృత్తి తోడనేగదా జీవించినది ! అజ్ఞాతవాసకాలమున విరటుని కొల్వున అతినీచమైన సేవకావృత్తిచేతనే జీవించితిమే ! ఆపద్ధర్మము ప్రకారము అవి అన్నియును ధర్మములు కాలేదా ? ఇప్పుడన్ననో - ఇంతకంటె ఆపద ఏమి కావలయును ? కనుక ఇంతమంది బంధువులను, ప్రియమిత్రులను, గురువులను చంపి రాజ్యము చేయుటకంటె భిక్షాన్నమే ధర్మమైనదియును, సుఖమైనదియునుకూడ.

ఈ గురుజనులను వధించుటచే కలుగు లాభమేమి ? ముక్తి లభించునా ? లేదు. ధర్మమాచరించినట్లగునా ? కాదు. గురుజనులను వధించుటచేత ముక్తి దొరకులేమి ? ఇది ధర్మమగులేమి ? లోకములో కీర్తియా ? 'క్షణికమైన రాజ్యముయొక్క లోభముచేత ధర్మమాలోచింపక, దయాదాక్షిణ్యాదులులేక, కటికవానివలె గురుజనులను, బంధువులను వధించి రక్తము ప్రవహింపజేసిన దురాత్ముడు' అని ఆచంద్రార్కముగ అపకీర్తి నిలిచిపోదా ? ఇక లభించునది తుచ్ఛమైనవియు, ఈనాడుండి రేపు పోవునవియునగు కామభోగములు. ఇంతియే కదా ! యథార్థమాలోచించిన మహామూల్యమైన గురుజనుల జీవనముముందు, ఈ రాజ్యభోగములు ఒక విలువగలిగినవా ? పైగా ఈ రాజ్యభోగములు

గురుజనులను వధించుటచేతకలిగినవగుటవలన వారిరక్తముతో తడిసినవి, మహాపాపమయములు. కనుక ఇట్టి తుచ్ఛభోగముల కొరకు గురుజనులను వధించుట నాకు ఉచితముగ తోచుట లేదు."

కొంతమంది 'అర్థకామాంస్తు, గురూన్' రెండును కలిపి, 'గురూన్' పదమునకు 'అర్థకామాన్' విశేషణముగ భావించి 'అర్థకామాసక్తులైన గురువులను' అని అర్థము చెప్పి, 'గురువులు ఎంత అర్థకామాసక్తులైనప్పటికిని చంపుట ధర్మము కాదు' అని అర్థము చెప్పినారు. అట్లు చెప్పరాదు. ఎందులకనగా ఈ శ్లోకములోనే పూర్వభాగమున 'మహానుభావాన్', అను విశేషణమును వాడియున్నాడు. 'మహానుభావాన్' 'అర్థకామాన్'- ఈ రెండును పరస్పర విరుద్ధములు. అర్థకామాసక్తులైనవారు మహానుభావులు కారు. మహానుభావులైన వారు అర్థకామాసక్తులు కారు. అర్జునుడు ఈ రెండు విశేషణములను 'గురూన్' అన్నపదమునకు వాడడు. కనుక, 'అర్థకామాన్' అన్నపదము 'గురూన్' అన్నదానికి విశేషణమని తలంచుట చాల భ్రమమూలకము.

అయితే కొంతమంది పండితులు 'అర్థకామాన్' అనగా అర్థాన్ - ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములు, వీటిని 'కామాన్' = కోరువారు. ఎవరికొరకు ? శిష్యుల కొరకు, కాని 'అర్థకామాన్' అనునది 'గురూన్' శబ్దమునకు విశేషణము అని అనుచున్నారు (శంకరానందులు). శబ్దములో

ఆ అర్థము తీయవచ్చునా ? తీయుటకు వీలున్నదా, లేదా అనినచో, ఉన్నదని ఒప్పుకొనవచ్చును. కాని ఇక్కడ ఈ సందర్భములో అది విరిచి అర్థముతీయుటే అగుచున్నది. సహజముగా వచ్చిన అర్థము ప్రకరణమునకు విరుద్ధమైనచో, అప్పుడు మిగిలిన ఏ పద్ధతిగనైనను అర్థముతీసి సరిపెట్టుకొనుటకు ప్రయత్నించవచ్చునుగాని, ఆవశ్యకము లేనప్పుడును సహజమైన అర్థము సరిపోవునప్పుడును ఇంకొకవిధముగ అర్థముతీయరాదు. అట్లు తీసినయెడల భాషలో తమకున్న ప్రావీణ్యము కనపడవచ్చునేగాని, వక్తయొక్క భావము బయటపడదు. కనుక ఇక్కడ 'అర్థకామాన్' అనగా అర్థకామరూపములైన 'భోగాన్' భోగములు అని అర్థము చెప్పుటయే సమంజసము. అర్థకామరూపములైన ఈ భోగములు రుధిరప్రయుక్తములు. 'రుధిర ప్రదిగ్ధాన్' 'అర్థకామాన్' అను రెండును 'భోగాన్' అనుదానికి విశేషణములు.

ఇంకొకటి - 'అర్థకామాన్' అనునది 'గురూన్' కు విశేషణమే అనుచు 'అర్థకామాసక్తులైన గురువులు' అని అర్థముతీయువారు ఎట్లు సమర్థించుచున్నారనగా :

భీష్ముడు ధర్మరాజుతో "అర్థస్య పురుషో దాసః - దాసస్త్వర్థో న కస్యచిత్ । ఇతి సత్యం మహారాజ - బద్ధస్త్వర్థేన కౌరవైః" అని యుద్ధమునకు పూర్వము చెప్పియున్నాడు.

అనగా 'మానవుడు అర్థమునకు దాసుడు. అర్థము ఎవరికిని దాసకాదు. ఓ ధర్మరాజా ! మేము అర్థముచేత దుర్యోధనాదులకు కట్టుబడియున్నాము. ఇది సత్యము' అని వారలే చెప్పియున్నారు. వారు అనినదానినే అర్జునుడు ఇక్కడ 'అర్థకామాన్ గురూన్' అని ప్రయోగించినాడు. తప్పు అని వారి సమర్థనము.

నిజమే - భీష్మద్రోణులు అట్లు చెప్పినది నిజమే. వీరనుకొనినట్లు వారిది దుష్టస్వార్థముకాదు. కారణాంతరములచేత అటుండవలసివచ్చినది కాని, పాండవులయందే వారికి పూర్తిగ అభిమానము గలదు. వారు జయించవలయుననియే ఆకాంక్ష. వారు జయించుటకు తగినసాహాయ్యమంతయును - ఎంతవరకు చేయుటకు వీలుకలదో అంతవరకును - చేసియే ఉన్నారు. భీష్ముడు కేవలము దుష్టస్వార్థపరుడే అయినచో తండ్రి కొరకు అట్లు భీషణప్రతిజ్ఞ దాల్చి, జీవితమంతయును అస్ఖలిత బ్రహ్మచర్యముతో, రాజ్యమునుకూడ పరిత్యజించి, పవిత్ర జీవితమును గడుపగలడా ? యయాతివలె ఇక్కడ తండ్రి బలవంతమేమైన నున్నదా ? తండ్రి కొరకనియే తెలిసి, తండ్రి సుఖము కొరకు తాను ఏమి వదలిపెట్టకపోయిన సామాన్య ధర్మములో దోషము లేదో దానిని, విశేషధర్మమును దృష్టిలో నుంచుకొని తృణప్రాయముగ తండ్రికొరకు త్యజించగలిగిన మహాధీరుడు. తరువాత కూడ-అనగా యుద్ధములో పడిపోయిన

తరువాతకూడ - లోకమునకు కావలసిన ఐహికపారమార్థిక ధర్మములన్నిటిని బోధించి, ధర్మమును నిలుపుటకు తగినవాడని ఎంచియేగదా కృష్ణపరమాత్మ భీష్మునిద్వారా, ధర్మరాజును నిమిత్తమాత్రునిగజేసి ధర్మములను వ్యాపింపచేయించినది ! మహర్షులుకూడ భీష్మునివద్ద ధర్మములు వినినట్లు భారతమున కలదు. అట్టి మహనీయుడు దుష్టస్వార్థపరుడని ఎట్లు అన గలము ? వారు అర్థకామాసక్తులు కారు. అయితే, వార లట్లు అనుట సహజము, సమంజసముకూడ. పాండవులమీది ప్రేమ వలన, 'అయ్యో ! వీరికి సాహాయ్యము చేయజాలకపోతిమే' అను విచారమువలన, తమ ఆందోళనను తెలుపుకొనుటలో వచ్చిన నైచ్యానుసంధానమేగాని వేరుకాదు. కనుక, వారలను గురించి వారు, ఒక పరిస్థితికి విచారము కలిగి చేసికొనిన నైచ్యానుసంధానమును, ఎట్లు ఉన్నదానిని అట్లే అర్థముతీసి, బోను ఎక్కిన వానిని న్యాయస్థానములో ప్రతిపక్ష న్యాయ వాది ప్రశ్నించినట్లు చేయరాదు.

విశిష్టాద్వైత సంప్రదాయములో శ్రీమద్రామాను జుల పరమగురువు యామునాచార్యులవారు పరమాత్మ సన్నిధిలో ప్రార్థించుకొనుచు 'అమర్యాదః, క్షుద్రః, దుర్మానీ' ఇత్యాదిగా తమను గూర్చి చెప్పికొనినారు. అయితే, తమంత తామే అట్లు చెప్పికొనినప్పుడు, అది అబద్ధ మెట్లగును? కనుక యామునాచార్యులవారు అమర్యాదులు, క్షుద్రులు

అని నిర్ణయము చేయుదుమా ? చేయము; చేయరాదు. అట్లే ఇచ్చటను. ఏది ఎట్లున్నను, అర్జునుడు మాత్రము భీష్మాదు మొదలగువారిని "అర్థకామాసక్తులు" అనియైన అనవలయును; లేక "మహానుభావులు" అనియైన అనవలయును. అంతియేకాని పరస్పరవిరుద్ధములైన ఈ విశేషణముల రెంటిని ఒకసారిగా అనడు అని అమృతవాహిని సిద్ధాంతము.

శ్లో॥ నచైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ ౬

ప. వి :—న, చ, ఏతత్, విద్మః, కతరత్, నః, గరీయః, యత్, వా, జయేమ, యది, వా, నః, జయేయుః, యాన్, ఏవ, హత్వా, న, జిజీవిషామః, తే, అవస్థితాః, ప్రముఖే, ధార్తరాష్ట్రాః.

టీక :—

యాన్ = ఎవరిని,
హత్వా = చంపి,
నజిజీవిషామః = జీవించుటకు కోరనే కోరమో,
తే ధార్తరాష్ట్రాః = అట్టిధృతరాష్ట్ర సంబంధులగు భీష్మాదులు,

ప్రముఖే = ఎదుట,
అవస్థితాః = ఉన్నారు,
వయం = మనము,
జయేమ, యత్, వా = జయింతుమో;
నః = మనలను,
జయేయుః, యది, వా = (వారే) జయింతురో,
నః = మనకు,
కతరత్ = ఏది,
గరీయః = శ్రేయోదాయకమైనదో,
ఏతత్ చ = ఈ విషయమునుకూడ,
నవిద్మః = తెలిసికొనజాలము.

తా. మనము యుద్ధము చేయుటయా ? చేయకపోవుటయా ? ఈ రెంటిలో ఏది శ్రేష్ఠము ? వారిని మనమే జయింతుమో ; మనలను వారే జయింతురో ; తెలియకున్నది. ఎవరిని చంపిన తరువాత మనము జీవించ జాలమో, అనగా జీవించుటకు కూడ కోరమో, అట్టి ధార్తరాష్ట్రులు మన కెదుట నిలబడే యున్నారు.

అమృతవాహిని :-

యుద్ధము చేయుటయా, మానుటయా, అను విషయము నిర్ణయించుకొనలేకపోవుచున్నాడు అర్జునుడు. "కృష్ణా! ఈ రెంటిలో ఏది శ్రేయస్కరము ? యుద్ధము చేయుట క్షత్రియధర్మముగ తెలియుచున్నది. కాబట్టి యుద్ధముచేయక

పోయిన, స్వధర్మమును పాలించని దోషము వచ్చునేమో! యుద్ధము చేసినయెడల కులనాశనము కలుగును. దానిచే, కుల ధర్మములు నశించును. దానిచేత కలిగెడి విషమపరిణామము కన్నులకు గోచరించుచున్నది. కనుక కులనాశనము చేసిన మహాదోషము ననుభవించవలసివచ్చునేమో! పోనీ, యుద్ధము చేయుదమనుకొన్నను, జయాపజయము లెవ్వ రెరుగుదురు ? వారిని మనమే జయించెదమో, మనలను వారే జయించెదరో ఎవరు చెప్పగలరు ? పోనీ మనమే జయించెద మనుకొనినను, రణరంగములో ఈ ఎదుట నిల బడినది కూడ ఎవరో చూచితివా ? ఎవరిని చంపినయెడల మనము జీవింపజాలమో, అట్టి బంధువులు, ఆత్మీయులునైన ధార్తరాష్ట్రులు. కనుక యుద్ధమున మనకే జయము కలుగు ననుకొన్నను, ధార్తరాష్ట్రులను చంపకుండ ఆ విజయము రాదుగదా ! కనుక కృష్ణా! నేను ఏమి చేయవలయునో నిర్ణ యము చేసికొనలేకపోవుచున్నాను."

మొదటి అధ్యాయములో యుద్ధము చేయుట మంచిది కాదనిచెప్పి, దానికి అనేక కారణములు చూపించి, చివరకు 'యుద్ధము చేయను' అని రథము మీద చతికిలబడిన అర్జునుడు, ఇప్పుడు, రెండు శ్లోకములలో కృష్ణపరమాత్మ ఆక్షేపించు నప్పటికి ఇక చెప్పుటకు ఏమియులేక 'యుద్ధము చేయుటయా? మానుటయా? ఏది శ్రేయస్కరమో నిర్ణయము చేసికొనలేక పోవుచున్నాను.' అని అడుగుటలోనికి దిగినాడు.

**అవతారిక :-**

ఇక తనంతటతానేమియు నిర్ణయించుకొనలేక, ఇప్పుడు తాను ఏమిచేయవలయునో, తనకు ఏదిచేసిన శ్రేయస్కరమో, నిర్ణయించి చెప్పవలసినదిగా కృష్ణునికి శరణాగతి చేయు చున్నాడు.

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

ప. వి :—కార్పణ్యదోషోపహతస్వభావః, పృచ్ఛామి, త్వాం, ధర్మసమ్మూఢచేతాః, యత్, శ్రేయః, స్యాత్, నిశ్చితం, బ్రూహి, తత్, మే, శిష్యః, తే, అహం, శాధి, మాం, త్వాం, ప్రపన్నమ్.

టీక :—

కార్పణ్యదోషోపహతస్వభావః = కార్పణ్యమను దోషముచే చెడిన మనసు గలవాడనై,

ధర్మసమ్మూఢచేతాః = ధర్మాధర్మములు తెలియని మనస్సు గలవాడనై,

త్వాం = నిన్ను,
పృచ్ఛామి = అడుగుచున్నాను,
యత్ = ఏది,
నిశ్చితం = నిశ్చయమైన,
శ్రేయః = మేలు,
మే = నాకు,
స్యాత్ = అగునో,
తత్ = దానిని,
బ్రూహి = చెప్పుము
తే = నీకు,
(అహం = నేను)
శిష్యః = శిష్యుడను,
త్వాం = నిన్ను,
ప్రపన్నం = శరణుపొందిన,
మాం = నన్ను,
శాధి = శాసించుము.

తా. కృష్ణా! కార్పణ్యదోషముచేత నా స్వభావము చెదరగొట్టబడినది. ఆ కారణమున ధర్మాధర్మనిర్ణయము చేయలేని మూఢత్వము చెందినది నా బుద్ధి. కనుక నిన్ను అడుగుచున్నాను. నాకు ఏది శ్రేయస్కరమో, దానినినీవే నిర్ణయించి చెప్పుము. నీకు శిష్యుడను. నీకు శరణాగతి చేసితిని. నన్ను శాసించుము.

అ మృ త వా హి ని :—

"ఓ కృష్ణా ! కార్పణ్యదోషము నా స్వభావమును చెదరగొట్టినది. అందుచేత కర్తవ్యాకర్తవ్య నిర్ణయము చేసికొనలేకుండ నున్నాను. ఏది ధర్మమో, ఏది అధర్మమో తెలియకున్నది" అనినాడు అర్జునుడు.

అయితే, ఇప్పుడు అర్జునునకు పట్టిన కార్పణ్యదోష మేమి ? 'కార్పణ్యము' అనగా కృపణుని లక్షణము. కార్ప ణ్యము కలవాడు కృపణుడు. కృపణశబ్దమునకు అనేక అర్థ ములు కలవు. వాటిని విచారించుదము.

కృపణుడు - లోభి; ఒకనివద్ద అపారమైన ధన ముండును. కాని అవసరమైనప్పుడుకూడ, ఒక దమ్మిడీ దానము చేయుటగాని,తాను అనుభవించుటగాని, అతనికి ఎంత మాత్రమును ఇష్టముండదు. ప్రతిదినము పెట్టెమూత తెరచి ఆ ధనమును చూచుకొనుచు, 'ఎంత వడ్డీ వచ్చుచున్నది ? ఎంత ఫలసాయము వచ్చుచున్నది ? దీని మీద సంవత్సరమున కెంతలాభము వచ్చుచున్నది ?' అని లెక్కలు చూచుకొనుచు, ఆనందించుటయే అతనిపని. అట్టివానిని 'లోభి' అందురు. అర్జునునివద్ద ఈ లోభితనము లేదు. స్వభావముచేతనే గొప్ప ఉదారుడు.

మొదటి అధ్యాయములో

"నకాంక్షే విజయం కృష్ణ । - నచ రాజ్యం సుఖానిచ।
కిం నోరాజ్యేన గోవింద - కిం భోగై ర్జీవితేనవా॥

యేషా మర్థే కాంక్షితంనో - రాజ్యం భోగా స్సుఖానిచ ।
త ఇమే ఽవస్థితా యుద్ధే - ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ॥

ఆచార్యాః పితరః పుత్రా - స్తథైవచ పితామహాః ।
మాతులా శ్శ్వశురాః పౌత్రా - శ్శ్యాలా స్సంబంధిన స్తథా ॥

ఏతా న్నహంతు మిచ్ఛామి - ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్య రాజ్యస్య - హేతోః కింను మహీకృతే" ॥

"నాకు నా కొరకు విజయముగాని, రాజ్యముగాని, సుఖములుగాని, ఏమియును అక్కరలేదు. ఈ రాజ్యములు, ఈ వైభవములు ఎవరికొరకని ఉద్దేశించుకొని ఉంటిమో, అట్టి ఆత్మీయులైన వారందరును ప్రాణములమీదను, ధనముమీదను ఆశవిడిచిపెట్టి, ఇదిగో - ఈ యుద్ధరంగమున నిలబడి యున్నారు. ఈ భూలోకరాజ్యమేమి - త్రైలోక్యాధిపత్యము వచ్చినను ఈ ధార్తరాష్ట్రులను చంపను" అని అర్జునుడు కృష్ణపరమాత్మతో చెప్పినాడు. లోభగుణము కలవాడు ఇట్లనునా ? ధనము కొరకు, స్వార్థము కొరకు, లోకములో ఎన్నెన్ని ఘోరహత్యలు జరుగుటలేదు ? తండ్రి కుమారుని చంపుచున్నాడు. తల్లి కుమారుని చంపించుచున్నది. కుమారుడు తల్లిదండ్రులను చంపించుచున్నాడు. ధనముమీద వెఱ్ఱి కాంక్షగలవానికి, తల్లి, తండ్రి, గురువులు, పెద్దలు

కాన్పింతురా ! తనకు లాభము వచ్చునెడల, ఎవరినైనను సరే, చంపవెరువడు. ఇప్పుడు అర్జును డన్ననో - "అయ్యో! వీరిని చంపుటచేత త్రైలోక్యాధిపత్యము వచ్చినను నాకు అక్కరలేదు. వీరిని చంపి భోగము లనుభవించుటకంటె, పవిత్రముగ, శాంతియుతముగ, సాత్త్వికవృత్తియైన భిక్షాటనముచే జీవించుట పరమోత్కృష్టమైనపని కృష్ణా !" అనినట్టి ఉదారవరేణ్యుడు. ఇట్టి అర్జునునకు లోభగుణమున్నదని అనుటకు ఎవరికైనను సాహసముండునా ?

ఇక 'కృపణ' శబ్దమునకు రెండవ అర్థము -

ఇంద్రియములను జయించి, కామకాంచనములకు లోబడక, శాస్త్రసమ్మతమైనట్టియు, మహాపురుషామోదితమైనట్టియును ప్రవర్తన కలిగియుండి, భగవత్ప్రాప్తిని పొందుటయే పరమలక్ష్యముగాగల మానవజీవితమును, క్షుద్రమైన, అనిత్యమైన, అల్పమైన సుఖభ్రాంతిని కలిగించునట్టియును, అధోగతికి త్రోయునట్టియును, విషయోపభోగములకై వ్యయపరచునట్టి మూర్ఖుడు.

"యోవా ఏతదక్షరం గార్గ్యవిదిత్వా అస్మాల్లోకాత్
ప్రైతి స కృపణః" (బృహ. ఉ. 3-8-10).

"ఓ గార్గీ ! ఈ అవ్యయుడైన పరమాత్మను తెలిసికొనకుండగనే, ఎవడు ఈ లోకమునుండి మరణించి పోవు

చున్నాడో, వాడు కృపణుడు" అని బృహదారణ్యకోపని షత్తులో ఉన్నది.

కృష్ణపరమాత్మకూడ గీతలో "కృపణాః ఫలహేతవః" (౨-౪౯) ఫలాభిలాషకలవారు కృపణులు. అనగా కామ్య కర్మలుచేసి, వాటి ఫలమును అనుభవించుటకు స్వర్గాది ఊర్ధ్వ లోకములకు పోవుచు, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అనునట్లు అచ్చట పుణ్యము క్షీణించిపోవగనే మర్త్యలోక మున జన్మలకు వచ్చుచు, ఊర్ధ్వ మర్త్య లోకములకు చుట్లు పెట్టి తిరుగువారు 'కృపణులు' అని చెప్పినాడు.

అర్జునుడు ఈ ఊర్ధ్వలోక భోగములయందుకూడ ఎంతమాత్రమును అభిలాషలేని జితేంద్రియుడు. స్వర్గలోకమున ఊర్వశివంటి అపూర్వసుందరి- దేవతావేశ్య - తనంతతాను వలచివచ్చిననుకూడ, చివరకు ఆమె శాపమునైన ఆనంద ముతో అంగీకరించినాడుగాని, తన ధర్మమును మాత్రము పీసమంతకూడ సడలనీయలేదు. ఎంతటి జితేంద్రియుడో సామాన్య మానవబుద్ధితో ఊహించుటకైనను అందునా ? అట్టివానిని ఇంద్రియజితుడైన మానవునిక్రిందగట్టి, 'కృపణుడు' అనుటకు ఎవరు సాహసించగలరు! కాబట్టి ఇక్కడ ఈ అర్థము కూడ పొసగదు.

ఇక మూడవఅర్థము : 'కృపణుడు' - దీనస్వభావము గలవాడు. ఇక్కడ అర్జునుని కృపణత్వము ఈ దీనత్వమే.

'అయ్యో ! ఇంతమంది స్వజనులను చంపవలసివచ్చినదే' అను దీనత్వమే అర్జునుని పట్టుకొని ఇంతస్థితికి తీసికొనివచ్చినది. ఇది కేవలము కృపచేత కలిగినది. సంజయుడు 'కృపయాఽఽవిష్టం' అని మొదటి శ్లోకములోనే చెప్పియున్నాడు.

ఇంత బంధునాశనమును తలంచుకొనునప్పటికి, అర్జునుని హృదయము ద్రవించిపోయి, యుద్ధముపేరు తలచుకొన్న మాత్రమున వణకు ప్రారంభమైనది. అంతియేకాని వీరత్వలోపముచేత వచ్చిన పిరికితనముకాదు. అర్జునుడు స్వతః శూరుడు. పరాక్రమసంపన్నుడు. అతిరథశ్రేష్ఠుడు. అతనికి ఇంకొకవిధమైన కార్పణ్యము ఎట్లు కలుగును? బంధునాశనమునకు 'యుద్ధము చేయను' అని అనినాడు.

ఇప్పుడు "కృష్ణా ! బంధునాశన మగునన్న విచారముతో, నా స్వభావము, బుద్ధి చలించిపోయినవి. యుద్ధము చేయుటయా, చేయకపోవుటయా ? ఏమియును తోచుటలేదు. నీ పాదములపై బడి వేడుకొనుచున్నాను. నాకు ఏది శ్రేయస్కరమో, నీవే నిర్ణయించి చెప్పుము. నేను నీకు శిష్యుడను. నన్ను 'ఇది చేయుము' 'ఇది చేయవద్దు' అని శాసించుము" అని అనుచున్నాడు.

ఇంతవరకును అర్జునునకు కృష్ణుడు పరమాత్మయని తెలిసినప్పటికిని, స్నేహితుడుగనే వ్యవహారము నడచు

చున్నవి. ఒకరి కొకరు స్నేహితులుగనే ఉండిరి. భోజనము దగ్గర, నిదుర దగ్గర, రాకపోకలదగ్గర, అన్నిసందర్భముల యందును, ఇద్దరును సమానభావముతోడనే మెలగుచుండిరి. కృష్ణునియందు భగవద్బుద్ధి, శ్రేష్ఠత్వమునందు శ్రద్ధ, ఉన్న ప్పటికిని, మిత్రత్వముచేత సమానవ్యవహారముతో నడచు చున్నవి. ఇప్పుడు కలిగిన ఈ దురవస్థ అట్లుండుట చేత కలిగినదే. కృష్ణపరమాత్మతో సమానముగ ఉండుటకు యోగ్యతలేదు. అట్లుండినయెడల, మిత్రత్వములో సలహా మాత్రమే లభించును; ఉపదేశము లభించదు. చేయుటకు ప్రోత్సాహము లభించునుగాని, ఆజ్ఞాపించి, శాసించి, చేయించుట లభించదు. "ఇప్పటి నా స్థితిలో, సలహాలచేతను, ప్రోత్సాహములచేతను, ప్రయోజనము లేదు. ఉపదేశము కావలయును. ఆజ్ఞాపించి శాసించి చేయించుట కావలయును. అట్లు లభించుటకు మిత్రత్వము చాలదు. ఉపదేశమిచ్చుటకును, శాసించి బలాత్కారముగ నైనను శ్రేయోమార్గ మందు నడిపించుటకును, ఆ శోకమోహములు నశింపజేయుట కును, పరమకల్యాణప్రాప్తి లభింపజేయుటకును, ఒక సదాచార్యుడు ఇప్పుడు నా కవసరము. కృష్ణపరమాత్మను మించిన సదాచార్యుడు ఎవడుకలడు? సాక్షాత్ పర మాత్మను ప్రక్కనుంచుకొని, సదాచార్యునిగ ఆశ్రయించకుండ ఎంతకాలము పాడుచేసికొంటిని! గురువుయొక్క ఉపదేశా మృతము లభించుటకు శిష్యుడు ఆర్తితో శరణాగతుడై

సిద్ధముగ నుండవలెను" అని భావించి అర్జునుడు "కృష్ణా! ప్రభో! నేను నీ శిష్యుడను. నీ పాదములమీదబడి ప్రపత్తి చేయుచున్నాను. నన్ను శాసించుము" అని ప్రార్థించు చున్నాడు.

శిష్యులు పలువిధములు - ఒకసారి గురువుచేత ఏదైన మంత్రమును ఉపదేశము పొందుట మాత్రమే - తరువాత మరల ఆ గొడవయే అక్కరలేదు. ఆ మంత్రమును ఒకసారి యైనను తలవరు. 'ఇక చాలు. ఆ గురువే మమ్ములను మోక్షమునకు తీసికొనిపోవును' అని ఊరకొందురు. అది సరియైన విశ్వాసమైనచో బాధలేదు; కాని, నిత్యజీవితములో ఎట్టిమార్పును ఉండదు; పాపపుణ్య విచారణయే ఉండదు. న్యాయాన్యాయ విచారణయే లేక స్వార్థమును పూరించు కొనుటలోనే కాలమును గడపుచు గురువు చెప్పినవికూడ తమకిష్టమైనచో విందురు; లేనిచో వినరు. ఇట్టివారికి ఈ ఆచార్యాశ్రయణము ఉపయోగించదు. వీరిసంగతి ఇంత కన్న ఎక్కువ వ్రాయదలపను.

కొంతమంది- ఉపదేశమునుపొంది, అంతమాత్రముచేత గురువుతో తమకు అవసరము తీరిపోయినదనుకొని, ఇక తమ సాధనమీందనే తాము ఆధారపడి సాధనలు చేయుచుందురు. ఇక గురువుల ఆజ్ఞలను పాటించుట మొదలైనవి ఉండవు.

తమ పురుషప్రయత్నముమీద అహంకారము కలిగి ఉందురు. ఇట్టివారు గురుకృపచేత లభించవలసిన యథార్థలాభమును పొందలేరు.

ఈవిధముగ గాక, అర్జునుడు శిష్యత్వముతోపాటు సర్వభారములను ఆయనమీదనే వేసి, తనను శ్రేయోమార్గమున శాసించి నడపుటకు తగిన బాధ్యతలన్నియును ఆయనకే అర్పించి, అనన్యశరణాగతుడగుచున్నాడు. 'శాధి మాం త్వాం ప్రపన్నం' అని.

'పరమాత్మ అపరిమిత సామర్థ్యముగలవాడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, అనంత కల్యాణగుణములు కలవాడు, పరమోత్కృష్టుడు' అని తెలిసికొని, ఆయునకు తనను సమర్పణము చేసికొనవలయును. దీనినే ప్రపత్తి, శరణాగతి, ఆత్మనిక్షేపము, ఆత్మ సమర్పణము అని అందురు.

భగవంతుడు స్వాభావికమైన, అపారమైన, సర్వశక్తిత్వ, సర్వజ్ఞత్వ, సర్వాంతర్యామిత్వ, దయాళుత్వాది కల్యాణగుణములకు మహోదధి. సర్వాధిపతి. ఐశ్వర్య మాధుర్య ధర్మ శౌర్య జ్ఞాన వైరాగ్యాది గుణములకు నిలయుడు. ప్రణత క్లేశనాశనుడు. సంశయము, భ్రమ మొదలగు దుర్గుణములనెడి చీకటికి సూర్యునివంటివాడు. ప్రేమస్వరూపుడు. అనాలోచితవిశేషాశేష లోకశరణ్యుడు.ఆపద్బాంధవుడు,

పరమాత్మీయుడు, పరమాచార్యుడు అని విశ్వసించి, తనను ఆయనకంటె ఆశ్రయములేనివానినిగను, నిరాధారుని గను, దుర్బలునిగను, శక్తిహీనునిగను తెలిసికొని, ఆయన యొక్క ఆశ్రయమునందును, ఆలంబనమునందును, అనవధి కాతిశయ జ్ఞాన, బలైశ్వర్య వీర్యశక్తి తేజః ప్రభృతి అసంఖ్యేయ కల్యాణగుణములయందును, అసమాన శరణాగత వత్సలత్వమునందును దృఢమైన, అనన్యమైన విశ్వాసమును కలిగియుండి, తనయొక్క సర్వభారములను, సర్వబాధ్యతలను, ఆయనయందే ఉంచి, తనను అన్నివిధములను, సర్వదా ఆయన చరణకమలములపై సమర్పించుకొనుటయును, ఆయన చేతిలో ఒకపరికరమై, నిత్యము, నిరంతరము, ఆయన కను సన్నలమీదనే ఆడుకొనుచు, పాడుకొనుచు ఉండుటకే ఆసక్తికలిగి, ఆ ఆసక్తి వ్యసనముగ పరిణమించగా ఆయనను అనన్యముగ చింతించుకొనుచు ఉండుటయే శరణాగతత్వమునకు పరమావధి.

అర్జునుడు ఇట్టివిధమున శరణాగతుడగుటకే తహతహ చెంది, చివరకు "ఓ పరమాత్మా! నేను నీకు శిష్యుడను, శరణాగతుడను అయితిని. నన్ను నీ ఇష్టము వచ్చినట్లు శాసించుకొనుము" అని సర్వార్పణము చేసికొనెను. ఈ శ్లోకమే గీతోపదేశ ప్రారంభమునకు బీజము. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకముతో గీతోపదేశముయొక్క ఉపసంహారము. కనుక

గీతయొక్క ఉపక్రమోపసంహారములు శరణాగతితోడనే అయినవి.

ఇంకొక విషయము - వేదాంత రహస్యమును ఉపదేశము పొందుటకు తగిన అధికారి తగినవారివద్దకు పోయి ఎట్లు అడుగవలయును అనుదానికి సమాధానము నాల్గవ అధ్యాయములో కృష్ణపరమాత్మ చెప్పియున్నాడు.

"తద్విద్ధి ప్రణిపాతేన - పరిప్రశ్నేన సేవయా! ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం - జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ అనగా, "నీవు జ్ఞానులు, తత్త్వదర్శనులు అయినవారివద్దకుపోయి, ప్రణిపాతము చేతను, పరిప్రశ్న చేతను సేవచేతను తెలిసికో! అట్లు తెలిసికొనదలచినవారికి వారు జ్ఞానమును ఉపదేశించెదరు."

ఈ మూడు లక్షణములును అడుగువానిలో ఏర్పడువరకును ఉపదేశము చేయరాదు. కాబట్టియే మొదటి అధ్యాయములో అర్జునునకు కృష్ణపరమాత్మ ఉపదేశించలేదు. అయితే, అర్జునుడు తాను చెప్పాట అయిపోయిన తరువాత, 'ఇక యుద్ధము చేయను' అని కూర్చొనినాడు. కృష్ణపరమాత్మ ఏమి చేయవలయును? అర్జునునకు చెప్పవలెను. కాని అర్జునుడు అడుగవలసినవిధమున అడుగుట లేదు. కాబట్టి, రెండవ అధ్యాయములో రెండవ మూడవ శ్లోకములలో సమాధానముగ, అర్జునుని ఆక్షేపించి, అంతటితో ఆగక 'ఈ క్షుద్రమైన హృదయదౌర్బల్యము ఎక్కడనుండి

దాపురించినది ? ఛీ ! దీనిని త్యజించి యుద్ధమునకు లెమ్ము !' అని గద్దించినాడు. కృష్ణుడు పరమాత్మయని అర్జునునకు అది వరకే తెలియును. కాని, మిత్రత్వమే ఇద్దరి మధ్యను ఉన్నది. చివరకు ఏమియునుతోచక, తనకు యథార్థమును బోధించి, కర్తవ్యాకర్తవ్యములను తెలుపు మహానుభావుడు - ఈయన తప్ప ఎవరును లేరని, కృష్ణపరమాత్మయొక్క పాదములపై బడి నివేదించుకొనినాడు అర్జునుడు. 'త్వాం ప్రపన్నం' అనుటచేత ప్రణిపాతమును, 'పృచ్ఛామి త్వాం' అనుటచేత పరిప్రశ్నమును, 'శిష్యస్తేఽహాం'అనుటచేత సేవయును సిద్ధించినవి. 'ఆ! ఇక చెప్పవచ్చును' అని శ్రీకృష్ణపరమాత్మ అనుకొనినాడు.

**అవతారిక :_**

ఈ ప్రకారము 'తనకు కర్తవ్యమును బోధించి, కర్తవ్యనిర్వహణమునకు శాసించవలసినది' అని ప్రార్థించి, ఇప్పుడు ఆ ప్రార్థనకు హేతువును చెప్పుచు, తన విచారమును ప్రకటించుచున్నాడు అర్జునుడు.

శ్లో॥ నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ ౮

ప. వి :— న, హి, ప్రపశ్యామి, మమ, అపనుద్యాత్, యత్, శోకం, ఉచ్ఛోషణం, ఇంద్రియాణాం, అవాప్య, భూమౌ, అసపత్నం, ఋద్ధం, రాజ్యం, సురాణాం, అపి, చ, ఆధిపత్యమ్.

టీక :—

భూమౌ = భూమియందు,
అసపత్నం = ఎదురులేనట్టియు,
ఋద్ధం = (ఐశ్వర్యముచేత) వృద్ధిబొందియుండు నట్టిదియునగు,
రాజ్యం = రాజ్యమును, (శత్రువులను జయించుట వలన గలుగు భూరాజ్యమును)
సురాణాం, ఆధిపత్యం, చ = ఇంద్రపదవిని సైతము,
అవాప్య అపి = పొందియునుకూడ,
ఇంద్రియాణాం = ఇంద్రియములను,
ఉచ్ఛోషణం = (మిగుల) శోషింపజేయు,
మమ = నాయొక్క,
శోకం = దుఃఖమును (వ్యసనమును),
యత్ = ఏది,
అపనుద్యాత్ = పోగొట్టునో,
(తత్ = దానిని - అట్టి సదుపాయమును)
న ప్రపశ్యామి హి = కనుగొనజాలకున్నానుగదా!

తా. ఈ భూమిమీద నిష్కంటక సమృద్ధమగు రాజ్యమునుగాని, ఇంద్రాధిపత్యమునుగాని పొందికూడ. ఇంద్రియములను సైతము సంశోషింపజేయు ఈ దుఃఖమును పోగొట్టు ఉపాయమును కనుగొనలేకుండ ఉన్నాను.

అ మృ త వా హి ని :—

కృష్ణా ! ఇప్పటికి నా దుఃఖము ఇంద్రియములనుకూడ పీల్చిపిప్పి చేయుచున్నది. శత్రురహితమైనట్టియు, ధనధాన్య సమృద్ధమైనట్టియు ఈ నిష్కంటక భూరాజ్యమేకాదు - ఇంద్రాధిపత్యము లభించినను ఈ దుఃఖముపోదు. ప్రబలమైన ఈ దుఃఖమును పోగొట్టగల సమర్థుడవు నీవే. కనుక, నాయందు అనుగ్రహముంచి, ఈ దుఃఖము పోవుటకు ఉపాయము చెప్పుము.

అ వ తా రి క :—

అర్జునుడు ఇట్లు చెప్పి, తరువాత ఏమిచేసినాడను విషయమును ధృతరాష్ట్రునకు సంజయుడు చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ :—

శ్లో॥ ఏవ ముక్త్వా హృషీకేశం
గుడాకేశః పరంతపః ।
నయోత్స్య ఇతి గోవింద
ముక్త్వా తూష్ణీం బభూవహ ॥

ప. వి :— ఏవం, ఉక్త్వా, హృషీకేశం, గుడాకేశః, పరంతపః, న, యోత్స్యే, ఇతి, గోవిందం, ఉక్త్వా, తూష్ణీం, బభూవ, హ.

టీక :—

పరంతపః = శత్రువులను తపింపజేయునట్టియును,
గుడాకేశః = నిద్రను జయించినట్టియును, (అర్జునుడు,)
హృషీకేశం = శ్రీకృష్ణపరమాత్మను గూర్చి,
ఏవం = పైన చెప్పబడిన విధముగ,
ఉక్త్వా = పలికి,
గోవిందం = శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి,
న యోత్స్యే ఇతి = యుద్ధము చేయనని,
ఉక్త్వా = పలికి,
తూష్ణీం బభూవ = మౌనముగ నుండెను,
హ = ఆశ్చర్యము.

తా. శత్రువులను సంతపింపజేయు సమర్థుడును, నిద్రను జయించినవాడును అగు అర్జునుడు ఇట్లు పలికి, హృషీకేశునితో "గోవిందా! నేను యుద్ధముచేయను" అని మౌనముదాల్చి ఊరకుండెను. అహా! ఏమాశ్చర్యము!

## అ మృ త వా హి ని :—

హృషీకేశశబ్దమునకు ఇదివరలో వ్యాఖ్యానము వ్రాసియున్నాము. ఇంద్రియములకు నియామకుడనియును,

సర్వాంతర్యామి అనియును కూడ అర్థము కలదు. అర్జునుడు శత్రువుల తపింపజేయ సమర్థుడును, నిద్రను జయించినవాడును కూడ. ఇచ్చట శత్రువుల తపింపజేయ సమర్థుడనగా బాహ్య శత్రువులనేగాక అంతశ్శత్రువులయిన అరిషడ్వర్గమును కూడ జయించినవాడని అర్థము. ఈ గీతను వినుటకు అరిషడ్వర్గము నకు లోబడక, ఆ గుణములను జయించినవాడును, నిద్రను స్వాధీనమునందుంచుకొనినవాడును మాత్రమే అధికారి. ఈ రెండు లక్షణములును అర్జునునివద్ద కలవనుటచే సంజయుడు 'గుడాకేశః' 'పరంతపః' అను ఈ రెండు విశేషణములను ప్రయోగించినది. కాని కొంతమంది 'పరంతప' అని సంబోధన రూపములో ధృతరాష్ట్రునకు విశేషణముగ చెప్పుచున్నారు. అట్లు చెప్పువారు విసర్గలు తీసివేసిరి. కొంతమంది అర్జునునకు విశేషణముచేసి విసర్గలు కలిపిరి. ఎట్లు చేసినను బాధ ఏమి యును లేదుగాని, "అమృతవాహిని" అభిప్రాయముమాత్రము ఆ విశేషణము అర్జునునకు చెప్పుటలోనే ఎక్కువ స్వారస్య మున్నదని. ధృతరాష్ట్రుడు యుద్ధములు చేసినాడా? శరీరబల ముండిన ఉండవచ్చును. పుట్టుగ్రుడ్డి యగుటచే ధనుర్విద్యా శూన్యుడుకూడ. అట్టివాడు పరంతపుడెట్లు కాగలడు? అయితే, ఒక విధమున కాగలడేమో! మొదట ఆయన ప్రశ్నలో 'మామకాః పాండవాశ్చైవ' అని దుర్యోధనాదు లను మాత్రమే తనవారని భావించి, పాండవులను పరులక్రింద జమకట్టియున్నాడు. కనుక, పరులైన ఆ పాండవులను అనేక

విధముల మానసిక తాపములు కలిగించి బాధలు పెట్టి యున్నాడు. కనుక ఆయనకూడ 'పరంతపుడు' అని యుండు నేమో ధృతరాష్ట్రునికి విశేషణముగా చేసినవారు. కాని బాహ్యముగ జూచినను శత్రుసంహారశబ్దము అర్జునునకే తగును. ఆంతర్యముగ జూచినను అరిషడ్వర్గమును జయించిన వాడు అర్జునుడే. ఇట్టివాడే గీతను వినుటకు అర్హుడు. ఈ విశేషణము గీతాప్రబోధ సమయమున చెప్పియుండుటచేత, సంజయుడు 'పరంతప' శబ్దము అర్జునుని ఉద్దేశించియే ప్రయోగించి యుండునని తోచుచున్నది. అస్తు.

వినువారి అర్హతను నిరూపించినాము. ఇక, వక్త ఎట్టివాడుగ ఉండవలయును అను విషయము కావలయును. వక్త సర్వజ్ఞుడుగ ఉండవలయును; నియామకుడుగ ఉండవలయును. ఆ అభిప్రాయముతోడనే, గీతను ఉపదేశించు కృష్ణునుద్దేశించి 'హృషీకేశ' శబ్దమును ప్రయోగించియున్నాడు సంజయుడు. అర్జునుని స్థితి తాత్కాలికముగ ఇట్లు యుద్ధవిముఖముగ మారినను, కృష్ణుడు ఇంద్రియములకు ప్రభువు గనుక, తన ప్రబోధముచేత అర్జునుని చక్కజేయగలడు. 'హృషీకేశుడు' అనగా 'సర్వాంతర్యామి' అను అర్థము కలదు. ఆయన సర్వాంతర్యామి గనుక అర్జునుని హృదయములోనుండి నడపగలడు. సర్వాంతర్యామియైన పరమాత్మ, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు గనుక, కేవలము బ్రహ్మవిద్యా ప్రతిపాదకమైన

ఈ గీతను చెప్పుటకు ఒక్క కృష్ణపరమాత్మయే అర్హుడు అన వలయును. సర్వశక్తిమంతుడు గనుక ఏదియైనను చేయగల సమర్థుడను భావముతో "ధృతరాష్ట్రా! ఇక నీ పుత్త్రుల జయముమీద ఎంతమాత్రమును ఆశపెట్టుకొనకుము" అను భావమును సంజయుడు సూచించుచున్నాడు.

సంజయుడు ధృతరాష్ట్రునితో "అర్జునుడు పైని చెప్పిన ప్రకారముగ పరమాత్మకు శరణాగతుడై 'నన్ను నీ యిష్టమువచ్చినట్లు శిక్షించి, తీర్చిదిద్ది ఉపయోగించు కొనుము. నీకు శిష్యుడను. నీ పాదములు పట్టుకొనినాను' అని తన దుఃఖమును తెలియపరచి 'గోవిందా! నేను యుద్ధము చేయను' అని మౌనము వహించి యూరకుండెను" అని చెప్పినాడు.

గోవిందశబ్దమునకు - 'గోభి ర్వేదవాక్యై ర్విద్యతే లభ్యతే ఇతి గోవిందః' అను వ్యుత్పత్తి ప్రకారము- వేదవాక్య ముల ద్వారా పరమాత్మయొక్క స్వరూపము తెలియబడు చున్నది; పొందబడుచున్నది. కనుక పరమాత్మ గోవిందుడు. కాబట్టియే గీతలో స్వయముగ చెప్పుకొనియున్నాడు. "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" 'సకలవేదములవలనను తెలియబడువాడను నేనే' అని.

అ వ తా రి క :-

అర్జునుడు ఇట్లుచెప్పి మౌనము వహించి ఊరకొనిన పిమ్మట, కృష్ణపరమాత్మ ఏమిచేసెనో సంజయుడు చెప్పు చున్నాడు.

శ్లో॥ త మువాచ హృషీకేశః
ప్రహస న్నివ భారత!
సేనయో రుభయో ర్మధ్యే
విషీదంత మిదం వచః ॥ ౧౦

ప. వి :—తం, ఉవాచ, హృషీకేశః, ప్రహసన్, ఇవ, భారత, సేనయోః, ఉభయోః, మధ్యే, విషీదంతం, ఇదం, వచః.

టీక :—

భారత ! = ఓ ధృతరాష్ట్రా!
ఉభయోః సేనయోః మధ్యే = రెండుసేనల నడుమను,
విషీదన్తం = దుఃఖపడుచుండు,
తం = ఆ అర్జునునిగూర్చి,
హృషీకేశః = శ్రీకృష్ణస్వామి,
ప్రహసన్నివ = పరిహాసము చేయువానివలె (బిగ్గరగ నవ్వుచు)
ఇదం వచః = (ముందు చెప్పబోవు) ఈ వాక్యమును,
ఉవాచ = పలికెను.

తా. ధృతరాష్ట్ర మహారాజా! రెండుసేనలమధ్యను దుఃఖించుచున్న అర్జునునిజూచి కృష్ణపరమాత్మ, నవ్వుచున్నవానివలె ఇట్లు పలికెను.

**అమృతవాహిని :—**

అర్జునునిజూచి కృష్ణపరమాత్మ అపహాస్యము చేయుచు, అనుచున్నాడు.

ఎందులకు అపహాస్యము ?

౧. 'ఎవరితో యుద్ధము చేయవలయునో, దుష్టుడైన దుర్యోధనునకు సాహాయ్య మొనర్చుటకై ఎవరెవరు వచ్చి యున్నారో చూచి నిర్ణయించుకొనవలయును. ఉభయసేనల మధ్యకును మన రథమును పోనిమ్ము కృష్ణా !' అని మహారథునివలె అతిరథునివలె శౌర్యముగను, వీర్యముగను పలికిన అర్జునుడు, ఇప్పుడు స్వజనమును చూచునప్పటికి అకాల అక్రమ కృపారూపమోహాపరవశుడై దుఃఖించుచు కూలబడుటను జూచి నవ్వుచున్నాడు.

౨. శౌర్యము వీర్యము పరాక్రమము జూపించి, శత్రుసైన్యమును నుగ్గునుగ్గుగా దునుమాడవలసినచోట, దీనమైన, హీనమైన, హేయమైన విషాదమును పొందుటనుజూచి నవ్వుచున్నాడు.

3. "నన్ను శరణ్యముగ ఆశ్రయించి, 'నాకు శ్రేయస్కరమైన దానిని నీవే నిర్ణయించి చెప్పవలసినది' అని



ప్రార్థించి, నా నిర్ణయమేమో వినుటకుముందే, 'నేను యుద్ధము చేయును' అని చెప్పివేయుచున్నాడే! ఎటువంటి పొరపాటు!" అని నవ్వుచున్నాడు.

౪. "ఈ స్వజనులను చూచునప్పటికి కృపకలిగినదా యేమి? ఇతరులైనయెడల సొరకాయలు తరిగినట్లు వారి కంఠములు తరుగువాడవా యేమి?" అని నవ్వుచున్నాడు.

౫. "'వారే గెలిచెదరో, మనమే గెలిచెదమో తెలియదు' అంటివి. నీవు గెలుచు అవకాశమున్నచో యుద్ధము చేయువాడవును, లేనిచో యుద్ధము చేయనివాడవునా?" అని నవ్వుచున్నాడు.

౬. "ఇది క్షాత్రధర్మమునకు సంబంధించిన స్థితియా? వైరాగ్యమునకు సంబంధించిన స్థితియా? ఏదియును కాదే! రెంటికి చెడిన రేవడవౌచున్నావే!" అని నవ్వుచున్నాడు.

"ఏమోయి! ఏమి ప్రజ్ఞావాక్యములు పలుకుచున్నావు!" అని ఈ భావములన్నియును ధ్వనించు ఒక వికటాట్టహాసము చేసినాడు కృష్ణపరమాత్మ.

అర్జునునకు కలిగినది వైరాగ్యమనియును, వైరాగ్యము కనుకనే కృష్ణపరమాత్మ చేసినగీతా ప్రబోధము వినుటకు అర్హత చేకూరినదనియును, కొందరు వ్రాయుచున్నారు. కాని ఇది వైరాగ్యముగునో కాదో, కృష్ణపరమాత్మయే నిర్ణయించినాడు.

"ఇటు క్షాత్త్రమునకు సంబంధించక, అటు వైరాగ్యమునకు సంబంధించక, ఉభయభ్రష్టత్వమైన, క్షుద్రమైన హృదయదౌర్బల్యము" అని. ఇట్లు కృష్ణపరమాత్మ చెప్పుచుండగా, 'కాదు, ఇది వైరాగ్యమే' అని నిర్ణయించుటకు అధికార మెవరికి గలదు ? వైరాగ్యము కలవారు 'నేను యుద్ధము చేయను, ఇది హింసాకాండ' అందురుగాని, 'నావారిని చంపలేను. ఇంతమంది బంధువులను చంపవలసి వచ్చుచున్నది కనుక యుద్ధము చేయను' అందురాయేమి ?

ఎదుట నిలబడినది ఇతరులుగాని, తనవారుగాని, తాను చేయునది ధర్మయుద్ధముగాని, వైరాగ్య సంపన్నుడగు బ్రాహ్మణుడు యుద్ధము చేయడు.

ఇక క్షత్త్రియుడో, ధర్మయుద్ధము సంప్రాప్తమైనప్పుడు, ఎదుట నిలబడినది తనవారైనను, పరులైనను, యుద్ధమే తన కర్తవ్యధర్మముగా తలచి యుద్ధము చేయును. తనకు విజయము చేకూరునట్లున్నను, అపజయము చేకూరునట్లున్నను, 'జయించిన భూలోక రాజ్యము వచ్చును. చచ్చిన వీరస్వర్గము వచ్చును' అను భావముతో యుద్ధము చేయును.

ఇప్పటి అర్జునుని స్థితి ఇటునూగాక, అటునూగాక యున్నది. ఇది ఒకరకమైన క్షుద్రహృదయదౌర్బల్యము. కృష్ణపరమాత్మ, మహావైద్యశిఖామణియై, ఆ మోహమును నశింపజేయుటకు, జగదాచార్యుడై నిలబడి గీతాప్రబోధము చేయుచున్నాడు. ఆ హృదయదౌర్బల్యమునకు చికిత్స చేయు

పూనుకొనినాడు. హృదయదౌర్బల్యపిశాచమునకు మహా భూతమంత్రవేత్తయై, గీతారూపమైన మహోచ్చాటన మంత్రమును ఉచ్చరించుచున్నాడు. అర్జునుని ఇంద్రియ సంక్షోభ కారకమైన ఈ దుఃఖమదగజమును పారద్రోల, కృష్ణకేసరి గర్జించుచున్నది.

**అ వ తా రి క :—**

ఈ రీతిగా అర్జునుడు చింతామగ్నుడై, కృష్ణపరమాత్మకు శరణాగతుడై, తన ఈ అపారదుఃఖము నివర్తించు ఉపాయము చెప్పవలసినదని ప్రార్థించి, ఈ లోకరాజ్య సుఖముగాని, పరలోకరాజ్యసుఖముగాని, నా ఈ దుఃఖమును నివర్తింపజేయజాలవని చెప్పి ఊరకొనగా, అర్జునుని జూచి, ఇప్పు డితనికి ఇంతదుఃఖము కలుగుటకు కారణము, ఇంతమంది స్వజనులను చంపవలసివచ్చినదను కారణమే గనుక, దానికి ఔషధమైన నిత్యానిత్యవస్తువివేకమును గురించిన సాంఖ్య యోగమును బోధించి, ఆ సాంఖ్యయోగప్రకారముగూడ యుద్ధముచేయుటయే అతనికి కర్తవ్యమని ప్రతిపాదన చేయు తలంపుతో ప్రారంభించుచున్నాడు.

శ్రీభగవానువాచ :—

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం
ప్రజ్ఞా వాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతాసూంశ్చ
నానుశోచన్తి పండితాః ॥ ౧౧

ప. వి :—అశోచ్యాన్, అన్వశోచః, త్వం, ప్రజ్ఞావాదాన్, చ, భాషసే, గతాసూన్, అగతాసూన్, చ, న, అనుశోచన్తి, పండితాః.

టీక :—

(హే అర్జున ! = ఓ అర్జునుడా !
త్వం = నీవు,
అశోచ్యాన్ = దుఃఖింపదగని భీష్మాదులనుగూర్చి,
అన్వశోచః = దుఃఖించినావు,
ప్రజ్ఞావాదాన్ + చ = వివేకులు పలుకునట్టిమాటలను,
భాషసే = పలుకుచున్నావు,
గతాసూన్ = మృతిచెందినవారిని గూర్చియును,
అగతాసూన్ + చ = జీవించి యున్నవారిని గూర్చి యును,
పండితాః = పరమార్థానుభవముగలవారు (మహాత్ములు),
అ + నుశోచన్తి = దుఃఖించరు.

తా. కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు. ఓ అర్జునా ! నీవు దుఃఖించదగనివారినిగూర్చి దుఃఖించుచున్నావు. ప్రజ్ఞావాదములు పలుకుచున్నావు. (పండితులవలె పలుకుచున్నావు). పండితులు, చచ్చినవారిని గురించి గాని, బ్రతికియున్నవారిని గురించిగాని దుఃఖించరు.

**అ మృ త వా హి ని :-**

అర్జునుని మోహమును నశింపజేయుటకు ఒక్క భగవానునకే శక్తిగలదు. ఇతరుల కెవరికిని లేదు. మమకారమునకును, అహంకారమునకును, వీటివలన గలుగు మిగిలిన గుణములకును, అన్నిటికిని కారణము ప్రకృతి. ఆ ప్రకృతిని గురించి పరమాత్మ గీతలో చెప్పికొనినాడు - "దైవీహ్యేషా గుణమయీ - మమ మాయా దురత్యయా" అని తన మాయయొక్క బలమును చెప్పియున్నాడు. బ్రహ్మాదిదేవతలు సైతము ఆయన మాయలో తల్లడిల్లిపోవలసినదేగాని, తట్టుకొన లేరు.

అయితే, ఆ మాయనుండి పరమాత్మయే ఉద్ధరించవలయునంటిరి గదా ! అందరనూ ఉద్ధరించునా అనిన, ఆ ! అందరను ఉద్ధరించును. ఎవరిమీదను రాగముగాని, ద్వేషముగాని ఆయనకు లేదు. ఈషణ్మాత్రమునకూడ పక్షపాతము లేదు. ఎవరువచ్చి 'నీవేదిక్కు. రక్షింపవలసినది' అని ఆయనను శరణాగతి చేయుదురో, వారిని ఎవరినైనను రక్షించును. అది ఆయనదీక్ష.

ఇప్పుడు అర్జునుడు "కార్పణ్యదోషోపహత స్వభావః" అను శ్లోకమున శరణాగతిచేసియున్నాడు. దానితో అర్జునుని మోహమును పూర్తిగ నశింపజేయవలసిన బాధ్యత కృష్ణునిపై

బడినది. బాధ్యతపడినదికాని, ఆయన తన బాధ్యతను నిర్వ ర్తించగలడా అన్నసందేహమునకు తావులేదు. ఆయన అఘటిత ఘటనాసమర్థుడు. కనుకనే ఆయనను భగవంతు డన్నారు.

'భగవంతుడు' అనగా -

> "ఐశ్వర్యస్య సమగ్రస్య - వీర్యస్య యశస శ్శ్రియః।
> జ్ఞానవైరాగ్యయోశ్చైవ - షణ్ణాం భగ ఇతీరణా ॥
> వసంతి యత్ర భూతాని - భూతాత్మ న్యఖిలాత్మని।
> సర్వభూతే ష్వశేషేషు - వకారార్థ స్తతోఽవ్యయః॥"
>
> (వి. పు. ౬-౫-౭౪-౭౫)

సమగ్రమైన అపారమైన అపరిమితమైన ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వై రాగ్యము- ఈ ఆరును భగమనబడును.

సమస్తభూతములు తనయందు కలవాడును, తాను సకలభూతములందును కలవాడును అయిన అవ్యయుడని 'వ' కారమునకు అర్థము. కనుక ఈపై ఆరుగుణములను కలిగి ఎవడు సర్వభూతములయందును ఉన్నాడో, ఎవనియందు సర్వభూతములు ఉన్నవో వాడు భగవంతుడు.

"ఉత్పత్తి ప్రళయం చైవ - భూతానా మాగతిం గతిమ్ ।
వేత్తి విద్యా మవిద్యాంచ - స వాచ్యో భగవానితి" ॥
(వి. పు. ౬-౫-౭౮)

ఎవడైతే సమస్తభూతములయొక్క ఉత్పత్తి ప్రళయములను, రాకపోకలను, విద్యను, అవిద్యను తెలిసికొనుచున్నాడో (అనగా సర్వజ్ఞుడో) వాడు 'భగవానుడు' అని చెప్పబడును.

"ఏష మేష మహచ్ఛబ్దో - మైత్రేయ భగవానితి ।
పరమ బ్రహ్మభూతస్య - వాసుదేవస్య నాన్యగః" ॥

"ఓ మైత్రేయా ! ఈ విధముగ గొప్పదైన 'భగవ' చ్ఛబ్దము పరబ్రహ్మస్వరూపమైన శ్రీ వాసుదేవునకే వాచకము. ఇంక ఎవరికిని కాదు."

ఇట్టి భగవానుడే అర్జునుని మోహరూపమైన మాయను తొలగించవలెను. ఇంకొకనికి ఎంతమాత్రమును సామర్థ్యము లేదు. కనుకనే శరణాగతుడైన అర్జునుని అజ్ఞానాంధకారమును తొలగింప బద్ధకంకణుడై జ్ఞానముద్ర వహించి, జగదాచార్య రూపమున రథముపై అధివసించియున్నాడు. ఆ భగవానుడు ఏమనుచుండెనో వినుడు -

"అర్జునా ! ఎవరికొరకు దుఃఖించరాదో, వారికొరకు దుఃఖించుచున్నావు. ప్రజ్ఞావాదములు పలుకుచున్నావు. ప్రజ్ఞా

వాదములు ఎవరు పలుకవలయునో, ఎవరికి అధికారమున్నదో తెలియునా ? ఒక్క పండితులకే కలదు. పండితులన ఎవరో తెలియునా ? చచ్చినవారికొరకును, బ్రతికియున్నవారి కొరకును కూడ దుఃఖించనివారు పండితులు. మరి నీవు దుఃఖించుచుంటివే. పైగా పండితులు మాట్లాడినట్లు మాట్లాడుచుంటివి" అని.

మొదటి అధ్యాయములో అర్జునుడు చెప్పినవాటి నన్నిటిని 'అశోచ్యా నన్వశోచ స్త్వం' అని ఒక్క అవహేళనతో ఖండించి, అవి అన్నియును అసందర్భ ప్రలాపములు అని త్రోసివేయుచున్నాడు. చూడుడు మొదటి అధ్యాయములో -

"దృష్ట్వేమం స్వజనం కృష్ణ - యుయుత్సుం సముపస్థితమ్.(౨౮)
సీదంతి మమగాత్రాణి - ముఖంచ పరిశుష్యతి ॥
వేపథుశ్చ శరీరేమే - రోమహర్షశ్చ జాయతే । (౨౯)
గాండీవం స్రంసతే హస్తాత్ - త్వక్చైవ పరిదహ్యతే ।
నచశక్నో మ్యవస్థాతుం - భ్రమతీవచ మేమనః ॥ (౩౦)

ఈ శ్లోకములలో, దుఃఖముచేత తనకు గలిగిన స్థితిని వర్ణించినాడు అర్జునుడు. ఈ దుఃఖము ఎందుకు కలిగినది ? ఈ యుద్ధములో అందరును స్వజనులు ఉన్నారే, వీరినందరనూ చంపవలసివచ్చుచున్నదే అని.

"అహో బత మహత్పాపం - కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్య సుఖలోభేన - హన్తుం స్వజన ముద్యతాః ॥ (४౫)

ఈ శ్లోకములో 'మనము యుద్ధమునకు సిద్ధమగుట ఎంత ఘోరమైన పాపము!' అని దుఃఖమును ప్రకటించినాడు అర్జునుడు.

తరువాత సంజయుడు -

"ఏవముక్త్వార్జున స్సంఖ్యే - రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం - శోక సంవిగ్న మానసః ॥ (४౭)

అని అర్జునుని స్థితిని వర్ణించినాడు.

వీటి నన్నిటిని ఉద్దేశించుకొని కృష్ణపరమాత్మ అర్జునునితో 'అశోచ్యానన్వశోచ స్త్వం' అనుచున్నాడు. ఇక్కడ నుండియే కృష్ణపరమాత్మయొక్క ఉపదేశము ప్రారంభము. పదునెనిమిదవ అధ్యాయములో అరువది ఆరవ శ్లోకముతో ఉపదేశము పరిసమాప్తి. ఉపదేశ ప్రారంభమునకు ముందున్నవియును, ఉపదేశసమాప్తికి తరువాతవియును గీతకు పూర్వపీఠికయును, ఉత్తర పీఠికయును అయి యున్నవి.

"ప్రజ్ఞావాదాంశ్చ భాషసే"

అర్జునుడు మొదటి అధ్యాయములో

"నిమిత్తానిచ పశ్యామి - విపరీతాని కేశవ ।
నచ శ్రేయోఽనుపశ్యామి - హత్వా స్వజన మాహవే"॥ (౩౧)

తా. కృష్ణా! అన్నియును విపరీత లక్షణములే కనుబడుచున్నవి. ఈ స్వజనమును చంపుటచేత గలుగు మే లేమియును గనుపించదు.

అ ని యు ను,

"నకాంక్షే విజయం కృష్ణ! - నచ రాజ్యం సుఖానిచ।
కిం నోరాజ్యేన గోవింద! - కిం భోగై ర్జీవితేనవా"॥ (౩౨)

తా. కృష్ణా! విజయమును కోరను. రాజ్యమక్కరలేదు. సుఖములపై నాశలేదు. గోవిందా! నాకీరాజ్యముతో పనియేమున్నది? భోగములేల? జీవించిలాభమేమి?

అ ని యు ను,

"యేషామర్థే కాంక్షితం నో- రాజ్యం భోగా స్సుఖానిచ।
త ఇమేఽవస్థితా యుద్ధే - ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ"॥ (౩౩)

తా. ఎవరికొరకై రాజ్యమునుగాని, భోగములనుగాని, సుఖములనుగాని, కోరవలసివచ్చునో, వారే ప్రాణములను, ధనములను వదలిపెట్టి యుద్ధమునకు సిద్ధముగ నిలబడియున్నారు.

అ ని యు ను,

"ఆచార్యాః పితరః పుత్త్రా - స్తథైవచ పితామహాః।
మాతులా శ్శ్వశురాః పౌత్త్రాః- శ్శ్యాలా స్సంబంధిన స్తథా॥ (౩౪)

తా. ఆచార్యులు, తండ్రులు, పుత్త్రులు, తాతలు, మేనమామలు, శ్వశురులు, మనుమలు, బావమరదులు, వియ్యంకులు మొదలగు బంధువులందరును ఉన్నారు.

అ ని యు ను,

"ఏతా న్నహంతు మిచ్ఛామి - ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్య రాజ్యస్య - హేతోః కింను మహీకృతే ॥" (౩౫)

తా. వీరు నన్ను చంపిన చంపుదురుగాక । నేను మాత్రము వీరిని చంపను. భూమండలాధిపత్యముగాదు సరికదా, త్రైలోక్యాధిపత్య మిచ్చెద నన్నను యుద్ధము చేయను.

అ ని యు ను,

"నిహత్య ధార్తరాష్ట్రా న్నః - కా ప్రీతి స్స్యా జ్జనార్దన।
పాప మేవాశ్రయే దస్మాన్ - హత్వైతా నాతతాయినః" ॥ (౩౬)

తా. ఓ జనార్దనా । ఈ కౌరవులను సంహరించుటచేత మాకేమి సంతోషము గలుగును ? వీరెంతదుర్మార్గులైనను వీరిని చంపుటచేత మనకు పాపమే లభించును.

అ ని యు ను,

"తస్మా న్నార్హా వయం హంతుం - ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్ ।
స్వజనంహి కథం హత్వా - సుఖిన స్స్యామ మాధవ ।" (౩౭)

తా. కాబట్టి బంధుజనులతో కూడియున్న కౌరవులను చంపుట మంచిదికాదు. స్వజనులనుచంపి, మాధవా । ఏమి సుఖమందగలము ?

అ ని యు ను,

"యద్య ప్యేతేన పశ్యంతి - లోభోపహత చేతసః ।
కులక్షయకృతం దోషం - మిత్రద్రోహేచ పాతకమ్" ॥ (౩౮)

తా. లోభితనముచేత మతి చెడినవారికి కులక్షయమువలన గలుగు దోషమును, మిత్రులకు ద్రోహముచేయుటచే గలుగు పాతకమును గనుపింపవు.

అ ని యు ను,

"కథం నజ్ఞేయ మస్మాభిః - పాపా దస్మా న్నివ ర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం - ప్రపశ్యద్భి ర్జనార్దన ।" ॥ (౩౯)

తా. కాని, మాకు కులమునశింపజేయుటచే గలుగు దోషము బాగుగ కనుపించుచున్నది. అయినప్పు డీ పాపము నింక నెట్లు చేయ గలము ? ఏమైననుసరే, జనార్దనా ! ఇట్టి పాపకృత్యమున కింక పాల్గొనను.

అ ని యు ను,

"కులక్షయే ప్రణశ్యంతి - కులధర్మా స్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్న - మధర్మోఽభిభవత్యుత" ॥ (౪౦)

తా. చూడుము ! తెలియుటలేదా ? కులమునశించెనేని సనాతనము లైన కులధర్మములు నశించును. ధర్మము నశించెనేని లోకమున కులము లన్నియు నధర్మముచే పరివ్యాప్తములై పోవును.

అ ని యు ను,

"అధర్మాభిభవాత్ కృష్ణ ! - ప్రదుష్యంతి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ ! జాయతే వర్ణసంకరః" ॥ (౪౧)

తా. కృష్ణా ! అధర్మము వ్యాపించిన వెంటనే కులస్త్రీలు చెడిపోవుదురు. స్త్రీలుచెడిపోవుటచేత వర్ణసంకరము కలుగును.

అ ని యు ను,

"సంకరో నరకాయైవ - కులఘ్నానాం కులస్యచ ।
పతంతి పితరోహ్యేషాం - లుప్త పిండోదక క్రియాః" ॥ (౪౨)

తా. వర్ణసంకరము కలుగగనే దానికి కారణమైన కులఘాతకులును, కులములును నరకమున గూలును. పిండ, దాన, తర్పణాది

క్రియలు జరుపువారు లేకపోవుటచేతను, అధికారము లేనివారు జరిపినను అవి ముట్టకపోవుటచేతను, వారి పితృదేవతలు సైతము నరకమున బడి పోవుదురు.

అ ని యు ను,

"దోషై రేతైః కులఘ్నానాం - వర్ణసంకర కారకైః ।
ఉత్సాద్యంతే జాతి ధర్మాః - కులధర్మాశ్చ శాశ్వతాః" ॥ (౪౩)

తా. కులఘాతకుల యొక్క వర్ణసంకరమునకు కారణములైన ఈ దోషములచేత, సనాతనములైన జాతిధర్మములును, కులధర్మములును చెడగొట్టబడుచున్నవి.

అ ని యు ను,

"ఉత్పన్న కులధర్మాణాం - మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో - భవతీ త్యనుశుశ్రుమ" ॥ (౪౪)

తా. ఏ మానవుల కులధర్మములు చెడిపోయినవో, వారికి నరకమే నిశ్చయమని, జనార్దనా ! మనము వినలేదా?

అ ని యు ను,

కులనాశనము చేయువానికి మహాపాపము సంభవించునని, దానివలన గలుగు దోషములనుచెప్పి, రెండవ అధ్యాయములో -

"కథం భీష్మ మహం సంఖ్యే - ద్రోణంచ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి - పూజార్హా వరిసూదన !" ॥ (౪)

తా. కృష్ణా ! భీష్ములును, ద్రోణాచార్యులును నాకు పరమ పూజ్యులుగదా ! అట్టివారిని పూజించుటకుమారు, వారిమీద బాణములు ప్రయోగించి, ఎదిరించి యుద్ధమెట్లు చేయగలను ? మనసెట్లొప్పును ?

అ ని యు ను,

"గురూ నహత్వాహి మహానుభావాన్ -
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహలోకే ।
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ -
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥

తా. పూజనీయులైన గురువులజంపి, రాజ్యమనుభవించుటకంటె, వారితో యుద్ధము చేయక, రాజ్యమును వదలి, బిచ్చమెత్తుకొని జీవించుట చాల శ్రేయస్కరము. గురువుల జంపి, అర్థకామరూపము లైనవియును, వారి రక్తముచే పూయబడినవియునైన భోగముల ననుభవింపవలసి వచ్చును.

అనియును చెప్పి, అనేక యుక్తులతో 'యుద్ధము చేయుట అనుచితము' అని అహంకారపూర్వకముగ సిద్ధాంతము చేసియున్నాడు అర్జునుడు. ఈ వాక్యము లన్నిటిని ఉద్దేశించుకొని కృష్ణపరమాత్మ 'ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' 'పండితునివలె ప్రజ్ఞావాదములు మాట్లాడుచున్నావు?' అను చున్నాడు.

యథార్థ మాలోచించిన, మొదటి అధ్యాయములో అర్జునుడు కృష్ణునకు ఒక మహోపన్యాస మిచ్చెనేగాని,

అధ్యాయము చివరవరకును గూడ, కృష్ణుని అడుగుటగాని, లేక కృష్ణపరమాత్మకు మాట్లాడుటకు అవకాశమిచ్చుటగాని చేయలేదు. కాబట్టి దానిని 'అర్జునగీత' అనవచ్చునేమో యని పించుచున్నది. యథార్థమునకు తాను మోహాంధకారములో మునిగియుండి, ధర్మాధర్మనిర్ణయము చేయుటకు తగనిస్థితిలో యుండి, తనస్థితిని తాను తెలిసికొనలేక, తనకు అప్పుడు తోచినదే ధర్మము, సత్యము అనుకొని, దానికి వేరైనది ఎవరెంత చెప్పినను, 'పొరపాటే' అనుకొని మాట్లాడినయెడల ఏమనవలెను? వారు పండితులు కారు. కాని మాటలు మాత్రము పండితులవలె మాట్లాడుదురు. ఇట్టి స్థితియే అర్జును నకు పట్టినది. దానిని దృష్టిలో ఉంచుకొని కృష్ణపరమాత్మ 'ప్రజ్ఞావాదాంశ్చభాషసే' 'పండితునివలె మాట్లాడుచున్నావే' అనుచున్నాడు.

మరియు, "పండితులు ప్రాణములు పోయినవారి కొరకును, ప్రాణములు పోనివారి కొరకును కూడ దుఃఖించరు. అనగా, చచ్చినవారికొరకును, బ్రతికియున్నవారికొరకును కూడ దుఃఖించరు. నీవు దుఃఖించుచున్నావు. కాబట్టి పండితుడవుకావు" అని చెప్పినాడు.

'లోకములో చచ్చినవారికొరకు ఏడ్చుట కనుపించు చున్నదిగాని, బ్రతికియున్నవారికొరకు ఏడ్చుట కనిపించుట లేదే' అనిన, రెండును లోకమున కానవచ్చుచున్నవి. ఎట్లన - ఇదికూడ రెండురకములు.

ఒకటి - తన కిష్టులు, మిత్రులు, చనిపోయిన దుఃఖింతురు. శత్రువులు, అనిష్టులు, జీవించియున్న "అయ్యో! వీరింకను జీవించియున్నారే" అని దుఃఖింతురు. కాబట్టి బ్రతికియున్న వారికొరకును, చచ్చినవారికొరకును కూడ దుఃఖించుట లోకమున కనపడుచునే యున్నది.

ఇక రెండవరకము - తన కిష్టులైనవారు బ్రతికియున్నప్పుడుకూడ, వారికొరకు దుఃఖింతురు. వారు ఆరోగ్యముగ లేరనియో, బాధలు పడుచుండిరనియో, 'అయ్యో! వారెట్లు జీవించెద'రనియో, అనేకరకములుగ దుఃఖింతురు. కొంతమంది విషయమై వారు పుట్టుటకుముందునుండియే దుఃఖించుట ప్రారంభింతురు - 'అయ్యో! నాకు సంతానము లేదే' అని. కొంతకాలమునకు ఒక శిశువు పుట్టును. ఆ శిశువుకూడా ఏడ్చుచునే పుట్టును. పుట్టిన తర్వాత, బాలగ్రహములు మొదలగు దోషములకు భయపడి దుఃఖము. తరువాత, చదువుకొనక చెడ్డవాడైన దుఃఖము. అతనికి వివాహము కాకపోయిన దుఃఖము. అతని భార్య, అతని మాటవినని గయ్యాళియైనచో, 'అయ్యో, వాని మెడ కింత గుదిబండను కట్టితిమే' అని దుఃఖము. భార్యాభర్తలిరువురును మంచివారలై, కాపురము చేయుచుండినను, 'వారికి ఐశ్వర్యము లేదే' అని దుఃఖము. ఐశ్వర్యమున్నను 'వారికి సంతానము లేదే' అనికూడ వీరికే దుఃఖము. ఎంతదూరముపోయినను, చివరకు, వాడో వీడో చనిపోవు

వరకును ఈ దుఃఖము వెంటబడుచునే యుండును. కనుక, లోకములో బ్రతికియున్న వారిని గురించియును, చచ్చినవారిని గురించియునుకూడ దుఃఖింతురు. ఇష్టులను గురించికూడ, వారు బ్రతికియున్నను 'ముందుముందు చనిపోవుదురేమో' అన్న దుఃఖముకూడ ఉండుటకద్దు. ఇప్పుడు అర్జునుని స్థితి ఇదియే - అందరును ఇప్పుడు బ్రతికియే యున్నారు. కాని, యుద్ధములో చనిపోవుదురని దుఃఖము. ఈ దుఃఖము ప్రస్తుతము బ్రతికి యున్నవారిని గురించియేకదా !

'గతాసూన్' అనుదానికి కొందరు 'ప్రాణములు లేని వాటిని గురించి' అని అర్థము వ్రాసియున్నారు. అది పొసగదు. ఎందులకనగా 'గతాసూన్' అనగా గతించిన ప్రాణములుగల వారు అని అర్థము. అనగా, అంతకుముం దొకప్పుడు ప్రాణములు కలిగియుండి, ఇప్పుడు లేనివిగయున్నవని అర్థము వచ్చునుగాని, అసలే అప్రాణివాచకములన్న అర్థము రాదు.

అర్జును డిట్లు దుఃఖించుటకు మోహమే కారణము. ఈ మోహము ఆత్మానాత్మవివేచనాజ్ఞానమును మరుగు పరచినది. ప్రస్తుతము అర్జునునకు ఆ జ్ఞానమే కావలయును. ఆ జ్ఞానమే ఈ దుఃఖరూపమైన వ్యాధికి మందు. ఆ అభి ప్రాయముతో, కృష్ణపరమాత్మ ప్రబోధము ప్రారంభించ బోవుచున్నాడు.

**అవతారిక:—**

ఈ శ్లోకములో 'భీష్ముడు మొదలగువారిని గురించి దుఃఖించుటతప్పు' అను అభిప్రాయమును మాత్రమే సూచించినాడు. దుఃఖించుట ఎందులకు తప్పో, ఈ రాబోవు శ్లోకములో చెప్పబోవుచున్నాడు.

శ్లో॥ న త్వే వాహం జాతునాసం
న త్వం నేమే జనాధిపాః ।
నచైవ నభవిష్యామ
స్సర్వే వయ మతః పరమ్ ॥ ౧౨

ప. వి :—న, తు, ఏవ, అహం, జాతు, నాసం, న, త్వం, న, ఇమే, జనాధిపాః, న, చ, ఏవ, న, భవిష్యామః, సర్వే, వయం, అతఃపరం.

టీక :—

అహం = నేను,
జాతు = ఒకప్పుడును,
నాసం (ఇతి) తునైవ = లేకుంటిని (అనునది) లేదు,
త్వం చ = నీవును,
న = (లేకుంటి వనునది) లేదు,
ఇమే జనాధిపాశ్చ = (యుద్ధరంగముననున్న) ఈ రాజులును,

న = (లేకుండిరనునది) లేదు,
వయం సర్వే = మనమందరమును,
అతఃపరం = ఇకమీాదను (శరీరములు నశించిన పిమ్మటను),
న ఏవ భవిష్యామః చ (ఇతి) న = లేకపోవుదుము అనునదియును లేదు.

తా. నేనుగాని, నీవుగాని, ఈరాజులుగాని, ఇదివర కెప్పుడును లేనివారముకాదు. మనమందరమును ఇకముందు ఉండబోమనునదియును లేదు.

అమృతవాహిని :—

"అర్జునా! నీవు ఎవరినిగూర్చి దుఃఖించుచున్నావు? భీష్మాదులనగా నెవరు? 'భీష్ముడు' అని నీవు చెప్పుశబ్దము నకు, ఇక్కడ వాచ్యమైన తత్త్వమేది? ఈశరీరమా? ఆత్మయా? శరీరమనుకొనుట పొరపాటు. వ్యావహారికముగ గుర్తు తెలియుటకు మాత్రమే ఈ పేర్లుగాని, ఈ పేర్ల చేత చెప్ప బడునది యథార్థమాలోచించినచో ఆత్మయే. ఈ విషయమును నీవు బాగుగ జ్ఞప్తియందుంచుకొని, ఆత్మకొరకు దుఃఖించుట మానుము. ఎందువల్లననగా, నేను ఇదివర కెప్పుడును ఉంటిని. నీవును, ఈ రాజులునుకూడ ఇదివర కెప్పుడును ఉండిరి. మనమందరమును ఉందుము. నిత్యముగ ఉందుము. మనము అనగా ఈ శరీరములని భ్రాంతిపడకుము. నిత్యమైన ఆత్మలము. కనుక ఎందులకు దుఃఖించవలయును?

మన శరీరములు పుట్టుటకుముందును, పుట్టినతర్వాత ఇప్పుడును, శరీరములు నశించిన పిమ్మటను, భూత భవిష్య ద్వర్తమాన కాలములయం దెల్లప్పుడునుకూడ, శాశ్వతముగ, నిత్యులమైయుండువారమే. ఇట్టివిషయమున దుఃఖించుట ఎంత అజ్ఞానమో ఆలోచించుకొనుము."

ఇచ్చట కృష్ణపరమాత్మ ఆత్మలయొక్క అనేకత్వము ఒప్పుకొనుచున్నాడు. కాన, 'ఆత్మ' ఒకటియేగాని, అనేకములు గావు అనువారి వాదము నిరసింపబడుచున్నది. ఇట్లే ప్రతి చోటనుకూడ ఆత్మల బాహుళ్యమునే గీతలో కృష్ణపరమాత్మ చెప్పియున్నాడు. గీతలో తత్త్వత్రయమే ప్రతిపాదింపబడినది. పరమాత్మ, ఆత్మ, ప్రకృతి. ఈ మూడు తత్త్వములను గీత చెప్పుచున్నది. కాబట్టి పరమాత్మకంటె ఆత్మగణము భిన్న మనుట యథార్థము. ఈ భావమును తెలియపరచుటకే కృష్ణ పరమాత్మ 'నేను, నీవు, ఈ రాజులు - మనమందరమును' అని ఇట్లు ప్రయోగించినాడు.

ఈ భేదము ఉపాధిచేత కలిగినదేకాని, పరమార్థమున యథార్థము కాదని కొందరందురు.

అట్లనరాదు. యథార్థమున భేదములేక ఉపాధిగతమైన భేదమే అయినయెడల, అది అజ్ఞానజనకము. అయినప్పుడు పరమార్థమున భేదములేదని తేలుచున్నది. ఇక్కడ అర్జునునకు పరమార్థమును, తత్త్వజ్ఞానమును బోధించు సమయమున

అజ్ఞానజనకమైన భేదమును ఉపదేశించుట సమంజసమా? వానికున్న అజ్ఞానములోనే సమాధానము చెప్పి, తాత్కాలికముగ పని నెరవేర్చుకొందమనియా కృష్ణపరమాత్మ గీతాప్రబోధము మొదలుపెట్టినది? కాదు కనుక కృష్ణపరమాత్మ పరమార్థముగనే గీతాప్రబోధము చేసియున్నాడు. ఆత్మకును పరమాత్మకును గలట్టియును, ఆత్మలలో పరస్పరమును గలట్టియును భేదమునే ఉపదేశించుచున్నాడు. ఆయన అభిప్రాయము ప్రకారము భేదమే సత్యము. శ్రుతికూడ "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యోవిదధాతి కామాన్" (శ్వేత. ౬-౧౩) అనగా, 'అనేకములైన, నిత్యములు, చేతనములు అయిన ఆత్మలలో, ఒక నిత్యుడు, చేతనుడు అయినపరమాత్మ. కామములను ఇచ్చుచున్నాడు. (పూర్తిచేయుచున్నాడు). పరమాత్మ నిత్యులలో నిత్యుడు. చేతనులలో చేతనుడు.' ఈ శ్రుతికూడ ఆత్మకును పరమాత్మకునుగల భేదమును, ఆత్మల యొక్క అనేకత్వమును ప్రతిపాదించుచున్నది.

**అవతారిక :—**

ఆత్మయొక్క నిత్యత్వమును ఇంకను కొన్నియుక్తులతో ప్రతిపాదించుచున్నాడు కృష్ణపరమాత్మ.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తర ప్రాప్తి
ర్ధీర స్తత్ర నముహ్యతి ॥ ౧౩

ప. వి :—దేహినః, అస్మిన్, యథా, దేహే, కౌమారం, యౌవనం, జరా, తథా, దేహాన్తరప్రాప్తిః, ధీరః, తత్ర, న, ముహ్యతి.

టీక :—

దేహినః = ఆత్మకు,
అస్మిన్ దేహే = ఈ శరీరమునందు,
కౌమారం = బాల్యమును,
యౌవనం = యౌవనమును,
జరా = ముదిమియును (వృద్ధాప్యమును),
యథా = ఏవిధమున క్రమముగ వచ్చునో,
తథా = ఆవిధముననే,
దేహాన్తరప్రాప్తిః = మరియొక శరీరమును పొందుట యును (కలుగుచున్నది).
తత్ర = ఆ విషయమున,
ధీరః = (దేహము ఆత్మకాదనియు, దేహ మనిత్య మనియు, ఆత్మ నిత్యమనియును అనుభవము గల్ల జ్ఞాని,
నముహ్యతి = మోహమును పొందడు.

తా. ఆత్మకు ఈ దేహమునందు కౌమారము, యౌవనము, వృద్ధాప్యము ఎట్లు కలుగుచున్నవో, అట్లే. ఈ దేహమును వదలి ఇంకొక, దేహమును పొందుటకూడ కలుగుచున్నది. తెలిసిన ధీరులు ఈ విషయమున దుఃఖించరు. (మోహమున పడరు).

(10)

అ మృ త వా హి ని :—

అర్జునా ! ఆత్మ ఈ దేహమును విడుచునప్పుడు, పామరుడు ఈ దేహముకంటె ఆత్మ వేరుగాయున్నదనుజ్ఞానము లేకపోవుటచేత, దేహము నశించుటయనగా, సర్వము నశించు చున్నదని భ్రాంతిజెంది, శోకించుచున్నాడు. అది తప్పు. దేహము నశించినను అది నశించదు. దేహము మారినను ఆత్మమారదు. ఒక దేహమునందు బాల్యము, కౌమారము, యౌవనము, వృద్ధాప్యము అను దశలు కలిగినను, ఒకదశనుండి మరొక దశకు దేహము మారినప్పుడు ఆత్మమారుచున్నదా ? లేదు గదా ! బాల్యములో తాను చేసినపనులు, వృద్ధాప్యమున కూడ 'బాల్యములో నే నీ పనిని చేసితిని' అని చెప్పుకొను చున్నాడుగదా! అనగా దేహము బాల్యదశలో నున్నప్పుడును, కౌమార, యౌవన, వృద్ధాప్యదశలలోనికి మారినప్పుడును, తానుమాత్రము మార్పులేక ఒక్కడుగనే యున్నట్లు అనుభవమువలన కూడ తెలియుచున్నది గదా। 'ఈ దేహము వదలి ఇంకొక దేహమును ధరించుటకూడ ఆత్మకు అట్లే' అని తెలిసిన ధీరులు ఎవరికొరకు దుఃఖించెదరు ? ఎందుకు దుఃఖించెదరు ? దేహము ఒకదశనుండి మరొకదశను పొందునప్పుడు ఎవ్వరైనను ఆత్మనశించుచున్నదని దుఃఖించుచున్నారా? లేదు. కారణము - ఈ విషయము అందరకును తెలియును గనుక.

అట్లే, ఆత్మజ్ఞానులు, ఈ ఆత్మ దేహమును వదలి ఇంకొక దేహమును పొందునప్పుడుకూడ ఆత్మనశించుటలేదని

తెలియునుగనుక దుఃఖించరు. పామరులు దుఃఖించెదరు. కనుక అర్జునా ! నీవు దుఃఖించవద్దు - అని భావము.

అ వ తా రి క :—

పూర్వశ్లోకములో ఆత్మయొక్క నిత్యత్వమును, నిర్వికారత్వమును ప్రతిపాదించి, రాబోవు శ్లోకములో సుఖదుఃఖములకు కారణమును చెప్పుచున్నాడు.

శ్లో॥ మాత్రాస్పర్శా స్తు కౌంతేయ !
శీతోష్ణ సుఖదుఃఖదాః ।
అగమాపాయినోఽనిత్యా
స్తాం స్తితిక్షస్వ భారత ! ౧౪

ప. వి :—మాత్రాస్పర్శాః, తు, కౌంతేయ, శీతోష్ణ, సుఖ దుఃఖదాః, అగమాపాయినః, అనిత్యాః, తాన్, తితిక్షస్వ, భారత.

టీక :—

కౌన్తేయ ! = ఓ అర్జునా !
మాత్రాస్పర్శాః + తు = పంచతన్మాత్రలవలన పుట్టిన శ్రోత్రాదీంద్రియములయొక్క శబ్దాది విషయ సంయోగము లయితే,

శీతోష్ణసుఖదుఃఖదాః = చలి, వేడి, మొదలగు సుఖ దుఃఖములను గలుగజేయు నవియును,

ఆగమాపాయినః = సంయోగ వియోగములు గలిగి నవియును (ఒకప్పు డుండి మరొక్కప్పుడు లేకుండునవి),

అనిత్యాః = అస్థిరములైనవియును (అయి ఉన్నవి),

(తస్మాత్ = కాబట్టి),

తాన్ = ఆ శీతోష్ణాదులను,

భారత ! = ఓ అర్జునా !

తితిక్షస్వ = ఓర్చుకొనుము.

తా. ఓ కౌంతేయా ! ఇంద్రియములకును, విషయములకును సంయోగము కలిగినప్పుడు, శీతోష్ణములు, సుఖదుఃఖములు అనుభవము నకు వచ్చుచున్నవి. కాని అవి అనిత్యములు. ఉత్పత్తి నాశనములు కలవి. కాబట్టి భరతకులశ్రేష్ఠా ! వాటిని సహించుకొనుము.

అమృతవాహిని :-

"మీయంతే జ్ఞాయంతే ఆభిః శబ్దాది విషయాః ఇతి మాత్రాః" అను వ్యుత్పత్తి ప్రకారము మాత్రలు అనగా జ్ఞానేంద్రియములు అయిదును, 'స్పృశ్యంతే ఇతి స్పర్శాః' అను వ్యుత్పత్తి ప్రకారము స్పర్శములు అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అను అయిదు విషయములును,

కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! అంతఃకరణముతో కూడిన ఇంద్రియము లకును, విషయములకును సంయోగము కలిగినప్పుడే మానవు నకు సుఖదుఃఖములు అనుభవమునకు వచ్చును. విషయములు ఇంద్రియములతో కూడినప్పుడే శీతోష్ణములు, సుఖదుఃఖ ములు, రాగద్వేషములు, హర్ష శోకములు, అనుకూల ప్రతి కూలములు మొదలగు ద్వంద్వములను కలిగించగలుగుతవి. ప్రత్యేకముగ, విషయములుగాని, ఇంద్రియములుగాని సుఖ దుఃఖాది ద్వంద్వములను కలిగించలేవు. ఇది సృష్టినియమము. ఇంద్రియములకును విషయములకును గలుగు సంయోగ వియోగములు నిత్యములు కావు. క్షణక్షణమునకు మారు చుండునవి. రాకపోకలు కలిగినవి. కాబట్టి ఆ సంయోగ వియోగములచేత గలుగు సుఖదుఃఖాది ద్వంద్వములు కూడ అనిత్యములే. వానిలో ఏదియును స్థిరముగ నుండదు. కాని వాటిమీాది నిత్యత్వబుద్ధి అనేక వికారములకును అనర్థము లకును కారణమగుచున్నది. వాటియందు నిత్యత్వబుద్ధిని తొల గించుకొనవలయును. సంయోగవియోగములు జరుగకుండ ఎవరును ఆపలేరు. వాటిని గురించి నీకు నిత్యత్వబుద్ధి లేనినాడు ఓర్చుకొనగల సామర్థ్యము కలుగును. ఈ తత్త్వమును తెలిసి కొని ఈ శీతోష్ణములను, సుఖదుఃఖములను ఓర్చుకొనుము. అనగా, సుఖమైనను కష్టమైనను, ఆనందమైనను దుఃఖమైనను, లాభమైనను నష్టమైనను, జయమైనను అపజయమైనను సమానముగ తలంచుము. పొంగుట, క్రుంగుట చేయకుము.

యథార్థమాలోచించినయెడల, ప్రతిమానవుడు ప్రతి విష యములోను కొంచెముగనో గొప్పగనో శీతోష్ణ సుఖ దుఃఖాదులను సహించుచునే యున్నాడు. వాటిని సహించ లేనివాడు ప్రతిపనిలోను ఎప్పుడును వెనుకంజ వేయుచునే యుండును. బ్రాహ్మణుడు తెలవారుజామునే లేచి స్నానానుష్ఠానములను చేసికొనవలయును. చలికి ఓర్చుకొన లేనివాడు స్నానమునకు జంకును. తపస్సు చేయవలయుననిన శారీరక మానసిక కష్టములను ఓర్చుకొనవలసియుండును. అదిలేనివాడు తపస్సు చేయలేడు. వ్యవసాయము చేయ వలయుననిన, తరువాతవచ్చెడి లాభముకొరకై ముందు ఖర్చులు నష్టములు కష్టములు భరించి ఓర్చుకొనవలసి యుండును. అదిలేనివాడు వ్యవసాయము చేయగలడా? కూలిచేసి జీవించువాడు ఎండకు వానకు శారీరక కష్టమునకు ఓర్చి యుండవలయును. లేనిచో, అతనిపని సాగదు. కేవలము ధనమే ప్రధానముగ ఎంచుకొనువాడు, ధనవంతుని వద్దకు యాచనకు పోయినప్పుడు,వాడు గౌరవించినను,అగౌరవించినను ఎట్టిమాటలు అన్నను ఓర్చుకొని యుండును. అట్లుండకపోయిన వారికి ఒకపైసకూడ రాదు. ఇట్లే జగత్తులో ఏపని అయినను సహనశక్తిలేనిది ఆవగింజంతకూడ నెరవేరదు. అయితే, ఆ చేయుపనినిబట్టి ఓర్చుకొనవలసిన ద్వంద్వములుకూడ హెచ్చు తగ్గులతో ఉండును. అంతియేగాని అసలు ఉండకపోవు. దుష్టు లకును శిష్టులకునుకూడ ఓర్పు అవసరమే. ఎవరెవరికి ఏతేజస్సుల

యందు ప్రేమ, విశ్వాసము, శ్రద్ధ కలవో ఆయా పనులకొంకు వారు ద్వంద్వములను సహించుకొనుచునే యుందురు. సహించుకొన గలుగుదురుకూడ. శ్రద్ధ, విలువ, ప్రేమ, విశ్వాసము లేని పనులకొరకు ఎవరును బాధపడరు. కాని జనసామాన్యములో ఆ ఓర్పు ఒక క్రమబద్ధముగను, శాస్త్రసమ్మతముగను ఉండదు. ఆ ఓర్పును విజ్ఞానదృష్టితో గమనించుకొనుచు శాస్త్రసమ్మతముగను, క్రమబద్ధముగను ఆచరణలోనికి తెచ్చు కొనగలిగిననాడు, అతడు తరించుటయేగాక, లోకులు తరించు టకుకూడ కారణభూతుడగును.

కొంతమంది వ్యాఖ్యాతలు, 'మాత్రాస్పర్శాః' అన్న ప్పుడు, మాత్రలనగా 'విషయములు' అని అర్థము వ్రాసినారు. అమృతవాహిని, మాత్రలనగా 'ఇంద్రియములు' అని అర్థము వ్రాసినది. రెండువిధములుగను అర్థముతీయుటకు వీలు లేకపోలేదు. ఎట్లు తీసినను విషయమునకు మాత్రము ప్రతిబంధ కము లేదు. 'ఇంద్రియములకు విషయములకు సంయోగము కలుగుటచే సుఖదుఃఖాది ద్వంద్వములు కలుగుచున్నవి' అని ఒకరు వ్రాసిన, 'విషయములకు ఇంద్రియములకు సంయో గము కలుగుటచే సుఖదుఃఖాది ద్వంద్వములు కలుగుచున్నవి' అని మరొకరు వ్రాసిరి. ఎట్లు వ్రాసినను బాధలేదు. మాత్రలనగా ఇంద్రియములా ? విషయములా? అని శబ్దార్థములు తీయుటలో భేదమే కాని, ఈ శ్లోకమువలన ఏభావమును కృష్ణపరమాత్మ

చెప్పదలచుకొ నెనో, ఆ భావమునకు ఎవరును అడ్డురాలేదు. కనుక బాధలేదు దానిని గురించి తర్జనభర్జనలుఅవసరము లేదు.

అ వ తా రి క :—

అట్లు సుఖదుఃఖాది ద్వంద్వములను సహించుకొనుటచే కలుగు లాభమును చెప్పుచున్నాడు.

శ్లో॥ యం హి న వ్యథయంత్యేతే
పురుషం పురుషర్షభ !
సమదుఃఖసుఖం ధీరం
సోఽమృతత్వాయ కల్పతే ॥ ౧౫

ప. వి :—యం, హి, న, వ్యథయన్తి, ఏతే, పురుషం, పురుషర్షభ, సమదుఃఖసుఖం, ధీరం, సః, అమృతత్వాయ, కల్పతే.

టీక :—

పురుషర్షభ ! = ఓ మనుజశ్రేష్ఠుడా !
ఏతే = ఈ మాత్రాస్పర్శములు (విషయవాసనలు),
సమదుఃఖసుఖం = సుఖదుఃఖములయందు సమబుద్ధి గలిగిన,
ధీరం = వివేకియైన,
యం పురుషం = ఏ పురుషుని,
న వ్యథయన్తి = బాధింపవో,

సః హి = వాడుగదా,
అమృతత్వాయ = మోక్షము కొరకు,
కల్పతే = అర్హుడగుచున్నాడు.

తా. ఓ పురుషశ్రేష్ఠా! ఎవడు సుఖదుఃఖములను సమముగా చూడగలుగుచున్నాడో, ఎవనిని ఈ ఇంద్రియ విషయ సంయోగము వలన కలిగెడి ద్వంద్వములు చలింపజేయజాలవో, అట్టి ధీరుడుమాత్రమే అమృతత్వమునకు - మోక్షమునకు - అర్హుడగుచున్నాడు.

**అమృతవాహిని :—**

'పురుషర్షభ !' అని అర్జునుని సంబోధన చేయుటలో శ్రీకృష్ణపరమాత్మ అభిప్రాయము :

"అర్జునా! నీవు పురుషశ్రేష్ఠుడవు. శూరత్వ, వీరత్వ, ధీరత్వాదులు నీకు సహజగుణములు. కాబట్టి నిన్ను ఈ సుఖ దుఃఖాది ద్వంద్వములు ఏమియును చేయజాలవు. నీ సహజ స్థితి నీకు తెలియక మోహమునబడి దుఃఖించుచున్నావు. నీస్థితి ఎటులున్నదో తెలియునా ?

"ఒక పెద్దపులి నిండుగర్భిణియై యుండగ తుపాకిదెబ్బ తిని ప్రసవించి మరణించినది. ఆ పిల్లను అక్కడ గొఱ్ఱెలు కాచుకొనువారు పెంచిరి. అది కొంచెము పెద్దదైనది. ఆ గొఱ్ఱెల లోనే తిరుగుచు, తానుకూడ ఒకగొఱ్ఱెనే అనుకొనుచు,

కుక్కలు మొఱిగినను, తోడేళ్ళు వచ్చినను, ఆ గొఱ్ఱెలతో పాటు తానుకూడ పారిపోవుచు, ఆ గొఱ్ఱెలవలెనే అరచుచు, గడ్డి మేయుచు ఉండెను. తరువాత సమయము వచ్చినప్పుడు ఒక పెద్దపులి రాగా, గొఱ్ఱెలన్నిటితో పాటు అదికూడ పారిపోవు చుండెను. ఆ పులికి ఆశ్చర్యము కలిగి, ఈ పులిని పట్టుకొని, 'ఏమి అట్లు పారిపోవుచున్నావు ? నీవు గొఱ్ఱెవు కావు చూడుము' అని ఒక నీటిగుంటవద్దకు తీసికొనిపోయి, తన రూపమును దానిరూపమును ఒకటిగ నుండుటను జూపి, తన అరుపువలె అరుపునేర్పి, మాంసము తినుట అలవరచెను. అంతటినుండి ఈ పులికి తనయథార్థస్వరూపము అనుభవమునకు వచ్చినది. అప్పుడు దానికి ఆ భయము, ఆ గొఱ్ఱె అరుపులు, ఆ గడ్డితినుటలుపోయి, సహజమైన ధైర్యసాహసములు కలిగినవి. ఇప్పుడు నీస్థితికూడ ఇట్లే యున్నది. నీ సహజస్వరూపమును తెలిసికొనుము. క్షుద్రమైన హృదయదౌర్బల్యమును పారద్రోలుము. నిన్ను ఈ ద్వంద్వములు ఏమి చేయగలవు ?" అను అభిప్రాయమును సూచించుచున్నాడు కృష్ణపరమాత్మ.

వీరుడనగా బాహ్యశత్రువులను జయించగలిగినవాడు. ధీరుడనగా అంతశ్శత్రువులను జయించగలిగినవాడు. కాపుననే ఈ శ్లోకములో 'ధీరం' అని ప్రయోగించినాడు. ధీరుడుగాని, పరమపదప్రాప్తిని పొందలేడు. ధీరునకు సుఖదుఃఖములు సమానములు. ఇవన్నియును అనిత్యములగుటచే, అతనికి ఈ

ద్వంద్వములయందు ఇష్టానిష్టములుండవు. కనుక ధీరుడే ఈ ద్వంద్వములను సహించుకొనగలడు. ధీరుని ఈ ద్వంద్వములు ఎంతమాత్రమును బాధింపజాలవు. అనగా, నేత్రేంద్రియము నకు అనేక దృశ్యములు కనుపడవచ్చును. దానినే నేత్రేంద్రియమునకును రూపమునకును సంయోగమందురు. ఆ సంయోగము ధీరుని బాధించదు. విషయలోలునకు ఒక సుందరి కనుపడినయెడల - అతని నేత్రేంద్రియమునకును, ఆమె రూపమునకును సంయోగము కలిగినయెడల - ఆ సంయోగము అతని చిత్తమును సంక్షోభపెట్టును. అతిగ బాధించును. ఇట్లే సమస్తేంద్రియములు, సమస్తవిషయములు సంయోగము చెందినప్పుడు, దానికి తగిన సుఖమో దుఃఖమో కలుగుచుండును. అది ధీరునకుండదు. పర్వతము వర్షధారాపాతము నకు ఎట్లు చలించదో, అట్లే ధీరుడు విషయేంద్రియ సంయోగమునకు చలించడు. సాధనకాలములో సక్రమ పద్ధతులలో ద్వంద్వముల తత్త్వమును, వాటి అనిత్యత్వమును, తుచ్ఛత్వ మును విచారణ చేసికొనుచు, మననము చేసికొనుచు ఉన్న యెడల, సహించుకొను సామర్థ్యము కలుగును. "అర్జునా! నీవు సహజముగ ధీరుడవు. కనుక మోహితుడవుగాక వీటిని సహించుకొనుము" అని క్రిందటి శ్లోకములో చెప్పి, ఈ శ్లోక ములో "అట్లు సహించుకొనగలిగినవాడే, ద్వంద్వములచేత బాధనొందనివాడే, మోక్షమునకు అర్హుడగుచున్నాడు" అని చెప్పుచున్నాడు.

అవతారిక :-

ఇంకను ఎందువలన మోహమునకు, శోకమునకు కారణములేదో చెప్పుచున్నాడు.

శ్లో॥ నాసతో విద్యతే భావో
నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్త
స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ ౧౬

ప. వి :— న, అసతః, విద్యతే, భావః, న, అభావః, విద్యతే, సతః, ఉభయోః, అపి, దృష్టః, అన్తః, తు, అనయోః, తత్త్వదర్శిభిః.

టీక :—

అసతః = లేనిదానికి,
భావః = కలిమి,
న విద్యతే = లేదు,
సతః = కలదానికి,
అభావః = లేమి,
న విద్యతే = లేదు,
అనయోః ఉభయోః అపి = ఈ రెంటియొక్కయు,
అన్తస్తు = నిశ్చయమన్ననో,
తత్త్వదర్శిభిః = జ్ఞానులచే,
దృష్టః = తెలిసికొనబడినది.

తా. అసద్వస్తువైన దేహమునకు నశించకపోవుట అనునది లేదు. సద్వస్తువైన ఆత్మకు నశించుట అనునది లేదు. ఈ విధముగ సదసత్తుల రెంటియొక్క స్వరూపమును తత్త్వదర్శినులు తెలిసికొనియున్నారు.

## అమృతవాహిని :—

అసత్తైన కెప్పుడును నిత్యత్వము లేదు. సత్తునకు అనిత్యత్వము లేదు. ఇక్కడ 'భావము' అనగా 'నిత్యత్వము'; 'అభావము' అనగా 'అనిత్యత్వము'. 'అసత్పదార్థము' అనగా, ఈ నామరూపాత్మకమైన జగత్తంతయును. 'సత్పదార్థము' అనగా, ఆత్మసముదాయము, పరమాత్మ. 'అసత్పదార్థమైన ఈ జగత్తంతయు నశించెడిదే. దీనికి నిత్యత్వము లేదు' అను న్యాయమాధారముగ, ఇక్కడ శరీరములను గూర్చియే చెప్పుచున్నాడు. ఎందులకన, అర్జునుని దుఃఖము ఈ కనుపడు భీష్మాదులయొక్క శరీరములను గురించియో, లేక ఆత్మలను గురించియో అయి యున్నది. కనుక, 'ఈ శరీరములను గురించిగాని, ఆత్మలను గురించిగాని నీవు దుఃఖించపనిలేదు' అని చెప్పుటకై, 'ఈ శరీరము అసత్పదార్థములో చేరినది కనుక, దీనికి నిత్యత్వము లేదు, ఎట్లును నశించెడిదే. అనివార్యమైనదానికి నీవంటి ధీరుడు దుఃఖించరాదు. ఆత్మల గురించి అందువా ? ఆత్మ సత్పదార్థములో చేరినది కనుక, దానికి అనిత్యత్వము లేదు. నశించునది కాదు. కనుక, దానికై దుఃఖించుట అనవసరము. ఎట్లుచూచినను, నీవు దుఃఖించపనిలేదు'

అని చెప్పుట కుపక్రమింపబడిన శ్లోకమిది. కనుక ఇక్కడ అసత్పదార్థమన్న, ప్రధానముగ శరీరమును గురించియే యని యును, సత్పదార్థమన్న, పరమాత్మను గురించికాక ఆత్మను గురించియే యనియును తెలియవలయును. అయితే, పరమాత్మ కూడ సత్పదార్థమే. కాని ఇక్కడ ప్రకరణము ఆత్మకు సంబంధించినది.

"అర్జునా! నీవు 'భీష్ముడు మొదలగువారు చనిపోదురు' అని దుఃఖించుచున్నావే. భీష్ముడు అనునది శరీరమా? లేక ఆత్మయా? శరీరమే అందువా? అదెట్లును నశించెడిదే. నీవు ఎంత జాగ్రత్తగ కాపాడినను, అది నిలుచునదికాదు. ఆత్మ యందువా? అది ఎప్పుడును చచ్చునదికాదు. ఎవరును చంపలేరు. ఇక దేనికొరకు ఏడ్చుట?" అని భావము.

దేనికి పరివర్తనము, నాశనము కలదో, అది 'అసత్' అనియును, 'అసత్' ఎల్లప్పుడును ఉండునది కాదనియును, దేనికి ఏ అవస్థయందును, ఏ కారణముచేతను, ఎప్పుడును, పరివర్తనము, నాశనములేదో, ఏది ఎల్లప్పుడును ఉండునో, అది 'సత్' అనియును, ఆ సత్పదార్థము ఎప్పుడును నశించునది కాదనియును, పరమాత్మసాక్షాత్కారము పొందిన తత్త్వదర్శినులు అనుభవపూర్వకముగ తెలిసికొని నిర్ణయించినారు.

**అవతారిక :—**

సత్పదార్థము యొక్క నిత్యత్వమునే ప్రతిపాదించ బోవుచున్నాడీ శ్లోకములో.

శ్లో॥ అవినాశితు తద్విద్ధి
యేన సర్వ మిదం తతమ్ ।
వినాశ మవ్యయ స్యాస్య
న కశ్చి త్కర్తు మర్హతి ॥ ౧౭

ప. వి :—అవినాశి, తు, తత్, విద్ధి, యేన, సర్వం, ఇదం, తతం, వినాశం, అవ్యయస్య, అస్య, న, కశ్చిత్, కర్తుం, అర్హతి.

**టీక :—**

ఇదం సర్వం = ఈ సకలమును,
యేన = ఏ వస్తువుచేత,
తతం = వ్యాపింపబడియున్నదో,
తత్ = అట్టి (సర్వవ్యాపియైన) ఆత్మ,
అవినాశి (ఇతి) = నాశము లేనిదనియు,
అవ్యయస్య = నాశములేని,
అస్య = ఈ ఆత్మకు,
వినాశం = నాశనమును,
కర్తుం = కలుగజేయుటకు,

కశ్చిత్ = ఎవడును,
న + అర్హాతి = అర్హుడు కాడనియును,
విద్ధి = తెలిసికొనుము.

తా. ఈ సమస్తముచు దేనిచేత వ్యాపింపబడి యున్నదో, దానిని 'అవినాశి' అని తెలిసికొనుము. ఈ అవ్యయతత్త్వమును నశింపజేయుటకు ఎవరును సమర్థులుకారు.

అ మృ త వా హి ని :-

ఈ కనపడు సమస్త శరీరములందును వ్యాపించియున్న ఆత్మతత్త్వము నాశములేనిది సుమా ! దీనిని నశింపజేయ సమర్థులైనవారు ఎవరును లేరు. దీనికంటె భిన్నమైన ఏ పదార్థము చేతను ఇది నశింపజేయబడదు. స్వయముగ నశించదు. కనుక నిత్యము. దీనికొరకు ఏడ్చుటెందులకు అని భావము.

ఈ 'సర్వమును' అనగా దేనిని ఉద్దేశించుకొని కృష్ణ పరమాత్మ చెప్పుచున్నాడు ?

౧. 'ఈ నామరూపాత్మకమైన క్షరాక్షరసంయుక్తమైన, వ్యక్తావ్యక్తమైన సమస్త జగత్తు' అని అర్థమా ? లేక.

౨. 'ఈ నామరూపాత్మకమైన, వ్యక్తావ్యక్తమైన, కేవల జడవర్గమైన సమస్తము' అని అర్థమా ? లేక,

3. 'ఎవరు చనిపోవుదురని నీవు దుఃఖించుచుంటివో, ఆ కనపడు ఈ శరీరము'లని అర్థమా ? ఆలోచించవలయును.

౧. ఈ 'నామరూపాత్మకమైన, క్షరాక్షరసంయుక్తమైన, వ్యక్తావ్యక్తమైన సమస్త జగత్తు' అనినయెడల, ఇక దీనిలో చెప్పనిది మిగిలినదేది ? పరమాత్మవస్తువు.

ఈ పరమాత్మవస్తువు నశించునేమో, చంపబడునేమో అని అర్జునుడు దుఃఖించుటలేదు. ప్రకరణమునుబట్టి పరమాత్మ వస్తువునకు ఇక్కడ ప్రసంగములేదు.

౨. 'ఈ నామరూపాత్మకమైన, వ్యక్తావ్యక్తమైన, కేవల జడవర్గమైన సమస్తము' అనినయెడల,

అర్జునుడు 'ఈ జగత్తంతయును నశించునేమో' అని దుఃఖించుటలేదు. కనుక ఇక్కడ ఈ విచారణ అప్రస్తుతము.
3. 'ఈ కనపడు శరీరములు' అనినయెడల.

అవును - ఈ కనపడునట్టి భీష్మాదుల శరీరములను గురించియే కృష్ణపరమాత్మ చెప్పినది. అర్జునుడు ఏడ్చునది కూడ వీనికొరకే. వేనికొరకు అర్జునుడు ఏడ్చుచున్నాడో, ప్రస్తుతము వానినిగురించి చెప్పవలయును. తరువాత ప్రసంగము సాగుచున్నకొలదిని అన్ని విషయములును రావచ్చును. ఇక్కడ శరీరములను గురించి కనుక, ఈ శరీరములు అనిత్యములు, నశించునవి అనియును, వీనిలో వ్యాపించియున్న 'ఆత్మ'

నిత్యమైనది' నశించనిది అనియును విచారణ అవసరము. ఇప్పుడు కృష్ణపరమాత్మ ఈ విచారణయే చేయుచున్నాడు.

కాబట్టి 'ఈ సర్వము' అనునప్పుడు 'నీకు కనుపడు ఈ శరీరములన్నియు' అని అర్థము చేసికొనవలయును.

"అర్జునా! నీవు ఏ భీష్మాదులనుగూర్చి వీరందరును చనిపోవుదురని ఏడ్చుచుంటివో, వారెవరు? ఈ శరీరములా? కాదు. ఈ శరీరములలో వ్యాపించియున్న ఆత్మలు. శరీరము ఆత్మఅని రెండుపదార్థములు కలవు. ఈ రెంటిలో నీవు దేనికొరకు ఏడ్చుచున్నావు? ఆత్మకొరకా?" అని ప్రశ్నించి, ఈ రెండు పదార్థములలో ఒకటి 'అసత్', ఒకటి 'సత్' అని చెప్పి 'అసత్' అనగా అనిత్యము, నశించునది అనియును, 'సత్' అనగా నిత్యము, నశించనిది అనియును నిర్ణయించి, ఇప్పుడు శరీరము, ఆత్మ- ఈ రెంటిలో ఏది 'సత్' ఏది 'అసత్' అను విషయమును చెప్పబోవుచు, ముందు ఆత్మపదార్థము 'సత్' అనియును, నశించనిదనియును చెప్పుచున్నాడు.

"ఈ సమస్తమైన శరీరములలోను ఆత్మరూపముతో నున్న తత్త్వము నాశనములేనిది అని తెలిసికొను మను చున్నాడు. ఇది తనకంటె భిన్నమైన దేనిచేతనునశింపజేయబడదు. ఏదియు దీనిని నశింపజేయలేదు. ఇది తనంతటతాను నశించదు. కనుక దీనికొరకు దుఃఖింపవలసిన పనిలేదు" అని వర్ణించినాడు.

'సకల దేశములలోనున్న ప్రజ' అనునప్పుడు 'ప్రజ' ఎట్లు జాత్యేకవచనమో, అట్లే 'ఈ సమస్త శరీరములలో నున్న ఆత్మ' అనునప్పుడు 'ఆత్మ' జాత్యేకవచనముగ గ్రహించవలయును.

అ వ తా రి క :—

ఇప్పుడు శరీరములు అనిత్యములని చెప్పుచున్నాడు.

శ్లో॥ అంతవంత ఇమే దేహా
నిత్య స్యోక్తా శ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య
తస్మా ద్యుధ్యస్వ భారత ! ౧౮

ప. వి :—అన్తవన్తః, ఇమే, దేహాః, నిత్యస్య, ఉక్తాః, శరీరిణః, అనాశినః, అప్రమేయస్య, తస్మాత్, యుధ్యస్వ, భారత.

టీక :—

నిత్యస్య = వికారరహితుడును,
అనాశినః = నశింపనివాడును,
అప్రమేయస్య = ప్రత్యక్షాది షట్ప్రమాణములచేతను, కాల దేశ స్వరూపములచేతను తెలిసికొనదగనివాడునగు,
శరీరిణః = దేహియైన ఆత్మయొక్క,

ఇమే దేహాః = ఈ శరీరములు,
అన్తవన్తః = అంతము కలవిగా (నాశముకలవిగా),
ఉక్తాః = చెప్పబడినవి,
తస్మాత్ = కావున (అందువలన),
భారత ! = ఓ అర్జునా !
యుధ్యస్వ = యుద్ధముచేయుము.

తా. వికారరహితుడు, నాశనములేనివాడు, అప్రమేయుడు అయిన శరీరియొక్క - అనగా ఆత్మయొక్క - ఈ దేహములన్నియును, నశించునవిగ చెప్పబడినవి. కావట్టి, భరతవంశములోనివాడవైన అర్జునా ! యుద్ధము చేయుము.

అ మృ త వా హి ని :—

ఆత్మ, శరీరమును ధరించినవాడు కనుక శరీరి; నాశనములేనివాడు కనుక అనాశి. ఒక్క శాస్త్రముచే తప్ప, ఇతరమైన ఏ ప్రమాణముచేతను తెలియబడనివాడు కనుక అప్రమేయుడు. భూతభవిష్యద్వర్తమాన కాలములయందుండువాడు కనుక నిత్యుడు. ఇటువంటి ఆత్మయొక్క శరీరములు అంతవంతములు. అనగా నశించునవి. మరణధర్మముకలవి. శరీరమందు వ్యాపించియుండు ఆత్మ నశించదుగదా! ఎవరును నశింపజేయలేరుగదా ! (అతని శరీరములు సహజముగనే నశించునవి. ఎవరును నశింపజేయకున్నను నిలుచునవికావు). కనుక నీ క్షాత్రధర్మమైన ధర్మయుద్ధమును నీవు చేయవలసినదే.

"అర్జునా! ఈ శరీరములు ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక విధమున, ఎక్కడో అక్కడ, నశించితీరవలసినవే. కాని, జీవుడు మాత్రము ఎన్నడును నశించడు. కనుక యుద్ధము చేసినయెడల, ఎవరు చనిపోదురని విచారించుచుంటివో అది భ్రాంతిసుమా! నీవు యుద్ధము చేయకపోయినను, అవి నశించు నవేగదా! "నేను యుద్ధము చేసినయెడల వీరందరును నశించెద" రని భ్రాంతి ఎందులకు? యుద్ధము చేసినను, అందువలన ఈ శరీరములు నశించినను, ఆత్మ నశించదు. నీవు యుద్ధము చేయకపోయినను శరీరములు నిలువవు. కనుక ధైర్యము వహించి నీ క్షాత్రధర్మమైన ధర్మయుద్ధము చేయుము."

ఈ శ్లోకములో 'దేహములు' అని బహు వచనమును, 'శరీరిణః' 'శరీరియొక్క' అని ఏకవచనమును ప్రయోగించుటచేత 'అన్ని శరీరములలోను ఒకటే ఆత్మ వ్యాపించియున్నది' అను అర్థము ప్రకారము, 'అనేకాత్మలు కలవు' అనువాదము నిరస్తమైనట్లు తెలియుటలేదా అను సందేహము కలుగవచ్చును.

అట్లనరాదు - ఆత్మ ఇదివరకు అనేక దేహములు ధరించియున్నది. ముందు ఇంకను అనేక దేహ ములు ధరించగలదు. వర్తమానమున దేహము ధరించి యున్నది. ఈ దేహమును చూపుచు, ధరించివిడువబడినవియు, ధరింపనున్నవియునైన దేహములను దృష్టిలో నుంచుకొని 'ఈ దేహములు' అని బహువచనములో ప్రయోగించినాడు. అంతియేగాని, ఎదుటి సైన్యములోని దేహములను దృష్టిలో

నుంచుకొని 'ఈ దేహములు, అని ప్రయోగించలేదు. కనుక ఇంతమాత్రముచే ఆత్మయొక్క ఏకత్వము స్థాపింపబడుటలేదు. ఒక్కొక్క ఆత్మకు అనేక దేహములుండుట కృష్ణపరమాత్మ యొక్క అభిప్రాయము. పదమూడవ శ్లోకములో -

"దేహినోఽస్మిన్ యథా దేహే - కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తర ప్రాప్తి - ర్ధీర స్తత్ర నముహ్యతి॥"

అనగా, 'దేహియైన ఆత్మకు వర్తమాన దేహమునందు కౌమారము, యౌవనము, వృద్ధాప్యము, ఎట్లు కలుగుచున్నవో, అట్లే దేహాన్తరప్రాప్తికూడ కలుగుచున్నది. ఈ విషయమున ధీరుడైనవాడు దుఃఖించడు' అని. ఒకే దేహమునకు కౌమారము మొదలగునవి ఎట్లు సహజములో, అట్లే, ఆత్మకు ఒక దేహము విడిచి, ఇంకొక దేహము ధరించుట సహజమని తేలినది. కనుక ఆత్మకు దేహబాహుళ్యము స్పష్టము.

ముందు రాబోవు ఇరువదిరెండవ శ్లోకములోకూడ, ఇంకొక ఉపమానముతో ఈ సిద్ధాంతమునే స్థాపించినాడు.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ । నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా । న్యన్యాని సంయాతి నవాని దేహీ॥"

అనగా, 'మానవుడు ప్రాత వస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను ధరించినట్లు, ఈ ఆత్మ, ప్రాతశరీరములనువదలి క్రొత్త శరీరములను ధరించును' అని.

ఇక్కడ 'శరీరాణి' - శరీరములు - అని బహువచన ప్రయోగమున్నది. కాని ఈ 'శరీరములు' అన్నది ఎదుట కనులకు కనుపడు అనేక శరీరములను దృష్టిలో ఉంచుకొని కాదు కృష్ణపరమాత్మ చెప్పినది - ఆత్మ ధరించు అనేకజన్మలలోని శరీరములను గురించి చెప్పియున్నాడు. కాబట్టి ఇక్కడ 'ఆత్మ యొక్క ఏకత్వము స్థాపింపబడినది' అనుకొనుట భ్రాంతి మూలకము.

నాల్గవ అధ్యాయములో ఐదవశ్లోకము చూడుడు - "బహూని మే వ్యతీతాని- జన్మాని తవ చార్జున !" 'అర్జునా ! నాకును నీకునుగూడ అనేక జన్మలు గడచినవి' అని చెప్పి యున్నాడు. ప్రతిజన్మలోను, ఒక్కొక్క దేహముండునుగదా! అట్లే అనేక జన్మలలో అనేక దేహములను ఒకే ఆత్మ కలిగి యుండును. ఈ భావమునే దృష్టిలోనుంచుకొని 'ఆత్మయొక్క దేహములన్నియును నశించెడివే' అనుచున్నాడు. ఇట్లు చూపించదలచిన అనేకములు గలవు. ఇక ఈ అధ్యాయము లోనే పన్నెండవ శ్లోకము -

"నత్వేవాహం జాతునాసం - నత్వం నేమే జనాధిపాః ।
నచైవ నభవిష్యామ - స్సర్వే వయ మతఃపరమ్"

అనగా 'అర్జునా ! నేను ఇదివరకు లేనివాడనుకాను. నీవు లేనివాడవు కావు. ఈ రాజులందరును లేనివారు కారు. అట్లే ఇకముందును నేనుగాని, నీవుగాని, ఈ రాజులుగాని ఉండని

వారు కారు. అనగా భూత భవిష్య ద్వర్తమానకాలముల యందు, నేను, నీవు, ఈ రాజులు స్థిరముగ నుండువారమే' అనిభావము.

ఇక్కడ 'నేను, నీవు, ఈ రాజులు' అని కృష్ణపరమాత్మ చెప్పినాడుగదా! ఏ వస్తువుల నుద్దేశించి 'నేను, నీవు, ఈ రాజులు' అను శబ్దములు ప్రయోగించినాడు ? ఈ దేహముల నుద్దేశించియా ? కాదు. ఎందులకనగా, ఈ దేహములు భూతభవిష్యద్వర్తమానకాలములయందు స్థిరముగ నుండునవి కావు. కనుక, ఆ 'నేను, నీవు, రాజులు' అను శబ్దములకు వాచ్యార్థము ఈ దేహములు కాదు; ఈ దేహములలో ఉన్న ఆత్మలు. ఆ ఆత్మలను ఉద్దేశించియే ఆ శబ్దములను ప్రయోగించినాడు అని చెప్పవలయును.

దీనినిబట్టి విచారించి 'ఆత్మలు అనేకములు' అని కృష్ణపరమాత్మ అభిప్రాయమైనట్లు గ్రహించవలయును. మూడవ అధ్యాయములో ఇరువదవశ్లోకములో "కర్మణైవహి సంసిద్ధి - మాస్థితా జనకాదయః" 'జనకుడు మొదలగు జ్ఞానులు సైతము, ఆసక్తిరహితముగ కర్మలు చేసియే పరమపదమును ప్రాపించి యున్నారు' అని యున్నది. ఇక్కడ 'సంసిద్ధి మాస్థితాః' 'పరమపదమును ప్రాపించిరి' అని బహువచనము ప్రయోగించ బడినది. ఎవరు ? 'జనకాదయః' జనకుడు మొదలగువారు. జనకుడు మొదలగువారు అనగా దేహములా ? 'శరీరములు

పరమపదమును ప్రాపించినవి' అనుట కృష్ణపరమాత్మ సిద్ధాంత మైయుండునని ఊహించుటకైన వీలుండునా? శరీరము లందున్న ఆత్మలని అభిప్రాయము. ఆత్మలే పరమపదమును ప్రాపించినవి అను అభిప్రాయము సమంజసము. ఈ పరమపద ప్రాప్తి శరీరములకని శాస్త్రీయమైన ఏ సిద్ధాంతము అంగీక రించును ? ఎవరును అంగీకరించరు. కనుక 'ఆత్మలకే' అని తేలిననాడు, 'ఆత్మలు' అని బహువచనములో ఉండుటచే అనేకములనియే సిద్ధాంతము.

పన్నెండవ అధ్యాయములో 'తే ప్రాప్నువంతి మామేవ' 'వారు నన్నే పొందుచున్నారు' అనియును, 'యాంతి మద్యాజి నోఽపిమాం' 'నన్ను భజించువారు నన్నే పొందుచున్నారు' అనియును, 'తేఽపి యాంతి పరాంగతిం' 'వారుకూడ పరమపద మును పొందుచున్నారు' అనియును, 'తేఽపిచాతి తరం త్యేవ' 'వారుకూడ నిస్సందేహముగ తరించుచున్నారు' అనియును, 'గచ్ఛం త్యమూఢాః-పదమవ్యయంతత్' 'జ్ఞానులు నాశనము లేని ఆ పరమపదమును పొందుచున్నారు' అనియును

ఈవిధముగా గీతలో అనేక ప్రమాణములు చూప వచ్చును. ఇక్కడ పరమపదమును పొందినారని బహువచన ములో చెప్పుటచే ఆత్మలు అనేకములని కృష్ణపరమాత్మ అభిప్రాయమైనట్లు సిద్ధాంతము.

ఒకేజాతికి చెందిన వస్తుసముదాయమునుద్దేశించి జాత్యైకవచనములో చెప్పుటయు సర్వజనాంగీకారమైన శిష్ట సంప్రదాయమే. ఈవిధముగ చూచినను 'ఆత్మ' యని ఏక వచనము ప్రయోగించినను ఆత్మసముదాయము నుద్దేశించి ప్రయోగింపబడిన జాత్యైకవచనప్రయోగముగ కూడ గ్రహించనగును.

ఉదా :

(౧) దేవతలకు 'కొబ్బరికాయ' యనిన ప్రీతి.
(౨) 'మామిడిపండు' రుచిగ నుండును.

పై వాక్యములలో కొబ్బరికాయ, మామిడిపండు అనునవి జాత్యైకవచనముగ నుపయోగింపబడి, కొబ్బరి కాయలు, మామిడిపండ్లు అని అర్థమిచ్చుచున్నవి.

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం
యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో
నాయం హంతి న హన్యతే॥ ౧౯

ప. వి :— యః, ఏనం, వేత్తి, హన్తారం, యః, చ, ఏనం, మన్యతే, హతం, ఉభౌ, తౌ, న, విజానీతః, న, అయం, హన్తిః, నహన్యతే.

టీక :—

యః = ఎవడు,
ఏనం = ఈ ఆత్మను,
హన్తారం = చంపునట్టిదిగ,
వే_త్తి = తెలిసికొనునో,
యః = ఎవడు,
ఏనం = ఈ ఆత్మను,
హతం = చంపబడునదిగ,
మన్యతే చ = తలంచునో,
తౌ ఉభౌ = వారిరువురును,
న విజానీతః = వాస్తవమెరిగినవారుకారు
(తెలిసినవారుకారు);
అయం = ఈ ఆత్మ,
నహన్తి = చంపునదికాదు,
నహన్యతే = చంపబడునది కాదు;

తా. ఎవడైతే ఈ ఆత్మను చంపుదానినిగను ఎవడు చంపబడు దానినిగను. తెలిసికొనుచున్నాడో. వారిరువురునుకూడ యథార్థమును తెలిసినవారుకారు. ఆత్మ చంపదు; చంపబడదు.

అమృతవాహిని :—

అర్జునుడు 'నేను ఈ భీష్మాదుల నందరను చంపువాడను. వారు నాచేత చచ్చువారలు' అను భ్రాంతిలోబడి దుఃఖించు

చుండుటను జూచి పరమాత్మ, ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెలియజేసి, అతని దుఃఖమును నివర్తింపజేయవలయునని, ఆత్మయొక్క నిత్యత్వమును ప్రతిపాదించుచు ఈ శ్లోకము చెప్పుచున్నాడు.

"ఆత్మ, దేనినిగాని చంపదు. దేనిచేతను చావదు. ఆత్మ ఇంకొక ఆత్మను చంపుననికాని, ఇంకొక ఆత్మచేత చచ్చునని గాని, తలంచు ఇద్దరును ఆత్మతత్త్వమును తెలియనివారే. నిత్యమైన, అవ్యయమైన, నాశనములేని ఆత్మను చంపుట ఎట్లు? చచ్చుట ఎట్లు ? రెండునుకూడ అసంభవములు. అసందర్భములును. కనుక ,అర్జునా ! దుఃఖించవలసినది ఏమియు లేదు. యుద్ధము చేయుము" అని.

ఈ శ్లోకము కఠోపనిషత్తులోని మొదటి అధ్యాయములో రెండవవల్లిలో పందొమ్మిదవ మంత్రముతో చాల వరకు పోలియున్నది. కొంచెము మార్పుకలదు. అదియైనను శబ్దములలోనే. అర్థమంతయును ఒక్కటే-

"హంతాచే న్మన్యతే హంతుం - హతశ్చే న్మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ నవిజానీతో - నాయం హంతి నహన్యతే" ॥

ఈ మంత్రమురొక్క అర్థము పై శ్లోకముయొక్క అర్థమే. తాను చెప్పినదే ప్రమాణము అయినప్పటికిని, కృష్ణ పరమాత్మ శ్రుతిని ప్రమాణముగా ఎత్తిచూపించుట ఏలయన,

శ్రుతుల గౌరవమును తెలుపుటకే. తానే శ్రుతిని ప్రమాణముగ గైకొనినయెడల, తనను అనుసరించి మానవులందరును శ్రుతులను ప్రమాణముగ స్వీకరించి తరించుదురనియెడి ఆకాంక్షయే, అట్లు తరించవలయుననెడి కృపయే కారణము. మూడవ అధ్యాయములో, ఇరువది రెండు, ఇరువదిమూడు శ్లోకములలో ఈ భావమునే చెప్పియున్నాడు.

"నమే పార్థాస్తి కర్తవ్యం - త్రిషులోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం - వర్త ఏవచ కర్మణి" ॥
"యది హ్యహం నవర్తేయం - జాతు కర్మ ణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే - మనుష్యాః పార్థ సర్వశః" ॥

అనగా "అర్జునా! మూడులోకములయందునుకూడ నాకు కర్తవ్యమనునది ఏమియును లేదు. అనగా చేయవలసినది లేదు. నేను పొందనిది కాని, పొందవలసినదికాని కించిన్మాత్రమును లేదు. అయినప్పటికిని కర్మలు చేయుచునే యున్నాను. ఎందులకో తెలియునా? నేను ప్రాలుమాలి కర్మలు చేయకుందునేని, మానవులు, అన్ని విధముల నా మార్గమునే అనుసరింతురు. నేను చేయకపోయినచో, వారును చేయక చెడుదురు. కనుక నేను చేయుచున్నాను" అని అర్థము.

కాబట్టియే ఆయనకూడ శ్రుతిని ప్రమాణముగ స్వీకరించియున్నాడు.

అవతారిక :—

ఆత్మ ఎవరిచేతను ఎందుకు చంపబడదు ? ఎందుకు చావదు అను శంకను ఈ శ్లోకములో నివారణ చేయు న్నాడు.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ ౨౦

ప. వి :— న, జాయతే, మ్రియతే, వా, కదాచిత్, న, అయం, భూత్వా, భవితా, వా, న, భూయః, అజః, నిత్యః, శాశ్వతః, అయం, పురాణః, న, హన్యతే, హన్యమానే, శరీరే.

టీక :—

అయం = (వెనుక తెలియజేయబడిన) ఆత్మ,
కదాచిత్ = ఒకప్పుడును (ఎన్నడును),
న జాయతే = పుట్టునట్టిదికాదు;
న మ్రియతే వా = చచ్చునట్టిదియునుకాదు;
న భూత్వా = లేకుండి,
భూయః = మరల (క్రొత్తగా),
భవితా న = కలుగునదికాదు;

భూత్వా = ఉండి,
భూయః = మరల,
న భవితా న = లేకుండునదికాదు;
అతః = కాబట్టి,
అయం = ఈ ఆత్మ,
అజః = పుట్టుకలేనిది,
నిత్యః = నాశనములేనిది,
శాశ్వతః = స్థిరమైనది,
పురాణః = అనాదియైనది,
శరీరే = (వినాశియైన) దేహము,
హన్యమానే = అనేకవిధములుగ మారుచున్నను,
నహన్యతే = మార్చబడదు.

తా. ఈ ఆత్మ ఎన్నడును పుట్టుటలేదు. చచ్చుటయునులేదు. ఒకప్పుడుండుటయును, ఒకప్పుడు లేకపోవుటయును లేదు. అజుడు నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు, శరీరములు చంపబడినప్పటికి చావనివాడు.

## అమృతవాహిని :—

ఈ శ్లోకములో కృష్ణపరమాత్మ, 'ఆత్మ' జడముకంటె విలక్షణమైనదని చెప్పుచున్నాడు. జడమునకు వికారములు ఆరు కలవు. ౧. పుట్టుట. ౨. ఉండుట. 3. వృద్ధిపొందుట. ౪. మార్పుచెందుట. ౫. క్షీణించుట. ౬. నశించుట అనునవి.

ఈ ఆరు వికారములును ఆత్మకు లేవు అని నిరూపణచేయుచున్నాడు.

(౧) 'అజుడు' పుట్టుకలేనివాడు (౨) 'నాయంభూత్వా భవితా వా నభూయః' ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండుటలేదు. ఏదియైనను ఒక వస్తువు ఒకప్పుడుండి ఒకప్పుడు లేకపోయిన దైన యెడలనే 'అది ఉన్నది' అని చెప్పుకొనవలసివచ్చును. ఆత్మ అట్లుకాదు. ఎప్పుడును ఉండునదియే. కనుక, క్రొత్తగా ఇప్పుడు 'ఉన్నది' అని చెప్పుకొనుటకు తగినదికాదు. కనుక, 'ఉండుట' అను వికారము లేనివాడు. (౩) 'పురాణః' అను విశేషణముతో, ఎప్పటినుంచియో ఏకరసస్వరూపుడై యుండువాడు. ఒకప్పుడు వృద్ధి అనునదిలేదు. క్షీణించు స్వభావముండిననేగాని, వృద్ధియగునట్టి గుణముండుటకు వీలులేదు. కాబట్టి వృద్ధిరూపమైన వికారము లేనివాడు. (౪) 'శాశ్వతుడు' 'ఎల్లప్పుడును ఏకరూపమున నుండువాడు.' అని మార్పు లేకపోవుటను జెప్పినాడు. (౫) 'నిత్యుడు' అనుటచేత క్షీణత్వము లేనివాడు. (౬) 'నహన్యతే హన్యమానే శరీరే' 'శరీరము చంపబడినను చావనివాడు అనుటచేత నాశనములేనివాడు అని సిద్ధించినది. కనుక ఆత్మ షడ్భావవికారములు లేనివాడు అని చెప్పుటయే ఈ శ్లోకముయొక్క ముఖ్యోద్దేశము. కాన "అర్జునా! భయపడక వివేకముతో ధైర్యము వహించి యుద్ధముచేయుము" అని కృష్ణపరమాత్మ చెప్పుటకే ఈ విచారణ చేయబడినది.

కఠోపనిషత్తులోని ప్రథమాధ్యాయములో, రెండవ వల్లిలో పందొమ్మిదవ మంత్రముకూడ అతికించిత్ భేదముతో, ఈ శ్లోకమువలెనే యున్నది.

శ్లో॥ వేదావినాశినం నిత్యం
యు ఏన మజ మవ్యయమ్ ।
కథం సపురుషః పార్థ !
కం ఘాతయతి హంతికమ్? ॥ ౨౧

ప. వి :— వేద, అవినాశినం, నిత్యం, య, ఏనం, అజం, అవ్యయం, కథం, సః, పురుషః, పార్థ, కం, ఘాతయతి, హంతి, కమ్.

టీక :—

పార్థ ! = ఓ అర్జునుడా !
యః = ఏ పురుషుడు,
ఏనం = ఈ ఆత్మను,
అజం = పుట్టుక లేనిదిగను,
అవ్యయం = శాశ్వతమైనదిగను,
అవినాశినం = నాశరహితమైనదిగను,
నిత్యం = పరిణామము (మార్పు) లేనిదిగను,
వేద = తెలిసికొనుచున్నాడో,

సః పురుషః = ఆ పురుషుడు,
కథం = ఎట్లు,
కం = ఎవ్వని,
ఘాతయతి = చంపించుచున్నాడు ?
కం = ఎవ్వని,
హన్తి = చంపుచున్నాడు ?

తా. ఓ పార్థా ! ఈ ఆత్మను నాశనములేనిదానివిగను, నిత్యమైనదిగను, పుట్టుకలేనిదిగను, అవ్యయముగను ఎవడు తెలిసికొనునో, వాడు, ఏ ఆత్మను ఎట్లు చంపించును ? ఎట్లు చంపును ?

అ మృ త వా హి ని :-

"అర్జునా ! ఆత్మ నశించనిది. నిత్యమైనది. పుట్టుకలేనిది-క్షయించనిది - అవ్యయమైనది అని అనుభవపూర్వకముగ తెలిసికొనినవాడు ఏ ఆత్మను ఎట్లు చంపించును ? ఎట్లు చంపును ? ఆత్మ చచ్చునా ? 'అయ్యో ! నేను ఇన్ని ఆత్మలను చంపించుచున్నానే ! చంపుచున్నానే !' అని ఎట్లు అనుకొనును ? సహజముగ నశించెడి స్వభావముగల ఈ స్థూల శరీరములు నశించుచున్నవి. ఇవి ఎట్లైనను నశించక నిలుచునవికావు. దేహాత్మవివేకము లేనివారు దేహము చచ్చిపోయినప్పుడు ఆత్మ చచ్చినదని ఏడ్చెదరు. దేహమునకు కలిగిన దశలన్నిటిని ఆత్మకు అంటకట్టుదురు. ఇది ఆత్మానాత్మవివేకము లేని అజ్ఞుల లక్షణము. పార్థా ! నీకీ అజ్ఞానము తగునా !

యథార్థమును విచారించుకొని యుద్ధమునకు లెమ్ము! ఎంత మాత్రమును దుఃఖించకుము అని" భావము.

**అ వ తా రి క :—**

శరీరములకును ఆత్మకును ఎట్టి సంబంధమో చెప్పి, ఆ సంబంధమువలన తెలిసికొనవలసిన జ్ఞానమును రాబోవు శ్లోకములో చెప్పుచున్నాడు.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ ౨౨

ప. వి :—వాసాంసి, జీర్ణాని, యథా, విహాయ, నవాని, గృహ్ణాతి, నరః, అపరాణి, తథా, శరీరాణి, విహాయ, జీర్ణాని, అన్యాని, సంయాతి నవాని, దేహీ.

టీక :—

నరః = మనుష్యుడు,
యథా = ఏ విధముగ,
జీర్ణాని = శిథిలములైన,
వాసాంసి = వస్త్రములను,
విహాయ= విడిచి,

నవాని = క్రొ త్తవియు,
అపరాణి = అన్యములునగు,
(వాసాంసి = వస్త్రములను),
గృహ్ణాతి = స్వీకరించుచున్నాడో,
తథా = ఆవిధముగ,
దేహీ = ఆత్మ,
జీర్ణాని = శిథిలములైన,
శరీరాణి = దేహములను,
విహాయ = విడిచి,
నవాని = క్రొత్తవియు,
అన్యాని = ఇతరములునగు,
(శరీరాణి = దేహములను),
సంయాతి = పొందుచున్నాడు.

తా; మానవుడు ప్రాతవస్త్రములను త్యజించి, నూతనవస్త్రములను ధరించినట్లు, ఆత్మ ప్రాతశరీరములను విడిచి నూతన శరీరములను ధరించుచున్నది.

అ మృ త వా హి ని :-

"అర్జునా ! మానవుడు తాను ధరించిన వస్త్రములు ప్రాతవైనప్పుడు (వదలవలసి వచ్చినప్పుడు) ఆ వస్త్రములను వదలి, మరల నూతనవస్త్రములను ధరించుట లేదా ? అట్లే ఆత్మ ప్రాతశరీరమును వదలి నూతనశరీరములను ధరించు

చున్నది. దీనిలో దుఃఖించవలసినపని ఏమున్నది ?" అని కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు.

ప్రశ్న : మానవుడు చినిగిపోయిన, మలినమైన, అనుపయోగకరములైన బట్టలను మాత్రము విడిచి, గట్టివియు, క్రొత్తవియు, పరిశుభ్రమైనవియు, ఉపయోగకరమైనవియు నైన వస్త్రములను ధరించును. కాని ఆత్మ అపూర్వసౌందర్యవంతమును, యౌవనవంతమును, దృఢవంతమును, ఆరోగ్యవంతమును, భాగ్యవంతమును అయిన శరీరమును, ఇంకను చిన్నవానిని పెద్దవానిని కూడ విడిచి, ఇంకొక దేహమును ధరించుచున్నదే ! ఈ ఉపమాన మెట్లు సరిపోవును ?

సమా : ఉపమానములకును ఉపమేయములకును పోలిక, ఏకదేశములోనే యుండునుగాని, అన్నివిధములను అన్ని దృక్పథములనుండియును సరిపోవలయునన్నడి నియమము లేదు.

ఉదా : 'రామన్న పులివంటివాడు' అనునప్పుడు, రామన్నకు పులివలె చారలు, కోరలు, నాలుగుకాళ్ళు, పంజాలు, తోక - అన్నియు నున్నవని భావించరాదు. అట్లు భావించిన, వానిని వెంటనే పిచ్చిఆసుపత్రికి పంపించవలయును. ఆ ఉపమానముతో ఒక్క పరాక్రమములోనో, చురుకుదనములోనో, సామ్యమును తీసికొనవలయును. ఇంతియే. ఇది అలంకారశాస్త్రనియమము.

ఇట్లు ఆలోచించినచో, మానవుడు వస్త్రములను ఎట్లు మార్చవలసివచ్చుచున్నదో, అట్లే దేహి - ఆత్మ - యును దేహములను మార్చవలసివచ్చును అని మాత్రమే ఊహించవలయును.

జీర్ణమైన వస్త్రములను అనునప్పుడు 'ధరించ యోగ్యము కాని వస్త్రములు' అని అర్థము తీసికొనవలయును. వస్త్రము క్రొత్తది కావచ్చును. వెంటనే వదలివేయవలసిన అవసరములు చాల కలుగుచుండును. శుభకార్యములకు పీటలమీద కూర్చొనినప్పుడు, క్రొత్త బట్టలతో కూర్చున్నను, ఆశీర్వచనములకుముందు వస్త్రములు ఇచ్చినప్పుడుగాని, పెండ్లికుమారునకు మధుపర్కములు ఇచ్చినప్పుడుగాని, అంతకుముందు ధరించియున్న వస్త్రములు క్రొత్తవైనను, విడిచి, ఈ నూతనవస్త్రములను ధరించవలసినదే. ఇక్కడ పెద్దలు చెప్పినట్లు వినవలసినదేగాని, బట్టలు ధరించువానికి స్వాతంత్ర్యము లేదు; 'నేను విడువను, ధరించను' అని అనుటకు అధికారము లేదు. తల్లిదండ్రుల కర్మ చేయబోవునప్పుడు, క్రొత్తవైనను, పరిశుభ్రమైనవైనను, ఉన్నవస్త్రములను వదలి, తడిబట్టలు కట్టుకొనవలయును. అదివరకు ధరించిన బట్టలు, ఒక దృష్టితో ఎంత మంచివైనను ఇంకొకదృష్టితో చూచిన ఈ సమయములో అవి పనికిరానివే. అట్లే కార్యాలయమునకు వెళ్ళునప్పుడు దానికి తగినవి, పడకగదికి పోవునప్పుడు దానికి

తగినవి వస్త్రములు ధరించవలసినదే; అవి ధరించునప్పుడు అంతకుముందున్న వస్త్రములను విడువవలసినదే. యంత్రాగారములలో పనిచేయువారికి, వస్త్రముల విషయములో మార్పు అందరికిని బాగుగ తెలిసినదే. ఇంటిని దులుపు పనిలోనికి పంపించబడినప్పుడు, తన మంచి దుస్తులను వదలి, ప్రాతగుడ్డలు ధరించిపోవును. ఈ విధముగ ఎన్నైన ఉదాహరణములు చూపవచ్చును. ఇట్లే ఆత్మ, ఈ దేహములను వదలి, క్రొత్త దేహములను ధరించవలయును.

దీనినిబట్టి చూచినచో, నూతనశరీరములు అనునప్పుడు (మరొక) అన్యశరీరములను అని అర్థము తీసికొనవలయునుగాని, అదివరకున్న శరీరములకంటె నాణ్యమైన శరీరములని అర్థము తీసికొనరాదు.

మన దృష్టిలో ఈ శరీరము ఎంతయో అందమైనదే; నడివయస్సులోనున్నదే; మంచి ఆరోగ్యవంతము, బలిష్ఠమునైనదే; భాగ్య భోగ్యము లనుభవించుచున్నదే. అయిననేమి ? మనకు తెలియని అనేక కారణములచేత ఈ శరీరము వదలిపెట్టనగినది కావచ్చును. ఇంతకంటె దుర్బలమైనదియు, వ్యాధిగ్రస్తమైనదియునగు శరీరమును అప్పటికి ధరించవలసిన అవసరము కలుగవచ్చును.

ప్రశ్న : మానవుడు ప్రాత వస్త్రములను విడుచునప్పుడుగాని, క్రొత్త వస్త్రములను ధరించునప్పుడుగాని

దుఃఖించడు; ఆనందించనుకూడదు. కాని దేహమును వదలునప్పు డును, ధరించునప్పుడును కూడ బాధపడుట, ఏడ్చుట కలుగు చున్నదే! ఇదెట్లు?

సమా: మొదటనే చెప్పినట్లుగ, ఉపమానము, ఉప మేయము, అన్నివిధములను సరిపోవు. అయినను కొన్ని కొన్ని చాలభాగము సరిపోవుటకూడ కద్దు.

వస్త్రములు విడుచుట, ధరించుట, ఈ తత్త్వము తెలిసిన పెద్దవారు దుఃఖించరుకాని, శిశువులు తల్లి ప్రాత చొక్కాను విప్పునప్పుడును, క్రొత్తది తొడుగునప్పుడును కూడ ఏడ్చెదరు. వారికి బాధాకరముగాకూడ నుండును. అట్లే దేహములు వదలునప్పుడు అజ్ఞానులు దుఃఖింతురు; జ్ఞానులు దుఃఖించరు.

ప్రశ్న: మానవుడు వస్త్రములు విడుచుటలోను, ధరించుటలోను, స్వాతంత్ర్యమున్నది. ఆత్మ దేహములు, వద లుటలోను, ధరించుటలోను, స్వాతంత్ర్యము కనపడుట లేదే! ఇదెట్లు!

సమా: వస్త్రధారణలో కూడ అందరకును స్వాతం త్ర్యము కనబడుటలేదు. అస్వాతంత్రులైనవారు వారివారి పనుల కనుగుణములైన దుస్తులను, వారి వారి యజమానుల ఆజ్ఞప్రకారము, ఇష్టమున్నను లేకపోయినను ధరించవలసినదే.

రక్షకభటులను చూడుడు - వేసవికాలములో, మండు టెండలోనైనను సరే - ఆ దుస్తులు ధరించవలసినదే. వారికి చికాకుగానున్నను, విడువవలెననెడి కాంక్షయున్నను వీలులేదు. ఇట్లే అన్ని శాఖలలోని ఉద్యోగస్థులకును. కేవలము స్వతంత్రులకు మాత్రమే వారి ఇష్టమువచ్చినట్లు విడుచుటకు ధరించుటకు అధికారముగలదు. అట్లే ఆత్మలు బంధనములో నున్నంత కాలము, వారివారి కర్మానుగుణమైన అనుభవములకొరకు, ఆ యా లోకములకు పోవునప్పుడు ఆ యా పరిస్థితులకు తగిన దేహములను పరమాత్మ నిర్ణయమునకులోబడి ధరించవలయును.

ప్రశ్న : అయితే వస్త్రముల విషయములో కొందరకు స్వాతంత్ర్యమున్నట్లు, దేహముల విషయములోకూడ కొందరకు స్వాతంత్ర్యమున్నదా ?

సమా : ఆ! ఎందుకులేదు ? ఉన్నది. 'ముక్తపురుషులు వారి ఇష్టమువచ్చినప్పుడు, వారి ఇష్టమువచ్చిన దేహములను ధరించి, వారి ఇష్టమువచ్చిన లోకములో, వారి ఇష్టమువచ్చినంత కాలము సంచరించగలరు' అని బ్రహ్మసూత్రాది శాస్త్రములలో నున్నది.

ప్రశ్న : 'గృహ్ణాతి' 'సంయాతి' అనగా, 'ధరించును', 'పొందును' అను క్రియలు స్వాతంత్ర్యమును సూచించుచున్నవే!

'ధరింపజేయబడును' 'పొందజేయబడును' అనిన బాగుండెడిది. అట్లనకపోవుటచే స్వాతంత్ర్యము ధ్వనించుచున్నది. ఏమి సమాధానము ?

సమా : అంతమాత్రమున ఏమియు బాధ లేదు. 'జైలుకు వెళ్ళినాడు' 'జైలునుండి వచ్చినాడు' అని అందుము. అయితే వెళ్ళుటకును, వచ్చుటకును వానికి స్వాతంత్ర్యమున్నదని భావించరాదు. మనకు తోచినదెల్లను 'ధ్వని' అనుకొని అర్థములు తీయరాదు. జైలుకు వెళ్ళుటకును, జైలునుండి వచ్చుటకును ఎట్లు స్వాతంత్ర్యము లేదో, దేహము వదలుటకును, ధరించుటకును ఎట్లు స్వాతంత్ర్యము లేదో, అట్లే ధ్వన్యర్థమును తీయుటకుకూడ మనకు స్వాతంత్ర్యము లేదు.

ప్రశ్న : నరుడు వస్త్రములు విడిచి ధరించినట్లు, ఆత్మకూడ దేహములు విడుచును, ధరించును అని బహువచనములో చెప్పినాడు. నరుడు ఒకేసారి ఎక్కువ వస్త్రములు ధరించవచ్చును. ఆత్మ ఒకేసారి ఎక్కువ దేహములు- చాల దేహములు - ధరించునా ?

సమా : ఒకేసారి ధరించకపోయినను, ఇంతవరకు ఎన్ని దేహములు ధరించినదో లెక్కలేదు. పరమాత్మ కరుణ పొందువరకును ఎన్ని దేహములు ధరించునో చెప్పలేము. కనుక దేహములు అని బహువచనములో ప్రయోగించుట సమంజసమే.

ప్రశ్న : 'పడుసు వస్త్రములు ధరించినట్లు దేహములు ధరించును' అని చెప్పిన చాలదా ? 'నరుడు' 'దేహి' అని రెండు ప్రయోగములు ఎందులకు ?

సమా : వస్త్రములు ధరించుట, ఒక్క నరుడు మాత్రమే చేయును. దేహములు ధరించుట ప్రతిజీవికిని కలదు. కనుక వస్త్రముల ఉదాహరణములో 'నరుడు' అనవలయును. దేహధారణ విషయములో 'నరుడు' అనిన చాలదు. 'దేహి' అనవలెయును.

ప్రశ్న : 'గృహ్ణాతి', 'సంయాతి'- ఈ రెండు క్రియలును సమానార్థకములై యుండగ, ఒకే క్రియతో పని జరుగునప్పుడు, ఈ రెండు క్రియలను వాడవలసిన అవసరమేమి కలిగినది ?

సమా : రెండును సామాన్యార్థములో సమానార్థకములే. కాని, 'గృహ్ణాతి' అనగా 'గ్రహించుచున్నాడు' అని ముఖ్యార్థము. అట్లే 'సంయాతి' అనగా 'పోవుచున్నాడు' అని ముఖ్యార్థము. 'వస్త్రములు గ్రహించుట, దేహముల విషయములో ఈ దేహమును విడిచి ఇంకొక దేహములోనికి పోవుట జరుగును. కనుక, ఈ ప్రయోగమే చాల సమంజసము.

తరువాత కృష్ణపరమాత్మ ఇంకొకవిషయము చెప్పుచున్నాడు. "అర్జునా ! నీవు ఈ యుద్ధములో చచ్చిపోవుదురని ఎవరిని గురించియును దుఃఖించనవసరములేదు. క్షత్రియులకు

ధర్మయుద్ధములోనిచావు వీరస్వర్గమును కలిగించును. ఈ క్షుద్ర దేహములను వదలిపెట్టి, వీరస్వర్గములో భోగముల కనుగుణమైనవియు,ఇంతకంటె శ్రేష్ఠములైనవియు నైన దేహములను ధరించెదరు. కనుక యుద్ధమునకు జంకి ఎంతమాత్రమును దుఃఖించనక్కరలేదు."

**అవతారిక :—**

ఇంతవరకు "ఒక శరీరమువదలి ఇంకొక శరీరమును ధరించుపట్ల దుఃఖించపనిలేదు" అని నిర్ణయించిచెప్పి, ఆత్మ యొక్క నిత్యత్వమును మరల ఇంకొక ప్రకారమున మూడు శ్లోకములలో ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి
నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయం త్యాపో
న శోషయతి మారుతః ॥ —23

ప. వి :—న, ఏనం, ఛిన్దన్తి, శస్త్రాణి, న, ఏనం, దహతి, పావకః, న, చ, ఏనం, క్లేదయంతి, అపః, న, శోషయతి, మారుతః.

టీక :—

శస్త్రాణి = ఆయుధములు,
ఏనం = ఈ ఆత్మను,
న ఛిన్దన్తి = ఛేదింప (జాల)వు;

పావకః = అగ్ని,
ఏనం = ఈ ఆత్మను,
న దహతి = దహింప (జాల) దు;
ఆపః = ఉదకములు,
ఏనం = ఈ ఆత్మను,
న చ క్లేదయన్తి = తడుపనుజాలవు;
మారుతః = వాయువు,
(ఏనం = ఈ ఆత్మను),
న శోషయతి = ఎండింపచేయ (జాల)దు.

తా. ఈ ఆత్మను కత్తులు నరుకలేవు; అగ్ని కాల్చలేదు; నీరు తడుపలేదు; వాయువు ఎండించలేదు.

అ మృ త వా హి ని :—

అర్జునా ! యుద్ధము చేసినయెడల, ఈ భీష్ముడు, ఈ ద్రోణుడు మొదలగు పూజనీయులు, బంధువులు చచ్చి పోవుదురనియా దుఃఖము ? ఈ కనుపడు శరీరములనే భీష్మ ద్రోణాదు లనుకొనినచో, ఈ శరీరములు ఎట్లును నశించెడివే. కనుక అనివార్యమైనదానిని గురించి దుఃఖించుట వెఱ్ఱితన మని చెప్పియుంటిని. లేక ఆత్మల నుద్దేశించి భీష్మద్రోణాదు లనుకొనినచో, ఆత్మ నశించునదికాదు అని ఇదివరకు చెప్పి యుంటిని.

ఎందువలన నశించదనగా - ఎట్లు నశించును ? ఈ బాణములు, ఆయుధములు ప్రయోగించిన చచ్చెదరని భయమా ? ఆత్మను కత్తులు నరుకలేవు. అగ్ని కాల్చలేదు. నీరు తడుపలేదు. వాయువునకు ఎండించు శక్తిలేదు. కత్తులు శరీరమును ముక్కలుముక్కలుగ నరకినప్పటికిని ఆత్మ నరకబడుటలేదు. శరీరమును అగ్ని కాల్చి భస్మముచేసినను ఆత్మ కాల్చబడదు. నీరు శరీరమును తడిపినను, ఆత్మ తడుపబడదు. వాయువు శరీరమును ఎండించినను, ఆత్మ ఎండించబడదు. ఇంతకంటె అస్త్రములు శస్త్రములు ఏమికలవు ? కత్తులు మొదలగు ఆయుధములుగాని, ఆగ్నేయాస్త్రము, వారుణాస్త్రము, వాయువ్యాస్త్రము మొదలగు అస్త్రములుగాని ఏవియును ఆత్మను ఏమియును చేయలేవు. ఎందువలన ?

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ
మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్య స్సర్వగత స్థాణు
రచలోఽయం సనాతనః ॥ ౨౪

ప. వి :— అచ్ఛేద్యః, అయం, అదాహ్యః, అయం, అక్లేద్యః, అశోష్యః, ఏవ, చ, నిత్యః, సర్వగతః, స్థాణుః, అచలః, అయం, సనాతనః.

టీక :—

అయం = ఈ ఆత్మ,
అచ్ఛేద్యః = ఛేదింపబడదగినది కాదు;
అయం = ఈ ఆత్మ,
అదాహ్యః = దహింపబడదగినది కాదు;
అక్లేద్యః = తడుపబడదగినది కాదు;
అశోష్యః ఏవ చ = ఎండింపబడదగినది కాదు;
అయం = ఈ ఆత్మ,
నిత్యః = త్రికాలములయందు నుండునదియును,
సర్వగతః = సర్వవ్యాపకమైనదియును,
స్థాణుః = నిశ్చలస్వభావము గలదియును,
అచలః = చలింపనిదియును,
సనాతనః = అనాదియైనదియును,
(భవతి = అగుచున్నది).

తా. ఆత్మ సహజముగ నరుకబడనిది. కాల్చబడనిది. తడుపబడనిది. ఎండింపబడనిది. నిత్యమైనది. సర్వత్ర వ్యాపించియున్నది. స్థిరమైనది. చలనములేనిది. సనాతనమైనది.

అ మృ త వా హి ని :—

పై శ్లోకములో 'కత్తులు మొదలగువాటివలన ఆత్మ నశించదు' అని చెప్పియున్నాడు. ఈ శ్లోకములో, మరల దానినే బలముకొరకు, మార్చి చెప్పుచున్నాడు. ఎందువలన

ఆత్మను శస్త్రాదులు నశింపచేయజాలవో ఇక్కడ చెప్పు చున్నాడు.

ఆత్మ నరుకబడునదికాదు. కత్తులు నరుకబడుదానిని నరుకునేగాని నరుకబడనిదానిని ఎట్లు నరుకగలవు ? కాల్చబడు నదికాదు. అగ్ని కాల్చబడదగినదానిని కాల్చునేగాని, కాల్చ బడనిదానిని ఎట్లు కాల్చగలదు ? తడుపబడునదికాదు. నీరు తడుపబడదగినదానిని తడుపునేగాని, తడుపబడదగనిదానిని ఎట్లు తడుపగలదు? ఎండించబడునదికాదు. వాయువు ఎండించ బడదగినదానిని ఎండించునేగాని, ఎండించబడదగనిదానిని ఎట్లు ఎండించగలదు ? ఈ ఆత్మ అఖండము; ఏకరసము; నిర్వికారము. కాబట్టి దీనిని ఏ శస్త్రములుగాని, అస్త్రములు గాని బాధింపలేవు.

ఆత్మ, అచ్ఛేద్యమనియు, అదాహ్యమనియు, అక్లేద్య మనియు, అశోష్యమనియు చెప్పియుండిరిగదా ! మరల నిత్యమనియు, సర్వగతమనియు, సనాతనమనియు చెప్పవలసిన అవసరమేమి కలిగినది అను సందేహము కలుగవచ్చును.

కేవలము పైన చెప్పిన 'అచ్ఛేద్యము' మొదలగు విశేష ణములచేత, కత్తులు మొదలగు ఏ ఆయుధములవలనను నశించక పోవుట ఒకటియే సిద్ధాంతమైనది. అట్లైన ఈ లక్షణము పంచభూతములలో ఒకటైన, జడరూపమైన, ఆకాశమునకు

కూడ గలదు. ఆత్మతత్త్వము ఈ ఆకాశమువంటిదే అనవలసి వచ్చును. ఆకాశముకంటె ఆత్మకుగల వైలక్షణ్యమును చూపుటకు, తరువాతి విశేషణములు చెప్పబడినవి. ఆకాశము నుండియే మిగిలిన నాలుగుభూతములు పుట్టుటచేత, ఆ నాలుగు భూతములుగాని, ఆ నాలుగు భూతముల కార్యములుగాని, ఆకాశమును బాధింపలేవు. తైత్తిరీయములో "ఆకాశ ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ" అని, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి భూమి, పుట్టినట్లు ఉన్నది. కనుక, ఆకాశమునుండి పుట్టిన మిగిలిన నాలుగు భూతములుగాని, వాని కార్యములైన ఆయుధవిశేషములుగాని, ఆకాశమును బాధింపలేవు. కనుక ఇంతమాత్రమే చెప్పి విరమించిన యెడల, 'ఆకాశమువంటిదే ఆత్మకూడ' అని చెప్పినట్లగును. కనుక ఇప్పుడు ఆత్మకు ఉండు వైలక్షణ్యమును చెప్పుచున్నాడు.

ఆత్మ నిత్యము. ఆకాశము నిత్యముకాదు. మహాప్రళయములో ఆకాశముకూడ నశించును. ఆత్మ ఎప్పుడును నశించదు. కనుక ఆత్మ నిత్యము.

ఆత్మ సర్వగతము. ఆకాశము సర్వవ్యాపికాదు. తన యొక్క కార్యములైన వాయువు, అగ్ని, జలము, పృథివి- వీటియందును, వీటి కార్యములయందును వ్యాపించియుండునే

గాని, తనకు కారణమైనవాటియందు వ్యాపించియుండలేదు. ఆత్మయొక్క సర్వవ్యాపకత్వ మట్లుకాదు.

ఆత్మ సనాతనము. ఆకాశము సనాతనమును, అనాది యును కాదు. ఆత్మ సనాతనమును, అనాదియును, ఎల్లప్పుడును ఉండునదియును అయి ఉన్నది.

కనుక ఈ విశేషణములు ఆత్మయొక్క వైలక్షణ్యమును చెప్పుటకు అత్యవసరము లగుటచే, కృష్ణపరమాత్మచేత చెప్ప బడినవి.

శ్లో॥ అవ్యక్తోఽయ మంచిత్యోఽయ
మవికార్యోఽయ ముచ్యతే ।
తస్మా దేవం విదిత్వైనం
నానుశోచితు మర్హసి ॥ ౨౫

ప. వి :— అవ్యక్తః, అయం, అచిన్త్యః, అయం, అవికార్యః, అయం, ఉచ్యతే, తస్మాత్, ఏవం, విదిత్వా, ఏనం, న, అనుశోచితుం, అర్హసి.

టీక :—

అయం = ఈ ఆత్మ,
అవ్యక్తః = చక్షురాదీంద్రియముల కగోచరము;
అయం = ఈ ఆత్మ,

అచిన్త్యః = మనస్సునకగోచరము;
అయం = ఈ ఆత్మ,
అవికార్యః = వికారములను పొందింపబడదగనిది;
(ఇతి = ఇట్లని),
ఉచ్యతే = చెప్పబడుచున్నది,
తస్మాత్ = ఆ కారణమువలన,
ఏవం = ఈ చెప్పబడిన ప్రకారముగ,
ఏనం = ఈ ఆత్మను,
విదిత్వా = ఎరిగి (తెలిసికొని),
అనుశోచితుం = దుఃఖించుటకు,
న అర్హాసి = తగవు.

తా. ఈ అత్మ అవ్యక్తము, అచింత్యము అవికార్యము అని చెప్పబడుచున్నది. కనుక, అర్జునా ! ఈ విధమైన ఆత్మతత్త్వమును, తెలిసికొని దుఃఖమును మానుము.

అమృతవాహిని :-

ఆత్మ అవ్యక్తము : అనగా ఇంద్రియజ్ఞానమునకుగాని, ఏ ప్రమాణముల ద్వారమునగాని వ్యక్తముకానిది గనుక, అవ్యక్తము.

అచింత్యము : ఇంద్రియముల కందునట్టిదానినే చింతించ వీలగును. ఇది ఇంద్రియముల కందునదికాదు. కాన, ఆత్మ అచింత్యము- చింతించుటకు వీలులేనిది,

అవికార్యము : ఇది అవికార్యము. అనగా వికారము పొందనిదియును, వికారము పొందించరానిదియును - కనుక అవికార్యము. ఇట్లని శాస్త్రములయందు చెప్పబడియున్నది. మహాత్ములచేత గూడ అనుభవపూర్వకముగ వచింపబడినది.

కనుక, అర్జునా ! ఈ తత్త్వమును బాగుగ తెలిసికొని, నీవు ఈ భ్రాంతిజనితమైన దుఃఖమును వదలి, నీ క్షాత్త్రధర్మమైన ధర్మయుద్ధమును నిమిత్తమాత్రుడవై చేయుము. దుఃఖించకుము.

ఈ శ్లోకములో 'అవ్యక్తము, అచింత్యము, అవికార్యము' అని మూడు విశేషణములు చెప్పియున్నాడు. అవ్యక్తము, అచింత్యము అని మాత్రము చెప్పి ముగించినచో, అవ్యక్తప్రకృతికిని ఆత్మకును భేదము లేనట్లగును. అవ్యక్త ప్రకృతిని అవ్యక్తమని చెప్పనక్కరలేదు గదా ! అదికూడ మానవుని మనస్సు కందనిదే కనుక, అచింత్యముకూడనై యున్నది. కాని అవికార్యము కాదు. ఆ అవ్యక్తప్రకృతియే కదా, పరమాత్మ సంకల్పముతో, ఈ జగత్తుగా అగుచున్నది ! ఆ అవ్యక్తప్రకృతియొక్క వికారమే ఈ జగత్తు. కనుక అది అవికార్యము కాదు. 'ఆత్మ ఆ అవ్యక్తప్రకృతికంటె కూడ విలక్షణమైనది' అని చెప్పుటకు అవికార్యము అని కూడ చెప్పియున్నాడు. ఆత్మకు ఎప్పుడును, ఎట్టి పరిస్థితులలోను, వికారము లేదు. కనుక, ఆత్మ ప్రకృతికంటె అత్యంతము విలక్షణమైనది.

**అవతారిక :—**

వెనుకటి శ్లోకములో కృష్ణపరమాత్మ, ఆత్మను పుట్టుకలేని దానినిగను, నశించనిదానినిగను చెప్పి, దానికొరకు దుఃఖించ నవసరము లేదని ప్రతిపాదించియున్నాడు. ఇప్పుడు రాబోవు రెండు శ్లోకములలో, ఒకవేళ ఆత్మ పుట్టునది అనియును, చచ్చునది అనియును తలంచునెడల, అప్పుడు కూడ దుఃఖించ వలసిన పనిలేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం
నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో!
నైనం శోచితు మర్హసి ॥ ౨౬

ప. వి :— అథ, ఏనం, చ, నిత్యజాతం, నిత్యం, వా, మన్యసే, మృతం, తథాపి, త్వం, మహాబాహో, న, ఏనం, శోచితుం, అర్హసి.

టీక :—

అథ చ = ఒకప్పుడును (ఒకవేళ),
ఏనం = ఈ ఆత్మను,
నిత్యజాతం = ఎప్పుడును పుట్టుచున్న దానినిగను,
నిత్యం మృతం వా = ఎప్పుడును నశించుచున్న దానినిగను,

మన్యసే = తలంతువేమో (ఒక వేళ తలంచినప్పటికిని),
తథాపి = అయినను,
మహాబాహో ! = (గొప్పభుజములుగల)
అర్జునా !
త్వం = నీవు,
ఏనం = ఈ ఆత్మనుగూర్చి,
శోచితుం = దుఃఖించుటకు,
న అర్హసి = తగవు.

తా. నీవు ఈ ఆత్మను సదా పుట్టునదిగను, అట్లే సదా మరణించునదిగను తలంచిననుకూడ, హేమహాబాహో ! నీవు దుఃఖించవలసిన అవసరములేదు.

అ మృ త వా హి ని :—

అర్జునా ! ఇంతవరకును 'ఆత్మ పుట్టదు, నశించదు' అని చెప్పబడినది. కాని నీవు ఈ ఆత్మను పుట్టునదిగను, మరణించునదిగను తలంచెదవా ? అట్లైనను దుఃఖించనవసరము లేదు సుమా !

దీనికి కొంతమంది వ్యాఖ్యాతలు ఈ క్రింది విధముగా వ్రాసియున్నారు-"ఒక వేళ నీవుకూడ అజ్ఞానులవలె శరీరముతో పాటు ఆత్మ పుట్టుచున్నదనియు, శరీరముతోపాటు మరణించుచున్నదనియును తలంచెదవా ? అట్లైనను దుఃఖించవలసిన అవసరము లేదు" అని కృష్ణపరమాత్మ అనుచున్నాడు -

కాని ఇక్కడ సందేహము ఒకటి బాధించుచున్నది. కృష్ణపరమాత్మ అర్జునునకు జ్ఞానప్రబోధము చేయుటకై పూనుకొనెనుగాని, యుద్ధము చేయనని కూర్చొనిన అర్జునుని, కేవలము యుద్ధము చేయించుటకు మాత్రమేకాదు. అర్జునుడు యుద్ధము చేయవలయును. అది జ్ఞానవిజ్ఞానములతో కూడిన సమత్వ బుద్ధితో చేయవలయును. యుద్ధము చేయుట ఒకటి, సమత్వభావన ఒకటి. యుద్ధము చేసినను, సమత్వభావముతో చేసిన పరమాత్మప్రాప్తికి ఉపకరించును. ఆ భావన లేక చేసినచో, అట్టివాడు ఆ పరమార్థమునుండి వంచింపబడును. అర్జునుని అన్ని బాధ్యతలను మీద వేసికొనిన కృష్ణపరమాత్మ, ఏదో విధమున సమాధానము చెప్పి, తన పనిని నేరవేర్చుకొనుటకై నిలబడ లేదు.

ఒక పక్షములోనైనను, ఆత్మ పుట్టునదిగను, మరణించునదిగను, కృష్ణపరమాత్మ ఒప్పుకొనవలయును. అది ఎట్లు పొసగునో విచారింతము.

'పుట్టుక యనగా అదివరకు లేకుండ, క్రొత్తగా కలుగుట; మరణమనగా, అదివరకున్నది లేకుండపోవుట' ఇది ఒకఅర్థము. ఈ అర్థములో 'శరీరమునకు పుట్టుకలు, చావులు ఉన్నవి కాని, ఆత్మకు లేవు' అని అనేకయుక్తులతో కృష్ణపరమాత్మ ఇదివరకే సిద్ధాంతము చేసియున్నాడు.

ఇంకొక అర్థము : భారతము-ఆనుశాసనిక పర్వములో, పార్వతికి శివుడు, జనన మరణముల తత్త్వము చెప్పుచు, 'శరీరము కలుగుట పుట్టుక' యనియును, 'శరీరము నశించుట మరణము' అనియును చెప్పక, 'ఆత్మ శరీరమును ధరించుట పేరు పుట్టుక యనియును, ఆత్మశరీరమును వదలుట పేరు మరణము' అనియును చెప్పియున్నాడు.

"నిత్యు డాత్మండు - దేహ మనిత్య మతడు
ముదిమి తెవులున వికృతమై - యది వికలత
బొందుటయు దాని దొరగి తా - బోవునట్టి
దశకు మరణమ న్పేరయ్యె - తనులతాంగి !

జీవుడు జీర్ణశరీరము
బోవిడిచి నవంబుబొంద - బుట్టను పేరన్
దావెలయం దద్దశ జీ
వావలి వర్తించు నిటు గ - తాగతపరమైన"

ఈ అర్థము ప్రకారము శరీరముతో ఆత్మకు సంయోగ దశ ఆత్మకు పుట్టుక యనియును, శరీరముతో ఆత్మకు వియోగ దశ ఆత్మకు మరణమనియును సిద్ధాంతముచేసి, కృష్ణపరమాత్మ ఆత్మ పుట్టునదిగను, మరణించునదిగను (ఒకపక్షములో) అంగీకరించినాడు.

ఈ అర్థము అజ్ఞానజనితముకాదు. శిష్టసమ్మతమే. ఎందులకనగా, శివుడేగదా చెప్పినది !

కనుక అర్జునా ! ఇట్లు ఆలోచించినను నీవు దుఃఖించ వలసిన పనిలేదు అనుచున్నాడు-

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్యచ ।
తస్మా దపరిహార్యేఽర్థే
న త్వం శోచితు మర్హసి॥ ౨౭

ప. వి :—జాతస్య, హి, ధ్రువః, మృత్యుః, ధ్రువం, జన్మ, మృతస్య, చ, తస్మాత్, అపరిహార్యే, అర్థే, న, త్వం, శోచితుం, అర్హసి.

టీక :—

హి = ఏ కారణమువలన,
జాతస్య = పుట్టినవానికి,
మృత్యుః = చావు,
ధ్రువః = నిశ్చయమో,
మృతస్య = చచ్చినవానికి,
జన్మ చ = పుట్టుకయు,
ధ్రువం = నిశ్చయమో,
తస్మాత్ = ఆ కారణమువలన,
అపరిహార్యే = తప్పింపశక్యముకాని,

అర్థే = కార్యవిషయమై,
త్వం = నీవు,
శోచితుం = దుఃఖించుటకు,
న అర్హాసి = తగవు.

తా. పుట్టినదానికి మరణము కలిగియే తీరును. మరణించిన దానికి పుట్టుక కలిగియే తీరును. కాబట్టి నివారించుటకు వీలులేని దీని కొరకు దుఃఖించుట అనవసరముగదా!

అమృతవాహిని :—

ఈ శ్లోకమునుబట్టి చూచినచో, చావుపుట్టుకలకు భారతములో చెప్పిన అర్థమే రూఢియగుచున్నది. ఎందుల కనగా, 'పుట్టినది చావకతప్పదు; చచ్చినది పుట్టకతప్పదు' అని ఈ శ్లోకములో చెప్పినాడు. జననమరణములు శరీరమున కను అర్థములో చచ్చినది మరల పుట్టదు. ఈ శరీరము ఇచ్చుటనే బూడిద యగుచున్నది. ఇంకొక కల్పములో పుట్టునుగదా యనిన, ఈ శరీరము మాదిరి శరీరము వచ్చునే గాని, ఈ శరీరమే రాదు. ఈ శరీర మిచ్చుటనే పంచభూతము లలో కలిసిపోవుచున్నది.

ఆత్మకు అనేక జన్మలలో శరీరములతో సంయోగ వియోగములు కలుగుచుండును.

కాన, ఈ భావములతోనే "అర్జునా! పుట్టినది చావక తప్పదు; చచ్చినది పుట్టకతప్పదు. అనగా, ఈ దేహము ధరించిన ఆత్మ ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక విధమున ఆ దేహమును విడువకతప్పదు. దేహమును విడిచిన ఆత్మ, ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక రూపమైన దేహమును ధరించక తప్పదు. ఇట్టి అనివార్యమైన - పరిహరించుటకు వీలులేని- ఈ నిర్ణయమును ఎవరు తప్పింపగలరు ? తప్పించుటకు వీలులేని అట్టి విషయమున దుఃఖించుట వెఱ్ఱితనముగాక మరేమున్నది ?

"ప్రయోజన మనుద్దిశ్య - న మందోఽపి ప్రవర్తతే॥"

అనగా, 'ప్రయోజనములేనిపని మందుడుకూడ చేయడు' అను న్యాయమున్నది- వినలేదా! ఎట్లును చచ్చు వాటికొరకు దుఃఖించుటచేత నీకు ఏమైన ప్రయోజనము కనపడుచున్నదా ? కనుక అర్జునా! దానిని గురించి నీవు ఎంతమాత్రమును దుఃఖించదగవు. దుఃఖమును వదలిపెట్టి నీ వర్ణాశ్రమోచితమైన ఈ ధర్మయుద్ధమునకు లెమ్ము !"

ఇక్కడ కృష్ణపరమాత్మ చెప్పినది సామాన్యనియమము; విశేషనియమముకాదు. విశేషనియమమేమనగా, ఏనాడు జీవుడు పరమాత్మకు శరణాగతిజేసి, తన జీవితమంతయును పరమాత్మ సేవలోనే గడుపుకొనునో, ఆ జన్మ ఆ జీవునకు కడసారి జన్మ. మరల పుట్టుక లేదు. "మాముపేత్యతు

కౌంతేయ ! పునర్జన్మ నవిద్యతే" అని చెప్పియున్నాడు గదా ! కనుక, ఇది సామాన్య నియమమని తెలిసికొనవలయును.

ఈ విషయములో పరమాత్మయే

"భూతగ్రామ స్స ఏవాయం - భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ! - ప్రభవం త్యహరాగమే॥"

"ఈ ప్రాణివర్గ మంతయును అవశముగ పుట్టి పుట్టి, బ్రహ్మయొక్క రాత్రికాలమున లయమొందుచున్నది. మరల బ్రహ్మకు పగలు కాగనే, అవశముగనే పుట్టుచున్నది" అని చెప్పియున్నాడు.

ఇది సామాన్య నియమము. కానినాడు, ఇక జీవులకు జన్మరాహిత్యము లేకపోవలసివచ్చును. అట్లుకాదు కాబట్టి, ప్రస్తుత శ్లోకసందర్భమునకూడ, సామాన్య నియమముగ అర్థము చెప్పవలయును.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత !
అవ్యక్త నిధనా న్యేవ
తత్ర కా పరిదేవనా ? ౨౮

ప. వి :— అవ్యక్తాదీని, భూతాని, వ్యక్తమధ్యాని, భారత. అవ్యక్త, నిధనాని, ఏవ, తత్రకా. పరిదేవనా.

టీక :—

భారత ! = ఓ అర్జునా !
భూతాని = మనుష్యాదిభూతములు (శరీరములు)
అవ్యక్తాదీని = జన్మమునకు ముందు కనపడని
మాయనుండి కలిగినవియు,
వ్యక్తమధ్యాని = (పుట్టిన వెనుక) కనబడుచున్న పుత్త్రి
మిత్త్రాది కార్యకారణ సంఘాతము
గలవియు,
అవ్యక్త నిధనాన్యేవ = మరణానంతరమున మాయ
యందే, తిరిగి లయముకాగ
లవియునై యున్నవి,
తత్ర = అట్టి శరీరముల విషయమై,
పరిదేవనా = దుఃఖము,
కా ? = ఏమి ? (ఎందులకు ?)

తా. సర్వభూతములును ఉత్పత్తికిముందు తెలియుటలేదు. ఉత్పత్తి అయినది మొదలు మరణములోపల తెలియుచున్నవి. మరల మరణానంతరము తెలియుటలేదు. దీనికి దుఃఖించుట ఎందులకు ?

అ మృ త వా హి ని :—

ఇచ్చట అవ్యక్తములు, వ్యక్తములు అని వేనినిగూర్చి చెప్పియున్నాడో, ఆ భూతముల కిక్కడ మనుష్యాది శరీరము లని అర్థము. ఆత్మ ఎప్పుడును అవ్యక్తమే. "అవ్యక్తోఽయ

మచింత్యోఽయం" అని ఇరువది ఐదవశ్లోకములో చెప్పి యున్నాడు. కనుక ఇచ్చట "ఒకప్పుడు అవ్యక్తములు: ఒకప్పుడు వ్యక్తములు" అని చెప్పుటచేత, శరీరములేయని అనుకొనవలసివచ్చుచున్నది.

ఈ శరీరములు పుట్టుకకుముందు తెలియబడుటలేదు. మరణించిన తరువాతను తెలియబడుటలేదు. పుట్టుకకును మరణమునకునుమధ్య మాత్రమే తెలియబడుచున్నవి.

శ్లో క,

'అవ్యక్తాదీని భూతాని' అనగా, 'ఈ భూతములన్నియును అవ్యక్తమునే ఆదిగాగలవి; అవ్యక్తమే అంతముగా గలవి. మధ్య మాత్రము వ్యక్తమగుచున్నవి.'

"అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః - ప్రభవం త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే - తత్రైవావ్యక్త సంజ్ఞికే॥"

ఎనిమిదవ అధ్యాయమున, పదునెనిమిదవ శ్లోకమున, "సకల వ్యక్తపదార్థములును, మొదట అవ్యక్త ప్రకృతి నుండియే పుట్టుచున్నవి. మరల ఆ అవ్యక్తమునందే విలీనమగుచున్నవి" అని చెప్పియున్నాడు. (అర్థము విపులముగా, ఆ శ్లోక వ్యాఖ్యానములో చూడనగును.)

ఇచ్చట ఆది అనగా పుట్టుకయనియును, నిధన మనగా చావు అనియును చెప్పవచ్చును. కనుక సర్వభూతములును అవ్యక్తమునే జన్మస్థానముగను, మరణస్థానముగను కూడ కలిగియున్నవి.

తేక,

ఈ సర్వభూతములును ఎచ్చటనుండి వచ్చుచున్నవో తెలియదు. మరల ఎచ్చటకు పోవుచున్నవో తెలియదు. వర్తమానమున మాత్రము, అనగా జనన మరణముల మధ్యను వాటి ఉనికి తెలియబడుచున్నది.

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్ ॥ 29

ప. వి :— ఆశ్చర్యవత్, పశ్యతి, కశ్చిత్, ఏనం, ఆశ్చర్యవత్, వదతి, తథైవ, చ, అన్యః, ఆశ్చర్యవత్, చ, ఏనం, అన్యః, శృణోతి, శ్రుత్వాపి, ఏనం, వేద, న, చ, ఏవ, కశ్చిత్.

టీక :—

కశ్చిత్ = ఒకానొకడు,
ఏనం = ఈ ఆత్మను,
ఆశ్చర్యవత్ = అద్భుతవస్తువువలె,

పశ్యతి = చూచుచున్నాడు,
తథైవ = అట్లే,
అన్యః = మరియొక్కడు,
ఏనం = ఈ ఆత్మను,
ఆశ్చర్యవత్ = అద్భుత వస్తువునువలె,
వదతి చ = చెప్పుచున్నాడు,
అన్యః = ఇతరుడు,
ఏనం = ఈ ఆత్మను,
ఆశ్చర్యవత్ = అద్భుతవస్తువునువలె,
శృణోతి చ = వినుచున్నాడు,
శ్రుత్వాపిచ = (ఇట్లు) వినియునుకూడ,
కశ్చిత్ = ఒకానొకడు,
ఏనం = వీనిని (ఈ ఆత్మను),
న వేద ఏవ = (యథార్థముగ) ఎఱుంగనే లేడు.

తా. ఎవడో ఒక మహాపురుషుడు మాత్రమే ఈ అత్మను ఆశ్చర్యముగ చూచును. అట్లే ఎవడో ఒక మహాపురుషుడు మాత్రమే ఆత్మతత్త్వమును ఆశ్చర్యముగ వర్ణించును (చెప్పును). ఎవడో ఒక మహాపురుషుడు మాత్రమే ఆత్మనుగూర్చి ఆశ్చర్యముగ వినును. ఒకానొకడు వీనిని గురించి వినికూడ తెలియలేడు.

అ మృ త వా హి ని :—

ఈ అర్థమునే చెప్పెడి మంత్రము ఒకటికఠోపనిషత్తులో కలదు -

"శ్రవణాయాపి బహుభి ర్యో నలభ్యః
శ్రుణ్వంతోఽపి బహవో యం న విద్యుః ।
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలాను శిష్టః॥" (౧-౨-౭)

అనగా, "ఏది చాలమందికి వినుటకు కూడ దొరకదో, వినువారు కూడ ఎక్కువమంది దేనిని తెలియలేరో, అట్టి ఆశ్చర్యజనకమైన ఆత్మనుగూర్చి చెప్పగలుగు మహాపురుషు డున్నచో ఆశ్చర్యమే. అతడు ఆశ్చర్యకరమైన పురుషుడే. దానిని పొందగలుగు నైపుణ్యముగల మహాపురుషుడుకూడ ఎవడో ఒక్క డుండును. తెలిసికొనువాడుకూడ - ఆచార్యుని ద్వారా ఉపదేశము పొందిన ఆశ్చర్యమైన పురుషుడు ఎవడో ఒక డుండును."

ఆత్మ ఆశ్చర్యకరమైనది. ఇట్టిదట్టిదని వర్ణించుటకు వీలులేనిది. చూచుటకు వీలులేనిది. వినుటకు వీలులేనిది. ఇట్టి ఆత్మను ఎవడో ఒకడు సదాచార్యుని కృపతో చూచును. ఎవడో ఒక మహాభాగ్యశాలిమాత్రమే ఆ చూచినదానిని చెప్పును. అదికూడ ఆశ్చర్యకరముగనే ఉండును. దానిని చెప్పుటకు ఈ ప్రాకృతభాషయును, ఈ ప్రాకృతవాక్కును చాలవు. కాని ఇతరులకొరకు ప్రాకృతభాషలోనే, ప్రాకృత వాక్కుతోనే చెప్పవలయునుగదా! అది ఆశ్చర్యకరముగనే

ఉండును. చెప్పగలిగిన మహాపురుషుడు దొరకినను వినువాడు అధికారి లభించవలదా? అట్టివాడుకూడ ఆశ్చర్యముగనే వినును. ఇతరులు చాలమంది విందురు. కాని వినియును వారేమియు తెలిసికొనలేరు. ఆత్మ అట్టిది. ఎవరేమి చేయగలరు?

ముందు, చెప్పువాడు దొరకవలయును. అది అరుదు. ఎందువలనన, ఎంత ఆశ్చర్యకరముగ చెప్పినను, అనుభవముగల మహాపురుషుడుగాని చెప్పలేడు. అట్టివాడు దొరకినను, వినువాడు అపరిమిత శ్రద్ధావిశ్వాసములతో, ఎంతమాత్రమును అసూయలేకుండ వినువాడై యుండవలయును. లేనియెడల ఎన్ని పర్యాయములు వినినను, వారికి ఈషణ్మాత్రముకూడ తెలియనే తెలియదు. ఆ మహావకాశమును, దృష్టి నటునిటు పోనిచ్చుటతోనే, ఆ సమయములోనే వచ్చునట్టి ఇతర ఆలోచనలతోనో, లేక లోకసంభాషణలతోనో, ఇదియును అదియును కాకపోయిన, కునుకుపాట్లతోనో పాడుచేసికొనును. విను విషయమునందుగాని, చెప్పువానియందుగాని, ఏ మాత్రము అసూయాభావమున్నను, వినినది సరిగ అర్థము చేసికొనలేడు. వితండవాదము, విపరీతప్రశ్నలు బయలుదేరును. వీటిలో ఏవియును లేకుండ ఉండవలెనన్నచో, ఎంత శ్రద్ధావిశ్వాసములుండవలెను? అట్లు వినువాడుకూడ దుర్లభుడే. కాబట్టియే "వక్తా శ్రోతాచ దుర్లభః" అని పెద్దల శ్రీసూక్తి. కాని వినువారు చాలమందియే ఉందురు. ఇట్లు వినువారు "మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్."

ఆత్మానుభవము గలిగిన వారందరును ఆత్మనుగూర్చి చెప్పలేరు. వారిలో ఏ ఒక్కడో చెప్పగలుగును. అదియైనను ఆశ్చర్యకరమే. లౌకిక పదార్థములను వర్ణించి చెప్పినట్లు ఆత్మ వస్తువును వర్ణించి చెప్పుటకు వీలులేదు. కాన, చెప్పుట చాల ఆశ్చర్యము, అద్భుతమును. కనుక, ఆశ్చర్యముగనే చెప్పును. ఎన్ని ఉదాహరణములతో, ఉపమానములతో, ఆత్మతత్త్వమునుగూర్చి చెప్పినను, ఆ ఉదాహరణములు, ఆ ఉపమానములును పూర్ణముగ సరిపోవునవిగా ఉండవు. సముద్రము నెరుగని బాలుడు తండ్రినిజూచి "సముద్రమనగా నెట్లుండును ?" అని ప్రశ్నించినచో, తండ్రి, వారి గ్రామము ననేగల ఒక చెరువునుజూచి "సముద్రమనగా ఇట్లేయుండును. కాని దీనికంటె చాల పెద్దది" అని చెప్పును. ఈ పోలిక ఎంతవరకు సరిపోవునో, ఇక్కడకూడ అంతియే సరిపోవును. ఆత్మతో సమానమైన వస్తువు ప్రపంచములో ఇంకొకటిలేదాయె ! అయినప్పటికిని మహాత్ములు విధి రూపముగాను, నిషేధరూపముగాను, ఏవో ఆశ్చర్యమయము లైన సాంకేతికములద్వారా దానిని మనకు తెలియజెప్పు దురు. ఇది ఆశ్చర్యముగను, అద్భుతముగను ఉండును.

ఎందులకన, "శరీరమే నేను" అను భావానుకూలమైన వాతావరణములో మొదటినుండియు అలవడిన వార లకు "నీవు శరీరమవుకాదు" అనినచో, ఎంత ఆశ్చర్యముగ

ఉండును! "నీవు మనుష్యుడవు కావు" అని చెప్పినచో, ఎంత ఆశ్చర్యముగ వినునో చూడుడు. ప్రాపంచిక విషయము లన్నియును అనుభవములో సుఖప్రదములుగ తోచుచున్నవానికి "ఇవన్నియును దుఃఖప్రదములు" అని చెప్పిన, ఎట్లు అర్థమగును? ఆశ్చర్యముగ వినడా! "ఆత్మ కండ్లతో చూచుటకు వీలులేనిది. చెవులతో వినుటకు వీలులేనిది. తాకుటకు వీలులేనిది. వాసన జూచుటకు వీలులేనిది. నాలుకతో రుచి చూచుటకు వీలులేనిది. బుద్ధితో ఊహించుటకు వీలులేనిది" అని చెప్పినచో ఆశ్చర్యముగ వినక ఏమిచేయును? శాస్త్రముల యందును, చెప్పునట్టి వానియందును, కేవలము శ్రద్ధ, భక్తి, విశ్వాసములు గలిగి, 'సత్యమే' అని నమ్మి వినవలసిన దేగాని, వేరు మార్గములేదు. ఇట్లు వినుట ఒక ఆశ్చర్యజనకమైన శ్రవణము.

కొంతమంది విందురు. శ్రమయనుకొనక, ప్రతిరోజును చాల దూరదూరములనుండి వచ్చికూడ విందురు. కాని, వారి చిత్తములో శ్రద్ధ, విశ్వాసములు పూర్తిగ లేకపోవుట చేతను, బుద్ధి శుద్ధము, సూక్ష్మము కాకపోవుటచేతను, వారు ఆత్మతత్త్వమును విన్నను, వారికి సంశయము, విపరీతభావము కలుగుచుండును. అందువలన వారలకు యథార్థ స్వరూపము తెలియబడదు. కనుక ఆత్మతత్త్వమును తెలిసికొనుట చాల కష్టము.

ఈ కారణములచేత "కొంతమంది వినియును తెలిసి కొనలేరు" అని పరమాత్మ చెప్పుటయైనది. ఆత్మవస్తువు ఆశ్చర్యకరమైనదే. ఆశ్చర్యకరమైనదానిని చూచుట ఆశ్చర్యమే. చెప్పుట ఆశ్చర్యమే. వినుట ఆశ్చర్యమే.

**అవతారిక :—**

ఈ విధముగ ఆత్మతత్త్వమును, నిత్యమైనదిగను, నాశనము లేనిదిగను చెప్పి, ఇప్పుడు ఈ శ్లోకముతో సాంఖ్య యోగ ప్రకరణమునకు ఉపసంహారము చేయుచున్నాడు.

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం
దేహే సర్వస్య భారత !
తస్మా త్సర్వాణి భూతాని
న త్వం శోచితు మర్హసి ॥ 30

ప. వి :— దేహీ, నిత్యం, అవధ్యః, అయం, దేహే, సర్వస్య, భారత, తస్మాత్, సర్వాణి, భూతాని, న, త్వం, శోచితుం, అర్హసి.

టీక :—

హే భారత ! = ఓ అర్జునా !
సర్వస్య = సమస్త ప్రాణులయొక్క,
దేహే = శరీరము,

(వధ్యమానేఽపి = చంపబడుచున్నను),
అయం దేహీ = ఈ ఆత్మ,
నిత్యం = ఎల్లప్పుడును,
అవధ్యః = చంపబడదగనిది,
తస్మాత్ = ఆ కారణమువలన,
త్వం = నీవు,
సర్వాణి భూతాని = సమస్తమైన భూతములను గురించి
(అనగా జీవులను గురించి),
శోచితుం = దుఃఖించుటకు,
న అర్హాసి = తగవు.

తా. ఓ భారతా ! సర్వులయొక్క దేహమున నుండెడి ఆత్మ అవధ్యము. వధింపబడనిది. కనుక సర్వభూతములను గురించియును నీవు దుఃఖించుట తగదు.

**అమృతవాహిని :—**

సమస్తదేహములలో నుండెడి ఆత్మలుకూడ నశించనివే. దేహములన్నియును వధింపబడినను, వాటిలో ఉండెడి ఆత్మలు వధింపబడవు. కనుక నీవు ఎవరినిగురించి దుఃఖించెదవు ? బ్రహ్మ మొదలుకొని స్థావరపర్యంతమైన దేహములలో నుండెడి ఆత్మలన్నియును ఒకటియే. విషమత్వము శరీరములకు సంబంధించినది మాత్రమే. శరీరములకు సంబంధించిన ఈ విషమత్వము, అనిత్యత్వము ఆత్మలకు సంబంధించవు.

ఆత్మలు నిత్యములు, అవ్యక్తములు, అచింత్యములు, అవి
కార్యములు, సనాతనములు, అచ్ఛేద్యములు, అదాహ్యములు,
అక్లేద్యములు, అశోష్యములు. (ఈ విశేషణములను గురించిన
వ్యాఖ్యానము ౨౩, ౨౪, ౨౫ శ్లోకములలో చూడనగును.)
కనుక అనిత్యము లయిన ఈ శరీరములు నరికబడినను, ఆత్మలు
నరకబడవు. కనుక నీవు ఎవరినిగూర్చి దుఃఖించెదవు? గురువులు,
మహానుభావులు అని కొంతమందిని శ్రేష్ఠులుగను, కొంత
మందిని నీచులుగను భావించి, 'శ్రేష్ఠులనుకూడ చంపవలసి
వచ్చుచున్నదే' అని దుఃఖించుచున్నావు. శ్రేష్ఠత్వము శరీరము
లనుబట్టి ఏర్పడినదిగాని, స్వతః ఆత్మలకు లేదు. అవన్నియును
సమానములే. శ్రేష్ఠత్వ నీచత్వములకు సంబంధించిన శరీ
రములు, నీవు యుద్ధము చేసినను చేయకపోయినను నశించె
డివే. సమానములైన ఆత్మలు నీవుయుద్ధము చేసినను నశించవు.
కనుక అర్జునా! ఈ వైక్లబ్యమును పారద్రోలి, ధైర్య
వంతుడవై, లేచి యుద్ధముచేయుము. దుఃఖించకుము. శత్రు
వులు నవ్వరా! నీవు ఎటువంటి పరమపవిత్రమైన, పౌరుష
వంతమైన, రాజర్షు లవతరించిన భరతవంశములో పుట్టినావు!
ఈ వంశములోని ఏ రాజపుంగవులైనను, నీవలె యుద్ధమునకు
జంకిరా? లెమ్ము! గాండీవము ఒకసారి సారించుము!

ప్రశ్న : ఇక్కడ సమస్తప్రాణుల శరీరములలో ఉండునట్టి
'ఆత్మ' అని ఆత్మను ఏకవచనములో చెప్పుటచేత ఆత్మలు
అనేకములు కావు. ఒక్కటేనని తేలుటలేదా?

సమా : లేదు. ఆత్మను ఏకవచనములో ప్రయోగించిన మాట వాస్తవమే. కాని, శరీరమునుకూడ ఏకవచనములోనే ప్రయోగించినాడే. 'సర్వస్య దేహే' 'సర్వులయొక్క దేహము నందు' అని! అయితే 'సర్వులకును ఒక్కటే దేహము' అని నిర్ణయము చేయవలయునా? ఒక్కొక్కప్పుడు బహువచనము లోను, ఏకవచనములోనుకూడ, ప్రయోగించుటకద్దు. ఏక వచనములో ప్రయోగించినప్పుడు జాత్యేకవచనమని భావించవలయును. లేక 'ఆత్మను ఏకవచనములో ప్రయోగించుట కేమైన గూఢార్థముండునేమో' అని ఆలోచించిన యెడల, 'దేహమును ఏకవచనములో ప్రయోగించుటకు కూడ ఏమైన గూఢార్థముండునేమో' అని ఆలోచించవలయును. కాని ఏమియును లేదు. జాత్యేకవచనముగనే ఇక్కడ భావించ వలయును.

అవతారిక:_

ఇంతవరకును ఆత్మయొక్క నిత్యత్వమును, శరీరము యొక్క అనిత్యత్వమును చెప్పి, 'నీవు యుద్ధముచేసినను, చేయ కున్నను ఆత్మ నశించునది కాదు శరీరము నశించక యుండునది కాదు. కాబట్టి నీవు తప్పక యుద్ధముచేయ వలసిన దే. యుద్ధములో ఎవరో నశించెదరు అని విచారించ నవసరము లేదు. అట్లు విచారించుట నీవంటివానికి" తగదు అని చెప్పి, ఇప్పుడు 'నీ క్షత్రియ ధర్మముబట్టి

చూచినను విచారించుట అనుచితమే' నని చెప్పి, యుద్ధము చేయుటకు ప్రోత్సహించుచున్నాడు ఏడు శ్లోకములలో.

శ్లో॥ స్వధర్మ మపి చావేక్ష్య
న వికంపితు మర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్
క్షత్త్రియస్య న విద్యతే ॥ 31

ప. వి :—స్వధర్మం, అపి, చ, అవేక్ష్య, న, వికంపితుం, అర్హసి, ధర్మ్యాత్, హి, యుద్ధాత్, శ్రేయః, అన్యత్, క్షత్త్రియస్య, న, విద్యతే.

టీక :—

అపి చ = ఇంతియేకాక,
స్వధర్మం = స్వకీయమైన క్షత్త్రియధర్మమును,
అవేక్ష్య = ఆలోచించి,
వికంపితుం = చలించుటకు,
న అర్హసి = తగవు;
హి = ఏమనగా,
క్షత్త్రియస్య = రాజునకు,
ధర్మ్యాత్ = ధర్మముతో కూడిన,
యుద్ధాత్ = యుద్ధమునకంటె,

అన్యత్ = ఇతరమైన,
శ్రేయః = మేలు,
న విద్యతే = లేదు.

తా. అర్జునా ! నీ ధర్మమును జూచినను నీవు భయపడనవసరము లేదు. క్షత్రియునకు ధర్మయుద్ధముకంటె శ్రేయస్కరమైనది ఇంకొకటి లేదు.

**అమృతవాహిని :—**

అర్జునా ! పోనీ, "ఆత్మ నిత్యమైనను, శరీరము అనిత్యమైనను, నేను యుద్ధముచేసినను, శరీరములు ఎట్లైనను నశించెడివే అయినను, అవి నశించుటకు నిమిత్తము ఎందులకు కావలయును ?" అందువా ? అట్లైన వినుము :- నీ వర్ణోచితమైన ధర్మమును జూచినను, నీవు యుద్ధముచేయక తప్పదు. నీవు క్షత్రియుడవు, క్షత్రియునకు కల్యాణప్రదమైనది ధర్మయుద్ధము. దానికంటె మించిన కల్యాణమార్గము ఇంకొకటి క్షత్రియునకు లేదు. కనుక నీవు యుద్ధము చేయవలసినదే. తప్పదు. యుద్ధమునకు కారణము అవినీతియో, రాజ్యలోభమో కారాదు. విషయలోలుపత కారణముగ మనము యుద్ధమునకు దిగరాదు. 'నీ భార్యను నాకు స్వాధీనము చేసినసరే. లేకపోయిన, ఇదిగో దండెత్తి వచ్చుచున్నాను' అని, క్షత్రియుడనుగదాయని యుద్ధమునకు దిగరాదు. ఇటువంటిది అవినీతి కారణముగ యుద్ధమునకు దిగుటయనగా. ఇది

మనకు పనికిరాదు. రాజ్యలోభముచేతనో, ధనలోభము చేతనో అన్యాయ్యముగ ఆక్రమణ చేసికొనుటకై యుద్ధము ప్రకటించరాదు. అది అధర్మయుద్ధము. అట్టివి పనికిరావు. కాని ధర్మయుద్ధము క్షత్రియునకు ముక్తిప్రదము. ఆ ధర్మ యుద్ధమే తన వర్ణమునకు, తన పరిస్థితికి ధర్మమైన కామ్య ముతో చేసి చచ్చినయెడల, వీరస్వర్గము దొరకును. నిష్కామ్య ముగ చేసి చచ్చినయెడల, ముక్తి లభించును. నిష్కామ్యముగ చేసి, జయముపొందిన యెడల, మరల తన జీవితములో దానికి ప్రతిబంధకము తెచ్చిపెట్టుకొనకుండ యుండినయెడల, జీవితాంతమున ముక్తిలభించును. కనుక ధర్మయుద్ధము శ్రేయోమార్గమని చెప్పబడినది. కనుక, సకాలమునకు వర్షము తటస్థించిన రైతు లెట్లు సంతోషింతురో, అకస్మాత్తుగ భూమిలో నిధిదొరికిన పేదవాడెట్లు ఆనందించునో, ధర్మ యుద్ధము తటస్థించినప్పుడు క్షత్రియుడు అట్లు సంతోషించును. కనుక నీవు ఎంతమాత్రమును దుఃఖించక యుద్ధమునకు లెమ్ము!

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం
స్వర్గద్వార మపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ !
లభంతే యుద్ధ మీదృశమ్ ॥ 32

ప. వి :—యదృచ్ఛయా, చ, ఉపపన్నం, స్వర్గద్వారం, అపా వృతం, సుఖినః, క్షత్రియాః, పార్థ, లభన్తే, యుద్ధం, ఈదృశం.

టీక :—

హే పార్థ ! = ఓ అర్జునా !
యదృచ్ఛయా = కోరకుండ (అయాచితముగ),
ఉపపన్నం = సంభవించినట్టియు,
అపావృతం = తెరువబడిన స్వర్గద్వారరూపమైనదియు
నగు,
ఈదృశం = ఇట్టి,
యుద్ధం = (ధర్మ) యుద్ధము,
(యే) క్షత్రియాః = (ఏ) రాజులు,
లభన్తే = పొందుచున్నారో,
(తే = వారలు),
సుఖినః = ఇహాపరసుఖములు గలవారుగా,
(భవన్తి = అగుచున్నారు).

తా. ఓ పార్థా! తనంతతానుగా తటస్థపడినదియు, తెరువబడిన స్వర్గద్వారమువంటిదియునైన ఇటువంటి యుద్ధము లభించిన క్షత్రియులు భాగ్యవంతులు సుమా! - (భాగ్యవంతులైన క్షత్రియులకు మాత్రమే లభించును)

అ మృ త వా హి ని :—

'పార్థా !' అని సంబోధన చేయుచున్నాడు. పార్థు డనగా అర్జునుడు, అతని తల్లికి 'పృథ' అనికూడ ఒక పేరు

ఉండెడిది. ఆమె పెంపకమునకు పోవుటచేత, అక్కడివారు 'కుంతి' అని పిలిచెడివారు. కాబట్టి కృష్ణుడు అర్జునుని పార్థుడని యును పిలుచుచుండును.

ఇక్కడ 'పార్థా!' అని సంబోధించి, మరల ఏమి జ్ఞాపకము చేయుచున్నాడనగా, యుద్ధమునకుముందు కుంతి కృష్ణునితో చెప్పెను-

"ఏత ద్ధనంజయో వాచ్య - సత్యో ద్యుక్తో వృకోదరః ।
యదర్థం క్షత్రియా సూతే- తస్య కాలోఽయ మాగతః ॥
(భార. ఉద్యో - ౧౩౭-౯)

అనగా, "క్షత్రియమాత ఏపని కొరకు పుత్త్రులనుకనునో, దానికి తగిన సమయము వచ్చినది అని, కృష్ణా ! ధనంజయుని తోను, భీమునితోను చెప్పుము !" ఇట్లు చెప్పినది నీ తల్లి - జ్ఞాపకమున్నదా? రామచంద్రమూర్తికి 'పితౄజ్ఞాపరిపాలకుడు' అని పేరు వచ్చినట్లు, మీకు 'మాతౄజ్ఞాపరిపాలకులు' అని పేరువచ్చినదికదా ! తల్లి ఆజ్ఞను జవదాటకయేకదా ద్రౌపదిని మీ రేవురును వివాహమాడినారు ! ఆ తల్లిమాట నివ్వు డెట్లు త్రోసివేయుదువు ? అని జ్ఞాపకము చేయుచున్నాడు.

కనుక పార్థా ! ఈ ధర్మయుద్ధము ఎటువంటిదో తెలి యునా ? తెరచిన స్వర్గద్వారమువంటిది. ఈ యుద్ధములో మరణించువారు, సరాసరి, మధ్యలో ఎట్టి ఆటంకములును

లేకుండ, ఎవరి ఆజ్ఞలను పొందుటగాని, అడు
మొదలగు అగత్యములు లేకుండ స్వర్గమునకు పోదురు.
వచ్చితినిగాని తలుపులు తీయండి" అని ద్వారము వద్దక
తలుపులు తట్టవలసినపని లేదు. ద్వారములు తె
యుండును. అటువంటి ఈ యుద్ధము తనంత తాను తట
ఎంత అదృష్టవంతులైన క్షత్రియులకో! మీరు సంధి
ప్రయత్నములు చేసినారు! ఎంతమందిని పంపినారు!
మీకొరకై నేనుకూడ ఆ దుర్మార్గుడైన దుర్
దగ్గరకు వెళ్ళుటయును, వాడు నన్ను కట్టివేయ ప్రయ
విఫలులగుటయును, జరిగినదా లేదా? మీరు ఇంత
త్నముచేసినను, దుర్యోధనుడు 'సూదిమొనమో
భూమినికూడ ఈయ'నని గట్టిగ చెప్పినాడుగదా! 
ఎంత ఇష్టము లేకపోయినను, మీరన్నదమ్ములందరును
చించి, ఇక తప్పనిసరియై,యుద్ధమునకు సిద్ధపడినారు. క
యుద్ధము మీరు కోరకుండగనే తటస్థించినది. కనుక
గొప్ప అదృష్టవంతులు. ఈ మంచి సమయమును
పోనిచ్చుకొనరాదు. భయపడకుము. ధైర్యము సడలనీయ
నీ అదృష్టము ఏమనికొనియాడను అర్జునా! ఇట్టి
పవిత్రమైన ధర్మయుద్ధము తనంత తాను నీకు లభి
భళిరా! లే! ఒక్కసారి గాండీవమును సారించి, గు
రముజేసి, దేవదత్తమును పూరించి, సింహనాదము చే
నీవారందరును నీ స్థితినిజూచి నిరుత్సాహపడియున్నా

సింహనాదముతో వారి నిరుత్సాహముపోగొట్టి,ఉత్సాహమును మేల్కొనజేయును.

అవతారిక :—

యుద్ధము చేయుటచేత కలిగెడి లాభములను చూపించి, ఇప్పుడు చేయకపోవుటచేత కలిగెడి అనర్థములను చెప్పుచున్నాడు.

శ్లో॥ అథ చేత్త్వ మిమం ధర్మ్యం
సంగ్రామం న కరిష్యసి ।
తత స్స్వధర్మం కీర్తించ
హిత్వా పాప మవాప్స్యసి ॥ 33

ప. వి :—అథ, చేత్, త్వం, ఇమం, ధర్మ్యం, సంగ్రామం, న, కరిష్యసి, తతః, స్వధర్మం, కీర్తిం, చ, హిత్వా, పాపం, అవాప్స్యసి.

టీక :—

అథ = (పరమసుఖప్రదమైన ప్రయోజనమును పోగొట్టుకొనుటయే) కాక,
త్వం = నీవు,
ధర్మ్యం = ధర్మయుక్తమైన,
ఇమం సంగ్రామం = ఈ యుద్ధమును,

న కరిష్యసి చేత్ = చేయ వేని,
తతః = అందువలన,
స్వధర్మం = స్వధర్మ (ఫల) మును,
కీర్తించ = యశస్సును,
హిత్వా = పోగొట్టుకొని,
పాపం = (మీాదుమిక్కిలి స్వధర్మపరిత్యాగమువలన కలుగు) దోషమును,
అవాప్స్యసి = పొందగలవు.

తా. లేక నీవు ఈ ధర్మమును చేయకపోయినయెడల, స్వధర్మమును, కీర్తిని కూడ పోగొట్టుకొని. పాపమునే పొందెదవు.

అ మృ త వా హి ని :—

అర్జునా ! నీవు "నాకు పుణ్యమువద్దు స్వర్గమును వద్దు. ఇవి కావలయుననిన-చో యుద్ధము చేయువలయునుగాని, ఇవేవియు అక్కఱలేని నేను యుద్ధము ఎందులకు చేయవలయును ? నీవు ఇవన్నియును చెప్పెదవని యేగదా, 'త్రైలోక్యాధిపత్యము వచ్చినను యుద్ధముచేయను' అని ఇదివరకే చెప్పియుంటిని" అందువేమో - వినుము. నీవు ఈ యుద్ధము చేయకపోయిన యెడల, నీ కర్తవ్యరూపమైన స్వధర్మమును వదలిన పాపము వచ్చును. ఇదివరలో 'అర్జునుడు మహాశూరుడు, వీరుడు. అతిరథుడు' అని సంపాదించిన కీర్తి యంతయును నశించిపోవును. నీవు ఏకాకిగా వెడలి,నివాతకవచాది రాక్షసులను జయించితివి.

కేవలము శంకరునితో యుద్ధముచేసి, శంకరుని మెప్పించితివి. ఇది సామాన్యమా! దీనిచేత లోకములో నీకెంత కీర్తి వ్యాపించినది! ఇదంతయును వమ్మై, దుమ్మైపోవునుగదా! ఎటుజూచినను నీవు యుద్ధము చేయక తప్పదోయి పార్థా!

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని
కథయిష్యంతి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తి
ర్మరణా దతిరిచ్యతే ॥ 34

ప. వి :— అకీర్తిం, చ, అపి, భూతాని, కథయిష్యన్తి, తే, అవ్యయాం, సంభావితస్య, చ, అకీర్తిః, మరణాత్, అతిరిచ్యతే.

టీక :—

అపి చ = ఇంతియేకాక,
భూతాని = ప్రాణులు (జనులు),
తే = నీయొక్క,
అకీర్తిం = అపకీర్తిని,
అవ్యయాం = శాశ్వతముగ,
కథయిష్యన్తి = చెప్పికొనగలరు,
సంభావితస్య = (చిరకాలమునుండియును శౌర్యధైర్యాది గుణములచే) సన్మానింపబడు వానికి,

(20)

అపకీర్తిః = (క్రొత్తగ వచ్చినట్టి) అపకీర్తి,
మరణాత్ చ = చావుకంటెను,
అతిరిచ్యతే = మించిన దగుచున్నది.

తా. అదియునుగాక, సర్వులును శాశ్వతముగ నీ అపకీర్తిని పలుకుచుందురు. మానవీయునకు అపకీర్తి, మరణముకంటెనుకూడ మించినదిసుమా !

అ మృ త వా హి ని :—

అర్జునా! చూడుము! నీవు యుద్ధము చేయకపోవుట చేత, స్వధర్మము, కీర్తియు నాశనమగుటయు, పాపము లభించుట యును మాత్రమేకాదు- ఒక్క మానవులేకాదు - దేవతలు, ఋషులు, యక్షులు, రాక్షసులు అనేక ప్రకారములుగ నిన్ను నిందించెదరు. ఈ అపకీర్తి, ఈ రోజుండి రేపుపోవునది అను కొనుచుంటివా ? చిరస్థాయిగ నిలిచియుండును సుమా ! యశోధనులైనవారికి, అపకీర్తికంటె మరణమే మంచిదికదా ! అయితే, తాత్కాలికోద్వేగముతో "నాకు అపకీర్తి కలిగినను సరే" అందువు. కాని అపకీర్తి కలుగునప్పటికి సహించుకొనలేవు సుమా ! శూరుడవు, వీరుడవు అని మూడు లోకములలోను కీర్తి వహించియున్నావు. అట్టి నీవు ఏ మాత్ర మును అవమానమును సహించలేవు. కాబట్టి ఎట్లు విచా రించినను, యుద్ధము చేయుటయే నీకు కర్తవ్యము.

శ్లో॥ భయా ద్రణా దుపరతం
మన్యంతే త్వాం మహారథాః ।
ఏషాంచ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35

ప. వి :—భయాత్, రణాత్, ఉపరతం, మన్యంతే, త్వాం, మహారథాః, ఏషాం, చ, త్వం, బహుమతః, భూత్వా, యాస్యసి, లాఘవం.

టీక :—

త్వం = నీవు,
ఏషాం = ఎవరికి,
బహుమతః = మాన్యుడవు,
(అభూః = అయితివో),
(తే) మహారథాః = (అట్టి) మహారథులయినవారు (దుర్యోధనాదులు),
త్వాం = నిన్ను,
భయాత్ = భయమువలన,
రణాత్ = యుద్ధమునుండి,
ఉపరతం = మరలినవానినిగా,
మన్యంతే = తలంపగలరు,
(బహుమతః = ఇంతవరకు వారలచే గౌరవింపబడినవాడవు),

భూత్వా - చ = అయ్యును,
లాఘవం = అగౌరవమును,
యాస్యసి = పొందగలవు.

తా. ఇంతియేకాక, ఎవరిదృష్టిలో నీవు ఇంతవరకును, శూరుడవు, వీరుడవు అని గౌరవింపబడితివో, ఆ మహారథులే ఇప్పుడు నిన్ను చులకనజేసి, భయముచేత యుద్ధమునుండి విరమించుకొంటివని యను కొందురు.

## అ మృ త వా హి ని :—

అర్జునా ! మన ఉభయ సేనలలోని మహావీరులందరు నిన్ను ఇంతవరకును 'అతిరథుడు, మహారథుడు' అని తలంచి, నీ విషయమున గౌరవముగను,భయముగను ఉన్నారు. ఇప్పుడు నిన్ను అతిలాఘవముగ, చులకనగ చూచెదరు. భయముచేత నీవు యుద్ధమునుండి పారిపోతివని నిందలుపల్కుదురు. "అర్జునుడు స్వజనులమీద దయచేతను, పాపము వచ్చుననియు యుద్ధము మానినాడు" అని అనుకొనరు. "మమ్ములనుజూచి భయపడి పారిపోయినాడు" అని ధార్తరాష్ట్రులను, "భీష్మ ద్రోణాదులను జూచి భయపడినా"డని మనవారును తలంచెదరు. ఇప్పుడు నీవు ఎన్నిమాటలుచెప్పినను, అపకీర్తి భరించవలసి వచ్చునప్పటికి, ఇప్పుడు మాటలు చెప్పినట్లుండదు. నీవు భరించ లేవు. ప్రతిష్ఠ సంపాదించినవారికి, అపకీర్తిని భరించుట మరణముకంటె దుఃఖకరముసుమా ! కనుక నీవు యుద్ధము చేయుటే కర్తవ్యము.

అ వ తా రి క :—

పై శ్లోకములో సర్వసాధారణముగ అందరును చెప్పి కొనెడి నిందన గూర్చి చెప్పి, ఇప్పుడు 'నీ శత్రువులైన దుర్యోధ నాదులు, ముఖముమీదనే అనేక దుర్వచనములు పలుకు దురు' అనుచున్నాడు.

శ్లో॥ అవాచ్య వాదాంశ్చ బహూన్
వదిష్యంతి తవాహితాః ।
నిందంత స్తవ సామర్థ్యం
తతో దుఃఖతరం ను కిమ్ ? 36

ప. వి :—అవాచ్యవాదాం, చ, బహూన్, వదిష్యన్తి, తవ, అహితాః, నిందంతః, తవ, సామర్థ్యం, తతః, దుఃఖ తరం, ను, కిమ్.

టీక :—

తవ = నీయొక్క,
అహితాః = శత్రువులు,
తవ = నీ యొక్క,
సామర్థ్యం = శక్తిని,
నిందంతః = నిందించుచున్నవారై,
బహూన్ = అనేకములైన,
అవాచ్యవాదాం చ = అనరానిమాటలనుకూడ,

వదిష్యన్తి = పలికెదరు,
తతః = అంతకంటె,
దుఃఖతరం = అధికదుఃఖము,
కిం- ను = మరేమికలదు ?

తా. నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు, నిన్ను అన గూడని అనేకమైన మాటలను అందురు. అంతకంటె మించిన దుఃఖ మేమున్నది ?

అ మృ త వా హి ని :-

అర్జునా ! నీ శత్రువులు - దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, శకుని మొదలైనవారు- పెక్కుమారులు, నీచేత దెబ్బలుతిని పారిపోయినవారలే యైనను, ఇప్పుడు యుద్ధము చేయని నిన్ను జూచి, భయములేక, ఇచ్చవచ్చినట్లు ఎవరును అనగూడని వినగూడని దుర్వచనములు పలికెదరు. చాటున కాదు - నీముఖముమీదనే. ఆ నిందావాక్యములు సామాన్య మానవులనే కలతచెందించునవిగా యుండును. ఇక నీబోటి శూరుడు విని సహించగలడా ? అంతకంటె లోకములో దుఃఖ మనునది ఇంకొకటిగలదా ? "నేను యుద్ధము చేయను. యుద్ధము చేయనినన్ను,ఆయుధములు ధరించి దుర్యోధనాదులు చంపినను నాకు మేలే" అంటివి. నీవు యుద్ధము చేయనియెడల, నిన్ను వారు అస్త్రములు శస్త్రములు ప్రయోగించి కొట్టెదరు. అట్లు కొట్టినయెడల నీ ప్రతిజ్ఞ ప్రకారము ఓర్చుకొనగల

వేమో ! కాని అట్లు కొట్టగు. ఎటువంటివారును, చివరకు ఏమియును సామర్థ్యము లేని అధమాధములుకూడ సహించలేని అసహ్యావాగ్బాణముల ప్రయోగించి నీచిత్తమును బాధించెదరు. నీవంటి పౌరుష శాలికి, మానసీయునకు ఇది సహించలేనిది. ఇంతకంటె దుఃఖముండునా ?"

అర్జునుడు ఇంతవరకును యుద్ధము మానుటలో సుఖమున్నదనియును, చేయుటలో దుఃఖమున్నదనియును, ఏమేమో చెప్పినాడు. 'అది వట్టి భ్రాంతి - యుద్ధము చేయుటచేతనే మేలుకలదు. యుద్ధము చేయకపోవుటచేతనే భరించలేని అనేక విధములైన దుఃఖములు కలుగును' అని కృష్ణపరమాత్మ చెప్పినాడు.

అ వ తా రి క :—

ఈ విధముగ యుద్ధము చేయకుండుటవలన కలిగెడి పలురకములైన అనర్థములను అనేకయుక్తులతో, హేతువులతో వివరించి, ఇప్పుడు యుద్ధము చేయుటచేత రెండు వైపులనుండి చూచినను కలిగెడి లాభములను చూపించుచు, అర్జునుని యుద్ధమునకే సిద్ధపడవలసినదిగా ఆజ్ఞాపించుచున్నాడు.

శ్లో॥ హతోవా ప్రాప్స్యసే స్వర్గం
జిత్వావా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ !
యుద్ధాయ కృతనిశ్చయః ॥ 32

ప. వి :—హతోవా, ప్రాప్స్యసే, స్వర్గం, జిత్వావా, భోక్ష్యసే, మహీం, తస్మాత్, ఉత్తిష్ఠ, కౌన్తేయ, యుద్ధాయ, కృతనిశ్చయః.

టీక :—

కౌన్తేయ ! = ఓ అర్జునా !
హతోవా = (శత్రువులచేత) నీవు చంపబడినయెడల,
స్వర్గం = స్వర్గమును,
ప్రాప్స్యసే = పొందుదువు;
జిత్వావా = (శత్రువులను నీవు) జయించితివేని,
మహీం = భూమిని (రాజ్యమును);
భోక్ష్యసే = అనుభవింతువు;
తస్మాత్ = కావున,
యుద్ధాయ = యుద్ధముకొరకు,
కృతనిశ్చయః = చేయబడిన నిశ్చయము కలవాడవై (అనగా, నిశ్చయించుకొని),
ఉత్తిష్ఠ = లెమ్ము !

తా. ఒకవేళ నీవు యుద్ధమున మరణించినయెడల స్వర్గమనుభవించెదవు. జయించినయెడల భూమండలాధిపత్య మనుభవించెదవు. కనుక అర్జునా ! యుద్ధము చేయుటకే కృతనిశ్చయుడవై లెమ్ము !

అ మృ త వా హి ని :—

"అర్జునా ! 'నేను యుద్ధము చేయవలయునా ? మాన వలయునా ? ఏది శ్రేయస్కరము ? మనలను వారే

జయించెదరో వారిని మనమే జయించెదమో ఎంతమాత్రమును నిర్ణయించుకొనలేకుండ నున్నాను’ అని చెప్పితివే! యుద్ధము చేయకపోయిన గలుగు అనర్థములను చెప్పితినిగదా! యుద్ధము చేసినయెడల స్వధర్మమును నిర్వర్తించిన వాడవగుదువు. పుణ్యము లభించును అని చెప్పితిని. అంతియేకాదు, యుద్ధము నందు మరణించితివా స్వర్గమనుభవించెదవు. జయించితివా భూమండలాధిపత్య మనుభవించెదవు. కావున ఈ రెండు దృష్టులలో ఎటు చూచినను నీకు యుద్ధము చేయుటయే శ్రేయస్కరము. కనుక యుద్ధము చేయుటకే కృతనిశ్చయుడవుకమ్ము. ధైర్యము నవలంబించుము. శరీరమును చిత్తమును సంబాళించుకొని లెమ్ము ” అనుచున్నాడు కృష్ణపరమాత్మ.

ఈ అధ్యాయము యొక్క ఆరవశ్లోకములోని అర్జునుని ప్రశ్నకు ఈ శ్లోకములో సమాధానము చెప్పబడినది.

**అవతారిక :—**

మొదటి అధ్యాయములో నలుబది అయిదవ శ్లోకములో ‘అహో! మనము మహా పాపమును చేయుటకు సిద్ధపడుచున్నాము’ అని అర్జునుడు పాపమునకు భయపడిన దానికి, సమాధానము చెప్పబడుచున్న దీ శ్లోకములో —

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా
లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాపమవాప్స్యసి ॥ 38

ప. వి :—సుఖదుఃఖే, సమే, కృత్వా, లాభాలాభౌ, జయాజయౌ, తతః, యుద్ధాయ, యుజ్యస్వ, న, ఏవం, పాపం, అవాప్స్యసి.

టీక :—

సుఖదుఃఖే = సుఖదుఃఖములను,
సమే కృత్వా = సమానములుగ తలచి,
లాభాలాభౌ = లాభనష్టములను,
(సమౌ కృత్వా = సమానములుగ తలచి),
జయాజయౌ = జయాపజయములను,
(సమౌ కృత్వా = సమానములుగ తలచి),
తతః = తరువాత,
యుద్ధాయ = యుద్ధము కొరకు,
యుజ్యస్వ = తలపడుము.
ఏవం = ఇట్టి నిశ్చయము గలవాడవైతి వేని,
పాపమ్ = పాపమును,
న అవాప్స్యసి = పొందబోవు.

తా, సుఖదుఃఖములయందును, లాభనష్టములయందును, జయాప జయములయందును సమభావము కలిగి, యుద్ధముచేయుటకొరకు సిద్ధము కమ్ము. అట్లు చేయుటచేత నీవు పాపమును పొందక ఉండగలవు.

## అ మృ త వా హి ని :_

"అర్జునా! మానవుడు స్వధర్మ నిర్వహణ విషయములో ఆ స్వధర్మముచేత సుఖము కలిగినను, దుఃఖము కలిగినను, లాభము, నష్టము, జయము అపజయము ఏది సంభవించి నను లెక్కచేయక ఆచరించవలెను - అందుచే పాపమును పొందడు. నీవు క్షత్త్రియుడవు కనుక నీకు స్వధర్మములలో ప్రధానమైనది ధర్మయుద్ధము. ఈ యుద్ధములో శస్త్రాస్త్ర ప్రహారణములచేత దుఃఖమే కలుగనీ, లాభము రానీ, నష్టము రానీ, జయమే కలుగనీ, లేక శత్రువులచేత జయింపబడి నీ సర్వస్వము నశించనీ- వీటి యందు మనస్సును ఉంచకుము. వీటియందు మనస్సు నుంచుటచేత రాగద్వేషములును, హర్ష శోకములును కలుగును. నీ వారు జయించినప్పుడు, నీ శత్రువు ఓడినప్పుడు నీకు హర్షము కలుగును. శత్రువుచేత నీకుగాని నీ వారికిగాని అపజయము కలిగినప్పుడు శోకము కలుగును. అట్లే నీకు సహాయము చేసిన వారియందు రాగమును ప్రతిపక్షులయందు ద్వేషమును కలుగును. ఇట్టివి కలుగనీయక కేవలము స్వధర్మమును నిర్వహించుట నీ బాధ్యత, కర్తవ్యము అని తెలిసికొని, ధర్మము కొరకే

యుద్ధము చేయుము. ప్రస్తుతము యుద్ధము నీకు స్వధర్మము. కనుక యుద్ధముకొరకే యుద్ధము చేయుము - అనగా స్వధర్మముకొంకే యుద్ధము చేయుము. ఇట్లు యుద్ధము చేసినయెడల నీకు పాపము ఎంతమాత్రమును అంటదు."

ఇక్కడ కృష్ణపరమాత్మ, మొదటి అధ్యాయములో ముప్పది ఆరవ, ముప్పది తొమ్మిదవ, నలుబది అయిదవ శ్లోకములలో అర్జునునిచేత చెప్పబడిన దానికి సమాధానము చెప్పుచున్నాడు. 'స్వజనులను చంపుటచేత పాపమే కలుగును. కనుక యుద్ధము చేయను' అనినాడు అర్జునుడు. 'కాదు. స్వధర్మము కనుక యుద్ధము చేసియే తీరవలయును. కాని ఆ యుద్ధమే సమత్వయోగముతో చేసినయెడల, నీవు తలచినట్లు పాపము ఎంత మాత్రమును అంటదు' అని కృష్ణపరమాత్మ వివరించినాడు.

అవతారిక :—

ఇంతవరకును సాంఖ్య యోగము ప్రకారము - అనగా ఆత్మానాత్మ వివేకమును తెలిపి, ఆ జ్ఞానము ప్రకారమును, క్షాత్ర ధర్మము ప్రకారమునుకూడ యుద్ధము చేయుటయే కర్తవ్యము అనినిరూపించి 'సమత్వముతో యుద్ధముచేయుము' అని అర్జునునకు ఆజ్ఞాపించినాడు. ఇప్పుడు కర్మయోగ సిద్ధాం

తము ప్రకారముగూడ యుద్ధము చేయుటయే ఉచితము అని నిరూపించుటకు కర్మయోగమునుగూర్చి చెప్పబోవుచున్నాడు-

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే
బుద్ధిర్యోగే త్విమాం శృణు !
బుద్ధ్యా యుక్తో యయా పార్థ !
కర్మబంధం ప్రహాస్యసి ॥ 39

ప. వి :— ఏషా, తే, అభిహితా, సాంఖ్యే, బుద్ధిః, యోగే తు, ఇమాం, శృణు, బుద్ధ్యా, యుక్తః, యయా, పార్థ, కర్మ బంధం, ప్రహాస్యసి.

టీక :—

హే పార్థ ! = ఓ అర్జునా !
సాంఖ్యే = జీవాత్మ పరమాత్మ తత్త్వవిచారణ విషయమైన,
ఏషా బుద్ధిః = ఇంతవరకును చెప్పబడిన వివేకము,
తే = నీ కొరకు,
అభిహితా = చెప్పబడినది,
యయా బుద్ధ్యా = ఎట్టి వివేకముతో,
యుక్తః = కూడినవాడవై,
కర్మబంధం = కర్మచే గలుగు బంధమును,
ప్రహాస్యసి = విడిచిపెట్టెదవో,

(తాం = అట్టి),
యోగే తు = (ఆత్మజ్ఞానమునకు కారణమైన)
కర్మయోగ విషయమై,
ఇమాం = ఇక చెప్పబోవు బుద్ధిని,
శృణు = వినుము.

తా. అర్జునా ! ఇంతవరకును సాంఖ్యమతానుసారమైన బుద్ధి చెప్పబడినది. ఇప్పుడు ఏ బుద్ధితో కూడియున్నయెడల, నీవు కర్మబంధము లను వదలించుకొనగలుగుదువో, అట్టి కర్మయోగమందలి బుద్ధిని చెప్పెదను వినుము.

అమృతవాహిని :-

ఈ శ్లోకము వ్యాఖ్యానించుచు లోకమాన్య తిలక్ తన గీతారహస్యములో 'సాంఖ్య మతానుసారముగ అనగా సన్న్యాస నిష్ఠానుసారముగ నీకీ బుద్ధి అనగా జ్ఞానము, లేక యుపపత్తి చెప్పబడినది' అని వ్రాసినారు. అనగా దీని పూర్వ శ్లోకములో చెప్పబడినది సన్న్యాసమార్గానుసారముగనని ఆయన అభిప్రాయ పడినారు. అయితే సన్న్యాస మార్గాను సారముగకూడ యుద్ధము చేయవలయునని కృష్ణపరమాత్మ అభిప్రాయమైనట్లు ఆయన నిర్ణయము. ఇట్లైనను అట్లైనను కర్మ చేయవలసి యున్న యెడల, ఒకదానికంటె ఇంకొక దానిలో సులభత్వ మేమున్నది ? యుద్ధము చేయుటను సన్న్యాస మార్గానుసారముగ సమర్థించి చెప్పితినని అనినప్పుడు, సన్న్యా

నేముకూడ కర్మల నొప్పుకొనినట్లు కృష్ణపరమాత్మ చెప్పినాడు కదా! ఇప్పుడీ యుద్ధము చేయుటయా చేయక పోవుటయా అని అర్జునుని సందిగ్ధావస్థ. అంతియేకాని తిలక్ మహాశయులు అభిప్రాయపడినట్లు అర్జునుడు "నేను చతుర్థాశ్రమమైన సన్న్యసమును తీసికొందును, యుద్ధము చేయను" అని అనలేదు. "యుద్ధము చేయను. యుద్ధము చేయుటకంటె భిక్షాన్నముతిని జీవించుట ఉత్తమము" అనినమాట నిజమే; కాని ఇది చతుర్థాశ్రమమైన సన్న్యసమును ఉద్దేశించి అనినదికాదు. కృష్ణపరమాత్మకూడ "అర్జునుడు చతుర్థాశ్రమమైన సన్న్యసమునకు సిద్ధపడుచున్నాడు" అని అనుకొనలేదు. అర్జునుడు చెప్పిన ఆచరణములో కొంచెముగా పోలిక ఉండుటచేత, సన్న్యసము తీసికొనబోవుచున్నాడేమో' అని మీరు అభిప్రాయ పడినారు కాని, ఆ అభిప్రాయము అర్జునునకు ఉన్నట్లు కృష్ణ పరమాత్మ పొరపాటుపడలేదు.

ఒక ఉదాహరణము: జాతీయపక్షములో రెండు చీలికలు కలవనుకొనుడు. ఆ చీలికల వారికి ఏదో ఒకచోట అభి ప్రాయభేదము వచ్చినది. కాని రెండుపక్షములును దేశ విముక్తికొంకే, నిస్వార్థముగా సేవచేయునవే. ఒక వ్యక్తికి "రాట్నము వడుకుటా వడుకకపోవుటా" అని సందేహము కలిగి, చివరకు రాట్నము వడుకుట మంచిదికాదు అని నిర్ణ యమునకు వచ్చినప్పుడు, రాజకీయ విషయయలు బాగుగా

తెలిసిన ఒక వ్యక్తి రాట్నము వడుకుటయే ముఖ్యము. వదలి పెట్టరాదు అని నిర్ణయించి చెప్పుటకు ముందు ఒక పక్ష సిద్ధాంతము ప్రకారము రాట్నము వడుకుటయే ముఖ్యము అని సమర్థించి, ఇప్పుడు రెండవ పక్ష సిద్ధాంతము ప్రకారము గూడ రాట్నము వడుకుటయే ముఖ్యమని సమర్థించి చెప్పెదను వినుము - నీ సందేహానివృత్తి అగును అని చెప్పిన యెడల రాట్నము వడుకు విషయములో రెండు పక్షముల సిద్ధాంతమును ఒక్కటే యని నిర్ణయము కాదా! అట్లే యుద్ధము చేయుటయే కర్తవ్యము అని సాంఖ్య మార్గాను సారముగ సమర్థించినాడు కృష్ణపరమాత్మ. ఇప్పుడు యోగానుసారము సమర్థించ బోవుచున్నాడు. సాంఖ్యము అనగా సన్న్యాసము' అని తిలక్ అర్థము తీసినారు. తర్క-వాదము అని గాంధీజీ అర్థము తీసినారు.

అసలు ఇంతవరకు కృష్ణపరమాత్మ సన్న్యాసమును గురించి ఎత్తుకొననేలేదు, ఆత్మ, దేహము వీటినిగురించి విచారణచేసి, ఆత్మ ఎప్పటికిని ఎట్లును, ఎవరిచేతను చంపబడదు, నశించునదికాదు, నిత్యమైనది, స్థిరమైనది, సనాతనమైనది, అవ్యక్తము, అవికార్యము ఈ మొదలగు లక్షణములుకలది అనియును, దేహము నశించునది, అనిత్యము, వికార్యము, వ్యక్తము, జడము, ఎప్పుడో ఒకప్పుడు, ఏదో రూపమున నశించిపోవునదియే అనియును నిర్ణయము చెప్పి, ఈ కారణమున

ఈ రాజులందరినిగూర్చి దుఃఖించనవసరములేదు. కనుక నీవు ధర్మసిద్ధమై ఏర్పడిన యుద్ధమును చేయుటలో ఏమియును భయపడవలసిన అవసరము ఎంత మాత్రమునులేదు అని చెప్పినాడు.

ఈ ఆత్మానాత్మ విచారణ సర్వులకును అవసరమే. కనుక ఈ విచారణ పద్ధతి ప్రకారము చూచినను, యుద్ధము చేయుటయే ధర్మమనిచెప్పి, ఇప్పుడు ఇంకొక విధముగాకూడ సమర్థించ బోవుచున్నాడు. అంతియేకాని, ఇక్కడ సన్న్యాసమునుగూర్చి ఎత్తుకొనవలసిన పనిలేదు; ఎత్తికొననులేదు.

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి
ప్రత్యవాయో నవిద్యతే।
స్వల్పమ ప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్॥ ౪౦

ప. వి :—న ఇహ, అభిక్రమనాశః, అస్తి, ప్రత్యవాయః, న. విద్యతే, స్వల్పం, అపి, అస్య, ధర్మస్య, త్రాయతే, మహతః, భయాత్.

టీక :—

ఇహ = ఫలాపేక్షలేక, ఈశ్వరార్పణముగ జేయబడు ఈ కర్మ యోగమునందు,

అభిక్రమనాశః = ప్రారంభించుట వ్యర్థము,

న అస్తి = కానేరదు,

ప్రత్యవాయః = ఒకప్పుడు మధ్యమధ్య స్వల్ప లోపములున్నను వానివలన దోషము,

న విద్యతే = లేదు.

అస్య, ధర్మస్య = ఈ నిష్కామకర్మమైన ధర్మము యొక్క,

స్వల్పమపి = లేశమైనను,

మహతః = మిగుల గొప్పదియగు,

భయాత్ = జననమరణ ప్రవాహరూపమైన సంసార భయమునుండి,

త్రాయతే = సంరక్షించును.

తా. ఈ ధర్మముయొక్క ఆరంభము నశించదు. ప్రత్యవాయ దోషములేదు. ఈ ధర్మము ఏ కొంచెమైనను కూడ మహాభయమునుండి రక్షించును.

అ మృ త వా హి ని :–

"అర్జునా ! ఈ ధర్మముయొక్క ప్రభావమెటువంటిదో వినుము. దీనిని ప్రారంభించి పూర్తిచేయక ముందే ఆగిపోయినను ఇది సంస్కారరూపమున వెంటబడి మరు జన్మముల యందైనను బలాత్కారముగ మరల ఈ ధర్మము వైపునకే ప్రవృత్తి కలుగజేయును. మానవునకు ఇష్టములేనిది సంస్కారములు బలాత్కారముగ చేయించ

గలవా అని అనుకొనవద్దు. ప్రతిమానవుడును సంస్కారము లకువశుడై మాత్రమే కర్మలను చేయుచున్నాడు. చూడుము - కొంతమంది మానవులు ధర్మము నెరుగుదురు. అధర్మము వదలవలయునన్నియును, ధర్మము నాచరించ వలయుననియును కూడ వారికి అభిప్రాయముండును. కాని అధర్మమునువదల లేరు. ఎందువలన ? వారి పూర్వజన్మల సంస్కారములు బలముగ లాగుటవలన వాటికి లోబడి, ఆ సంస్కారముల కనుగుణమైన కర్మలనే చేయుచున్నారు. మరల ఆ సంస్కారముల కే బలముకాగా, మాటిమాటికి ఆ సంస్కారములచేత ఈడ్వబడి సంసార సముద్రములో పడిపోవుచున్నారు. కనుక సంస్కార ములకు అంత బలమున్నది. కాని అర్జునా ! నీవు భయపడ వలసిన పని లేదు. నీవు పార్థుడవు, మహాబాహుడవు, పరంతపుడవు - నిన్ను సంస్కారము లేమిచేయగలవు ? కనుక పాపసంస్కారములవలన భయపడవలసిన పనినీకు లేదు.

అయితే "పాపసంస్కారములు నన్నేట్లు ఏమియును చేయజాలవో, అట్లే మంచి సంస్కారములుకూడ ఏమియును చేయజాలవేమో, అట్టియెడల ఈ ధర్మముయొక్క సంస్కా రములు మాత్రము నాకు ఏమి ఉపయోగపడగలవు" అని తలంచబోకుము. నిజమే ఈ సంస్కారములుకూడ నిన్ను ఆకర్షింపలేవు. కాని నీకు బాగుగ ఉపయోగించును. ఒక ఉదాహారణము చూడుము.

సామాన్యనావికుడు ఒకనదిలో పడవను నడుపు చున్నాడు. అప్పుడు గాలివాటము పడవకు ప్రతికూలముగ నున్న యెడల నావికున కిష్టమున్నను లేకపోయినను, ఆ పడవ ఆ గాలివాటమునకే పోవును. అతడు ఏమియును చేయలేడు. కనుక గాలి ఎటున్న అటువైపునకే అతడు పడవను నడుపు కొనును గాని, తన ఇచ్ఛానుసారము నడుపలేడు. గాలికి అంతటి బలముగలదు. కాని, మంచిసామర్థ్యముగల నావికుడై నచో గాలి వ్యతిరేకముగనున్నను, కొంచెము కష్టమేగాని, ఎటులనో బాధలుపడి, తన ఇష్టమువచ్చినవైపునకే పడవను నడిపించుకొని వెళ్ళుచున్నాడు. అప్పుడాతడు గాలిని జయించి నట్లే. గాలి అతనిని ఏమియును చేయలేకపోయినది. అతనిని గాలి ఏమియును చేయజాలకపోయినది గనుక అతడు వెళ్ళు వైపునకే ఆ గాలివాటముకూడ ఉన్నచో అది అతనికి ఉప యోగపడదని అభిప్రాయమా ? అతని సామర్థ్యమునకు తోడు, గాలికూడ అనుకూలముగనున్న యెడల, ఆ పడవను నడుపుట మరింత సులభమై యుండునుకదా ! అట్లే, ఈ సంస్కారములు కూడ ప్రతికూలములైన వైనను, నీవు సమర్థుడవుగనుక, నిన్నేమియును చేయలేవు. సంస్కారములు ప్రతికూలముగ నున్నపుడే, నీ జీవితనౌకను నీ కనుకూలముగ నడుపుకొనగల సామర్థ్యము నీకున్నపుడు, ఇక సంస్కారములుకూడ నీ కను కూలముగ నున్న యెడల చెప్పవలసినదేమున్నది ! "ఉప్పు లేకనే ముప్పందుముతిను వారా ఆయన ఉప్పున్న యెడల ఎంత

తినునా" అన్నదట ఒక ఆమె. కనుక అర్జునా! భయపడ కుము. ఈ ధర్మము ప్రారంభించబడి పూర్తి కాకపోయినను నశించదు. క్షేత్రములో బీజములు నాటినతర్వాత, తాను మరల ఆ విషయము వదలుటచేతగాని, అనావృష్టిచేతగాని, అతివృష్టిచేతగాని, మరి ఏ ఇతర కారణములచేతగాని ఆ బీజములు పుచ్చిపోయి ప్రయోజనపడక పోవచ్చును. ఈ ధర్మము అట్టిదికాదు. దేనిచేతను ఇది చెడదు. సంస్కార రూపమున మరుజన్మకైనను ఉపయోగపడును.

ఇంతియేకాదు. ఈ ధర్మము మధ్యలో వదలిపెట్టబడి నను దోషములేదు. ఎంతవరకు తినిన అంతవరకే కడుపునిండి నట్లు, ఎంతవరకు చేసిన అంతవరకును ఫలమిచ్చును. సంస్కార రూపమున వెంటబడును. పూర్తిచేయకపోవుటచేత, కామ్యకర్మలలోవలె ప్రత్యవాయము (దోషము : అనగా విపరీతపరిణామము) లేదు.

ఈ ధర్మము కొంచెమే చేసినను సంస్కారరూపముగ వెంటబడి సంసారసముద్రమునుండి గట్టున పడువరకును ముందునకే నెట్టుచుండునుగాని వదలదు. కనుక మహా భయమునుండి రక్షించును అంటిని. యథార్థము తెలిసిన వానికి సంసారపతనముకంటె భయమేమున్నది? అంతటి ఆ భయమునుండి రక్షించును.

తాడిచెట్టు ఎక్కువానిని, ఎంతవరకు క్రిందినుండి పట్టుకొని పైకి త్రోయగలము అని ఒక సామాన్యమైన సామెతకలదు. సంస్కారములు అట్లుకాదు. తాడిచెట్టు మొవ్వకు పోవువరకును ఆధారముగ క్రిందినుండి పైకి నెట్టుచునే యుండును, కనుక మహాభయమునుండి రక్షించగలదు అని చెప్పితిని" అని కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు.

ప్రత్యవాయము అనగా అదిసరిగా పూర్తిచేయక పోవుట వలన కలిగెడి అనర్థము. అది ఈ నిష్కామ కర్మయోగము నకులేదు. కామ్యకర్మలైన యజ్ఞములు మొదలైన వానికి కలదు.

ఒకడు ఇంద్రాది దేవతలను గూర్చి యజ్ఞ చేయుచు, అది సరిగా పూర్తిచేయలేనియెడల అపారమైన ప్రత్యవాయమున్నది. కాని, దీనిలో కోరిక లేకపోవుటచే ఆ ప్రత్యవాయము లేదు.

ఉదాహరణము : ఒక మహాత్ముడు ప్రయాణము చేయుచు బండికొరకు వేచి కూర్చుండి యుండును. ఇంకొక ప్రయాణీకుడు మంచిభావములు గలవాడగుటచే, మహాత్ములయందు భక్తిశ్రద్ధలు కలవాడగుటచే, తాపముగ నున్నదే యని వీవనతో ఆ మహాత్మునకు విసురుట మొదలు పెట్టును. అయితే ఈ మహాత్ముడు అచ్చట నున్నంతసేపును, ఆ ప్రయాణీకు డచ్చటనుండు నవకాశము లేదు. కనుక అతనికి

ఎంతసేపు అవకాశముండునో అంతసేపే ఆ సేవచేసి వెడలి పోవును. కాని ఆ సేవకు తగినంత ఫలము అతనికి చెందియే తీరును. చివరవరకు సేవనతో విసరలేదేమి అని ఈ మహాత్మునకు కోపమురాదు. చేసినంతవరకు ఫలము పరమార్థముగా వచ్చితీరును. ఇదియే ఒక ఉద్యోగి తనకు పంకా లాగు వానిని జీతము మీదకుదుర్చుకొనినప్పుడు, వాడు చివరి వరకు పంకాలాగక పోయినచో వానికి చీవాట్లు తప్పవు, జీతములో విరుగకోత తప్పదు. మరల మరల అట్లే చేసినచో ఉద్యోగములోనుండి వెడలగొట్టబడుటయు తప్పదు. అట్లే ఇక్కడను, నిష్కామముగ చేయు ధర్మమునకు ఇట్టి ప్రత్యవాయము లేదు.

పూర్తికాకముందు ఆగిపోవుట యనగా, శరీరపతన కారణముచేత ఆగిపోవుటయా, మధ్యలో ఏవైన విఘ్నములువచ్చి ఆగిపోవుటయా ? - ఎటులైనను బాధలేదు. శరీర పతనముచేత మధ్యలో ఆగిపోయినను, మనచేత జయించబడని విఘ్నములు కలిగి ఆగిపోయినను ప్రత్యవాయము లేదు. మహాత్మునికి సేవనతో విసరినవాడు వెళ్ళక తప్పనిసరియై వెడలి పోయినను, అయ్యో మహాత్మునికి విసరుట పడలేదే అన్న నిర్వేదముతోడనే వెళ్ళును. లేదా, వెళ్ళకపోయినను ఏదో ఇంకొక కారణముచేత ఎంత ప్రయత్నించినను విసరుటకు వీలులేకపోయినప్పుడుకూడ నిర్వేదముతోడనే ఆగిపోవును.

అప్పుడు కూడ ఫలితమునకు ఏమియును నష్టము లేదు. ఇంతియే కాదు; వానికే, కొంచెము సేపు విసరుదమని బుద్ధిపుట్టి, కొంచెము సేపు విసరి ఊరకొనినను, అప్పుడుకూడ ప్రత్యవాయము లేదు. దానికి తగినంత ఫలితమే వచ్చును. ఎందుకు ఊరకొంటివి అని ఎవరును దండించువారుండరు. ఇది నిష్కామధర్మాచరణములో ఉండు విశేషము.

ఇక్కడ కర్మయోగమనగా - కర్మయోగములోనికర్మ-శాస్త్రవిహితమైన ఉత్తమకర్మ. సమత్వమునకు యోగమని పేరు. 'సమత్వం యోగఉచ్యతే' అని. కనుక మమకారము, ఆసక్తి, కామక్రోధములు, లోభమోహములు మొదలైనవి ఎంతమాత్రమును లేక, నెరవేరినను నెరవేరకపోయినను సమముగ నెంచుచు, తన వర్ణమునకును ఆశ్రమమునకును, స్వభావమునకును, పరిస్థితికిని తగినట్టి శాస్త్రవిహితమైన కర్తవ్యకర్మలను ఆచరించుటయే కర్మయోగమనగా.

ఈ కర్మయోగమునే కృష్ణపరమాత్మ గీతలో అక్కడక్కడ సమత్వయోగమని, బుద్ధియోగమని, తదర్థకర్మ మని, మదర్థకర్మయని, మత్కర్మయని, చెప్పియున్నాడు.

నిష్కామకర్మయోగము పూర్తియగుట యనగా, బాహ్యమైనకర్మయని కాదు అర్థము. అంతఃకరణములో నిష్కామత, భక్తి, సమత్వము ఈ భావము పరిపక్వము

కావలయును. అట్లుకాకుండ, కర్మ పూర్తిచేసినను పూర్తి కానట్లే. అప్పుడు ఈ సంస్కారముల బలముచేత మరుజన్మలలో పూర్తి చేసికొని క్రమముగ ముక్తినిపొందగలడు. కాబట్టి పూర్తికాకపోవుటచేత నశించుటలేదు. ఎట్టి కామమును లేకపోవుటచేత ఇంకొకఫలము ఏదియును రాదు. కనుక ముక్తిపొందువరకును వదలిపెట్టడు అని భావము. మరణ సమయములోపల నిష్కామత' సిద్ధించినది; మొదలుపెట్టిన బాహ్యరూపమైనకర్మ, కొన్ని బలవత్తరములైన విఘ్నములచేత మధ్యలో పూర్తికాక ఆగిపోయినది; కాని, వానికి ఈ జన్మతో ముక్తితప్పదు. కనుక ఇక్కడ కర్మయోగములో నిష్కామతకే ప్రాధాన్యము. ఫలము దానివలననే. కనుకనే పరమాత్మను "భావగ్రాహీ జనార్దనః" అందురు.

అ వ తా రి క :—

ఇప్పుడు నిష్కామకర్మయోగమునకు కావలసినది బుద్ధి కనుక ఆ బుద్ధి రెండురకములని చెప్పి, ఆ రెండురకముల బుద్ధులభేదమును చెప్పుచున్నాడు.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి
రేకేహ కురునందన !
బహుశాఖా హ్యనంతాశ్చ
బుద్ధయోఽవ్యవసాయినాం॥ ౪౧

ప. వి :— వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకా, ఇహ, కురునందన, బహుశాఖాః, అనంతాః, చ, హి, బుద్ధయః, అవ్యవసాయినామ్.

టీక :—

కురునందన = ఓ అర్జునా!
ఇహ = ఈ నిష్కామకర్మయోగమునందు,
వ్యవసాయాత్మికా = పరమాత్మ భక్తిచే సంసారమను సముద్రమును దాటుదుమను నిశ్చయమే స్వరూపముగాగల;
బుద్ధిః = బుద్ధి,
ఏకా = ఒకటె,
అవ్యవసాయినాం = భక్తిలేక, నిశ్చయబుద్ధి శూన్యులై కామ్యకర్మలు చేయువారియొక్క,
బుద్ధయః = బుద్ధులు,
బహుశాఖాః = అనేక విధములగు శాఖలు కలవిగాను,
అనంతాశ్చ = అంతులేనివిగాను ఉన్నవికదా!

తా. ఓ కురువంశ శ్రేష్ఠుడా! వ్యవసాయాత్మికమైన బుద్ధి ఏకముగ నుండును. అనగా ఒకే నిశ్చయముకలదిగ నుండును. కాని సాధనరహితుల బుద్ధి అనేకముగ నుండును. వాసనారూపమైన అనేక శాఖలు కలిగియుండును.

## అమృత వాహిని :-

అర్జునా! బుద్ధి రెండు రకములు. ఒకటి వ్యవసాయాత్మికమైనది. అనగా సాధనలతో ఆరితేరి, వాసనలన్నియు

కళింపినట్టిది, కాఁబట్టి, ఆబుద్ధి నిశ్చయాత్మకమైనదిగ ఉండును. ఒకే ముఖముగ ప్రవహించును. దానికి పరమాత్మ ఒక్కటే గమ్యస్థానము.

రెండవది వాసనాత్మికమైనది. అనగా సాధనలో అర్థి తేరక, అనేక వాసనలతో కూడుకొనినది. ఈ బుద్ధి బహు శాఖలుగ నుండును. ఏ ఒక్కదానిమీఁదను స్థిరముగ నిలువదు. అస్థిరమై, క్షణక్షణమునకును మారునట్టి ఆలోచనలు కలిగి యుండును. దానికి వివేకముండదు. ఎందువలన ననగా, బుద్ధి వాసనలతో కూడుకొని యున్నంతవరకును ఆ బుద్ధితో వాస నానుగుణమైన కల్పనాతరంగములు కుక్క గొడుగులవలె పుట్టుచు గిట్టుచు నుండును. ఆ తరంగముల ప్రవాహమునకు అంతుండదు. కనుక ఆ బుద్ధి నిశ్చలముగ స్థిరముగ ఎట్లుండ గలదు? ఇప్పుడు "ఐశ్వర్యము కావలయును, ఏ దేవతను పూజించుదము? ఏయే కర్మలు చేయుదము? లేనిచో ఏ వ్యవహారములు చేయుదము? ఇంకను ఏ వంకరత్రోవలు త్రొక్కుదము?" అని ఇట్లేవేవో ఆలోచించుచుండును. మరల ఇంకొక క్షణమునకు "పుత్త్రులులేరు; ఏ యజ్ఞము చేయు దము?" అనియును, మరియొక క్షణమునకే "స్వర్గసుఖమును కలిగించు యజ్ఞములు చేయవలయును" అనియును, ఇట్లు ఈ సంకల్ప వికల్పములకు అంతుండదు. దీనిలోచిక్కి మానవుఁడు, తుపానులోవలె ఉక్కిరిబిక్కిరి యగుచుండును. దీని

కంతటను కారణము వాసనాత్మికాబుద్ధి. ఇక ఇట్టివానికి బుద్ధి నిశ్చయముగ, ఏకముగ, స్థిరముగ ఎట్లుండును? కనుక బుద్ధిని వాసనారహితముగ, వ్యవసాయాత్మికముగ సిద్ధము చేసికొనవలయును. 'అవ్యవసాయికులు' - ఎవరి బుద్ధి అజ్ఞానజనితమైన విషమభావముచేత మూహ్యమైయున్నదో, ఎవరు ప్రాపంచిక తుచ్ఛభోగములనే పరమగమ్యములుగ తలంచి, నిత్యమును ప్రయత్నించుచుందురో, అట్టి వివేకరహితులైన వారల నుద్దేశించి కృష్ణపరమాత్మ 'అవ్యవసాయినాం' 'అవ్యవసాయికుల యొక్క' అని ప్రయోగించినాడు. వారి యొక్క బుద్ధి పైన చెప్పినట్లు అనేక శాఖలుగ నుండును. ఇట్టి వారికి క్షణక్షణమునకును అభిప్రాయములు మారుచుండును. రుచులు భేదించుచుండును. ఒకేపదార్థమును గురించి ఒక అంశమున ప్రీతి, మరొక అంశమున ద్వేషము; ఒకేపదార్థముపై ఒక కాలములో ప్రియము, మరొక కాలములో ద్వేషము - ఇట్లు ప్రతిక్షణము ప్రతివిషయమున విషమభావములు కలుగుచుండును. దీనికంతటను కారణము వాసనాత్మికాబుద్ధి.

అవతారిక:-

యోగికి కావలసిన వ్యవసాయాత్మికాబుద్ధిని గురించియు, వదలిపెట్ట వలసిన వాసనాత్మికాబుద్ధిని గురించియును చెప్పి, ఇప్పుడు వాసనాత్మికాబుద్ధిగల సకామమానవుల స్వభా

వమును, సిద్ధాంతమును, ఆచార వ్యవహారములను చెప్ప బోవుచున్నాడు.

శ్లో॥ యా మిమాం పుష్పితాం వాచం
ప్రవదం త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ !
నాన్య ద స్తీతి వాదినః ॥ ४२

శ్లో॥ కామాత్మాన స్స్వర్గపరా
జన్మకర్మ ఫలప్రదాం ।
క్రియా విశేష బహుళాం
భోగైశ్వర్యగతిం ప్రతి ॥ ४३

శ్లో॥ భోగైశ్వర్య ప్రస క్తానాం
తయాపహృత చేతసాం ।
వ్యవసాయాత్మికాబుద్ధి
స్సమాధౌ న విధీయతే ॥ ४४

ప. వి :— యాం, ఇమాం, పుష్పితాం, వాచం, ప్రవద న్తి, అవి పశ్చితః, వేదవాదరతాః, పార్థ, న, అన్యత్, అ స్తి, ఇతి, వాదినః. ४२

కామాత్మానః, స్వర్గపరాః, జన్మకర్మఫలప్రదాం, క్రియా విశేషబహుళాం, భోగైశ్వర్యగతిం, ప్రతి, ४३

భోగైశ్వర్య ప్రసక్తానాం, తయా, అపహృత చేతసాం,
వ్యవసాయాత్మికాబుద్ధిః, సమాధౌ, న, విధీయతే, ४४

టీక :—

హే పార్థ! = ఓ అర్జునా!
వేదవాదరతాః = వేదమునందు ఫలమును తెలిపెడి భాగములైన అర్థవాదములయందు ప్రీతికలవారును,
నాన్యత్ అస్తిఇతి వాదినః = కర్మ చేయుటకంటె వేరు పురుషార్థము లేదనువారును,
కామాత్మానః = దారేషణ, పుత్రేషణ, ధనేషణ యను ఈషణాత్రయముచే, కోరికలచే నిండిన మనస్సుగలవారును,
స్వర్గపరాః = స్వర్గమే అన్నిటిలో మేలైన పురుషార్థ మని ఎంచియుండువారును,
అవిపశ్చితః = అవివేకులు (తత్త్వము తెలియని అల్ప బుద్ధిగలవారును),
జన్మ కర్మ ఫలప్రదాం = జన్మమును, కర్మమును, కర్మ ఫలములను ఇచ్చునట్టిదియును,
భోగైశ్వర్యగతింప్రతి = భోగైశ్వర్యములను పొందుట కొరకు. క్రియావిశేషబహుళాం = అనేక కర్మభేదములు గలదియు,

పుష్పితాం = ఫలప్రదము కాని, కేవలము పుష్పములను పూచి పైకి మాత్రము సొంపుగ కనుపించునట్టి స్వర్గాదులనెడి అల్పసుఖముల నిచ్చునట్టిదియునగు,

ఇమాం = ఈ

యాం వాచం = ఏ మాటను (మోసబుచ్చునట్టి ఏ మాటలను)

ప్రవదన్తి = చెప్పుచున్నారో,

తయా = అట్టి వాక్యము చేత,

అపహృతచేతసాం = అపహరింపబడిన మనస్సుగలవారును,

భోగైశ్వర్యప్రసక్తానాం = సుఖానుభవమునందును, ఐశ్వర్యమునందును ఆశగలవారును అగువారలకు,

వ్యవసాయాత్మికాబుద్ధిః = నిశ్చయాత్మకమైనబుద్ధి,

సమాధౌ = చిత్తైకాగ్రతయందు,

న విధీయతే = కలుగనేరదు.

తా. అవివేకులు, వేదములయందు చెప్పబడిన ఫలశ్రుతి వాక్యములయందే ప్రీతిగలవారై, భోగములందే తన్మయులై యుందురు. వారికి స్వర్గమే పరమగమ్యము. దానికి మించినదిలేదు. ఈషణత్రయము నందు తగులుకొనినట్టివారు యథార్థతత్త్వమును తెలియలేక, జన్మపరంపరను కలుగజేయునట్టియును, భోగైశ్వర్యలాభములను కలిగించునట్టి

యును, అనేక కర్మకలాపములనే ప్రశంసించుచుందురు. ఎవరిచిత్తములు, పైకిమాత్రము సొంపుగ కనపడుచు, ఫలరహితములైన వాక్యములచే విమోహితములై యున్నవో, భోగైశ్వర్యాదులయందే ఆసక్తితో దూషితములై యున్నవో అట్టివారికి వ్యవసాయాత్మికాబుద్ధి ఎట్లు కలుగును ? వారి బుద్ధి ఎప్పుడునుచంచలముగనే యుండును.కాన పరమాత్మయందు నిలువదు.

**అ మృ త వా హి ని :—**

"పార్థా ! ఐహికాముష్మిక ఫలములను మాత్రమే అనేక విధములుగ వర్ణించెడి వేదములయొక్క ఫలశ్రుతివాక్యముల యందే శ్రద్ధావంతులైన అవివేకులు భోగాసక్తులు. భోగములనే సర్వకాల సర్వావస్థలయందును చింతించుకొనుచు, తన్మయులై, ఆ భోగములవెంట తమ మనుష్యత్వమును కూడ కోలుపోయి తిరుగు వారికి స్వర్గమే పరమగమ్యస్థానము. ఇక దానికి మించినదిలేదు. వారికి వేదములందు సంసారబంధము నుండి బయటపడుటకు ఉపదేశింపబడిన వాక్యములు, వైరాగ్య బోధకములైనవి, బ్రహ్మవిద్యాప్రతిపాదకములైనవి అగు భాగములు అక్కరలేదు; రుచించవు. వారికి అవి సారములేని మెట్ట వేదాంతవాక్యములు. కనుక, వారు ఇహ పరలోక భోగైశ్వర్యములను మాత్రమే కాంక్షించుచుందురు. వాని ననుభవించుటకై దేవమనుష్యాది జన్మలనెత్తుచు, స్వర్గమర్త్య లోకములమధ్య తిరుగుడులలో పెట్టబడుచుందురు. ఇట్టివారిని గురించియే గీతలో తొమ్మిదవ యధ్యాయమున ఇరువదవ, ఇరువది ఒకటవ శ్లోకములలో చెప్పబడియున్నది.

"త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివిదేవభోగాన్ ॥
"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామ కామా లభంతే ॥"

అనగా - త్రైవిద్యులు (ధర్మార్థ కామములనే కోరువారు) యజ్ఞములచేత నన్నుపూజించి, సోమపానము చేయుటచేత పాపములు పోగొట్టుకొని, స్వర్గప్రాప్తిని ప్రార్థించుచున్నారు. వారు వారి పుణ్యఫలమైన స్వర్గాది ఫలములను పొంది, అక్కడ దివ్యములగు దేవతా భోగముల ననుభవించుచున్నారు. చివరకు వారు విస్తారమైన ఆ స్వర్గములో భోగముల ననుభవించుటచేత పుణ్యము క్షయముకాగా, మరల మర్త్యలోకమున ప్రవేశించుచున్నారు. ధర్మార్థకామములనే పరమ ప్రాప్యములుగ దలంచు త్రైవిద్యులు స్వర్గమర్త్యలోకముల మధ్య నీ విధముగ రాకపోకలు పొందుచున్నారు - అనగా సంసారచక్రమున పరిభ్రమించుచున్నారని భావము.

వారికి నిత్యానిత్య వస్తువివేకము లేదు. కనుక యథార్థమైన తమ కర్తవ్యమును తెలిసికొనలేనివారై వేదములలో

నున్న కామ్యభాగములను మాత్రమే తీసికొని, ఆ ఫలశ్రుతి వాక్యములనే ఇతరులకును చక్కగ ప్రచారము చేయుదురు. వారి మాటలు ఫలరహితములై నట్టియును, కేవలము కంఠ్లక్తింపుగమాత్ర ముండునట్టియును విషలతలవంటివి. ఆ వాక్యములు ఎంతయో ఆకర్షణీయముగా నుండి, చెప్పువారియొక్కయు, వినువారియొక్కయు మనస్సులను హరించుచుండును. సామాన్యమానవులయొక్క మనస్సులు, సహజముగనే విషయోపభోగములవైపు పరుగులిడు స్వభావము గలిగియుండును. ఇక వేదవాక్యముల ద్వారా, తియ్యని మాటలతో, ఆ భోగైశ్వర్యములనే వర్ణించి చెప్పుచున్న యెడల, మనస్సులు అటువైపు లాగబడక ఎట్లుండగలవు ? కనుక అట్టి సంభాషణములు సుందరమైన పుష్పములుగల విషలతలవంటివి అనబడినది. చూచుట కెంతయో ఇంపుగ నుండుటచే ఆ పుష్పముల దరికిబోయి, ఒక్క పువ్వును వాసన జూచిన చాలును - ఇక విషము తలకెక్కి స్పృహతప్పును.

అట్లే ఈ వాక్యము లెంతయో రమణీయముగ తోచుచు, స్వర్గాది ఫలములయందు కాంక్షను వృద్ధిపరచి, పరమాత్మప్రాప్తినుండి వంచించి, ఆ భోగానుభవరూపమగు మత్తులోనే పడవేసియుంచును. కనుక వారిబుద్ధి అతిచంచలముగనుండును. లేనిది కావలయుననియును, ఉన్నదిచాలదనియును, పోయినదానిని తిరిగి సంపాదించవలయుననియును, ఉన్నదానిని రక్షించుకొనవలయుననియును తలంచుచు, పోయిన

దానినిగూర్చి విచారించుటలోను, ఉన్నది పోవునేమోయని భయపడుటలోను, అందరికంటె తానే అధికుడుగ నుంటిననని విఱ్ఱవీగుటలోను, తనకంటె ఇతరుడు అధికుడుగ నున్నాడేయని అసూయతో క్రుగ్గుటలోను తపించిపోవుచు, వారిబుద్ధి గచ్చు మీద ఒలికిన పాదరసమువలె, అటునిటు పరుగులెత్తుచుండును.

కొలనునిండ నీరున్నది, ఒక తామరాకున్నది, ఆ యాకు మీద ఒక నీటిబిందువున్నది, బాగుగ గాలివీచుచున్నది, నీరు విస్తారముగ కదలుచున్నది - అప్పుడు ఆ ఆకుమీది నీటిబిందు వెట్లు చలించుచుండునో, వారి బుద్ధు లట్లు చలించుచుండును. ఇట్టివారికి వ్యవసాయాత్మికాబుద్ధి ఎట్లు లభ్యపడును ? లభ్య పడదు. వారి చంచలబుద్ధి పరమాత్మయందు స్థిరముగ నిలువదు.

అ వ తా రి క :_

అయిన యెడల పరమపురుషార్థముకాని స్వర్గాదులను గుఱించిన కర్మకలాపములు వేదములయందు ఎందుకు ప్రతి పాదింప బడవలయును అను ప్రశ్నకు ఈ శ్లోకములో సమాధానము చెప్పబడినది -

శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా
నిస్త్రైగుణ్యో భవార్జున ! ।
నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ ౪౫

ప. వి :—త్రైగుణ్య విషయాః, వేదాః, నిస్త్రైగుణ్యః, భవ, అర్జున, నిర్ద్వన్ద్వః, నిత్యసత్త్వస్థః, నిర్యోగక్షేమః, ఆత్మవాన్,

టీక :—

అర్జున ! = ఓ అర్జునా !
వేదాః = శ్రుతులు,
త్రైగుణ్య విషయాః = సత్త్వరజస్తమోగుణముల వలన కలిగిన సంసార స్వరూపమును తెలియజేయునవిగా నున్నవి.
త్వం = నీవు,
నిస్త్రైగుణ్యః = త్రిగుణములవలన కలుగు విషయాభిలాషను వదలినవాడవుగను,
నిర్ద్వన్ద్వః = శీతోష్ణములు, సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు లోనగు ద్వంద్వములతో సంపర్కము లేనివాడవుగను,
నిత్యసత్త్వస్థః = ఆ పరబ్రహ్మ వస్తువునే ఆశ్రయించినవాడవుగను,
నిర్యోగక్షేమః=నీయొక్క యోగక్షేమములను గూర్చిన కర్తృత్వభావమును వదలి పెట్టినవాడవును,
ఆత్మవాన్ = మనస్సును స్వాధీనమందుంచుకొనినవాడవును,
భవ = అగుము,

తా, అర్జునా ! వేదములు త్రైగుణ్యములు - సత్త్వరజస్తమో గుణములకు సంబంధించినవి. నీవు గుణాతీతుడవును, ద్వంద్వములు లేని వాడవును, నిత్యమైన పరమాత్మయందే నిలచిన వాడవును కమ్ము ! యోగక్షేమములయందు కర్తృత్వభావమును వదలిపెట్టుము. మనస్సును బాగుగ స్వాధీనములో నుంచుకొనుము.

## అ మృ త వా హి ని :-

అర్జునా ! వేదములు త్రైగుణ్య విషయములుసుమా ! మానవులలోని సాత్త్విక రాజసిక తామసిక వర్గములవారి నందరిని ఉద్ధరించుటకు ఏర్పడినవి. తామస ప్రజలకు ఆ భాగములలో చెప్పబడిన విషయములు చిత్తమునకు బాగుగ నాటును. రాజసప్రజలకు ఆ రాజసభాగములలోని విషయములు చిత్తమును బాగుగ ఆకర్షించును. సాత్త్వికులకు ఆ సాత్త్విక భాగములలోని విషయములు ఆనంద జనకములుగనుండును. నీవు గుణాతీతుడవుకమ్ము. ద్వంద్వములను లక్ష్యపెట్టనివాడవు కమ్ము. అప్పుడు నీవు నిత్యమైన పరమాత్మయందే స్థిరముగ నిలచి యుండగలవు. ఇక నీ మనస్సును ఎటు పోమ్మనినను పోదు.

సామాన్య ప్రజానీకము సాంసారిక భోగములనే కాంక్షించుచుందురు. వానికిగూడ ఒక మార్గమును ఉపదేశించని యెడల, వారు అశాస్త్రీయమార్గమునబడి, కేవలము స్వేచ్ఛాచారులై, మృగములవలె తినుటకువిషయము లనుభవించుటకు

మాత్రమేపుట్టితిమని భావించి, అధోగతిపాలగుదురని వేదము దయతో అన్ని విషయములను బోధించినది. వేదము భోగములను, విషయకాంక్షలను త్యజించలేని వారికి, అనుభవించుము, కాని క్రమబద్ధముగ అనుభవించుము అని చెప్పాను. వీరిలో తామసప్రజలకు ఆ తరగతికి తగిన ధర్మములు బోధించినది. ఆ భాగము తామసభాగము. అవి వారు సక్రమముగ ఆచరించి, పై తరగతిలోనికి అనగా రాజసపు తరగతిలోనికి వచ్చెదరు. వారికిని అట్లే వారికి తగిన ధర్మములను బోధించినది. వానిని వారు సక్రమముగ, ఆచరించి పై తరగతికి - అనగా సాత్త్వికపు తరగతికి వచ్చెదరు. వారికిని అట్లే వారికి తగిన ధర్మములను బోధించినది. ఆ భాగము సాత్త్వికభాగము. అది వారు సక్రమముగ ఆచరించి పై తరగతికి అనగా గుణాతీత స్థితికి వచ్చెదరు. ఇది యథార్థమైన సిద్ధావస్థ. ఇక వీరికి వేదము ఏదియును బోధించదు. వీరికి విధి నిషేధములు లేవు. సిద్ధావస్థ యనగా పరిపూర్ణ మానవత్వము.

ఇన్ని రకములుగ ధర్మమును బోధించునది యగుటచే వేదము త్రైగుణ్యము. అంగడికి పోయినవాడు తనకు కావలసినవి మాత్రమే తీసికొనునట్లు, వేదములో వారి వారి తరగతికి తగినవి మాత్రమే స్వీకరించవలయును. కాని వేదములో చెప్పబడినవిగదా యని, ప్రతి విషయమును తనకు ఆచరణయోగ్యముగ తీసికొనరాదు. కనుక "అర్జునా! గుణాతీతుడవు కమ్ము" అని హెచ్చరించుచున్నాడు. అనగా ఇప్పుడే నీవు

గుణాతీతుడవై, ఈ ధర్మములనన్నిటిని వదలిబెట్టుమని అభి ప్రాయముకాదు. నీకు తగిన కర్మముల నాచరించి, దాని ఫల ముగగుణాతీత స్థితికి రావలసినది అని అభిప్రాయము.

ఇటువంటి ఘట్టములలోనే అర్జునుడు భ్రమచెంది, మూడవ అధ్యాయము మొదట "నన్ను కలగలుపు మాటలతో భ్రమ పెట్టుచున్నట్లున్నావు. నీకు ఈ స్థితియే గొప్పదని తోచినచో, ఈ ఘోరమైన కర్మలో నన్నెందులకు ప్రవేశపెట్టుచున్నావు?" అని ప్రశ్న వేసినాడు. అది ఉత్తమ స్థితియనుట యథార్థమే. ఆ స్థితికి అర్జునుడు వచ్చుటకు విధానమును చెప్పుట ఆయన ఉద్దేశ్యము. ఇప్పుడే, వెంటనే, అన్నిటిని వదలిబెట్టి, ఊరకే కూర్చొనుటే గుణాతీతస్థితి అని కృష్ణపరమాత్మ చెప్పు చున్నట్లు భ్రాంబడినాడు అర్జునుడు.

గుణాతీతుడు కూడ కర్మ చేయును. కర్మ చేయకుండ నుండుట గుణాతీతస్థితికాదు. అయితే, గుణాతీతునితో - నీవు కూడ కర్మ చేయవలయును అని శాస్త్రము చెప్పదు. ఎందు కనగా, వానిలో పరమాత్మయొక్క సర్వజ్ఞత్వము ప్రకాశించు చుండును. అట్టి మహాత్ముడు కనుక ఇంకొకరిచేత చెప్పించు కొనెడి స్థితిలోనుండడు. శాస్త్రము వారికి విధినిషేధములు చెప్పదు. తెలియని వారికి చెప్పవలయును. కనుక క్రింది వారికి చెప్పును. కాక, గుణాతీతస్థితికి రాక, నేను గుణాతీతు

డను అనుకొని భ్రాంతిపడు వానిని 'మిథ్యాచారుడు' అని చెప్పినది. అట్టివానికి మాత్రమే 'ఓరీ! నీవు గుణాతీతుడ ననుకొనినను కర్మలు చేయవలసినదే' అని చెప్పాను.

"నిత్య సత్త్వస్థః" : 'నిత్య సత్త్వము పరబ్రహ్మ వస్తువు, ఆ సచ్చిదానంద ఘనస్వరూపుడైన కళ్యాణగుణ సింధువునందే నీ చిత్తమును సదా యుంచి, తచ్చింతన, తత్స్మరణ, తత్కీర్తనాదులయందే స్థిరముగ నుండుము' అని అమృతవాహిని భావము.

ఈ శ్లోకములో పొందవలసిన గమ్యస్థానమును,ఆగమ్య స్థానమును పొందుటకు ఉపాయమును రెండును చెప్పబడినవి. పొందవలసిన గమ్యస్థానము గుణాతీతస్థితి. పొందుటకు ఉపాయము పరమాత్మ ఆశ్రయణము. వరుసగా తామస, రాజస, సాత్త్విక గుణములను మూటిని దాటిపోవలయును. అయితే, ఒక్కసారిగా ఎట్టివారును గుణములను దాటలేరు. "దైవీ హ్యేషా గుణమయీ- మమ మాయా దురత్యయా। మామేవ యే ప్రపద్యన్తే, మాయా మేతాం తరన్తితే" అనగా "సత్త్వ రజస్తమోగుణములచే కూడుకొనిన నామాయ నెవరును దాటలేరు. ఎవరైతే నా పాదములాశ్రయింతురో, వారిని నేనే దాటింతును" అని చెప్పినట్లు, "నిత్య సత్త్వస్థః" ఆ పరమాత్మనే ఆశ్రయించుము. నీవు గుణముల నతిక్ర

మించిపోగలవు' అని చెప్పినాడు. అట్లుగాక పరమాత్మ నాశ్రయించక, స్వతంత్రశక్తిమీద ఆధారపడి, సత్త్వగుణము నాశ్రయించి ఎంత ప్రయత్నించినను, పరమాత్మ మాయను దాటలేడు. అందుచేతనే "తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః" అనగా "కలతబెట్టుటయే స్వభావముగాగల ఇంద్రియములను వశము చేసికొని, సమాహితుడును, మత్పరాయణుడునునై యుండవలయును" అని అరువది యొకటవ శ్లోకములో చెప్పినాడు.

కాబట్టి 'నిత్య సత్త్వ స్థః' అనగా 'పరమాత్మయందే నిలచియుండుము' అను అర్థమే సమంజసముగ నున్నది. లేనిచో పొందవలసిన గమ్యస్థానమును మాత్రమే చెప్పి, అది పొందుటకు ఉపాయము చెప్పక వదలివేసిన ట్లగుచున్నది.

'నిర్యోగక్షేముడవు కమ్ము.' అనగా నీ యోగక్షేమములను గురించి నీ బాధ్యత ఏమియును ఉంచుకొనకుము. నిర్భయుడవై, నిశ్చయుడవై యుండుము. అనంతకోటి బ్రహ్మాండములయొక్క యోగక్షేమములను వహించెడివాడను నీ యోగక్షేమములను వహింపనా ? ఆ బాధ్యత నీ కెందులకు ? నాయందు పూర్ణవిశ్వాసముండిననాడే నీవు యోగక్షేమముల చింతవదలిపెట్టగలవు.

ఈ భావమునే కనపరచుచు పరమాత్మ, తొమ్మిదవ అధ్యాయములో "యోగక్షేమం వహామ్యహం" అని చెప్పియున్నాడు.

శ్లో॥ యావా నర్థ ఉదపానే
సర్వత స్సంప్లు తోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు
బ్రాహ్మణస్య విజానతః ॥ ౪౬

ప. వి :—యావాన్, అర్థః, ఉదపానే, సర్వతః, సంప్లుతోదకే, తావాన్, సర్వేషు, వేదేషు, బ్రాహ్మణస్య, విజానతః.

టీక :—

సర్వతః సంప్లుతోదకే = అంతటా మధురజలములు నిండియున్నప్పుడు,
ఉదపానే = స్వల్పజలముగల వాపీకూప తటాకాదుల యందు,
యావాన్ అర్థః = ఎంత ప్రయోజనమో,
విజానతః బ్రాహ్మణస్య = బ్రహ్మతత్త్వ జ్ఞానముచే సర్వత్ర సచ్చిదానంద ఘనపరబ్రహ్మానుభవము గలబ్రాహ్మణునకు,
సర్వేషు వేదేషు = సకల వేదములయందును,
తావాన్ (అర్థః) = అంతియే ప్రయోజనము.

తా. సర్వత్ర పరిపూర్ణమైన మధురజలములు లభించినప్పుడు, మానవునకు నూతులు మొదలగు వానియందు ఎంతప్రయోజనమో, బ్రహ్మతత్త్వ జ్ఞానముచే సర్వత్ర సచ్చిదానంద ఘన పరబ్రహ్మానుభవముగల బ్రాహ్మణునకు వేదములయందు అంతియే ప్రయోజనము కలదు.

**అమృతవాహిని :—**

అర్జునా ! మానవుడు నీటికొఱకు వాపీకూప తటాకాదుల నాశ్రయించుచున్నాడు. అట్టి మానవునకు మధురాతి మధురమైన జలము సర్వత్ర లభించిన యెడల, ఆ వాపీకూప తటాకాదువలన గలుగు ప్రయోజనము, అంతటను, అనాయాసముగ లభించుచునే యున్నది. ఇక నాతడు ఆ వాపీకూప తటాకాదులను వెదకుకొనుచు పోవునా ? పోవలయునా ?

అట్లే, ఏ పరబ్రహ్మప్రాప్తి కొరకు వేదముల నాశ్రయించవలసి వచ్చినదో, ఆ సచ్చిదానంద ఘనపరబ్రహ్మము, సర్వత్ర, సదా, అనుభవములో నున్నవారికి, ఆవేదముతో ఏమిప్రయోజనము ? ప్రయోజనము లేదు అని భావము. బృహదారణ్యకములో -

"తమేవ ధీరో విజ్ఞాయ - ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ।
నానుధ్యాయాత్ బహూన్‌శబ్దాన్ - వాచో విగ్లాపనంహి తత్ ॥"

అనియును,

నారదులవారు తమ భక్తిసూత్రములలో "వేదానపి సన్న్యస్యతి, కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే" అనియును చెప్పియున్నారుకదా! కనుక అట్టి మహాత్మునకు వేదములతో గాని, వేద విహితమైన కామ్యకర్మంతో గాని పనిలేదు.

శ్లో॥ కర్మణ్యే వాధికార స్తే
మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతు ర్భూ
ర్మా తే సంగోఽ_స్త్వకర్మణి॥ 47

ప. వి :— కర్మణి, ఏవ, అధికారః, తే, మా, ఫలేషు, కదాచన, మా, కర్మఫలహేతుః, భూః, మా, తే, సంగః, అస్తు, అకర్మణి,

టీక :—

తే = నీకు,
కర్మణ్యేవ = కర్మ చేయుటయందే,
అధికారః (అస్తి) = అధికారముకలదు.
కదాచన, = ఒకప్పుడును,
ఫలేషు = కర్మఫలములయందు,
(అధికారః = అధికారము)
మా = వద్దు (కర్మఫలము నపేక్షింపకుము)
కర్మఫల హేతుః = కర్మములు చేసినయెడల గొప్ప ఫలము కలుగునను దురాశచే, కర్మముల నెల్లప్పుడు చేయుచు, కర్మలను, వాటి ఫలములను గూర్చి కలుగజేసికొనువాడవు,
మాభూః = కాకుము.
అకర్మణి = (ఫలేచ్ఛ లేనప్పుడు, నాకు కర్మములేల యని) కర్మలు చేయకుండుటయందు,

తే = నీకు,
సంగః = అభిలాష,
మా స్తు = కలుగకుండునుగాక.

తా. నీకు కర్మచేయుటయందే అధికారము కలదు. కర్మ ఫలము నందు నీకు ఎన్నడును అధికారములేదు. కనుక కర్మఫలమునకు కారణము కాకుము. అట్లని కర్మ చేయకుండుటలో నీకు అసక్తికలుగకుండు గాక।

## అ మృ త వా హి ని :-

నీకు నీ వర్ణమునకు, ఆశ్రమమునకు, స్వభావమునకు, పరిస్థితికి అనుగుణమైనట్టి శాస్త్ర విహితకర్మలు చేయుటయందే అధికారము కలదు. ఎందువలన ననగా, నీవు మానవ జన్మములో నుంటివి. జీవునకు ఒక్క మానవజన్మములోనే మరల క్రొత్తగ కర్మలు చేయుటకు అధికారము కలదు. కనుక నీవు కర్మచేయుము. మిగిలిన జన్మలలో జీవునకు కర్మలుచేయుటలో అధికారము లేదు. తనకున్న అధికారమును మానవుడు సద్వినియోగము చేసికొని పరమాత్మ ప్రాప్తిపొందవలయును. తన వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులకు అనుగుణమైన శాస్త్ర విహితకర్మలను భగవదాజ్ఞగా భగవత్సేవగా, అహంకారము మమకారము ఫలాభిలాష కర్తృత్వాభిమానము వదలి ఆచరించినయెడల అతిసులభముగ, సహజముగ పరమాత్మ ప్రాప్తి లభించును.

మానవునకు కర్మలుచేయుటయందే అధికారము. స్వాతంత్ర్యము కలదుగాని, స్వరూపముతో త్యజించుటయందు అధికారములేదు, స్వాతంత్ర్యములేదు. బలాత్కారముగ వదలినను అది అనధికారకృత్యమే యగుచున్నది. అటుల కర్మలు త్యజించి ఎన్నడును ఉండలేడు మానవుడు. ఇంకొక రూపములో ఇంకొక విధముగ ఇంకొకప్పుడు ఇంకొకచోట చేసియే తీరును. ప్రకృతి చేయించును- అప్పుడు తన అధికారమును దుర్వినియోగము చేసినదోషము కూడ వచ్చును. తరువాత శాస్త్రము యొక్క ఆజ్ఞను తిరస్కరించిన శిక్ష అనుభవించవలసివచ్చును. కనుక నీ కర్తవ్యమును తప్పక ఆచరించియే తీరవలయును. ఎన్నడును త్యజించరాదు.

ప్రభుత్వము ఆత్మరక్షణకొరకును, ప్రజారక్షణకొరకును కొన్ని శస్త్రములు ఒకనివద్దనుంచి, వాటిని ఉపయోగించుటకు అధికారమును ప్రసాదించి, ఎట్లు ఉపయోగించవలయునో, ఎప్పుడు ఉపయోగించవలయునో, ఆనియమములన్నటిని ఆతనికి తెలిపె ననుకొనుడు. తరువాత ఆతడు తనకు ప్రభుత్వము ప్రసాదించిన ఆ అధికారమును ఉపయోగించక పోయినను, దుర్వినియోగముచేసినను, ప్రభుత్వముచే దండింపబడుటయు, ఆ అధికారము లాగివేయబడుటయు, బందీకృతుడగుటయు సంభవించునుగదా!

అట్లే జన్మ బంధనమునుండి తాను ముక్తుడగుట కొరకును, ఇతరులకు హితము చేయుటకొరకును పరమాత్మ జీవు

నకు మానవశరీరమును ప్రసాదించినాడు. మిగిలిన జన్మలలో లేని కొన్ని సౌకర్యములను, అధికారములను ఇచ్చినాడు. ఆ అధికారములను,సౌకర్యములను ఉపయోగించక పోయినను, దుర్వినియోగముచేసినను దండనము, బంధనము- సంసార పతనము-తప్పదు. ఈ అధికారములలో చాలా ప్రధానమైనది కర్మలు చేయునధికారము. ఈ అధికారమును సద్వినియోగము చేసికొనిన యెడల ఈ సంసార బంధమునుండి విడుదల పొంది పునరావృత్తి రహితమైన పరమపదము పొందగలుగుచున్నాడు. దుర్వినియోగము చేసికొనినవాడు దండనకు పాత్రుడగును. తరువాత ఆతనినుండి ఈ అధికారము లాగివేయబడును. అధికారము లాగివేయబడుట యనగా, తనకు ఈ మానవజన్మను ప్రసాదించక, ఏ నీచజన్మలనో ఇచ్చుట. కుక్క పంది మొదలగు జన్మలలోనికి పారవేయుట. ఆ జన్మలలో, ఎట్టి బాధల ననుభవించవలసి వచ్చునో తెలియదు. ఈ తత్త్వమును, రహస్యమును తెలిసినమానవుడు ఈ అధికారమును సద్వినియోగము చేసికొనవలయును.

సరే ! కర్మచేయవచ్చును. చేసిన కర్మఫలము ఎందుచేత కోరరాదు అని ప్రశ్న -

మానవునకు కర్మయొక్క ఫలములో ఎట్టి స్వాతంత్ర్యమును లేదు. ఏయే కర్మకు ఏయే ఫలము నిర్ణ

యించబడి యున్నది, ఆ ఫలము ఏ జన్మలో అనుభవించ వలయును, ఏ విధముగ అనుభవించవలయును - ఇవి ఎవరికిని తెలియవు. ఆ ఫలము తన ఇచ్ఛానుసారము తనకు అవసర మున్నప్పుడు దొరకదు. లేక తన కిష్టము లేనిదైనను, తప్పించు కొందమన్నను వీలులేదు. అందువల్లనే మానవుడు తలంచునది యొకటి,జరుగునది మరొకటి. అనేకమంది మానవులు అనేకరకములైన భోగములు అనుభవించవలయునని కోరు చుందురు. కాని అనుభవించ లేకుండ నున్నారు. కొన్ని కొన్ని సంయోగములు వియోగములు మానవుడు కోరడు. కోరక పోయినను ఆతనికి అక్కర లేకపోయినను, ఇష్టము లేకపోయి నను, తప్పించుకొనుట కెంత ప్రయత్నము చేసినను, నెత్తిని నోరు బెట్టుకొని ఏడ్చినను, బలాత్కారముగ కలుగుచునే యుండును. ఎందువల్లననగా, కర్మలయొక్క ఫలములనిచ్చునది కేవలము పరమాత్మ చేతిలో నున్నది. దానిలో మానవుని ఆటలు సాగవు; పప్పులుడుకవు.

మానవుడు భ్రమప్రమాదములకు లోనగుట సహజము. ఏ ప్రమాదము తటస్థించినను చేసెడికర్మకు లోపముకలుగును. దానివలన ఫలము విపరీతమగును. కేవలము నిష్కామముగ పరమాత్మ సేవగ చేయుకర్మలకు భ్రమప్రమాదములవల్ల ప్రత్యవాయము లేదు కాని కామ్యకర్మలకు సక్రమముగ సమగ్ర ముగ చేసిననే ఫలము గలుగును. ఆ ఫలమైనను చాల అల్పము, ఇక పొరపాటు చేసిన ప్రమాదము అధికము.

ఒక యజ్ఞము చేయవలయుననిన ఆ ఋత్విక్కులలో ఎవరైన నొకరు వేదమంత్రములను స్వరము తప్పి ఉచ్చరించినచో, కర్తకు బ్రహ్మరాక్షస జన్మవచ్చును. "స్వాహా" అని నప్పుడు అగ్నిలో నేయి మొదలగునవి వేల్చు సమయము నిర్ణయింపబడినది,

'స' కారము ఉచ్చరించునపుడు ఆహుతిఇచ్చినచో సూకరజన్మ కలుగును. అట్లే, 'హా'కారముమీద ఆహుతి ఇచ్చినను, 'ఆ' కారము మీద ఆహుతి ఇచ్చినను, వేర్వేరు దుష్టఫలములు చెప్పబడినవి.

చివరిప్లుతముమీదనే ఆహుతి నీయవలయును.

ఇట్లే ప్రతికర్మకును ఒక్కొక్కరకమైన బాధగలదు.

కాబట్టి అర్జునా! నీవు ఫలాభిలాషను పూర్తిగత్యజించి కర్మలు మాత్రము శ్రద్ధాభక్తులతో, అహంకార మమకారములు లేకుండ చేయుము. అట్లు చేసినయెడల, అంతఃకరణము పరిశుద్ధినొంది నిస్త్రైగుణ్యాత్వమునకు అధికారములభించును. నిస్త్రైగుణ్యాత్వము లభించగనె ద్వంద్వములు నీకు తోచనే తోచవు. అట్టి స్థితిలో నీచిత్తము, బుద్ధి, ఇంద్రియములు, అన్నియును కేవలము నిత్యుడును, సచ్చిదానంద శుభస్వరూపుడును, కల్యాణగుణ మహోదధియును, నిరతిశయ సౌందర్య

పారావారమును, అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడునైన పరమాత్మయందే నిశ్చలముగ, స్థిరముగ నిలచి యుండును. కనుక నీకు కర్మలయందే అధికారమని చెప్పితిని. వివేకముతో విచారించుకొని యుద్ధమునకు సన్నద్ధుడవుకమ్ము.

అర్జునా! నీకున్న కర్మాధికారమును శాస్త్రనిషిద్ధమైన దుష్టకర్మలయం దుపయోగించుట దుర్వినియోగమనబడును. అట్లే నీ వర్ణమునకు, ఆశ్రమమునకు, స్వభావమునకు, పరిస్థితులకు అనుగుణమైన శాస్త్రవిహితకర్మను ఆచరించకపోవుటయును దుర్వినియోగమే అగును. కనుక విహితకర్మల వదలుట ఎట్లు చూచినను తగనిది. "నకర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" (3-4) "మానవుడు శాస్త్ర విహిత కర్మానుష్ఠానము లేక నైష్కర్మ్యసిద్ధిని పొందలేడు." కనుక నీకు పాపమూలకములైన కర్మలు చేయుటయందును, శాస్త్ర విహితములైన కర్మలు చేయకపోవుటయందును ఆసక్తి కలుగకుండుగాక!

ఫలాభిలాషాదులులేకుండ కర్మ చేయుటచేత కర్మలు ఎట్లు బంధనములు కావో వినుము. మానవుడు పాపము చేయుటకు కారణము ఆసక్తి. ఆసక్తి లేనిది పాపములు చేయలేడు. ఇచ్చట ఆసక్తి, మమకారము, అహంకారము, కర్తృత్వాభిమానము లేక కర్మలు చేయువాడగుటచే నిక క్రొత్తగ పాపములు చేయడు. ఆసక్తి, మమకారము, కర్తృత్వాభి

మానము వదలి చేయబడిన కర్మల ప్రభావముచేత ఇదివరకు చేయబడిన పాపములు భస్మమై పోవుచున్నవి. చేయబడుచున్న శాస్త్ర విహితకర్మల యందు ఫలాభిలాష, ఆసక్తిలేక పోవుటచేత ఇవి ఫలములచేత బంధించలేవు. ఈ ప్రకారముగ వాని సమస్త కర్మలు విలీనమై పోవుచున్నవి. నైష్కర్మ్యత్వము సులభముగ సిద్ధించుచున్నది.

"కర్మణ్యేవాధికారస్తే - మాఫలేషుకదాచన" "నీకు కర్మ చేయుటయందే అధికారముగ గలదు. కర్మఫలమునందధికారము లేదు."

ఈ విషయమును బాగుగ లోతుగ విచారించవలయును.

జీవునకు జన్మలన్నియును కారాగృహములు పూర్వజన్మలలో చేసిన పాపపుణ్యముల ఫలములనుభవించుటకు జన్మలు కలుగుచున్నవి. ఈ జన్మలన్నిటిలో మానవజన్మయొక్క విశేషమేమనగా, పూర్వపుణ్య పాప ఫలముల ననుభవించుటకును, క్రొత్తగ కర్మలు చేయుటకును కూడ అవకాశము కలదీ మానవజన్మ. ఎవరికి ఏయే కర్మలు శాస్త్రములందు విధింపబడినవో, ఆయా కర్మలు చేయుటయందే మానవునకు అధికారము కలదుగాని, ఆ కర్మల ఫలమునందు అధికారము లేదు. ఆ ఫలమును

కోరుట అధికారము లేనిదానిని కోరుటేయగును. కనుక ఫలమును కోరుట పరమాత్మ సహించడు. ఆ ఫలమును కోరుటవలన తిరుగ మరల జన్మలసెత్తవలయును. ఫలమును కోరక, భగవత్కైంకర్య బుద్ధితో నిష్కామముగ కర్మలు చేసినయెడల, జన్మరాహిత్యము లభించును.

కారాగృహములో బంధితులకు ప్రభుత్వము కొన్ని కర్మల నేర్పాటుచేసినదనుకొనుడు. ఉదయము గానుగ లాగుట, సాయంత్రము వ్యవసాయము చేయుట - ఉదాహరణకు ఇంతమాత్రము చాలును. ఏ బంధితుడైనను తాను గానుగ లాగినందులకు కూలి అడుగవచ్చునా? తాను వ్యవసాయముచేసిన పొలములోని పంట తనకే రావలయునని కోరుటకు అధికారమున్నదా? ప్రభుత్వము విధించిన కర్మలు చేయుటకే అధికారము. అది చేయక పోయిన ప్రభుత్వము యొక్క ఆగ్రహమునకు పాత్రుడగును. కర్మఫలమందధికారము లేదు. అధికారములేని ఫలమును తాను పొంద ప్రయత్నించినను, ప్రయత్నించుచున్నట్లు తెలిసినను, వీడొక దొంగగా పరిగణింపబడి, ప్రభుత్వముచేత దండింపబడును.

అట్లుగాక, తన అధికారముగల కర్మలు, ప్రభుత్వాజ్ఞగ చేయుచు, ఫలమును కోరకయున్న యెడల, ప్రభుత్వముయొక్క అనుగ్రహమునకు పాత్రుడై, సమయమునకు బందెనుండి విడుదలగును. మరల బంధప్రాప్తి ఉండదు,

అట్లే మానవుడు శాస్త్రములందు తనకు విధింపబడిన కర్మలను ఫలముఁ గోరక, భగవత్కైంకర్య బుద్ధితో చేసిన యెడల భగవదనుగ్రహమునకు పాత్రుడై, జన్మరాహిత్యమును పొందును.

అవతారిక :—

పూర్వశ్లోకములో కర్మఫలమునం దాసక్తి పనికిరాదని చెప్పినాడు. ఫలమునం దాసక్తి లేదు గనుక కర్మ నెందుకు చేయవలయును అని కర్మలు చేయక పోవుటయందు నీకు ఆసక్తి పనికిరాదు అనినాడు. ఐతే కర్మలనే ప్రకారము చేయవలయునో ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి
సంగం త్యక్త్వా ధనంజయ !
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే ॥ ౪౮

ప. వి :—యోగస్థః, కురు, కర్మాణి, సంగం, త్యక్త్వా, ధనంజయః
సిద్ధ్యసిద్ధ్యోః, సమః, భూత్వా, సమత్వం, యోగః,
ఉచ్యతే॥

టీక :—

ధనంజయా ! = ఓ అర్జునా !
త్వమ్ = నీవు,
యోగస్థః = సమత్వమనబడు యోగమునందుండి,

సంగమ్ = ఫలాపేక్షను, నేనుచేయుచున్నానుఅను
కర్తృత్వమును, నాది అను అభిమానమును,
త్యక్త్వా = విడిచి,
సిద్ధ్యసిద్ధ్యోః = ఫలముయొక్క కలిమిలేములయందు,
సమోభూత్వా = ఒకే భావముతోనున్నవాడవై,
కర్మాణి = స్వకీయమైన వర్ణాశ్రమవిహిత కర్మములను,
కురు = చేయుము.
సమత్వమ్ = ప్రాప్తాప్రాప్తములయందు మనస్సును
సమముగ నుంచగలుగుటయే,
యోగః (ఇతి) ఉచ్యతే = యోగమని చెప్పబడు
చున్నది.

తా. ఓ ధనంజయా! యోగమందున్నవాడవై ఆసక్తిని విడిచి పెట్టి సిద్ధియందును అసిద్ధియందును కూడ సముడవై కర్మలుచేయుము. సమత్వమునే యోగమని అందురు.

అ మృ త వా హి ని :-

ధనంజయా! నీవు కర్మచేయక తప్పదు. కాని ఆసక్తి వదలిపెట్టి కర్మచేయుము. రాజ్యము మీదగాని, బంధుమిత్రాదులమీదగాని, అట్లే ఇతర విషయభోగములమీద గాని ఏ మాత్రము ఆసక్తియున్నను, పూర్ణముగ కర్మము నాచరింపలేవు. అనగా సక్రమముగ ఆచరింపలేవు. నీ ధర్మమైన ధర్మయుద్ధము చేయుటకు నీవు వెనుకాడునది ఈ బంధు

మిత్రాదులందలి ఆసక్తిచేతనేగదా ! ఆసక్తి యున్నంత కాలము రాగద్వేషములును, వాటి కార్యరూపములైన హర్ష శోకములును కలుగుచునే యుండును. ఎంతకాలము రాగ ద్వేషములుండునో, అంతకాలమును సిద్ధి, అసిద్ధియందు సమభావము కుదురదు. యోగస్థుడవై కర్మ చేయవలయు నన్నచో, ముందు ఆసక్తిని పూర్తిగ త్యజించుము. తరువాత నెరవేరుట యందును నెరవేరక పోవుటయందును సమముగనే ఉండుము. యుద్ధమున జయము లభించినను, అపజయము లభించినను సమభావముతోడనే యుద్ధము చేయుము. సమత్వ మనిననిదియే. ఇదియే యోగము. నిన్నుద్ధరించునది ఈ సమత్వమే. నీ కర్తవ్య కర్మ చేయక తప్పదు, కనుక చేయుము. కాని ఈ సమత్వమును మాత్రము బాగుగ కలిగి యుండుము.

ఒక కర్మ చేయునప్పుడు ఆ కర్మయొుక్క సిద్ధి, అసిద్ధి యందు మాత్రమే సమత్వముండవలయునని చెప్పినయెడల, కర్మచేయు సమయములో ఎట్లుండవలయును అను సమస్యను తీర్చుటకు 'యోగస్థః' అను శబ్దము ప్రయోగించబడినది. కర్మ చేయునప్పుడుకూడ యోగస్థుడవై యుండుము. కేవలము నెరవేరినను నెరవేరకపోయినను, సమముగ ఉండుటచాలదు. ఏపని చేయుచున్నను ప్రతి పదార్థము విషయమునను, కర్మ యందుగాని, దాని ఫలమునందుగాని, ఏ ప్రాణియందుగాని

ఎంతమాత్రమును విషమభావము రానీయక సమభావముతోనే యుండవలయును.

ఇట్లు కర్మ యోగముయొక్క ఆచరణప్రక్రియను చెప్పినాడు పరమాత్మ ఈ శ్లోకములో.

కొంతమంది-సిద్ధి, అసిద్ధి అనగా "కర్మ చేయుచున్న పురుషునికి కలుగుచున్న చిత్తశుద్ధిచే, జ్ఞానమును పొందుట 'సిద్ధి' అనబడును. దానికి విరుద్ధమైనది, మనస్సుయొక్క అశుద్ధిచే కలుగునట్టిది 'అసిద్ధి' యగును. ఆ సిద్ధ్యసిద్ధుల రెంటియందును సమముగ నుండుటయే యోగమన బడుచున్నది" అని ఇట్లు వ్రాసిరి -

ఇక్కడ బాగుగ ఆలోచింపవలసి యున్నది. ఈ శ్లోకములో కర్మయోగము యొక్క అవధికూడ చెప్పబడినది. ఈ స్థితి చిత్తశుద్ధి పూర్ణముగ కలిగిన మీదటగాని రాదు. కనుక చిత్తశుద్ధిని సంపాదించుటకే ఈ కర్మయోగము అయినప్పుడు "చిత్తశుద్ధి కలిగినను కలుగకపోయినను సముముగ ఉండుము" అనినచో, చిత్తశుద్ధిలేనిది సమముగ ఎట్లుండగలడు ? చిత్తశుద్ధిలేక, మలము, విక్షేపము, అవరణము అను దోషములు ఎంతమాత్రమైనను ఉన్నంతకాలము పూర్ణముగ సమత్వభావన కలుగుటకు అవకాశమే లేదు. కనుక ఇక్కడ సిద్ధి, అసిద్ధి అనగా కృష్ణపరమాత్మ అభిప్రాయము ఇదియై

యుండదని మా అభిప్రాయము. పని నెరవేరినను నెరవేరక పోయినను అను అర్థమునే తీసికొనవలయును -

**అవతారిక :—**

ఈ విషయమే మాటిమాటికి ఎందుకు చెప్పబడు చున్నదో, కారణము ఈ శ్లోకములో చెప్పుచున్నాడు-

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ
బుద్ధియోగా ద్ధనంజయ !
బుద్ధౌ శరణ మన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః॥ 49

ప. వి :—దూరేణ, హి, అవరం, కర్మ, బుద్ధి యోగాత్, ధనంజయః, బుద్ధౌ, శరణం, అన్విచ్ఛ, కృపణాః, ఫలహేతవః.

**టీక :—**

ధనంజయ = ఓ అర్జునా !
బుద్ధియోగాత్ = (ఈశ్వరారాధనమను బుద్ధితో చేయు) నిష్కామ కర్మకంటె,
కర్మ = ఫలమును కోరి చేయబడిన కామ్య కర్మము,
దూరేణ అవరం హి = మిక్కిలి నికృష్టమైనదిగదా !
అతః = కాబట్టి,

బుద్ధౌ = నిష్కామకర్మయోగబుద్ధి యందు,
శరణం = అభయప్రాప్తిసాధనమును,
అన్విచ్ఛ = ప్రార్థింపుము,
ఫలహేతవః = ఫలముగోరి కర్మముల జేయువారు,
కృపణాః = జనన మరణాది దుఃఖపరంపరగలను సదా
పొందునట్టి దీనులు జాలిపడదగినవారలు

తా. సమత్వరూపమైన బుద్ధియోగముకంటె సకామకర్మ అత్యంత తుచ్ఛమైనది. కనుక అర్జునా ! నీవు బుద్ధియోగమునే ఆశ్రయించుము. ఫలముకోరి కర్మలు చేయువారు దీనులుసుమా !

అ మృ త వా హి ని :_

బుద్ధియోగమునకు ప్రధానలక్షణము ఫలత్యాగము, నెరవేరినను నెరవేరక పోయినను సమముగ నుండుటయును, ఈ బుద్ధియోగముతో కూడిన కర్మకంటె అన్యమైన కర్మ - అనగా ఫలాపేక్షతో కూడి చేయబడిన కర్మ అత్యంతము నికృష్టమైనది, ఫలముకోరి కర్మలు చేయునెడల ఆ కర్మల యొక్క ఫలము క్షణికములు, నశించెడివిఅగు తుచ్ఛ సుఖములు. నిష్కామముగ చేయబడిన కర్మలయొక్క ఫలము సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, అఘటన ఘటనా సమర్థుడు, దయామయుడు, సచ్చిదానందామల పరిపూర్ణుడునైన, కల్యాణ గుణ మహోదధి పరమాత్మ లభించుట. కనుక కామ్యముతో చేయబడిన కర్మల ఫలమునకును, నిష్కామముగ చేయ బడిన కర్మలఫలమునకును గడ్డిపరకకును మేరుపర్వతమునకును

ఉన్నంతభేదము ; రాత్రికిని పగటికిని ఉన్నంత వాసి; ఎండమావులకును అమృతవారాశికిని ఉన్నంత తారతమ్యము కలదు.

ఎవరైనను తెలిసినవారు మేరుపర్వతమును వదలి గడ్డిపరకకు ఆశపడుదురా ? పగటిని కాక రాత్రిని ప్రేమించెదరా? అమృతవారాశిని తృణీకరించి ఎండమావులకై పరుగులు పెట్టెదరా ? కాని మేరువును వదలి గడ్డిపరకకు ఆశపడువారును, పగటినికాక రాత్రిని ప్రేమించువారును, అమృతవారాశిని తృణీకరించి ఎండమావులకై పరుగులు పెట్టువారును కొంతమంది కలరు. వారే కామ్యముతో కరలు చేయువారు - పాపము, వారు కృపణులు; జాలిపడదగినవారు. వారి హితము వారు తెలిసికొనలేనివారు. బంగారపు త్రాటిని వదలి గడ్డిత్రాడుకు ఆశపడునట్టి బుద్ధిహీనులు; పారిజాత పుష్పమాలను వదలి పామును మెడ ధరించునట్టి తెలివితక్కువవారు; ఆనందమును త్రోసివేసి దుఃఖమును వరించు జడులు. కనుక వారు కృపణులు. అర్జునా ! దీనాతి దీనులు, ముందు ఆలోచనలేకుండచేసి, చివరకు మోకాళ్ళమీద తల ఆనించుకొని రెండుచేతులు నెత్తిపై బెట్టుకొని రోదనము చేయువారు. వీరిని చూచిన జాలివేయునుకదా ! నీవు వీరుడవు. కాన అట్టి దీనత్వమునకు పాలుపడరాదు. చక్కగ ఆలోచించుకొని, బుద్ధియోగము నాశ్రయించి కర్మలు చేయుము. నీవు నాకు ఇష్టుడవు, సఖుడవు, ప్రియభక్తుడవునుకదా ! నీవు అట్టి దీనాతి దీనస్థితికి పోవుచో, చూచిచూచి సహించగలనా ! ఊరకొన

గలనా ? కాబట్టి బుద్ధియోగము నాశ్రయించి నిష్కామముగ కర్మలు చేయుటను గురించి మాటిమాటికిని చెప్పుచున్నాను. నీవు కర్మల నాచరించు సమయమున ఈ బుద్ధియోగమును బాగుగ ఆశ్రయించి యుండుము. నడచునప్పుడు, తిరుగుచున్నప్పుడు, కూర్చున్నప్పుడు, నిలుచున్నప్పుడు, నిద్దురపోవునప్పుడు, మేలుకొనినప్పుడు, ప్రతిక్షణమును ప్రతి చిన్నపని చేయునప్పుడును నిరంతరముగ ఈ సమత్వబుద్ధిని ఆశ్రయించియే యుండుము. ఇదియే పరమకల్యాణపదవికి సుగమము, సులభము, నిరపాయము, నిశ్చితమునైన ఉపాయము. (ఇక్కడ బుద్ధియోగముతో కూడిన కర్మలకంటె ఇతరమైన కర్మలు అన్నప్పుడు నిషిద్ధకర్మలు అని అర్థము తీయరాదు. నిషిద్ధకర్మలు ఎప్పుడును త్యాజ్యములే. ఏ కర్మలు నిష్కామముగ చేయుటచే పరమాత్మ ప్రాప్తికి సాధనములగుచున్నవో, ఆ కర్మలనే కామ్యముతో చేసి ఆ మహాఫలము నుండి వంచింపబడి అల్పాత్యల్పమైన ఫలములను మాత్రము పొందు వారిని గురించియే ఇచ్చట చెప్పబడినది. నిషిద్ధ కర్మలుచేసి తమకును లోకమునకును కూడ ప్రమాదకరులైన వారిని కృపణులు అనరాదు, దుష్టులు అనవలెను).

"యోవా ఏత దక్షరం గార్గ్యవిదిత్వా
స్మాల్లోకా త్ప్రైతి సకృపణః"

"హేగార్గి ! ఎవడు పరబ్రహ్మమును పొందకయే ఈ లోకమునుండి పోవుచున్నడో వాడు కృపణుడు."

(బృహ ఉ॥ 3-౮-౧౦)

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ
ఉభే సుకృత దుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ
యోగః కర్మసు కౌశలం ॥ ౫౦

ప. వి :— బుద్ధియుక్తః, జహాతి, ఇహ, ఉభే, సుకృతదుష్కృతే, తస్మాత్, యోగాయ, యుజ్యస్వ, యోగః, కర్మసు, కౌశలం.

టీక :—

బుద్ధి యుక్తః = (సుఖదుఃఖాదులయందు) సమబుద్ధి కలవాడు,

ఉభే, సుకృత దుష్కృతే = (పుణ్యము, పాపమువలెనే జనన మరణాదులు గలుగ జేయును గాన, సామాన్యులు పాపఫలము నెట్లు అపేక్షింపరో, అట్లే జ్ఞానులు పుణ్యఫలమునుగూడ నపేక్షింపరు. అట్టి) పుణ్యపాపములనెడి రెంటిని,

ఇహ = ఈ లోకమునందు (ఈ జన్మమందు),

జహాతి = త్యజించుచున్నాడు,

తస్మాత్ = ఆ కారణము వలన,

యోగాయ = (సమబుద్ధి) యోగముకొరకు (నిష్కామ
కర్మయోగము కొరకు),
యుజ్యస్వ = సిద్ధపడుము,
కర్మసు = తన వర్ణాశ్రమ విహితములైన సత్కర్మల
యందు,
కౌశలం = బంధక స్వభావముగల కామ్యకర్మలనుండి
సమత్వ బుద్ధిచే మనస్సును మండలించు
కొను నేర్పు,
యోగః (ఇతి = యోగమని,
(ఉచ్యతే = చెప్పబడుచున్నది.)

తా. బుద్ధి యుక్తుడైన మానవుడు- అనగా వివేకముతో నిష్కామముగ కర్మలు చేయువాడు-పుణ్యపాపముల రెంటిని ఇక్కడనే వదలిపెట్టుచున్నాడు. అనగా అవి వానిని బంధించలేవు. కనుక నీవు ఇట్టి కర్మయోగమునకే ప్రయత్నించుము. యోగమనగా కర్మాచరణమునందు చూపు నేర్పే.

## అ మృ త వా హి ని:-

బుద్ధి యోగముతో కూడుకొని కర్మలు చేయువాడు అనాది కాలమునుండియు, అనగా అనేక జన్మాంతరముల నుండియును, ఈ జన్మములోను, చేయబడి, సంచితముగ నిలువ చేయబడియున్న అనేకములైన పుణ్యాపాపములను ఈ లోకముననే విడిచిపెట్టుచున్నాడు. అనగా ఈ జన్మలోనే సమస్త కర్మబంధనముల నుండియును ముక్తుడగుచున్నాడు. ఆతనికి ఈ కర్మఫలములతో ఎట్టి సంబంధమును ఉండదు.

ఆతని కర్మలు పునర్జన్మను కలిగించలేవు. (అ. ౪-౨౨ శ్లో, వ్యాఖ్యానమున చూడుడు) సమత్వ బుద్ధితో కూడి కర్మలు చేయు కర్మయోగి జీవన్ముక్తుడగుచున్నాడు. కనుక నీవుకూడ అట్లే కర్మలు చేయుము. కర్మలు యథార్థముగ బంధనము నకుగాని ముక్తికిగాని హేతువులుకావు. మానవుడు తన తెలివితక్కువచేత కర్మలను బంధన హేతువులుగ సిద్ధము చేసికొనుచున్నాడు. తెలివిగలవాడు ఇప్పుడు చేయుకర్మలు బంధన హేతువులు కాకుండ చేసికొని, అంతమాత్రముతో ఆగక ఈ కర్మలను సమత్వబుద్ధి యోగముతో గూడుకొని చేయుటచేత బంధనమునకు హేతువులైన వెనుకటి జన్మాంత రములోని పుణ్యపాపరూపములగు కర్మలనుండికూడ విముక్తు డగుచున్నాడు. కనుక బంధన విముక్తికి హేతువు కర్మలు చేయుటయందలి సమత్వబుద్ధియను కౌశలమే. దానినే యోగమందురు. ముండకోపనిషత్తులో కూడ-

"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ" (౩-౧-౩)

విద్వాన్ (బుద్ధిశాలి) పుణ్య పాపముల-రెంటిని వదలిను అని చెప్పబడియున్నది.

**అవతారిక :-**

పుణ్య పాపములను ఇక్కడనే వదలి ఏమగుచు న్నాడు అనుదానికి సమాధానము ఈ శ్లోకము ఇచ్చు చున్నది.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తాహి
ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మ బంధ వినిర్ముక్తాః
పదం గచ్ఛంత్యనామయం ॥ ౫౧

ప. వి :—కర్మజం, బుద్ధియుక్తాః, హి, ఫలం, త్యక్త్వా, మనీషిణః, జన్మబంధ వినిర్ముక్తాః, పదం, గచ్ఛన్తి, అనామయం.

టీక :—

బుద్ధియుక్తాః = సుఖదుఃఖములయందు సమత్వ బుద్ధిగల,
మనీషిణః = మహాత్ములు,
కర్మజం = కర్మమువలన బుట్టిన,
ఫలం = ఫలమును,
త్యక్త్వా = విడిచి,
జన్మబంధ వినిర్ముక్తాః = జన్మమనెడి బంధమువలన విడువబడినవారై
అనామయం = పునరావృత్తి రహితమైన పరమపదమును,
గచ్ఛంతిహి = పొందుచున్నారుగదా !

తా. బుద్ధియోగముతోకూడి కర్మలు చేయువారు కర్మలచేత కలుగు ఫలములను వదలి జన్మబంధమునుండి ముక్తులై నిరామయము, నిర్వికారమునైన పరమపదమును పొందుచున్నారు.

అమృతవాహిని :—

అర్జునా! కర్మ బంధనమును గలుగజేయునది అయి నప్పటికిని, అది బుద్ధియోగముతో కూడి కర్మలు చేయునట్టి మనీషావంతులను బంధించలేదు. అట్టి మనీషావంతులు జన్మ బంధమునుండి పూర్ణముగ విముక్తులై నిరామయమైన మోక్షమును పొందుచున్నారు.

రాగద్వేషాది క్లేశములుగాని, శుభాశుభ కర్మములు గాని, హర్షశోకాది వికారములుగాని ఎటువైపు దృష్టి మర ల్పుటకైనను వీలులేదో అట్టి నిత్యమైన పదమును అనామయ పదమందురు.

'మనీషిణః' అనుటచేత మోక్షద్వారమైన, అమూల్య మైన మనుష్యశరీరమును పొందికూడ ఎవరు ఈ జీవితమును తుచ్ఛభోగములకే ఉపయోగించుకొని చెడుచున్నారో, వారు బుద్ధిమంతు లెట్లగుదురని భావము.

అవతారిక :—

అయినచో అనామయమైన ఈ పరమపదప్రాప్తి నాకెప్పుడు లభించును అని అర్జునునకు సందేహము కలుగ వచ్చును. దానికి సమాధాన మీ శ్లోకములో చెప్పబడు చున్నది-

(28)

శ్లో॥ యదా తే మోహకలిలం
బుద్ధి ర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం
శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥ ౫౨

ప. వి :— యదా, తే, మోహకలిలం, బుద్ధిః, వ్యతితరిష్యతి, తదా, గన్తాసి, నిర్వేదం, శ్రోతవ్యస్య, శ్రుతస్య, చ.

టీక :—

యదా = ఎప్పుడు,
తే = నీయొక్క,
బుద్ధిః = బుద్ధి,
మోహకలిలం = అజ్ఞానరూపమైన కల్లతను,
వ్యతితరిష్యతి = దాటునో,
తదా = అప్పుడు,
శ్రుతస్య = ఇహలోక పరలోక సంబంధమైన భోగైశ్వర్యాదులను గురించి ఇదివరకు వినినవాటి యందును,
శ్రోతవ్యస్య చ = ఇక వినబోవు వాటియందును కూడ,
నిర్వేదం = వైరాగ్యమును,
గన్తాసి = పొందగలవు

తా. ఈ విధముగ నీవు ఆచరించుచుండగ ఎప్పుడు నీబుద్ధి మోహరూపమైన కలతను లేక మోహముచే కలిగిన కలతలను దాటునో,

(మోహము నశించునో) అప్పుడు నీ విదివరకు విన్నవియును ఇకముందు వినబోవునవియునగు ఇహలోక పరలోక సంబంధములగు సమస్త భోగములయందును వైరాగ్యమును పొందగలవు.

అమృతవాహిని :-

అర్జునా! నీకు ఆ పరమపదరూపమైన భగవత్ప్రాప్తి లభించవలెనన్నచో నీకు పట్టుకొనిన ఈ మోహకలిలము వదలిపోవలయును. ఈ బంధువులు మిత్రులు మొదలగువారియందు అజ్ఞానజనితమైన మమకారము, స్నేహము, ఈ ప్రాపంచిక భోగములందు కాంక్ష మొదలగు మోహరూపమైన కళ్మలము వదలిపోవలయును. అదియే-అనగా ఆ కళ్మలమే నిన్ను ధర్మసమ్మూఢచేతస్కునిగ, కర్తవ్యాకర్తవ్య నిర్ణయము చేసికొనలేని వానినిగ చేయుచున్నది. కాని ఈ మోహరూపమైన కళ్మలము నీకు సహజమైనదికాదు. ఆగంతుకము. కనుక దాటుటకు అవకాశము కలదు. నీవు ఈ నిష్కామకర్మయోగము సక్రమవిధానముగ శ్రద్ధతో ఆచరణలో పెట్టుకొనుచు రాగారాగా నీ వీ మోహరూపమైన కళ్మలమును దాటగలుగుదువు. అప్పుడు నీకు ఇహలోక పరలోక సంబంధమైన ప్రతివిషయమునను వైరాగ్యము కలుగగలదు. అంతవరకును ఈ గందరగోళము తప్పదు. నీవు మహాత్ముల సాంగత్యముచేసి నిత్యానిత్యములను కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుకొనతగిన వివేకమును సంపాదించుకొని, మమకారము,

అహంకారము, ఆసక్తి, కోరిక, కర్తృత్వాభిమానము మొదలగు వాటిని త్యజించి, మత్పరాయణుడవు - భగవత్పరాయణుడవు - కమ్ము. నిష్కామభావముతో మత్పరాయణుడవై కర్మలు చేయుచుండుటచేత ఆవరణమను దోషము నశించును. అట్లు ఆవరణదోషము నశించుటచేతనే బుద్ధియందు కలిగిన ఈ మోహకలిలమును దాటగలవు.

(ఆవరణ దోషమనిననేమో మూడవ అధ్యాయములో ముప్పది ఎనిమిదవ శ్లోకముయొక్క వ్యాఖ్యానమున చూడ నగును.)

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే
యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధి
స్తదా యోగ మవాప్స్యసి ॥ ౫౩

ప. వి :— శ్రుతివిప్రతిపన్నా, తే, యదా, స్థాస్యతి, నిశ్చలా, సమాధౌ, అచలా, బుద్ధిః, తదా, యోగం, అవాప్స్యసి.

టీక :—

శ్రుతివి ప్రతిపన్నా = అనేకము వినుటచేత చలించినట్టి,
తే = నీయొక్క,
బుద్ధిః = మతి (అంతఃకరణము)

యదా = ఎప్పుడు,
సమాధౌ = భగవద్ధ్యానమందు,
నిశ్చలా = స్థిరమైనదై,
అచలా = చలించనిదై,
స్థాస్యతి = నిలుచునో,
తదా = అప్పుడు,
యోగం = భగవత్ప్రాప్తి రూపమైన యోగమును,
అవాప్స్యసి = పొందగలవు.

తా. అనేక విధములైన మాటలు వినుటచేత చలించినట్టి నీబుద్ధి ఎడతెగని భగవద్ధ్యానమందు ఎప్పుడు స్థిరమై నిలుచునో, అప్పుడు భగవత్ప్రాప్తి రూపమైన యోగమును పొందగలవు.

## అమృతవాహిని :-

అర్జునా ! ఇంతవరకును నీవు ఈ లోకము యొక్కయు పరలోకముల యొక్కయు భోగములను ఐశ్వర్యములను వైభవములను గురించి అనేకములుగ వినియున్నావు. దీనిచేత నీబుద్ధిలో విక్షేపదోషము కలిగినది. దానితో బుద్ధి ఒక్క క్షణముకూడ స్థిరములేనిదిగ మారిపోయినది. ఏ విషయమును గురించియును స్థిమితముగ ఆలోచించలేదు. ఇప్పుడు ఒక విషయమును కోరినచో ఇంకొక క్షణమునకు మరొకదానిని కోరును. ఒక విషయము ఇప్పుడు మంచిదిగ తోచినచో ఆ విషయమే మరుక్షణముననే చెడ్డదిగ తోచును. ఇటువంటి

శ్రుతివిప్రతిపన్నబుద్ధి ధర్మాధర్మములను కర్తవ్యాకర్తవ్యము లను నిర్ణయించలేక మోహమనెడి గుండమున బడి అవశమై తిరుగుచుండును. ఇట్టి బుద్ధిని పరమాత్మ ధ్యానమునందు స్థితినిపొంది నిశ్చలముగ నిలుచునట్లు చేయవలయును. దానికి ఉపాయము, భగవంతుని గుణలీలావైభవములను గురించియును, ఆయనయొక్క దివ్యమైన జన్మలను దివ్యమైన కర్మలను గురించియును చక్కగ వినుము; విని భగవత్పరాయణుడవుకమ్ము. అప్పుడు ఆ బుద్ధి పరమాత్మ ధ్యానములో నిలుపుటకు స్వాధీనమగును. ఈ వినుట కేవలము భగవదను భవముగల మహాత్ములవద్దకే పోయి వినుము. లేనియెడల ఎవరి అభిప్రాయముల ప్రకారమువారు చెప్పి, పరస్పరవిరుద్ధము లను వినుటచేత నీబుద్ధి మిక్కిలిగ చలించునట్లు చేయగలరు. జాగ్రత్తవహించి భగవదనుభవపరులైన జ్ఞానులు, తత్త్వ దర్శులు అయిన మహాత్ముల చెంతకేగి త్రికరణములచేతను శరణాగతుడవై శ్రవణముచేయుము. అప్పుడు నీబుద్ధి చక్కని బాటలోనికి రాగలదు. ఆబుద్ధి పరమాత్మ ధ్యానములో స్థిరముగ అచలముగనిలిచి ఉండిపోవును.

ఆస్థితిలో నీకు భగవత్ప్రాప్తి రూపమైన యోగము లభించును. అనగా భగవంతునితో నిత్యమైన పూర్ణమైన సంయోగము లభించును. ఇదియే సాధకునియొక్క పరమ గమ్యము. ఇకపైన తెలిసికొనవలసినదియును పొందవలసినది

యును ఏమియుఉండదు. అప్పుడు బుద్ధిలో మలవిక్షేపావరణ ములను మూడుదోషములును వాసనలతోకూడ నశించును. భగవంతునియందు నీబుద్ధి స్థిరముగ నిలిచిపోవును.

(ఈ మూడుదోషములను గురించి మూడవ అధ్యాయములోని ముప్పది యెనిమిదవశ్లోకము యొక్క వ్యాఖ్యానములో చూడుడు.)

అవతారిక :–

భగవంతుని పూర్ణముగ అనుభవించు స్థితప్రజ్ఞుని లక్షణములు వినగోరి అర్జునుడు ప్రశ్నించుచున్నాడు.

అర్జున ఉవాచ :—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా ?
సమాధిస్థస్య కేశవ !
స్థితధీః కిం ప్రభాషేత ?
కిమాసీత వ్రజేత కిమ్ ? ॥౫౪

ప. వి :—స్థితప్రజ్ఞస్య, కా, భాషా, సమాధిస్థస్య, కేశవ ! స్థితధీః, కిం, ప్రభాషేత, కిం, అసీత, వ్రజేత, కిం.

టీక :—

కేశవ ! ఓ కృష్ణా !
సమాధిస్థస్య = భగవత్ప్రాప్తిరూపమైన యోగము నందే స్థిరముగనిలిచిన,

స్థితప్రజ్ఞస్య = స్థితప్రజ్ఞునియొక్క,
భాషాకా ? = మాట్లాడుట ఎట్లుండును ?
స్థితధీః = స్థితప్రజ్ఞుడు,
ప్రభాషేత కిం = ఎట్లు మాట్లాడును ?
కిం ఆసీత ? = ఎట్లుకూర్చుండును ?
కిం వ్రజేత ? ఎట్లుచరించును ?

తా. అర్జునుడడుగుచున్నాడు : కేశవా ! ఆ విధమున భగవత్ప్రాప్తిరూపమైన యోగమునందే స్థిరముగనిలిచిన బుద్ధిగల స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములేమి ? ఎట్లు మాట్లాడును ? ఎట్లు కూర్చుండును ? ఎట్లు నడచును ?

## అ మృ త వా హి ని :—

ఈ శ్లోకములో అర్జునుడు కృష్ణపరమాత్మను, 'కేశవా!' అని సంబోధించుచున్నాడు. కేశవుడవుకృష్ణా నీవు, కనుక నీవే నా ఈ ప్రశ్నకు సమాధానము ఉన్నదున్నట్లు చెప్పగలవు. ఇంకెవరును చెప్పలేరు అని భావము.

కేశవ = (1) కశ్చ ఈశశ్చ యః ద్వశేన వర్తంతః సః కేశవః అనగా. క = బ్రహ్మ, ఈశ = శివుడు, ఈ ఇద్దరును ఎవరివశమున నుందురో, వాడు కేశవుడు.

(2) కేశివధాద్వా కేశవః = "యస్మాత్త్వయైవదుష్టాత్మా హతః కేశీ జనార్దనః, తస్మాత్కేశవనామ్నాత్వం లోకేజ్ఞేయో భవిష్యసి" (ఇతి విష్ణుపురాణే)

అనగా 'నీవు దుష్టుడైన కేశి అను రాక్షసుని సంహారించుటచేత 'కేశవుడు' అను పేరుతో లోకమందు ప్రసిద్ధుడవు కాగలవు.'

'నీవు పరబ్రహ్మవు మహాప్రభో। నీవే నా ఈ ప్రశ్నకు సమాధానము చెప్పి నాచిత్తమునకు శాంతి చేకూర్చగలవుగాని, ఇతరులవలన కాదు అని భావము.

స్థితప్రజ్ఞుడు, సమాధిస్థుడు అని రెండు విశేషణములు కలవు. పరమాత్మయందు పూర్తిగ అచలముగ స్థిరముగ మనస్సు స్థాపనచేసి పరిపూర్ణపరమాత్మానుభవముకలిగినవారు అనెడి భావమును తెలుపుటకై ఈ రెండువిశేషణములు ప్రయోగింపబడినవి. అటువంటిమహాత్ములకు ఈ చెప్పబోవు లక్షణములు సహజములు. సాధకునకు ప్రయత్నించి సంపాదించుకొనవలసినవి.

అర్జునుడడుగుచున్నాడు :- కేశవా! పరిపూర్ణ పరబ్రహ్మానుభవముగల మహాత్ముని లక్షణములెట్లుండును? ఎట్లు మాట్లాడును? ఎట్లు కూర్చొనును? ఎట్లు నడచును?

ఈ శ్లోకములో "కాభాషా" అనునప్పుడు, భాష అనగా అర్థము లక్షణము అనియే గ్రహించవలయును, 'వాక్కు'

అని అర్థము చెప్పినయెడల 'కింప్రభాషేత ?' అని ప్రయోగింప బడియున్నది. కనుక, 'భాషా' పదమును "భాష్యతే కథ్యతే అనయా ఇతిభాషా' అనగా 'దేనిచేత వస్తువుయొక్క స్వరూపము చెప్పబడుచున్నదో ఆ లక్షణమునకు భాష అనిపేరు.'

అ వ తా రి క :—

అర్జునుడడిగిన నాలుగుప్రశ్నలకును కృష్ణపరమాత్మ పదునెనిమిది శ్లోకములలో సమాధానము చెప్పుచు ఈఅధ్యాయము పూర్తిచేయుచున్నాడు.

శ్రీభగవా నువాచ :—

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్
సర్వాన్ పార్థ! మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్ట
స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౫

ప. వి :- ప్రజహాతి, యదా, కామాన్, సర్వాన్, పార్థ, మనోగతాన్, ఆత్మన్యేవ, ఆత్మనా, తుష్టః. స్థితప్రజ్ఞః. తదా. ఉచ్యతే.

టీక :—

ప్రార్థ ! = ఓ అర్జునా !
యదా = ఎప్పుడు.

మనోగతాన్ = మనస్సునందుండెడి,
సర్వాన్ = సమస్తమైన,
కామాన్ = కోరికలను,
ప్రజహాతి = విడుచుచున్నాడో,
ఆత్మనా = (తనచేత) ఆత్మ చేత
ఆత్మన్యేవ = పరమాత్మయందే
తుష్టః = ఆనందముగలవాడై
(భవతి = అగునో)
తదా = అప్పుడు
స్థితప్రజ్ఞః ఉచ్యతే = (వాడు) స్థితప్రజ్ఞుడనబడు చున్నాడు.

తా. ఓ అర్జునా! ఎప్పుడు మనోగతములైన సర్వకాంక్షలను పూర్తిగ వదలివేయుచున్నాడో, పరమాత్మయందే ఆనందించుచున్నాడో, అప్పుడు 'స్థితప్రజ్ఞుడు' అని చెప్పబడుచున్నాడు.

అమృతవాహిని:—

అర్జునా! ఇహలోక పరలోక సంబంధమైన ఏ పదార్థములును, భోగములును లభించినప్పుడుగాని, నశించినప్పుడు గాని, పొంగుట, క్రుంగుట లేక, ఏవిధములైన కాంక్షలు ఎంత మాత్రమును అంతఃకరణమునందు కలుగకుండ నుండుస్థితి ఎప్పుడు కలుగునో, కాంక్షలేకాదు వాటి వాసనలుకూడ ఉండవో - అంతమాత్రముతో చాలదు; సర్వకాల సర్వావస్థల

యందును ఒక్క పరమాత్మయందే ఆనందించుచుండునో అట్టి మహాత్ముడు స్థితప్రజ్ఞుడు.

మనస్సులో కామములున్నంతకాలము ఆ మనస్సు పరమాత్మయందు స్థిరముగ నిలువదు. కాని ఆ కామములను మనకు శక్తికలుగువరకు త్రోసివేయుచు, మనసు పరమాత్మ యందు స్థిరముగ నిలువకపోయినను కొంచెము కొంచెముగ నిలుపుచున్న యెడల పరమాత్మయందు నిలిచినకొలదిని మనస్సు లోని కామములు దూరమగుచుండును. అదివరకటి కంటె కామ ములు కొంచెము తగ్గిన చిత్తమును పరమాత్మయందు నిలు పుట మరల కొంచెము సులభము. ఇట్లే శక్తియున్నంత వరకు మనస్సును పరమాత్మయందు నిలుపుటకు ప్రయత్నించు చున్నచో నెమ్మదినెమ్మదిగ, మనస్సులోని కామములన్నియును పూర్తిగ నశించును. అప్పుడు ఆ మనస్సు పరమాత్మయందు అచలముగ, స్థిరముగ నిలువగలదు. కామముయొక్క వాస నలు ఎంతకొద్దిగ ఉన్నను మనస్సు స్థిరముగ నిలువదు. కనుక స్థితప్రజ్ఞుని లక్షణములలో మొట్టమొదటిది 'సర్వాన్ కామాన్ ప్రజహాతి' మనస్సులోగల సర్వకామములను పూర్తిగ విడు చుటగా చెప్పబడినది.

పరమాత్మానుభవము శరీరగతముగాని, ఇంద్రియ గతముగాని, మనోగతముగాని, బుద్ధిగతముగానికాదు; ఆత్మ గతము. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఎవరికి పూర్తిగ వశపడి స్వాధీనములో ఉండునో వాడుమాత్రమే

పరమాత్మానుభవములో మునుగగలడు. ఎవనిని ఈ శరీరేం ద్రియమనోబుద్ధులు కలతబెట్టునవిగ ఉండునో వానికి పర మాత్మానుభవము కుందేటికొమ్ము. పరమాత్మానుభవమునకు ముందే శరీరేంద్రియమనోబుద్ధులు మేలిమిబంగారమువలె పరిశుద్ధములై యుండునుగనుక అట్టివాడు పరమాత్మానుభవ ములోఉండును. అనగా ఆత్మ పరమాత్మలో లీనమై యుండును. అట్టివాని శరీరము ప్రారబ్ధకర్మ చేత ఇంకను ఈ లోకములో ఉన్నయెడల అట్టివాని శరీరేంద్రియమనో బుద్ధులద్వారా కర్మలు జరుగుచున్నను ఆ కర్మలు వానిని బంధించలేవు. బంధించలేక పోవుటయేకాక లోకకళ్యాణమునకు హేతువులగును. 'ఆత్మన్యే వాత్మనాతుష్టః' అనుటలో భావమిది.

ఈ స్థితికలిగినసమయమున వానిని 'స్థితప్రజ్ఞుడు' అను చున్నాడు గీతాచార్యుడు.

ప్రశ్న : 'ఆత్మన్యే వాత్మనా తుష్టః' అనగా 'ఆత్మచేత ఆత్మయందే సంతోషించువాడు' అని అర్థముగదా ! దీనిని బట్టిచూచినచో 'ఆత్మవేరు, పరమాత్మవేరు, ఎప్పటికైనను ఈ జీవుడు పరమాత్మను పొందినప్పుడే, ఆనందమనుభవించ గలడు' అను వాదము ఖండింప బడుటలేదా ?

సమా : లేదు. ఇంతమాత్రముచేత పరమాత్మ వేరుగా లేడని అర్థము తీయరాదు. ఆత్మ ఆత్మయందు సంతోషించును.

అనగా తాను ఆత్మయందే సంతోషించును. ఈ ప్రాపంచిక విషయముల యందుకాదు. అయితే తాననగా ఎవరో ముందుగ తెలిసికోవలయును. 'తాను' అనగా ఆత్మ. ఆత్మకు ఆత్మ పరమాత్మ. ఆత్మ తన ఆత్మయందుఁ అనగా తనకు ఆత్మయైన పరమాత్మయందు సంతోషించును అని అర్థము చెప్పవలయునేగాని పరమాత్మనువదలి కేవలము తనయందే ఆనందించును అని చెప్పరాదు.

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనా
సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధ
స్థితధీ ర్మని రుచ్యతే ॥ ౫౬

ప. వి. :— దుఃఖేషు, అనుద్విగ్నమనాః. సుఖేషు, విగతస్పృహః, వీతరాగభయక్రోధః, స్థితధీః, మునిః, ఉచ్యతే.

టీక :—

దుఃఖేషు = దుఃఖములయందు,
అనుద్విగ్నమనాః = ఎవనిచిత్తము కంపింపదో,
సుఖేషు = సుఖములయందు,
విగతస్పృహః = (ఎవడు) కాంక్షలేనివాడో,
వీతరాగభయక్రోధః = ఆసక్తి, భయము, క్రోధము,
పూర్తిగ నశించిపోయినవాడో,

మునిః = (అట్టి) ముని,
స్థితధీః = స్థితప్రజ్ఞుడు అని,
ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. దుఃఖములు ప్రాప్తించినప్పటికిని ఎవని మనస్సు ఉద్రిక్తతను పొందదో అట్లే సుఖములయందుకూడ ఎవనికి స్పృహలేదో, ఎవనికి ఆసక్తి, భయము, క్రోధము పూర్తిగ నశించి పోయినవో అట్టి ముని స్థితప్రజ్ఞ డనబడు చున్నాడు.

అమృతవాహిని :—

అర్జునా ! స్థితప్రజ్ఞుడెటులుండునో ఇంకను చెప్పెదను వినుము. దుఃఖములమీద దుఃఖములు కలుగుచున్నప్పటికిని, స్థితప్రజ్ఞుని మనస్సులో ఈ షణ్మాత్రమైనను వికారము కలుగదు. ఇంక ఉద్రిక్తత విషయము చెప్పవలయునా ! సాధారణముగ ప్రపంచములో సామాన్య మానవులు ప్రతి చిన్న విషయమునకును ఉద్రిక్తతను చెందుచుందురు.

ఎప్పుడైనను ఏకారణముచేనైనను ఒకనికి ఒక వేయి రూపాయలు చేతికి చిక్కినయెడల ఇక ఆ ఆనందములో సర్వమును మరచిపోవుట చూచుచున్నాముగదా! ఆ ఆనందములో ఇటునటు పరుగెత్తుటలో గోడగాని గుమ్మముగాని నెత్తికో ముఖమునకో తగిలి నెత్తురుకారుచున్నను ఆతనికి తెలియదే! 'అయ్యో ! నెత్తురు కారుచున్నదేమి' అని ఎవ

రైనను చెప్పినను దానిని లక్ష్యము చేయక ఏమియును లేదు అని, చేతితో రక్తమును తుడుచుకొనుటకుగూడ అవకాశము లేక ఆనందపడుచుండునే! తుచ్ఛమైన ప్రాపంచికానందములో కూడ అల్పమైన ఈ ఆనందమునకే వానికి ఈ కష్టము దుఃఖము తెలియుటలేదే!

ఇక ఏ జమీందారో ఏ అధికారియో "నీవు సాయంకాలము ఆరుగంటలకు రావలసినది, పదిఎకరములభూమి నీకు బహుమతి చేయదలచినాము" అని కాగితము పంపిన ఇక చూడవలె ఆ గంతులు! ఆ ఆనందము ముందు "ఇదిగో! ఈ కొంచెము ఫలాహారముచేసి పో నాయనా!" అని తల్లి చెప్పుచున్నను ఆ ఫలాహారము మీదగాని ఆ తల్లి మాట మీదగాని మనసుండునా? అది వరకు ఏ స్నేహితులు కనుపించకపోయిన, ఏ దేహబంధువులు పలుకరింపకపోయిన తాను బ్రతుకలేననుకొనుచుండువాడో వారేవచ్చి మధ్యలో పలుకరించినను పలుకునా! అసలు పలుకరించినట్లు ఆ హడావుడిలో తెలియునా?

అకస్మాత్తుగ, ఏ లాటరీలోనో ఒక్కసారిగా ఏ లక్షరూపాయలో రాగా ఆ ఆనందము తట్టుకొనలేక ప్రాణములు పోయినవారు కూడ కలరు.

ఇక దుఃఖముల విషయములో చూచిన, ఏ చిన్న కష్టమునకు నష్టమునకుగూడ తట్టుకొనలేక గోలచేయుచుండును,

ఇంటిలో ఏ చంటిబిడ్డకైనను కొంచెము తలకాయ నొప్పి వచ్చిన ఆ వైద్యునివద్దకు ఈ వైద్యునివద్దకు పరుగులు పెట్టు చుందురు. తమకు రావలసిన బాకీ ఒక్క రూపాయవద్ద ఎదుటి వారితో పోట్లాడి, చివరకు కోర్టువరకుపోయి, కోర్టుచుట్టు తిరిగి, చాలా బాధలు పడుదురు. ఆ బాధలన్నియును ఆ ధనముమీద కాంక్ష చేత వారికి బాధలుగా కనుపించవు.

ఇట్లు తుచ్ఛమైన అల్పమైన ఈ ప్రాపంచిక విషయ ములవలన సుఖదుఃఖములలో మునిగినవారే శారీరక మానసిక సుఖదుఃఖములను లెక్కచేయక తిరిగెదరే ! ఇక సకలకల్యాణ గుణ పరిపూర్ణుడైన, కేవలము దయాసింధువైన ఆ సచ్చిదా నంద ఘనపరబ్రహ్మసాగరములో మునిగి తేలుచు ఈదులాడు వానికి ఈ ప్రాపంచికకష్టములు, దుఃఖములు హిమాలయము లంతటివైనను చిత్తమును ఈ వఱ్ఱమాత్రమైనను కలతచెందించ గలవా ? అసలు అవి కష్టములుగ దుఃఖములుగ గోచరించునా? "దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః" అనగా ఇదియే భావము.

"వీతరాగభయక్రోధః" అనగా స్థిత ప్రజ్ఞునకు రాగము, భయము, క్రోధము పూర్తిగ నశించి పోవును అని భావము. సూర్యోదయమగు నప్పటికి అంధకారమెట్లు నశించిపోవునో, అట్లే మనపై భగవత్కరుణ ప్రసరించు నప్పటికి చిత్తములో రాగము, భయము, క్రోధము నశించి పోవును.

ఎవని చిత్తములో దుఃఖములయందు ద్వేషము సుఖములయందు రాగముకలదో, వానికి మాత్రమే దుఃఖములు కలుగునేమో యని భయము. సుఖములు పోవునేమో యను భయము సర్వకాలములయందును వెంటాడుచుండును. దుఃఖనివారణ విషయములో సహాయము చేసినవారియందును సుఖప్రాప్తి విషయములో తోడ్పడిన వాని విషయమునను రాగము కలుగుచుండును. ఎవడు తన దుఃఖములకు కారణమైనాడో, తన సుఖమునకు ప్రతిబంధకమైనాడో, వానియందు ద్వేషము క్రోధము కలుగుచుండును. కాని కేవలము ఆ సచ్చిదానంద ఘనపరబ్రహ్మ సాగరములో మునిగియుండు వానికి, ఈ ప్రాపంచిక సంబంధమైన దుఃఖములయందును సుఖములయందును స్పృహ ఎట్లుండును ? ఇక వానికి రాగము, భయము, క్రోధము ఎవనియందు కలుగవలయును ? ఎందుకు కలుగవలయును ? కలుగనే కలుగవు సరిగదా వాని చిత్తము లోనికి తొంగిచూచుటకైనను వాటికి అధికారము లేదు.

ఇక్కడ 'ముని' అనగా పరమాత్మప్రాప్తికొరకు సాధన చేయువాడు అని అర్థము. 'ముని' ఈ స్థితికి వచ్చినప్పుడు వానిని స్థితప్రజ్ఞుడు అందురు.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ
స్తత్తత్ప్రాప్య శుభాశుభం ।
నాభినందతి నద్వేష్టి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౭

ప. వి :— యః, సర్వత్ర, అనభిస్నేహః, తత్, తత్, ప్రాప్య శుభా
శుభం, న, అభినందతి, న, ద్వేష్టి, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.

టీక :—

యః = ఎవడు
సర్వత్ర = అంతట (తన దేహము మొదలగు సమస్త
మందును),
అనభిస్నేహః = అభిమానము లేనివాడో
తత్తత్ శుభాశుభం ప్రాప్య = తనకు ఆయా శుభములు
అశుభములు ప్రాప్తిం
చినను,
నాభినందతి = ఆనందించడో,
న ద్వేష్టి = ద్వేషించడో,
తస్య = వానియొక్క,
ప్రజ్ఞా = బుద్ధి,
ప్రతిష్ఠితా = స్థిరమైనది.

తా. ఎవరికి తనదేహము మొదలగు వేటియందును అభిమానము లేదో, ఎట్టిశుభము ప్రాప్తించినను ఎంతటి అశుభము ప్రాప్తించినను ఆనందించుట ద్వేషించుట చేయడో వాడు స్థితప్రజ్ఞుడు.

అ మృ త వా హి ని :—

అర్జునా! సాంసారిక మానవుడు భార్య, పుత్రులు, సోదరులు మొదలగు దేహబంధువులయందు మమకారము,

ఆసక్తి బలముగ కలిగియుండుటచే రాత్రింబవళ్ళు ఆ సంగము లోనే మోహితుడై యుండును. అతని ప్రతిచిన్న పనియందును ప్రతిమాటయందును ఇంద్రియములయొక్క ప్రతిచిన్న చేష్ట యందును మమకారసంబంధమైన మోహము పైకి ఉబుకు చునే యుండును. కాని స్థితప్రజ్ఞునకు ఈ మమకారము, ఆసక్తి మొదలగునవి ఎంతమాత్రమును ఉండవు. ఆతని అంతః కరణములో పరిశుద్ధమైన అప్రాకృత ప్రేమప్రవాహము అవిరళ ముగ ప్రవహించుచుండును. కాబట్టి ఆతనికి తనవారనిగాని పెరవారనిగాని లేక,సమస్త జీవకోటులయందును సమభావమున నిష్కారణ ప్రేమప్రవాహము కట్టలు తెంచుకొని ప్రవహించు చుండును. ఆతనిహృదయములో మమకారమునకును ఆసక్తి కిని సంబంధించిన ప్రేమఉండదు. ఆతని సంభాషణగాని, కర్మలుగాని ఇంద్రియచేష్టగాని, మమకారాది దోష రహితమైన విశుద్ధప్రేమమయములుగ ఉండును. అట్టివానికి శుభాశుభములని రెండు విధములుండవు. కనుక శుభమును అనగా ప్రియమును ప్రేమించుట, అశుభమును అనగా అప్రియ మును ద్వేషించుట అనునది ఆతని అంతఃకరణములో ఉండు టకు వీలులేదు. కనుక వానికి శుభము కలిగినను అశుభము కలిగినను అనగా ప్రియము కలిగినను అప్రియము కలిగినను ఆతడు ఆనందించుటగాని, ద్వేషించుటగాని చేయడు అని సామాన్య మానవదృష్టిలో చెప్పబడినది. జాగ్రత్తగ ఆలో చించి చూచిన ఆసక్తియే రాగద్వేషములకును అనేక అనర్థ

ములకును మూలకారణము. ఆసక్తి బీజముతో కూడ నశించిన స్థితప్రజ్ఞునకు రాగద్వేషములుగాని వికారములుగాని కలుగుట అసంభవము.

అట్టి స్థితప్రజ్ఞునకు ప్రారబ్ధము ప్రకారము ఇంకను ఈ లోకములో దేహము జీవించియున్న యెడల, అట్టివానిని జీవన్ముక్తుడు అందురు. అట్టివాని దేహమునకు ప్రారబ్ధ కర్మవశమున అనుకూల ప్రతికూలములు - ప్రియా ప్రియములు - సంభవించినను, చిత్తములో ఏ మాత్రమును వికారము కలుగదు.

"నాస్థా ధర్మే నవసునిచయే నైవ కామోపభోగే ।
యద్భ ద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మాను రూపం ।
ఏ తత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి ।
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు॥"

అన్న స్థితిలో ఉండును.

యాదవభాగ్యరాశియైన కృష్ణపరమాత్మ పాదారవింద భక్తి రసామృత మహాబ్ధిలో మునుకలు వేయు వానికి ఈ ప్రాపంచిక అనుభవములలో ఇష్టమని అనిష్టమని, ప్రియమని, అప్రియమని, శుభమని అశుభమని, లాభమని, నష్టమని, జయమని అపజయమని ఉండునా ? అసలు తట్టునా? ఏది జరిగినను, ఏదిలభించినను అన్నియును భగవత్ప్రసాదమని ఆనందముతో స్వీకరించును. ఇక వానికి రాగద్వేషము లెట్లు కలుగును ?

ఎందుకు కలుగును ? ఎవరియందు వేనియందు కలుగును ? సదా సర్వదా సర్వత్ర ఆనందమే అనుభవించుచుండును. అట్టివాడు స్థితప్రజ్ఞుడు.

శ్లో॥ యదా సంహరతే చాయం
కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౫౮

ప. వి :— యదా, సంహరతే, చ, అయం, కూర్మః, అంగాని. ఇవ. సర్వశః, ఇన్ద్రియాణి, ఇంద్రియార్థేభ్యః, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.

టీక :—

కూర్మః = తాబేలు,
అంగాని = తన అవయవములను,
సంహరతే, ఇవ = (లోపలకు) ముడుచుకొనునట్లు,
అయం = ఈతడు,
యదా = ఎప్పుడైతే.
సర్వశః = అన్నివైపులనుండి,
ఇంద్రియాణి = తన ఇంద్రియములను,
ఇంద్రియార్థేభ్యః = ఇంద్రియములయొక్క విషయములనుండి,

సంహరతే = మరలించుకొనుచున్నాడో,
తస్య = వానియొక్క
ప్రజ్ఞా = బుద్ధి
ప్రతిష్ఠితా = స్థిరమగుచున్నది.

తా. తాబేలు తన అవయవములను ఎట్లులోపలకు ముడుచు కొనునో, అదేవిధమున బాహ్య విషయములనుండి ఎవడైతే తన ఇంద్రియములను ఎప్పుడు మరలించుకొనగలుగునో, అప్పుడు వాడుస్థిత ప్రజ్ఞుడు.

**అ మృ త వా హి ని :—**

తాబేలు తన అవయవములను లోపలకు ముడుచుకొన గలదు. అదేవిధమున స్థితప్రజ్ఞుడు తన ఇంద్రియములను ఇంద్రి యార్థములైన బాహ్య విషయములనుండి మరలించి చిత్త మును పరమాత్మయందే స్థిరముగా నిలుపుకొనును.

తాబేలునకు లోపలకు ముడుచుకొనుటకును, పైకి తెచ్చు కొనుటకును తన అవయవములు ఎంతిగా స్వాధీనములో నుం డునో, అట్లే స్థితప్రజ్ఞునకును తన శరీరేంద్రియ మనోబుద్ధులు అత్యంతము స్వాధీనములై యుండును.

ఇచ్చట తాబేలు ఉపమానమునకు కొంతమంది ఇట్లు అర్థము చెప్పుచున్నారు-

"తాబేలు తనకు అవసరమైనపుడు తన అవయవములను పైకి తెచ్చుకొని, అవసరము తీరగనే మరల లోపలకు ముడుచు

కొనునట్లు, స్థితప్రజ్ఞుడు కూడ విషయోపభోగము లనుభవించవలయునని కాంక్ష జనించినప్పుడు, తన ఇంద్రియములను విషయములవైపునకు త్రిప్పుకొని, పనితీరిన వెంటనే తన ఇంద్రియములను మరల ఉపసంహరించుకొనును."

కాని ఈ అర్థము పొసగదు సరికదా చాల హాస్యాస్పదముగా కూడ నుండును. ఎందుకనగా, లోకములో ప్రతి మానవుడు చేయునది ఇట్లేగదా! ప్రతి మానవుడేమి - ప్రతి జీవియు చేయుచుండినదియేకదా! ఇక సాధకునకును సామాన్యునకును భేదమేమున్నది? సాధకుడే చేయుడన్నచో ఇక స్థితప్రజ్ఞుడు చేయునా? స్థితప్రజ్ఞునకు అసలు విషయములవైపునకు దృష్టి పోవునా? కాంక్షకలుగునా? ఉపమానమును ఏకదేశములోనే తీసికొనవలయునుగాని, అన్ని విధముల పోలిక తీసికొనరాదు. కాబట్టి అట్లు అర్థము చెప్పరాదు.

సామాన్య మానవులకు శరీరేంద్రియ మనోబుద్ధులు స్వాధీనములో ఉండవు. వాటి ఇష్టమువచ్చినట్లు అవి విషయోపభోగములలో తిరుగవలసినదే. వారికి వాటిమీద ఏమియును అధికారముండదు. పోనీ ఏకారణముచేతనైనను ఇంద్రియములను నిగ్రహించి కూర్చొన్నను, తన మనోరాజ్యములో ఇంద్రియములద్వారా సూక్ష్మ విషయముల భోగించుచునే యుండును. ఇది స్వప్నములో జరుగుచుండుటకలదు. మరి ఇంద్రియ జితుడైనచో జాగ్రదవస్థలోకూడ జరుగు

చుండును. కాబట్టి 'సర్వశః' 'అత్యంతము స్వాధీనములో ఉండును' అని చెప్పబడినది. అనగా మనోరాజ్యములో సూక్ష్మ విషయ భోగములనుండి కూడ ఇంద్రియములు మరలించబడి ఉండును. అప్పుడు అతని బుద్ధి పరమాత్మయందు స్థిరముగ ప్రతిష్ఠింపబడియుండును. అటువంటివానిని స్థితప్రజ్ఞుడు అన వలయును.

శ్లో॥ విషయా వినివర్తన్తే
నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య
పరం దృష్ట్వా నివర్తతే ॥ 59

ప. వి ;—విషయాః, వినివర్తన్తే, నిరాహారస్య, దేహినః, రసవర్జం, రసః, అపి, అస్య, పరం, దృష్ట్వా, నివర్తతే.

టీక :—

నిరాహారస్య = ఆహారము తీసికొనని,
దేహినః = పురుషునకు,
రసవర్జం = ఆసక్తి తప్ప,
విషయాః = విషయములు,
వినివర్తన్తే = నివృత్తములగుచున్నవి,
అస్య = ఈ పురుషునకు,

పరం = పరమాత్మను,
దృష్ట్వా = సాక్షాత్కరింప జేసికొనిన మీదటనే,
రసఃఅపి = ఆసక్తికూడ,
నివర్తతే = నివృత్తమగుచున్నది.

తా. ఆహారము లేని పురుషునకు విషయములు మాత్రము నివృత్తము లగుచున్నవి. కాని రసము (ఆసక్తి) మాత్రము నివృత్తి చెందుటలేదు. ఇతనికి పరమాత్మ సాక్షాత్కార మగుటచే, ఈ రసము (ఆసక్తి) కూడ నివర్తించుచున్నది.

అ మృ త వా హి ని :—

అర్జునా! పురుషుడు ఆహారము పుచ్చుకొనకపోవుటచే ఉపవాసాదులచే ఇంద్రియములు విషయానుభవమునకు శక్తి లేనివి అగుచున్నవి. కనుక విషయములు మాత్రము నివర్తించుచున్నవి. కాని ఆ విషయముల యందుండెడి ఆసక్తి మాత్రము నివర్తించదు. అది కేవలము పరమాత్మ సాక్షాత్కారము చేతనే నివర్తించవలయును.

అంతేకాదు. ఇంద్రియములకు విషయములు ఆహారము. కనుక ఇక్కడ ఆహారమనగా 'విషయములు' అని అర్థము చెప్పవలయును. ఇంద్రియములవలన బాహ్యవిషయముల ననుభవించక నిలిపినను, విషయములందలి ఆసక్తిమాత్రము పోవుటలేదు. ఆ ఆసక్తికూడ పోవలయునన్నచో పరమాత్మ

సాక్షాత్కారము కావలయును. పరమాత్మ సాక్షాత్కార మగుటచేతనే ఆసక్తి నివర్తించును. రసమనగా ఆసక్తి. ఆసక్తి నశించనంతకాలము ఇంద్రియవృత్తులు మాత్రము విషయములవైపునకే పరుగులెత్తుచుండును. వృత్తులు కూడ అణగనిది బుద్ధి స్థిరముగ నిలువదు. స్థితప్రజ్ఞునకు రసము కూడ నివర్తించినది. ఆసక్తి నశించినది. కనుక ఇంద్రియవృత్తులు అణగినవి. కారణము వానికి పరమాత్మసాక్షాత్కారమైనది గనుక, ఆ పరబ్రహ్మరసము రుచి దొరకినది గనుక. అతని ఇంద్రియ మనోవృత్తులన్నియును వెనుకచూపు లేక, నిలుకడ అనునది లేక, ఆ సచ్చిదానందఘన పరబ్రహ్మమువైపునకే, ద్రుతగమనముతో ప్రవహించుచుండును.

'ఇంద్రియములద్వారా విషయము లనుభవించుట నిలిపినను, ఆసక్తిమాత్రముపోదు' - అనగా వివరముగ చెప్పవలయును.

లోకానుభవమును ఉదాహరణముగ చూపుదుము.

పెక్కుమంది ఏవేవో ఇతర కారణములచేతనైనను,విష యములను విడుచుచున్నారు. రోగము చేతనో, భయము చేతనో, పట్టుదలచేతనో ఇట్లు జరుగుచుండును. రోగి తన కిష్ట మైన పదార్థమును తినడు. నిజమే. కాని వానికి ఆసక్తి పోలేదు. ఆ పదార్థము తినినచో రోగము హెచ్చునను కార

ణమున మానినాడు. కాని, ఆసక్తిమాత్రము బాగుగనే యుండును.

కొంతమంది విషయలోలురు కొన్ని విషయము లనుభవించుటను అనేక భయములచే మానవచ్చును. వారికి వాటి యందలి ఆసక్తిమాత్రము పూర్తిగనే యుండును.

ఇట్లే బలాత్కారముగ ఇంద్రియములను విషయముల నుండి మరలించుచున్నారు. కాని, ఆసక్తి పోవుటలేదు. ఆ ఆసక్తి పరమాత్మ సాక్షాత్కారముచేతనే నశించుచున్నది.

అయితే ఆసక్తి ఎట్లును పోవుటలేదు గనుక, విషయములను త్యజించుట ఏల అనుభావము తీసికొనరాదు. సక్రమమైన పద్ధతులలో, విషయములను త్యజించి, పరమాత్మ సేవలో ఇంద్రియములను మనస్సును పూర్తిగ వినియోగించిన యెడల నెమ్మది నెమ్మదిగ పరమాత్మ సాక్షాత్కారమునకు అర్హత కలుగును. అట్లు అర్హుడగుచున్న కొలదిని, ఆసక్తి కొంచెము కొంచెముగ నశించుచుండును. కాని పూర్తిగా ఆసక్తి నశించుట మాత్రము పరమాత్మ సాక్షాత్కారము చేతనే.

కొంతమంది వ్యాఖ్యాతలు రసము అనగా ఆసక్తి అని అర్థము తీయక మనస్సుతో విషయములను అనుభవించుట అని అర్థము తీసినారు. కాని, అట్లు తీయరాదు.

ఆసక్తి వేరు, అనుభవించుట వేరు. ఆసక్తి యొక్క కార్యము అనుభవించుట, అనుభవించుటకు కారణము ఆసక్తి. అనుభవించుట అని అర్థముతీసిన, వాడు మిథ్యాచారుడు అగుచున్నాడు. మిథ్యాచారునికి ఎన్నడైన పరమాత్మ సాక్షాత్కారము అగునా ? ఆసక్తి నశించునా ? ఇక్కడ ప్రసంగము సాధకుని గురించి. సాధకుడు ప్రారంభదశలో నెమ్మది నెమ్మదిగ విషయములను త్యజించుట మొదలుపెట్టును. చివరకు పూర్తిగకూడ వదలిపెట్టును. అట్టివానికి ఇది ఒక హెచ్చరిక - మనము విషయములను పూర్తిగ వదలగలిగితిమి అని అజాగ్రత్తతో నుండవద్దని. నీవు విషయములను వదలిపెట్టినను, నీ మనస్సులో నీకు తెలియకుండ ఆసక్తి ఉండును. ఆసక్తి ఉన్నంతకాలము ఇంద్రియవృత్తుల ప్రవాహము విషయముల వైపు నుండి నిగ్రహింపబడినదేగాని ప్రవాహము ఆగలేదు. కనుక అజాగ్రత్తతో నుంటివా, ఒక్క చిన్న ప్రమాదము బోల్తా కొట్టించగలదు. కనుక ఈ జాగ్రత్త ఎంతవరకుండవలయు ననగా, పరమాత్మ సాక్షాత్కారమగువరకును ఉండవలయును. ఆ సాక్షాత్కారముతో ఆసక్తి పూర్తిగ నశించును. అంతటితో ఇంద్రియవృత్తులడగును. ఇక పతనభయము లేదు. చచ్చినపాము కరచుసని భయముండునా ?

స్థితప్రజ్ఞునకు ఈ ఆసక్తికూడ నశించినది. అనగా పరమాత్మ సాక్షాత్కారమైనవానినే స్థితప్రజ్ఞు డనవలయును.

కనుక స్థితప్రజ్ఞునకు విషయములు మాత్రమే నివర్తించుటకాదు. దీనికి కారణమైన ఆసక్తి, ఆసక్తికి కారణమైన అజ్ఞానము పూర్తిగ మూలముట్టుగ నశించినవి. మిగిలినవారి త్యాగములోను, ఇతని త్యాగములోనుగల వైలక్షణ్యము ఇది.

**అ వ తా రి క :—**

ఆసక్తి నాశనముకాక, కేవలము విషయముల నివృత్తి మాత్రమే అయిన చాలదు అని చెప్పి, దాని చేత కలుగు నష్టమును చెప్పుచున్నాడు.

శ్లో॥ యతతోహ్యపి కౌంతేయ !
పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని
హరంతి ప్రసభం మనః ॥ ౬౦

ప. వి :—యతతః, అపి, హి. కౌంతేయ, పురుషస్య, విపశ్చితః, ఇంద్రియాణి, ప్రమాథీని, హరంతి, ప్రసభం, మనః.

టీక :—

కౌంతేయ ! = ఓ కుంతీపుత్రా !
యతతః = మోక్షము కొరకు ప్రయత్నించునట్టియును,
విపశ్చితః = వివేకవంతుడైనటువంటియును,

పురుషస్య = పురుషుని,
మనః అపి = మనస్సునుకూడ,
ప్రమాథీని = కలతబెట్టుటయే స్వభావముగాగల,
ఇంద్రియాణి = ఇంద్రియములు,
ప్రసభం = బలాత్కారముగ,
హరన్తిహి = ఆకర్షించుచున్నవిగదా-విషయములందు
ప్రవర్తింప జేయుచున్నవిగదా !

తా. అర్జునా ! ఆసక్తి నశించకపోవుటచేత, కలతబెట్టుటయే స్వభావముగాగల ఇంద్రియములు, మోక్షమునకై యత్నించు నట్టియును, వివేకవంతుడైనట్టియును పురుషుని మనస్సును కూడ బలాత్కారముగ హరించుచున్నవి.

అ మృ త వా హి ని :—

అర్జునా ! ఇంద్రియములు ఎంతబలమైనవో తెలియునా? సామాన్యమానవుని మాట చెప్పవలయునా ? వివేకవంతులై మోక్షమునకు ప్రయత్నించువారి మనస్సునుకూడ, బలాత్కారముగ విషయముల వైపునకు లాగివడవేయును. దీనికి కారణము మనస్సులో ఉండిన ఆసక్తియే. మనస్సులో ఆసక్తి ఉన్నంతకాలము మానవుడు ఎంత జాగ్రత్తతోనున్నను ఇంద్రియములు ఆతని మనస్సును లాగగలవు. ఇంద్రియముల విషయములో, జయించితిమిగదా యని మైమరచి ఉండవద్దని హెచ్చరిక. ఇంద్రియములను గురించి మనుధర్మశాస్త్రములో

కూడ "బలవా నింద్రియగ్రామో, విద్వాంసమపి కర్షతి" (౨-౨౧౫) అని ఇంద్రియ నిగ్రహము చేయువారలకు అజాగ్రత్త వలదని హెచ్చరిక ఇచ్చుచున్నాడు.

భాగవతములో నారదభగవానులు వ్యాసులవారితో "యమనియమాది యోగముల నాత్మ నియంత్రితమయ్యు కామ రోషముల ప్రచోదితంబయగు శాంతి వహింపదు" అని చెప్పియున్నారు.

అ వ తా రి క :—

అయితే ఆసక్తి నశించుటకు ఏమి చేయవలయును అను సందేహమునకు సమాధానము ఈ శ్లోకములో చెప్పు చున్నాడు -

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః ।
వశేహి యస్యేంద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౧

ప. వి :— తాని, సర్వాణి, సంయమ్య, యుక్త, ఆసీత, మత్పరః, వశే, హి, యస్య, ఇంద్రియాణి, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.

టీక :—

తాని సర్వాణి = అట్టి (కలత పెట్టుటయే స్వభావముగా గల) సకలేంద్రియములను,
సంయమ్య = వశము చేసికొని,

యుక్తః = సమాహితుడును,
మత్పరః = మత్పరాయణుడునై,
ఆసీత = ఉండవలసినది,
యస్య = ఎవనియొక్క,
ఇంద్రియాణి = ఇంద్రియములు,
వశే = అధీనమందు,
వర్తన్తే = ఉన్నవో,
తస్య = వానియొక్క,
ప్రజ్ఞా = బుద్ధి,
ప్రతిష్ఠితా = మిక్కిలి స్థిరమైనది,
హి = కదా! (అగును).

తా. కొబట్టి సాధకుడు తన ఇంద్రియములన్నిటిని వశముచేసికొని, మత్పరాయణుడును సమాహితుడునై ఉండవలెను. ఈ విధముగ ఇంద్రియములు వశమైన వానిబుద్ధి స్థిరమైనది అగును.

అ మృ త వా హి ని :-

అర్జునా! ఇంద్రియములను వశముచేసికొని మోక్షము కొరకు ప్రయత్నించువారలగు వివేకశీలుర మనస్సులను సైతము ఇంద్రియములు ఆకర్షించును అని ఎందులకు చెప్పితినో తెలియునా? ఆ ఇంద్రియములు మహాబలమైనవి. వాటి దృష్టి ఎప్పుడును విషయములవైపునకే ఉండును. ఎన్ని

జన్మములనుండియో వాటికిని మనస్సునకును విషయాను భవమును, విషయములయందే చరించుటయును అభ్యాసమై పోయినది. కనుక వాటికి విషయములయందే ప్రేమ సహజ ముగానున్నది. ఈ కారణమున మానవు డెంత నిగ్రహించినను అవి తప్పించుకొని విషయములలో పడుటకే ప్రయత్నించును. ఇంద్రియములు బలమైనవి కూడ. కాబట్టి ఒక్క నిగ్రహ మైనచో ఎట్లుండుననగా -

బలమైన మదించిన గిత్తదూడలు కలవు. ప్రక్కనే నవనవలాడుచు బాగుగా పెరిగిన చక్కని పైరులతో నిండిన పొలములుకలవు. ఆ పొలములలో మేయుట ఆ గిత్తదూడ లకు ఎన్నిరోజులనుండియో బాగుగా అలవాటైపోయినది. ఇప్పు డా దూడలు బాగుగా ఆకలితోకూడ నున్నవి. వాటిని మనము ఆపగలమా ? ఒకవేళ ఎంతకట్టివేసినను, బలవంత మున ఆగుటయేకాని, ఇష్టపడి కాదుగదా ! ఇట్టిస్థితిలో ఏమాత్రము సందుదొరకినను కట్లు త్రెంచుకొని పైరుమీద పడుటకే చూచుచుండునుగదా ! వాటి దృష్టి పైరువైపునకు లేకుండ చేయవలయుననిన, వాటికి కడుపునిండుగ మేయుటకు చాలినంత మేత ఇక్కడనే దొరకవలయును, ఇది ఆ పైరు కన్న ఎక్కువ రుచికలదిగ నుండవలయును. ఇట్లు చేసిన ఆ గిత్తలు ఆ పైరుమీదకుపోవు. అయినను పూర్వపు అలవాటు చొప్పున పోయినను, ఆ పైరు మేతలో రుచిలేకపోవుటచే,

మరల ఇటేవచ్చును. ఈ విధముగా రెండు మూడు పర్యాయములు అటుపోయి, ఆ మేతలో రుచి, సారము లేదని అనుభవము అయినమీదట, ఇక అటు పొమ్మని త్రోలినను పోవు.

అట్లే, ఇంద్రియములను ప్రాపంచిక విషయముల వైపునకు పోనీయక నిగ్రహించి ఉంచిన మెన, ఆకలిగొనియున్న గిత్త దూడలను పైరుమీద పడకుండ కట్టివేసి యుంచినట్లే. కాని ఇంద్రియములను విషయములనుండి మరలించుటతోపాటు భగవత్పరము చేసి, సేవ, పూజ యనునట్టి ఆహారము పెట్టవలయును. అనగా మనస్సును భగవద్ధ్యానములో ఉంచవలయును. భగవంతుని జన్మగుణకర్మ వైభవములను ఆ మనస్సునకు సదా బోధించుచుండవలయును.

కులశేఖర మహారాజు, తాము రచించిన ముకుందమాలలో ఇట్లు చెప్పియున్నారు - "జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం। పాణిద్వంద్వ సమర్చయాచ్యుత కథాః శ్రోత్రద్వయ త్వం శృణు । కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం । జిఘ్రఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధాన్నమాధోక్షజమ్ ॥"

"ఓ జిహ్వా ! భగవంతుని కీర్తించుము. ఓ మనసా ! ఆ శ్రీధరుని స్మరించుము, ధ్యానించుము. ఓ చేతులారా ! పరమాత్మను పూజించుడు. ఓ చెవులారా ! అచ్యుత కథా

మృతమును సదా ఆలకించుడు. ఓ నేత్రములారా ! ఆ కృష్ణ భగవానుని దర్శించుడు. ఓ పాదములారా ! భగవంతుని ఆలయమునకు పొండు. ఓ నాసికమా ! ముకుందపాదసమర్పిత తులసిని వాసన జూడుము. ఓ శిరమా ! ఆ పరమాత్మ పాద పద్మములకు నమస్కరించుము" అని ఈ విధముగా ప్రార్థించి యున్నారు.

ఇంద్రియములను భగవంతుడు మనకిచ్చినది తనను భజించుటకే. ఆ భగవంతుడు అమృతస్వరూపుడు. కనుక ఇంద్రియములకు ఈ విషయ విషాహారమును పెట్టుటకంటె, భగవత్సేవామృతాహారమును పెట్టినయెడల, ఇక ఈ విషయములవైపునకు అవి చూడవుగదా ! ఈ విషయములు బాగుగ అలవడిన కారణమున, ఇంద్రియములకు మొదట భగవద్విషయము రుచింపకపోవచ్చును. కాని క్రమశిక్షణతో మప్పిన యెడల తరువాత ఆ భగవద్విషయమును వదలి రమ్మ నినను రావు. అంతవరకు - ఇంద్రియములకు భగవద్విషయము దొరకువరకు - మాత్రమే ఇంద్రియనిగ్రహము కొంచెము కష్టముగ తోచును. కనుకనే కృష్ణుడు అర్జునునితో 'ఇంద్రియముల నిగ్రహించి మత్పరుడవు కమ్ము' అనుచున్నాడు. 'తాని సర్వాణి' సర్వేంద్రియములను అని అర్థము. ఏ ఒక్క ఇంద్రియమును వదలిపెట్టినను విఘ్నమే.

ఒక రైతు పొలమునకు నీళ్ళు పెట్టుచున్నాడు. పొలమునకు పెద్ద పెద్ద కన్నములు అనేకములున్నవి. కన్నములు కట్టకుండ, నీళ్ళు ఎన్ని పెట్టినను ప్రయోజన

మేమున్నది ? ఆ నీరంతయును ఆ కన్నములద్వారా బయటకు ప్రవహించిపోవును. అన్ని కన్నములను కట్టి ఒక్క కన్నమేగదా అని అశ్రద్ధచేసి, ఏ ఒక్క కన్నమైనను కట్టకుండ మిగిల్చినచో, ఆ నీరు ఆ కన్నముద్వారానే బయటకు ప్రవహించును. కనుక అన్ని కన్నములు కట్టవలయును.

అట్లే, ఈ మనస్సు ఇంద్రియములద్వారా బహిర్విషయములలోనికి పరుగులిడును. కనుక అన్ని ఇంద్రియములను నిగ్రహించి భగవత్పరాయణుడు కావలయును. ఏ ఒక్క ఇంద్రియమును వదలినను, ఆ ఇంద్రియముద్వారా మనస్సు పైకి పారిపోవును అని భావము.

కనుక అన్ని ఇంద్రియములకు భగవత్సేవారూపకమైన ఆహారమును కడుపునిండుగ సదా పెట్టుచుండవలయును. అప్పుడు ఇంద్రియములు అన్నియును శాంతివహించి యుండ గలవు. ఇదే భావమును, భాగవతములో నారదభగవానులు వ్యాసమహర్షికి బోధించియున్నారు -

“యమ నియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యు, కామరోషముల ప్రచోదితంబయగు. శాంతి వహింపదు. విష్ణుసేవచే క్రమమున శాంతి గైకొనిన కైవడి” అని.

కాబట్టి ఈ విధముగ ఇంద్రియములను వశముచేసికొని శాంతింపచేసినవానిని, స్థితప్రజ్ఞుడందురు. అతని బుద్ధి పరమాత్మయందు, చలించక స్థిరముగ ఉండును.

**అ వ తా రి క :—**

మనస్సును ఇంద్రియములను వశము చేసికొని భగవత్పరాయణుడు కానియెడల కలిగెడి పతనమును చెప్పుచున్నాడు కృష్ణపరమాత్మ ఈ రెండు శ్లోకములలో -

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస
స్సంగ స్తే షూపజాయతే ।
సంగా త్సంజాయతే కామః
కామా త్క్రోధోఽభిజాయతే ॥ ౬౨

శ్లో॥ క్రోధా ద్భవతి సమ్మోహ
స్సమ్మోహా త్స్మృతి విభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో
బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥ ౬౩

వ. వి :-ధ్యాయతః, విషయాన్, పుంసః, సంగః, తేషు, ఉపజాయతే, సంగాత్, సంజాయతే, కామః, కామాత్, క్రోధః, అభిజాయతే, ౬౨

క్రోధాత్, భవతి, సమ్మోహః, సమ్మోహాత్, స్మృతివిభ్రమః, స్మృతిభ్రంశాత్, బుద్ధినాశః, బుద్ధినాశాత్, ప్రణశ్యతి. ౬౩

**టీక :—**

పుంసః = మానవునకు,
విషయాన్ = (ప్రపంచమందుండెడి) విషయములను,
ధ్యాయతః = చింతనముచేత,

తేషు = వాటియందు,
సంగః = ఆసక్తి (ప్రీతి),
ఉపజాయతే = కలుగుచున్నది,
సంగాత్ = విషయాసక్తివలన,
కామః = ఆశ (కోరిక),
సంజాయతే = కలుగుచున్నది,
కామాత్ = కోరికవలన (తానాశించిన వస్తువును మరియొకడాశించి, అడ్డువచ్చినయెడల)
క్రోధః = కోపము,
అభిజాయతే = కలుగుచున్నది,
క్రోధాత్ = కోపమువలన,
సమ్మోహః = అవివేకము,
భవతి = కలుగుచున్నది,
సమ్మోహాత్ = అవివేకమువలన,
స్మృతివిభ్రమః = (అదివరకు తనకు తెలిసినట్టియు, పెద్దలవలన వినినట్టియు ధర్మములను జ్ఞప్తికి తెచ్చెడి) స్మృతి నశించుచున్నది.
స్మృతిభ్రంశాత్ = స్మృతి నశించుటచేత,
బుద్ధినాశః = (కార్యాకార్యవివేకమున కాధారమైన) బుద్ధి నశించుచున్నది.
బుద్ధినాశాత్ = బుద్ధినశించుటచేత,
ప్రణశ్యతి = సర్వనాశన మగుచున్నాడు.

తా. మానవునకు విషయచింతనచేత వాటియందు ఆసక్తికలుగు చున్నది. ఆసక్తివలన కామము కలుగుచున్నది. ఆ కామమునకు విఘ్నము కలిగినయెడల క్రోధము కలుగుచున్నది. క్రోధమువలన విచారణజ్ఞానము మరుగుపడుచున్నది. దానివలన అదివరకు తనకు తెలిసి నటువంటియు పెద్దలవలన వినినటువంటియు ధర్మములను జ్ఞప్తికితెచ్చెడి స్మృతి నశించుచున్నది. స్మృతినశించుటచేత బుద్ధినాశనము కలుగు చున్నది. బుద్ధినశించుటచేత ఫలము సర్వనాశనమే: అధోగతియే.

**అ మృ త వా హి ని :—**

అనాదికాలమునుండియును, జన్మజన్మాంతరసహస్ర ములనుండియును విషయానుభవములోనుండియుండుటచేత, మనస్సులో విషయవాసన బాగుగా సాంద్రముగా పట్టుకొని యుండును. దానియొక్క స్థూలరూపమే ఆసక్తి. కాబట్టి మానవునకు మనస్సులో సహజముగనే విషయాసక్తి యుండును. ఆ ఆసక్తివలన విషయచింతనము అనివార్యముగ జరుగును. విషయచింతనముతో, జన్మజన్మాంతరముల నుండియు వచ్చుచున్న ఆసక్తి ఇంకను అధికమగుచున్నది. మనస్సులో ఆసక్తి అధికమైననాడు విషయముల ననుభవించ వలయు ననెడి కామము - కోరిక - కలుగును. ఆసక్తియొక్క స్థూలరూపమే-కార్యమే-పరిపక్వావస్థయే-కామము. ఈస్థితిలో మానవుడు విషయములను అనుభవించకుండ నుండలేడు. 'కామాంధునకు ఏమియును కనుపడదు' అని పెద్దలవాణి. ఇక ఇప్పటినుండియే వివేకము నశించుట ప్రారంభమగును. కామము

చేత కంప్లను పొరలు కమ్మియున్నవానికి తప్పు తెలిసినను లక్ష్యముచేయక తప్పుచేయును. ప్రపంచములో తప్పులు చేయు వారందరకును ఏ ఒక్కటియో తప్ప, 'తాము చేయునవి తప్పులు అని తెలియును. కాని మానలేకుంటు న్నారు. ఆ అనుభవమునకు ఏకారణముచేత విఘ్నము కలిగినను ప్రక్కనున్నవారిమీద క్రోధము కలుగును. ఇక విఘ్నమునకు కారణమైనవానిమీద చెప్పవలయునా ? ఆ క్రోధమునకు అవధియుండునా ? ఆ క్రోధమువలన అంతఃకరణములో కర్తవ్యాకర్తవ్యనిర్ణయము చేసెడి వివేకము నశించును. ఆ స్థితిలో మానవుడు వెనుకముందులు ఆలోచించలేడు. క్రోధావేశములో తాను ఏపని చేయబోవుచున్నాడో, ఆపని యొక్క పరిణామము ఎట్లు మాటనో ఎంతమాత్రమును తెలిసికొనలేడు. వివేకము నశించుస్థితినే 'సమ్మోహ' మందురు. ఆ సమ్మోహమువలన అనగా- క్రోధముచేత కలిగిన మూఢభావమువలన - స్మరణశక్తి పోవును. దానితో 'నేను చేయబోవుపని ఏమి ? ఎవరిని గురించి చేయుచున్నాను? ఆవ్యక్తికిని నాకును ఎట్టి సంబంధము ? ఇప్పుడు నేను చేయబోవు పనిచేత నాకు నష్టమా? ఇతరులకు నష్టమా? ఇది పాపమా? పుణ్యమా?' అని ఏమియును ఆలోచించలేడు. కోపమునకు వశపడి అదివరకు అనుకొననివికూడ చేయును. అనుకొన్నవి మరచిపోవును. అదివరకు పెద్దలవద్ద వినినవియును, శాస్త్రములలో

చదివినవియును అన్నియును మరచిపోవును. ఆ బుద్ధిలో స్మరణ శక్తి యుండినగదా ! స్మరణశక్తియనగా స్మృతి. అది ఛిన్నాభిన్నమైపోవును. స్మరణశక్తి నశించిననాడు, స్మృతి నశించిననాడు, బుద్ధినశించినదనే అనుకొనవలయును. దేహము ఆకారముతో నున్నను ప్రధానమైన ప్రాణములు పోయిన, ఇక దేహము నశించినట్లేగదా ! శవమే అది. అట్లే బుద్ధికి ప్రాణతుల్యమైన స్మృతి నశించిన ఇక బుద్ధి ఏమున్నది ? కనుక బుద్ధి నశించినట్లుగనే ఎన్నుకొనవలయును. స్మరణశక్తి యుండిననే బుద్ధి తన పనిని తాను చేయగలుగును. అది లేకపోయిన బుద్ధి వెంటనే నశించును. ఇక బుద్ధి నశించిన చెప్పునదేమి ? కర్తవ్యమును చేయకపోవుటయు, అకర్తవ్యమును చేయుటయును. ఈస్థితి కలుగుటలో, పాళ్ళభేదమును బట్టి ఆ వ్యక్తి యొక్క ప్రతివ్యవహారములోను, ప్రతిమాటలోను, ప్రతి ఆలోచనలోను, కటుత్వము, క్రూరత్వము, కఠినత్వము, భయము, హింస, ప్రతిహింస, జడత్వము, మూఢత్వము మొదలగు దోషములన్నియును ప్రజ్వరిల్లుచుండును. దానితో అధఃపతనము, రౌరవాదినరకయాతనలు, నీచజన్మలు ఇవన్నియును సిద్ధమగును. బుద్ధినాశనముచేత సర్వనాశన మనగా ఇదియే.

అవతారిక:—

మనస్సును ఇంద్రియములను జయించని మానవుని పతనము ఎట్లు జరుగునో చెప్పి, ఇప్పుడు ఆసక్తి నశించిన స్థిత

ప్రజ్ఞుడు విషయములందు చరించుచున్నప్పటికిని వానిని విషయములు ఏమియును చేయజాలవని చెప్పుచున్నాడు.

శ్లో॥ రాగద్వేష వియుక్తై స్తు
విషయా నింద్రియై శ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా
ప్రసాద మధిగచ్ఛతి ॥ ౬౪

ప. వి :—రాగద్వేష వియుక్తైః, తు, విషయాన్, ఇంద్రియైః, చరన్, ఆత్మవశ్యైః, విధేయాత్మా, ప్రసాదం, అధిగచ్ఛతి.

టీక :—

రాగద్వేష వియుక్తైః = రాగద్వేషరహితములైనవియు,
ఆత్మవశ్యైః = తనకు స్వాధీనములైనట్టివియునగు,
ఇంద్రియైః = ఇంద్రియములచేత,
విషయాన్ = విషయములయందు,
చరంతు = సంచరించుచున్నను,
విధేయాత్మా = స్వాధీనమైన మనస్సుగల స్థితప్రజ్ఞుడు,
ప్రసాదం = పరమశాంతిని,
అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా. రాగద్వేషరహితములైనట్టియును, తనకు స్వాధీనములైన
యును ఇంద్రియములచేత ప్రపంచమందు సంచరించుచున్నను స్వాధీ
నమైన మనస్సుకల స్థితప్రజ్ఞుడు పరమశాంతిని పొందుచున్నాడు.

**అమృతవాహిని :-**

"అర్జునా! ఇంద్రియములను, మనస్సును పూర్తి
వశముచేసికొని మత్పరాయణుడై సర్వేంద్రియములను (అ
వది యొకటవ శ్లోకములో చెప్పినట్లు) నా కైంకర్యమునం
వినియోగించుచు సచ్చిదానందఘన పరబ్రహ్మమును, కల్యా
గుణ పరిపూర్ణుడను, వాత్సల్యమహోదధిని అయిన
సాక్షాత్కారమును పొందుటచే రసము - ఆసక్తి - కూ
నివర్తించినట్టి స్థితప్రజ్ఞుడు ప్రపంచమందు సంచరించుచున్న
ఆతని భగవదనుభవమునకును పరమశాంతికిని ఎంతమాత్రము
ప్రతిబంధకముండదు" అనిభావము.

రాగద్వేషములు పూర్తిగ నశించనివాడు చేయు ప్ర
పనిలోను, మాట్లాడు ప్రతిమాటలోను, ప్రతి ఆలోచనలో
తగినంత మోతాదులో, తెలియునట్లో తెలియన
రాగద్వేషము లుండుట తప్పదు. రాగద్వేషములు పూ
పోయి ఇంద్రియములు, మనస్సు స్వాధీనమై భగవదనుభవ
చిక్కినవానికి ఆసక్తి, ఆసక్తికి కారణమైన సంస్కారము
కూడ నశించుటచేత, విషయములందు చరించుచున్నను అతే
విషయములు ఎంతమాత్రమును వికారమును పొందించలేవ

ప్రశ్న : విషయములందు చరించుచున్నను అంటక పోవుట ఎట్లు ? అసలు కాంక్షలు లేనివాడు విషయములలో ఎందుకు చరించును ?

సమా : మరి ఏమిచేయును ? ప్రపంచములో జీవించి తిరుగుచున్నప్పుడు విషయములలో చరించక ఎట్లుండగలడు ? తాను కావలయునని కోరి భోగములను అనుభవించడుగాని, దైవికముగా ప్రారబ్ధానుసారముగా వచ్చినదానిని, దాని యందు కాంక్ష లేకుండ అనుభవించుచునే యుండును. విష యములనగానేమి ? మార్గము వెంబడి పోవునప్పుడు నేత్రము లకు అనేకదృశ్యములు కనుపించును. అట్లు కనిపించకుండ ఎవరు ఆపగలరు ? అయితే హృదయములో కాంక్షలు గలవాడు ఆదృశ్యములను రాగద్వేషములతో చూచును. ఏ కాంక్షయు లేని మహాత్ముడు నిర్వికారుడై రాగద్వేషరహితుడై చూచును. చూచుట ఎట్టివానికిని తప్పదు. అట్లే అక్కర లేదనుకొన్నను చెవులకు అనేకము వినబడును. వాటిలో మంచి, చెడ్డ సంభాషణలు రెండును కూడ ఉండును. కాంక్షలు గలవాడు అట్టి శ్రవణమువలన వికారము చెందును. రాగ ద్వేషములకు పాల్పడును. స్థితప్రజ్ఞుడు వాటికి చలించడు. అంతయు పరమాత్మలీలగా గ్రహించి తన ఆనందములో తానుండును. కాని ఆ సంభాషణ తప్పించుకొనలేడు. దీని పేరే విషయములలో సంచరించుట యనగా.

బాలునకు విషయానుభవమునకు సంబంధించిన సంస్కారములు ఇంకను మొలకెత్తు పరిపక్వస్థితికి రాకపోవు

టచే, ఆతడు విషయములందు సంచరించుచున్నను ఆతనిని విషయములు ప్రలోభపెట్టలేవు. నాలుగైదు సంవత్సరముల బాలుని పదునెనిమిదేండ్ల యువతి, అతిలోకసుందరి, వచ్చి కౌగిలించినను, నూరేండ్ల ముసలమ్మవచ్చి కౌగిలించుకొన్నను సమానమే. అతని చిత్తములో ఏమాత్రమును వికారము కలుగుటకు అవకాశము లేదు. అతనికి సంస్కారములు మొలక లెత్తు స్థితికి రాలేదు కనుక, ఆ సంస్కారము లతనిని బాధించ లేవు. ఇక భగవదనుభవముగల మహాత్మునకు ఆ సంస్కారములు నశించుటచేత ఆతనిని బాధించవు. బాలునకు సంస్కారములు లేతగానున్నవి; మహాత్మునకు నశించినవి. కాబట్టి వికారము చెందకపోవుటలో ఇద్దరును సమానమే. అందువల ననే 'బాలోన్మత్త పిశాచవత్' అని మహాత్ములను వర్ణించి యున్నారు. ప్రాపంచిక విషయములను గూర్చిన నిస్పృహ విషయమున మాత్రమే ఈ ఉపమానము కాని, మహాత్ములు బాలురవలె జ్ఞానహీనులుగా నుందురనియును, పిచ్చివారలై దగ్గరకు వచ్చినవారిని తిట్టుదురనియును, దయ్యము పట్టినవారివలె తమ స్వాధీనము తప్పి గంతులు వేయుదురని యును కాదు.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం
హాని రస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు
బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ ౬౫

ప. వి :— ప్రసాదే, సర్వదుఃఖానాం, హానిః, అస్య, ఉపజాయతే, ప్రసన్నచేతసః, హి, ఆశు, బుద్ధి, పర్యవతిష్ఠతి.

టీక :—

ప్రసాదే = పరమశాంతిలభించిన,
అస్య = ఈ స్థితప్రజ్ఞునకు,
సర్వదుఃఖానాం = సర్వదుఃఖములును,
హానిః = నాశనము,
ఉపజాయతే = కలుగుచున్నవి (పొందుచున్నవి),
హి = ఎందు చేతననగా,
ప్రసన్న చేతసః=పరిశుద్ధాంతఃకరణము గలవానియొక్క,
బుద్ధిః = బుద్ధి,
ఆశు = శీఘ్రముగానే,
పర్యవతిష్ఠతి = పరమాత్మయందు స్థిరముగా నిలిచి యుండును.

తా. పరమశాంతిలభించినవానికి సర్వదుఃఖములును నశించుచున్నవి. అట్టి పరిశుద్ధాంతఃకరణముగలవానియొక్క బుద్ధి శీఘ్రముగనే పరమాత్మయందు స్థిరముగ నిలిచియుండును,

అమృతవాహిని :—

రాగద్వేషములే సర్వానర్థములకును, సర్వదుఃఖములకును మూలకారణములు. అవి ఆసక్తితో సహా నశించిన

నాడు, ఇక అనర్థములు, దుఃఖములు ఎక్కడివి ? రాగద్వేష ములులేని అంతఃకరణముతో పరమాత్మధ్యానముచేత ఆధ్యాత్మిక ప్రసన్నతకలుగును. దానిచేత అంతఃకరణమునందే ఒక రకమైన సాత్త్వికసుఖము అనుభవమునకు వచ్చును. ఇక ఆ సుఖమును త్యజించి ఎచ్చటకునుపోదు; పోజాలదు. దానివృత్తులన్నియును కేంద్రీకరింపబడి ఇటువైపునకే ప్రవహించును. అప్పుడు బుద్ధి పరమాత్మయందు స్థిరముగ నిలుచును. ఇక భగవదనుభవము గలిగిన తరువాత - పరమాత్మసాక్షాత్కారమైనతరువాత - ఆ బ్రహ్మానందానుభవములభించినతరువాత - ఇంక చెప్పునదేమున్నది ! అట్టి మహాత్ముడు స్థితప్రజ్ఞుడు.

శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య
నచ యుక్తస్య భావనా ।
నచాభావయత శ్శాంతి
రశాంతస్య కుత స్సుఖమ్ ? 66

ప. వి :— న, అస్తి, బుద్ధిః, అయుక్తస్య, న, చ, యుక్తస్య, భావనా, న, చ, అభావయతః, శాంతిః, అశాంతస్య, కుతః, సుఖమ్.

టీక :—

అయుక్తస్య = ఇంద్రియనిగ్రహము లేనివానికి,
బుద్ధిః = పరమార్థబుద్ధి,
నాస్తి = ఉండదు,

అయుక్తస్య = అట్టివానికి (ఇంద్రియ నిగ్రహము లేనివానికి),
భావనా - చ = ఆస్తిక్యభావమును,
న = లేదు,
అభావయతః = అట్టిభావములేనివానికి,
శాన్తి - చ = (చిత్త) శాంతియును,
న = లేదు,
అశాన్తస్య = చిత్తశాంతము లేనివానికి,
కుతః - సుఖమ్ = సుఖమెక్కడిది ?

తా. ఇంద్రియ నిగ్రహము లేనివానికి పరమాత్మ విషయమైన బుద్ధి ఉండదు. అట్టివానికి ఆస్తిక్య భావమేఉండదు. భావములేనివానికి శాంతి లేదు. శాంతములేనివానికి సుఖమెక్కడనుండి వచ్చును ?

## అమృతవాహిని :—

అయుక్తుడు అనగా ఇంద్రియములను, మనస్సును నిగ్రహించలేనివాడు. వానికి పరమాత్మయందు నిశ్చయాత్మక బుద్ధి ఉండదు. అనేకరకములైన భోగవాసనలచే మనస్సునకు విక్షేపదోషము కలుగును. ఈ స్థితిలో బుద్ధి కర్తవ్యాకర్తవ్య ములను నిర్ణయించుకొనగలశక్తిని కోల్పోవును. కనుక ఈ బుద్ధి పరమాత్మ ధ్యానములో స్థిరముగ నిలువదు. అంత దూరముపోనేల ? అట్టివాని అంతఃకరణములో పరమాత్మను

గూర్చిన ఆస్తిక్యభావమే స్థిరముగా ఉండదు. ధ్యానములో బుద్ధి స్థిరముగా నిలుచుట ఎక్కడిది? పరమాత్మకలడనుభావమే లేనివానికి శాంతి కలుగదు. పరమాత్మ పరమశాంతి మహోదధి. ఎవనికి ఎప్పుడు ఏ కొంచెము శాంతి కావలయునన్నను, ఆయనవద్దనుండియే రావలయును. అట్టి స్థితిలో పరమాత్మయే లేడనువానికి ఇంక శాంతి ఎచ్చటనుండి వచ్చును? శాంతి లేనివానికి సుఖము శూన్యము. త్యాగరాజులవారుకూడ 'శాంతములేక సౌఖ్యములేదు' అన్నారు. సుఖము కావలయునన్నచో శాంతి ఉండవలయును. శాంతము కావలయునన్నచో పరమాత్మధ్యానము కావలయును. పరమాత్మ విషయమున బుద్ధి స్థిరముగ నిలువవలయును. ఇది కావలయునన్నచో, పరమాత్మకలడన్న ఆస్తిక్యభావము అంతఃకరణములో అచలముగా ఉండవలయును. ఈ భావము అచలముగా ఉండవలయునన్నచో ఇంద్రియములు, మనస్సు బాగుగ నిగ్రహింపబడి స్వాధీనములో ఉండవలయును.

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం
యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం
వాయుర్నావమివాంభసి ॥ ౬౭

ప. వి:— ఇంద్రియాణాం, హి, చరతాం, యత్, మనః, అనువిధీయతే, తత్, అస్య, హరతి, ప్రజ్ఞాం, వాయుః, నావం, ఇవ, అంభసి.

టీక :—

చరతాం = (విషయముల యందు)ప్రవర్తించుచున్న,
ఇంద్రియాణాం = ఇంద్రియములను,
యత్ = ఏ,
మనః = మనస్సు,
అనువిధీయతే = అనుసరించుచున్నదో,
తత్ = ఆ మనస్సు,
అస్య = ఈ పురుషుని యొక్క,
ప్రజ్ఞాం = వివేకమును,
అంభసి = సముద్రమునందు,
నావం = ఓడను,
వాయురివ = వాయువువలె,
హరతి = హరించుచున్నది. (అనగా తన వైపునకే ఆకర్షించి తనతో గూడ లాగుకొనిపోవు చున్నది.
హి = యథార్థము.

తా. విషయములయందు సంచరించెడి ఇంద్రియములవెంట జను మనస్సు బుద్ధిని, నీటియందున్న నౌకను వాయువుహరించినట్లు హరించు చున్నది.

అమృతవాహిని :—

విషయములందే సంచరించెడి ఇంద్రియములకు నిలుకడ ఉండదు. అట్టి నిలుకడలేని ఇంద్రియములను వెంటాడు

మనస్సు బుద్ధినికూడ పరమాత్మధ్యానమందు నిలువనీయక ఈడ్చి తప్పుత్రోవపట్టించును. ఎట్లు ఈడ్చును? దానికి సమాధానముగా ఒక ఉపమానము ఈయబడినది. సముద్రము, పడవ, వాయువు. సముద్రములో సంచరించు పడవను వాయువు సరిగా పోనీయక తప్పుత్రోవలకు లాగుకొనిపోయినట్లు, విషయములందు పరుగులిడు ఇంద్రియములతో కూడిన మనస్సు బుద్ధిని పరమాత్మవైపునకు పోనీయక విషయములవైపునకు లాగును. పడవ స్థానమునబుద్ధి, వాయువుస్థానమున విషయములందు పరుగులిడు ఇంద్రియములతో కూడిన మనస్సు, నీరు స్థానమున సంసారసముద్రము.

పడవకు ఏదో ఒక ప్రదేశము గమ్యస్థానమైనట్లు బుద్ధికి గమ్యస్థానము పరమాత్మ. సముద్రములో పడవ ప్రయాణము చేయుచుండగా, ఒక పెద్దతుపాను బయలుదేరినయెడల ఆ పడవ తన మార్గమును వదలిపెట్టి ఆ తుపాను తీసికొనిపోయిన వైపునకే ఎట్లు పోవునో, అట్లే విషయములలో పరుగులుబెట్టు ఇంద్రియములతో కూడిన మనస్సు బుద్ధిని దారులు తప్పించి తనతో విషయములలోనికి ఈడ్చుకొనిపోవును.

ఈ ఉపమానమువలన మనము గ్రహించవలసినది ఏమనగా -

గాలి పడవను త్రోవనుండి తప్పించి లాగికొనిపోవునప్పుడు నావికుడు అసమర్థుడైనచో త్రోవతప్పి వాయువు

యొక్క ఇష్టానుసారముగా పడవ పోవుటయో, లేక అగాధ సముద్రములో అంతులేకుండ మునిగిపోవుటయో జరుగును. కాని దానిని సరిగా నడుపుట అసంభవము మాత్రముగాదు. నేర్పరి, సమర్థుడు అయిన నావికుడు ఆ వాయువును తనకు అనుకూలముగ మార్చుకొని జాగ్రత్తగ పడవను గమ్యస్థానమునకు చేర్చగలడు. అట్లే ఎవనియొక్క ఇంద్రియములు, మనస్సు, వశమున లేవో, అట్టి మానవుడు తన బుద్ధిని పరమాత్మయందు నిలుపదలచినను వాని ఇంద్రియములు, మనస్సు, ఆ బుద్ధిని విషయములనెడి సుడిగుండములోనికి ఈడ్చుకొనిపోవును. దాని చేత రెండు రకములైన ప్రమాదములు కలుగును.

ఒకటి : ఆ బుద్ధిని పరమాత్మయందు నిలువనీయక అనేకరకములైన భోగములను గురించి ఎట్లు పొందుటయా అను ఆలోచనలో దింపును.

రెండు : పాపాచరణములో ప్రవృత్తినికలిగించి అధః పతనమును పొందించును.

ప్రశ్న : ఈ ప్రమాదములు రెండునూ పైకి ఒకే మాదిరిగా కనిపించుచున్నవే! తేడా ఏమున్నది?

సమా : మొదటిది పాపాచరణముకాదు. తాను ధర్మముగా, ఇంకొకరికి తనవలన నష్టములేకుండా, భోగము లనుభవించుట, అనుభవించువలయునని కాంక్షజనించుట. దీనివలన పాపములో పడడుకాని, భగవదనుభవము మాత్రము దొరకదు.

రెండవది కేవలము పాపాచరణమే. తాను భోగము లనుభవించుటలో, అనుభవించవలయునని కోరుటలో దుష్ట స్వార్థమున్నది. పరులకు బాధకలిగినను తాను సుఖపడుటయే ఉద్దేశ్యము. ఈ రెంటికిని ఇదియే భేదము.

ప్రశ్న : అయితే మొదటిది ప్రమాదకర మెందులకైనది?

సమా : ఐహికదృష్టితో చూచినచో ప్రమాదకరము కాదు కాని, కేవల పరమార్థదృష్టితో చూచిన ప్రమాదకరమే. ఇంద్రియములు, మనస్సు, భోగములను వాంఛించుచుండినంత వరకు, వానికి పరమాత్మానుభవము లభించదు. కాబట్టి మోక్షార్థికి ఇదికూడ ప్రమాదమే. ఇక ప్రస్తుతమునకు వత్తము.

ఇంతమాత్రమున భయపడి నిరుత్సాహముతో ప్రయత్నమునుండి విరమించుకొనవలసినపనిలేదు. ఎవడు తన ఇంద్రియములను, మనస్సును, స్వాధీనము చేసికొనగలిగినాడో, వాడు తన బుద్ధిని పరమాత్మయందు నిలుపగలడు. అట్లు వశమైన ఇంద్రియములు, మనస్సు, బుద్ధిని ఇట్లు చలింపచేయవు. ఇక ఆ బుద్ధిని పరమాత్మలో అచలముగా నిలుపుటకు సహాయపడగలవు.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో!
నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౮

ప. వి :_తస్మాత్, యస్య, మహాబాహో, నిగృహీతాని,సర్వశః, ఇంద్రియాణి, ఇంద్రియార్థేభ్యః, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.

టీక :_

మహాబాహో! = గొప్పభుజములుగల ఓ అర్జునా!
తస్మాత్ = కాబట్టి,
యస్య = ఎవనియొక్క,
సర్వశః = సమస్తములైన,
ఇంద్రియాణి = ఇంద్రియములు,
ఇంద్రియార్థేభ్యః = విషయములనుండి,
నిగృహీతాని = నిగ్రహించి (తనస్వాధీనమునందుంచుకొనునో),
తస్య = వానియొక్క,
ప్రజ్ఞా = బుద్ధి,
ప్రతిష్ఠితా = స్థిరమైనది (పరమాత్మయందునిలుచును).

తా. కాబట్టి అర్జునా! ఎవడు తన ఇంద్రియములను ఇంద్రియ విషయములనుండి అన్నివిధములను నిగ్రహించి తన స్వాధీనమునందుంచుకొనునో, వానియొక్క బుద్ధి స్థిరముగ పరమాత్మయందు నిలుచును.

**అమృతవాహిని :_**

అర్జునా! ఇంద్రియములను మొట్టమొదట విషయముల నుండి మరలించుటయును, నిగ్రహించుటయును అభ్యసించవలయును. ఇట్లు ఇంద్రియములు విషయములనుండి పూర్తిగ

నిగ్రహింపబడిననాడు వాని బుద్ధి పరమాత్మధ్యానములో చలనములేక స్థిరముగ నుండగలదు. అయితే ఇంద్రియములను విషయములనుండి నేను మరల్చగలనా అను భయమును చెందనవసరములేదు. నీవు భుజబలసంపన్నుడవు. నీకు ఇంద్రియములు జయించుటయన ఒక కష్టమైనపనికాదు.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం
తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః ॥ ౬౯

ప. వి ;—యా, నిశా, సర్వభూతానాం, తస్యాం, జాగర్తి, సంయమీ, యస్యాం, జాగ్రతి, భూతాని, సా, నిశా, పశ్యతః, మునేః.

టీక ;—

సర్వభూతానాం = సకల ప్రాణులకును,
యా = ఏది (పరమార్థతత్త్వము),
నిశా = రాత్రివలె అప్రకాశమగు అజ్ఞానాంధకారము వలెనుండునో,
తస్యాం = ఆ పరమార్థతత్త్వమునందు,
సంయమీ = ఇంద్రియనిగ్రహము గలిగి పరమాత్మానుభవము గల ముని,

జాగర్తి = మేలుకొనియుండును,
భూతాని = సమస్తభూతములును,
యస్యాం = దేనియందు (విషయములందు),
జాగ్రతి = మేలుకొనియుండునో,
సా = అట్టిది,
పశ్యతః = పరమార్థానుభవముగల,
మునేః = మునికి,
నిశా = రాత్రిగానుండును.

తా. సర్వభూతములకును ఏది రాత్రియో, దానియందు ముని మేల్కొనును. సమస్తభూతములును దేనియందు మేల్కొనునో, అది పరమార్థానుభవముగల మునికి రాత్రి.

అమృతవాహిని :-

ఈ శ్లోకములో రాత్రియని అజ్ఞానమును ఉద్దేశించుకొని చెప్పబడినది. అజ్ఞానమును అంధకారముతో పోల్చెదరు. కనుక అది రాత్రి అనబడినది. పగలు అని భగవద్విషయము నుద్దేశించుకొని చెప్పబడినది. భగవద్విషయజ్ఞానమును ప్రకాశముతో పోల్చెదరు. కనుక అది పగలు. అనగా మేల్కొనదగిన కాలముగ చెప్పబడినది.

సమస్త ప్రాణులకును భగవద్విషయము రాత్రి - అనగా దాని విషయమున నిద్రింతురు. స్థితప్రజ్ఞుడైన మునికి అది

పగలు. దానియందు మేల్కొని యుండును. మునికి ప్రపంచ విషయములు అనగా అజ్ఞానము రాత్రి. దానియం దతడు నిద్రించును. సమస్త ప్రాణులకును విషయములు పగలు. దాని యందు వారు మేల్కొని యుందురు.

పగలు అనగా హెచ్చరిక గలిగి ప్రవర్తించుట, రాత్రి యనగా హెచ్చరిక తప్పి విముఖులుగా నుండుట.

సమస్త ప్రాణులును భగవద్విషయమున హెచ్చరిక తప్పి విముఖులుగా నుందురు. ముని ఆ విషయమున హెచ్చరిక గలిగి ప్రవర్తించును. ప్రాపంచిక విషయములలో ముని హెచ్చరిక తప్పి విముఖుడుగా నుండును. సమస్త ప్రాణులును విషయోపభోగములలో హెచ్చరికలు గలిగి ప్రవర్తించెదరు.

యథార్థమాలోచించిన భగవద్విషయము పగలు; ప్రపంచభోగములు రాత్రి అనుటయే సత్యము. అయినను, దృష్టిదోషముగల గ్రుడ్లగూబకు పగలు రాత్రివలె నుండును; రాత్రి పగటివలె నుండును. మానవులకు మాత్రము పగలు పగటిగాను, రాత్రి రాత్రిగాను ఉండును. కనుక కేవలము విషయభోగలాలసులు గ్రుడ్లగూబలు. స్థితప్రజ్ఞులు మానవులు. కనుక యథార్థమైన మానవత్వమునకు పరమాత్మను పొందుటకు సాధనచేయుటయే చిహ్నము.

పగలు పగలుగాను, రాత్రి రాత్రిగాను తెలిసినను, పగటికంటె రాత్రినే ప్రేమించువారు లేకపోలేదు. దుష్ట

రాక్షసులు, దొంగలు, విషయలోలురు, పిశాచములు, వీరందరును రాత్రిని ప్రేమించెదరు. కనుకనే వారికి 'నక్తంచరులు' అని పేరు వచ్చినది. వీరందరును రాత్రి అంతయును మేలుకొని, పగలు కుంభకర్ణునిపై పోటీగా గుఱ్ఱుకొట్టి నిద్ర పోదురు. క్రూరమృగములు- పులులు, సింహములు మొదలైనవి- రాత్రియందు ఆహారమునకై తిరిగి తిరిగి కడుపు నిండుగ మెక్కి పగలు ఏ కొండగుహాలలోనో నోళ్ళు తెరచుకొని, ఒళ్ళు తెలియక నిద్దుర పోవుచుండును.

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వ త్కామాయం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ॥ ౭౦

టీక :—

ఆపూర్యమాణం = ఉదకముచే సంపూర్ణముగా నింపబడిన,
సముద్రం = సముద్రమును,
ఆపః = నలువైపులనుండియును వచ్చిపడుచున్న నదీజలములు,
అచలప్రతిష్ఠం = (చెలియలికట్టదాటకుండ) కలత పెట్టకయే,
యద్వత్ = ఏలాగున,

ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో,
తద్వత్ = అట్లే,
యం = ఎవనిని,
సర్వే కామాః = సమస్త సాంసారిక భోగములు,
ప్రవిశన్తి = వచ్చియును,
అచలప్రతిష్ఠం = కలతపెట్టవో,
సః = అట్టి స్థితప్రజ్ఞుడు,
శాన్తిం = శాంతిని,
ఆప్నోతి = పొందును,
కామకామీ = విషయాసక్తుడు,
న = పొందడు.

తా. నలువైపులనుండియును వచ్చిపడుచున్న నదీజలములు సముద్రము నెట్లు కలతపెట్టకయే ప్రవేశించునో, అట్లే ఎవనిని సాంసారిక భోగములు వచ్చియును కలతపెట్టలేవో, ఆ మానవుడు పరమశాంతిని పొందుచున్నాడు. విషయాసక్తునకు శాంతి లభించదు.

అ మృ త వా హి ని :—

పరమాత్మానుభవామృతసాగరములో నిత్యము నిరంతరము ఈదులాడుచుండు స్థితప్రజ్ఞుని సముద్రముతో పోల్చి చెప్పుచున్నాడు.

సముద్రము ఆపూర్యమాణము. అగాధమైన అనంతమైన జలములతో పరిపూర్ణమై ఉండును. దానికి ఇతర జలము

యొక్క ఆవశ్యకములేదు. కనుక సముద్రము అచలముగా ఉండును. అనగా ఎన్నెన్ని నదులద్వారా ఎంతెంత అగాధమైన అనంతమైన జలము వచ్చిపడుచున్నను సముద్రము తనస్థితినుండి మార్పుచెందదు. పొంగుట క్రుంగుట జరుగదు. హద్దుమీరదు. అటులనే పరమాత్మానుభవముగల మహాత్ముడును అనంతమైన బ్రహ్మానందముతో పరిపూర్ణుడుగ నుండును. అతనికి ఈ ప్రాపంచిక సుఖభోగములతో ఈషన్మాత్రమైనను ఆవశ్యకములేదు. కొరతలేదుగదా ! ఇంక ఆవశ్యకము ఏముండును ? అంతఃకరణములో సకలమైన కోరికలును వాసనలతోకూడ నశించిపోయినవి. అయితే ప్రారబ్ధకర్మవశమున అనేక ప్రాపంచిక భోగములు రావచ్చును. అనేకనష్టములు, దుఃఖములు రావచ్చును. ప్రాపంచిక పదార్థములతోగాని, వ్యక్తులతోగాని సంయోగ వియోగములు కలుగవచ్చును. అవి అతని అంతఃకరణములో ఏమియును కలతను చెందించలేవు. పొంగుటగాని క్రుంగుటగాని జరుగదు. ఆ భోగములు వచ్చుటచేతను పోవుటచేతనుగాని, పదార్థములయొక్క,వ్యక్తులయొక్క సంయోగ వియోగములచేతగాని, కీర్త్యపకీర్తులచేతగాని, స్తుతినిందలచేతగాని, హర్షశోకములు, రాగద్వేషములు, కామక్రోధములు, లోభమోహములు, భయము మొదలగు వికారములు ఆవగింజంతకూడ అతని అంతఃకరణములో కలుగవు. అచలుడై యుండును. తన మర్యాద - హద్దు - నుండి చలించడు.

మదించి ఒడలు తెలియక సంచరించు గంధసింధురము మందగమనముతో పోవుచుండగా దానిమీద నాలుగు పన్నీరు చినుకులు పడినను, నాలుగు పేడనీటిచినుకులు పడినను దానికి తెలియునా? పొంగుట, క్రుంగుట ఉండునా? ప్రక్కను ఎవరైనను 'గంధసింధురమునకు జై' అని నినాదములు చేయుచున్నను, వెనుక కుక్కలు మొరుగుచున్నను, పొంగుటయు, క్రుంగుటయు నుండునా?

అట్లే, అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృత పాన విశేషమత్తచిత్తులను ప్రాపంచిక విషయములను గురించియు, వాటి రాకపోకలను గురించియు చిత్తములో స్పృహ ఉండునా? కనుక అతనికి మాత్రమే యథార్థమైన పరమశాంతి మాక్కై ఉండును. 'నకామకామీ' అనగా విషయాసక్తునకు అట్టి శాంతి లభించదు' అని గట్టిగా చెప్పబడినది. విషయాసక్తత చిత్తములో విక్షేపమును అపారముగ కలుగజేయును. అట్టివానికి బుద్ధి స్థిరముగ ఉండదుకదా! ఇక శాంతికి అవకాశము ఎట్లు ఉండును? అతనికి శాంతి ఎండమావులలోని నీరు.

శ్లో॥ విహాయ కామాన్య స్సర్వాన్
పుమాం శ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకార
స్స శాన్తి మధిగచ్ఛతి॥ ౭౧

ప వి :— విహాయ, కామాన్, యః, సర్వాన్, పుమాన్, చరతి, నిస్స్పృహః, నిర్మమః, నిరహంకారః, సః, శాంతిం, అధిగచ్ఛతి.

టీక :—

యః పుమాన్ = ఏపురుషుడు,
సర్వాన్ కామాన్ = సమస్తమైన కామములను (కోరికలను)
విహాయ = విడిచి,
నిస్స్పృహః = ఎంతమాత్రమును వాటియందభిలాష లేక,
నిరహంకారః = అహంకారములేక,
నిర్మమః = మమకారములేక,
చరతి = ప్రవర్తించుచున్నాడో,
సః = వాడు,
శాన్తిం = శాంతిని,
అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా. ఏపురుషుడు సమస్తమైన కామములను విడిచిపెట్టి, వాటియందభిలాష ఎంతమాత్రమునులేక, అహంకారమమకారములు లేనివాడై ప్రవర్తించుచున్నాడో ఆ పురుషుడు పరమశాంతిని పొందుచున్నాడు.

అమృతవాహిని :—

అట్టి స్థితప్రజ్ఞత్వము, నిర్వికారస్థితి, నిరతిశయ బ్రహ్మానందానుభవము ఇహలోక పరలోక సంబంధమైన సమస్త

భోగములందును అన్నిరకములైన కోరికలును పూర్తిగ నశించినగాని కలుగదు. ఏ భోగవిషయమునను ఎంత మాత్రమును కోరిక ఉండరాదు. అంతఃకరణము అన్ని విధముల కామనారహితము కావలయును. అహంకారము పనికిరాదు. ఈ దేహమే తాననుకొని, ఈ దేహముకంటె వేరుగా దీనిలో ఏమియు లేదని, దేహమునకు కలిగిన సుఖదుఃఖములను జూచి తాను సుఖిని దుఃఖిని అనుకొనుచు ఉండుటయే అహంకారము. మహాత్ములకు అహంకారము ఎంతమాత్రమును ఉండదు. మమకారము విషముకంటె ప్రమాదమైనది. మనోబుద్ధీంద్రియములతో కూడిన దేహము 'నాది' అని అభిమానించుటయు, దానితో సంబంధించిన భార్య, పిల్లలు, సోదరులు, బంధువులు, ఇల్లు, వాకిలి, ధనము, ఐశ్వర్యము, పశువులు - మొదలగువాటియందును, తనవలన చేయబడిన కర్మలయందును, కర్మలఫలములయందును, కలుగు మమత్వము మమకారము అనబడును. మహాత్ములకు మమకారము ఎంతమాత్రమును ఉండదు.

సుఖమే రానిమ్ము, దుఃఖమే రానిమ్ము, లాభమే కలుగనిమ్ము, నష్టమే కలుగనిమ్ము, జయమే లభించనిమ్ము, అపజయమే లభించనిమ్ము, నిందాస్తుతులు, కీర్త్యపకీర్తులు మొదలైనవి ప్రారబ్ధకర్మరీత్యా ఏది లభించినను వానియందు 'అయ్యో, ఇది లభించినది, ఇది లభించలేదు' అను భావన

ఎంతమాత్రమును లేకుండుటయే నిస్పృహ అనబడును. ఈ నిస్పృహ అన్నికోరికలు, అహంకారము, మమకారము పూర్తిగ పోయినగాని లభించదు. కనుక మహాత్ములు మాత్రమే నిస్పృహులుగ ఉండగలరు. ఇట్టివారికి పరమ శాంతి కరతలామలకము. ఇట్టి స్థితప్రజ్ఞుడు లోకములో సంచరించుచున్నను, వానిచేత ఎన్నికర్మలు చేయబడుచున్నను, వాని బ్రహ్మానందానుభవమునకు ఏ కొరతయును లేదు; ఉండదు.

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ !
నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి
బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి ॥ ౭౨

ప. వి :— ఏషా, బ్రాహ్మీ, స్థితిః, పార్థ, న, ఏనాం, ప్రాప్య, విముహ్యతి, స్థిత్వా, అస్యాం, అంతకాలే, అపి, బ్రహ్మనిర్వాణం, ఋచ్ఛతి.

టీక :—

పార్థ ! = ఓ అర్జునా !
ఏషా = ఇదియే,
బ్రాహ్మీ స్థితిః = పరబ్రహ్మానుభవస్థితి,

ఏనాం = దీనిని,
ప్రాప్య = పొందిన (వాడు),
న విముహ్యతి = మోహమును పొందడు,
అన్తకాలేఽపి = మరణసమయమందైనను,
అస్యాం = ఈ పరబ్రహ్మానుభవస్థితి కలిగిన,
బ్రహ్మనిర్వాణం = శాశ్వతానందస్వరూపుడైన పర మాత్మను,
ఋచ్ఛతి = పొందుచున్నాడు.

తా. ఓ అర్జునా ! ఇదియే బ్రాహ్మీస్థితి. దీనిని పొందినవాడు ఎన్నడును మోహమును పొందడు. అంత్యకాలమునం దీస్థితి కలిగినను ఆత్యంతిక సుఖస్వరూపమైన పరబ్రహ్మను పొందుచున్నాడు.

## అ మృ త వా హి ని :—

ఈ అధ్యాయములో ఏబదిఅయిదవ శ్లోకము దగ్గర నుండి ఇంతవరకును చెప్పబడిన స్థితప్రజ్ఞునియొక్క స్థితి 'బ్రాహ్మీస్థితి' అని చెప్పబడినది. ఈ స్థితిని పొందినవాడు ఎన్నడును మోహమును పొందడు.

బ్రహ్మమనగానేమి? పరమాత్మ, ఈశ్వరుడు అనగా నేమి ? సంసారమేమి ? మాయ ఏమి ? వీటిలో వీటికి పరస్పర సంబంధమేమి ? నే నెవరిని ? ఎక్కడనుండి వచ్చితిని ? ఎందుకొరకు వచ్చితిని ? నా కర్తవ్యమేమి ?

నేనిప్పు డేమి చేయుచున్నాను? మొదలగు విషయములగూర్చి యథార్థజ్ఞానము లేకపోవుటయే మోహమనబడును. ఈ మోహము జీవునకు అనాదికాలమునుండియు పట్టుకొని యున్నది. దానివలన ఈ జీవుడు ఈ సంసారసముద్రములోబడి అల్లాడుచున్నాడు. ఈ సంసారసముద్రమున అల్లాడుటపోయి శాశ్వతబ్రహ్మానందస్వరూపుడైన - సకలకల్యాణగుణ మహోదధియైన - అప్రాకృత దివ్యమంగళ స్వరూపుడైన - నిరతిశయ సౌందర్యసింధువైన - దయామయుడైన పర మాత్మను అనుభవించవలయునన్నచో ఈ స్థితి రావలయును. కాని అహంకారము, మమకారము, ఆసక్తి, కోరికలు పూర్తిగ నశించిన మానవుడే ఈ స్థితికి అధికారి. ఈ స్థితి జీవితకాలములోనే లభించిన మహాత్మునిసంగతి చెప్పవలసిన దేమున్నది! అతడు బ్రహ్మానంద స్వరూపుడైన జీవన్ముక్తుడే. కాని మానవునకు సాధనచేయుచు రాగా, మరణకాలమున చివర క్షణములో ఈ స్థితి కలిగినను, బ్రహ్మానందానుభవము కలుగుచున్నది. ఇక జన్మలు కలుగవు.

"నచ పునరావర్తతే" (ఛా. ౮-౧౫-౧)
"తేషాం న పునరావర్తతే" (బృ. ౬-౨-౧౫) అని శ్రుతులు చెప్పినట్లు,
"అనావృత్తి శ్శబ్దాత్" అని బ్రహ్మసూత్రములో చెప్పినట్లు,

"మా ముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే"
అని గీతలో చెప్పినట్లు ఇక అతనికి సంసారము లేదు.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్య
యోగోనామ ద్వితీయోఽధ్యాయః.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం
యదుగిరి యతిరాజ సంపత్కుమార మునీంద్రాణాం
శిష్యేన సీతారామయతినావిరచితే
అమృతవాహినీ నామక శ్రీగీతాభాష్యే
ద్వితీయోఽధ్యాయః.



# అమృతవాహిని

**3**



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రులు

ముముక్షుజన మహాపీఠాధిపతులు

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీమద్భగవద్గీతా – తృతీయోఽధ్యాయః

# కర్మ యోగః

అర్జున ఉవాచ :—

శ్లో॥ జ్యాయసీ చే త్కర్మణ స్తే
మతా బుద్ధి ర్జనార్దన !
తత్కిం కర్మణి ఘోరే మాం
నియోజయసి కేశవ ! ॥ ౧

ప. వి:—జ్యాయసీ, చేత్, కర్మణః, తే, మతా, బుద్ధిః, జనార్దన, తత్, కిమ్, కర్మణి, ఘోరే, మామ్, నియోజయసి, కేశవ.

టీక :—

జనార్దన ! = ఓ జనార్దనా !
కర్మణః = కర్మయోగముకంటె,
బుద్ధిః = బుద్ధియే,
జ్యాయసీ = శ్రేష్ఠమైనదని,
తే = నీకు,
మతా చేత్ = అభిప్రాయమైనచో,
తత్ = అట్టిచో,
కేశవ ! = ఓ కేశవా !
మామ్ = నన్ను,
ఘోరే = భయంకరమైన,

కర్మణి = కర్మయందు,
కిమ్ = ఎందువలన,
నియోజయసి = నియోగించుచున్నావు ?

తా. అర్జును డడుగుచున్నాడు :- హే జనార్దనా ! నీవు కర్మకంటె బుద్ధినే శ్రేష్ఠమైన దానినిగా భావించిన యెడల, నన్ను ఈ ఘోరమైన కర్మయందే ఏల నియోగించుచున్నావు ?

**అమృతవాహిని :-**

అర్జునుడు అడుగుచున్నాడు :-

జనార్దనా ! కర్మకంటె బుద్ధియే శ్రేష్ఠమైనదని నీ అభిప్రాయమా ? "దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ ! బుద్ధౌ శరణ మన్విచ్ఛ" "బుద్ధియోగముకంటె కర్మ మిక్కిలి నీచమైనది. కనుక అర్జునా ! బుద్ధియందే రక్షణ నాపేక్షింపుము" అని చెప్పితివికదా! అయినచో నన్నీ ఘోరకర్మము ఏల చేయుమందువు ?"

ఇక్కడ అర్జునుడు బుద్ధియోగము అనగా జ్ఞానయోగ మని అర్థము చేసికొని, జ్ఞానయోగమనగా కర్మలచేయక ఊరక 'బ్రహ్మము, బ్రహ్మము' అనుచు కూర్చొనుటయే యని భావించి ఇట్లడుగుచున్నాడు.

అయితే, బుద్ధియోగమనగా జ్ఞానమని అర్థము చేసి కొనుటలోను కర్మఅనగా కర్మయోగము అనుకొనుటలోను తప్పేమున్నది ? అని సందేహమురావచ్చును. కాని అట్లు అర్థము చెప్పుటకు వీలులేదు.

బుద్ధియోగమనగా సమత్వబుద్ధితో కూడిన కర్మయోగమని అర్థము. ఎందువలననగా 'కృపణాః ఫలహేతవః' అనుటచే 'కర్మ' అనగా కామ్యకర్మ అనియే అర్థము చెప్పవలయును, ఇంకొకవిధముగ చెప్పరాదు. ప్రకరణసందర్భముకూడ-మానవుడు కర్మచేయక ఒక్క-క్షణముకూడ ఉండలేడు. ఆ కర్మ యెట్లు చేసిన బంధనమునకు హేతువుకాదో, ఎట్లు చేసిన హేతువగునో చెప్పునది యగుటచేత బుద్ధియోగమనగా కర్మలు చేయకుండుట కాదనియు, ఫలాభిలాష లేక, నెరవేరినను నెరవేరక పోయినను సమభావము కలిగి భగవత్సేవాదృష్టితో కర్మలు చేయుటయే యనియును గ్రహింపవలయును.

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన
బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య
యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥ ౨

ప. వి:— వ్యామిశ్రేణ, ఇవ, వాక్యేన, బుద్ధిం, మోహయసి, ఇవ, మే, తత్, ఏకమ్, వద, నిశ్చిత్య, యేన, శ్రేయః, అహమ్, అప్నుయామ్.

టీక :—

వ్యామిశ్రేణేవ= కలగపులగముగ అనిపించుచున్న,
వాక్యేన = వాక్యములచేత,
మే = నాయొక్క,

బుద్ధిమ్ = బుద్ధిని,
మోహయసీవ = మోహింపజేయుచున్నట్లున్నావు,
యేన = దేనిచేత,
అహం = నేను,
శ్రేయః = శ్రేయస్సును,
ఆప్నుయామ్ = పొందుదునో,
తత్ ఏకమ్ = అట్టి ఒక్కదానిని,
నిశ్చిత్య = నిశ్చయించి,
వద = చెప్పుము.

తా. కలగలుపుగా కనుపించు వాక్యములచే నాబుద్ధిని మోహపెట్టుచున్నట్లున్నావు : నాకు దేనివలన శ్రేయస్సు లభించునో అట్టి ఒక్కదానిని నిశ్చయించి చెప్పుము.

## అమృతవాహిని :-

కృష్ణపరమాత్మ ఇంతవరకు చేసిన ప్రబోధములో అర్జునుడు నిశ్చయమైన ఒక సాధనను నిర్ణయించుకొనలేకపోయినాడు. బుద్ధి తికమకపడిపోయినది. ఒకచోట జ్ఞానమును ప్రశంసించి, మరల కర్మ చేయవలసినదిగా ఆజ్ఞాపించుచున్నాడు. "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున !" అని ఒకచోట, "కర్మణ్యే వాధికారస్తే" అని యింకొకచోట, "దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ !" అని మరొకచోట అనుచున్నాడు. ఈ మాటలలో పరస్పర వైరుధ్యము భాసించినది అర్జునునికి. అందువలన కృష్ణపరమాత్మ తనకు కర్త

శ్రేష్ఠమని చెప్పుచున్నాడో, జ్ఞానము శ్రేష్ఠమని చెప్పు చున్నాడో, కర్మచేయుట ఆయన చివరి అభిప్రాయమో, కర్మ విడిచిపెట్టి జ్ఞానవిచారణలో కూర్చుండుట ఆయన ఆశయమో తెలిసికొనలేక "కృష్ణా! ఈ కలగలుపుమాటలతో నా బుద్ధిని చెదరగొట్టుచున్నట్లున్నావు. నాకేది శ్రేయస్కరమో దానిని ఒక్కదానిని నీవే నిర్ణయించి, స్పష్టములైన మాటలలో చెప్పుము" అనుచున్నాడీ శ్లోకములో.

అయితే, కృష్ణపరమాత్మయందు విశ్వాసమున్నది అర్జునునకు. ఆయన తన హితమే చెప్పునని తెలియును. అయిన నేమి - ప్రబోధమును అర్థము చేసికొనినగదా ఆచరణలో పెట్టుట ! సందేహానివృత్తికొరకు అడుగుచున్నాడుగాని కృష్ణ పరమాత్మ తనను మోసము చేయుచున్నాడను భావముతో కాదు. 'వ్యామిశ్రేణేవ' అనుపదములో 'ఇవ' శబ్దమును ప్రయోగించుటచేతను 'మోహయసీవమే' అనుపదములో 'ఇవ' శబ్దము ప్రయోగించుటచేతను "కృష్ణా! నీవు కలగలుపు మాటలు చెప్పుటలేదు. కాని, నా బుద్ధియొక్క పరిస్థితినిబట్టి ఇప్పటి నీ ఈ మాటలు అట్లు తోపింపజేయుచున్నవి. నీవు నాబుద్ధిని మోహపెట్టుటలేదు; నాకు తెలియును- కాని అట్లున్నది" అని అర్జునుని భావముగా ధ్వనించుచున్నది.

అర్జునుడు ఈప్రశ్న రెండవ అధ్యాయములోని ఏబది నాల్గవ శ్లోకములోనే వేయవలసినది - ఇప్పుడు అర్జునుడు వేసిన ప్రశ్నకు సంబంధించిన విషయము ఏబదిమూడవ శ్లోకములో

పూర్తిఅయినది. కనుక ఇది అప్పుడు వేయవలసిన ప్రశ్న. ఇంతసేపు ఆగి ఇప్పుడు వేసినాడు. ఏల ?

అర్జునునికి ఈసందేహము నిజమునకు అప్పుడే కలిగినది. కాని ఏబదిమూడవ శ్లోకములో "శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలాసమాధావచలాబుద్ధిస్తదాయోగమవాప్స్యసి" "అనేకము వినుటచే చలించినట్టి నీబుద్ధి ఎప్పుడు ఎడతెగని భగవద్ధ్యానమందు స్థిరమై చలించక నిలచియుండునో అప్పుడు భగవత్ప్రాప్తిరూపమైన యోగమును పొందగలవు" అని కృష్ణ పరమాత్మ చెప్పినప్పటికి అర్జునునికి భగవత్ప్రాప్తి లభించిన మహాత్ముల లక్షణములు ఎట్లుండునో వినవలయునను కోరిక బలముగా ముందునకు వచ్చినది. ఆ కారణమున ముందు స్థితప్రజ్ఞుని లక్షణములనుగూర్చి ప్రశ్నించి తెలిసికొని, తరువాత ఆ సందేహమును ఈ ప్రశ్నరూపముగా ఇప్పుడు అడిగినాడు.

తనకు కొంత తెలిసిన ఒక విషయమున కలిగిన సందేహమును తీర్చుకొనుటకు వేయు ప్రశ్న వేరు; ఒక క్రొత్త విషయమును తెలిసికొనుటకు వేయు ప్రశ్న వేరు. క్రొత్త విషయమును తెలిసికొనుటకు ప్రశ్నించినప్పుడు వక్త చెప్పిన సమాధానముతో ఆ సందర్భము ముగిసిపోవుట కద్దు; ఏలయన క్రొత్తగా విన్న ఈ విషయమున తిరిగి క్రొత్త సందేహములు మొలకెత్తుటకు మనసున ఈ విషయము మాగి, మననము సాగి ఉండవలయును. అంతకుముందే కొంత తెలిసిగాని, తెలిసినదనుకొను స్థితిలో గాని ఉన్న విషయమున కలిగిన సందేహము తీర్చుకొనుటకు వేయు ప్రశ్న సామాన్యముగ ఒంటరిగా రాదు.

సమాధానము వెంట తిరిగి సందేహములు, ప్రశ్నలు-పరంపరగ సాగుటకు ఎక్కువ అవకాశమున్నది. అందుచేతనే అర్జునుడు ఈ 'కర్మ', 'బుద్ధి' వాని తారతమ్యము - ఈ చర్చలోనికి దిగబోవుచు, ప్రసంగవశమున పరమాత్మ భగవదనుభవమును పొందిన వారిని గురించిన ప్రసక్తిరాగా, ముందు వారినిగురించి తెలిసికొని, తరువాత ఈ సంశయపరంపరను విచ్ఛేదము చేసికొనవచ్చునను తలంపుతో - ముందుగ స్థితప్రజ్ఞుని గూర్చి ప్రశ్నించినాడు. ముందే ఈ కర్మ, బుద్ధి తారతమ్యముల చర్చలోనికి దిగినచో క్రమముగ చర్చ పెరిగి స్థితప్రజ్ఞుని లక్షణములను తెలిసికొనుటకు చాల వ్యవధి కలుగు అవకాశ మున్నది. మధ్యలో అర్జునుడు స్థితప్రజ్ఞునిగూర్చి ప్రశ్నించి, తెలిసికొని, తిరిగి ఇచ్చట ఈ వెనుకటి విషయమును అంది పుచ్చుకొని ప్రశ్నించుటలోని ఔచిత్య మిది అని అమృత వాహిని అభిప్రాయము.

శ్రీభగవానువాచ :—

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా
పురా ప్రోక్తా మయానఘ !
జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్. 3

ప. వి :—లోకే, అస్మిన్, ద్వివిధా, నిష్ఠా, పురా, ప్రోక్తా, మయా, అనఘ, జ్ఞానయోగేన, సాంఖ్యానామ్, కర్మయోగేన, యోగినామ్.

టీక :—

అనఘ ! = ఓ పాపరహితుడా !
అస్మిన్‌లోకే = ఈ లోకమందు,
పురా = పూర్వమందు,
సాంఖ్యానామ్ = సాంఖ్యులకు
జ్ఞానయోగేన = జ్ఞానయోగముచేతను,
యోగినామ్ = కర్మయోగులకు,
కర్మయోగేన = కర్మయోగముచేతను,
ద్వివిధా = రెండు ప్రకారములుగల,
నిష్ఠా = అనుష్ఠానక్రమము,
మయా = నాచేత,
ప్రోక్తా = చెప్పబడినది.

తా. పాపరహితుడా ! అర్జునా ! జ్ఞానయోగముచేత సాంఖ్యులకును, కర్మయోగముచేత యోగులకును- రెండువిధములైన నిష్ఠలు నాచేత పూర్వము చెప్పబడినవి.

అమృతవాహిని :—

"అర్జునా ! పూర్వము నేను రెండువిధములైన నిష్ఠలను ఉపదేశించి యున్నాను. నిష్ఠ అనగా మోక్షమార్గము. మోక్షమునకు రెండు మార్గములను నేను సృష్ట్యారంభముననే ఏర్పాటుచేసితిని" అని చెప్పుచున్నాడు.

ఒకటి జ్ఞానయోగమార్గము. రెండవది కర్మయోగ మార్గము.

జ్ఞానయోగమార్గమున ప్రయాణము చేయువారిని సాంఖ్యులనియును, కర్మయోగ మార్గమున ప్రయాణము చేయు వారిని యోగులనియును అందురు.

మస్తిష్క-ప్రధానులు, హృదయప్రధానులు అని మానవులు సహజముగ రెండు తెగలుగా ఉందురు. మస్తిష్క-ప్రధానులే సాంఖ్యులనియును, హృదయప్రధానులే యోగులనియును చెప్పబడినది.

మస్తిష్క-ప్రధానులకు విచారణప్రధానమైన మార్గము రుచించును. హృదయప్రధానులకు విశ్వాసప్రధానమైన, ప్రేమప్రధానమైన మార్గము రుచించును.

ఈ ఇద్దరును మోక్షమును పొందువారే.

ఐదవ అధ్యాయములో "సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ" అని సన్న్యాసము- సాంఖ్యయోగము-, కర్మయోగము- ఈ రెండును మోక్షము నిచ్చునవే అని చెప్పబడినది. గీతలో ఈ రెండు మార్గములను గురించియే ప్రధానముగా ప్రసంగించబడినది.

"పురా ప్రోక్తా మయా" "నాచేత పూర్వము చెప్పబడినది" అని.కృష్ణపరమాత్మ ఇప్పుడు అర్జునునికొరకు క్రొత్తమార్గమును చెప్పుటలేదు. సృష్ట్యారంభకాలములోనే ఈ మార్గముల నేర్పాటుచేసి యున్నాడు.

మహాభారతములో శాంతిపర్వమున మూడువందల నలుబది తొమ్మిదవ అధ్యాయమున, నలుబది తొమ్మిదవ

శ్లోకమున "తత్రై పథర్మ్మః కథిత స్స్వయం నారాయణేన హి। పితామహాయ శుద్ధాయ యుగాదౌ లోకకారిణే॥" అని సృష్టికి ఆదిలోనే బ్రహ్మకు ఈ ధర్మము ప్రబోధించినట్లు ఉన్నది.

ఇంకను అనేక అవతారములలో కూడ ఈ ధర్మములను చెప్పియే ఉన్నాడు భగవంతుడు. ఈ అధ్యాయమునకు ముందు రెండవ అధ్యాయములోకూడ ముప్పదితొమ్మిదవ శ్లోకములో "ఏషాతేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" 'ఇంతవరకు నీకు సాంఖ్యయోగ విషయమును ఉపదేశించి యున్నాను. ఇప్పుడు యోగవిషయమును ఉపదేశించెదను వినుము' అని ఈ రెండు నిష్ఠలనుగూర్చి చెప్పియున్నాడు.

కనుక కృష్ణపరమాత్మ కలగలుపుగా చెప్పలేదు. అర్జునుడు గ్రహించలేక తికమకపడినాడు.

పరమాత్మ అర్జునుని 'అనఘ!' అనగా 'పాపరహితుడా!' అని సంబోధన చేయుచున్నాడు-భావమేమనగా- 'పాపాత్ములు ఈ నిష్ఠలలో దేనిని పొంద నర్హులుగారు. నీవు సహజముగా పాపరహితుడవు. నీకు ఈ నిష్ఠల నాచరించు సామర్థ్యమున్నది. భయపడకుము! తాత్కాలికమైన ఈ మోహమును త్యజించి కర్తవ్యపాలనకు సిద్ధపడుము' అని-

శ్లో॥ న కర్మణా మనారంభా
నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనా దేవ
సిద్ధిం సమధిగచ్ఛతి॥

ప. వి:— న, కర్మాణామ్, అనారంభాత్, నైష్కర్మ్యం, పురుషః, అశ్నుతే, న,చ, సన్న్యసనాత్, ఏవ,సిద్ధమ్,సమధిగచ్ఛతి.

టీక :—

పురుషః = పురుషుడు,
కర్మణామ్ = సత్కర్మములయొక్క,
అనారంభాత్ = ఆచరించకపోవుటవలన,
నైష్కర్మ్యమ్ = జ్ఞానమును,
న అశ్నుతే = పొందడు.
సన్న్యసనాదేవ = కర్మత్యాగమువలననే,
సిద్ధిమ్ = సిద్ధిని
న చ సమధిగచ్ఛతి = పొందనే పొందడుగదా !

తా. మానవుడు కర్మలను చేయనంతమాత్రమున నైష్కర్మ్యము ను పొందడు. కేవలము కర్మలను స్వరూపముతోకూడ త్యజించుట చేతనే సిద్ధి కలుగదు.

అమృతవాహిని :—

మానవుడు తన వర్ణాశ్రమ విహిత కర్మలను చేయనంతమాత్రమున నైష్కర్మ్యము లభించదు. నైష్కర్మ్యమనగా కర్మయోగముయొక్క పరిపక్వావస్థ. కర్మల నాచరించుచు గూడ వానిచేత బంధింపబడకుండ నుండు స్థితి.

కర్మలు బంధనమునకు హేతువను వాద మొకటి కలదు. ఆ వాదము సరియైన విచారణకు నిలుచునదికాదు. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" 'మానవుని బంధమోక్షములకు కారణము మనస్సే' అని సిద్ధాంతము,

మనస్సులో నిష్కామత కలుగక కర్మలు చేయనంత మాత్రమున మిథ్యాచారిత్వము సిద్ధించునేగాని నైష్కర్మ్యము సిద్ధించదు. మనస్సులో నిష్కామత పూర్తిగాకలిగి అహంకార మమకారములు లేనిస్థితిలో ఎన్నికర్మలు చేసినను నైష్కర్మ్యమే సిద్ధించును. బంధనభయము ఈషణ్మాత్రముకూడ ఉండదు. గీతయొక్క సారాంశమంతయును ఇక్కడనే ఉన్నది. శాస్త్ర విహితకర్మలను అసలు ప్రారంభించకపోవుటచేగాని, ప్రారంభించినవాటిని త్యజించుటచేగాని సిద్ధికలుగదు. మోక్షమునకు హేతువులు నిష్కామత, జ్ఞానముగాని, కర్మయోగము యొక్క కర్మకాదు. కర్మచేయునప్పుడు ఉంచుకోగలిగిన అంతఃకరణమునందలి పరిశుద్ధమైన నిష్కామత మోక్ష హేతువు.

అట్లే సాంఖ్యులయొక్క కర్మత్యాగముకాదు వారి మోక్షమునకు హేతువు; వారి జ్ఞానమే హేతువు. ఈ రహస్యము తెలిసినవారు లోకకల్యాణార్థము కర్మలుచేయుటకు భయపడరు.

లోకములో ఒకపని - తనకు అక్కరలేకపోయినను, ఆ పనిని చేయకపోయినను తనకు నష్టములేకున్నను, చేసినయెడల తనకు లాభములేకున్నను, తనవారికొరకు ఆ పనిని చేయుట చూచుచున్నాము. "వసుధైవ కుటుంబకం"అన్నట్లు మహాత్ములకు వసుధ అంతయు వారి కుటుంబమే. కాన తమకు అక్కర లేకపోయినను లోకముకొరకువారు కర్మలు చేయుదురు. కర్మ బంధనకారణమనెడి భ్రాంతిలో నున్నవారుమాత్రమే కర్మలన్న

భయపడుచు దూరదూరముగ నుందురు. ఆ భయమున్నంత కాలము వారిఅంతఃకరణములో జ్ఞాన మెట్లు కలుగును? జ్ఞానము కలుగనిది మోక్ష మెట్లు లభించును?

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

ప. వి:— న, హి, కశ్చిత్, క్షణమ్, అపి, జాతు, తిష్ఠతి, అకర్మకృత్, కార్యతే, హి, అవశః, కర్మ, సర్వః, ప్రకృతిజైః, గుణైః

టీక :—

జాతు = ఒకప్పుడును (ఏ సందర్భములోను),
క్షణమపి = క్షణమాత్రమైనను,
కశ్చిత్ (అపి) = ఒకానొక పురుషుడును (ఎవడును),
అకర్మకృత్ = కర్మ చేయనివాడై,
నతిష్ఠతి హి = ఉండడు కదా!
హి = ఏలయన -
అవశః = అస్వాతంత్రుడగుటచేత,
సర్వః = ప్రతివాడును,
ప్రకృతిజైః = ప్రకృతివలన పుట్టిన,
గుణైః = గుణములచేత,

కర్మ = కర్మమును,
కార్యతే = ప్రవర్తింపజేయుచున్నాడు.

తా. ఎవడును ఎప్పుడును కర్మనుచేయక ఒక్కక్షణమైనను ఉండలేడు. ఎందుచేత ననగా, సర్వులును తమకు ఇష్టమున్నను లేకపోయినను, ప్రకృతిగుణముల చేత కార్యములందు బలాత్కారముగ ప్రవర్తింపజేయబడుచున్నారు.

## అమృతవాహిని :—

“అర్జునా ! మానవుడు అసలు కర్మచేయక ఒక్కక్షణమైనను ఉండగలడా ? స్వభావము ఉండనిచ్చునా ? ప్రకృతి గుణములైన సత్త్వరజస్తమోగుణములు కూర్చుండనిచ్చునా ? కూర్చొనుటమాత్రము కర్మకాదా ? లేచుట, కూర్చొనుట, తినుట, త్రాగుట, మలమూత్రముల విడచుట, నిద్రపోవుట, మేల్కొనుట, ఆలోచించుట, రెప్పలుమూయుట, తెరచుట, మననముచేయుట, కలగనుట, శ్వాసపీల్చుట, వదలుట, ధ్యానముచేయుట, సమాధిలో ఉండుట - మొదలగున వన్నియును కర్మలుకావా ? శరీరమున్నంతకాలము కర్మలను ఎట్లు వదలించుకోగలడు ? పూర్వజన్మలలో తాను సంపాదించుకొన్న సంస్కారములకు వశుడైన మానవుని, ప్రకృతిసంభవములైన సత్త్వరజస్తమోగుణములు ఊరకొననిచ్చునా ? తేలు కుట్టినవాడు గంతులువేయకుండ ఎట్లుండగలడు ? అట్లే మానవుడు గుణములకు లోబడినప్పుడు ప్రకృతి చేయించిన ట్లెల్ల బలాత్కారముగ కర్మలు చేయుచునే ఉండును. కాని, అర్జునా ! ప్రకృతికి లోబడని మానవులు లేకపోలేదు. వారే

గుణాతీతులు - స్థితప్రజ్ఞులు - ప్రేమాత్మికాభక్తులు - వారిని మాత్రము ప్రకృతి ఏమియు చేయజాలదు. వారిని సత్త్వ రజస్తమోగుణములు వశము చేసికొనలేవు. కాని వారుకూడ కర్మలుచేయుదురు. వారు సత్త్వగుణమునకుకూడ లోబడరు; సత్త్వగుణమును వశములో ఉంచుకొని లోకకల్యాణార్థము కర్మలుచేయుదురు. వారిచేత చేయబడు కర్మలయందు వారికి మమకారము, ఫలాభిసంధి, కర్తృత్వాభిమానము ఎంత మాత్రమును ఉండవు. పరమాత్మ చేతిలో ఒక పరికరముగ ఉండి కర్మలు చేయుదురు. కనుక ఇక్కడ 'సర్వుడు' అనుదాని పరిధిలో అట్టి మహాత్ములను చేర్చకుము.

గుణములకు వశపడి కర్మలుచేయుట యన, పూర్వజన్మ సంస్కారములకు లోబడి వర్ణాశ్రమోచిత కర్మలుచేయుటయు, ఇచ్చటి వాతావరణమునకు లొంగిపోయి కర్మలుచేయుటయు కూడ.

ఈ గుణములు ప్రకృతిసంభవములు. పదునాల్గవ అధ్యాయములో అయిదవ శ్లోకములో "గుణాః ప్రకృతి సంభవాః" అనియును, పదమూడవ అధ్యాయములో పందొమ్మిదవ శ్లోకములో "విద్ధి ప్రకృతిసంభవాన్" అనియును, ఇరువది ఒకటవ శ్లోకములో "ప్రకృతిజాన్ గుణాన్" అనియును, పదునెనిమిదవ అధ్యాయములో నలుబదవ శ్లోకములో "ప్రకృతిజైః" అని యును కృష్ణపరమాత్మ "గుణములు ప్రకృతి సంభవములు" అని సిద్ధాంతము చేసియున్నాడు.

ప్రకృతి సామాన్యమైనదికాదు - "దైవీ హ్యేషాగుణ మయీ మమమాయా దురత్యయా" అని ఏడవ అధ్యాయములో చెప్పియున్నాడు. 'నా ఈ గుణమయమైన ప్రకృతి దాటుటకు వీలులేనిది; ఎవరును దాటలేరు' అని భావము. కనుకనే ఈ ప్రకృతియొక్క గుణములచేత జగత్తంతయును మోహింపజేయబడుచున్నది. "త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్ మోహితం..." అని చెప్పబడినది ఏడవ అధ్యాయములో పదమూడవ శ్లోకమున.

ఇట్టి బలమైన ప్రకృతి కర్కశహస్తములనుండి తప్పించుకొని బయటపడుటకు తగిన నేర్పరితనము కలిగించునదే గీతలో చెప్పబడిన యోగము. ఆ యోగము కర్మలు చేయకుండ కూర్చొనుటచే సాధింపబడజాలదు. కర్మలు చేయకపోవుట యోగముకాదు.

శ్లో॥ కర్మేన్ద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా
మిథ్యాచార స్స ఉచ్యతే॥ 6

ప. వి :—కర్మేన్ద్రియాణి, సంయమ్య, యః, ఆస్తే, మనసా, స్మరన్, ఇన్ద్రియార్థాన్, విమూఢాత్మా, మిథ్యాచారః, సః, ఉచ్యతే

టీక :—

యః = ఎవడు,
కర్మేన్ద్రియాణి = కర్మేంద్రియములను,
సంయమ్య = చక్కగా అణచి,
మనసా = మనస్సుచేత,
ఇన్ద్రియార్థాన్ = విషయములను,
స్మరన్ ఆస్తే = చింతించుచున్నాడో,
విమూఢాత్మా = మూఢబుద్ధిగల,
సః = అట్టివాడు,
మిథ్యాచారః = కపటాచారముగలవాడని,
ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. ఎవడైనను కర్మేంద్రియములను బలాత్కారముగ నిగ్రహించి మనస్సులోమాత్రము ఇంద్రియవిషయములను స్మరించుచున్నయెడల అట్టి మూఢుడు 'మిథ్యాచారుడు' అనబడుచున్నాడు.

అమృతవాహిని :-

"అర్జునా! ఒకడు కర్మేంద్రియములనుమాత్రము బలాత్కారముగ నిగ్రహించినాడు; వాని మనస్సుమాత్రము ఆసక్తి పోకపోవుటచేత ఇంద్రియవిషయములను స్మరించుచునే యున్నది; అతడు మిథ్యాచారుడు అనబడుచున్నాడు." సాధకుడు వేరు; మిథ్యాచారుడు వేరు. వీరిద్దరకును ఆకాశమునకును భూమికిని ఉన్నంత భేదమున్నది. పగటికిని, రాత్రికిని ఉన్నంత తేడాఉన్నది. పతివ్రతకును వేశ్యకును ఉన్నంత వ్యత్యాసమున్నది.

సాధకుడు కర్మేంద్రియములను పాపాచరణమునుండి నిగ్రహించి, ఇంద్రియములను, మనస్సును పరమాత్మ ధ్యానమందు సంలగ్నము చేయును. కాని, పూర్వజన్మ సంస్కారముల యొక్క ప్రాబల్యముచేత వానిమనస్సు అప్పుడప్పుడు విషయములవైపు పోవుచుండును. ఆ సాధకు డప్పుడు అయ్యో అనుకొని మనస్సును మరలించుకొని మరల పరమాత్మధ్యానములో నుంచుచుండును. ఇట్లే ప్రయత్నము అవిరళముగా సాగించుకొనుచుండును. కనుక వాడు సాధకు డనబడును. అంతియేగాని మిథ్యాచారుడు కాడు.

మిథ్యాచారుడుకూడ కర్మేంద్రియములను నిగ్రహించును. కాని లోపలమాత్రము విషయములనే స్మరించుచుండును. వీడు బాహ్యముగ కర్మేంద్రియములను నిగ్రహించుట లోకమును మోహపరచుటకే. ప్రజలు తన్ను నిజమైన యోగి అనుకొని విశ్వసించి, ప్రమత్తులై యుండు తరుణమునకై వేచియుండి వీడు విషయముల ననుభవించుటకు ఉపాయములు పన్నుచుండును.

కొంగ నీటిఒడ్డున ఒంటికాలిమీద కదలక మెదలక నిలబడియుండును; ఏమియును చలనము ఉండదు. కాని, చిత్తములో చేపలనే స్మరించుచుండును. చేపలను పట్టుకొనుటకు సమయమును చూచుచుండును. అట్టివాడు మిథ్యాచారుడు. అందువల్లనే మిథ్యాచారుని జపమునకు కొంగజపమని పేరు కలిగినది.

సాధకునకును మిథ్యాచారునకును అసలు ఆశయముల లోనే భేదమున్నది. సాధకుడు ఇంద్రియములను నిగ్రహించుట పరమాత్మ ననుభవించుటకు. మిథ్యాచారుడు ఇంద్రియములను నిగ్రహించుట లోకమును మోసగించి విషయము లనుభవించుటకు.

ఈ విషయము బాగుగా విచారించుకొని సాధకులు హెచ్చరిక కలిగి యుండవలయును. లోపల ఒకటి బయట మరొకటి పనికిరాదు. త్రికరణములును ఏకముగా ఉండవలయును - "మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః। మనస్యన్యం వచస్యన్యం కర్మణ్యన్యం దురాత్మనః॥" అనెడి శ్లోకార్థమును చక్కగా మననము చేసికొనుచుండవలయును.

ఇక్కడ "కర్మేంద్రియములు" అనగా దశేంద్రియములు అని అర్థము చెప్పకోవలయును. గీతలో ఎచ్చట చూచినను జ్ఞానేంద్రియములని, కర్మేంద్రియములని విడదీసి చెప్పబడలేదు. సామాన్యముగా "ఇంద్రియములు" అనియును, "కర్మేంద్రియములు" అనియును చెప్పబడియున్నది. వేని ద్వారమున మానవుడు కర్మలు చేయునో అవి కర్మేంద్రియములు - చేతులు, కాళ్ళు, నాలుక, మలవిసర్జనేంద్రియము, మూత్రవిసర్జనేంద్రియము - ఈ అయిదు యింద్రియములతో మనము పనులు చేయుదుము గనుక వీనిని కర్మేంద్రియములు అనుట ఒక పరిపాటి అయినది. కృష్ణపరమాత్మ అభిప్రాయములో చూచుట, వినుట, వాసన గ్రహించుట, స్పర్శను గ్రహించుట, రసమును గ్రహించుట - ఇవన్నియునుకూడా కర్మలే.

కనుక కన్ను, చెవి, ముక్కు, చర్మము, జిహ్వ ఈ అయిదింటిని కూడ కలిపి మొత్తమును "కర్మేంద్రియములు" అని చెప్పినాడు.

కాని, కర్మేంద్రియము లనినప్పుడు చేతులు మొదలైన అయిదింద్రియములనే తీసికొన్నచో బాధలేదుగదా అనుటకు వీలులేదు. అట్లన్నచో కన్ను మొదలగు ఇంద్రియములను నిగ్రహించనక్కర లేదను భావము వచ్చును. అట్లైన మిథ్యాచారత్వము, సాధకత్వము కూడ పూర్తిగా సిద్ధంచదు. కనుక కర్మేంద్రియము లన్నది పది యింద్రియములను దృష్టిలో ఉంచుకొనియే.

కేవలము కర్మ చేయకపోవుటచేతనే - కదలిక మెదలిక లేకపోవుటచేతనే మోక్షము సిద్ధించు పక్షమున రాతికిని రప్పకును మోక్షము దొరకవలయును. కేవలము తీరుబాటు లేకుండ పనులు చేయుట చేతనే మోక్షము లభించుపక్షమున చీమలకు కోతులకు కూడ మోక్షము సిద్ధించవలయును. అట్లు లేదు. మోక్షమునకు భావమే కారణము; మోక్షాధిపతియైన పరమాత్మ 'భావగ్రాహి.'

సారాంశములు-"నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" అను శ్లోకము ప్రకారము కర్మలు చేయక పోవుట నైష్కర్మ్యము కాదనియును,

"నహి కశ్చిత్ క్షణమపి" అను శ్లోకము ప్రకారము కర్మవిడిచిపెట్టవలయునని చెప్పినను, విడిచిపెట్టతలచినను, అధిమాత్రము విడిచిపోదనియును,

ఒకవేళ కొంతవరకు ఇంద్రియముల ద్వారమున చేయవలసిన కర్మలు చేయక బలవంతముగ నిగ్రహించినను, అది మోక్షోపాయము కాకపోగా మిథ్యాచారత్వము తెచ్చి పెట్టునదే అనియును సిద్ధించినవి.

అవతారిక :—

కనుక మానవుడు చేయవలసినదేమి ? అహంకార మమకారములతో సహా ఆసక్తిని మాత్రము విడిచి, నిష్కామ భావముతో ఇంద్రియముల ద్వారమున కర్మలు చేయవలయునని హెచ్చరించుచు, అట్లు చేయువాని గొప్పతనమును ఉగ్గడించుచున్నాడు పరమాత్మ.

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా
నియమ్యారభతేఽర్జున !
కర్మేంద్రియైః కర్మయోగ
మసక్తస్స విశిష్యతే ॥



ప. వి :—యః, తు, ఇన్ద్రియాణి, మనసా, నియమ్య, ఆరభతే, అర్జున, కర్మేన్ద్రియైః, కర్మయోగం, అసక్తః, సః, విశిష్యతే.

టీక :—

అర్జున ! = ఓ అర్జునా !
యః తు = ఎవ్వడు
ఇన్ద్రియాణి = ఇంద్రియములను



మనసా = మనస్సుచేత,
నియమ్య = నిగ్రహించి,
కర్మేన్ద్రియైః = కర్మేన్ద్రియములచేత,
కర్మయోగం = కర్మయోగమును,
అసక్తః = ఆసక్తిరహితుడై,
ఆరభతే = ఆచరించుచున్నాడో,

సః = వాడు,
విశిష్యతే = ఉత్తము డగుచున్నాడు.

తా. కావి అర్జునా! ఎవడు మనస్సుతో ఇంద్రియములను వశమందుంచుకొని, అసక్తిలేక, కర్మేంద్రియముల ద్వారమున కర్మయోగమాచరించుచున్నాడో వాడు శ్రేష్ఠుడుసుమా!

అమృతవాహిని :—

"అర్జునా! కర్మలను ఎట్లును ఎవడును విడిచిపెట్టలేడు గదా! ఆ కర్మలనే, మనస్సును, ఇంద్రియము లను స్వాధీనములో నుంచుకొని, అహంకార మమకార కర్తృత్వాభిమాన ఫలాభిలాషలను పూర్తిగ త్యజించి, శాస్త్రవిహితములైన ధర్మములను, సక్రమముగా నిష్కామభావముతో ఆచరించుటయే ఉత్తమోత్తమమైన ఉపాయము.

ఎన్నిజన్మలనుండియో - మానవుని బుద్ధికి అందని అనాదికాలమునుండియును - సంస్కారప్రవాహము మహాబలముతో ప్రవహించి వచ్చుచున్నది. ఆ ప్రవాహమునకు లోబడి మానవుడు కర్మలుచేయుచున్నాడు. ఆ మహాప్రవాహ

మును ఎవరు అడ్డగలరు ? అయితే చేయవలసినది లేదా అనినచో ఉన్నది - ఒకటే ఉపాయమున్నది - ఆ ప్రవాహము ఒక్కసారిగా- అకస్మాత్తుగా- బలాత్కారముగా - అడ్డగించిన యెడల మహాప్రమాదమునకు గురికావలసి వచ్చును. కనుక నేర్పరితనముతో ఆ ప్రవాహమును మనకు అనుకూలముగా మార్చుకోవలయును. ఇది ఒక్కటే ఉపాయము. ఇదియే సహజమైన పద్ధతికూడ.

ఇక్కడకూడ 'ఇంద్రియాణి' 'కర్మేంద్రియైః' అనినప్పుడు కర్మేంద్రియములైనను, జ్ఞానేంద్రియములైనను - పదింటిని అని గ్రహించవలయును. ఒక్క కర్మేంద్రియములైదింటిని మాత్రము వశముచేసికొని జ్ఞానేంద్రియములను విడిచిన యెడల ఇంద్రియములు వశమైనట్లు కాదు.

ఇంకొక ముఖ్యవిషయము - జ్ఞానేంద్రియములులేక కర్మయోగము సిద్ధించదు. చూచుట, వినుట, వాసనజూచుట మొదలగునవి లేక కర్మయోగ మాచరించుట ఎట్లు ? కనుక సర్వేంద్రియములను అనియే గ్రహించవలయును.

'నియమ్య' అనుటలో ఇంద్రియములను చక్కనిమార్గములో నియమించవలయునుగాని అటకాయించరాదు. వక్రమార్గముల పోవువానికి ఒక్కసారిగా అటకాయించునప్పటికి ఇంద్రియవృత్తి రూపమైన ప్రవాహము ఎప్పుడో ఒకప్పుడు ఆ అడ్డును పడగొట్టుకొని ప్రవహించును. కనుక ప్రవాహా

మును ఆపక వక్రమార్గమునుండి మరలించి సక్రమమార్గము నింకొకదానిని చూపవలయును. అదియే కర్మయోగము.

ఇంద్రియములను కార్యములయం దుపయోగించక అటకాయించి నిలుపునెడల మోక్షమునకు మాత్రమే ఉపయోగించుటకై ఈయబడిన ఈ మానవ దేహమునకు అక్కర లేని యింద్రియములను పరమాత్మ ఎందులకు ఇచ్చును ? ఈయకుంపనే ఉండెడివాడుగదా! తక్కిన అన్ని జన్మలకంటె మానవ జన్మ అతి ఉత్కృష్టమైనదని మహాత్ములు చెప్పుచున్నారుగదా! అయితే తక్కిన జన్మలలోనున్న సౌకర్యములను కొన్నిటిని తీసివేయుట, వాటిలోలేని యితర సౌకర్యములను కొన్నిటిని కలిగించుట - చేసినాడు పరమాత్మ. ఏలయన మానవజన్మ కేవలము మోక్షమును పొందుటకు మాత్రమే ఏర్పడినది కనుక మోక్షసాధనకు కావలసిన సౌకర్యములు మాత్రము కలిగించినాడు; ఇతరమైనవి తీసివేసినాడు. పక్షులకు ఆకాశమున ఎగురుటకు ఉపయోగించు రెక్కలనిచ్చినాడు. అవి ఎక్కడకు ప్రయాణము చేయదలచినను ఆ రెక్కల సహాయమున వేగముగా ఎగిరిపోగలవు. అంతకంటె గొప్ప జన్మయైన మానవ దేహమునకు ఈయలేదేమి ? ఇచ్చిన యెడల ఈ కార్లకు, రైళ్ళకు ధనము పోయనక్కరలేదుగదా ! ఏ కారుకొరకును ఏ రైలుకొరకును గంటలతరబడి కనిపెట్టుకొని ఉండనక్కర లేదుగదా ! ఎంత సదుపాయముగా ఉండెడిది ? కాని, అది అక్కరలేదు గనుకనే ఈయలేదు. తక్కిన జన్మంలలో లేని విశిష్టమైన జ్ఞానమును అధికముగ ప్రసాదించినాడు. అట్లే ఇంద్రి

యములు పరమార్థసాధనకు ఆటంకమే అని పరమాత్మ తలచినచో మోక్షసాధనమైన ఈ దేహమునకు ఇంద్రియములు లేకుండనే చేసెడివాడుగదా ! పరమార్థసాధనకు అవి ఆవశ్యకములు కనుకనే పరమాత్మ వాటిని మనకు ప్రసాదించినాడు. ఆయన ఏ నిమిత్తమై వాటిని ప్రసాదించినాడో ఆపనికి ఉపయోగించక మానవుడు పశుపక్ష్యాదులకు సహజమైన విషయోపభోగములకై ఉపయోగించి చెడుచున్నాడు. వానిని దుర్వినియోగము చేసికొనుచున్నాడు.

అయితే ఇప్పుడు చేయవలసినదిఏమి? అటు ప్రపంచము వైపు అక్రమమార్గమున బోవు ఇంద్రియసముదాయమును ఇటు పరమాత్మవైపునకు సక్రమమార్గమున నడుపవలయును.

'నియమ్య' అనుటచేత అటకాయించవలయునని కాక, వశముచేసికొని, మంచిమార్గమున నడుపవలయు ననియే అర్థము గ్రహించవలయును.

శ్లోకములోకూడ "మనసా ఇంద్రియాణి నియమ్య, అసక్తః కర్మేంద్రియైః కర్మయోగ మారభతే" అని ఉన్నది. "కర్మయోగ మాచరించుచున్నాడో" అనినప్పుడు ఆచరించుమని ఆదేశించినట్లు గ్రహించవలయును. కర్మయోగమనగా ఆసక్తిరహితుడై ఇంద్రియములను సత్కర్మలయందు వినియోగించుటయే.

'సవిశిష్యతే' వాడు శ్రేష్ఠుడగును అని చెప్పబడినది. ఎవరికంటె శ్రేష్ఠుడు ? అని ప్రశ్న వేసికొని కొంతమంది

వ్యాఖ్యాతలు 'పై శ్లోకములో చెప్పబడిన మిథ్యాచారునికంటె శ్రేష్ఠుడు' అని వ్రాసినారు. కాని కృష్ణపరమాత్మ అభిప్రాయము అది కాదని అమృతవాహిని భావము. ఏలయన, పై శ్లోకములో చెప్పబడిన మిథ్యాచారుడు వంచకుడు, డాంబికుడు, అసురీగుణములు గలవాడు. కానిచో కృష్ణపరమాత్మ 'మిథ్యాచారుడు' అనడు.

కొంతమంది "ఇంద్రియములను నిగ్రహించినను అవి వాని స్వభావముచే విషయములను స్మరియించుచునే ఉండును. వీడు నిగ్రహించుచు ఉండును; అవి మరల స్మరించుచుండును; కనుక వానిని మిథ్యాచారుడు అనినాడు పరమాత్మ" అని అభిప్రాయపడినారు. అది సరికాదు. అట్టివానిని సాధకుడు అనవలెను. సాధకుడు ఎంత ప్రారంభదశలో ఉన్నను "మిథ్యాచారుడు" అని ఎన్నటికిని అనబడడు. మిథ్యాచారుడు అనగా లోపల వంచన బుద్ధిగలిగి పైకి జ్ఞానివలె - ఏమియు కర్మలుముట్టుకొననివానివలె - కనబడువాడు. కనుకనే 'మిథ్యాచారుడు' అని అతనికి పేరు పెట్టినాడు పరమాత్మ - అనగా అతని ఆచారము మిథ్య అన్నమాట. తరువాతి శ్లోకములో చెప్పబడిన యోగి మనస్సుతో గూడ ఇంద్రియములను వశము జేసికొని అహంకార మమకారములు, కర్తృత్వాభిమానము, ఆసక్తి ఈషన్మాత్రము కూడ లేక శాస్త్రవిహితమైన కర్మలు చేయువాడు. వీనిని ఆ మిథ్యాచారునికంటె శ్రేష్ఠుడు అనుట ఒకరకమైన నిందయే కాని ప్రశంస కాదు. పతివ్రతయైన స్త్రీని ఒక వేశ్యకంటె మంచిది అనుట దూషణ కాక ప్రశంస అనబడునా?

స్త్రీలందరికంటె ఆమె శ్రేష్ఠురాలు అనిన అది యథార్థమైన ప్రశంస. రత్నమును తెచ్చి బొగ్గుకంటె విలువైనది అనిన ఎట్లుండును? అట్లే ఈ యోగిని 'మిథ్యాచారునికంటె శ్రేష్ఠుడు' అని కృష్ణపరమాత్మ అనినాడని అనుట విచారణీయము. సర్వమానవులలో శ్రేష్ఠుడు అని అర్థము తీసికోవలయునని అమృతవాహిని అభిప్రాయము.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యే దకర్మణః ॥ ౮

ప. వి :— నియతం, కురు, కర్మ, త్వం, కర్మ, జ్యాయః, హి, అకర్మణః, శరీరయాత్రా, అపి, చ, తే, న, ప్రసిద్ధ్యేత్, అకర్మణః.

టీక :—

త్వం = నీవు,
నియతం = నిర్ణయింపబడిన,
కర్మ = శాస్త్రీయకర్మను,
కురు = చేయుము;
అకర్మణః = కర్మచేయని స్థితికంటె,
కర్మ = శాస్త్రవిహిత కర్మ చేయుట,
జ్యాయోహి = శ్రేష్ఠముకదా!

అకర్మణః = కర్మచేయని,
తే = నీకు,
శరీరయాత్రాపి = ఐహిక జీవితయాత్రగూడ,
న ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపదు.

తా. శాస్త్రవిహితమైన కర్మలు చేయుము. అకర్మకంటె- అనగా కర్మ చేయకుండుటకంటె- చేయుట శ్రేష్ఠము. కర్మలను చేయనియెడల నీ శరీర యాత్రకూడ కొనసాగదు.

## అ మృ త వా హి ని :-

అర్జునా! శాస్త్రవిహితమైన నీ కర్మలను నీవు చేయుచునే ఉండవలయును. కర్మ చేయకపోవుటకంటె కర్మలచేయుట శ్రేష్ఠమైనది. కర్మలు బాహ్యముగా చేయనంతమాత్రమున జ్ఞానికాడు; మిథ్యాచారుడగును. కనుక నీకర్మలు నీవు చేయవలసినదే. ఒకవేళ హఠమువహించి కర్మలు చేయవలదను కొనిన నీ శరీరయాత్రకూడ సాగదు అనుచున్నాడు పరమాత్మ.

అవును - ఎట్లు సాగును ? తినుట, త్రాగుట, రెప్పలు వేయుట, మూయుట, గాలిపీల్చుట, మలమూత్ర విసర్జనములు చేయుట, మొదలగునవన్నియును కర్మలేగదా ! అవిచేసినను కర్మలు చేసినట్లే అగునుగదా ! అవి చేయకపోయినచో శరీరమే నిలువదు. పోనీ - "శరీరము నిలుచుటకుమాత్రము కర్మలు చేయుదును; మిగిలినవి మానుదును" అందువా ? అది చాల తెలివితక్కువ. శరీరరక్షణకు కావలసినవి చేయుటయు, చిత్త శుద్ధికిని, జ్ఞానమునకును ఉపయోగపడునవి మానుటయునా ?

చి_త్తశుద్ధి, జ్ఞానము శరీరముఁపాటి చేయవా ? కర్మలనెట్లును చేసినవాడవే అగుచుంటివి. క్షుద్రమైన శరీరరక్షణకుమాత్రము కర్మలుచేసి, పరమార్థమునకు చేయకపోవుట కేవలము చార్వాకమతము అవలంబించుటయే అగును.

శరీర నిర్వహణమునకైనను, యజ్ఞములుజేసి మిగిలిన అన్నముద్వారా శరీరమును నిర్వహించుకొనవలయును. అట్లు చేసినయెడల సర్వపాపములనుండి విము_క్తిని చెందవచ్చును. "యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వ కిల్బిషైః" అని పద మూడవ శ్లోకములో చెప్పబడియున్నది. లేనినాడు "భుంజతే తేత్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్" 'ఎవరు కేవలము తమకొరకే వండుకొని తినుచున్నారో వారు తినునది అన్నము కాదు; పాపమునే తినుచున్నారు'-అనగా వారి అన్నము పాప మయము; పాపపరిణామము. అన్నమే శరీరముగా పరిణమించు నని శరీరత_త్త్వము తెలిసినవారు అనుచున్నారు. కనుక పాప స్వరూపమైన అన్నముచేత పోషింపబడిన శరీరము పాపస్వరూ పమే అగుచున్నది. అట్టి శరీరము అధోగతికే కారణమగు చున్నది. కనుక తనమేలు కోరుకొనువాడు యజ్ఞముచేసియే భుజించవలయును. తరువాత అంతఃకరణముకూడ ఆహారము యొక్క ఫలమును పొందును - "ఆహారశుద్ధౌ స_త్త్వశుద్ధిః, స_త్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః" (ఛాం.ఉ. 7-26-2) ఆహారము శుద్ధమైనది అయినయెడల దానిచేత అంతఃకరణమునకు శుద్ధి కలుగును. అంతఃకరణము శుద్ధిచెం దుటచేత స్మృతి ధ్రువముగా

నిలుచును. కనుక ఎటుజూచినను యజ్ఞములు చేయనియెడల శరీరనిర్వాహణమే సాగదు.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర
లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ !
ముక్తసంగ స్సమాచర !

ప. వి :— యజ్ఞార్థాత్, కర్మణః, అన్యత్ర, లోకః, అయం, కర్మబంధనః, తదర్థం, కర్మ, కౌన్తేయ, ముక్తసంగః, సమాచర.

టీక :—

యజ్ఞార్థాత్ = యజ్ఞముకొరకైన,
కర్మణః = కర్మలకంటె,
అన్యత్ర = ఇతరములైన కర్మలయందు,
అయం లోకః = ఈ లోకము,
కర్మబంధనః = కర్మయే బంధముగా గలదిగ,
(భవతి = అగుచున్నది)
హే కౌన్తేయ! = కున్తీపుత్రుడవగు ఓ అర్జునా !
తదర్థం = ఆ యజ్ఞముకొరకే,
కర్మ = కర్మను,
ముక్తసంగః సన్ = ఫలవాంఛారూపమగు సంగమును విడిచినవాడవై,
సమాచర = చక్కగ చేయుము,

తా. యజ్ఞార్థము చేయుకర్మలు గాక ఇతరమైన కర్మలచేతనే మానవలోకము బంధింపబడుచున్నది. అర్జునా! ఆసక్తిని వదలి యజ్ఞము కొరకు కర్తవ్య కర్మలను చక్కగ ఆచరించుము.

## అ మృ త వా హి ని :-

అర్జునా! నీవు కర్మలు చేయకతప్పదు; కాని యజ్ఞము కొరకే కర్మలు చేయుము. యజ్ఞముకొరకే చేయబడు కర్మలు గాక తదితరమైనకర్మలు మానవులను బంధించు చున్నవి. యజ్ఞముకొరకు చేయబడు కర్మలు బంధించవు. నన్ను పొందుట కుపయోగించునుకూడ. కనుక ఓ అర్జునా! నీవు ఎంతమాత్రమును ఆసక్తిలేనివాడవై, యజ్ఞముకొరకే కర్మలు చేసినయెడల పూర్వసంచిత పాపపుణ్యములుకూడ నశించి పోవును. పాపపుణ్యములే బంధనములు.

ఇచ్చట యజ్ఞములనగా-లోకోపకారమునకు హేతువులైన శాస్త్రవిహిత కర్మలన్నియును యజ్ఞములే; ఇవి బంధించవు; ఉన్న బంధములనుకూడ వదలించును; లోక కల్యాణ కారకములగును.

'ముక్తసంగుడవై ఆచరించుము' అనగా కర్మల యందును కర్మఫలమునందునుకూడ మమకారము ఆసక్తియు లేక ఆచరించుము అని భావము.

యజ్ఞమనగా 'విష్ణువు' అని అర్థమున్నది. "యజ్ఞోవై విష్ణుః" అని శ్రుతి. కనుక యజ్ఞముకొరకు అనినప్పుడు పరమాత్మకొరకు అని అర్థము తీసికొనవచ్చును. నారాయణ తీర్థులవారుకూడ తమ "కృష్ణలీలా తరంగిణి" గ్రంథమునందు

"యజ్ఞ ! యజ్ఞసంరక్షణ !" అని పరమాత్మను "యజ్ఞ !" అని సంబోధన చేసినారు. కనుక పరమాత్మకొరకు చేయబడు కర్మలు బంధించవు. తదితరములైన కర్మలు మాత్రమే బంధన కారణములు. ఇంకను కర్మలు చేయకుండ మానవు డుండ లేనప్పుడు ఆ కర్మలు యజ్ఞార్థము అనగా భగవత్సేవారూప మున చేసిన యెడల బంధించకపోవుటమాత్రమే కాదు - మానవజన్మకు పరమలక్ష్యమైన భగవత్ప్రాప్తిని కలిగించును. భగవదర్థమై కర్మ చేయుటయన, వర్ణాశ్రమోచితమైన శాస్త్రీయకర్మలను జేయుచు, ఫలమును 'కృష్ణార్పణము' అని భగవంతునికే అర్పించవలయును. అది భగవత్స్వరూపము గానే చేయవలయును. ఇదియే యజ్ఞమనగా.

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ
మేష వోఽస్త్విష్టకామధుక్ ॥ ౧౦

ప. వి ;—సహ, యజ్ఞాః, ప్రజాః, సృష్ట్వా, పురా, ఉవాచ, ప్రజాపతిః, అనేన, ప్రసవిష్యధ్వం, ఏషః, వః, అస్తు, ఇష్టకామధుక్.

టీక ;—

పురా = పూర్వకాలమందు,
ప్రజాపతిః = బ్రహ్మదేవుడు,

సహయజ్ఞాః = యజ్ఞములతో కూడినవారుగా,
ప్రజాః = మానవులను,
సృష్ట్వా = సృజించి,
అనేన = ఈ యజ్ఞముచేత,
ప్రసవిష్యధ్వం = వృద్ధినిబొందుడు,
ఏషః = ఇది,
వః = మీాకు,
ఇష్టకామధుక్ = ఇష్టమైనవాంఛలను పూరించునదిగ,
అస్తు = అగుగాక !
(ఇతి = అని)
ఉవాచ = పలికెను.

తా. ప్రజాపతి ఆదిలో యజ్ఞములతో కూడినవారుగ ప్రజలను సృష్టించి "ఈ యజ్ఞములద్వారా మీరు వృద్ధిని పొందుడు. ఈ యజ్ఞములు మీమీ మనోరథ భోగములనిచ్చును" అని పలికెను.

అ మృ త వా హి ని :—

ప్రజాపతి అనగా చతుర్ముఖబ్రహ్మ; ఆయనయే సృష్టించుచున్నాడు - కనుక ఇచ్చట ప్రజాపతి అనగా సామాన్యముగా అందరును బ్రహ్మఅనియే అర్థము చెప్పుదురు. కాని సృష్టికి ఆదికారణము భగవంతుడు. కనుక భగవంతుడని అర్థము చెప్పుట శ్రేష్ఠమైనది. "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ !" అనుచోట ఈ అర్థమే ధ్వనించుచున్నది. ఆ రెండు నిష్ఠలలో ఒకటిగదా ఈయజ్ఞము! సామాన్యదృష్టిలో సృష్టికర్త బ్రహ్మయే అయినను, మొదటికి

పోయి చూచిన "సర్వభూతాని కౌన్తేయ ! ప్రకృతిం యాంతి మామికామ్, కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహామ్ "నేనే సృష్టికర్త" నని తొమ్మిదవ అధ్యాయములోని ఏడవ శ్లోకములో చెప్పుకొనియున్నాడు. స్వయముగా బ్రహ్మయే తన కుమారుడైన నారదునకు ఈరహస్యము చెప్పినాడు "సఏష ఆద్యః పురుషః కల్పేకల్పే సృజ త్యజః"అని. (భాగ-౨-౬-౩౯)

ఇంకొకచోట కూడ చెప్పినాడు-"తస్మైనమోభగవతే వాసుదేవాయ ధీమహి యన్మాయయా దుర్జయయా మాం బ్రువంతి జగద్గురుమ్॥" (భాగ. ౨-౫-౧౨) 'కుమారా ! నేను కూడ ఏవాసుదేవునికి నమస్కరించుచున్నానో అతని బలమైన మాయచేత అంధులైనవారు నన్ను ఈ జగత్తునకు స్వామిగా తలంచుచున్నారు' అని. కనుక ఇచ్చట 'ప్రజాపతి' అనగా భగవంతుడని అర్థము చెప్పుటయే సమంజసమైయున్నది.

అయితే "తనను గూర్చి చెప్పుకొనునప్పుడు ఉత్తమ పురుషలో చెప్పుకొనక ప్రథమపురుషలో చెప్పుకొనునా ?"అని ప్రశ్న వేయనక్కరలేదు. గీతలోనే కొన్ని సందర్భములలో అట్లు చెప్పుకొనినాడు. ఇది భాషలో ఒక్కొక్కభావమును వ్యక్తము చేయుటకు ఉపయోగపడును. భారతయుద్ధములో సైంధవవధ సందర్భములో భీమునకు ద్రోణాచార్యులు అడ్డుపడినప్పుడు భీముడు యుద్ధము చేయుచుండగా ద్రోణాచార్యులు "ఏమోయి! అర్జునుడుకూడ నాకు నమస్కరించి నా అనుజ్ఞమీద దాటి పోయినాడు; నీవు కూడ అట్లుచేయుము" అనినాడు. అంతట భీముడు కన్నులెఱ్ఱజేసి 'ఏమీ ! వచ్చినది భీముడుసుమా !

వీడు ఒకరి యాజ్ఞలకొరకు వేచియుండువాడుకాడు; నీకు శిష్యుడునుకాడు; శత్రువు. నిన్ను యుద్ధమున జయించిపోవును గాని నీ అనుజ్ఞకొరకు యాచించడు" అని సమాధాన మిచ్చినాడు.

ఇచ్చట భీముడు తనను ప్రథమపురుషలోనే చెప్పుకొని నాడు. నారదులవారు కూడ తమ భక్తిసూత్రములలో "నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమవ్యాకుల తేతి" అనియును, "స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః" అనియును తమను ప్రథమపురుషలో చెప్పుకొనినారు. గీతలోనే కృష్ణపరమాత్మకూడ "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి(౧౮-౬౧) "తమేవ శరణంగచ్ఛ" (౧౮-౬౨) అని తనను ప్రథమపురుషలోనే చెప్పుకొనినాడు. అట్లే ఇచ్చటను 'ప్రజాపతి' అని చెప్పుకొనినాడు.

"అర్జునా ! భగవంతుడు మొదట యజ్ఞములతో సహా ప్రజలను సృష్టించి వారితో ఇట్లు చెప్పెను- "మీరు ఈయజ్ఞ ములద్వారా వృద్ధిని పొందుడు. ఈ యజ్ఞములు సక్రమముగా ఆచరించుటచేత మీకు మీ మీ మనోరథములను కామము లను నెరవేర్చగలవు."

యజ్ఞములనగా మానవునకు స్వధర్మరూపములును, శాస్త్రవిహితములును నైన కర్మలన్నియును. ఇవన్నియును ప్రజలకు ఏర్పాటు చేసిన పరమాత్మ ప్రజలకు హెచ్చరిక ఇచ్చు చున్నాడు-"మీరు ఈయజ్ఞములద్వారా ఐహికముగ పార

మూర్థికముగ ఉన్నతిని పొందవలసినది. ఈ లోకములో మీకు కావలసిన కోరికలు గూడ ఈ యజ్ఞములవలన నెరవేరగలవు."

శ్లో॥ దేవాన్ భావయతానేన
తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః
శ్రేయః పర మవాప్స్యథ ॥ ౧౧

ప. వి :— దేవాన్, భావయత, అనేన, తే, దేవాః, భావయన్తు, వః, పరస్పరం, భావయన్తః, శ్రేయః, పరం, అవాప్స్యథ.

టీక :—

అనేన = ఈ యజ్ఞముచేత,
దేవాన్ = దేవతలను,
భావయత = పూజింపుడు,
తే దేవాః = ఆ దేవతలు,
వః = మిమ్ము,
భావయన్తు = ఆదరింతురుగాక !
పరస్పరం = ఒండొరులను,
భావయన్తః = ఆదరించుకొనినవారై,
పరం = ఉత్తమమగు,
శ్రేయః = శ్రేయస్సును,
అవాప్స్యథ = పొందగలరు,

తా. మీరు ఈ యజ్ఞములద్వారమున దేవతల నారాధింపుడు. దేవతలు మిమ్ము వృద్ధి పొందింతురు. ఈ విధముగ మీరు పరస్పరము సహాయము చేసికొనుచు ఉత్కృష్టమైన శ్రేయమును పొందుడు.

అమృతవాహిని :—

భగవానుడు దేవతలకు మానవులకు పరస్పర సంబంధమేర్పాటుజేసి "ఒకరి కొకరు సహాయము చేసికొని సుఖమును పొందుడు" అని నియమించినాడు.

మానవులు యజ్ఞములద్వారా దేవతల నారాధించవలయును. దేవతలు మానవులకు ఇష్టకామ్యములు నెరవేర్తురు. ఇట్లు ఒండొరుల సహాయముతో వృద్ధిపొందవలసి యున్నది.

యజ్ఞము అనుపదము శాస్త్రవిహితమైన సర్వకర్మలను ఉద్దేశించి చెప్పబడినది. వానిలో ఎవరెవరికి ఏ ఏ కర్మలు స్వధర్మములో వారు వారు ఆ యా సత్కర్మలు చేయకతప్పదు. ఈ యజ్ఞయలను సక్రమముగా ఆసక్తిరహితులై ఆచరించుట చేత సంసారమునందు సుఖముగా, అనాయాసముగా ముందునకు ప్రయాణముజేసి పరమశాంతిని పొందగలరు.

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా
దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో
యో భుంక్తే స్తేన ఏవ సః ॥ ౧౨

ప. వి :— ఇష్టాన్, భోగాన్, హి, వః, దేవాః, దాస్యన్తే, యజ్ఞభావితాః, తైః, దత్తాన్, అప్రదాయ, ఏభ్యః, యః, భుంక్తే, స్తేనః, ఏవ, సః.

టీక :—

యజ్ఞ భావితాః = యజ్ఞములచేత ఆరాధింపబడిన,
దేవాః = దేవతలు,
వః = మీకొరకు,
ఇష్టాన్ = అభీష్టములైన,
భోగాన్ = భోగములను,
దాస్యన్తేహి = ఈయగలరుకదా!
తైః = ఆ దేవతలచేత,
దత్తాన్ = ఈయబడిన భోగములను,
ఏభ్యః = ఈ దేవతలకొరకు,
అప్రదాయ = ఈయక,
యః = ఎవ్వడు,
భుంక్తే = భుజించుచున్నాడో,
సః = వాడు,
స్తేన ఏవ = చోరుడే.

తా. యజ్ఞములచేత నారాధింపబడినదేవతలు మీకు ఇష్టమైన భోగముల నిత్తురు. వారిచేత ఈయబడిన భోగములను మరల వారికి యజ్ఞముల ద్వారా నివేదనచేయకయే ఎవడు అనుభవించునో వాడు దొంగయే అగుచున్నాడు.

అ మృ త వా హి ని :—

యజ్ఞము లనగా - శాస్త్రవిహితములైన సమస్త సత్కర్మములు అని నిర్ణయము.

దేవతలు అనగా పరమాత్మకు అవయవభూతులు; ఆయన యొక్క అధికారమునకు లోబడి పనులు చేయువారు.

ఈ విషయము తెలిసికొని, వ్యక్తియొక్క ఏ అవయవమునకు సేవజేసినను ఆ వ్యక్తికి చేసినట్లే అయినట్లు, ఏ దేవతకు సేవజేసినను, ఏ దేవతను ఆరాధించినను పరమాత్మకు సేవజేసినవారే, పరమాత్మను ఆరాధించినవారే అగుదురు. దాని ఫలముగా వారికి పరమశాంతి, పరమశ్రేయస్సు లభించును. లేక ఆ యా దేవతలనే ప్రధానులుగా తలచి సకామముగా ఆరాధించినను మానవునకు ఈ లోకమునగాని, పరలోకమునగాని అర్హములైన భోగములు లభించును. మానవుడు ఈలోకములో ఆ యా దేవతలచే ప్రసాదించబడిన భోగములను మరల వారికి సమర్పించక- అనగా ఆరాధించక- కేవలము తానే అనుభవించినయెడల వాడు దొంగ అగుచున్నాడు.

ఎవరికి ఎంతెంత భాగము న్యాయ్యముగా పంచవలయునో వారికి అంతంతభాగములనీయక తానే అనుభవించిన - ఇతరుల సొమ్మును వారి యనుజ్ఞ లేక అనుభవించినచో- దొంగ కాక మరెవ్వడు?

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో
ముచ్యంతే సర్వ కిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా
యే పచ న్త్యాత్మకారణాత్ ॥ ౧౩

ప. వి ;— యజ్ఞశిష్టాశినః, సన్తః, ముచ్యన్తే, సర్వకిల్బిషైః, భుంజతే, తే, తు, అఘం, పాపాః, యే, పచన్తి, ఆత్మకారణాత్.

టీక ;—

యజ్ఞశిష్టాశినః = యజ్ఞము చేయగా మిగిలిన అన్నమును భుజించెడి,
సన్తః = సత్పురుషులు,
సర్వకిల్బిషైః = సమస్త పాపములనుండియు,
ముచ్యన్తే = విడువబడుచున్నారు,
యేతు = ఎవ్వరైతే,
ఆత్మకారణాత్ = తమకొరకే,
పచన్తి = వండుకొనుచున్నారో,
పాపాః = పాపులైనట్టి,
తే = వారు,
అఘం = పాపమును,
భుంజతే = భుజించుచున్నారు.

తా. యజ్ఞముచేయగా మిగిలిన పదార్థమును భుజించువారు - అనగా అనుభవించు సత్పురుషులు - సమస్త పాపములనుండియు విడువబడు చున్నారు. కేవలము తమకొరకే వండుకొను పాపాత్ములు పాపమును భుజించుచున్నారు.

అమృతవాహిని :—

యజ్ఞము చేయుటకే మానవజన్మ ఏర్పడినది. తాను చేయవలసిన యజ్ఞముల కొరకే మానవుడు పదార్థములను సంపాదించుట. అట్లు యజ్ఞములకై తాను సంపాదించిన

పదార్థములతో యజ్ఞము చేసి, అనగా దేవతలకు సమర్పించి, క్రమబద్ధముగా దేవతల నారాధించి, మిగిలిన అన్నమును, అనగా పదార్థములను భుజించవలయును. ఆ అన్నము-ఆ పదార్థము - 'అమృతము' అనబడును. ఆ అమృతమును భుజించువారు, అనుభవించువారు సర్వపాపములనుండియు విడివడి బయటపడుచున్నారు.

ఇదే విషయము నాల్గవ అధ్యాయములో ముప్పదిఒకటవ శ్లోకములో చెప్పబడినది - "యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్" 'ఆ అమృతభుక్కులు సనాతన పరబ్రహ్మమును పొందుచున్నారు' అని. అట్లు చేయక అట్లు సంపాదించిన-దేవతలచే ప్రసాదించబడిన - ఆ యా పదార్థములతో దేవతల నారాధించక, కేవలము తమకొరకే వండుకొని భుజించువారు, అనుభవించువారు పాపాత్ములు. వారు భుజించునది, అనుభవించునది అన్నముకాదు; కేవలము అన్నరూపముగా ఉన్న పాపమే; వారు పాపమునే భుజించుచున్నారు. అన్నమే శరీరముగా పరిణమించును గాన, పాపమును భుజించుటచేత శరీరము పాపమయమే అగుచున్నది. అట్టి శరీరముతో చేయబడు సర్వమును పాపమయమే. కాబట్టి వారిజీవితమే పాపమయమగుచున్నది. యజ్ఞము చేసి మిగిలిన పదార్థములను ప్రసాద బుద్ధితో అనుభవించువాడు మాత్రమే అమృతమును భుజించుచున్నాడు; కాన వాని శరీరము అమృతమయమే అగుచున్నది. అట్టివాని శరీరముతో చేయబడు సర్వమును అమృతమే అగు

చున్నది; కనుక వానిజీవితమే అమృతము; అట్టివాడు అమృత స్వరూపమైన సనాతన బ్రహ్మమును పొందుచున్నాడు.

ఈ శ్లోకము అన్నము ఉపలక్షణముగా, మానవుని సర్వమును ఉద్దేశించి చెప్పబడినది. మానవుడు తాను పండా కొనిన అన్నమునందు తనకొక్కనికే అధికారమున్నదని భావించి,అది తన ఒక్కనిదే అని భ్రాంతిజెంది, కేవలము తానొక్కడే అనుభవించినయెడల, దొంగబుద్ధితో ఇతరుల సొత్తును అనుభవించిన పాపమును తనకుతానై నెత్తిపై రుద్దుకొను చున్నాడు.

అనగా మానవునకు, దేవతలను అవయవములుగాగలిగిన పరమాత్మచేతనే, ఆ దేవతలద్వారా ఈయబడిన సర్వశక్తులను, సర్వపదార్థములను, సర్వపరిస్థితులను పరమాత్మకు అవయవ భూతులుగానున్న దేవతలకు "వాసుదేవస్సర్వమితి" "సర్వమును వాసుదేవుడే" "వాసుదేవుడే సర్వమును" అనుభావముతో నివేదింపవలెను. విశ్వములోని సకల జీవులకును వారివారి భాగములు వారివారికి సమర్పించక అనుభవించరాదు. అట్లు అనుభవించినవారి జీవితమంతయు పాపభూయిష్ఠమగును. అట్టి వానికి "నాయం లోకోஉస్త్యయజ్ఞస్య కుతోஉన్యః కురుసత్తమ !" ఈ లోకమేలేదు. ఇంక పరలోకము సంగతి, మోక్షము సంగతి చెప్పవలయునా ?"

మానవుడు తన శారీరక మానసిక బౌద్ధిక ఆర్థిక శక్తు లన్నిటిని, ఇంకను అనేక విధములైన పదార్థములన్నిటిని, లోక సేవకొరకు ఉపయోగించి, మిగిలినవి తాను అనుభవించవల యును. అప్పుడు వాని జీవితము అమృతమే; కాన వాడు అమృ

తుడు; వాడు చేయు ప్రతిపనియును అమృతము. ఆ అమృత మును తాను భుజించుటచేత తాను తరించుచున్నాడు; ఇతరులకు పెట్టుటచేత ఇతరులుకూడ తరించుచున్నారు. అట్లే తన శరీరము, మనస్సు, బుద్ధి, అర్థము - అన్నియును అమృతములగును. కనుక వానిచేత తాను తరించుటయేకాక అవన్నియును లోకకల్యాణ దాయకములగుచున్నవి. ఈ విషయము తెలిసినవారు పైన చెప్పిన తమ బలములను, శక్తులను పూర్తిగాగాని, కొంతవరకు గాని లోకసేవకు ఉపయోగించక ఎట్లుండగలరు ? ఇటువంటి వారినే ఈ శ్లోకములో 'సంతః' అని చెప్పినారు. అనగా వారే మానవులలో ఉత్తమోత్తములు. మిగిలినవారు దొంగలు.

ఎవరికి ఎంతభాగము పోవలయునో అంత భాగమును సమర్పించి, మిగిలినది అనుభవించువారు ఉత్తములు. మిగిలినది తనదేగదా ! దానిలో కూడ ఎంత ఎక్కువగా యితరులకు ఉపయోగించిన అంత ఉత్తమత్వము లభించగలదు. తన సర్వస్వము లోకసేవకు ఉపయోగించువాడు ఉత్తమోత్తముడు.

అట్లే ఎవరెవరికి ఎంతెంత పోవలయునో దానిని పూర్తిగ సమర్పించక, ఏ కొంచెమైనను దాచుకొని అనుభవించువాడు దొంగ. దానిలో కూడ ఎంతెంత ఎక్కువగ దాచుకొని అనుభవించిన దొంగతనములో అంతంత శ్రేష్ఠత్వము లభించును. అంతయు తానే అనుభవించువాడు పెద్దదొంగ-గజదొంగ.

ఈ రహస్యము తెలిసినవారు తమ శక్తి సామర్థ్యముల ననుసరించి లోకసేవ చేయుదురు; చేయవలయును.

శ్లో॥ అన్నా ద్భవంతి భూతాని
పర్జన్యా దన్న సంభవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మ సముద్భవః॥ ౧౪

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షర సముద్భవమ్ ।
తస్మా త్సర్వగతం బ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ౧౫

ప. వి :— అన్నాత్, భవంతి, భూతాని, పర్జన్యాత్, అన్న సంభవః, యజ్ఞాత్, భవతి, పర్జన్యః, యజ్ఞః, కర్మ సముద్భవః. (౧౪)

టీక :—

అన్నాత్ = అన్నమువలన,
భూతాని = ప్రాణులు,
భవంతి = కలుగుచున్నవి;
పర్జన్యాత్ = మేఘమువలన,
అన్న సముద్భవః = అన్నము పుట్టుట (జరుగుచున్నది);
యజ్ఞాత్ = యజ్ఞమువలన,
పర్జన్యః = మేఘము (వర్షము),
భవతి = కలుగుచున్నది;
యజ్ఞః = యజ్ఞము,
కర్మసముద్భవః = కర్మవలన కలుగుచున్నది.

ప. వి :— కర్మ, బ్రహ్మోద్భవం, విద్ధి, బ్రహ్మ, అక్షరసముద్భవం, తస్మాత్, సర్వగతం బ్రహ్మ, నిత్యం, యజ్ఞే, ప్రతిష్ఠితం. ౧౫

టీక :—

కర్మ = కర్మ,
బ్రహ్మోద్భవం = ప్రకృతివలన కలుగుచున్నది;
బ్రహ్మ = ప్రకృతి,
అక్షరసముద్భవం = అక్షర పరబ్రహ్మమునుండి కలుగుచున్నది;
తస్మాత్ = కాబట్టి,
సర్వగతం = సర్వవ్యాప్తియైన,
బ్రహ్మ = పరబ్రహ్మము,
నిత్యం = ఎల్లప్పుడును,
యజ్ఞే = యజ్ఞమునందు,
ప్రతిష్ఠితం = స్థిరముగా ఉన్నదని,
విద్ధి = తెలిసికొనుము.

తా. అన్నమువలన సమస్తభూతములును కలుగుచున్నవి. వర్షము కురియుటవలన అన్నము కలుగుచున్నది. యజ్ఞము చేయుటచేత వర్షము కురియుచున్నది. యజ్ఞము కర్మవలన జరుగుచున్నది. కర్మ ప్రకృతి వలన కలుగుచున్నది. ప్రకృతి అక్షర పరబ్రహ్మమునుండి బయలువెడలుచున్నది అని తెలిసికొనుము. కాబట్టి సర్వవ్యాపకమైన పరబ్రహ్మము యజ్ఞమునందు నిత్యమును ప్రతిష్ఠితమైయున్నది.

అమృతవాహిని :—

సమస్త భూతములును అన్నమువలన కలుగుచున్నవి. అన్నము వలన ఎట్లు కలుగుచున్నవి అనగా, అన్నము

భుజించబడి శరీరములో సప్తధాతువులుగా పరిణమించును.
చివరి పరిణామము పురుషులకైనచో శుక్లము-వీర్యము;అందురు
స్త్రీలకైనచో రజస్సు-శోణితము అందురు. ఈ రెంటి సంయో
గముచేత సర్వభూతముల ఉత్పత్తియును కలుగుచున్నది.
"అన్నాద్భూతాని జాయంతి" (తైత్తిరీయోపనిషత్తు రెండవ
వల్లిలో రెండవ అనువాకము). కనుక కృష్ణపరమాత్మ ఈ
శ్రుత్యర్థమునే ఇక్కడ చెప్పుచున్నాడు.

ఇక్కడ భూతములు అనగా ప్రాణులయొక్క అన్నమయ
కోశములైన ఈ స్థూలశరీరములు. ఆత్మ ఈ అన్నముచేత కలు
గుటలేదు. సూక్ష్మశరీరము, కారణశరీరము ఈ అన్నముచేత
కలుగుటలేదు. కనుక ఈస్థూలశరీరములే ఇచ్చట గ్రహించవల
యును- స్థూల పదార్థములన్నియును కాదు- ప్రాణులయొక్క
స్థూలశరీరములు మాత్రమే-ఇవి అన్నమువలన కలుగుచున్నవి.

కృష్ణపరమాత్మ 'జాయంతి' అనక 'భవంతి' అని
భావమును పూర్తిచేసినాడు. 'జాయంతి' అనగా పుట్టుచున్నవి
అని అర్థము. 'భవంతి' అనగా 'అగుచున్నవి' - తయారగు
చున్నవి అని అర్థము. శరీరములు మాతృగర్భములో తయా
రగుటకు కారణము ఎట్లు అన్నమో, అట్లే శరీరము పుట్టిన
తరువాతకూడా వృద్ధిఅగుటకు అన్నమే కారణము. "జాతా
న్యన్నేన వర్ధంతే" అని అక్కడనే చెప్పబడియున్నది. అన్నమే
శరీరముగా పరిణమించి శరీరము వృద్ధిపొందుచున్నది. కనుకనే
'యుక్తాహార విహారస్య' అని కృష్ణపరమాత్మ యుక్తాహారమును
చెప్పియున్నాడు. యుక్తమనగా 'తగినంత' అని ఒక అర్థము.

తక్కువ తినినయెడల శరీరము తన విధ్యుక్తధర్మమును నెర వేర్చుటకు చాలినంత శక్తిమంతముగా ఉండక, నీరసించును. మోతాదుకుమించి తినినయెడల శరీరమునకు అక్కరలేనంత బలముగలిగి, దానివలన క్రొవ్వెక్కి, మనము చెప్పినమాట వినక ఎదురుతిరుగును. కనుక యుక్తమనగా తగినంత మోతాదులో అని అర్థము. 'ఉచితమైనది' అని ఇంకొక అర్థము. భుజించు ఆహారముయొక్క సారముచేత శరీరము తయారగు చున్నది. గనుక, ఆహారము ఎట్టి గుణము కలిగినది అయిన, శరీరమును అట్టిగుణము కలిగినదే అగును. శరీరము సాత్త్వికమైనదిగా ఉన్నయెడల సాధకుని ఉద్దేశము ప్రకారము ఉపయోగపడును. రాజసమైనదిగను, తామసమైనదిగను ఉన్న యెడల సాధకునకు లోబడదు. కనుక 'సాధకుడు యుక్తమైన ఆహారమునే తీసికొనవలయును' అని పరమాత్మ ఆదేశము.

ప్రాణులకు అన్నము కావలయును. ఆ అన్నము ఎట్లు కలుగును ? "పర్జన్యా దన్నసంభవః" అన్నము వర్షమువలన కలుగుచున్నది. వర్షములు సకాలములో కురిసిన యెడల పైరులు చక్కగాపండి అన్నమును కలుగచేయును. పైరులు బాగుగా ఫలించవలయుననిన సకాలములో చాలినంతగ వర్షములు కురియవలెను. కనుక 'వర్షము వలన అన్నము కలుగుచున్నది' అని చెప్పబడినది.

వర్షములు యజ్ఞముల మూలమున కలుగుచున్నవి. "అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే; ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టిరన్నం తతః ప్రజాః" అని మనుస్మృతిలో

ఉన్నది. 'అగ్నియందు వేయబడిన ఆహుతి ఆదిత్యునియందు చేరును. ఆదిత్యునివలన వర్షము కురియును. వర్షమువలన అన్నము, అన్నమువలన ప్రజ కలుగును' అని తాత్పర్యము. వర్షములు కురియవలయుననిన, యజ్ఞములు చేయవలయును. ఇక్కడ వర్షములు కురియుట అనగా సస్యానుకూలముగా తగినంతలో సకాలములో కురియుటగా భావించవలయును. అనావృష్టి ఎట్టిదో అతివృష్టికూడ అట్టిదే.

యజ్ఞముల మూలమున సస్యానుకూలములైనవర్షములు సకాలములో కురియును. ఇప్పుడు యజ్ఞములు తగ్గుటచేతనే వర్షములుకూడ తారుమారై కావలసినప్పుడు కురియక, అనవసర సమయములలో - కురియకూడని సమయములలో - అతిగా కురియుట జరుగుచున్నది. దీనిచేత కలుగునది ప్రమాదమేగదా ! సకాలములో తగినంతగా కురియకపోవుటచే పంటలు సరిగా పండవు. అకాలములో అతిగా కురియుటచే పండిన ఆ కొద్దిపంటలైనను నీటిలో మునిగిపోయి కుళ్ళిపోవును. అకాలములో కురిసిన ఆ వర్షములు అతిగాకురియుటచేతవరదలు వచ్చి, కాలువలు తెగి, నదులుపొంగి గ్రామములమీద పడి, పొలములమీదపడి, పంటలకు, గ్రామములకు, ప్రాణులకు ప్రమాదము సంభవించుట ఫలము. కనుక దేశములో యజ్ఞము సురక్షితముగా సాగుచుండవలయును.

అయితే యజ్ఞమనగా కేవలము వేదమంత్రములతో అగ్నిలో నేయి వేల్చు ప్రక్రియతోకూడిన ఒక్కటియేకాదు - కృష్ణపరమాత్మ గీతలో అనేకవిధములైన యజ్ఞములను

చెప్పియున్నాడు. శాస్త్రసమ్మతముగా చేయబడు ప్రతి సత్కార్యమును యజ్ఞమే. కనుకనే కేవలము అగ్నిలో నేయి వేల్చి చేయు యజ్ఞములను అలవాటు లేని పాశ్చాత్య దేశములు సైతము, చక్కగా వర్షించి పంటలు బాగుగాపండి ఆర్థికముగ మంచి స్థితియందున్నవి. అచ్చట అగ్నితో చేయు యజ్ఞములు లేకపోవచ్చునుగాని, అనేక సత్కార్యములు జరుగుచుండ వచ్చునుగదా ! వాని ఫలముగ పంటలు బాగుండవచ్చును.

కనుక ఏ దేశములో, ఏ కాలములో ప్రజలందరును సద్గుణములు గలిగి, ఒకరి కొకరు సహాయపడుచు, ప్రేమతత్త్వమున మెలగుచుందురో, ఆ దేశములో ఆ కాలములో అన్నము సమృద్ధిగా ఉండును. పాడిపంటలు కొల్లలుగా ఉండును. అతివృష్టి అనావృష్టి దోషములు కలుగవు. కరవు కాటకము లుండవు. స్ఫోటకములు మరిడీజాడ్యములు మొదలగు జబ్బులు వ్యాపించవు. ప్రజలలో పరస్పరము సుహృద్భావములు కలుగుటచే తగవులు, పోట్లాటలు, యుద్ధములు ఉండవు. తల్లి, కుమారుడు కూడ న్యాయస్థానములు కెక్కు దుస్థితి తప్పును. ఐహిక జీవితము సుఖమయము, శాంతిప్రధానము అగును. అప్పుడు మానవుడు పరమార్థమునకు అధికారి అగును. ఇప్పుడు సత్కార్యాచరణము దేశములో తగ్గినను, దుష్ట స్వార్థము మానవహృదయాల నాక్రమించి స్వైరవిహారము సాగించుచున్నను, ఇంకను ఇంతమాత్రమైనను సక్రమముగా వర్షములుండి, పాడిపంటలు ఇంతమాత్రమైనను ఉన్నవనిన, అది పూర్వులు చేసిన నిష్కామ్య సత్కార్యాచరణము

యొక్క సంచితమే. కూర్మాని తినుట సాగించినచో, దుర్వ్యాఖ్యాలు చేయసాగినచో ఎంతటి ఆస్తులుగాని, ఐశ్వర్యములుగాని ఆగనట్లు, ఈ సంచితముకూడ తగ్గిపోవుచున్నది. ఈ సంచితము పూర్తి అయిపోయిననాడు ఇంక మానవునకేమి, మిగిలిన ప్రాణులకేమి శరీరనిర్వహణమునకు తగినంత ఆహారముకూడ లభించదు. అసలు వర్షములులేక కొంతకాలము, అంతయు జలమయము అగునట్లుగ మురుగువర్షములు కొంత కాలము జరిగి, అందుచేత పంటలు పండక, సర్వనాశనము ప్రాప్తించును. కనుక మరల ఈ ధర్మమును పునఃస్థాపించవలయును. దీనికే సమస్తులైనవారు పూనుకోవలయును.

ప్రతిమానవుడు తన కర్తవ్యపాలనము అవశ్యము చేసియే తీరవలయును. కాని ప్రతిమానవుడు తనంతట తానే ధర్మము ఆచరించలేడు. పైన ఆచరింపజేయువారు ఉండవలయును. క్షాత్రధర్మము ఏర్పడినది, ప్రజలలో ఈ విధమైన ధర్మసంస్థాపన చేయుటకే. ఆధ్యాత్మిక సంస్థలు, ప్రభుత్వము చేయి చేయి కలుపుకొని ప్రజలలో ఈ వాతావరణమును సృష్టించుటకే కృషి చేయవలయును. ఇంతకంటె వాటియొక్క ప్రయోజనము వేరొకటిలేదు.

"యజ్ఞః కర్మ సముద్భవః"-యజ్ఞము కర్మవలన కలుగుచున్నది. అన్నిటిలో వేల్చుట రూపమైన యజ్ఞము ఋత్విక్కులు, యజమాని మొదలగువారి వ్యాపారములు మొదలగువానివలన కలుగుచున్నది. హోమము, మంత్రములు, తాంత్రికక్రియలు మొదలగువానిచేత ఆ విధమగు యజ్ఞము

సిద్ధించుచున్నది. ఆయా వ్యాపారములకు కర్మలు అని పేరు. అంతేగాక లోకోపకారకమైన ప్రతికార్యమును యజ్ఞముగనే కృష్ణపరమాత్మ సిద్ధాంతీకరించినాడు. అయినప్పుడు ఎట్టి సత్కార్యము జరుగవలసియున్నను మానవులయొక్క మనోబుద్ధీంద్రియ శరీరములయొక్క చేష్టలేగదా సాధనములు! ఈ చేష్టలకే కర్మలు అని ప్రయోగింపబడినది. కనుక సమస్తమైన సత్కార్యములును ఈ కర్మలవలననే కలుగుచున్నవి.

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి" - కర్మ బ్రహ్మమునుండి పుట్టుచున్నది.

ఇక్కడ బ్రహ్మమనగా చాలమంది 'వేదము'అని అర్థము చెప్పినారు. అమృతవాహిని అభిప్రాయమున ఇచ్చట బ్రహ్మము అనగా ప్రకృతి. ఏలయన - జగత్తులో ఏపని జరిగినను దానికి కారణము ప్రకృతియే. పదమూడవ అధ్యాయములో ఇరువదవ శ్లోకములో "కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" 'దేహేంద్రియ మనోబుద్ధి వ్యాపారములు ప్రకృతివలననే కలుగుచున్నవి"అని చెప్పబడినది. పదునాల్గవ అధ్యాయములో పందొమ్మిదవ శ్లోకమును "నాన్యం గుణేభ్యః కర్తారంయదా ద్రష్టానుపశ్యతి"అనిగుణములే కర్తగానిర్ణయించినది. గుణములు ప్రకృతిసంభవములేగదా! కనుక కర్మలు ప్రకృతివలననే జరుగుచున్నవి. ఇక్కడ 'బ్రహ్మము' అనగా ప్రకృతి అని చెప్పుటే సమంజసము.

"బ్రహ్మము" అనునది ప్రకృతిపరముగ ఎక్కడైనను వాడబడి ఉన్నదా అని పరిశీలింతము. పదునాల్గవ అధ్యాయ

ములో మూడవ శ్లోకమున "మమ యోనిర్మహద్బ్రహ్మ" అని చెప్పినచోట 'బ్రహ్మ' అనగా ప్రకృతి అనియే అర్థము. ముండకోపనిషత్తులో మొదటిముండకము మొదటి ఖండము "యస్సర్వజ్ఞ స్సర్వవిత్, యస్యజ్ఞానమయం తపః, తస్మాదేత ద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే" అని ఉన్నది. ఈ మంత్రములోని 'బ్రహ్మ' అనునది 'ప్రకృతి'అను అర్థమున ప్రయోగించబడినది. కనుక ఈ సందర్భమున కూడ 'బ్రహ్మ మనగా 'ప్రకృతి' అనియే అర్థము చెప్పి 'కర్మలు ప్రకృతివలన కలుగుచున్నవి' అనుచున్నాము.

'వేదము' అని అర్థము చెప్పుటకూడ మాకు పూర్తిగా అసమ్మతము కాదుగాని, 'ప్రకతి' అను అర్థము పై అర్థము కంటె సమంజసముగా తోచుచున్నది. 'వేదము' అనువారు చెప్పున దేమన- ఎవరు ఏ కర్మలు చేయవలయును ? ఎప్పుడు చేయవలయును ? ఎట్లుచేయవలయును ?- ఈ విషయము లన్నియును వేదమునందు చెప్పబడియున్నవి. వేదములయందు చెప్పబడియున్నట్లే చేయవలయును గాని వేఱువిధముగ చేయరాదు. కనుక కర్మలు వేదములనుండి పుట్టుచున్నవి.

"ప్రకృతికూడ అనాది. కనుక అది పరబ్రహ్మమునుండి పుట్టుచున్నది అనుటకు వీలులేదు."

ప్రకృతి అను అర్థము పొసగదనుటకు పై వారు చెప్పు హేతువిది-

ఇదొక్కటే వారు చెప్పిన అభ్యంతరము. అయితే వేదముకూడ అనాదియేకదా ! నిత్యమైనదేకదా ! దానిని

మాత్రము పరబ్రహ్మనుండి పుట్టినదిగా ఎట్లు చెప్పవచ్చును ? అను ప్రశ్నవచ్చును - దానికి వారి సమాధానము - "వేదము అనాది, నిత్యము అని మేమును ఒప్పుకొందుము. 'వేదము పర బ్రహ్మమునుండి పుట్టుచున్నది' అన్నంతమాత్రమున వేదము మొదటలేనిదనియు, తరువాత వెనుకనుండి పుట్టినది అనియు మా అభిప్రాయముకాదు. వేదము ఒకమానవునిచేత రచింప బడినదికాదు; అది అపౌరుషేయము; అది పరబ్రహ్మమునుండి బహిర్గతమైనది - ప్రకటమగుచున్నది. ప్రళయకాలములో ఆయనయందు లీనమగుచున్నది. ఈ అభిప్రాయము ప్రకారము వేదము పరబ్రహ్మమునుండి పుట్టినది" అని.

ప్రకృతి అని అర్థము చెప్పిన యెడల ఎట్టిబాధ కలుగు చున్నదని మీరు చెప్పినారో ఆ బాధనుకూడ ఈ సమాధాన ముతో మీరే నివారణ చేసినారు.

వేదము అనాది, నిత్యము అని ఒప్పుకొనినను, పర బ్రహ్మమునుండి పుట్టుచున్నది అనుటచేత ఆ అనాదిత్వము నకును, నిత్యత్వమునకును బాధ ఉండదని మీరు ఎట్లు అనుకొని నారో, అట్లే 'ప్రకృతి' అని అర్థము చెప్పుకొన్నను ప్రకృతి యొక్క అనాదిత్వమునకును నిత్యత్వమునకు బాధకలుగదు. ఈ ప్రకృతి ప్రళయకాలములో పరబ్రహ్మమునందు లీనమై మరల సృష్టి ఆరంభమున ఆయననుండియే వ్యక్తమగుచున్నది. కనుక 'ఆయన వలననే పుట్టినది' అని చెప్పుటకు ఎట్టి ఆక్షేపణ యును ఉండదు.

"వేదము కర్మ చేయునట్టి విధానము చెప్పుచున్న దేగాని కర్మలు వేదమునుండి పుట్టుటలేదు. వేదముచేత కర్మలు కలుగుటలేదు. ప్రకృతినుండియే కర్మలు పుట్టుచున్నవి; ప్రకృతి వలననే కర్మలు కలుగుచున్నవి. కాబట్టి ఇక్కడ బ్రహ్మమనగా ప్రకృతి అనియే అర్థము చెప్పుచున్నాము. అభిప్రాయభేదము లుండుట సహజము. పై వారి అభిప్రాయమును మేము కాదనముగాని దానికంటె ప్రకృతి అని అర్థము చెప్పుట ఎక్కువ సమంజసమని మాత్రము మా నిశ్చితమైన అభిప్రాయము.

"బ్రహ్మాక్షరసముద్భవం" - ఆ బ్రహ్మ అక్షరమునుండి కలిగినది. కర్మకు కారణమైన ప్రకృతి అక్షరము - అనగా పరబ్రహ్మము - నుండి కలిగినది. అనగా ప్రళయములో ఆయనయందు లీనమైయుండి సృష్టికాలములో ఆయననుండి మరల వ్యక్తమగుచున్నది. పరబ్రహ్మమునుండి పుట్టుటయనగా అదియే.

అక్షరమనగా కొంతమంది 'జీవాత్మ' అని అర్థము చెప్పినారు. ప్రకృతి అనగా ప్రకృతి పరిణామమైన శరీరమని అర్థము చెప్పి ఆ శరీరమునకు అధిష్ఠాత జీవాత్మకనుక ఆ జీవాత్మ ఉండుటచేతనే ఆ శరీరము కర్మలు చేయుటకు సమర్థమగుచున్నది గనుక 'శరీరము జీవాత్మవలన కలుగుచున్నది' అని అర్థము చెప్పినారు.

అమృతవాహిని ఇక్కడ ప్రకృతి అనగా దేహము లన్నిటికిని కారణమైన సత్త్వరజస్తమోగుణములకును మూలకారణమై 'కార్యకారణ కర్తృత్వే' అని చెప్పబడిన ప్రకృతియే

అని అర్థము చెప్పుచున్నది. ఈ ప్రకృతి జీవాత్మనుండి కలుగుట లేదు. కనుక 'అక్షరము' అనిన పరబ్రహ్మమునే అర్థము చెప్పుకొనవలసి యున్నది.

"తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం"
"కాబట్టి సర్వగతమైన, నిత్యమైన బ్రహ్మము యజ్ఞమునందు ప్రతిష్ఠితమై యున్నది". ఇక్కడ బ్రహ్మమునకు ఏమి అర్థము చెప్పవలయును ? 'కర్మబ్రహ్మోద్భవం' అనినప్పుడు బ్రహ్మము నకు వేదము అని అర్థము చెప్పినవారు "యజ్ఞమునందు వేదము ప్రతిష్ఠితమైయున్నది" అనియును, బ్రహ్మమనగా ప్రకృతి అని అర్థము చెప్పినవారు "యజ్ఞమునందు ప్రకృతి ప్రతిష్ఠితమై యున్నది" అనియును చెప్పినారు.

వారి వాదముప్రకారము కర్మ ప్రకృతినుండి కలిగినది. కనుక కర్మయందు ప్రకృతి వ్యాపించి యుండునుగదా ! కారణము కార్యమునందువ్యాపించియుండుట సహజముగదా! ఈ న్యాయముచేత కర్మయందు-అనగా కర్మకు కార్యరూపమైన యజ్ఞమునందు-ప్రకృతి, లేక వేదము వ్యాపించి యుండవల యును; కనుక బ్రహ్మము అనగా వేదము లేక ప్రకృతి అని చెప్పవలయు నని వారి అభిప్రాయము.

మా అభిప్రాయము వివరింతుము- సంస్కృతమున ఒక శబ్దమునకు అనేకార్థము లుండవచ్చును. అన్ని శబ్దములకు కాకపోయినను కొన్ని శబ్దములకు నానార్థములు గలవు. గీతలోనే 'ఆత్మ' అనునది ఒకే అర్థములో వాడబడలేదు. అనేకార్థము

లలో వాడబడినది. అట్లే "యోగ" శబ్దము కూడ ఆయా సందర్భములలో చూడనగును. బ్రహ్మశబ్దమునకు కూడ ప్రకృతి వేదము, చతుర్ముఖబ్రహ్మ, బ్రాహ్మణుడు, పరబ్రహ్మము ఇన్ని అర్థములు గలవు. ప్రకరణమునుబట్టి ఆయా అర్థముల చెప్పికొనవలయును.

"కర్మబ్రహ్మోద్భవం" అనినప్పుడు బ్రహ్మశబ్దమునకు ప్రకృతి అనియే అర్థము చెప్పవలయును; "బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం" అనినప్పుడు 'బ్రహ్మ' అనగా పరబ్రహ్మమనియే అర్థము చెప్పవలయును.

ఈ శ్లోకములో సూచనగా చెప్పిన ఈవిషయమే నాల్గవ అధ్యాయములోని ఇరువదినాల్గవ శ్లోకములో విపులముగా చెప్పబడియున్నది. "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః - బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా" యజ్ఞములోని సర్వమును బ్రహ్మాత్మకమనియును, కనుక బ్రహ్మాత్మకమైన కర్మ చేత యజమాని పొందునది బ్రహ్మమునే అనియును భావము. ఇక్కడ బ్రహ్మమనగా ప్రకృతి కాదు; పరబ్రహ్మమే. ప్రకృతియైనపక్షమున యజ్ఞకర్త చేత పొందబడునది ప్రకృతియా? ఇది శాస్త్రవిరుద్ధము. ఇక్కడ శ్రీమద్రామానుజులు కూడ బ్రహ్మమనగా పరబ్రహ్మము అను అర్థమునే చెప్పియున్నారు. కనుక "తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్" అనుచోట బ్రహ్మశబ్దమునకు అర్థము పరబ్రహ్మమనియే చెప్పవలయును.

అన్నమునకు వర్షము, కారణము, వర్షమునకు యజ్ఞము కారణము, యజ్ఞమునకు కర్మ కారణము, కర్మకు ప్రకృతి కారణము, ప్రకృతికి పరబ్రహ్మము కారణము. కార్యమునందు కారణము వ్యాపించియుండుట న్యాయ్యమే. అయినప్పుడు మూలకారణము పరబ్రహ్మము గనుక, సర్వమందును పరబ్రహ్మము ప్రతిష్ఠితమై యుండుట సమంజసము. కావున ఇక్కడ మేము బ్రహ్మమనగా పరబ్రహ్మమనియే అర్థము చెప్పినాము.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం
నానువర్తయతీహ యః ।
అఘాయు రింద్రియారామో
మోఘం పార్థ ! స జీవతి. ౧౬

ప. వి :— ఏవం, ప్రవర్తితం, చక్రం, న, అనువర్తయతి, ఇహ, యః, అఘాయుః, ఇంద్రియారామః, మోఘం, పార్థ, సః, జీవతి.

టీక :—

పార్థ ! = ఓ అర్జునా !
ఏవం = ఈవిధముగా,
ప్రవర్తితం = పరమాత్మచే చేయబడిన,
చక్రం = సృష్టిచక్రమును,
యః = ఎవడు,
ఇహ = ఈలోకమందు,

నానువ ర్తయతి = అనుసరింపడో,

సః = వాడు,

అఘాయుః = పాపమయమైన జీవితము గలవాడును,

ఇంద్రియారామః = ఇంద్రియలోలుడును (అయి),

మోఘం = వ్యర్థముగా,

జీవతి = బ్రతుకుచున్నాడు.

తా. అర్జునా ! ఈ విధముగ పరమాత్మచేత ఏర్పరుపబడిన సృష్టి చక్రమును ఎవ డనుసరింపడో, అట్టి ఇంద్రియలంపటుడైన పాపియొక్క జీవితము వ్యర్థము.

అ మృ త వా హి ని :—

సృష్టిపరంపరారూపమైన ఈ చక్రమును ప్రతిమానవుడును అనుసరించితీరవలయునని కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు - అనగా మానవుడు తన కర్తవ్యమును పాలించితీరవలయును అని భావము. లేనియెడల అట్టివాని ఆయువు పాపమయము. వాడు కేవలము ఇంద్రియముల ద్వారమున విషయముల ననుభవించుటయే పరమార్థమని భావించును. ఇంతకంటె పైన ఏమియు లేదని చెప్పును. కనుక పాపపుణ్య విచారము లేక, పశుపక్ష్యాదులకుకూడ సహజమైన ఇంద్రియ విషయములకే దుర్లభతమమైన తన మానవజన్మను ఉపయోగించి పాడుచేసికొను పాపి సృష్టికి బరువుచేటుగా బ్రతుకు చున్నాడు. వాని జీవితము వ్యర్థము. వాని ఆయువంతయును పాపమే.

తినుటకు బ్రతుకుచుంటిమనువారును, బ్రతుకుటకు తినుచుంటిమనువారును మానవులలో ఇరుతెగలు గలరు. తినుటకు అనుపదము ఉపలక్షణము; విషయములను అనుభవించుటకే అని భావము.

తినుటకే బ్రతికెడివారు ఇంద్రియారాములు. బ్రతుకుటకు తినువారు ఆత్మారాములు. ఇంద్రియారాములవలన లోకమునకు ఉపద్రవము. ఆత్మారాములవలన లోకమునకు కల్యాణము. కనుక ఇంద్రియారాములు పాపులు. వారు బ్రతుకుట వ్యర్థము. దేశములో ఎన్ని కుక్కలు, పందులు, పశువులు బ్రతుకుటలేదు! కేవలము తినుటకే బ్రతుకువారికిని వీనికిని భేదమేమున్నది? వీరు తినుటకే బ్రతుకుచున్నారు గనుక బ్రతికి ఏమిచేయవలయును అనుప్రశ్న వీరి కుదయించదు. ఒకవేళ ఎవరైనను వీరిని "మీరు బ్రతికి ఏమిచేయవలయును?" అని ప్రశ్నించినయెడల "తినవలయును". "విషయములను అనుభవించవలయును" అను సమాధానమే వచ్చును. కనుక వీరు పాపజీవనులు.

ఈ ప్రశ్నయే బ్రతుకుటకు తినువారిని వేసినయెడల "తినుటకు బ్రతుకుచున్నాము" అని సమాధానము చెప్పరు. ఎందువలన ? బ్రతుకుటకు తినుచున్నారుగనుక. అయితే "ఎందులకు బ్రతుకుచున్నాము ?" అను జిజ్ఞాస వీరికి కలిగితీరును. ఈ జిజ్ఞాస కలిగిననాడుగాని మానవుడు ఉన్నతికొరకు ప్రయత్నము చేయుడు. యథార్థమైన ఈ జిజ్ఞాసయే నిచ్చెనవలె మానవుని ఒక్కొక్కమెట్టే ఎక్కించి చివరకు గమ్యస్థానమును

జేర్చును. కనుక మానవుడు ఈ సృష్టిచక్రమును అనుసరించి తీరవలసిన దే. లేక ఎవడైనను మూర్ఖుడై వ్యతిరేకించిన యెడల ఏదో ఒకనాడు వాడు అగాధమున కూలవలసిన దే.

## సృష్టి చక్రము




అన్నమువలన సమస్త ప్రాణులును కలుగుచున్నవి. సమస్తప్రాణులలో కర్మచేయు నధికారము ఒక్క మానవులకే కలిగినది. కనుక మానవులనే తీసికొందము. మానవులవలన కర్మ, కర్మవలన యజ్ఞము, యజ్ఞమువలన వర్షము, వర్షమువలన అన్నము, మరల అన్నమువలన మానవులు,

ఇట్లే సృష్టిచక్రము తిరుగుచుండవలయును. ఈ సృష్టి చక్రమునకు వ్యాఘాతము తటస్థించినప్పుడు మరల బాగు చేయుటకు పరమాత్మ అవతరించుచుండును.

ఈ సృష్టిచక్రమునకు ఎవడు అనుకూలముగా నడచు చున్నాడో వాడు తన కర్తవ్యమును సక్రమముగ నిర్వర్తించు చున్నవాడగుచున్నాడు. ఎవడు సృష్టిచక్రమునకు అనుకూల ముగా నడచుకొనడో వాడు తన కర్తవ్యమును సక్రమముగా నిర్వర్తించనివాడగుచున్నాడు. కనుక తన కర్తవ్యమును సక్రమముగా నిర్వర్తించుటయే సృష్టిచక్రమును అనుసరించుట యనగా. ఎవరు ఈ సృష్టిచక్రమునకు అనుకూలముగా ప్రవ ర్తించక వ్యాఘాతమును కలిగింతురో వారే పరమాత్మ దృష్టిలో దుష్టులు. దేశకాల పరిస్థితులనుబట్టి వారిని ఎట్లు చక్కజేయవలయునో అవసరము వచ్చినపుడు ఆయనయే వచ్చి చక్కజేయుచుండును. చక్కజేసెడి విధానము దేశకాల పరిస్థితులనుబట్టి, వ్యక్తులయొక్క ఆంతర్యమునుబట్టి మారు చుండును. సృష్టిచక్రమునకు ప్రమాదము తటస్థించినదే అవ తారమునకు తగినకాలము. తన దుష్టస్వార్థమును న్యాయా న్యాయ విచక్షణలేక పూరించుకొనుటకు ప్రయత్నించువాడు పాపజీవి. అట్టివానిని గురించియే 'అఘాయుః' అని శ్లోకములో చెప్పబడినది. ఇతరులను బాధించియో, వేధించియో, మోస గించియో ధనసంపాదనజేయుచు, విషయోపభోగముల ననుభ వించుచు, జీవితమంతయు గడుపువాడు "అఘాయువు". వాని ఆయువంతయును పాపమయము, బాధించి, వేధించి తన

దుష్టస్వార్థము నెరవేర్చుకొనువానికంటె, మోసముచేసి నెర వేర్చుకొనువాడు మహాదుష్టుడు. కొలనిలోని కొంగలను తుపాకితో కొట్టువానికంటె తపశ్శాలివేషము వేసికొని, కొలను ఒడ్డునకూర్చొని, కొంగలకు 'వీడు చాల మంచివాడు; మనల నేమియు చేయడు' అను విశ్వాసము కలిగించి, దగ్గరకువచ్చిన కొంగలను వచ్చినట్లే, సమయము గమనించి సంచిలో వేసి కొనువాడు అతిదుష్టుడు. అట్లే ప్రపంచములో కొంతమంది పైకి చాల ఉత్తములుగను, పరులహితమును కోరువారుగను నటించుచు, తియ్యని మంచిమాటలు చెప్పుచు, పురుషుల యొక్కయు తల్లులయొక్కయు ధనశీలములను, శరీరములకు, మనస్సులకు నొప్పికలుగకుండ హరించి, తమ స్వార్థమును పూరించుకొనువారు కలరు; ఇట్టివారు మహాప్రమాదకరులు. దాపరములేకుండ బాహ్యముగాకూడ దుష్టులుగా ఉండువారి కంటె వీరిచేత దేశమునకు అరిష్టము ఎక్కువ. వీరు గోముఖ వ్యాఘ్రములు. ఇట్టివారిని ఏ రూపముననైనను ముందు వీరి వేయుటయే పరమాత్మ నిర్ణయించుకొనిన కర్తవ్యములలో ప్రధానమైనది. సృష్టిసాధమును, కూలుచున్నట్లు తెలియకుండ కూలద్రోయు పందికొక్కులు వీరు. పట్టుకొనుటకు దొరకరు. "వీడు ఈపనిని చేయును" అని ప్రజలు అనుకొననే అనుకొనరు. అంతటి విశ్వాసము కలిగించుకోగల నేర్పరులు వీరు. అట్టివారిని 'కాలనేములు' అనియును, 'పూతనలు' అనియును అనవలెను. వీరిచేత సృష్టిచక్రమునకు ఎక్కువగా వ్యాఘాతములు కలుగు చుండును. న్యాయ్యమైన స్వార్థమును, సృష్టిచక్రమునకు ప్రతి

బంధకము లేకుండ నెరవేర్చుకొనువారును గలరు. ఇట్టివారినే "కామ్యకర్మలు చేయువారు" అని చెప్పియున్నారు గీతలో. వీరు తమ కామములను శాస్త్రవిహితమైన కర్మలవలన నెరవేర్చుకొందురు. కాన వీరితో సృష్టిచక్రమునకు ప్రతిబంధకము కలుగదు. అయితే వీరుమాత్రము తమ తమ కర్మలు నిష్కామ్యముగా జేసిన, ఎట్టి మహోన్నతఫలము లభించునో, అట్టి మహోన్నతఫలమునుండి వంచింపబడి అల్పఫలమునుమాత్రము పొంది తృప్తిచెందుచున్నారు. కనుక వీరు జాలిపడదగినవారు. రత్నమునిచ్చి దానికిబదులు రేగిపండును తీసికొన్నట్లు తమ అమూల్యమానవజీవితమును, కర్మలను తుచ్ఛవిషయోపభోగములకుగా వినియోగించి వృథచేసికొనుచున్నారు. కాని, వారో సక్రమముగ లభించు సౌకర్యములతో తృప్తిపడక ఒక్కసారిగ బాపుకొనవలెనన్న దురాశతో - బంగారపుగ్రుడ్లు పెట్టు బాతును పగలగోసి, ఉన్న కొంచెము ఆధారమునుగూడ ఊడగొట్టుకొను అవివేకులు - మూలచ్ఛేదముచేయు కంటకులు- కనుకనే వ్యర్థముగ జీవించుచున్నారు అనుటతో ఆగక, పరమాత్మ వారికి "అఘాయువులు" అను బిరుదముకూడ ఇచ్చినాడు.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా
దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవచ సంతుష్ట
స్తస్య కార్యం నవిద్యతే ॥ ౧౭

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో
నాకృతే నేహ కశ్చన।
నచాస్య సర్వభూతేషు
కశ్చి దర్థవ్యపాశ్రయః॥ ౧౮

ప. వి :— యః, తు, ఆత్మరతిః, ఏవ, స్యాత్, ఆత్మతృప్తః, చ, మానవః, ఆత్మని, ఏవ, చ, సంతుష్టః, తస్య, కార్యం, న, విద్యతే, ౧౭

ప. వి :— న, ఏవ, తస్య, కృతేన, అర్థః, న, అకృతేన, ఇహ, కశ్చన, న, చ, అస్య, సర్వభూతేషు, కశ్చిత్, అర్థవ్యపాశ్రయః. ౧౮

టీక :—

యః మానవః తు = ఏ పురుషుడు,
ఆత్మరతిరేవ = ఆత్మయందే ప్రేమగలవాడును,
ఆత్మతృప్తశ్చ = ఆత్మయందే తృప్తిపొందినవాడును,
ఆత్మన్యేవచ = ఆత్మయందే,
సంతుష్టః = సంతోషపడువాడును,
స్యాత్ = అగునో,
తస్య = వానికి,
కార్యం = చేయవలసినది,
నవిద్యతే = లేదు. ౧౭

టీక :—

తస్య = వానికి,
ఇహ = ఈలోకమునందు.
కృతేన = కర్మ చేయుటచేత,

అర్థః = ప్రయోజనము,
నైవ = బొత్తిగాలేదు;
అకృతేన = కర్మచేయకపోవుటచేత,
కశ్చన = ఒకానొక దోషమును,
న = లేదు;
అస్య = వీనికి,
సర్వభూతేషు = సమస్తభూతములయందును,
కశ్చిత్ అర్థవ్యపాశ్రయః నచ = ప్రయోజన నిమిత్త మాశ్రయింపవలసిన పదార్థ మొక్కటి యును లేదు.

తా. ఎవడు పరమాత్మయందే ప్రేమకలవాడో, పరమాత్మయందే తృప్తుడై యుండునో, పరమాత్మయందే ఆనందించుచుండునో, అట్టివానికి కర్తవ్యమనునదిలేదు.

అట్టివాని కీలోకములో కర్మచేయుటచే వచ్చు లాభముగాని, కర్మ చేయకపోవుటచే కలుగు ప్రత్యవాయముగాని ఏమియునులేదు. అతనికి పిపీలిక మొదలగు బ్రహ్మపర్యంతము ఏ ప్రాణిని ఆశ్రయింపవలసిన పనిలేదు.

**అమృతవాహిని :-**

ఈ రెండు శ్లోకములలో ప్రకృతికిని శాస్త్రములకును కూడ అతీతులై, పరిపూర్ణబ్రహ్మానుభవములో మునిగియుండు మహాత్ములనుగురించి చెప్పబడినది.

ఏ మానవులు సర్వకాల సర్వావస్థలయందును సకల కల్యాణగుణ మహోదధియును, అప్రాకృత దివ్యమంగళ

విగ్రహుడును, కందర్పకోటి సుందరుడును, సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, అఘటితఘటనాసమర్థుడును అగు సచ్చిదానందఘనపరబ్రహ్మమును సాక్షాత్కరించుకొని, బ్రహ్మానందసాగరములో మునిగియుందురో, అట్టివారికి తాము తరించుటకై చేయవలసిన కర్తవ్యమేమియును లేదు. అట్టివారికి కేవలము ఆనందస్వరూపుడైన పరమాత్మయందే రతియుండును. రతి అనగా ప్రేమ. బ్రహ్మదిలోకపర్యంతమైన సకలభోగముల యందును ఈషణ్మాత్రముకూడ ఆసక్తి ఉండదు. ఆసక్తి కలుగుటయును, 'అది పనికిరాదు' అని విచారణవలన త్రోసివేసికొనుటయును కాదు - అసలు ఆసక్తి పుట్టనే పుట్టదు. పరమాత్మయందు పరమప్రేమ ప్రవహించుచుండును. ఆ ప్రేమానుభవము యొక్క ఆనందముముందు బ్రహ్మలోకభోగములు సైతము తృణప్రాయములుగ, తుచ్ఛములుగ తోచును. చివరకు ముక్తికూడ రుచించదు. కావుననే ఒక మహాత్ముడు చెప్పినాడు - "భుక్తి ముక్తి స్పృహా యావత్ పిశాచీ హృది వర్తతే, తావద్భక్తిసుఖస్యాత్ర కథ మభ్యుదయో భవేత్" 'భుక్తి అనగా బ్రహ్మదిలోకపర్యంతమైన భోగములు - ఈ భోగములందుగాని, ముక్తియందుగాని ఆసక్తి యను పిశాచము హృదయమున ఉన్నంతకాలము అక్కడ భక్తియొక్క ఆనందము ఎట్లు లభించగలదు ?'

వారు ఆత్మతృప్తులు - అనగా పూర్ణకాములు. పరమాత్మను పొందిన మానవుడు పూర్ణకాముడు అగును. ఆతనికి ఇంక పొందవలసినది ఏమియును లేదు. ఏ సాంసారిక పదార్థముతోను ఆతనికి అవశ్యకము లేదు. సర్వకాల సర్వావస్థలయందును,

అన్నివిధముల, పరమాత్మయందే, అనన్యభావముతో, తృప్తుడై ఉండును.

"ఆత్మన్యేవచ సంతుష్టః"-అనగా పరమాత్మను పొందిన మానవుడు నిత్యముగ, నిరంతరముగ పరమాత్మయందే ఆనందించుచుండును. ఇక వానిని జగత్తులోని ఏవియు - బ్రహ్మాది భోగములున్నైతము - తమవైపునకు ఏమాత్రమును ఆకర్షించలేవు. ఆతనిని ఏసందర్భములోను, ఏకారణముచేతను ఏసంఘటనయును, తన ఆనందమునుండి ఈషణ్మాత్రమైనను, చలింపచేయలేదు. ఎప్పుడును సచ్చిదానంద పరబ్రహ్మ రస మహోదధిలో ఈదులాడుకొనుచు ఉండును. ఇక అట్టి మహా పురుషునకు కర్తవ్యమని ఏదియును లేదు. అనగా తరించుటకై ఏర్పడిన ఏ సాధనతోను ఆతనికి పని లేదు. శాస్త్రములయందు చెప్పబడిన సకల సాధనలకును ఏకైక గమ్యస్థానము పరమ కల్యాణస్వరూపమైన భగవత్ప్రాప్తియే. ఆ గమ్యస్థానమును పొందినవానికి ఇంక ఏ సాధనతో మాత్రము ఏమిపనియున్నది? కనుక ఆతనికి లోకములో కర్మచేయుటచేత కలుగు లాభము గాని, చేయకపోవుటచేత కలుగు నష్టముగాని ఏమియును లేదు. అట్టి మహాపురుషునకు బ్రహ్మలోకపర్యంతమైన భోగముల యందును ఎంతమాత్రమును కోరిక లేనప్పుడు ఏమి చేయవల యును ? ఎందులకు చేయవలయును ? ఆతనికి పిపీలికదగ్గర నుండి బ్రహ్మపర్యంతమైన ఏవ్యక్తినిగాని ఏ పదార్థమునుగాని ఆశ్రయించు పనిలేదు. దేని నాశ్రయించవలయును ? ఎందుల

కాశ్రయించవలయును ? ఈ అభిప్రాయముతోనే 'ఆతనికి చేయవలసినది ఏమియును లేదు' అని చెప్పబడినది.

ఇక్కడ విచారణ అవసరము - అట్టి మహాత్ములకు "తస్య కార్యం నవిద్యతే" 'వారికి చేయవలసినదిలేదు' అని ఎందులకు చెప్పవలసి వచ్చినది ? దాని అర్థము ఎంతవరకు ఎట్లు తీసికొనవలయును ? జాగ్రత్తగ ఆలోచించనియెడల విపరీతార్థములు బయలుదేరగలవు.

అట్టి మహాత్ములు ఏమియును చేయక, ఊరక ఉందురని భావమా ? మానవునకు ఎట్టి పరిస్థితిలోనైన కర్మచేయకుండ నుండు స్థితి సంభవమని గీతయొక్క అభిప్రాయమా ? "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్" అనియును, "యద్య దాచరతి శ్రేష్ఠః" అనియును, "న మే పార్థాస్తి కర్తవ్యం" అనియును చెప్పిన కృష్ణపరమాత్మ "కర్మ చేయక ఊరక ఉండుట" అను సిద్ధాంతమునకు ఇష్టపడునా ? ఇష్ట పడడు. పదునేడవ శ్లోకములో 'మానవః' అను పదమును ప్రయోగించుట 'అట్లు భగవత్ప్రాప్తిని పొందుటకు మానవ మాత్రునకు అధికారముకలదు' అని నిరూపించుటకే.

కనుక ఈ రెండుశ్లోకములలో చెప్పబడినది-"తనకొరకై చేయవలసినది ఆతని కేమియు ఉండదు" అని మాత్రమే గ్రహించవలయును. ఆతనికి కర్మ చేసినను చేయకపోయినను ఒక్కటే అనుటలో, ఆతని పరమార్థమునకు ఆతనిచే చేయబడు కర్మలు లాభించవు; చేయకపోవుటచే నష్టమునులేదు. ఇంత మాత్రమేగాని "అసలు అతడు కర్మ చేయనే చేయడు"అని

అర్థము చెప్పికొనరాదు. అట్లు అర్థము చెప్పుట కృష్ణ పరమాత్మకు అభిమతముగాదు. అట్టి మహాత్ములు కరుణా మూర్తులుగా నుందురు. కాన లోకకల్యాణార్థము కర్మలు చేయుదురు. కర్మలు చేయక ఒక్కక్షణముకూడ నుండరు.

కర్మలు చేయుటచేగాని, చేయకపోవుటచేగాని నీకు లాభనష్టములు లేనప్పుడు, నీవు కర్మలు చేయుటచే లోకము నకు లాభమున్నయెడల కర్మలను ఎందులకు చేయరాదు ? కర్మలు చేసిన యెడల నీకు నష్టమున్నచో 'ఇతరుల లాభమునకై నేను నష్టపడుదునా ?' అనిన అనవచ్చును. నీకు నష్టము లేనప్పుడే ఇతరుల లాభముకొరకు పనిచేయలేనియెడల, నీకు నష్టమువచ్చునప్పుడు చేయగలవా ?

మహాత్ములు తాము నష్టపడియైనను ఇతరులకు మేలు చేయుదురు. ఇక నష్టము లేనప్పుడు చెప్పవలయునా? "ఊరకే పాడే అమ్మ పెండ్లివస్తే మరీ పాడిందట !" అన్నట్లు, తాము కష్టములకు, నష్టములకు లోనైకూడ ఇతరుల మేలుకొరకే ప్రయత్నించుట మహాత్ముల లక్షణముకాగా, అట్టిమహాత్ములు తమకు నష్టముకూడ లేనప్పుడు ఊరకకూర్చుందురా ? అట్లు భావించుట చాల అసంగతము.

**అవతారిక :—**

"అట్టివారే కర్మలుచేయక ఉండరే ! ఇక నీవా ? - కనుక నీవుకూడ కర్మలు చేయవలసినదే" అని నిర్దేశించి, ఆ కర్మల నెట్లుచేయవలయును ? ఫలమేమి ? ఈ విషయము చెప్పుచున్నాడు -

శ్లో॥ తస్మా దసక్త స్సతతం
కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ
పర మాప్నోతి పూరుషః ॥ ౧౯

ప. వి :—తస్మాత్, అసక్తః, సతతం, కార్యం, కర్మ, సమాచర, అసక్తః, హి, ఆచరన్, కర్మ, పరం, ఆప్నోతి, పూరుషః -

టీక :—

తస్మాత్ = కాబట్టి,
అసక్తః = ఆసక్తి లేనివాడవై,
సతతం = ఎల్లప్పుడు,
కార్యం = విధ్యుక్తమైన,
కర్మ = కర్మమును,
సమాచర = ఆచరింపుము,
హి = ఏల అనిన,
అసక్తః = ఆసక్తిలేనివాడై,
కర్మ = కర్మమును,
ఆచరన్ = ఆచరించుచు,
పూరుషః = పురుషుడు,
పరం = మోక్షమును,
ఆప్నోతి = పొందుచున్నాడు.

తా. కాబట్టి అర్జునా! ఆసక్తిలేనివాడవై ఎల్లప్పుడును కర్తవ్యములైన కర్మలను బాగుగా ఆచరించుచుండుము. ఆసక్తిరహితుడై కర్మలు చేయు మానవుడు మోక్షమును పొందుచున్నాడు.

అమృతవాహిని :—

"తస్మాత్" 'కాబట్టి' అని - ఏమికాబట్టి? కేవలము పరిపూర్ణ పరమాత్మానుభవము కలిగియుండి, అందుచేతనే తమకొరకు కర్తవ్యమనునది లేనివారై, కర్మలు చేసినను చేయకపోయినను లాభముగాని నష్టముగాని లేనివారై, బ్రహ్మపర్యంతమైన దేనినిగాని ఆశ్రయించవలసినపని లేని మహాత్ములే లోకము కొరకు కర్మలు చేయుచున్నారు కాబట్టి, నీవుకూడ కర్మలు చేయవలయును. సిద్ధపురుషులు లోకము కొరకు కర్మలు చేయుదురు; సాధకుడు తనకొరకును, లోకము కొరకును కర్మలు చేయును.

మానవుని చిత్తములో ఆసక్తియున్నప్పుడు కర్మలు బంధించునవి అగును. ఆసక్తి లేనప్పుడు ఆ కర్మలే తనకును లోకమునకునుకూడ కల్యాణదాయకములగును. మహాత్ములకు ఆసక్తిలేకపోవుట సహజము. సాధకుడు ఆసక్తిలేకుండ కర్మలు చేయుట అభ్యసించవలయును.

'అభ్యసించవలయును' అనుటలో భావమేమన - ఆసక్తితో కర్మలుచేసిన బంధహేతువులగును గనుక, ఆసక్తిపోవు వరకును కర్మలుచేయక, ఆసక్తి పోయిన తరువాత చేయుదమని ఉండరాదు. కర్మలు చేయకుండ ఉండుటకు ఎవరికిని

సాధ్యముకాదు; కనుక కర్మలు చేయుచునే ఆసక్తిలేకుండ చేయుటను అభ్యసించుము అని భావము.

మానవుడు ఆసక్తిరహితుడై కర్మలు చేయగలిగిననాడు ఆ కర్మలు ఆతనిని బంధించవు సరిగదా, ఆతని పూర్వబంధనములనుకూడ నశింపజేయును - అంతమాత్రమేకాదు; మోక్షమును కలుగజేయును; భగవంతుని పరిపూర్ణ సాక్షాత్కారమును కలుగజేయును.

"సతతం కార్యం కర్మ సమాచర" 'కర్తవ్యమును బాగుగ ఆచరించుము' అని చెప్పుచు ఇట్లు ఎంత కాలము ఆచరించవలయును అనుదానికి సమాధానముగ 'సతతం' అను శబ్దమును ప్రయోగించియున్నాడు. 'సతతం' అనగా ఎల్లప్పుడును అని అర్థము. "ఎల్లప్పుడును కర్మలు చేయవలసినదే. జ్ఞానము కలిగిన తరువాత, పరమాత్మ సాక్షాత్కారముకలిగిన తరువాత కర్మలు చేయనక్కరలేదని భ్రాంతిపడకుము. కర్మల నెల్లప్పుడును చేయవలసినదే" అనుభావముతో 'సతతం' అని ప్రయోగించి యున్నాడు.

మానవుడు ఎట్లును కర్మలు మానలేనప్పుడు, కర్మలు మానుసమయము ఒకటి ఉండును అని పరమాత్మ అభిప్రాయముగా భ్రాంతిపడరాదు. భావపరివర్తనము మాత్రమే గీతలో చెప్పబడినది. ఆసక్తిరహితముగా చేయువారు సిద్ధపురుషులు. ఆసక్తితో చేయువారు త్రైగుణ్యులు. వీరినే 'త్రైగుణ్యులు' అని

కూడ అందురు; కామ్యకర్మలు చేయువారు-* తమ అంతః కరణమునందలి ఆసక్తిని విచారణాబలమున నెట్టిపార వేయుటకు ప్రయత్నించుచు కర్మలజేయువారు సాధకులు.

సరే; ఎల్లప్పుడును కర్మలు చేయుచుండవలసినదే అని తేలినది. కర్మకు 'కార్యం' అని విశేషణము చేర్చబడినది. కార్యం అనగా 'చేయదగినది' అని అర్థము. పనిచేయుమని వారు గనుక ఏదో ఒకపని చేయుచుండుటకాదు. అట్లైన తెలిసియో తెలియకయో ప్రతివాడును ఏదో ఒకపని చేయుచుండునేకాని ఊరకే ఉండలేడుగదా! అయినప్పడిక 'కర్మచేయుము' అని చెప్పవలసినపనియే లేకపోవును.

కాని ఇక్కడ అర్థమదికాదు. 'చేయదగిన కర్మ ఏది? చేయదగని కర్మ ఏది?' అని విచారించుకొని, చేయదగినకర్మనే చేయవలయును గాని చేయదగని కర్మను చేయరాదు, చేయదగిన కర్మఏదో, చేయదగని కర్మఏదో ఎట్లు తెలియగలదు? "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ" అని పదునారవ అధ్యాయమునందు చెప్పబడియున్నది. సాధకునకు 'ఈపనిచేయదగినది; ఈపనిచేయదగనిది' అని నిర్ణయించుకొనుటకు శాస్త్రమే ప్రమాణము. సిద్ధపురుషులకో - వారు "కోవిధిః కోనిషేధః" అనియును, "నశాస్త్రం నైవచక్రమః" అనియును చెప్పదగినవారు గనుక, వారు లోకకల్యాణము కొరకు కర్మలు చేయుటలో ఏ ఏ కర్మలు చేయవలయునో

* వీరినిగురించి రెండవ అధ్యాయములో నలుబదిరెండు, మూడు, నాలుగు శ్లోకముల వ్యాఖ్యానము చూడుడు.

వారే అప్పటి పరిస్థితులనుబట్టి నిర్ణయించుకొందురు. వారికి శాస్త్రములు ఏమియును ఆజ్ఞాపించవలసినది లేదు. వారివాక్కే శాస్త్రము. వారి ఆచరణయే ధర్మము. వారు ఏది చెప్పినను, ఏది చేసినను శాస్త్రానుగుణముగనే ఉండును. వారి వాక్కును ఆచరణనుచూచి శాస్త్రములను అర్థము చేసికొనవలయును.

**అవతారిక:—**

'ఆసక్తిరహితుడవై కర్మలు చేయుము' అని అర్జునుని ఆదేశించి 'ఇట్లు చేసినవారు పరమపదమును - అనగా పరమాత్మను-పొందుచున్నారు' అని చెప్పి, ఇప్పుడు జనకాదులను ప్రమాణముగా చూపి, పై విషయమునే స్పష్టముచేయుచు, కర్మలు చేయుటయే నీకు ఉచితమని చెప్పుచున్నాడు -

శ్లో॥ కర్మణైవహి సంసిద్ధి
మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి
సంపశ్యన్ కర్తు మర్హసి ॥ —౨౦

ప. వి :—కర్మణా, ఏవ, హి, సంసిద్ధిం, అస్థితాః, జనకాదయః. లోకసంగ్రహం, ఏవ, అపి, సంపశ్యన్, కర్తుం, అర్హసి,

టీక ;—

జనకాదయః = జనకుడు మొదలగువారు,
కర్మణైవ = కర్మ చేయుటచేతనే,
సంసిద్ధిం = జ్ఞానసిద్ధిని,

ఆస్థితాః హి = పొందిరిగదా !
లోకసంగ్రహం=లోకసంగ్రహమును(ప్రయోజనమును)
సంపశ్యన్ అపి = చూచియైనను,
కర్తుమేవ = కర్మలను జేయుటకే,
అర్హాసి = తగుచున్నావు.

తా. జనకుడు మొదలగువారు కర్మవలననే పరమసిద్ధిని పొందిరి. కనుక లోకసంగ్రహముకొరకైనను నీవు కర్మలు చేయుటయే తగినది.

**అమృతవాహిని :—**

అర్జునా ! చూడుము- జనకునికంటె జ్ఞాని కలడా ! జ్ఞానులలో ఉత్తమోత్తమ శ్రేణికి చెందినవాడుగదా జనకుడు! అట్టి జనకుడు మొదలగు వారందరును కర్మచేసియే మోక్షమును పొందియున్నారు.

జనక చక్రవర్తి దృఢాధ్యవసాయము నీకు తెలియును గదా! మిథిలయంతయు కాలిపోవుచున్నను, 'నాది ఒక గడ్డిపరక కూడ పోవుటలేదు' అని చెప్పుకొనజాలిన మహానుభావుడు. అట్టి అతడు జీవితపర్యంతము కర్మలు చేసినాడు. అంబరీషుని పరిపక్వస్థితి తెలియునుగదా ! అంబరీషుని కొరకే గదా సుదర్శనాయుధము దుర్వాసుని పదునాల్గు భువనముల ద్రిప్పినది! అటువంటివాడు జీవితపర్యంతమును కర్మ చేయుచునే యున్నాడు.

ప్రహ్లాదుడు - ఎవనిపేరు ఒక్కసారి త్రికరణశుద్ధిగా తలచిన మానవుని జీవిత మంతయు ధన్యమగునో అట్టి

ప్రహ్లాదుడు కర్మలు చేయుచునే జీవితమును గడపెను. ఇట్టి మహానుభావులుఎందరో పూర్వము కర్మ చేసియే తరించినారు. లోకమును ఉద్ధరించినారు.

తత్త్వజ్ఞానముచేత మోక్షమని యున్నదిగదా ! కర్మ చేత మోక్షమని ఎట్లు చెప్పవచ్చును ? దీనికి సమాధానము సందర్భానుసారముగ ఇంతకు పూర్వమే చెప్పబడినది.

మానవుడు కర్మ చేయకుండ ఉండ లేనప్పుడు, కర్మ చేత మోక్షము ఉన్నను, లేకపోయినను కర్మ చేయకతప్పదుగదా! ఎట్లును తప్పనప్పుడు, ఆకర్మ కేవలము బంధనరూపమే అయినప్పుడు, ఇక మానవుని 'నీవు బంధమునుండి విముక్తుడవు కమ్ము!' అని ఉపదేశించుటయే ఉన్మత్తప్రలాపము కాగలదు. కనుక కర్మ కేవలము బంధనరూపముగాదు; భావము బంధమునకును మోక్షమునకును కారణము. భావముయొక్క ప్రభావము కర్మపై ప్రసరించి, కర్మ బంధనమునకును మోక్షమునకును కారణమని చెప్పబడుచున్నది. కనుక ఎట్టిభావముతో కర్మ చేసినయెడల బంధనమో, ఎట్టిభావముతో కర్మ చేసిన యెడల మోక్షమో చెప్పబడినది. కనుకనే కర్మలు చేయుచున్నను, ఎటుల చేసినచో బంధనములు కావో - ఆ యుక్తిని తెలుపుచున్నది గీత 'యోగః కర్మసు కౌశలం' అని.

కాబట్టి తత్త్వజ్ఞానోదయమునకు పూర్వమును మానవుడు కర్మలుచేయును. తత్త్వజ్ఞానోదయానంతరమును కర్మలు చేయును. తత్త్వజ్ఞానమునకు పూర్వము తనకొరకును,లోకము కొరకును చేయును. అట్టివారే సాధకులు. తత్త్వజ్ఞానోదయా

నంతరము కేవలము ఒక్క లోకకల్యాణము కొరకే చేయును. అట్టివారే సిద్ధపురుషులు. ఇదియే భేదము,

కర్మలు చేయుటమాత్రము ఎప్పుడును, ఎవరికిని తప్పదు. కనుక 'నిష్కామ్యకర్మచేత పరమసిద్ధి' అనుట సమంజసమే. నిష్కామ్యకర్మచేత సాధకునకు చిత్తశుద్ధికలిగి. తత్త్వజ్ఞానోదయమునకు సహాయము కలుగును. కనుకకూడ, మోక్షమునకు నిష్కామకర్మ సాధనమని చెప్పబడినది.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ
స్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే
లోకస్తదనువర్తతే॥ ౨౧

ప. వి:—యత్, యత్, ఆచరతి, శ్రేష్ఠః, తత్, తత్, ఏవ, ఇతరః, జనః, సః, యత్, ప్రమాణం, కురుతే, లోకః, తత్, అనువర్తతే.

టీక :—

శ్రేష్ఠః = గొప్పవాడు,
యద్యత్ = ఏ యే కర్మమును,
ఆచరతి = ఆచరించుచున్నాడో,
తత్తదేవ = ఆ యా కర్మమునే,
ఇతరః జనః = సామాన్యుడైన తక్కిన జనుడు,
(ఆచరతి = ఆచరించుచున్నాడు)

సః = ఆ గొప్పవాడు,
యత్ ప్రమాణం కురుతే = దేనిని ప్రమాణముగా చేయునో,

లోకః = లోకము,
తత్ = దానినే,
అనువర్తతే = చేయుచున్నది (అనుసరించుచున్నది).

తా. శ్రేష్ఠుడైనపురుషుడు ఏది ఆచరించునో ఇతర పురుషుడుకూడ అదియే ఆచరించును. ఆ శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగా జేయునో లోకము దానినే అనుసరించును.

**అమృతవాహిని :-**

శ్రేష్ఠుడు అనగా సద్గుణములవలనను, యథార్థ తత్త్వ జ్ఞానమువలనను శ్రేష్ఠత్వము లభించినవాడు. ఆకారణముననే లోకమున 'ధర్మాత్ముడు, మహాత్ముడు' అని పేరుపొందినవారికి అపారమైన బాధ్యత ఉండును. తమ్ము అనుసరించి ఇతర మానవులు నడచుకొందురు. కనుక అతడు ఇతరులకొంకైనను కర్మలుచేయవలయును. లేనియెడల లోకులందరును ఆతనివలెనే కర్మచేయక చెడిపోదురు. మిగిలినవారు- అనగా సామాన్యులు కర్మలుచేసిననే బాగుపడుదురు; చేయకపోయిన చెడిపోదురు. ఇక మహాత్ములన్ననో కర్మచేయుటచేత బాగుపడుటయును, చేయకపోవుటచేత చెడిపోవుటయును - రెండును ఉండవు తమ విషయములో కర్మచేసినను చేయకపోయినను ఒకటే. లోకము యొక్క స్వభావము మాత్రము శ్రేష్ఠులైనవారిని అనుసరించుట,

మహాత్ములకు తాము చేయకపోయిన తమకు నష్టము లేదుగాని, చేయకపోయిన నష్టమును, చేసినచో లాభమును అనుభవించు దశలో ఉన్న సామాన్యజనులు అట్టి మహాత్ములను జూచి తామకూడ చేయక చెడిపోదురు. తాము చేయని కారణమున లోకము చెడిపోవుట సహించరు మహాత్ములు. కనుక లోకమును దృష్టిలో ఉంచుకొని తాము కర్మల నాచరింతురు. వారిని జూచి లోకముకూడ తమ తమ వర్ణాశ్రమధర్మములను శ్రద్ధాభక్తులతో ఆచరించును. దానివలన సృష్టిచక్రము సవ్యముగా నడచును.

మహాత్ములు ఆచరించని యెడల లోకులు "ఈ ధర్మములలో మంచి ఉన్న యెడల వారెందులకు ఆచరించరు ? కనుక ఈ ధర్మములన్నియును సారహీనములు" అని తలచి, వారు కూడ మానివేయుదురు. అట్లు లోకముకూడ మానిన యెడల సృష్టిచక్రము సరిగా నడువదు. అందువలన సృష్టిలో ఒడుదుడుకులు, సంఘర్షణాలు బయలుదేరి సృష్టికే ప్రమాదము వాటిల్లగలదు. ఈ ప్రమాదమున కంతకును బాధ్యులు మహాత్ములే అగుదురు. ఇది తెలిసిన మహాత్ములు ఎన్నడును కర్మ చేయుట మానరు.

ఒకడు తాను యథార్థముగా పరిపక్వస్థితికి రాకపూర్వమే ఏవో ఇతర కారణములవలన లోకము తనయందు విశ్వాసముతో తనను మహాత్ముడనియును, మహాజ్ఞాని అనియును,పూజించుట ప్రారంభించిన యెడల, అంతమాత్రమున నిజముగా తాను మహాత్ముడనైతి ననుకొని, అహంకరించి,తన

యిష్టము వచ్చినట్లు మెలగుచు, తన ఇష్టము వచ్చినట్లు ప్రబోధము జేయుచు, తన ఇష్టమువచ్చినట్లు శాస్త్రమునకు అర్థములు తీయుచు ఉన్న యెడల, లోకము దానినే ప్రమాణముగా స్వీకరించి, ఆచరించును. దానిచేత వారికి కలుగు ఐహిక పారమార్థికకష్టనష్టములకు బాధ్యుడు ఈతడే అయి, ఈమహా పాపఫలముగ యమధర్మరాజువద్ద చేతులుకట్టుకొని నిలబడి, సమాధానము చెప్పుకొనవలసియుండును. శిక్షలనుభవింపవలసి యుండును. కనుక యథార్థమైనమహాత్ములు ఏదిచేసినను, ఏది మాట్లాడినను, ఏది ఆచరించినను లోకముయొక్క క్షేమ మొక్కటే దృష్టిలో ఉంచుకొని చేసెదరు.

శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగాచేయునో లోకము దానినే అనువర్తించుననగా - ఆతడు లోకములో ఎవరికేది క్షేమమనో దానిని ఆలోచించి 'నీవు ఇట్లు చేయుము !' అని ఆజ్ఞాపించిన లోకము దానిని అట్లే చేయును. 'నీవు ఇట్లు చేయకుము !' అని ఆజ్ఞాపించిన అట్లే చేయకుండును. కనుక లోకము బాగుపడినను, చెడిపోయినను అప్పుడున్న శ్రేష్ఠులే దానికి బాధ్యులు. మహాత్ములు ఆచరించినట్లు అందరును ఆచరింతురుగదా ! ఇంక 'సయత్ప్రమాణం కురుతే' అనునది చెప్పుట ఎందులకనగా-లోకములో అందరకును కర్తవ్యములు ఒకేవిధముగ ఉండవు. వారివారి వర్ణాశ్రమములయొక్కయును, పరిస్థితి స్వభావములయొక్కయును భేదములవలన కర్తవ్యములుకూడ భిన్నభిన్నములుగా ఉండును. కనుక తాను ఆచరించుటచేత, తనవంటి వర్ణాశ్రమ పరిస్థితి స్వభావములలో

ఉన్నవారు తాను చేసినట్లు చేయుదురు; దేనిలోనైనను కొంచెము భిన్నత కలవారు తాను చెప్పినట్లు చేయుదురు.

అవతారిక :-

'మహాత్ములకు ఏమియును చేయవలసినది లేకపోయినను, లోకసంగ్రహమును దృష్టిలో ఉంచుకొని, కర్మ చేయుదురు' అని చెప్పి ఇప్పుడు పరమాత్మ తనను ఉదాహరణముగా చూపి చెప్పుచున్నాడు.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం
త్రిషులోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి ॥ ౨౨

శ్లో॥ యది హ్యహం నవర్తేయం
జాతుకర్మ ణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే
మనుష్యాః పార్థ ! సర్వశః ॥ ౨౩

శ్లో॥ ఉత్సీదేయు రిమే లోకా
న కుర్యాం కర్మచేదహమ్ ।
సంకరస్య చ కర్తాస్యా
ముపహన్యా మిమాః ప్రజాః ॥ ౨౪

ప. వి ;—న, మే, పార్థ, అస్తి. కర్తవ్యం, త్రిషు, లోకేషు, కించన, న, అనవాప్తం, అవాప్తవ్యం, వర్త, ఏవ, చ, కర్మణి. ౨౨

ప. వి :—యది, హి, అహం, న, వర్తేయం, జాతు, కర్మణి, అతన్ద్రితః, మమ, వర్త్మ, అనువర్తన్తే, మనుష్యాః, పార్థ, సర్వశః. ౨౩

ప. వి ;—ఉత్సీదేయుః, ఇమే, లోకాః, న, కుర్యాం, కర్మ, చేత్, అహం, సంకరస్య, చ, కర్తా, స్యాం, ఉపహన్యాం, ఇమాః, ప్రజాః. ౨౪

టీక ;—

పార్థ! = ఓ అర్జునా!
మే = నాకు,
కర్తవ్యం = చేయవలసినకర్మము,
నాస్తి = లేదు,
త్రిషులోకేషు = మూడులోకములయందును,
అనవాప్తం = పొందబడనిది,
అవాప్తవ్యం = పొందవలసినది,
కించన = ఏదియును,
న = లేదు;
(తథాపి) చ = అయినను
కర్మణి = కర్మమందు,
వర్తఏవ = ప్రవర్తించుచున్నానుగదా! ౨౨

టీక :—

పార్థ ! = ఓ అర్జునా !
అహం = నేను,
జాతు = ఎప్పుడును,
అతన్ద్రితః = జాగ్రత్తగలవాడనగుచు,
కర్మణి = కర్మమునందు,
నవర్తేయం యది = ప్రవర్తించకపోదునేని,
మనుష్యాః = ప్రజలు,
సర్వశః = అన్నిప్రకారములుగను,
మమ = నాయొక్క,
వర్త్మ = మార్గమును,
అనువర్తన్తే హి = అనుసరింతురుగదా ! —23

టీక :—

అహం = నేను,
కర్మ = కర్మమును,
న కుర్యాం చేత్ = చేయనైతినేని,
ఇమే లోకాః = ఈ జనులు,
ఉత్సీదేయుః = భ్రష్టులగుదురు;
సంకరస్య చ = వర్ణసంకరమునకును,
కర్తా = కారణము,
స్యాం = అగుదును;
ఇమాః ప్రజాః = ఈ ప్రజలను,
ఉపహన్యాం = చెడగొట్టినవాడనగుదును. —24

తా. అర్జునా ! నాకు చేయవలసినది ఏమియునులేదు. మూడులోకములలోనుకూడ నేను పొందనిదిగాని, పొందవలసినదిగాని లేదు.అయినను కర్మలను చేయుచునేయున్నాను. ౨౨

తా. నేను జాగ్రత్తవహించి కర్మ చేయకపోతినేని మానవులు సర్వవిధముల నా మార్గమునే అనుసరింతురు. ౨౩

తా. నేను కర్మ చేయకుండినచో ఈ మానవులందరును చెడిపోదురు. సంకరమునకు నేను కారణమై ఈ జనులను పాడుచేసినవాడనగుదును. ౨౪

**అమృతవాహిని :-**

కృష్ణపరమాత్మ అర్జునునితో తనను ఆదర్శముగా పెట్టుకొనుమనియును, తాను మూడులోకములయందును పొందనిది లేదనియును చెప్పుచున్నాడు. అదియునుగాక తానెటువంటి ప్రభావసంపన్నుడో - గీతలో ఎన్నోచోట్ల, "భోక్తారం యజ్ఞతపసా సర్వలోక మహేశ్వరమ్" అనియును, "యోమామజమనాదించ వేత్తి లోకమహేశ్వరమ్" అనియును, "పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః" అనియును, గతిర్భర్తా ప్రభుస్సాక్షీ" అనియును, "అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ" అనియును, "ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్" అనియును, చెప్పుకొనియున్నాడు.సర్వలోకములకు ప్రభువైన కృష్ణపరమాత్మకు ఈ సర్వజగత్తునందును తనది కానిదేదిగలదు? క్రొత్తగా పొందవలసినదికూడ ఏదియును లేదు,

ఆయన అవాప్తసమస్తకాముడు. అయినను కర్మలు చేయుచునే యున్నాడు. ఎందులకు చేయవలయును ? అట్లు చేయుటకు లోకానుగ్రహమే కారణము. ఆయనయే కర్మలు చేయని యెడల, ఆయనను జూచి లోకులుగూడ తమ కర్తవ్య కర్మలను మానుదురు. దానితో వర్ణవ్యవస్థ చెడిపోవును; ధర్మము క్షీణించును; స్వేచ్ఛాచారత, దుష్టస్వార్థము, విషయలోలుపత, మోసము వంచన, హింసలు, ఘోరమైన మారణయత్నములు - అన్నియును హద్దుపద్దులు లేకుండ పెచ్చుపెరిగిపోవును. జగత్తు ఇట్లు చెడిపోకుండ కాపాడుటకై కృష్ణపరమాత్మ ప్రతిక్షణమును కర్మలు చేసియే యున్నాడు.

మరియును ఆయన సత్యసంకల్పుడు. అనగా సంకల్పమాత్రము చేతనే అనంతకోటి బ్రహ్మాండములును సృజింపబడుచున్నవి; పోషింపబడుచున్నవి; లయింపబడుచున్నవి. అఘటితఘటనాసమర్థుడు, సర్వలోకములకును ఏకైకమహేశ్వరుడు, ఐనప్పటికిని ఒకమానవరూపముతో దుఃఖాలయము, అశాశ్వతము అయిన ఈలోకములో మాటిమాటికి జన్మించుచున్నాడు. అట్లు జన్మించవలసిన అవసరము ఆయనకేమి కలిగినది ? ఒక్క లోకానుగ్రహమే ఆ అవసరము. ఆయన మాటలతో, చేతలతో లోకమునకు ఆదర్శముగా ఉండి, లోకము నుద్ధరించవలసియున్నది. అందువల్లనే ఆయనకూడ నిత్యమును కులోచితము, కాలోచితమునగు కర్మలు చేసియే యున్నాడు. ఆయనయే కర్మలు చేయకపోయినచో, ఈ మానవులందరును ఆయనను

అనుసరించి, వారును చేయక చెడిపోయెడివారే. సామాన్య
ముగా మానవుల లక్షణము ఎట్లుండుననగా - వారికి ఎవరు
పెద్దలు, శ్రేష్ఠులు అని తోచినదో వారిని అనుసరింతురు.
ఆ కాలములో చాలమంది ప్రజలకు కృష్ణపరమాత్మ గొప్ప
వాడు, ఆదర్శపురుషుడు అను అభిప్రాయమున్నది. కాబట్టి వారి
కొరకు తానుకూడ కర్మల నాచరించినాడు. వారు- అనగా
ప్రజలు- చెడిపోకుండ బాగుపడు బాధ్యత తనమీద వేసికొని
పనిచేసినాడు. కాబట్టియే తన కూర్మిభక్తుడైన అర్జునునితో
యిట్లు అనుచున్నాడు-

"అర్జునా! చూడుము ! కర్మ పనికిరానిదైనయెడల నీకు
చెప్పుదునా? లోకులందరి శ్రేయస్సునుకూడ కోరువాడను
గదా! ప్రియుడవు, సఖుడవు, భక్తుడవు అయిన నీకు చేయ
కూడనిపని చెప్పుదునా? "కర్మ జ్ఞానముకంటె తక్కువైనది.
కర్మచేయుట అజ్ఞానమునకు లక్షణము" అని భ్రాంతిపడి, తమ్ము
జ్ఞానులని భావించుకొని, కర్మలు మానుట మహాప్రమాదము;
అధఃపతన హేతువు. చూచుచున్నావుకదా! నేనుకూడ కర్మలు
చేయుచున్నాను. నేను ఏది శ్రేష్ఠమని చేయుచున్నానో,
దానినే నీకును చెప్పుచున్నాను. కనుక కర్మలుచేయుటయే నీకు
కూడ పరమ శ్రేయస్కరము. సర్వకాంక్షలను నశింపజేసికొని
నట్టియును, చివరకు మోక్షమందుకూడ ఆసక్తిలేనట్టియును
మహాత్ములు కూడ లోకకల్యాణార్థము కర్మలు చేయుదురు.
సాధకులు తమకొరకును, లోకముకొరకునుకూడ కర్మలుచేయ
వలయును."

శ్లో॥ సక్తాః కర్మ ణ్యవిద్వాంసో
యథా కుర్వంతి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాసక్త
శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥ ౨౫

ప. వి:— సక్తాః, కర్మణి, అవిద్వాంసః, యథా, కుర్వన్తి, భారత, కుర్యాత్, విద్వాన్, తథా, అసక్తః, చికీర్షుః, లోక సంగ్రహమ్-

టీక :—

భారత! = ఓ అర్జునా!
అవిద్వాంసః = అజ్ఞానులు,
కర్మణి = కర్మమందు,
సక్తాః = ఫలాపేక్షగలవారై,
యథా = ఏవిధముగ,
కుర్వన్తి = చేయుచున్నారో,
తథా = ఆవిధముగ,
విద్వాన్ = జ్ఞాని,
అసక్తః = ఫలాపేక్ష లేనివాడై,
లోకసంగ్రహం = ప్రజలను బాగుచేయుటను,
చికీర్షుః = నెరవేర్పు తలంపుగలవాడై,
కుర్యాత్ = చేయవలయును.

తా. ఓ భారతా! అర్జునా! అజ్ఞానులైన మానవులు ఆసక్తితో ఎట్లు కర్మలు చేయుదురో, ఆసక్తిరహితులైన జ్ఞానులుకూడ, లోకసంగ్రహము కొరకు అట్లే, కర్మలు చేయవలయును.

అ మృ త వా హి ని :—

ఈ శ్లోకములో 'కర్మణి' అనినప్పుడు ఇచ్చటి ప్రకరణ మునుబట్టి శాస్త్రనిషిద్ధములు, నిందితములు, నీచములు అయిన కర్మలకు ప్రస్తావనయే లేదు. పరిస్థితిని, స్వభావమును అనుస రించిన, శాస్త్రవిహితములైన కర్మలనే ఇచ్చట గ్రహించ వలయును.

అజ్ఞానులైన మానవులు ఫలాభిలాషతో కర్మలయందు ఆసక్తిగలిగి కర్మలు చేయుదురు. జ్ఞానులుకూడ అజ్ఞానుల వలెనే కర్మలు చేయవలయును. కాని, ఫలాభిలాష, ఆసక్తి లేకుండ చేయవలయును. జ్ఞానులకును, అజ్ఞానులకును ఇదియే భేదము. అజ్ఞానులు చేసినట్లే జ్ఞానులుకూడ చేయవలయును అనుటలో అభిప్రాయమేమనిన-

అజ్ఞానులు ఫలమునందాసక్తిగలిగి కర్మలు చేయుదురు కనుక 'ఈ కర్మలచేతగదా మన మీఫలమును పొందనర్హుల మగుచున్నాము' అని కర్మలను అపరిమితశ్రద్ధతో చేయుదురు. జ్ఞానికి కర్మఫలమునందు ఈషణ్మాత్రముకూడ ఆసక్తి ఉండదు; ఫలమందభిలాష లేదు కనుక తాను కర్మ చేసినను చేయక పోయినను తనకు ఒక్కటే; లాభముగాని నష్టముగాని లేదు; కనుక ఆ కర్మను అరగొరగా చేయుట తటస్థించవచ్చును;

శ్రద్ధలేక చేయవచ్చును - ఇదికూడదు. ఫలమందభిలాష లేక పోయినను, లాభనష్టములు లేకపోయినను లోకసంగ్రహము కొరకు కర్మలు చేయవలయును; అభిలాషకలవారు చేయునంత శ్రద్ధతోను చేయవలయును. ఇదియే కర్మయోగములో ఉన్న రహస్యము - అని జ్ఞానులకు పరమాత్మ హెచ్చరిక నిచ్చుచున్నాడు.

ఇంకొక విషయమేమనిన - కొంతమంది సాధకులకు కొంతవరకు పోయిన తరువాత, తమకు కూడ తెలియకుండ ఒక అభిమానము బయలుదేరును - "నేను జ్ఞానినైతిని; ఇంక నాకు ఈ సాధనతోను, కర్మలతోను పనిలేదు; నేనేమియును చేయనక్కరలేదు" అని. ఈ భావము కలిగినట్లుకూడ తెలియకుండ అంతఃకరణములో ఉద్భవించును. ఇదియే సాధకునకు ప్రమాదకరమైన సుడిగుండము. తనను జ్ఞానిగను మహాత్ముడుగను తలంచుకొనుట ఒకటి; ఇతరులు ఎంతవారైనను, వారిని సంసారకూపమందు మునిగియున్నవారుగను, తెలియనివారుగను తలంచుట రెండు; తనకు కర్మలతో సంబంధము లేదని తలచుట మూడు; ఇతరులు కర్మలు చేయుచున్న యెడల, "వారింకను అజ్ఞానములోపడిపోవుచున్నారు; కర్మలనే పట్టుకొని ప్రాకులాడుచున్నారు" అని నిర్లక్ష్యముగా చూచుటయో, జాలిపడుటయో చేయును, ఆ జాలిపడు లక్షణమును సాధకుకు అడ్డము వచ్చునట్టి ఒక దుర్గుణముగా తెలిసికొనలేక, దానిని భూతదయగా భావించుకొని సంతోషపడుట నాలుగు; ఇట్టి వారిలో ఎవరికైనను 'మనకు కర్మలతో అవసరము లేకపోయి

నను ఇతరులకొరకు మనము కర్మలు చేయవలయును' అను అభిప్రాయము ఒక వేళ కలిగినయెడల, ఆ చేయుటలో కూడ తమకొరకుకాదు, ఇతరుల కొరకు కాబట్టి, ఇతరులు చూచు చున్నప్పుడు చేయుటయు, చూడనప్పుడు మానుటయు కలుగును - ఇది అయిదవ దోషము. పోనీ - ఇతరులు చూచు చున్నప్పుడైనను చేయునది సరిగ చేయక, శ్రద్ధలేక, పైకి చేయుచున్నట్లు నటించుట - ఆరవదోషము.

ఇన్ని దోషములు ఏర్పడునుగనుక పరమాత్మ ఎంత గనో హెచ్చరిక ఇచ్చుచున్నా డీశ్లోకములో. తనకక్కర లేదు గనుక శ్రద్ధతో చేయడు; దాని పరిణామమే చివరకు మోసము క్రిందకుకూడ వచ్చును. ఇట్టి సుడిగుండములో పడకుండ నుండుటకు సాధకుడైనచో తన కొరకును, లోకము కొరకును, జ్ఞానియైనచో కేవలము లోకముకొరకును, ఆసక్తి విడిచిపెట్టి శ్రద్ధతో కర్మచేయవలసిన అవసరమున్నది.

కర్మచేయు విషయమున సాధకుడును, జ్ఞానియును ఒకటే. జ్ఞానినిగదా నాకు అక్కరలేదు అని, అంతర్యమున శ్రద్ధలేక, అసలు కర్మచేయక, లోకులకు శిక్షణ ఇచ్చుటకని, చేయుచున్నవానివలె కనుపించుచున్నయెడల, అట్టివానివద్ద శిక్షణ పొందువారందరును అట్టి మోసగాండ్రే అగుదురు. లోహము కరగించి ఏ పోలిక మూసలో పోసిన ఆ పోలిక వస్తువుగనే ఏర్పడునుగదా !

చేసినచో శ్రద్ధతో, నిర్వంచనముగ నిర్దుష్టముగ చేయవలయును. లేకున్న టింగురంగాయని అసలు మానవలయును,

అంతేగాని ఉభయభ్రష్టత్వము పొందరాదు. చేయుట, చేయక పోవుటలలో చేయవలయునని పక్షమువాడు కృష్ణపరమాత్మ-

శ్లో॥ న బుద్ధిభేదం జనయే
దజ్ఞానాం కర్మసంగినాం ।
జోషయేత్సర్వకర్మాణి
విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ ౨౬

ప. వి :— న, బుద్ధిభేదం, జనయేత్, అజ్ఞానాం, కర్మసంగినాం, జోషయేత్, సర్వకర్మాణి, విద్వాన్, యుక్తః, సమాచరన్.

టీక :—

విద్వాన్ = విద్వాంసుడు,
కర్మసంగినాం = కర్మయందాసక్తిగల,
అజ్ఞానాం = అజ్ఞానులకు,
బుద్ధిభేదం = బుద్ధికి చలనమును,
నజనయేత్ = పుట్టింపగూడదు;
యుక్తః సమాచరన్ = నేర్పుతో తానాచరించుచు,
సర్వకర్మాణి = సమస్తకర్మలను,
జోషయేత్ = ఇతరులచే నాచరింపచేయవలయును.

తా॥ విద్వాంసుడైనవాడు కర్మలయందాసక్తులైన అజ్ఞానులయొక్క బుద్ధియందు భ్రమను కలుగజేయరాదు. సమత్వబుద్ధితో తాను చక్కగా కర్మలుచేయుచు, వారిచేతకూడ చేయించవలయును.

**అమృతవాహిని:—**

అర్జునా! కర్మలయందాసక్తికలిగిన అజ్ఞానులకు బుద్ధిలో భ్రమను కలుగజేయరాదు - "ఆత్మ చేయదు; కర్మ బంధనమునకు కారణము; పుణ్యపాపములు రెండును బంధనములే. కాబట్టి పుణ్యకార్యములుకూడ ఏమియును చేయరాదు" ఇట్టి అర్థాతలేని వాక్యములు చెప్పి వారిబుద్ధిలో సందేహములు కలిగించరాదు. వారు కర్మ మానలేరు; చేయుదానియందు 'ఇది బంధనమేమో' అన్న భయము- చేయుటయా? చేయకపోవుటయా? అను సందిగ్ధావస్థ - వీనిలో పడుదురు. కాబట్టి నిజమైన జ్ఞాని అట్లు చేయడు. వారివలెనే తానుకూడ కర్మలు చేయును. కాని ఆసక్తిలేకుండ చేయును. వారినికూడ కర్మలు మానకుండకర్మలమీద శ్రద్ధ వారికి పోకుండ చూచుచు, వారికి నిష్కామ్యముగా కర్మలుచేయుట నేర్పును. ఇది జ్ఞానిలక్షణము.

ఒక గ్రామములో ఒక వీథివీథి అందరునూ జ్ఞానులే - వారికి కర్మచేయుట అనిన భయము. "కర్మ పుణ్యరూపమో, పాపరూపమో అయి ఉండవలయునుగదా! పాప మెట్లు బంధనమో అట్లే పుణ్యముకూడ బంధనమేగదా! అందువలన జన్మరాహిత్యమును కోరువారు కర్మలు చేయరాదు" అని వారి సిద్ధాంతము. కనుక వారి ఇంటికి ఎవరు వచ్చినను మంచినీరు కూడ ఈయరు; మంచినీరు ఇచ్చినను అదికూడ బంధనమేయని వారి అభిప్రాయము.

బ్రహ్మమే కర్మమూలమున బంధనములో పడినదని వారి అభిప్రాయము. "బ్రహ్మమే కర్మమూలమున బంధనములో

పడిన యెడల ఆ బ్రహ్మము బంధనములో పడుటకుముందే కర్మ చేసి ఉండవలయును గదా! అప్పుడు బంధనమునకు ముందు బ్రహ్మము బ్రహ్మముగనే ఉన్నదిగదా! అప్పుడంత అజ్ఞానముగా కర్మ ఎందులకు చేయవలసివచ్చినది? అసలు బ్రహ్మము ఎప్పుడైనను కర్మ చేయునా? చేయగూడని కర్మ బ్రహ్మము తనకు అజ్ఞానము కలిగిన తరువాత చేసినదా? కర్మ చేయుట చేత అజ్ఞానము కలిగినదా? అజ్ఞానము చేత కర్మ చేసిన యెడల ఆ అజ్ఞానము ఎక్కడినుండి ఎందుచేత కలిగినది? లేక కర్మ చేసిన తరువాత అజ్ఞానము కలిగిన యెడల అజ్ఞానము కలుగకముందు బంధనమని తెలిసి తెలిసి, అజ్ఞానకారణమని తెలిసి తెలిసి ఆ బ్రహ్మము కర్మ ఎందులకు చేయవలయును?" అని వారిని మనము ప్రశ్నించిన యెడల, మన ముఖమువంక తేరిపారజూచి "అజ్ఞానము తొలగినగాని ఇది అర్థముకాదు. మీరు సగుణా రాధకులు కాబోలు. నిర్గుణములోనికి వెళ్ళిన తరువాత మీకే తెలియగలదు" అని సమాధానము చెప్పుదురు.

సరే; వారి సిద్ధాంతమది. ఎవరేమి చేయుదుము?

వేసవికాలము; మధ్యాహ్నసమయము; ప్రయాణము చేయువాడొకడు దాహమై ఆ గ్రామములో ఒకరి యింటికి పోయి దాహమడిగినాడు. దాహము ఈయలేదు. వీధిఅంతయు తిరిగినాడు. ఎవరును దాహమీయలేదు; పైగా వేదాంతము చెప్పుట మొదలుపెట్టినారు.

"ఎవరికి దాహము? ఎవరు తీర్చునది? ఎట్లు తీర్చుట? దాహమేమి? దాహము మిథ్య; నీవు మిథ్య; ఇచ్చుట మిథ్య;

త్రాగుట మిథ్య, దాహము తీరుట మిథ్య; నీవే బ్రహ్మము; నేనే బ్రహ్మము; నీవును నేనును ఒకటియే. ద్వైతము భయ సూచకము. ఇచ్చునదెవరు? పుచ్చుకొనునదెవరు?" ఈ విధముగ వేదాంత ప్రబోధము ప్రారంభించినారు.

ఈ బాటసారికి ఒడలు మండిపోయినది; చచ్చిపోవు చుండగా పెండ్లి పాటలేమి? చూచినాడు. బాగుగ ఆలోచించినాడు. వీరి వేదాంతమునకు తగిన ఆచరణ చూపవలయునను కొన్నాడు. గబగబ ఒక ఇంటిలో జొరబడినాడు. బిందెలోని నీరు కడుపార త్రావినాడు. ఆబిందె తీసికొని బయలుదేరినాడు. ఇక ఆ ఇంటిలోనివారు 'దొంగ! దొంగ!' అని కేకలు వేయ సాగినారు. 'మాబిందె మాకీయవేమి?' అని అరచినారు. జనము చాలమంది మూగినారు. అప్పుడు అతడు "మీరెవరు? నేనెవరు? బిందె ఏమి? ఎత్తుకొనిపోవుటేమి? ఇచ్చుటేమి? అంతా మిథ్యయే; బిందె మిథ్య; ఎత్తుకొనిపోవుట మిథ్య; ఇచ్చుట మిథ్య; అంతా బ్రహ్మమే ఉన్నదంతా బ్రహ్మమే. నీవు బ్రహ్మము; నేను బ్రహ్మము; ఈబిందె బ్రహ్మము; ఈ మూగిన జనము బ్రహ్మము, ఎత్తుకొనిపోవుట బ్రహ్మము, ఇక్కడ బ్రహ్మములో నానాత్వము లేదు. నీవు నేను అని, నా బిందె నీ బిందె అని భ్రాంతిపడకుడు! ద్వైతము భయ కారణము" అని ఆ బిందె పుచ్చుకొని ఒక్కపరుగు తీసినాడు.

ఇదీ వేదాంతము - 'మనదాకవచ్చెనో - మనసులో నొచ్చెనో' అనినట్లయినది.

తమకు దాహమైనచో దాహము తీరగా వారు ? తమ కుమారుడో మనుమడో ఊరినుండి ఎండలోవచ్చిన యెడల మంచినీరు ఈయరా ? ఈయకేమి ? ఇచ్చెదరు. తాముును త్రాగుదురు. కడుపునిండుగ మెక్కుదురు. ఇతరుల కష్టనేమి తెలియును అజ్ఞానులకు ? కనుక ఇతరుల విషయములో వేదాంతము చెప్పుదురు.

ఇట్లు ఉండరాదు. ఇవి జ్ఞానులమనుకొనువారి చేతకలుగు చిక్కులు, నిజమైన జ్ఞానికి కర్మతత్త్వము తెలియును. కేవలము కర్మ బంధనము కాదని తెలియును. కనుక ఆతడు కర్మలు మానడు. కర్మలు చేయువారిని ఆక్షేపించడు. కర్మలు చేయుటలో ఉండు పొరపాటును క్రమక్రమముగ దిద్దుబాటు చేయును.

ఈ శ్లోకములో "అజ్ఞానాం కర్మసంగినాం" అని ఉన్నది. అజ్ఞానులుఅని ఎవరిని ఉద్దేశించి చెప్పబడినది? "రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః" అని తొమ్మిదవ అధ్యాయములో చెప్పబడినవారిని గురించియేనా ఈవిశేషణము? ఈ అజ్ఞానులు ఏ శ్రేణికి చెందిన అజ్ఞానులు ? ఈ విషయము జాగ్రత్తగ ఆలోచించవలయును.

వీరు వర్ణాశ్రమధర్మములు, కర్మములు శాస్త్రోక్తప్రకారము ఆచరించువారు. పైన "రాక్షసీమాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః" అనుచోట చెప్పబడినవారు దుష్టులు, లోకోపద్రవకారులు. కనుక ఆదుష్టుల శ్రేణికి చెందినవారుకారు ఈశ్లోకములోని అజ్ఞానులు.

ఇక "మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతిమాశ్రితాః" అని తొమ్మిదవ అధ్యాయమున పదమూడవ శ్లోకములో చెప్పబడినవారు మహాత్ములు. లోకకల్యాణకారులు. కనుక, ఆ శ్రేణికి చెందినవారునుకారీశ్లోకములోని అజ్ఞానులు.

వీరు "త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః" అని తొమ్మిదవ అధ్యాయమున ఇరువది, ఇరువది ఒకటి, ఇరువది మూడు, ఇరువదినాలుగు - శ్లోకములలోను. "యామిమాం పుష్పితాం వాచంప్రవదం త్యవిపశ్చితః" అని రెండవ అధ్యాయమున నలుబది రెండు, నలుబదిమూడు నలుబదినాలుగు శ్లోకములలోను ఏడవ అధ్యాయములో ఇరువదవ, ఇరువది ఒకటవ, ఇరువది రెండవ, ఇరువదిమూడవ శ్లోకములలోను చెప్పబడిన శ్రేణికి చెందినవారు.

వీరు దుష్టులుగారు; శాస్త్రనిషిద్ధములైన దుష్కర్మలు చేయరు. శాస్త్రవిహితమైన సత్కర్మలనే చేయుదురు. కాని కామ్యములతో చేయుదురు. అందువలన - అనగా ఆ కర్మలు నిష్కామభావముతో, మాధవసేవారూపముగా చేయకపోవుట చేత - వానిచేత కలుగవలసిన అమోఘమైన, అనంతమైన మహాఫలమునుండి వంచింపబడుచున్నారు. అల్పమైన, అనిత్యమైన, తుచ్ఛమైన ఫలముతో తృప్తి చెందుచున్నారు. ఆకారణమున వీరు "అజ్ఞానులు" అనబడినారు. వీరిలో ఉన్న ఆ "కామ్యముతో చేయుట" అను లోపము దిద్దబడుట ఒక్కటే జరుగవలసినది. అది జరిగిననాడు వీరు మహాత్ములే కనుక మహాత్ములైనవారు వీరుచేయు ఈ కర్మలనే నిష్కామ్యముగా

చేయుట వీరికి నేర్పవలయును. ఆ నేర్పుటలో, ఆ చెప్పుటలో, కర్మలయందు అశ్రద్ధ నిర్లక్ష్యభావము గలుగునట్లు, కర్మలు మొదలుకే మానునట్లు చెప్పరాదు.

అనగా-ఒకడు తన ముదుసలి తల్లిదండ్రులకు నిత్యమును శ్రద్ధాభక్తులతో సేవచేయుచున్నాడు. కాని, వారియందు దేహసంబంధమైన గౌరవమర్యాదలనేఉంచి సేవించుచున్నాడు. కాబట్టి ఆ సేవకు ఫలము అసమర్థులైన, అజ్ఞానులైన, ఆ తల్లి దండ్రుల సంతోషమే. వారు సంతోషించినచో ఏమి ఫలమియగలరో ఆ అల్పఫలమే ఆతనికి లభించగలదు. ఇట్లు జరుగుచుండగా, ఒకప్పుడు వారింటికి ఒక వ్యక్తి-కొంచెముగ చదువుకొన్నవాడు - వచ్చి "ఛీ! ఇదేమి? ఈనాడు ఉండి రేపు పోవు వీరిసేవయా నీకు కావలసినది? నీ వెవరవో తెలిసికొనిన యెడల, నీకు యథార్థమైన తలిదండ్రులెవరో తెలియగలదు. నీకు, నాకు, అందరకు, ఈ అనంతకోటి బ్రహ్మాండములకును తల్లి, దండ్రి, సమస్తమును ఆ పరమాత్మయే. కాబట్టి ఆ పరమాత్మను కొలుచుటయే మానవజన్మకొక్క పరమలక్ష్యము" అని బోధించినాడు. ఆనాడు మొదలుకొని ఈతడు తలిదండ్రులసేవ మాని వేసినాడు; కాని పరమాత్మసేవ ప్రత్యక్షముగా చేయలేడు - కొంతకాలమునకు ఇటు తలిదండ్రుల సేవయు, అటు పరమాత్మ సేవయుకూడ లేకపోవుటచేత, ఏ పనియు లేక తిరుగు వానియందు నెమ్మది నెమ్మదిగా నిద్ర, ఆలస్యము, ప్రమాదము మొదలగు లక్షణములన్నియును ప్రవేశించి చివరకు సర్వభ్రష్టత్వము కలుగజేసినవి.

దీనికి బాధ్యుడు నిజమునకు ఆ బోధించిన వ్యక్తియే. బోధించినది సత్యమే అయినను సరిగా చెప్పుట చేతకాక పోవుటచే, బోధించబడిన వ్యక్తికి ఉభయభ్రష్టత్వము, ఈ బోధించిన వ్యక్తి యముని సన్నిధిలో చేతులు కట్టుకొని నిలబడి సమాధానము చెప్పుకొనవలసిన స్థితి. ఈ రెండు ఫలములును కలిగినవి.

ఇచ్చట యథార్థమాలోచించిన మొదట ఆతడు చేయు తలిదండ్రుల సేవ నింద్యమును, హేయమునుకాదు. ఆ తలి దండ్రులయందు దేహసంబంధభావమును మార్చుకొని, భగవత్స్వరూపులుగా భావించుకొని నిష్కామ్యముగా సేవ చేయవలయును. అప్పుడు ఆ సేవయే మాధవసేవ అగును. అందుచే ఆతడు ఆ సేవయొక్క అమోఘము, అనంతము, అయిన మహాఫలమును సులభముగా పొందగలడు.

అవతారిక:-

ఇరువది ఆరవశ్లోకములో అజ్ఞాను లెట్లు కర్మలు చేయుదురో జ్ఞానికూడ అట్లే కర్మలు చేయవలయునని చెప్పి, ఈ ఇద్దరును కర్మలు చేయుటలో ఉన్న భేదమును విపులముగా ఇరువది ఏడవ, ఇరువది ఎనిమిదవ శ్లోకములలో చెప్పుచున్నాడు -

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని
గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా
కర్తాహ మితి మన్యతే ॥ ౨౭

ప. వి :— ప్రకృతేః, క్రియమాణాని, గుణైః, కర్మాణి, సర్వశః, అహంకార విమూఢాత్మా, కర్తా, అహం, ఇతి, మన్యతే.

టీక :—

ప్రకృతేః = ప్రకృతియొక్క,
గుణైః = గుణములచేత,
సర్వశః = నానావిధములుగా,
క్రియమాణాని = చేయబడుచున్న,
కర్మాణి = కర్మలను,
అహంకార విమూఢాత్మా = అహంకారముచేత మూఢత్వముచెందిన మనసుకల అజ్ఞాని,
అహంకర్తా ఇతి = నేను కర్తను అని,
మన్యతే = తలంచుచున్నాడు.

తా. ప్రకృతి గుణములచేత అనేకవిధములైన కర్మలు చేయబడుచున్నవి. అహంకారయుక్తుడైన అజ్ఞాని 'నేను కర్తను' అని తలంచును.

**అమృతవాహిని :—**

"సత్త్వంరజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః" 'సత్త్వరజస్తమములను మూడు గుణములు ప్రకృతి సంభవములు' అని పదునాల్గవ అధ్యాయములోని అయిదవ శ్లోకములో చెప్పబడి యున్నది. ఈ గుణములవలననే కర్మలన్నియును జరుగుచున్నవి. అనగా ప్రకృతియొక్క ప్రధాన గుణములైన సత్త్వరజస్తమములే మనస్సు, బుద్ధి, అహంకారము, సూక్ష్మ పంచమహాభూతములు, దశేంద్రియములు,

శబ్దాది విషయములైదును, మొత్తము ఇరువదిమూడు తత్త్వములుగా పరిణమించుచున్నవి. కాబట్టి, ఇవన్నియును ప్రకృతియొక్క గుణములనియే చెప్పబడును. ఈ గుణముల చేతనే సర్వకర్మలును జరుగుచున్నవి. ఎట్లనిన - మనస్సు మననముచేయును. బుద్ధి ఒకవిషయమును ఆలోచించి నిశ్చయించును. జ్ఞానేంద్రియములైదును, శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములను గ్రహించును - అనగా చెవులు శబ్దమును వినును. చర్మము స్పర్శను గ్రహించును. కన్నులు రూపమును చూచును. జిహ్వ రసమును గ్రహించును. నాసిక వాసనను గ్రహించును.

కర్మేంద్రియములైదును చేయుకర్మలు- వాగింద్రియము మాట్లాడును. హస్తము పట్టుకొనును. పాదములు నడచును. గుదము - అనగా మలవిసర్జనేంద్రియము - మలమును విడుచును. ఉపస్థము - అనగా మూత్రవిసర్జనేంద్రియము - మూత్రమును విడుచును.

కనుక, లోకములో ఏ ఏ పనులు జరిగినను అవన్నియును పైన చెప్పబడినట్లు గుణములవలననే చేయబడుచున్నవి. కేవలము ఆత్మ చేయుటలేదు. కాని అహంకారముచేత అత్యంతము మోహింపబడిన అంతఃకరణముగలవాడు "అహంకార విమూఢాత్మా" అని చెప్పినట్లు తన వివేకశక్తిని బలహీనముగను, నిష్ప్రయోజనముగను చేసికొనుచున్నాడు. అందువలన ఆత్మ అనగా నేమి, అనాత్మ అనగా నేమి- అను వివేచన చేసికొనలేదు. నేను ఈ శరీరాదులకంటె విలక్షణమైనవాడను అని తెలిసికొనలేక, ఈ శరీరమే నేనని భ్రమించి, ప్రకృతి

గుణములచేత జరుపబడుచున్న కర్మలను తానే చేయుచున్నట్లు అహంకరించుచున్నాడు.

కాని కర్మయోగసాధకుని అంతఃకరణము మాత్రము అహంకారముచేత మోహింపబడుటలేదు. అతడు అహంకారమును నశింపజేసికొనుటకే ప్రయత్నించుచున్నాడు. కనుక సాధకుని 'అహంకార విమూఢాత్మా' అని అనరాదు. అహంకార విమూఢుడైనవాడు కామ్యములతో కర్మలు చేయుటయు, వాని ననుభవించుటకు స్వర్గాది లోకములకు పోవుటయు, అచ్చట అనుభవము క్షీణించగనే మరల భూలోకమున పుట్టి కర్మలుచేయుటయు - ఇట్లు మాటిమాటికి జననమరణ రూపమైన సంసారచక్రములో సుడివడి తిరుగుచుండును. జ్ఞాని అట్లు కాదు.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో !
గుణకర్మ విభాగయోః ।
గుణా గుణేషు వర్తంత
ఇతి మత్వా నసజ్జతే ॥ —౨౮

ప. వి :—తత్త్వవిత్, తు, మహాబాహో, గుణ కర్మ విభాగయోః, గుణాః, గుణేషు, వర్తన్తే, ఇతి, మత్వా, న, సజ్జతే -

టీక :—

మహాబాహో ! = ఓ అర్జునా !
గుణాః = గుణములు,
గుణేషు = గుణములయందు,

వర్తంతే ఇతి = ప్రవర్తించుచున్నవని,
మత్వా = తెలిసికొని,
గుణకర్మ విభాగయోః = గుణములయొక్కయు కర్మలయొక్కయు విభజనయొక్క,
తత్త్వవిత్ తు = యథార్థము తెలిసినవాడు (కనుక),
న సజ్జతే = అభిమానము (సంగము) కలిగియుండడు.

తా. కాని ఓ మహాబాహో ! అర్జునా ! గుణకర్మ విభాగముయొక్క యథార్థతత్త్వము బాగుగా తెలిసినవాడు గుణములు గుణములయందు ప్రవర్తించుచున్నవి అని తలచి "నేనుకర్తను" అను అభిమానములేక ఉండును.

## అమృతవాహిని :_

అర్జునా ! ఆవిధముగ ప్రకృతి గుణములచేతనే చేయబడుచున్న సకలకర్మలను గురించియును అజ్ఞానులు తమ్ము కర్తలుగ భావించి బంధనము పొలగుచున్నారు. కాని సకల కర్మల విషయమునను తాము కర్తలమని భావించక, బంధన రహితులై తిరుగువారుకూడ కలరు సుమా ! వారు గుణకర్మ విభాగముయొక్క యథార్థతత్త్వమును చక్కగ తెలిసినవారు. వారు ఎప్పుడును తాము కర్తలమని భావించరు. గుణములే గుణములయందు వర్తించుచున్నవి అని వారికి బాగుగ తెలియును; కనుక అహంకరించరు. కనుకనే వారికి బంధనము లుండవు.

ఇక - గుణకర్మవిభాగమనగా -

గుణవిభాగము - సత్త్వరజస్తమోగుణములయొక్క పరిణామరూపమైన ఇరువదిమూడు తత్త్వములను (మనస్సు, బుద్ధి, అహంకారము, సూక్ష్మపంచమహాభూతములు, దశేంద్రియములు, శబ్దాదివిషయ పంచకము-మొత్తము ఇరువదిమూడు) గురించి తెలిసికొనుట గుణవిభాగమును తెలిసికొనుట.

అంతఃకరణములో కలిగిన సాత్త్వికరాజస తామస భావములచేత ఇంద్రియములద్వారా కర్మలు చేయబడు చున్నవి. కనుక కర్మలు సాత్త్విక రాజస తామసములను మూడు భేదములతో నున్నవి. ఈ కర్మలు కలుగుటకు అంతఃకరణములోని భావములే-అనగా వృత్తులే- కారణము. కనుక ఈవృత్తులు ఏయే గుణములకు సంబంధించినవి అను గుణ వృత్తులను గురించిన వివేచన కూడ గుణవిభాగమే.

కర్మవిభాగము : పైన చెప్పిన గుణములచేత అనేక విధములైన భిన్నభిన్న క్రియలు జరుగుచుండును. ఈక్రియలందు కర్తృత్వాభిమానము కలుగుటచేతనే బంధనములోపడుట. ఈ క్రియలయొక్క సముదాయమును గురించి తెలియుటే కర్మ విభాగమును తెలియుట అనగా.

ఇట్లు గుణకర్మవిభాగమును బాగుగ తెలిసినజ్ఞాని మనో బుద్ధీంద్రియములద్వారమున జరుగు కర్మలయందు 'నేనుచేయు చున్నాను' అను కర్తృత్వాహంకారము ఏమాత్రమును లేక సత్త్వాదిగుణములే తమకార్యరూపములైన ఇంద్రియము లందును, విషయములందును, ప్రవర్తించుచున్నవి అను

దృఢాధ్యవసాయముతో, ఆసక్తిరహితుడై అభిమానము లే ఉండును.

శ్లో॥ ప్రకృతే ర్గుణసమ్మూఢాః
సజ్జన్తే గుణ కర్మసు ।
తా నకృత్స్నవిదో మన్దాన్
కృత్స్నవి న్న విచాలయేత్ ॥ ౨౯

ప. వి :— ప్రకృతేః, గుణసమ్మూఢాః, సజ్జన్తే, గుణకర్మసు తాన్, అకృత్స్నవిదః, మందాన్, కృత్స్నవిత్, న విచాలయేత్.

టీక :—

ప్రకృతేః = ప్రకృతియొక్క,
గుణసమ్మూఢాః = గుణములచేత మోహింపజేయబడిన వారగుచు,
గుణకర్మసు = గుణకర్మములయందు,
సజ్జన్తే = అభిమానముంచుచున్నారో (అట్టి)
అకృత్స్నవిదః = జ్ఞానులుకాని,
మన్దాన్ = అవివేకులైన,
తాన్ = కర్మసంగులను,
కృత్స్నవిత్ = తెలిసిన జ్ఞాని,
నవిచాలయేత్ = చలింపజేయరాదు.

తా. ప్రకృతి గుణములచేత మోహితులై, గుణములయందును, కర్మలయందును ఆసక్తులై ఉన్న మందులను - పూర్తిగ తెలియనివారిని- పూర్తిగ తెలిసిన జ్ఞానులు సంచలింపచేయరాదు.

అ మృ త వా హి ని :-

మానవుల అంతఃకరణము ప్రకృతి గుణములయొక్క- సంపర్క-ముచేత మూఢత్వము చెంది, భోగాసక్తమగును. భోగములందు సక్తత గలుగుటవలన కర్మలయందు ప్రవృత్తు లగుదురు. వీరు ఇహలోక పరలోక భోగములందు కోరికలచే శ్రద్ధాసక్తులతో కర్మలుచేయుదురు. వీరు చేయునది శాస్త్ర విహిత కర్మలనే కాని, ఫలాభిసంధితో చేయుటచే అనంతఫల మును పొందలేకపోవుచున్నారు. కాని, జ్ఞానులైనవారు వీరిని కలతపెట్టరాదు. వీరి అంతఃకరణము ప్రకృతిగుణములచేత మూఢత్వము చెంది ఉండుటచే, ప్రకృతికి అతీతమైన సుఖము- ఆనందము- ఒకటి ఉన్నదను జ్ఞానమే వీరికుండదు. ఇహలోక పరలోక భోగములే ఉత్కృష్ట సుఖములని భావింతురు. కనుక శాస్త్రవిహితమైన కర్మలనే- నిష్కామ్యముగా చేసినయెడల మోక్షము ప్రసాదించగల కర్మలనే- కామ్యబుద్ధితో చేసి, అనంతఫలమునుండి వంచింపబడి, అనిత్యమైన, అల్పమైన, తుచ్ఛమైన ఫలముతో తృప్తిపడి ఆనందించుచున్నారు. జ్ఞానులు చేయవలసినది నేర్పుతో వీరికి యథార్థజ్ఞాన మును బోధించి, నిష్కామ్యముగా కర్మలు చేయగలుగునట్లు దిద్దుబాటు చేయుటయే. అంతియేగాని జ్ఞానప్రబోధము చేయు టలో వీరికి కర్మలయందు నిర్లక్ష్యభావము ఏర్పడునట్లు చేయ రాదు.

ఇందు అజ్ఞానులకు 'అకృత్స్నవిదః' అనియును, 'మందాన్' అనియును రెండు విశేషణములు గలవు.

అకృత్స్నవిదు లనగా పూర్తిగ తెలియనివారు-అనగా కొంచెము తెలిసినవారు - అని భావము.

మనము స్వేచ్ఛాచారులమై, విషయలంపటులమై జీవితమును పాడుచేసికొనరాదు; శాస్త్రవిహితమైన కర్మలనే చేయవలయును అని తెలియును. అందువలన శాస్త్రవిహితమైన కర్మలయందు శ్రద్ధగలిగియున్నవారగుటచే కొంచెము తెలిసినవారు. కాని,ఇహలోక పరలోకభోగములకంటె శాశ్వతమైన, స్థిరమైన, అనంతమైన, మహాఫలము ఒకటి ఉన్నదని వీరికి తెలియదు. కాబట్టి పూర్తిగ తెలియనివారు. వీరు అధర్మమును ధర్మముగా, ధర్మమును అధర్మముగా తలచి ఆచరించునట్టి తామసిక మానవులకంటె చాల మంచివారు. వీరు బుద్ధిలేనివారుకారు- 'అల్ప మేధసాం'-అల్పబుద్ధిమంతులు. కనుక వీరు తాముచేయు కర్మలకు ఫలమైన భగవత్ప్రాప్తిని పొందక, నాశవంతములైన, దుఃఖాంతములైన, ఇహపరలోకభోగములనే పొందుచున్నారు.

జ్ఞానులకు కృత్స్నవిదులని విశేషణము గలదు. అనగా పూర్ణముగా తెలిసినవారు అని. వీరికి గుణకర్మవిభాగము బాగుగ తెలియును; ఆత్మపరమాత్మలయొక్క తత్త్వము బాగుగ తెలియును. కనుక ఇట్టి జ్ఞానులు పైనచెప్పబడిన అజ్ఞానులను తబ్బిబ్బుచేయరు అని జ్ఞానుల లక్షణమును చెప్పి, అట్లు అజ్ఞానులకు తేనిపోని ఉపదేశములుచేసి, చెడగొట్టువారు జ్ఞానులుకారు అను అభిప్రాయముకూడ సూచించినాడు పరమాత్మ.

"కర్మలు చేయుటకు చాలశ్రమపడవలయును. ఇంతశ్రమ పడినను ఏమిఫలము కలదు ? జగత్తు మిథ్య; కర్మ బంధన హేతువు." ఇత్యాది ఉపదేశములు చేయుటచేత వారికి కర్మల యందు అంతకుముందుగల శ్రద్ధపోయి, కర్మలనుండి నివృత్తు లగుదురు. కర్మలు చేయుట మాని వేయుదురు. దానిచేత వారికి పతనమే ఫలము. కొంతమందికి సందిగ్ధావస్థ కలుగును. మొదటినుండియు కర్మలు చేయుటచేతను, శాస్త్రములయందు కర్మలు చేయవలయునని విధి ఉండుటచేతను వీరికి కర్మలయందు అభిలాష ఉండును. ఈ ఉపదేశము చేయువారియందు 'జ్ఞానులు' అను గౌరవభావముండుటచే వీరు తప్పుచెప్పుదురా అను విశ్వాసము- ఇట్లు సందేహమున చిక్కి, తబ్బిబ్బుఅగుదురు. ఇట్టి స్థితిని తీసికొనిరారాదు. శ్రద్ధతోను, విశ్వాసముతోను కర్మలు చేయించుచు, యథార్థతత్త్వజ్ఞానమును ఉచితరీతిని కలిగించ వలయును. కర్మలు ఎట్లుచేసిన బంధనకారణములుకావో, తమకును లోకమునకునుగూడ కల్యాణప్రదములగునో చక్కగ నేర్పవలయును.

ఈ అధ్యాయముయొక్క మొదటి రెండుశ్లోకములలో అర్జునుడు 'నాకు దేనివలన శ్రేయస్సుకలుగునో అట్టి శ్రేయో మార్గమును ఒక్కదానిని నీవేనిర్ణయించి చెప్పుము' అని భగ వంతుని ప్రార్థించినాడు. భగవంతుడు ఆప్రార్థనకు సమా ధానముగా నాల్గవశ్లోకమునుండి ప్రారంభించి ఇంతవరకును చెప్పియున్నాడు. ఆ ఉపదేశసారమును ఒకమారు సింహావలోక నము చేసికొనవలసియున్నది.

శ్లోకసంఖ్య

౧. ౪. కర్మచేయకయే మానవుడు నైష్కర్మ్యసిద్ధిని పొందలేడు.

౨. ౪. కేవలము కర్మలను విడిచిపెట్టినంతమాత్రమున ఎవడును సిద్ధిని పొందలేడు.

౩. ౫. మానవుడు ఒక్కక్షణముకూడ కర్మచేయకుండ ఉండలేడు.

౪. ౬. బయటినుండి కర్మేంద్రియములతో కర్మలు చేయక మనస్సులో విషయములను చింతించుకొనువాడు మిథ్యాచారుడు.

౫. ౭. మనస్సును, ఇంద్రియములను వశమందుంచుకొని నిష్కామభావముతో కర్మచేయువాడు శ్రేష్ఠుడు.

౬. ౮. కర్మచేయకపోవుటకంటె చేయుటే శ్రేష్ఠము.

౭. ౮. కర్మచేయనియెడల శరీరయాత్రకూడ సాగదు.

౮. ౯. యజ్ఞముకొరకే చేయబడు కర్మ బంధించదు. ముక్తికే కారణమగునుకూడ.

౯. ౧౦,౧౧. భగవంతుడు కర్మచేయుటకే ఆజ్ఞయిచ్చియున్నాడు. స్వార్థరహితముగా భగవంతుని ఆజ్ఞ పాలించుటలోనే శ్రేయఃప్రాప్తి గలదు.

౧౦. ౧౨. యజ్ఞములుచేయక- అనగా దేవతలచేత ఈయబడినవి దేవతలకు సమర్పించక, కర్తవ్యపాలనము సేయక-భోగముల ననుభవించువాడు దొంగ.

౧౧. ౧౩. యజ్ఞశేషముతో శరీరనిర్వహణము కొరకు భోజనముచేయువాడు సమస్తపాపములనుండి విముక్తుడగుచున్నాడు.

౧౨. ౧౩. యజ్ఞములుచేయక కేవలము శరీర పోషణము కొరకే భోజనము వండుకొనువాడు పాపి.

౧౩. ౧౬. కర్తవ్యకర్మమును చేయనివాడు-అనగా సృష్టి చక్రమును అనువర్తించనివాడు - వ్యర్థముగా జీవించుచున్నాడు. వాని జీవితమే పాప మయము.

౧౪. ౧౯. ఆసక్తిరహితముగా కర్మచేయుట వలన భగవత్ప్రాప్తి లభించుచున్నది.

౧౫. ౨౦. పూర్వము జనకాదులుకూడ కర్మచేతనే సిద్ధిని పొంది యున్నారు.

౧౬. ౨౧. మానవు లందరును శ్రేష్ఠులైన వారిని అనుసరింతురు. కనుక శ్రేష్ఠులు కర్మ చేయవలయును.

౧౭. ౨౨. పరమాత్మకు చేయవలసినది ఏమియునులేదు. అయినను లోకసంగ్రహము కొరకు కర్మచేయుచున్నాడు.

౧౮. ౨౫. మహాత్మునకు ఏమియును కర్తవ్యములేదు. అయినను లోకసంగ్రహము కొరకు కర్మ చేయవలయును,

౧౯. ౨౬. మహాత్ములు స్వయముగ కర్మలను త్యజించి గాని, కర్మత్యాగమును బోధించిగాని,ఏవిధము గను కూడ సాధారణ మానవులను కర్తవ్య కర్మలనుండి చలింపచేయరాదు. తాము స్వయముగా చేయుచు, ఇతరులచేత చేయించ వలయును.

౨౦. ౨౯. మహాత్ములైనవారు, కర్మలను స్వరూపముతో త్యజించుటను ఉపదేశించి,దానివలన కర్మాసక్త మానవులను తబ్బిబ్బు చేయరాదు.

అవతారిక :–

ఇట్లు కర్మలయొక్క ఆవశ్యకమును ప్రతిపాదించి, రెండవ శ్లోకమున అర్జునుడు చేసిన ప్రార్థనకు సమాధానము చెప్పుచున్నాడు - 'అర్జునా ! నీవు యుద్ధము చేయుము !' అని ఆజ్ఞాపించుచున్నాడు–

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి
సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీ ర్నిర్మమో భూత్వా
యుద్ధ్యస్వ విగతజ్వరః ॥ ౩౦

ప. వి :—మయి, సర్వాణి, కర్మాణి, సన్న్యస్య,అధ్యాత్మచేతసా, నిరాశీః, నిర్మమః, భూత్వా, యుద్ధ్యస్వ, విగతజ్వరః.

టీక :—

అధ్యాత్మచేతసా = భగవదర్పణబుద్ధితో,
సర్వాణి కర్మాణి = అన్నికర్మలను,
మయి = నాయందు,
సన్న్యస్య = సమర్పించి,
నిరాశీః = ఆశారహితుడవును,
నిర్మమః = మమకారరహితుడవును,
భూత్వా = అయి,
విగత జ్వరః = సంతాపమును విడిచి,
యుధ్యస్వ = యుద్ధము చేయుము.

తా. అధ్యాత్మ చిత్తముతో సమస్తకర్మలను నాయందు సమర్పించి ఆశ, మమకారము లేక, దుఃఖమును విడిచి యుద్ధము చేయుము.

అమృత వాహిని :—

సర్వశక్తిత్వ సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వ దయామయత్వాది సకల కల్యాణగుణసంపన్నుడైన భగవంతునియొక్క గుణములను, ప్రభావములను, స్వరూపమును తెలిసికొని, పరిపూర్ణవిశ్వాసముగలిగి, నిరంతరమును, సర్వత్ర, ఆయననే చింతించుకొనుచు ఉండు చిత్తము అధ్యాత్మచేతస్సు. అట్లుండవలెనని "అధ్యాత్మచేతసా" అని చెప్పబడినది.

అట్టి అధ్యాత్మచిత్తముతో, సమస్తకర్మలను భగవంతునియందు సమర్పించుట అనగా - శ్రియఃపతియైన పరమాత్మను నిఖిల ప్రాకృత హేయగుణ ప్రత్యనీకుడుగను, సమస్త కల్యాణగుణ మహోదధిగను, అనంతజ్ఞానానందైక స్వరూపుడుగను, సర్వశక్తిమంతుడుగను, సర్వాధారుడుగను, సర్వ

వ్యాపిగను, సర్వజ్ఞుడుగను, సర్వేశ్వరుడుగను, అచింత్య దివ్యా ద్భుత నిత్య నిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌగంధ్య సౌందర్య సౌకుమార్య లావణ్య యౌవనాది దివ్యరూపుడుగను, పరమ ప్రాప్యుడుగను, పరమగతిగను, పరమప్రియుడుగను, పరమ హితైషిగను, పరమసుహృత్తుగను, పరమదయాసముద్రుడు గను, అనాలోచితాశేష విశేష లోకశరణ్యుడుగను తెలిసి కొని, అంతఃకరణము, ఇంద్రియములు - వీనితో గూడిన శరీ రమును, వీనిద్వారమున చేయబడు కర్మలను, సృష్టిలోగల సమస్తపదార్థములను భగవంతునివిగ తెలిసికొని, వేని యందును మమకారమును, ఆసక్తిని, ఉంచుకొనక, అన్ని విధముల త్యజించి "నాయందు ఏమియును, ఎంతమాత్రమును శక్తిలేదు. పరమాత్మయే అన్నివిధముల శక్తిని ప్రసాదించి, నాద్వారా తన ఇచ్ఛానుసారము సమస్తకర్మలు చేయించు కొనుచున్నాడు. నేను కేవలము నిమిత్తమాత్రుడను" అని తనను భగవంతునికి అధీనునిగా తెలిసికొని, భగవంతుని ఆజ్ఞానుసారము, భగవంతునికొరకే, భగవంతుని ప్రేరణచేతనే ఆయన చేయించినట్లు సమస్తకర్మలను చేయుచు, ఆ కర్మలను గురించికాని, కర్మలయొక్క ఫలమునుగురించికాని, ఏవిధమైన సంబంధమును పెట్టుకొనక, "అన్నియును భగవంతునివే; భగవంతునికే" అనెడి దృఢాధ్యవసాయముతో నుండుటయే.

ఈవిధముగ సమస్తకర్మలను భగవంతునియందు సమ ర్పించిన తరువాత, ఆశ, మమత్వము, దుఃఖము ఉండనే ఉండవు. ఈ భావమును వ్యక్తము చేయుటకే "ఆశ, మమ

త్వము, దుఃఖము లేనివాడవై, యుద్ధము చేయుము" అని చెప్పినాడు పరమాత్మ.

"నీవు సమస్త కర్మలు నాయందు సమర్పించి, సమస్త భారములు నామీదనే విడిచి, ఏవిధమైన ఆశ, మమకారము, రాగద్వేషములు, హర్ష శోకములు మొదలగు వికారములు లేక, నా ఆజ్ఞానుసారము యుద్ధము చేయుము"అని భగవంతుడు అర్జునునిగూర్చి చెప్పుచున్నాడు.

కర్మ చేయునప్పుడును, కర్మఫల మనుభవించునప్పుడును, మమత్వము, ఆసక్తి, రాగద్వేషములు, హర్ష శోకములు మొదలగు వికారములు ఉన్నంతకాలము పూర్తిగ భగవదర్పణము సిద్ధించదు.

అవతారిక :-

ఈవిధముగ అర్జునునకు నిశ్చితమైన సాధనను గురించి బోధించి, యుద్ధము చేయుటకు ఆజ్ఞాపించి, ఇప్పుడు తన మతమును అనుష్ఠించినవారికి కలుగు ఫలమును చెప్పుచున్నాడు.

శ్లో॥ యే మే మత మిదం నిత్య
మనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావన్తో ఽనసూయన్తో
ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ ౧౩

ప. వి:—యే, మే, మతం, ఇదం, నిత్యం, అనుతిష్ఠంతి, మానవాః, శ్రద్ధావంతః, అనసూయంతః, ముచ్యన్తే, తే, అపి, కర్మభిః–

టీక :—

యే మానవాః = ఏమనుష్యులు,
ఇదం మే మతం = ఈ నా అభిప్రాయమును,
శ్రద్ధావంతః = శ్రద్ధగలవారును,
అనసూయంతః = అసూయలేని వారును (అయి),
నిత్యం = ఎల్లప్పుడును,
అనుతిష్ఠంతి = అనుష్ఠింతురో,
తేఽపి = వారుకూడ,
కర్మభిః = కర్మములనుండి,
ముచ్యన్తే = విడువబడుచున్నారు.

తా. ఎవరు శ్రద్ధావంతులై, అసూయలేక, నా ఈ ఉపదేశమును సదా అనుష్ఠించుచున్నారో, వారుకూడ కర్మములనుండి విడివడుచున్నారు.

అమృతవాహిని :—

అర్జునా ! మానవుడు కర్మబంధనమునుండి విడివడి, ముక్తిని పొందవలయునన్నచో నా ఈ మతమును సదా అనుష్ఠించుచుండవలయును. ఎట్లు అనుష్ఠించవలయును ? నాయందు అసూయాభావము ఏమాత్రమును ఉండరాదు. అసూయ ఉన్నవానికి చెడు కనుపడునుగాని మంచి కనుపడదు. అంతేకాదు. చెడు లేకపోయినను ఉన్నట్లు కనుపడును; అంతేకాదు, మంచి కూడ చెడుగానే కనుపడును. కనుక అసూయ ఉన్నవాడు నా ఈ ఉపదేశము ఆచరణలో పెట్టలేడు. అసూయ లేకపోవుటమాత్రమే చాలదు; నా ఈ మతమును యథాతథముగ, యథాశక్తిగ ఆచరించవలయునన్నచో శ్రద్ధ ఉండవల

యును. శ్రద్ధ ఉన్నవాడే మానవుడు ఈ మతమును పూర్తిగ ఆచరణలో పెట్టగలడు; లేక పెట్టుటకు త్రికరణశుద్ధిగ ప్రయత్నించగలడు. కనుక అసూయలేక, శ్రద్ధాయుక్తులై, నిత్యమును అనుష్ఠించవలయును. ఇట్టివారు కర్మబంధనమునుండి విముక్తులగుచున్నారు.

"ఇదం మతం" 'ఈ మతము' అనగా ఏది ? ఈశ్లోకమునకు పూర్వము చెప్పబడినదా? లేక ఇంతకుపూర్వము మొదటి నుండియును చెప్పబడినదా ? లేక మొత్తము గీతఅంతటిలోను చెప్పబడినదా ? ఏది ?

"ఇదం" 'ఈ' అనుటచేత పూర్వశ్లోకమునందు చెప్పబడినదిగనే తోచును. ఇట్లు అర్థము చెప్పినను ప్రత్యవాయము లేదుకాని, కృష్ణపరమాత్మ అభిప్రాయము గీత అంతటిలోను వ్యాపించియున్నది.

మొదటినుండి చివరివరకు 'గీత' ఎంత చెప్పినను, తన ఈ అభిప్రాయమును చక్కగా, విపులముగా బోధించుటకే. ఒక అభిప్రాయమును ఒక పద్ధతిలో బోధచేసినప్పుడు, శ్రోతకు అది సరిగా అర్థముగాక మరల ప్రశ్న వేసిన యెడల ఆ అభిప్రాయమునే ఇంకొక పద్ధతిలో బోధింతురు. అప్పుడు మొదటి అభిప్రాయము వేరు, ఇప్పటిఅభిప్రాయము వేరు అని తలంచరాదు. ఎన్నిచోట్ల ఎన్నివిధముల చెప్పినను, మూలసిద్ధాంతము మాత్రము ఒక్కటిగనే ఉండును. *

---

* ఈవిషయమును గురించి నాల్గవ అధ్యాయములోని మొదటి శ్లోకముయొక్క వ్యాఖ్యానములో చూడుడు.

ఈసందర్భమున శ్రీమద్రామానుజులు ఇట్లు వ్రాసినారు- 'తేఽపి' 'వారుకూడ' అనుటచేత బంధనమునుండి విముక్తి చెందువారిని మూడురకములుగా చెప్పినట్లు తోచుచున్నది; మొదటివారు- శ్రద్ధగలిగి, అసూయలేక, అనుష్ఠించువారు; రెండవవారు- అనుష్ఠించరు. శ్రద్ధమాత్రమున్నది; మూడవ వారు - శ్రద్ధలేదు. అనుష్ఠించరు. కాని నిందించరుకూడ. ఈ మూడువిధములవారును తరించెదరు." ఇది వారు వ్రాసినది. "ఇచ్చట అనుష్ఠించనివారికికూడ ముక్తి అంగీకరించినట్లు కాలేదా? మీ సమాధానమేమి ?"అని ఒకరు ప్రశ్నించినారు. కాని శ్రీమద్రామానుజుల అభిప్రాయమును జాగ్రత్తగ గమనింప వలసి యున్నది.

"అసూయలేకున్న చాలును ; ఎప్పటికైనను వాడు తరించుటకు అవకాశముగలదు" అనిమాత్రమే వారి అభిప్రాయము- "ఇదానీమననుతిష్ఠంతోఽపి అస్మిన్ శాస్త్రార్థే శ్రద్ధధానా అనభ్యసూయవశ్చ, శ్రద్ధయాచ, అనసూయయాచ, క్షీణపాపా అచిరేణ ఇమమేవ శాస్త్రార్థమనుష్ఠాయ,ముచ్యంతే ఇత్యర్థః" - అనగా "ఈ శాస్త్రార్థమును అనుష్ఠించకపోయినను ఈ శాస్త్రార్థమునందు శ్రద్ధావంతులు, అసూయలేనివారును అగుటచే, అట్టిశ్రద్ధ, అసూయలేమి, అను గుణములచేత పాపములు పోయినవారై, శీఘ్రముగనే ఈ శాస్త్రార్థమును అనుష్ఠించి ముక్తులగుచున్నారు అని అర్థము"-ఇది వారు వ్రాసినది.

కనుక వారుకూడ శాస్త్రార్థమును అనుష్ఠించిన తరువా

తనే ముక్తియని ప్రతిపాదించియున్నారు. ఇచ్చట అభిప్రాయ భేదమేమియును లేదు.

'శ్రద్ధగలిగి, అసూయలేక నిత్యమును అనుష్ఠించిన మీదటనే ముక్తి' అని ఫలితార్థము.

'తేఽపి' 'వారుకూడ' అనుటలో 'అపి' ఎందులకు ప్రయోగించుట ?" అని ప్రశ్నించుకొని కొంతమంది "ఇట్లు శ్రద్ధతోను, అసూయలేకను అనుష్ఠించు ఇతరులే ముక్తిని పొందుచుండగా, అర్జునా ! నీసంగతి చెప్పవలయునా ?" అని కృష్ణపరమాత్మ భావముగా వ్రాసియున్నారు.

ఇది అంత సమంజసముగా తోచుటలేదు. అయితే, 'అపి' ప్రయోగమెందులకు ? అని ప్రశ్నరావచ్చును.

సాహిత్యములో కొన్ని శబ్దములకు కాలాంతరమునందు అర్థములు మారవచ్చును. అర్థము వ్యాపకము కావచ్చును. సంకుచితము కావచ్చును. ఇది అంతయును జాగ్రత్తగా పరిశీలించినగాని, సరియైన అర్థమును గ్రహించలేము. "అపి" శబ్దమునకు మహాభారతకాలము నాటికి "ఏవ"అను అర్థములో కూడ ప్రయోగముండి ఉండవచ్చును. ఇచ్చట ఆ అర్థమే ఎక్కువసమంజసముగా కనుపడుచున్నది. లేనియెడల "కూడ" అను అర్థమే చెప్పినయెడల, మనము ఎట్లో అర్థముకుదుర్చుకొనవలసివచ్చుచున్నదేగాని, సహజముగా కుదురుటలేదు. "ఏవ" అను అర్థమును ఉపయోగించిననే, మొదటినుండియు కృష్ణపరమాత్మ నొక్కిచెప్పుచున్న కర్మయోగ ప్రాధాన్యము సిద్ధించుచున్నది. "కూడ" అను అర్థము చెప్పిన ప్రాధాన్యము

పోయి రెండవపక్షముగా సిద్ధించుచున్నది. "ఏదో- వారుకూడ తరించగలరులే" అను ఓదార్పువాక్యముగా అర్థముస్ఫురించును. కనుక కృష్ణపరమాత్మ అభిప్రాయము గమనించిన 'ఏవ' అను అర్థముననే 'అపి' ప్రయోగింపబడియుండుననని అమృతవాహిని అభిప్రాయము.

అవతారిక :—

ఇట్లు "శ్రద్ధావంతులై, అసూయలేనివారై, నా ఈ మతము అనుష్ఠించువారు ముక్తిని పొందుచున్నారు" అని వారికి కలిగెడి ఫలమును చెప్పి, తనమతమును అనుష్ఠించని వారికి కలిగెడి ప్రమాదమునుకూడ చెప్పుచున్నాడు.

శ్లో॥ యే త్వేత దభ్యసూయంతో
నానుతిష్ఠంతి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్
విద్ధి నష్టా నచేతసః ॥ 32

ప. వి :— యే, తు, ఏతత్, అభ్యసూయన్తః, న, అనుతిష్ఠన్తి, మే, మతం, సర్వ జ్ఞాన విమూఢాన్, తాన్, విద్ధి, నష్టాన్, అచేతసః —

టీక :—

యేతు = ఎవ్వరైతే,
మే = నాయొక్క,
ఏతత్ మతం = ఈ అభిప్రాయమును,
అభ్యసూయన్తః = ద్వేషించువారై,

నానుతిష్ఠన్తి = అనుసరించరో,
తాన్ = వారలను,
అచేతసః = అవివేకులుగను,
సర్వజ్ఞానవిమూఢాన్ = ఏమాత్రమును జ్ఞానములేని మూఢులుగను,
నష్టాన్ = చెడిపోయినవారలుగను,
విద్ధి = తెలిసికొనుము.

తా. కాని, ఎవరైతే నాయందు దోషారోపణము చేయుచు, నా ఈ మతము అనుష్ఠింపకుందురో, వారిని పరమమూర్ఖులుగను, బుద్ధిలేనివారుగను, అన్నివిధముల భ్రష్టులైన వారుగను తెలిసికొనుము.

అ మృ త వా హి ని :—

అర్జునా ! కొంతమంది నా ఈ మతమును అనుష్ఠించని వారున్నారు. వారికి నాయందసూయ; కనుక నేను చెప్పినది వారు ధర్మమని విశ్వసించరు. నాయందు దోషములే ఆరోపించుచుందురు- "వీడు సామాన్యమానవుడు; అయినప్పటికిని తన గొప్పకొరకును, పూజలు చేయించుకొనుటకును, తాను భగవంతుడనని చెప్పుకొనుచున్నాడు; సకలకర్మలు నాకే అర్పించుడు అని చెప్పుకొనుచున్నాడు. వీడు సకలభూతముల కును, సర్వజగత్తునకును, సృష్టిస్థితిలయములు చేయువాడట !" అని ఏమేమో దూషింతురు. వారికి నా యథార్థస్వరూపము తెలియకపోవుటచే నన్ను దూషించుచున్నారు. నన్ను దూషించు వారు నేను చెప్పినవి ఎట్లాచరించెదరు ? ఆచరించరు. వారికి విషయములయందు ప్రీతియగుటచే, నిష్కామ్యముగ కర్మల

నాచరించుమనిన ఆచరింతురా? వారికి నచ్చిన కర్మల యందు, వారికి నచ్చినరీతిగా, వారికి నచ్చినప్పుడు, రాగద్వేష ములచేత ప్రేరేపింపబడినవారై, కేవలము వారి దుష్టస్వార్థ మును పూరించుకొనుట కొరకే, కర్మలు చేయుదురు. మనము చేయు కర్మలు శాస్త్రవిహితములా? శాస్త్రనిషిద్ధములా అను విచారము వారికి ఎంతమాత్రమును అక్కరలేదు; ఇట్టి వారి బుద్ధి విపరీతముగా ఉండును. కనుక ప్రతివిషయమును విపరీత ముగనే ఆలోచించి నిర్ణయము చేయుచుండును. వారి నిర్ణయ మునే ప్రమాణముగ గ్రహించి, విపరీతప్రవర్తనులగుదురు. తత్ఫలముగ వారు ఇహలోక పరలోక సుఖములనుండి భ్రష్టు లగుచున్నారు; అధఃపతనమునే పొందుచున్నారు; అన్నివిధ ముల చెడిపోవుచున్నారు. సరిగా తెలియకపోవుటచేత, అస్త వ్యస్తముగ ఆచరించి, ఇక్కడ— అనగా ఈలోకములో— సుఖ మునకు దూరులగుచున్నారు; మరణించిన తరువాత, ఇచ్చట చేసిన దుష్టత్వమునకు శిక్షగా రౌరవాదినరకములకుపోయి, అచ్చట యమయాతనలను అనుభవించుచున్నారు; అనేక నీచ జన్మలనెత్తుచున్నారు. ఈవిధముగా రెండు లోకములలోను చెడుచున్నారు.

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతే ర్జ్ఞానవా నపి!।
ప్రకృతిం యాంతి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి? 33

ప. వి :—సదృశం, చేష్టతే, స్వస్యాః, ప్రకృతేః, జ్ఞానవాన్, అపి, ప్రకృతిం, యాంతి, భూతాని, నిగ్రహః, కిం, కరిష్యతి.

టీక :—

జ్ఞానవానపి = జ్ఞానవంతుడైనను,
స్వస్యాః = స్వకీయమైన,
ప్రకృతేః = స్వభావమునకు (సంస్కారములకు),
సదృశం = అనుగుణముగనే,
చేష్టతే = ప్రవర్తించుచున్నాడు,
భూతాని = ప్రాణులు,
ప్రకృతిం = స్వభావమును,
యాన్తి = పొందుచున్నవి,
నిగ్రహః = ఇంద్రియ నిగ్రహము,
కిం కరిష్యతి = ఏమిచేయగలదు ?

తా. జ్ఞానవంతుడైనను తన ప్రకృతి ననుసరించియే సంచరించుచున్నాడు. సకల ప్రాణులును తమ తమ ప్రకృతినే-అనగా స్వభావమునే అనుసరించుచున్నవి. నిగ్రహమేమిచేయగలదు ?

అమృతవాహిని :–

అర్జునా ! ప్రతిప్రాణియును ప్రకృతినే పొందుచున్నది - అనగా అనుసరించుచున్నది. నదులు స్వభావసిద్ధముగనే సముద్రమువైపునకు ప్రవహించుచున్నవిగదా ! ఆ ప్రవాహమును బలాత్కారముగా నిగ్రహించగలరా ? అట్లే సమస్త జీవకోటియును, తమ తమ ప్రకృతికి - స్వభావమునకు-వశపడి, ప్రకృతిప్రవాహములోపడి,—ప్రకృతివైపునకే పోవుచున్నది.





ఆ కర్మప్రవాహమును ఏ మానవుడును బలాత్కారముగ అరికట్టలేడు; అనగా కర్మలను పూర్తిగ స్వరూపముతో త్యజించలేడు. అంతమాత్రమున ఆ ప్రవాహమును మానవుడు, తన అధీనములోనికి తెచ్చుకొనలేడు అని భ్రమలో పడవద్దు. నదీజలప్రవాహమును అరికట్టలేకపోయినను, ప్రవాహమును ఆపలేకపోయినను, తన బుద్ధిబలముచే అనేక ఉపాయములువన్ని, తన అధీనములోనికి తెచ్చుకొని, కొన్ని కట్టుబాట్లతో ఆ ప్రవాహమును ఒకవైపునుండి మరొకవైపునకు త్రిప్పగలుగు చున్నాడు మానవుడు; దానిచేత, లోకోపకారము జరుగు చున్నది.

లేనియెడల ఆ ప్రవాహము హద్దుపద్దులులేక, నదీతీరము సందలి ప్రజలను, పల్లెలను, పట్టణములను, అనేక పశుపక్ష్యాదులను, అరణ్యములను, మృగములను తనపొట్టను బెట్టుకొనుచు ఊరకే సముద్రములోనికి ప్రవహించును. లోకోపద్రవకారణమైన అట్టి ప్రవాహమునే, మానవుడు తన బుద్ధిబలముచే లోకోపకారకమైనదిగా చేయుచున్నాడు.అంతియేగాని ప్రవాహమును పూర్తిగ మాత్రము అరికట్టలేడు.

ఇదేవిధమున మానవుడు తన ఉద్దేశములను మార్చుకొని, కర్మప్రవాహమును ఇంకొకవైపునకు మార్చగలడు. కర్మప్రవాహమునకు ఉద్దేశములే కాలువలు. ఆ ఉద్దేశములను కాలువలనుమంచివైపునకుత్రిప్పి-ప్రక్కలనుసాధుసాంగత్యమన్న కట్టలను బాగుగ వేసి,ఆకర్మప్రవాహమునే లోకోపకారకముగా నడుపవచ్చును. లేనిచో ప్రక్కను కట్టలులేని, ఆనకట్టలులేని,

మహానదులవలె లోకోపద్రవకారణమగును. హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, రావణకుంభకర్ణులు, జరాసంధుడు, కంసుడు, దుర్యోధనుడు- మొదలగు దుష్టుల జీవితములట్టివే. జనకుడు, అంబరీషుడు, ప్రహ్లాదుడు,విభీషణుడు, శుకమహర్షి, పాండవులు- మొదలగువారి జీవితములు చక్కని, చలించని, స్థిరమైన, కట్టలుకట్టబడి, ఆనకట్టలు నిర్మింపబడి, సస్యానుకూలముగా కాలువలుత్రవ్వి, లోకోపకారకములుగా మరల్చబడిన ప్రవాహములుగల మహానదులవంటివి.

ప్రతి మానవుడును జన్మజన్మాంతరములలో అనేకవిధములైన కర్మలుచేయుచున్నాడు. ఆ కర్మలయొక్కసంస్కారములు స్వభావరూపముగా పరిణమించి వ్యక్తమగుచున్నవి. ఆ స్వభావమునే 'ప్రకృతి' అందురు. ఈ ప్రకృతికి ఎంత బలమున్నదనగా- కేవలము పరమాత్మానుగ్రహముగల-పరమాత్మానుభవముగల-మహాత్ములైనను ప్రకృతిని అతిక్రమించలేదు. ఐతే, ప్రకృతికి వశముగాక, ప్రకృతిని తమ స్వాధీనములో ఉంచుకొని, ఆ కర్మప్రవాహమును భగవత్కైంకర్యముగా మార్చుకొనగలరు అట్టి మహాత్ములు. అట్లు మార్చుకొని దాని ఫలమైన భగవత్సాక్షాత్కారమును పొందగలరు. కాని అసలు కర్మ ప్రవాహమును మాత్రము ఆపలేరు. ఇక సామాన్య మానవుల సంగతి, పామరుల సంగతి చెప్పవలయునా ? వారి స్వభావము వారిని తన యిచ్ఛానుసారముగా ఈ ప్రకృతి ప్రవాహములో పడవేసి, ఉక్కిరిబిక్కిరిచేయును. కాని, యత్నశీలుడైన మానవుడు మాత్రము, తన స్వభావమును అరికట్టి

లేదుగాని మంచిమార్గమున నడుపగలడు. పశుపక్ష్యాదులకును మానవునకును గల భేదము- పశుపక్ష్యాదులకంటె మానవుని కున్న వైలక్షణ్యము- ఇక్కడనే ఉన్నది. అట్టి స్వాతంత్ర్యము మానవునకున్నది. ఈ తన స్వాతంత్ర్యమును వదలుకొనిన తరువాత మానవునకును, పశుపక్ష్యాదులకును భేదములేదు. ఆకారములో భేదము ఉండవచ్చును. అట్టిభేదము పరస్పరము అన్ని జాతులకును గలదు; అట్లేమానవులకును గలదు. ఆకారములో భేదముచేత ఉత్కృష్టత రాదు. బుద్ధినిబట్టియును, దానిని సద్వినియోగము చేసికొనుటను బట్టియును ఉత్కృష్టతవచ్చును.

'స్వభావమును అరికట్టలేడు; సక్రమమార్గమున నడుపవలయును' అనునది జాగ్రత్తగ అర్థము చేసికొనవలయును - ఒక ఉదాహరణము - మానవుడు నిద్రను అరికట్టలేడు. నిద్రలేనిచో శరీరము నిలువదు. ఇది అందరకును సమానమే.

ఇక స్వభావమునకు లోబడినవాని పద్ధతి -

నిద్దుర వచ్చినప్పుడు నిద్దురపోవును. దాని అంతట అది పోవువరకును ఆ నిద్రాదేవతను సగౌరవముగ ఆదరించుచుండును. దీనిచేత క్రమముగా నిద్దుర వృద్ధియగును. కనుకనే చాలమంది రాత్రి ఎనిమిదిగంటలకే పరుందురు; తెల్లవారి ఏడెనిమిదిగంటలకు లేచెదరు. మరల అవకాశము చిక్కినప్పుడెల్ల నిద్దురపోవుచునే యుందురు.

ఇక స్వభావమును స్వాధీనములో ఉంచుకొనిన జ్ఞానుల పద్ధతి -

వీరును నిద్రపోదురు; నిద్రింపక ఎవరికిని వీలులేదు. కాని, ఆ పోవు నిద్దుర మితముగా పోవుదురు; సకాలములో పోదురు; ఆ నిద్దుర వారికి లోబడియుండును; రమ్మనినవచ్చును, పొమ్మనినపోవును. ఆకలి అయినప్పుడు అన్నము పెట్టినట్లు, శరీరమునకు అవసరము వచ్చినప్పుడు నిద్దురను ఆహ్వానింతురు. సమర్థుడైన యజమానివద్ద సేవకుడు భయభక్తులతో ఎట్లు పనిచేయునో, జ్ఞానులవద్ద నిద్దురకూడ అట్లే ఉండును. నిద్ర ఉదాహరణముగ అన్ని విషయములను గ్రహింపవలయును. సామాన్యమానవులు ఏది చేసినను, అహంకార మమకార రాగద్వేషాదులకు లోబడి చేయుదురు. జ్ఞానులు అహంకార మమకార రాగద్వేషాది రహితులై, శాస్త్రవిహితమైనవానిని, లోకసంగ్రహముకొరకు చేయుదురు.

పామరులకును, పండితులకును ఇదియే భేదము.

కొంతమంది ఇచ్చట విపరీతార్థమును చెప్పుచున్నారు - జ్ఞానికిని అజ్ఞానికిని వారు చెప్పు భేదమిది - ప్రతివాడును స్వభావమునకు లోబడియే ప్రవర్తించుచున్నాడు. అంతఃకరణములో అనేకజన్మలసంస్కారములుస్వభావరూపముగ ఉండును. ఆ సంస్కారములు పుణ్యపాపరూపములైనవిగా ఉండుట చేత, స్వభావము పుణ్య పాప మిశ్రమముగనే ఉండును. అట్టి స్వభావముచేత మానవుడు మరల పుణ్య పాప రూపములైన కర్మలయందు ప్రవర్తించుచున్నాడు. శరీరమున్నంతవరకు, అంతఃకరణమున్నంతవరకు, ఇంద్రియములున్నంతవరకు, పుణ్య పాప రూపములైన కర్మలు ఎవరికిని తప్పవు. కనుక శాస్త్ర

జ్ఞానముగాని, నిగ్రహముగాని ఏమిచేయగలవు ? ఇట్లు ప్రవ
ర్తించు విషయములో పామరులును, పండితులును, అజ్ఞాని
లును, జ్ఞానులును సమానులే. కాని భేదమెక్కడ ఉన్నదనగా
అజ్ఞాని 'నేను చేయుచున్నాను' అనుకొని చేయుచుండును
జ్ఞాని 'నేనేమియును చేయుచుండుటలేదు. చేయునది నేనుకాదు;
కాబట్టి ఇవేవియును నాకంటవు' అనుకొని చేయుచుండును;
అంతియే-పాపపుణ్యములు చేయకుండనుండుటకు ఏఒక్కరికిని
సాధ్యముకాదు. దొంగతనము చేయరాదు అని శాస్త్రములో
నున్నది. మానవుడు ఆ విషయము తెలిసినను దొంగతనము
మానలేకుండ నున్నాడు. ప్రభుత్వము శాసనములద్వారా
అరికట్టుటకు ప్రయత్నించుచున్నది. 'మనము దొంగతనము
చేసిన ప్రభుత్వము కఠినముగ శిక్షించును' అని తెలిసికూడ
చేయుచున్నాడే! ప్రభుత్వముయొక్క నిగ్రహ మేమి చేయ
గలదు ? ఐతే అజ్ఞాని 'నేను దొంగతనము చేయు
చున్నాను' అని అహంకారముతో చేయును. జ్ఞాని 'నేను
దొంగతనము చేయుటలేదు. స్వభావముచేత శరీరము, ఇంద్రి
యములు చేయుచున్నవి; నాకేమియును సంబంధములేదు. ఈ
దొంగతనము నాకేమియును అంటదు' అను భావముతో
చేయును; భేదమింతియే - అని ఈవిధముగా చెప్పుచున్నారు.

కాని ఇది చాల విపరీతమైన అర్థము. దీనికిని, శుష్క
వేదాంతమునకును భేదమేమున్నది ? ఈ వేదాంతమును ఆచ
రించువానికిని, మిథ్యాచారునికిని భేదమేమున్నది? ఇదియేకనుక
శాస్త్రసమ్మతమైన వేదాంతమైనచో, శాస్త్రములలో దొంగ

తనము చేయరాదు అని ఉన్నను మానలేకుండ ఉన్నారు అని వ్రాయుటలో అర్థమేమి ? శాస్త్రకారులగు మహర్షులు దొంగతనము పనికిరాదని నిర్ణయించినట్లేగదా ! స్వభావమును మార్చుకొనలేని మానవులకు ఇటువంటి ధర్మమును బోధించిన ఋషీశ్వరులు వీరిదృష్టిలో జ్ఞానులా, అజ్ఞానులా ?

జ్ఞాని పాపముచేయుచు, 'నేను చేయుటలేదు' అని అనుకొనునా ? పాపముచేయుట ఒకతప్పు; దానిని సమర్థించుకొన ప్రయత్నించుట మరొకతప్పు. హృదయములో పాపసంస్కారములుగలవాడు జ్ఞాని ఎట్లయినాడు ? మిథ్యాచారుడు, లోకవంచకుడు అయినాడు. అదియునుగాక మానవుడు కర్మ చేయకుండ ఉండలేడు అని గీత అభిప్రాయము. ఏ కర్మ చేయదగినది ? ఏ కర్మ చేయదగనిది ? ఏది ధర్మము ? ఏది అధర్మము? అని నిర్ణంచుకొని, చేయదగిన కర్మ చేయుటకును, చేయదగని కర్మ మానుటకును, ధర్మమును స్వీకరించుటకును, అధర్మమును త్యజించుటకును, మానవునకు అధికారమును, యోగ్యతయును కలవు. ఇది గీతయొక్క ముఖ్యసిద్ధాంతములలో ఒకటి.

అంతఃకరణము పూర్తిగా పరిశుద్ధినొందినగాని పరమాత్మ సాక్షాత్కారముకాదు. పరమాత్మ సాక్షాత్కారమైనవాని అంతఃకరణములో సాంసారిక సంస్కారములేవియు ఉండవు. కనుక ఆతనిచేత అధర్మము, పాపము ఎట్లు చేయబడును ? ఆతని అంతఃకరణములోని స్వభావమంతయును పరమసాత్త్వికముగా మారిపోయి, ఆ స్వభావము ఆతని కను

సన్నల మెలగుచున్నది. మహాపతివ్రతయైన భార్య భర్తయొక్క కనుసన్నల మెలగునట్లు, భర్తయిష్టమునే నెరవేర్చుటకు సదా సిద్ధమైయుండునట్లు, ఆతని స్వభావమును, ఆతనికి వశవర్తినియై యుండును. ఆతని స్వభావము అతిపవిత్రముగా ఉండును. సర్వకాలసర్వావస్థలయందును పరమాత్మచింతనలోనే మునిగి యుండుటచే, ఆ ప్రభావముచేత అంతఃకరణములోని మల విక్షేప ఆవరణదోషములు పూర్తిగా నశించిపోయినవి. అట్లు ఈ మూడు దోషములును పోయినతరువాతనేగాని సాధకునకు పరమాత్మ సాక్షాత్కారము లభించదు. కనుక ఆతని అంతః కరణములో అవిద్యామూలకమైన అహంకారము, మమకారము, రాగము, ద్వేషము, హర్షము, శోకము, దంభము, కపటము, కామము, క్రోధము, లోభము, మోహము మొదలగు వికారములు ఎంతమాత్రమును ఉండుటకు అవకాశమేలేదు. ఇక ఈ గుణములయొక్క కార్యములైన పాప కర్మములెట్లుచేయబడును? చేయబడవు. లోకసంగ్రహము కొరకు చేయబడిన పుణ్యకర్మల విషయమునకూడ, అత్యంతమైన నిర్మలత్వము, నిర్లిప్తత, నిస్పృహ గోచరించుచుండును. ఆతని స్వభావమునుండి పరమపవిత్రత, సమత, సంతోషము, దయ, క్షమ, శాంతి మొదలగు సద్గుణములు అపారముగ వ్యక్తమగుచుండును. ఈ గుణముల కనుగుణములైన శాస్త్ర విహితకర్మలే ఆతనిద్వారా, లోకసంగ్రహముకొరకు చేయ బడుచుండును.

ఎవనిలోనైనను కామక్రోధాదులకు సంబంధించిన

దుర్గుణములు ఏమాత్రము కనుపించినను, అతనివలన వానికి సంబంధించిన కర్మలు ఏకొంచెము జరిగినను, అట్టివాడు పైకి ఎంతమహాత్ముడుగా కనుపించినను, వానికి భగవదనుభవము చిక్కలేదనియే నిర్ణయించవలయును; వాడు మహాత్ముడు కాడనియే ఎంచవలయును. శాస్త్రములలో మహాత్ముల విషయమువచ్చిన ప్రతిచోటను, వారి అంతఃకరణములలో రాగద్వేష కామక్రోధ లోభ మోహములు ఎంతమాత్రమును ఉండవనియును, ఆ గుణములకు అచ్చట ఏమాత్రమును స్థానము లేదనియును గట్టిగ చెప్పబడియున్నది.

దీనికి ఒక అపవాదమున్నది: ఎక్కడనో, ఎవరో, మిక్కిలి సమర్థులైన మహాత్ములు లోకసంగ్రహముకొరకు, లోకానుగ్రహము కొరకు, పరమాత్మయొక్క ప్రత్యేక సంకల్పమునకు వశులై, చేసినపనులవలన, అజ్ఞానదృష్టికి వారు కామక్రోధములకు పాల్పడినట్లు గోచరించుచున్నది-

పరాశరమహర్షి సత్యవతీదేవి వలన వ్యాసులకనుట, నారదభగవానులు నరకూబర మణిగ్రీవులను శపించుట-మొదలగునవి.

ఇవి కేవలము లోకానుగ్రహము, లోకసంగ్రహము, పరమాత్మయొక్క ప్రత్యేకసంకల్పము, కారణములుగా జరిగి నవేగాని, ప్రకృతిగుణముల ప్రేరేపణచేత జరిగినవికావు. ఈ మినహాయింపుకొని సామాన్యమానవులు చేసినయెడల, శివుడు లోకానుగ్రహముకొరకు హాలాహలమును భక్షించినాడుగదా,

మనమెందులకు భక్షించరాదు అని విషమును భక్షించిన ఎట్లు నశింతురో, అట్లే నశింతురు.

మానవుడు ఏకర్మ చేసినను, దానికి రాగద్వేషములు కారణములైనచో, ఆ కర్మయొక్క ఫలములైన పుణ్యపాపములు ఆతడనుభవించి తీరవలసినదే. అట్లు రాగద్వేషములు ఎంతమాత్రమును కారణములు కాకుండ నుండినచో, ఆ పనుల యొక్క పుణ్యపాపములు ఆతనికి ఏమాత్రమును అంటవు; కాని అంతర్యములో రాగద్వేషములు కలిగియుండి, పైకిమాత్రము అవిలేనట్లు ఎవడైనను సమర్థించుకొనగలిగినచో, అంతమాత్రమున ఆతనిని పుణ్యపాపములు బంధించకపోవు. అట్టివానిని మిథ్యాచారుడనియును, లోకవంచకుడనియును అనవలయును. అట్టివారు తమ పరమార్థమును తామే చేతులార పాడుచేసికొని, తమ్ము తామే అధోగతిపాలు చేసికొనినవారగుదురు. కనుక తమ హితమునే కోరుకొనువారు ఈ విషయములో జాగ్రత్తగ ఉండవలసిన అవసరము ఎంతైనను గలదు.

శ్లో॥ ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయో ర్న వశ మాగచ్ఛేత్
తౌ హ్యస్య పరిపంథినౌ ॥ 34

ప. వి :—ఇన్ద్రియస్య, ఇన్ద్రియస్య, అర్థే, రాగద్వేషౌ, వ్యవస్థితౌ, తయోః, న, వశం, ఆగచ్ఛేత్, తౌ, హి, అస్య, పరిపంథినౌ.

టీక :—

ఇన్ద్రియస్య-ఇన్ద్రియస్య = సమస్తేంద్రియములయొక్క,
అర్థే = శబ్దాది ప్రతివిషయమందును,
రాగద్వేషౌ = రాగద్వేషములు రెండును,
వ్యవస్థితౌ = ఏర్పడియున్నవి,
తయోః = ఆ రాగద్వేషములకు,
వశం = అధీనము,
న ఆగచ్ఛేత్ = కాకూడదు,
తౌ = ఆ రాగద్వేషములు,
అస్య = ఈ సాధకునకు,
పరిపంథినౌహి = శత్రువులుగదా !

తా. ప్రతి ఇంద్రియముయొక్క విషయమునందును, రాగద్వేషములు రెండును నిలచియుండును. సాధకుడు వానికి వశపడరాదు. ఎందువలన అనగా సాధకునకు ఆ రెండును శత్రువులు.

అమృతవాహిని :—

ప్రతి ఇంద్రియమునకు సంబంధించిన భోగమునందును రాగద్వేషములు దాగియున్నవి. ఇంద్రియములకును, ఆ విషయములకును సంయోగము కలిగినప్పుడు, అది తనకు ఇష్టమైనదైనయెడల రాగమును, అనిష్టమైనదైనయెడల ద్వేషమును, కలుగుచుండును.

కన్నులు రూపమును చూచునప్పుడు, అతిసూక్ష్మముగనో, ఎక్కువగనో, రాగమో, ద్వేషమో, కలుగుచుండును. అట్లే ఏదియైనను వినినప్పుడును, దేనినైనను తినినప్పుడును,

మూచూచినప్పుడును, తాకినప్పుడును, ఇష్టమైనవైనయెడల రాగము, లేనియెడల ద్వేషమును - కలుగుచుండును.

సామాన్యముగా మానవ స్వభావమెట్లుండుననగా - తనకుమారుడు మట్టిలో ఎంతపొర్లాడివచ్చినను, చీమిడిముక్కు, పుసులకన్నులు, చీడపేలు - ఇట్లు మడ్డిగా ఉన్నను, దగ్గరకు రాగానే 'మాబంగారునాయనే! రాబాబూ!' అని చంక నెత్తికొని, ఆనందమనుభవించును - దీనిపేరు రాగము. లోకుల పిల్లవాడు పండువలె నీరు పోసికొని, చక్కనిదుస్తులు వేసికొని, వచ్చికూర్చున్నను, కనుబొమలు ముడివేసికొని "ఏయ్! మీాద పడతావేం? చోటులేదూ? దూరంగా కూర్చోలేవ్వా?" అని చీదరించుకొనును - దీనిపేరు ద్వేషము. ఇట్లే ప్రతి ఇంద్రియ విషయమునను గ్రహించవలయును. సాధకుడు ఈ విషయమున చాల మెలకువగలిగి వర్తించవలయును. ఏమాత్రము కునికి పాటుతో అడుగువేసినను, రాగద్వేషములను సర్పములు కాటందుకొనును.

పరమార్థమార్గములో రాగద్వేషములు పరమ శత్రువులు. ప్రయాణము చేయువారిని, త్రోవలో బందిపోటు దొంగలు ఎట్లు ఆటంకపరచి, సర్వస్వమును దోచుకొని, అరణ్యములో ఏదో అగాధములోనికి త్రోసిపోదురో, అట్లే పరమార్థ మార్గమున పోవు సాధకులను ఈ రాగద్వేషములు మిత్రత్వముతో సమీాపించి, మనస్సు, ఇంద్రియములు, వీని యందు నెమ్మదిగ స్థానమేర్పరచుకొని, మిథ్యాసుఖములుచూపి, ఆశగొల్పి, త్రోవలు తప్పించి, సంసారారణ్యములోనికి తీసికొని

పోయి, వివేకశక్తిని నష్టపరచును. చివరకు తుచ్ఛమైన సంసార భోగములచే పురికొల్పబడి, పాపప్రవర్తనుడగును. దానితో ఆతని సాధన భ్రష్టమైపోవును. చివరకు ఆపాపముల ఫలముగా రౌరవాది నరకకూపములలో కూలవలసి వచ్చును.

అవతారిక :_

ఇంతవరకు వినిన అర్జునునకు ఒక సందేహము కలుగ వచ్చును - "మానవుడు ఏదో ఒక కర్మ చేయకుండ ఉండలేడు; సరే ! నేనును కర్మ చేయుదును; కాని, ఈ ఘోరకర్మనే ఎందుకు చేయవలయును ? సుఖముగా భిక్షాన్నముతో క్షుత్తు నివారణచేసికొనుచు, శాంతిమయమైన కర్మలయందు ప్రవర్తించినయెడల, సహజముగనే రాగద్వేషములు వదలిపోవును గదా ! మరి ఈ యుద్ధరూపమైన ఘోరకర్మను చేయుమని ఆజ్ఞాపించుట ఎందులకు ?" అని. దానికి సమాధానముగా ఈ శ్లోకము చెప్పబడుచున్నది.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥ 35

ప. వి :—శ్రేయాన్, స్వధర్మః, విగుణః, పరధర్మాత్, స్వనుష్ఠితాత్, స్వధర్మే, నిధనం, శ్రేయః, పరధర్మః, భయావహః.

టీక :—

స్వనుష్ఠితాత్ = చక్కఁగా ఆచరింపబడిన,
పరధర్మాత్ = ఇతరులకు సంబంధించిన ధర్మముకంటె,
విగుణః = గుణములేనిదైన,
స్వధర్మః = తన ధర్మము,
శ్రేయాన్ = ఉత్తమమైనది,
స్వధర్మే = తన ధర్మమునందు,
నిధనం (అపి) = మరణము (అయినను);
శ్రేయః = మేలు,
పరధర్మః = ఇతరుల ధర్మము,
భయావహః = భయంకరమైనది.

తా. చక్కఁగ అనుష్ఠించుటకు వీలైన దైనను, పరధర్మమును ఆశ్రయించరాదు. దానికంటె గుణరహితమైన దైనను, దోషయుక్తమైనను, స్వధర్మమే ఉత్తమమైనది. తన ధర్మమునందు మరణము సంభవించినను మంచిదే. కాని, పరధర్మము మాత్రము భయంకరమైనది.

అ మృ త వా హి ని :—

అర్జునా ! స్వధర్మము దోషములతో కూడుకొనినదైనను, అనుష్ఠించుటకు కష్టముగ కనుపడినను, అది ఉత్తమమైనదే. పరధర్మము హింసాదిదోషములు లేక, అనుష్ఠించుటకు సుఖముగ కనుపడినను, స్వీకరించరాదు సుమా !

యథార్థమాలోచించిన, సమస్త కర్మలును దోషయుక్తములే - "సర్వారంభాహి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః" 'సమస్తకర్మలును అగ్ని పొగచేత ఆవరింపబడినట్లు దోషములచేత ఆవరింపబడినవే' అని పదునెనిమిదవ అధ్యా

యము- నలుబది ఎనిమిదవ శ్లోకమున చెప్పబడినది. కాని, భ్రమాత్మకమైన బుద్ధికి, తన ధర్మమునందు దోషములు గోచరించును; పరధర్మమునందు గోచరించవు. అంతమాత్రమున పరధర్మమునందు దోషములు లేనట్లుకాదు. దూరపుకొండలు నునుపు. దగ్గరికొండలు ఎట్లు చెట్లతో, పుట్టలతో నిండిఉన్నవో, దూరపుకొండలును అట్లే చెట్లతో, పుట్టలతో నిండియే ఉండును; కాని, దూరమునకు అట్లు కనుపించవు. కావున ఆ దూరపు కొండలు నున్నగ ఉన్నట్లు భ్రమకలుగును. అట్లే ధర్మములుకూడ. భ్రమతో నిండిన బుద్ధికి తన ధర్మము దోషములతో నిండిఉన్నట్లును, పరధర్మము దోషరహితముగ ఉన్నట్లును గోచరించును - అంతే; కాని యథార్థమాలోచించిన అన్ని ధర్మములును దోషయుక్తములైనవే. దోషములలో భేదములు మాత్రము ఉండవచ్చును. అంతమాత్రమున స్వధర్మమును వదలరాదు. వదలిన మానవుడు పతితుడగును. ఎంత కురూపియైనను, గుణహీనుడైనను, తన భర్త సేవయే పతివ్రతకు శ్రేయస్కరమైనట్లు, మానవునకు స్వధర్మమే శ్రేయస్కరము. కురూపి అనిగాని, గుణహీనుడు అనిగాని తనభర్తను పరిత్యజించి, సుందరుడనిగాని, మంచిగుణములు గలవాడనిగాని ఇతరుని వరించిన స్త్రీవలె, స్వధర్మమును విడిచి పరధర్మము నాశ్రయించిన మానవుడు పతితుడగుట తథ్యము.

ధర్మములలో కొన్ని స్వధర్మములును, కొన్ని పరధర్మములును ఉన్నవి. తన వర్ణమునకును, ఆశ్రమమునకును, స్వభావమునకును, పరిస్థితికిని తగిన ఏయే ధర్మములు, కర్మములు,

శాస్త్రములలో నిర్ణయింపబడిఉన్నవో, ఆ యా ధర్మములు, కర్మములు ఆతనికి స్వధర్మములు. ఇతరులకు విధింపబడినవి పరధర్మములు.

కాని, కొన్ని ధర్మములు అందరకును స్వధర్మములే -

సత్యము, భూతదయ, అహింస, అస్తేయము (దొంగతనము లేకపోవుట), సంతోషము, దానము, క్షమ, పవిత్రత, వినయము, మాతాపితృసేవ, మనోబుద్ధీంద్రియములను వశమందుంచుకొనుట, బ్రహ్మచర్యము, భగవద్భక్తి, మొదలైనవి సర్వులకును స్వధర్మములే. ఇవి ఒకరికి స్వధర్మములును ఒకరికి పరధర్మములును కావు.

అసత్యము పలుకుట, దొంగతనము, వ్యభిచారము, కపటము, మోసము,హింస, పరదారాపహరణము, పరధనాపహరణము, మొదలగు నిషిద్ధకర్మలు ఎవరికిని స్వధర్మములు కావు; సర్వులును త్యజించితీరవలసినవే.

కామ్యకర్మలుకూడ ఎవరికిని అవశ్యకర్తవ్యములు కావు కనుక ఇవికూడ ఎవరికిని స్వధర్మములలోనివి కావు.

ఇక విశేషధర్మములు కొన్నికలవు. అవిమాత్రము ఒకనికి స్వధర్మమైనది ఇంకొకనికి పరధర్మమగును. ఒకనికి ఆచరించుటకు తగినది, ఇంకొకనికి ఆచరించరానిది. వర్ణాశ్రమ ధర్మములన్నియును ఈ తరగతికి చెందినవి.

స్వధర్మము విగుణమైనను - అనగా దోషయుక్తమైనను- విడువరాదు. సమస్తకర్మలును దోషయుక్తములే. కనుక

ఇదికాదని అది, అదికాదని ఇది - ఇట్లు క్షణక్షణమునకు మార్చ రాదు. అన్ని కర్మలయందును ఒకేదోషము ఉండకపోవచ్చును కొద్దియో గొప్పయో, ఏదో ఒకదోషము ఉండియేతీరును. భగవత్కైంకర్యబుద్ధితో, నిష్కామ్యముగా చేసినయెడల, సమస్తమైన కర్మలకును, ఫలము భగవదనుభవమే. దేవాలయములో భక్తిశ్రద్ధలతో పూజచేయువానికిని, అదే భక్తిశ్రద్ధలతో దేవాలయము ఊడ్చువానికిని, దేవాలయమునకు సంబంధించిన అంట్లుతోమువానికిని, ఫలమునందు ఎంతమాత్రమును హెచ్చు తగ్గులు లేవు. హెచ్చుతగ్గు లున్నయెడల, దానికి కారణము చేయువారి భక్తిశ్రద్ధలలోని తారతమ్యమేగాని, కర్మలయొక్క ఎక్కువతక్కువలుమాత్రము కాదు. గురుశుశ్రూషలో, ఒకరు తలకు నూనె మర్దనచేయుచున్నారు. ఒకరు పాదములకు నూనె మర్దనచేయుచున్నారు. గురుశుశ్రూషాఫలము ఒకరికెక్కువ, ఒకరికి తక్కువ అనవచ్చునా ? బజారులో ఎవరో తలనొప్పితో బాధపడుచుండగా ఒకడు ప్రేమతో తలకు మందుపట్టించి సేవ చేయుచున్నాడు. ఒకనికి కాలులో మేకుదిగుటచే, ఒకడు ప్రేమతో కాలుపట్టుకొని, మేకులాగి, కట్టుకట్టుచున్నాడు. ఒకనికి రణములేచి మంచముమీదనుండగా, ఒకడు చక్కగా, పరిశుభ్రముగా, భోజనము తయారుచేసిపెట్టుచున్నాడు. ఒకడు రణముయొక్క చీము, నెత్తురు కడిగి కట్టుకట్టుచున్నాడు. వీరిలో ఎవరిసేవ ఉత్తమమైనది ? అందరి సేవయును సమా

నమే. అందరకును ఫలమొక్కటే. హెచ్చుతగ్గులు చూడ రాదు. *

"స్వధర్మే నిధనం శ్రేయః -స్వధర్మమునందుమరణించుట శ్రేష్ఠము. స్వధర్మపాలనమున ఏ ఆటంకములును, విఘ్నము లును లేక జీవితపర్యంతము సక్రమముగ సాగినయెడల, సాధ కుని భావానుగుణముగా స్వర్గమో, ముక్తియో లభించును. భావము కామ్యమైన స్వర్గము, నిష్కామ్యమైన ముక్తియు లభించును. కాని, ఎన్ని ఆటంకములు, విఘ్నములు వచ్చినను, స్వధర్మమునుండి మాత్రము చలించరాదు. ఒకవేళ ఆటంక ములు, విఘ్నములు కారణముగ మరణమే సంభవించినను, దానివలన ముక్తియే ఫలము. కనుక ఆ మరణమును శ్రేయ స్కరమే. ఈ విషయమున పురాణములలోను, ఇతిహాసముల లోను, లోకచరిత్రలలోను, అనేక ఉదాహరణములు లభించు చున్నవి.

స్వధర్మములో మరణించినగాని శ్రేయస్సు లేదా అను ప్రశ్న రావచ్చును. లేదనియే చెప్పవలెను. స్వధర్మములో మరణించుట అనగా, మరణపర్యంతమును స్వధర్మమును వీడ కుండుట అని అర్థము. స్వధర్మము ప్రారంభించి జీవితముయొక్క మధ్యలో విడువబడదగినదికాదు. కనుక, "స్వధర్మములో

* ఇంకను ఈ విషయమునుగురించి పదునెనిమిదవ అధ్యాయము లోని ఎనిమిదవ శ్లోకయుయొక్క వ్యాఖ్యానమును, నాల్గవఅధ్యాయము లోని పదమూడవ శ్లోకముయొక్క వ్యాఖ్యానమును చూడవలయును.

మరణించుము" అనగా జీవితపర్యంతమును స్వధర్మమును ఆచరించుము అని భావము.

ఇంకొకవిధముగగూడ అర్థము చెప్పుకొనవచ్చును.

"స్వధర్మమును ఆచరించుటచేత మరణమునకే సిద్ధము కావలసివచ్చినను, మరణమునకైనను సిద్ధపడుము కాని, స్వధర్మమును మాత్రము విడువకుము అని.

దిలీపమహారాజు ఒక గోవును రక్షించుటకై తన శరీరమును సింహమునకు ఆహారముగా ఇచ్చుటకు సిద్ధపడినాడు. శిబిచక్రవర్తి శరణాగతరక్షణ ధర్మమును పాలించుటకు మరణమునకైనను సిద్ధపడి, డేగకై తన శరీరమును కోసియిచ్చినాడు. ప్రహ్లాదుడు భగవద్భక్తిరూపమైన స్వధర్మమును పాలించుటలో, హిరణ్యకశిపునిచేత కల్పించబడిన అనేక మారణకర్మలను ఆనందముతో అంగీకరించి, స్వీకరించినాడు.

కనుక, ఎట్టి సంకటపరిస్థితులు తటస్థించినను, మానవుడు ఆనందముతో మృత్యువునకైనను సిద్ధపడవలెనుగాని, స్వధర్మమును మాత్రము వదలరాదు. ఇట్లు ధర్మము కొరకు మరణించుటలో పరమశ్రేయస్సు కలదు.

"పరధర్మో భయావహః" -పరధర్మము భయమును కలిగించునది. ఏమిభయము ? సంసారమున పడుటయే భయము; నరకకూపమున కూలుటయే భయము. వర్ణధర్మముగాని, ఆశ్రమ ధర్మముగాని, ఒకరిధర్మము ఇంకొకరు ఆచరించరాదు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర ధర్మములు ఒకరివి మరొకరు ఆశ్రయించరాదు. అట్లే, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస

సన్న్యాసాశ్రమ ధర్మములుకూడ;ఒక ఆశ్రమమువారు, ఇంకొక ఆశ్రమ ధర్మములు స్వీకరించరాదు. దీనివలన పాపమును, ఆ పాపమువలన నరకమును ఫలములు. ఒక వర్ణమువారి ధర్మములు ఇంకొక వర్ణమువారికి శ్రేష్ఠములుగ, సులభములుగ గోచరించును. అట్లే ఒక ఆశ్రమమువారి ధర్మములు వేరొక ఆశ్రమమువారికి శ్రేష్ఠములుగ, సులభములుగ గోచరించును. "పొరుగింటి పుల్లకూర రుచి" అను సామెత కలదు కదా ! ఇది మానవులలో పాతుకొనిపోయి ఉన్న ఒక గొప్ప దౌర్బల్యము. అది పోగొట్టుకొనక ఎన్ని చేసినను ఫలము లేదు. కనుకనే గీత "స్వధర్మమును విడిచి పరధర్మమును స్వీకరింపవద్దు !" అని గట్టిగ హెచ్చరించుచున్నది.

ఇక్కడ "పరధర్మము" అనుచోట పరశబ్దమునకు "ఇతరమైన" అనియేకాని "శ్రేష్ఠమైన" అని చెప్పరాదు.

ఇంకొక విధముగాకూడ చెప్పుకొనవలయును - "స్వ" అనగా తనయొక్క అని అర్థము. తనయొక్క ధర్మమేమో తెలిసికొనుటకు ముందు తానెవరో తెలిసికొనవలయునుగదా ! 'తాను' ఎవరు ? ఈ స్థూలశరీరమా ? సూక్ష్మశరీరమా ? కారణశరీరమా ? వీటిలో ఏదియునుకాదు. స్థూలసూక్ష్మ కారణ శరీరముల కతీతుడైన 'ఆత్మ' తాను. తనకంటె వేరైనది-పరమైనది-శరీరము. కాబట్టి శరీరమునుబట్టి వచ్చిన ధర్మము పరధర్మము. ఆత్మయైన తనధర్మమే స్వధర్మమనగా. ఆత్మలు పరమాత్మకు సహజముగా దాసులు.దాసులైన అట్టిఆత్మలు "మేమే స్వతంత్రులము" అని వ్యవహరించుట పరధర్మము. తనకంటె పరుడైన పరమాత్మయొక్క ధర్మమును ఆత్మ అవలంబించుట

పరధర్మము. ఇట్లు పరధర్మము నవలంబించుట శిక్షకే కారణము; అందువలన భయమే ఫలము. అట్లుగాక, తమ యథార్థ స్వరూపము దాసత్వమే అని తెలిసికొని, దానికి అనుగుణముగా బాహ్యాభ్యంతర ధర్మములను -ఆత్మధర్మములను. శరీర ధర్మములను -తీర్చిదిద్దికొని, ప్రవర్తించుట స్వధర్మము- ఇట్లు స్వధర్మము నవలంబించుట భగవదనుగ్రహమునకే కారణము' అందువలన శ్రేయమే ఫలము; అనగా మోక్షమే - భగవదనుభవమే - ఫలము. ఈ రహస్యమును తెలిసికొని, జాగ్రత్తగా ప్రవర్తింపవలసియున్నది.

**అవతారిక :-**

మానవునకు స్వధర్మపాలనము వలననే శ్రేయస్సు కలదు. పరధర్మమును స్వీకరించుట అను పాపము వలనను, నిషిద్ధకర్మముల నాచరించుట అను పాపమువలనను, అనేక విధములైన యమయాతనల ననుభవింపవలసి వచ్చును. ఈ విషయములు తెలిసినవారుకూడ, తమకిష్టము లేకున్నను, బలవంతముగ, ఎవరో చేయించుచున్నట్లు పాపమునే చేయుచున్నారు-ఎందుచేత? ఈ విషయమును తెలిసికొనవలయునని అర్జునుడు అడుగుచున్నాడు -

**అర్జున ఉవాచ :-**

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ।
బలాదివ నియోజితః ॥ 36

ప. వి :— అథ, కేన, ప్రయుక్తః, అయం, పాపం, చరతి, పూరుషః, అనిచ్ఛన్, అపి, వార్ష్ణేయ, బలాత్, ఇవ, నియోజితః—

టీక :—

వార్ష్ణేయ = కృష్ణా!
అథ = ఇక,
అయం = ఈ,
పూరుషః = పురుషుడు,
అనిచ్ఛన్ అపి = ఇష్టము లేనివాడైనను,
బలాత్ = బలాత్కారముగ,
నియోజితః ఇవ = నియమింపబడినవానివలె,
కేన = దేనిచేత,
ప్రయుక్తః = ప్రేరేపింపబడి,
పాపం = పాపమును,
చరతి = ఆచరించుచున్నాడు ?

తా. కృష్ణా! అట్టైన మానవుడు తన కిష్టము లేకపోయినను, బలవంతముగ దేనిచేత ప్రేరేపింపబడి పాపమును చేయుచున్నాడు ?

**అమృతవాహిని :—**

అర్జునునకు ఈ సందేహము కలుగుటకు కారణము, పరమాత్మ రెండవ అధ్యాయములోని అరువదవ శ్లోకములో "వివేకియై మోక్షమునకు యత్నముచేయు మానవుని మనస్సునుకూడ, ఇంద్రియములు బలాత్కారముగ హరించుచున్నవి" అని చెప్పియున్నాడు. అనగా, ఇంద్రియములు బలాత్కారముగ పాపాచరణమునందు ప్రవర్తింపజేయు

చున్నవి అని భావము. "లోకమున పాపముయొక్క విషపరిణామము ప్రత్యక్షముగను, అనుమానముఊహావల్లను,బుద్ధిమంతుడైన మానవుడు తెలిసికొనికూడ, పాపమందుప్రవర్తించుటకు ఇష్టము లేకకూడ, పాపమునందు ప్రవర్తించుచున్నట్లు, మనకు కనుపడుచున్నది. దానికి కారణమేమి? బలాత్కారముగ మానవునిచేత పాపము చేయించునది ఏది ? పరమాత్మయే ప్రజలను పాపమునందు ప్రవర్తింపజేయుచున్నాడా ? లేక ప్రారబ్ధము బలాత్కారముగ పాపము చేయించుచున్నదా? ఇంకేమైన వేరు కారణమున్నదా ?"-ఇది అర్జునుని ప్రశ్న.

అర్జునుని కాలమునాటికే - ద్వాపరయుగములోనే - ప్రారంభమైనవి కొన్ని విపరీతసిద్ధాంతములు - ఏవి అనగా-

౧-పరమాత్మయే సర్వజీవుల హృదయముననుండి,తన మాయచేత సర్వులను, రంగులరాట్నము మీద ఎక్కినవారిని, రాట్నములో యంత్రాధిపతి ఎట్లు త్రిప్పుచున్నాడో, అట్లు త్రిప్పుచున్నాడు. కనుక, మనకేమి స్వతంత్రత కలదు ? ఎంత మాత్రమును లేదు అనునది ఒకటి. వీరికి గీతలోని "ఈశ్వర స్సర్వభూతానాం" అనుశ్లోకము ప్రమాణము.

౨- మానవునకు ఏమాత్రమును స్వాతంత్ర్యము లేదు. పాపము చేసినను, పుణ్యము చేసినను ప్రారబ్ధకర్మానుగుణముగ, అవశుడై, చేయవద్దనుకొన్నను చేయును. కనుక మానవుడు పాపము చేయుటకు. ప్రారబ్ధకర్మయే కారణము" - అనునది ఒకటి. వీరికి ప్రమాణవాక్యము "బుద్ధిః కర్మానుసారిణీ" అను సూక్తి.

3-పాపములుగాని, పుణ్యములుగాని, సర్వకర్మలును ప్రకృతియొక్క గుణములద్వారా జరుగుచున్నవి. కనుక ఆపాపపుణ్యములకును, మనకును, ఏమియును సంబంధములేదు- అనునది ఒకటి. వీరికి గీతలోని "ప్రకృతేః క్రియమాణాని - గుణైః కర్మాణి సర్వశః" అనుశ్లోకము ప్రమాణము.

ఈ సిద్ధాంతములవారి అందరి అభిప్రాయమును చివరకు ఒక్కటే- "పాపపుణ్యములు చేయుటలో మానవునకు బాధ్యత లేదు; స్వాతంత్ర్యములేదు. కనుక ప్రవర్తన దిద్దుకొనవలసిన బాధ్యత మానవునకులేదు; దిద్దుకొనలేడు-" అని.

ఆకాలమునాటికే ఈ సిద్ధాంతములు ప్రచారములో ఉండుటచేతను, కృష్ణపరమాత్మకూడ రెండవ అధ్యాయములో "యతతోహ్యపి కౌంతేయ - పురుషస్య విపశ్చితః ఇంద్రియాణి ప్రమాథీని - హరంతి ప్రసభంమనః" అని చెప్పుటచేతను, అర్జునుడు తికమకపడియుండవచ్చును. మానవుడు పాపము చేయుటకు, ప్రారబ్ధకర్మగాని, దైవముగాని, ప్రకృతిగాని కారణమై, బలవంతమున చేయించుచున్నవా ? లేక ఇంకొక కారణమున్నదా ? అని అర్జునుని ప్రశ్నలోనిభావము.

**అ వ తా రి క :-**

అర్జునుడు ప్రశ్నించిన మీాదట, కృష్ణపరమాత్మ సమాధానము చెప్పుచున్నాడు -

శ్రీభగవానువాచ :-

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష
రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ 37

ప. వి :— కామః, ఏషః, క్రోధః, ఏషః, రజోగుణసముద్భవః, మహాశనః, మహాపాప్మా, విద్ధి, ఏనం, ఇహ, వైరిణమ్.

టీక :—

రజోగుణసముద్భవః = రజోగుణమువలనపుట్టిన,
ఏషః = ఈ,
కామః = కామమే,
క్రోధః = క్రోధము;
ఏషః = ఇది,
మహాశనః = అధికముగా ఆహారము కలది,
మహాపాప్మా = మహాపాపములకు హేతువు,
ఇహ = ఈ సందర్భమున
ఏనం = దీనిని,
వైరిణం = శత్రువుగా,
విద్ధి = తెలిసికొనుము.

తా. పరమాత్మ చెప్పుచున్నాడు: పాపము చేయుటకు కారణమైనది కామము. ఈ కామమే క్రోధముగా పరిణమించుచున్నది. ఇది రజోగుణము చేత పుట్టినది. ఎంతతినినను కడుపునిండనిది, మహాపాపి. ఇచ్చట- అనగా ప్రస్తుతవిషయమైన మోక్షసంపాదన విషయములో దీనిని శత్రువుగా తెలియుము. ఇది మోక్షమార్గమునకు ప్రబలశత్రువు.

అమృతవాహిని :—

మోక్షమార్గమునందు నడచు సాధకునకు కామమే పరమశత్రువు. ఇది మానవుని బలవంతముగా పాపమునందు ప్రవర్తింపజేసి, మోక్షమార్గమునుండి పతనము కలుగజేయును. జననమరణరూపమైన, రౌరవాది నరకయాతనానుభవరూపమైన, మహాదుఃఖముపాలుచేయును. కావున సాధకుడు ఈ కామమును తనకు మహాప్రబలమైన శత్రువుగా తెలిసికొని జాగ్రత్త వహించవలయును. ఇది ఎంతబలమైనదనగా, తన కిష్టము లేకపోయినను, పాపముచేయుటచేత కలిగెడి విషపరిణామము తెలిసినను కూడ మానవుడు పాపమునందు ప్రవర్తించుచున్నాడనగా, కామమునకు ఎంత బలమున్నదో చూడుము! ఈ కామమే మానవునిచేత పాపము చేయించుచున్నదికాని, భగవంతుడుకాని, ప్రారబ్ధముకాని ప్రకృతికాని కాదు.

భగవంతుడే పాపములు చేయించుచున్నాడనువారి వాదము ఇది.

"భగవంతుడు సర్వసమర్థుడు; స్వతంత్రుడు; నిరంకుశుడు; సమస్తమును నడుపువాడు జీవుడు. అసమర్థుడు; పరతంత్రుడు; నడపబడువాడు. జీవుడు భగవంతు డెట్లు నడపిన అట్లు నడచువాడుకనుక, పాపపుణ్యములు చేయుటలో జీవునకు స్వాతంత్ర్యమెక్కడ ఉన్నది? భగవంతుడు పాపము చేయించిన పాపము చేయును; పుణ్యము చేయించిన పుణ్యము చేయును.

భగవంతుడే పాపము చేయించి, భగవంతుడే శిక్షించునా? శిక్షించడు. కనుక, పాపము చేయవద్దు, పుణ్యమే చేయుము అని చెప్పుటచేత ప్రయోజన మెంతమాత్రమును లేదు. పాపము భగవంతుడే చేయించుచున్నప్పుడు పాపము చేయవద్దు అని బోధించి ప్రయోజనమేమున్నది? లేదు-పాపము చేయకుండుటకు సామర్థ్యములేదు కనుక. పోనీ, చేయుటచేత శిక్షఉండిన అది తప్పించుకొనుట ఎట్లు అని భయము. కాని, ఆయనయే చేయించి, ఆయనయే శిక్షవిధింపడు కనుక ఆ భయమును లేదు. అందుచే పాపములు చేయవద్దు అనుట పూర్తిగ నిష్ప్రయోజనము. గీతలో పదునెనిమిదవ అధ్యాయములో, అరువది ఒకటవ శ్లోకములో "ఈశ్వర స్సర్వభూతానాం-హృద్దేశేఽర్జున తిష్ఠతి - భ్రామయన్ సర్వభూతాని - యంత్రారూఢాని మాయయా" 'భగవంతుడు సర్వభూతములయొక్క హృదయ స్థానమున నిలిచి, యంత్రము నధివసించిన మానవులను యంత్రాధిపతివలె, సర్వభూతములను మాయచేతనే నడుపుచున్నాడు' అని.

ఇట్లు భావించుట సరికాదు.

మనచేత పాపములు భగవంతుడు చేయించుటలేదు. భగవంతుడు దయాస్వరూపుడు కనుక, దుఃఖములకు కారణమైన పాపములు బలవంతముగ చేయించి, దుఃఖముల ననుభవింపజేయునా? అదియునుగాక, భగవంతుని ప్రధాన ఆశయములలో, ప్రధానకార్యక్రమములలో 'ధర్మసంస్థాపనము' ఒకటి.

అవతరించుచవదికూడ ధర్మసంస్థాపనకే. అట్టి భగవంతుడు అధర్మము చేయించుననుట ఎంత హాస్యాస్పదము! ఎంత అసందర్భము! ఇంక ఆయన గీతలోనే పలుచోట్ల "సర్వ భూతములకును, తండ్రిని, తల్లిని, సుహృత్తును, గతిని, ప్రభువును, పోషించువాడను, రక్షకుడను" అనిచెప్పుకొనియున్నాడు. కనుక అట్టి బాధ్యతగల భగవంతుడు పాపము చేయించుచున్నాడనుట తగదు. *

ప్రారబ్ధకర్మయే పాపములు చేయుటకు కారణము అనువారి వాదమిది - మానవుడు ప్రారబ్ధకర్మకు అధీనుడు. "బుద్ధిః కర్మానుసారిణీ" అనునట్లు ప్రారబ్ధకర్మ ఎట్లునడిపించిన అట్లు నడచుచున్నాడు. పాపము చేయకుండుటకును, పుణ్యము చేయుటకును, ఆతనికి స్వాతంత్ర్య మెక్కడిది? అని-

ఇట్లు భావించుటయు సరికాదు - ప్రారబ్ధకర్మ- అనునది పూర్వజన్మల కర్మల ఫలముగ ఈ జన్మలో అనుభవింపవలసిన దానికిపేరు. క్రొత్తగ ఈజన్మలో కర్మలు చేయుటకును, దీనికిని సంబంధములేదు. "బుద్ధిః కర్మానుసారిణీ" అనుదానిలోని "కర్మ" అను పదమునకు ప్రారబ్ధకర్మ అనికాదు అర్థము; ఈ జన్మలో చేయు 'ఆగామి' అను కర్మ అని అర్థము. తల్లి, తండ్రి, గురువు మొదలగు పెద్దలు బాలురచేత చిన్నతనమునుండి, పాతిక సంవత్సరములు వచ్చువరకు ఏయే రూపములైనకర్మలు

* ఈ విషయ మింకను "ఈశ్వర స్సర్వభూతానాం" అను శ్లోకవ్యాఖ్యానములో చూడుడు.

చేయించుచుందురో, ఆయాకర్మల వలన కలిగిన సంస్కారముల ననుసరించియే వారి బుద్ధి నడచుచుండును. అందుచేత ఏర్పడినది "బుద్ధిః కర్మానుసారిణీ" అనుసూక్తి. పాపపుణ్యములు చేయుటకు దైవముగాని, ప్రారబ్ధముగాని, ప్రకృతిగాని కారణమై, మానవునకు స్వాతంత్ర్యమే లేనిచో, వేదము "ధర్మం చర !" అని మానవుని శాసించుటకే వీలులేదు. కాని వేదము అట్లు శాసించినదిగదా ! అందుచేత పాపపుణ్యములు చేయుటలో మానవునిదే బాధ్యత. దీనిలో సందేహమునకు తావేలేదు. ఈ విధముగ, ఈ కారణములచేతనే మూడవ వాదము - పాపపుణ్యాచరణమునకు ప్రకృతి హేతువు అను వాదము - కూడా ఖండింపబడుచున్నది. *

అవతారిక :-

కామ మెట్లు మానవుని పాపమందు ప్రవర్తింపచేయుచున్నదో, మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు -

శ్లో॥ ధూమే నావ్రియతే వహ్ని
ర్యథాఽఽదర్శో మలేన చ ।
యథోల్బే నావృతో గర్భ
స్తథా తే నేద మావృతమ్ ॥ 38

---

* ఈ విషయము పదమూడవ అధ్యాయమున "కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" అను శ్లోకవ్యాఖ్యానమున ఇంకను వివరముగ చర్చింపబడును.

ప. వి :— ధూమేన, ఆవ్రియతే, వహ్నిః, యథా, ఆదర్శం, మలేన, చ, యథా, ఉల్బేన, ఆవృతః, గర్భః, తథా, తేన, ఇదం, ఆవృతమ్.

టీక :—

యథా = ఏవిధముగ,
ధూమేన = పొగచేత,
వహ్నిఃచ = అగ్నియును,
మలేన = మాలిన్యముచేత,
ఆదర్శః చ = అద్దమును,
ఆవ్రియతే = కప్పబడుచున్నవో,
యథా = ఏవిధముగ,
ఉల్బేన = మాయచేత,
గర్భః = గర్భస్థమగు శిశువు,
ఆవృతః = కప్పబడునో,
తథా = ఆ విధముగ,
తేన = ఆ కామముచేత,
ఇదం = ఈ ప్రాణిసముదాయము,
ఆవృతం = కప్పబడి ఉన్నది.

తా. పొగచేత అగ్నియును, మలినముచేత అద్దమును, మావిచేత గర్భమును అవరింపబడినట్లు, ఈ కామముచేత ఈ ప్రాణిసముదాయము అవరింపబడియున్నది.

అ మృ త వా హి ని :.

కామము ఎట్లు మానవుని ఆవరించి, పాపమునందు ప్రవర్తింపజేయుచున్నదో, మూడుఉదాహరణములుచూపించి,

బోధచేయుచున్నాడు. కామముకూడా మూడుదోషములుగా పరిణమించి, మానవుని పాపములోనికి లాగుచున్నది - విక్షేప దోషము, మలదోషము, ఆవరణదోషము -

(౧) విక్షేపదోషమున కుదాహరణముగా పొగను చెప్పియున్నాడు. పొగ చంచలముగ అగ్నిని కప్పుచున్నది. అట్లే విక్షేపదోషముచేత మానవుని అంతఃకరణములో చంచలత్వము కలుగును. అందుచేత యథార్థము తెలిసికొనలేదు. అప్పుడప్పుడు కొంత తెలిసినను, దానిని స్థిరముగా నిలువనీయదు విక్షేపదోషము.

(౨) మలదోషమునకు అద్దమునందలి మాలిన్యము ఉదాహరణగ ఇచ్చియున్నాడు. మాలిన్యముచే అద్దము అపరిశుద్ధమైనట్లు, మలదోషముచే అంతఃకరణము అత్యంత మలినత చెందుచున్నది. దానివలన మురికిగల అద్దమునందు ప్రతిబింబము సరిగా గోచరించనట్లు మలినయుక్తమైన అంతఃకరణమునకు కర్తవ్యాకర్తవ్యములు గోచరించవు. అందువలన మానవుడు కర్తవ్య అకర్తవ్యములయొక్క స్వరూపమునుగూర్చి యథార్థవివేచనము చేయలేడు. దీనికి కారణము మలదోషము.

(3) ఆవరణదోషమునకు 'మావి'ని ఉదాహరణముగ చెప్పియున్నాడు. మావిచేత గర్భస్థ శిశువు ఎట్లు ఆచ్ఛాదింపబడియుండునో, అట్లే మానవుని అంతఃకరణము ఆవరణదోషముచేత కప్పబడియుండును. ఈ దోషమువలన మానవుడు, నిద్ర, ఆలస్యము, మొదలగువాటియందు చిక్కుకొని, అవిద్యే

సుఖదాయకములనెడి భ్రాంతిలోపడి, యథార్థమైన విచారణకు కించిన్మాత్రముకూడ ప్రవృత్తుడేకాడు. ఇది ఆవరణదోషము యొక్క లక్షణము.

ఈ మూడుదోషములును కామముయొక్క పరిణామములే. కామమే విక్షేపరూపదోషముచే, అంతఃకరణములో అనేక విషయభోగములందు తృష్ణను పెంచి, చంచలతను కలుగజేయును. కామమే మలరూపదోషముచే మానవునిచేత అనేక విధములైన పాపములను చేయించి, పాపములకు కారణమైన ఈ మలదోషమునే అంతఃకరణములో ఇంకను వృద్ధిపరచుచున్నది. కామమే ఆవరణరూప దోషముచే, మానవునకు నిద్ర, ఆలస్యము, ఏమియు పనిచేయక ఊరకకూర్చుండుట (అకర్మణత్వము), మొదలగువాటియందే సుఖమున్నట్లు అంతఃకరణములో భ్రాంతికలిగించి, వివేకశూన్యునిగ చేయును. ఈ విధముగ కామము జీవసముదాయమును ఈ మూడు దోషములచే కప్పియున్నది.

"తేనేదమావృతం" అనునచోట 'ఇదం' అనగా జ్ఞానమని కొందరు అర్థము వ్రాసినారు. ఆ అర్థము చెప్పుకొనినను గీతా ప్రబోధమునకు పెద్దప్రతిబంధకము కాదుకాని, అమృతవాహిని అభిప్రాయములో "ఈ ప్రాణిసముదాయము" అనుటయే సమంజసము. కారణమేమనగా - "ఇదం" అనునది సర్వనామము. ముందు ఒకపరి ఒకనామమును ప్రయోగించినప్పుడు, అతిసన్నిహితముగ మరల దానినే చెప్పవలసివచ్చినప్పుడు, దానికి బదులు సర్వనామమును ప్రయోగించుట భాషా సంప్ర

దాయము. "ఇదం" జ్ఞానమునకు సర్వనామముగా చెప్పుటకు ముందుశ్లోకములో జ్ఞానమును గురించి లేదు. అర్జునుని ప్రశ్న-మానవుడు దేనిచేత ప్రేరేపింపబడి పాపములు చేయుచున్నాడు అని. దానికి సమాధానముగా, కామమే మానవుడు పాపములు చేయుటకు కారణమని చెప్పబోవుచు, "కామము అగ్నిని పొగవలె, అద్దమును మాలిన్యమువలె, గర్భమును మావివలె, ఆవరించియుండుటచే, పాపములు చేయుట సంభవించుచున్నది" అని చెప్పినాడు. దేనిని ఆవరించియున్నది అని ప్రశ్న వేసిన యెడల, ఆవరింపబడి ఎవరు పాపము చేయుచున్నారో, వారినే దృష్టిలో ఉంచుకొని "ఇదం" అని చూపించినాడు. కనుక మానవసముదాయము అని అర్థము చెప్పవలయును. మానవ సముదాయము అనిన ఏకదేశమే అగుటచే, ఇతర ప్రాణులను ఈ కామము ఆవరించి యుండదేమో అను సందేహము కలుగవచ్చును. 'ప్రాణిసముదాయము' అనినచో, అందులో మానవులుకూడ వచ్చెదరు; కనుక 'ఇదం' అనగా ప్రాణిసము దాయము అని అర్థము చెప్పుటయే సమంజసము. ప్రాణిసము దాయమును కప్పియున్నది అనినప్పుడు, వాటియొక్క జ్ఞానము కప్పబడియున్నది అను అర్థమే ధ్వనించగలదు. కాని 'జ్ఞానము' అను శబ్దము తరువాతి శ్లోకములో చెప్పబడియున్నది. తరువాత వచ్చు నామవాచకము కొరకు ముందే సర్వనామమును ప్రయోగించుట భాషాసంప్రదాయము కాదు. అందుచేత ఇక్కడ అమృతవాహిని "ప్రాణిసముదాయము" అనియే వ్యాఖ్యానించుచున్నది.

శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన
జ్ఞానినో నిత్యవై రిణా ।
కామరూపేణ కౌంతేయ !
దుష్పూరే ణానలేనచ ॥ 39

ప. వి :—ఆవృతం, జ్ఞానం, ఏతేన, జ్ఞానినః, నిత్యవైరిణా, కామరూపేణ, కౌంతేయ, దుష్పూరేణ, అనలేన, చ.

టీక :—

కౌంతేయ = అర్జునా !
జ్ఞానినః = జ్ఞానులకు,
నిత్యవైరిణా = నిత్యవైరియును,
దుష్పూరేణ = తృప్తిపరచుటకుశక్యముకానిదియు(అగు)
ఏతేన = ఈ,
కామరూపేణ = కామరూపమగు,
అనలేన = అగ్నిచేత,
జ్ఞానం = జ్ఞానము,
ఆవృతం = కప్పబడినది.

తా. ఓ అర్జునా ! జ్ఞానులకెల్లప్పుడును వైరియైనదియును, తృప్తి పరచుటకు శక్యము కానిదియును అగు ఈ కామరూపమగు అగ్నిచేత జ్ఞానము ఆవరింపబడియున్నది.

అ మృ త వా హి ని :-

మానవునికి మోక్షము సంపాదించుట ఒక్కటే కర్తవ్యము. దానికి జ్ఞానము అత్యంతావశ్యకము. కాని జ్ఞానులకు

కామము నిత్యవైరి. అనగా కామము ఎల్లప్పుడును జ్ఞానము నకు విఘ్నము నే లుగజేయును. జ్ఞానమును మనకు ప్రయో జనకారికాకుండ చేయు నిత్యశత్రువు కామము. కామము దుష్పూరము. అనగా పూరించుటకు వీలులేనిది. ఎంతకును తృప్తిపడనిది.

యయాతి వేలసంవత్సరములు జీవించి కామోప భోగములు అనుభవించినాడు. ఇంకను తృప్తికలుగలేదు. కాని శరీరమునకు వృద్ధావస్థ వచ్చినది. కామమును అనుభవించు టకు శక్తిచాలదు. వాంఛ అపరిమితముగా ఉన్నది. కుమారు లను పిలిచి అడిగినాడు- "నా వృద్ధాప్యమును మీరు తీసికొని మీ యౌవనము నాకీయవలయును" అని. కొందరు తిరస్క రించినారు. యయాతి వారిని శపించినాడు. ఒక కుమారుడు తండ్రికి తన యౌవనము ఇచ్చి ఆతని వృద్ధాప్యమును తాను స్వీకరించినాడు. యయాతి కుమారుని యౌవనము గ్రహించి మరల కొన్ని వేల సంవత్సరములు కామమును అనుభవించి నాడు. అప్పటికిని ఆ వాంఛ ఏమియును తగ్గలేదు. కామము యొక్క స్వభావమే అంత. కనుకనే దానిని దుష్పూరము - తృప్తిపరచుటకు సాధ్యము కానిది - అనుట. ఎప్పటికైనను వైరాగ్యముచేత కామమును జయించవలయునేకాని, అనుభ వించి, తృప్తిపరచి, కామమునుండి నివృత్తిఅగుట జరుగనిది; అగ్నిజ్వాలలను ఆజ్యముపోసి చల్లార్చవచ్చునా? ఆ పని నీటికే సాధ్యము. అట్లే కామము వైరాగ్యముచే జయింప బడవలసినదే. కనుకనే కామమును అగ్నితో పోల్చినారు. కామమను అగ్నిచేత జ్ఞానము ఆవరింపబడి ఉన్నది.

అగ్నికి అనేక నామములు కలవు. అందు ఇచ్చట "అనలం" అను నామము ప్రయోగింపబడినది. అలం అనగా చాలును అని అర్థము. ఎంతకును చాలును అనుట లేనిది అనలము; ఎంత అనుభవించినను తృప్తికలుగనిది. కనుకనే కామమును అనలము అనినారు; దుష్పూరము అనికూడ అనినారు. ఈ రెండు విశేషణములతో, కామము పరమార్థ సాధకులకు వైరి అనియును, ఎంత అనుభవించినను ఇక చాలును అని తృప్తిపొందనిది అనియును బాగుగ వ్యక్తము చేయబడినది.

"జ్ఞానినః" అనగా జ్ఞానికి అని అర్థము. జ్ఞానికి కామము నిత్యవైరి. జ్ఞానికికూడ కామము ప్రతిబంధకము కాగలదా అని ప్రశ్న. కాకపోయిన గీతలో అట్లేందుకు ఉండును అని పై ప్రశ్న. ఎంతటి జ్ఞానికైనను కామము నిత్యశత్రువే. జ్ఞానము పరిపూర్ణత చెందినవానిని కామము బాధింపలేక పోవచ్చునేగాని శత్రుత్వ మెచ్చటికి పోవును ? జ్ఞానము పరిపూర్ణత చెంది, పరమార్థానుభవము చిక్కువరకు మాత్రము ఈ కామము ఏ క్షణముననైన గోతిలో త్రోయవచ్చును. ఈ సందర్భమున మహర్షి విశ్వామిత్రుని, మహాయోగి సౌభరిని ఉదాహరణగ తీసికొన వచ్చును. అందుచేత కామమునకు "జ్ఞానులకు నిత్యవైరి" అని బిరుదమిచ్చినాడు పరమాత్మ.

తాను ప్రకృతిబంధనమున నున్నాననియు, భగవదనుభవమే మోక్షమనియు, అట్టి మోక్షమే తన గమ్యమనియు సిద్ధాంతరూపముగ తెలిసికొని, సాధన ప్రారంభించిననాటి నుండి "జ్ఞాని" అని గౌణముగ పేర్కొనబడును. పరిపూర్ణ పర

మార్థానుభవము లభించువరకును ఈ జ్ఞానిశబ్దము గౌణమే. ఇట్టి జ్ఞానుల జ్ఞానము కామము అను అగ్నిచేత ఆవరింపబడు ప్రమాదము నిత్యసన్నిహితముగ ఉన్నది. పరిపూర్ణ పరమార్థానుభవము పొందిన జ్ఞానులను బాధించలేకపోయినను వారికి సైతము నిత్యశత్రువైన కామముచేత, తక్కినవారి జ్ఞానము ఆవరింపబడి, దీపప్రకాశము ఘటముచేత ఆవరింపబడినప్పుడు ప్రకాశమునకు వ్యతిరేకముగు అంధకారము వ్యాపించిన విధముగ అజ్ఞానము ఆవరించి, పాపముచేయుటకు హేతువగుచున్నదని చెప్పి, సర్వపాపములకును మూలకారణము కామము అని చెప్పుచున్నాడు పరమాత్మ.

శ్లో॥ ఇంద్రియాణి మనో బుద్ధి
రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయ త్యేష
జ్ఞాన మావృత్య దేహినమ్ ॥ ౪౦

ప. వి:— ఇంద్రియాణి, మనః, బుద్ధిః, అస్య, అధిష్ఠానం, ఉచ్యతే, ఏతైః, విమోహయతి, ఏషః, జ్ఞానం, ఆవృత్య, దేహినమ్-

టీక :—

అస్య = ఈ కామమునకు,
ఇంద్రియాణి = ఇంద్రియములును,
మనః = మనస్సును,
బుద్ధిః = బుద్ధియును,
అధిష్ఠానం = ఆశ్రయముగా,
ఉచ్యతే = చెప్పబడుచున్నది,

ఏతైః = వానిచేత,
జ్ఞానం = జ్ఞానమును,
ఆవృత్య = మరుగుపరచి,
ఏషః = ఈ కామము,
దేహినం = ఆత్మను,
విమోహయతి = వ్యామోహపెట్టుచున్నది.

తా. ఈ కామమునకు ఇంద్రియములును, మనస్సును, బుద్ధియును, ఆశ్రయములై యున్నవి. తన కాశ్రయములైన వీనివలన జ్ఞానమును మరుగు పరచి ఈ కామము ఆత్మను వ్యామోహముపాలు చేయుచున్నది.

అమృతవాహిని :-

కామమునకు ఆశ్రయస్థానములు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అని చెప్పబడినది. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి-ఇవి ఆత్మకు పరికరములుగ పరమాత్మచేత ప్రసాదింపబడి నవి. ఇంటిలో దొంగ ప్రవేశించినట్లు, శరీరమున వ్యాధిప్రవేశించి నట్లు వీటియందు కామముప్రవేశించి, దాగియుండి, అవకాశము ననుసరించి విజృంభించి, వీటి వివేకమును నశింపజేసి, సర్వానర్థములకును హేతువగుచున్నది. కామము ముందుగ ఇంద్రియములను ప్రేరేపించును. బలహీనమగు మనస్సు ఇంద్రియవశంవదమై వాని ననుసరించును; ఈచర్య ధర్మ విరుద్ధమేమో అని అంతరాంతరములలో సంశయము ఉత్పన్న మైనప్పుడు ఏవేవో హేతువులు కల్పించి, అసందర్భసమన్వయ రీతులు కొనసాగించి, ఆ చేష్టలను సమర్థించుటద్వారా బుద్ధి ఆత్మవంచన చేయును. ఈవిధముగ కామముయొక్క ముఖ్యా ధారములు ఇంద్రియములు, మనస్సు బుద్ధి అగుచున్నవి.

ఇట్లు చెప్పుటద్వారా ఈ కామముబారిని పడకుండుటకు కామమునకు ఆశ్రయస్థానములగు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి-వీని విషయమున శ్రద్ధ వహించవలసినదిగా హెచ్చరించుచున్నాడు పరమాత్మ. అశ్వములవంటి ఇంద్రియములను అదుపులో పెట్టుటకు, పగ్గమువంటి మనస్సు పటిష్ఠమైనదిగ ఉండవలెను. అట్టి మనస్సుద్వారా ఇంద్రియములను సక్రమముగ నడుపవలసిన సారథివంటి బుద్ధిని పరమసాత్త్వికముగ మలచుకొనవలసిన బాధ్యత సాధకునిపై గలదు-అట్లు జాగ్రత్త వహించిననాడు తనకు ముఖ్యాధారములయిన ఇంద్రియములు, మనస్సు, బుద్ధి-వీనిలో తావులేక, కామము నిర్వీర్యమై, సాధకుని ఏమియు చేయులేనిస్థితి ప్రాప్తించును. ఇంతకును కీలకస్థానమగు సారథిస్థానమున స్వబుద్ధిని తొలగించి, ఆ స్థానమున పరమాత్మను నెలకొల్పుకొనినవారికి ఇక తక్కిన బాధ లేనే లేదు. అట్లు చేయనంతకాలము, ఎంత సాత్త్వికమైనను ప్రాకృతమే గనుక స్వబుద్ధి ఏదోఒక సమయమున ఏమరుపాటుచెంది కామమునకు తావుకల్పించు ప్రమాదము ఉండనేయున్నది. అందుచేతనే పరమాత్మ సాధకులను ఈరీతిగా హెచ్చరించుచున్నాడు.

శ్లో॥ తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ
నియమ్య భరతర్షభ !
పాప్మానం ప్రజహి హ్యేనం
జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ॥ ౪౧

ప వి :—తస్మాత్, త్వం, ఇంద్రియాణి, ఆదౌ నియమ్య, భరతర్షభ, పాప్మానం, ప్రజహి, హి, ఏనం, జ్ఞాన విజ్ఞాన నాశనమ్.

టీక :—

భరతర్షభ != భరతవంశమునందు శ్రేష్ఠుడైన ఓ అర్జునా!
తస్మాత్ = అందుచేత,
త్వం = నీవు,
ఆదౌ = ముందుగ,
ఇంద్రియాణి = ఇంద్రియములను,
నియమ్య = నియమించి,
జ్ఞాన విజ్ఞాన నాశనం = జ్ఞానమును, విజ్ఞానమునుగూడ నశింపజేయునట్టియు,
పాప్మానం = పాపమే స్వరూపముగ గలట్టియు,
ఏనం = ఈ కామమును,
హి = తప్పక,
ప్రజహి = విడువుము.

తా. అందుచేత ఓఅర్జునా! నీవు ముందుగ ఇంద్రియములను నియమించి, సామాన్యజ్ఞానమును, విజ్ఞానమునుగూడ నశింపజేయగలదియును, పాపమే స్వరూపముగ గలదియును అగు ఈ కామమును తప్పక విడిచిపెట్టుము.

**అ మృ త వా హి ని :—**

ఓ అర్జునా! పైన వివరింపబడిన కారణములచేత నీవు ముందుగ ఈ కామమును జయింపవలసియున్నది. కామమును జయించుటకు ఇంద్రియములను నియమించవలయును. నియమించుట ఎట్లు? ఏపనియు లేక ఊరకుండుట వాటి స్వభావమునకు విరుద్ధమును, అసంభవమునుగదా! ఏనుగు తన తొండమును నిశ్చలముగ ఉంచలేదు-ఎల్లప్పుడును కదలించుచు, ఏదో ఒకటి పట్టుకొనుటో, విసరుటో, విరచుటో చేయుచుండవలసి

నదే. త్రోవలో పోవుచు ఏమియు దొరకకపోయినచో ప్రక్కనపోవువానినైన వేధించనే వలయును. అందుచేత మావటీంద్రుడు ఒక ఉపాయము చేయుదురు - ఒక కొయ్య బండయో, రాయియో దాని తుండమున కందించి, అది మోచి తెచ్చుట దాని పనిగా నిర్దేశింతురు. అది తుండమును ఆ పనియందే ఉంచును; ఇతరులకు దానివలన బాధఉండదు. అట్లే ఈ ఇంద్రియములును ఏదో పనిలేక ఉండవుకనుక, ఊరకే విడిచిపెట్టిన ఈ కామమునకు లోబడి, కొంపమీదకు తెచ్చి పెట్టును. కావున ముందుగ ఈ ఇంద్రియములను నియమించ వలయును. సర్వేంద్రియములకును ఏదో ఒక పరమార్థ కార్య క్రమమును అప్పగించవలయును. ప్రథమదశలో విసుగు తోచ వచ్చును; అందుచే అట్టి కార్యక్రమములలోనే వైవిధ్యమును కల్పించుకొని, మొత్తముమీద వేరొకవైపు పోవుటకు వీలు లేకుండ, ఏదో ఒక పరమార్థ కార్యక్రమమును కల్పించవల యును. నవవిధభక్తులు మొదలగునవి ఇట్టివే. ఇంద్రియములు ఈ విధముగ నియమింపబడినచో కామమునకు తావుండదు.

"ఆదౌ" అనుచున్నాడు పరమాత్మ. ఏవేవో చేసిన తరువాత సావకాశముగ చూచుకొనుటకు వీలైనది కాదీ ఇంద్రియ నియమనము. అది చేయనిది ఇంకేమి చేయుటకును కూడ అవకాశము ఉండదు. ఇచ్చట ముందుగ అనుటచే అన్నిటికంటె ముందుగ అనియును, అన్నిటికంటె ప్రధానముగ అనియును కూడ చెప్పవచ్చును.

కామమునకు "జ్ఞాన విజ్ఞాననాశనం" అను విశేషణము

చేర్చినాడు. జ్ఞానము అనగా ఇచ్చట సామాన్య జ్ఞానము - దేహము తాను కానని యు, తాను దేహాతిరిక్తుడైన ఆత్మ అని యును - ఈ విధముగ స్థూలముగ తెలిసినను ఇది జ్ఞానము అని చెప్పవచ్చును. విజ్ఞానము అనగా ఆత్మస్వరూపమును గూర్చిన వివేకము. అట్టి సూక్ష్మజ్ఞానమును విజ్ఞానము అందురు. కామము స్థూలమైన సామాన్యజ్ఞానమును నశింపజేయుటేగాక. సూక్ష్మమైన విజ్ఞానమును కూడ నశింపజేయగలదు.

ఇక్కడ ఒక ప్రశ్న రావచ్చును-జ్ఞానమునకు నాశనము కలదా అని. జ్ఞానము నిత్యమైనదే; నాశనము లేనిదే; కాని, ఈ కామము జ్ఞానమును మరుగుపరచును. మరుగుపడి నిరుప యోగమైనప్పుడు ఉండియును లేనట్లేకదా! దీపము వెలుగుచునే ఉన్నది; పైన కుండ బోర్లింపబడినది. ఇక ఆ లోని దీపము వలన ప్రయోజనమేమి? కనుక జ్ఞానమువలన ప్రయోజనమును నశింపజేయు కామమును,జ్ఞానమునే నశింపజేయునదిగా చిత్రించి నాడు పరమాత్మ. కామము అంత ప్రబలమైనది.

అందుచేతనే "పాప్మానం" అనినాడు-పాపమే స్వరూపముగా గలది. కామమునకు వశుడైనవాడు చేయలేని, చేయని మహాపాపము లేదు. అందుచేత ఈ కామమును విడిచి తీరవల యును. ఆ విడుచుటకు ఇంద్రియములను నియమించుట - పరమార్థ కార్యక్రమములయందు నియోగించుట - నిష్కామ కర్మయోగమును ఆచరించుట - కంటె గత్యంతరము లేదు. ఈ విషయము - ప్రథమముగ, ప్రధానముగ సాధింపవలసినదని శ్రీకృష్ణపరమాత్మ తీవ్రముగ హెచ్చరించుచున్నాడు.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః
ఇంద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిః
యో బుద్ధేః పరతస్తు సః॥ 42

ప. వి :— ఇంద్రియాణి, పరాణి, ఆహుః, ఇంద్రియేభ్యః, పరం, మనః, మనసః, తు, పరా, బుద్ధిః యః, బుద్ధేః, పరతః, తు, సః.

టీక :—

ఇంద్రియాణి = ఇంద్రియయలు,
పరాణి = ప్రధానమైనవిగా,
ఆహుః = చెప్పుచున్నవి,
ఇంద్రియేభ్యః = ఇంద్రియములకంటె,
మనః = మనస్సు,
పరం = ప్రధానమైనది,
మనసః తు = మనస్సుకంటెను,
బుద్ధిః = బుధి,
పరా = ప్రధానతరము,
బుద్ధేః = బుద్ధికంటె,
యః = ఏది,
పరతః తు = ప్రధానమైనదో,
సః = అది - కామము.

తా. జ్ఞానప్రతిబంధకములైనవానిలో శరీరముకంటె, ఇంద్రియములు ప్రధానమైనవి. ఇంద్రియములకంటె మనస్సు ప్రధానమైనది. మనస్సుకంటె బుద్ధి ప్రధానమైనది. ఇక ఆ బుద్ధికంటెకూడ ప్రధానమైనది ఒక్క కామమేసుమా!

**అమృతవాహిని :-**

ఓ అర్జునా! జ్ఞానమునకు ప్రతిబంధకములైనవాటిలో శరీరముకంటె ఇంద్రియములు ప్రధానమైనవి; ఇంద్రియముల కంటెను మనస్సు ప్రధానమైనది; మనస్సుకంటె బుద్ధి ప్రధానమైనది. బుద్ధికంటెకూడ ప్రధానమైనది కామమునుమా! కనుక ఆ కామము విషయమున జాగ్రత్తతో కనుగలిగి మెలగవలసి యున్నది. ఏమరుపాటులేక ఆ కామమును నశింపజేయుము! అని హెచ్చరించుచున్నాడు పరమాత్మ.

ఈ శ్లోకమున ప్రతిబంధక సామాగ్రిలో ప్రాధాన్యము వివరింపబడినది. సాధకుడు విరోధిస్వరూపమును చక్కగ అవగతము చేసికొననిదే ఉపాయస్వరూపము స్పష్టపడదు. జ్ఞాన ప్రతిబంధకములైనవానిలో శరీరము మొదటిది; అనుభవములో ఉన్నది. కాని, శరీరముకంటె ఇంద్రియములు బలవంతములగుటచే ప్రధానములు. శరీరము రథముగ పోల్చబడినప్పుడు, ఇంద్రియములు అశ్వములుగదా! ఆ అశ్వములు లాగిన వెంబడి పోవు రథముకంటెఅశ్వములు ప్రధానములు కాకుండు టెట్లు? ఆ అశ్వములను నియమించు కళ్ళెము మనస్సు. అందు చేత ఇంద్రియములకంటె మనస్సు ప్రధానమైనది.ఆకళ్ళెమును స్వాధీనమందుంచుకొను సారథిస్థానము బుద్ధిది. అందుచే మనస్సుకంటె బుద్ధి ప్రధానమైనది. ఈ అన్నింటిని మించిన ఆయత్ర దేవత కామము. అదే అన్ని అనర్థములకును మూలము. అందుచేత ఆ కామమును నశింపచేసికొనవలయును.

ఇచ్చట ఒక విషయము గమనింపవలయును. ప్రతి

బంధక సామగ్రిలో బలవత్తమము - పరమప్రధానమైనది కామము. దానిని నశింపచేయుటకు సాధన ఇంద్రియములను వశముచేసికొనుటతో మొదలుపెట్టవలయును. సారథికి బుద్ధులు గరపునంతలో గుఱ్ఱములు రథములు గోతిలో త్రోయగలవు. ఏవిధముననైన ముందు గుఱ్ఱముల నదుపులోనికి తెచ్చుకొనిన తరువాత, సావకాశముగ సారథికి బుద్ధులు గరపవచ్చును. కళ్ళెమును పటిష్ఠము చేసికొనవచ్చును. ముందుగ చేయవలసి నది-చేతిప్రక్కనున్న త్రాళ్ళు గుఱ్ఱముల ముట్టెలకు ఊచ్చులు పడునట్లు విసరి, వాటిని అదుపులోనికి తెచ్చుకొనుట. ఇదే వెనుకటి శ్లోకమున చేయబడిన హెచ్చరిక. తరువాత తీసికొన వలసిన జాగ్రత్తనుగూర్చి హెచ్చరించుచు, ప్రతిబంధక సామగ్రియందలి ప్రాధాన్య తారతమ్యములను తెలిపినాడీ శ్లోకమున పరమాత్మ.

ఇచ్చట ఏది బుద్ధికంటె బలవత్తరమైనదో అది - అను చోట "సః" అనగా ఆత్మ అని అర్థము చెప్పినారు పెక్కుమంది వ్యాఖ్యాతలు. కాని ఇది ప్రతిబంధకత్వములోని ప్రాధాన్య మును వివరించు సందర్భమగుటచేతను, వెనుకటినుండి కామ మునుగూర్చిన ప్రసంగమే వచ్చుచుండుటచేతను, తరువాతి శ్లోకములోగూడ "ఇట్లు బుద్ధికంటె ప్రధానమైనదిగ తెలిసికొని కామరూపశత్రువునునశింపచేయుము!" అన్నవిధివాక్యముచేతను ఇచ్చట కామము అను అర్థమే పొసగుచున్నదికాని, ఆత్మఅను అర్థము సమన్వయించుటలేదు. ఇచ్చట "సః" అనగా కామము అని వివరించుటే సమంజసమని అమృతవాహిని అభిప్రాయము,

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా
సం స్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో !
కామరూపం దురాసదమ్ ॥ ౪౩

ప. వి :— ఏవం, బుద్ధేః, పరం, బుద్ధ్వా, సంస్తభ్య, ఆత్మానం, ఆత్మనా, జహి, శత్రుం, మహాబాహో, కామరూపం, దురాసదమ్.

టీక :—

మహాబాహో ! = గొప్ప శక్తిగల ఓ అర్జునా !
ఏవం = ఈ విధముగ,
బుద్ధేః = బుద్ధికంటె,
పరం = ప్రబలమైనదిగా,
బుద్ధ్వా = తెలిసికొని,
దురాసదం = అణచుటకు సాధ్యముకాని,
కామరూపం = కామరూపమైన,
శత్రుం = శత్రువును,
ఆత్మనా = బుద్ధిచేత,
ఆత్మానం = మనస్సును,
సంస్తభ్య = నియమించి,
జహి = నశింపచేయుము.

తా. మహాబలుడైన ఓ అర్జునా ! ఈవిధముగ బుద్ధికంటెకూడ ప్రబలమైనదిగా బుద్ధిచేత మనస్సను నియమించుటద్వారా, ఆ కామరూపశత్రువును - అణచ శక్యముకాని దానిని - నశింపజేయుము.

**అమృతవాహిని :—**

ఈ విధముగా - అనగా పైని ప్రతిపాదింపబడినట్లుగా - బుద్ధికంటె కామము యొక్క ప్రాబల్యమును తెలిసికొని, బుద్ధిచేత మనస్సును నియమించి, దుస్సాధమగు కామరూప శత్రువును నశింపచేయుము అని ఆదేశించుచున్నాడు పరమాత్మ.

జయమును పొందగోరువాడు ముందుగ శత్రువుయొక్క బలాబలములను తెలిసికొని, తదనుగుణముగ వ్యూహానిర్మాణము చేసికొని సాగవలయును. అట్లు చేసిననే జయముపొందగలడు. అందుచేత హితైషియగు పరమాత్మ, కామరూప శత్రువుయొక్క ప్రాబల్యమును చెప్పుటతోపాటు, విజయమునకు అనసరమగు క్రమమును గూడ తానే వివరించినాడు -

"చిన్నపామునైనను పెద్దకఱ్ఱతో కొట్టవలయును" అని సామెత-ఇక అదే భయంకరమైన పెద్దనల్లత్రాచైన తీసికొనవలసిన జాగ్రత్త వేరుగదా ! అందుచేత ముందుగ శత్రువు యొక్క ప్రాబల్యమును గుర్తించుట అవసరము. అట్లు గుర్తించిననే అవసరమగు జాగ్రత్తలు తీసికొనగలడు మానవుడు. కనుక ముందుగ ఆ విషయము ప్రతిపాదింపబడినది.

తరువాత ఆ శత్రువును జయించు మార్గము నిర్దేశింపబడినది- ముందుగ బుద్ధిచేత మనస్సును నియమించవలయును. ఇచ్చట "సంస్తభ్య" అనగా "స్తంభింపజేసి" అని అర్థమువచ్చుచున్నను, ఆ విధముగ పూర్తిగ స్తభింపజేయుట అనునది సాధనస్థితిలో జరుగునది కాదు కనుక, సత్కార్మాచరణమునందు నియమించి, ఊపిరి సలుపకుండునట్లు శాస్త్రవిహిత కర్మాచరణ

మున నియమించి - అనియే చెప్పికొనవలయును. అట్లు చేయుటచే ఇంద్రియములును ఆ యా సత్కర్మలయందు ప్రవర్తింపక తప్పదు కనుక, ఇక వాటి నాశ్రయించుకొనిన కామము తన ప్రాబల్యమును కోల్పోయి, దాసోహమనక తప్పదు. అదే మార్గము. ఇట్లు మనస్సును, ఇంద్రియములను సత్కర్మాచరణమున నియమింపక ఊరక విచారణ చేసికొనినంత మాత్రమున జరుగు ప్రయోజనము ఉండదు.

"జహి" అనినాడు పరమాత్మ - దాసోఽహమని లొంగినట్లు కనుపడినంతమాత్రమున శత్రుశేషమును విడువరాదు. సర్వనాశనము చేసియే తీరవలెను. లొంగినట్లు కనుపడినను, ఏదో క్షణమున శక్తి పుంజుకొని, మనలను నాశము చేయగలదు. కనుక "నశింపజేయుము !" అని నిష్కర్షగ ఆదేశించినాడు పరమాత్మ.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం,
యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం,
యదుగిరి యతిరాజ సంపత్కుమార మునీంద్రాణాం
శిష్యేణ సీతారామయతినా విరచితాయాం,
అమృతవాహినీనామ శ్రీగీతావ్యాఖ్యాయాం
తృతీయోఽధ్యాయః

ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీమద్భగవద్గీతా — చతుర్థోఽధ్యాయః

# జ్ఞానయోగః

శ్రీభగవానువాచ :-

శ్లో॥ ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ
మను రిక్ష్వాకవేఽబ్రవీత్॥ ౧

ప. వి :- ఇమం, వివస్వతే, యోగమ్, ప్రోక్తవాన్, అహం, అవ్యయమ్, వివస్వాన్, మనవే, ప్రాహ, మనుః, ఇక్ష్వాకవే, అబ్రవీత్.

టీక :—

అవ్యయమ్ = నాశములేని,
ఇమం యోగం = ఈ యోగమును,
అహం = నేను,
(పురా) = (పూర్వకాలమున),
వివస్వతే = సూర్యునికొరకు,
ప్రోక్తవాన్ = చెప్పితిని.
వివస్వాన్ = సూర్యుడు,
మనవే = తనకుమారుడైన మనువుకొరకు,
ప్రాహ = చెప్పెను.

మనుః = ఆ మనువు,

ఇక్ష్వాకవే = తనకుమారుడైన ఇక్ష్వాకు మహారాజుకొరకు,

అబ్రవీత్ = చెప్పెను.

తా. శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :— నాశరహితమైన ఈ యోగమును, నేను పూర్వము సూర్యునకు చెప్పితిని. సూర్యుడు తన కుమారుడైన మనువునకు చెప్పెను. ఆ మనువు తన కుమారుడైన ఇక్ష్వాకునకు చెప్పెను.

**అమృతవాహిని :—**

కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :- "అర్జునా ! ఇప్పుడు నీకు బోధించినదియు బోధించదలచుకొన్నదియునగు ఈ గీతాయోగము ప్రస్తుతము నిన్ను యుద్ధమునకు పురికొల్పుటకై ప్రత్యేకముగా కల్పించి చెప్పుచుంటి ననుకొనుచున్నావా ? లేదు. ఈ యోగమును సృష్టియొక్క ఆరంభముననే చెప్పితిని. ముందు సూర్యునకు చెప్పితిని. ఆ సూర్యుడు తన కుమారుడైన మనువునకు చెప్పెను. ఆ మనువు తనకుమారుడైన ఇక్ష్వాకునకు చెప్పెను."

చతుర్ముఖబ్రహ్మయొక్క కుమారుడు మరీచి. ఆయన కుమారుడు కశ్యపుడు. కశ్యపుని కుమారుడు వివస్వంతుడు. ఈయనయే సూర్యుడు. రామచంద్రమూర్తి వంశమునకు మూలపురుషుడు. కనుకనే ఆ వంశమునకు 'సూర్యవంశము' అని పేరుకలిగినది. ఈ వివస్వంతుడే "ఇమం వివస్వతే

యోగం ప్రోక్తవా సహా మావ్యయమ్" అని కృష్ణపరమాత్మ చెప్పిన వివస్వంతుడు. కృష్ణపరమాత్మ ఈ వివస్వంతునకు ఆదికాలమున ఈ యోగమును ఉపదేశించినాడు. ఈ వివస్వంతుని కుమారుడు మనువు. కనుక, తన కుమారుడైన మనువునకు వివస్వంతు డుపదేశించినాడు. ఈ మనువును తనకుమారుడైన ఇక్ష్వాకు మహారాజున కుపదేశించినాడు.

వాల్మీకి రామాయణమున :-

"అవ్యక్తప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః ।
తస్మాన్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యపస్సుతః ॥ 20
వివస్వాన్ కాశ్యపా జ్జజ్ఞే - మనుర్వైవ స్వతస్మృతః ।
మనుః ప్రజాపతిః పూర్వ - మిక్ష్వాకుస్తు మనోస్సుతః॥ 21
తమిక్ష్వాకు మయోధ్యాయాం - రాజానం విద్ధిపూర్వకమ్." 22

(వాల్మీకి రామాయణము - బాలకాండము. 70 సర్గ.)

'అవ్యక్తస్వరూపుడైన నారాయణమూర్తికి బ్రహ్మ పుట్టెను. బ్రహ్మకు మరీచి, మరీచికి కశ్యపుడు, కశ్యపునకు వివస్వంతుడు, ఈయనయే సూర్యుడు - వివస్వంతునకు మనువు, మనువునకు ఇక్ష్వాకువు - పుట్టిరి. అయోధ్యాపురమును మనువు నిర్మించెను. ఇక్ష్వాకు మహారాజు అయోధ్యనే రాజధానిగ చేసికొని రాజ్యముచేసెను.'

సీతాకల్యాణ సందర్భమున వశిష్ఠుడు జనకునితో చెప్పిన సూర్యవంశక్రమములోని ఏ శ్లోకములు, ఇక్కడ చెప్పబడిన

వివస్వంతుడు, మనువు, ఇక్ష్వాకువు - వీరినే కృష్ణపరమాత్మ గీతలో పేర్కొనెనని గ్రహించవలయును.

"ఇమం యోగం" ఈ యోగమును- అనగా ఏ యోగమును ? ఈ అధ్యాయమునకు పూర్వము చెప్పిన మూడవ అధ్యాయమును గురించి యని కొంతమందియును, ఇక చెప్పబోవు నాలుగవ అధ్యాయమును గురించి యని కొంతమందియును అభిప్రాయములు తెలిపియున్నారు. కాని ఆ అభిప్రాయములు సమంజసములుగ, తృప్తికరములుగ తోచుట లేదు.

కృష్ణపరమాత్మ అర్జునునకు గీతను చెప్పబోవుటకు ముందే, ఒక సిద్ధాంతమును నిర్ణయించుకొని యున్నాడు. ఆ సిద్ధాంతమును బోధించుటకు ఉపక్రమించి, పూర్తిచేయుటకు చేసిన ప్రబోధమే గీతయను పేరున ప్రసిద్ధి చెందినది. కనుక, గీతలో నున్న ఆ మూలసిద్ధాంతమును దృష్టిలో నుంచుకొనియే, కృష్ణపరమాత్మ 'ఈ యోగము' అనినాడు. అంతియేగాని, ముందు చెప్పిన మూడవ అధ్యాయమును గురించి అనికాని, చెప్పబోవు నాలుగవ అధ్యాయమును గురించి అని కాని, అనుట సరికాదు. మూడవ అధ్యాయమును గురించి మాత్రమే అనుటచేత, గీతలో తరువాత, వేరే ఇంకొక సిద్ధాంతము చెప్పబడినట్లు ధ్వనించుచున్నది. బోధనావిధానములలో మార్పేగాని, మొత్తము గీత అంతటిలోను ఒకేఒక మూలసిద్ధాంతము ఏకరీతిగా ప్రవహించుచున్నది. దానిని

దృష్టిలోనుంచుకొనియే "ఈ యోగము" అనినాడు శ్రీకృష్ణ పరమాత్మ.

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త
మిమం రాజర్షయో విదుః
స కాలేనేహ మహతా
యోగో నష్టః పరంతప!॥ 2

ప. వి. :— ఏవమ్, పరంపరాప్రాప్తం, ఇమం, రాజర్షయః, విదుః, సః, కాలేన, ఇహ, మహతా, యోగః, నష్టః, పరంతప.

టీక :—

హే పరన్తప ! = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా!
ఏవమ్ = ఈవిధముగా,
పరంపరాప్రాప్తమ్ = పరంపరంగా పొందబడిన,
ఇమమ్ = ఈ యోగము,
రాజర్షయః = రాజర్షులు,
విదుః = తెలిసికొనిరి.
మహతా కాలేన = చాలకాలము గడచినందున,
సః యోగః = ఆ యోగము,
ఇహ = ఈ లోకమందు,
నష్టః = నశించిపోయెను.

తా॥ ఓ పరంతపా ! ఈ విధముగ నీ యోగమును రాజర్షులు తెలిసికొనిరి. ఎంతోకాలము గడచుటచే క్రమముగ నీయోగ మీలోకమున నశించిపోయినది,

అ మృ త వా హి ని :-

అర్జునా ! ఈవిధముగ పరంపరాగతముగ అనేక తరములవరకును ఈ యోగము రాజర్షులలో ప్రచారమైనది. ఒకరికొకరు పరంపరగా ఉపదేశము చేసికొనుచు ఈ యోగమును బాగుగ ప్రచారము చేసిరి. ఇట్లు చాలకాలము బాగుగా ప్రచారములోనుండి, తరువాత కాలక్రమమున ప్రచారము తగ్గి చివరకు లుప్తప్రాయమైనది. ఇప్పుడు కేవలము లేదనియే చెప్పవచ్చును. ఎందువల్లననగా చాలకాలముకాగా ఉపదేశము చేయువారు తగ్గిపోయిరి. వినువారిలో శ్రద్ధాభక్తులు తగ్గినవి. భోగాసక్తి పెరిగిపోయినది. చివరకు ఉపదేశించువారును లేరు; వినువారును లేరు. కనుక, ఈ లోకములో ప్రచారము లేకుండ పోయినది.

ఈ శ్లోకములో కృష్ణపరమాత్మ ఈ యోగమును గూర్చి "రాజర్షయో విదుః" 'రాజర్షులకే యోగము తెలియును' అని చెప్పినాడు. అందుచేత ఇది కేవలము రాజర్షులలో మాత్రమే ప్రచారముచెంది, ఇతరులలో ప్రచారము లేదేమో అనియును, ఇది కేవలము రాజర్షులకుమాత్రమే - క్షత్రియ జాతికి మాత్రమే యేమో అనియును సందేహము కలుగవచ్చును. కృష్ణపరమాత్మ అభిప్రాయమున ఈగీతాయోగము క్షత్రియులకు మాత్రమే అయిన, ఈ గీత ఏకపక్షమునకు చెందిన గ్రంథమే కాగలదు. కాని అట్లుకాదు. మానవజాతి

కంతకును మహోజ్జ్వలమైన వెలుగుబాట చూపు సమగ్రమైన విజ్ఞానభాండార మీ గీతాగ్రంథము. కనుక, ఇది ఒక క్షత్రియులకొరకే అనుకొనుట భ్రమమూలకము.

అయితే, ఇక్కడ కృష్ణపరమాత్మ 'రాజర్షయః' అనుట యెందులకనిన - అర్జునుడు క్షత్రియుడు. ఇది యితరులకు పనికివచ్చు యోగమనుకొందు వేమో, పూర్వమునుండియును రాజర్షులలో బాగుగ ప్రచారములోనున్నది, కనుక నీకు స్వధర్మమేగాని పరధర్మముకాదు అని చెప్పుటయే ఉద్దేశమై యుండవచ్చును.

"నేను వివస్వంతునకు చెప్పితిని. ఆయన మనువునకు చెప్పెను. మనువు ఇక్ష్వాకునకు చెప్పెను" అనుటచే ఆధ్యాత్మిక విద్యకు ప్రథమాచార్యుడు పరమాత్మయే అని నిర్ణయింప బడినది పరమాత్మచే. ఆయననుండియే ఈ విజ్ఞానస్రవంతి బయలువెడలవలయును. శాస్త్రసమ్మతమైన వైదిక సంప్రదాయములన్నియును పరమాత్మనే ప్రథమాచార్యుడుగ అంగీకరించినవి. పరమాత్మవలననే బయలువెడలవలసిన ధర్మము ఏకారణముచేతనైనను కాలాంతరమందు ఈ లోకములో లుప్తమైనచో, ఆ పరమాత్మయే అవతరించి,మరల ఆ ధర్మమును అర్హులైనవారికి ఉపదేశించి, ప్రచారములోనికి తీసికొనిరావలయును. ఇందుకొరకు అవసరము వచ్చినపుడెల్ల పరమాత్మ అవతరించుచుండును.

ఈ విశ్వాసముగలవారు ధర్మసంస్థాపనము విషయములో, ప్రచారము విషయములో, తమతమ బాధ్యతలను నిర్వంచనముగను, నిర్దుష్టముగను, నిర్వహించుకొనవలసినదే గాని, ఏకారణములచేతనైనను ఎప్పుడైన ధర్మమునకు హానికలుగునప్పుడు తాత్కాలికముగ ప్రజలు అధోగతిపాలగుచున్నారే అని జాలిపడవలసినదేగాని, ధర్మము నశించిపోవుచున్నదే అని భయపడవలసినపనిలేదు. అట్టిసమయము సంప్రాప్తించినప్పుడు, దానిని పునరుద్ధరింపవలసిన బాధ్యత పరమాత్మదేగదా! ఆయన బాధ్యత నాయన విస్మరించుననుకొనుట అజ్ఞానము. కనుక, ధర్మపరాయణులు ఎంత మాత్రమును భయపడనక్కరలేదు. కాని ఈ అభిప్రాయమును గ్రహించుటలో పొరబడి, మనకేమియు బాధ్యతలేదనియు; మనమేమియును చేయనక్కరలేదనియు, సోమరితనమును ఆశ్రయించరాదు. సక్రమముగా గ్రహించనినాడు మానవజాతి వేదాంతకారణముగా సోమరితనముపాలై పోగలదు. మానవుడు ధర్మము నశించుచున్నదే అని బెంగపడ నక్కరలేదు. 'కర్మణ్యేవాధికారస్తే' అని చెప్పినట్లు, తన విధ్యుక్తధర్మమును మాత్రము నిర్వంచనముగా నిర్వహించి తీరవలయును. ఇదియే కర్మయోగములోనున్న రహస్యము.

శ్లో॥ స ఏ వాయం మయా తేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖాచేతి
రహస్యం హ్యేత దుత్తమమ్ ॥ 3

ప. వి :—సః, ఏవ, అయం, మయా, తే, అద్య, యోగః, ప్రోక్తః, పురాతనః, భక్తః; అసి, మే, సఖా, చ, ఇతి, రహస్యం, హి, ఏతత్, ఉత్తమమ్.

టీక :—

పురాతనః = ప్రాచీనమైనట్టియు,
ఉత్తమమ్ = శ్రేష్ఠమైనట్టియు,
సః ఏవ అయం యోగః = ఆ యీ యోగము,
మే = నాయొక్క,
భక్తః = భక్తుడవును,
సఖా చ = స్నేహితుడవును,
అసి ఇతి = అయితివికావున,
మయా = నాచేత,
అద్య = ఇప్పుడు,
తే = నీకొరకు,
ప్రోక్తః = చెప్పబడినది.
ఏతత్ = ఈ యోగము,
రహస్యం హి = బహుగోప్యమైనదిగదా !

తా. ఈవిధముగ పురాతనమైనట్టియును, అత్య ఉత్తమమైనట్టియును, రహస్యమైనట్టియును, ఈయోగమును, నా భక్తుడవును, ప్రియమైన సఖుడవును గనుక నేను నీకు చెప్పుచున్నాను.

తా. అర్జునుడడుగుచున్నాడు : ఓ కృష్ణా ! నీయొక్క జన్మ ఇప్పుడు కలిగినది. సూర్యునియొక్క జన్మ బహుపురాతనమైనది. "నేను పూర్వము సూర్యునికి చెప్పితిని" అను నీ మాటను నేను ఎట్లు తెలిసికోగలను ?

## అమృతవాహిని :—

"కృష్ణా ! నీ మాటలువినిన నాకు చాల ఆశ్చర్యముగ నున్నది. సూర్యుడు ఎప్పుడో కల్పమునకాదియందు పుట్టి నాడు. నీవు ఇప్పుడు మాతో పుట్టి పెరుగుచున్నావు. అటు వంటిది నీవు సూర్యునికి ఈ గీత బోధించితిననుట నా బుద్ధి గ్రహించలేకుండనున్నది. అయితే, నీ మాటయందు అవిశ్వాసములేదు. పూర్తిగ విశ్వాసమున్నది. కాని, బుద్ధిమాత్రము అందుకొనలేకుండ నున్నది. కనుక నా ఈ సందేహమును తీర్చి, నేను గ్రహించగలుగునట్లు చెప్పుటకు సర్వసమర్థుడవును, సర్వజ్ఞుడవును, దయాసాగరుడవును అయిన నీవే తగుదువు. నీ భక్తుడనైన, నీ పాదములాశ్రయించిన నా యీ అభిలాషను పూర్తిచేయుము" అని భావము.

ఇక్కడ అర్జునునకు కృష్ణపరమాత్మయందుగాని ఆయన మాటలయందుగాని ఆవగింజంతకూడ అవిశ్వాసములేదు. కేవలము పరిపూర్ణ పరబ్రహ్మతత్త్వమైన కృష్ణపరమాత్మ వలననే ఈవిషయమును తెలిసికొనవలయునను అభిలాషతో అడుగుచున్నాడు.

శ్రీకృష్ణుడు పరమాత్మయని రాజసూయాధ్వర సందర్భమున భీష్మునిచే వినెను, శిశుపాలవధయు దీనినే నిరూ

పించెను. పెక్కుమంది మహర్షులును చెప్పియున్నారు. ఇంకను అనేక సందర్భములలో అనేకములైన ప్రభావములు ప్రత్యక్షముగా చూచియున్నాడు అర్జునుడు. అయినను స్వయముగా భగవంతుడే తన అవతారరహస్యమును వర్ణించగా వినవలయునను కుతూహలముతో వేసిన ప్రశ్న యిది -

శ్రీభగవానువాచ :—

> శ్లో॥ బహూని మే వ్యతీతాని
> జన్మాని తవ చార్జున !
> తా న్యహం వేద సర్వాణి
> న త్వం వేత్థ పరంతప ! ॥ ౫

ప. వి :— బహూని, మే, వ్యతీతాని, జన్మాని, తవ, చ, అర్జున, తాని, అహం, వేద, సర్వాణి, న, త్వమ్, వేత్థ, పరన్తప.

టీక :—

హే అర్జున ! = ఓ అర్జునా !
మే = నాకును,
తవచ = నీకును,
బహూని = అనేకములైన,
జన్మాని = జన్మలు,
వ్యతీతాని = గడచిపోయినవి,
తాని సర్వాణి = ఆ జన్మలన్నిటిని,

అహం = నేను,
వేద = ఎరుగుదును.
హే॰పరంతప! = శత్రువులను తపింపజేయువాడా!
త్వమ్ = నీవు,
న వేత్థ = ఎరుగవు.

తా. పరమాత్మ చెప్పుచున్నాడు :—"ఓ అర్జునా ! నీకును నాకును గూడ అసంఖ్యాకములైన జన్మలు గడచిపోయినవి. వాని నన్నిటిని నేనెరుగుదును; నీ వెరుగవు."

అ మృ త వా హి ని :—

అర్జునా ! మనము ఇప్పుడే పుట్టితి మనుకొనుచున్నావా? నేను అనేక పర్యాయములు పుట్టితిని. నీవు ఒక్కడవే కాదు, సకల జీవసముదాయమును అనేక పర్యాయములు పుట్టు చున్నది ; చచ్చుచున్నది. ఈ విధమైన నాజన్మములును మీాజన్మములును సర్వమును నాకు తెలియును. మీాజన్మములే మీాకు తెలియవు ; ఇంక నా జన్మలు ఎట్లు తెలిసికొనగలరు ? మత్స్య కచ్ఛప వరాహ నారసింహ వామనాది రూపములలో- జన్మించితిని. ఇంక ననేక అవతారము లెత్తితిని. హంస, హయగ్రీవ, కపిలాదులు - లెక్కలేనన్ని అవతారములు కలవు. ఏ యే అవతారములలో ఎంతెంతమందికి ఏ యే ఉపదేశములుచేసితినో మీాకు తెలియదు. కనుక ఈ యోగము పూర్వము సూర్యునకు చెప్పితిని అని నేను అనిన మాటలకు

ఏమియును ఆశ్చర్యపడవలసినపని లేదు. కల్పాదియం దు - నారాయణరూపముతో - సూర్యున కుపదేశించితిని. నేను సర్వజ్ఞుడను గనుక నా వెనుకటి అవతారములు, ఆ అవతారములలో చేసినకర్మలు, లీలలు, మాట్లాడిన మాటలు, సర్వము నాకు తెలియును. అట్లే సకలజీవరాసులయొక్కయును అన్ని జన్మలును, ఆయాజన్మలలో చేసిన సమస్తకర్మలును, మాట్లాడిన మాటలును, అంతఃకరణములలోని భావములును, సర్వమును నాకు తెలియును. కాని, మీకేమియును తెలియవు. మీరు సర్వజ్ఞులుకారు; అల్పజ్ఞులు. మీకు పూర్వజన్మలస్మృతి లేదు. కాబట్టియే ఈ ప్రశ్న వేసితివి. ఈ అనంతకోటి బ్రహ్మాండములలో - భూత భవిష్య ద్వర్తమానకాలములలో - జరిగినట్టియును, జరుగబోవునట్టియును, జరుగుచున్నట్టియును ఏసంఘటనయును, చిన్నదికాని, పెద్దదికాని, నాకు తెలియనిది లేదు. సకలజీవరాసులలో, ఏది, ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, ఏమి చేసినదియును ఏమి చేయబోవునదియును నాకు ప్రత్యక్షముగా తెలియుచునే యుండును. కనుక నేను పూర్వము కల్పాదియందు సూర్యునకు ఈ యోగము నుపదేశించితిని అని చెప్పితిని. నీవు ఈ విషయమును గురించి ఎంతమాత్రమును సందేహించవలసినపని లేదు.

అవతారిక:

కృష్ణపరమాత్మ తనకింతవరకును అనేకజన్మలు గడచినవి అని చెప్పుటచే, ఆయనకెందుకు జన్మలు గడువవలయును ?

మిగిలినవారిజన్మలకును ఆయన జన్మలకును భేదమేమి ? అను సందేహములు అర్జునునకు కలుగవచ్చును. అట్టి సందేహము నివర్తించుటకు ఇప్పుడు తనజన్మల తత్త్వమును గురించి చెప్పుచున్నాడు.

శ్లో॥ అజోఽపిస న్నవ్యయాత్మా
భూతానా మీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ
సంభవా మ్యాత్మమాయయా॥ ౬

ప. వి :— అజః, అపి, సన్, అవ్యయాత్మా, భూతానాం, ఈశ్వరః, అపి, సన్, ప్రకృతిం, స్వాం, అధిష్ఠాయ, సంభవామి, ఆత్మమాయయా.

టీక :—

అజోఽపిసన్ = పుట్టుకలేనివాడనైనను,
అవ్యయాత్మా (అపిసన్) = నాశములేనివాడనైనను,
భూతానామ్ = సమస్తప్రాణులకును,
ఈశ్వరోఽపిసన్ = ఈశ్వరుడనైనను,
స్వామ్ = స్వకీయమైన,
ప్రకృతిం = స్వభావమును,
అధిష్ఠాయ = స్వాధీనముచేసికొని (అధిష్ఠించి),
ఆత్మమాయయా = నామాయచేత (స్వశక్తిచేత),
సంభవామి = పుట్టుచున్నాను.

తా. "నేను పుట్టుకలేనివాడను, నాశనములేనివాడను, సర్వభూతములకు ఈశ్వరుడను అయినప్పటికిని, నాయొక్క ప్రకృతిని అధిష్ఠించి, నా మాయచేత పుట్టుచున్నాను."

అమృతవాహిని :—

"అర్జునా ! నేను పుట్టుకలేనివాడను. అయినను పుట్టుచున్నాను. "అజాయమానో బహుధా విజాయతే" "పుట్టుకలేనివాడు అనేక ప్రకారములుగా పుట్టుచున్నాడు" అను శ్రుతిప్రకారము నేను అనేక అవతారములను ధరించుచున్నాను. అయితే, నాపుట్టుక జీవులపుట్టుకలవంటిదికాదు. కావుననే నా పుట్టుకకు అవతారమని పేరువచ్చినది. అవతరించుట అనగా దిగుట. జీవులపుట్టుక అవతారముకాదు; అనగా దిగుటకాదు; పడుట; క్రిందపడుట. వారిక్కిష్టములేకపోయినను జీవులు దిగవలసినదే; అనగా పడవలసినదే. మరల వెళ్ళవలసినదే. జీవులు వానివాని కర్మలననుసరించి అవశముగ పుట్టుచుండును. వానిపుట్టుకలయందు వాని కెంతమాత్రమును స్వాతంత్ర్యములేదు. నా పుట్టుకలో నాకు సంపూర్ణ స్వాతంత్ర్యము ఉన్నది."

ఈ శ్లోకములో కృష్ణపరమాత్మ "ఆత్మమాయయా"అనియును, "స్వాం ప్రకృతిం అధిష్ఠాయ" అనియును రెండు పదము లుపయోగించినాడు. ఇట్లు రెండుపదము లుపయోగించుటలోగల ప్రత్యేకత ఏమనగా, "ఆత్మమాయయా"అనగా "నాయొక్క మాయచేత" అని అర్థము. అంతమాత్రమే చెప్పి

ఊరకొన్నచో తక్కిన జీవులపుట్టుకలకును తనపుట్టుకకును భేదమేమిచెప్పినట్లు ? తక్కిన అన్ని జీవులును అట్టిమాయచేతనే గదా పుట్టుచున్నవి అని కొంతమందికి సందేహము కలుగ వచ్చును. అట్టిసందేహము రాకుండుటకై "స్వాం ప్రకృతిం అధిష్ఠాయ"అని చెప్పినాడు. అనగా "నేను ఈ ప్రపంచము లోనికి వచ్చినను, నా ప్రకృతిని - అనగా నా స్వభావమును - విడిచిపెట్టక, దానిని స్వాధీనముచేసికొని, దానిని అధిష్ఠించియే వచ్చుచున్నాను" అని చెప్పినాడు. ఆయన స్వభావమనగా దయా వాత్సల్య సౌశీల్యాది కల్యాణగుణములే. జీవు లీ ప్రకారముగా తమ స్వభావమును వశపరచుకొనిరాలేరు. వారు కర్మఫలములకు వశులై పుట్టుచుందురు. ఇది ఈ రెండు పదములుపయోగించుటలోగల చమత్కారము.

"అర్జునా ! నా యిష్టమువచ్చినప్పుడు ఈ లోకమునకు వచ్చుచుందును. నా యిష్టము ప్రకారము ప్రవర్తించు చుందును. నా యిష్టము వచ్చినప్పుడు ఈ లోకమునుండి వెళ్ళిపోవుచుందును. నేను సర్వభూతములకును ఈశ్వరుడను. కనుకనే స్వతంత్రుడను. నేను పుట్టినప్పటికిని అది పుట్టుక ఎట్లు కాదో, నేను పుట్టుకలేనివాడనే ఎట్లైతినో, అట్లే నేను ఈ లోకమునుండి వెళ్ళిపోయినను అది మరణముకాదు; నేను నాశనములేనివాడనే; అమృతస్వరూపుడనే.

"ప్రకృతి అనగా స్వభావము. నాయొక్క ప్రధానమైన

స్వభావము అజత్వము, అవ్యయత్వము, సర్వేశ్వరత్వము, దయ, వాత్సల్యము, సౌశీల్యము మొదలగు కల్యాణగుణములు కలిగియుండుట అను పరతత్త్వ స్వభావమును వదలకయే, నా ఇచ్ఛచేతనే, పుట్టుచుందును. కల్యాణగుణపరిపూర్ణమగు నా ఈశ్వరసంబంధమైన స్వభావమును వీడకయే పుట్టు చుందును."

ఈ శ్లోకములో, భగవంతుడు ఒకమానవరూపములో అవతరించుటకు అవకాశములేదు అనువారి సిద్ధాంతమును, భగవంతుడు పుట్టునని అంగీకరించియును, ఆ పుట్టుక భ్రాంతి మూలకమైనదనియును, అదియు ప్రాకృతరూపమే అనియును, చెప్పునట్టివారి సిద్ధాంతమును బాగుగా ఖండింపబడినవి.

ఆయన పుట్టుటకు లోకానుగ్రహమే ముఖ్యకారణము. ఆయన అవతరించుటయును, అంతర్ధానమగుటయును, అవతారకాలములో ఆయనచేయు ప్రతిపనియును అత్యంత స్వతంత్రములు. ఎప్పుడు, ఎక్కడ, ఎట్లు అవతరించవలయు ననినను, అంతర్ధానముకావలయుననినను, ఆయన యిష్టము ప్రకారము చేయగలడు. ఒక్కక్షణములో పెద్దవాడు చిన్న వాడు కావలయుననినను, చిన్నవాడు పెద్దవాడు కావలయు ననినను, రూపము మార్చవలయుననుకొనినను, ఆయన స్వేచ్ఛగా చేయగలడు. ఎందువలననగా, ఆయన ప్రకృతిలో బంధింపబడియుండలేదు. ప్రకృతి ఆయన అధీనములోనుండి

ఆయన చెప్పినట్లు ఆయన సంకల్పానుసారము ప్రవర్తించునది గనుక, ఆయన యిచ్ఛనే అనుసరించును. అర్జునుని ప్రార్థనపైన తన యిష్టముతో విశ్వరూపమును ధరించగలిగినాడు. మరల దానిని ఉపసంహరించి చతుర్భుజరూపమును ధరించినాడు. ఇటుల ఒక రూపమును దాచి ఇంకొకరూపమును ధరించినప్పుడు దానిని మరణమని, జననమని ఎట్లు అనమో, అట్లే, ఎప్పుడు, ఏ రూపములో బహిర్గతమైనను, అంతర్థానమైనను, జననమరణములని అనరాదు. దేవకీదేవికి ముందు చతుర్బాహురూపముతో గోచరించి, వెంటనే శిశురూపమును ధరించెను. వామనావతారములో బలిచక్రవర్తియొద్ద పొట్టిదైన రూపముతోనుండి, త్రివిక్రమరూపమును దాల్చెను. ఇదియే ఆయన జన్మలోఉన్న విలక్షణత.

ఒకడు ఏదో ఒక నేరము చేయుటచేత, కారాగారమున బంధింపబడినాడు. ప్రభువుగాని, ప్రభుత్వాధికారులుగాని, కారాగృహములో నున్నవారి యోగక్షేమముల విచారించుటకు వత్తురు. బంధితులును, ఆ ప్రభువు మొదలగువారును కూడ కారాగృహపుగోడలమధ్యనే ఉండిరి. అయినను, నేరము చేసినవారిని "బంధితులు" అన్నారు; వీరిని అనలేదు; వారు బంధితులు; వీరు స్వతంత్రులు. కారాగృహమునుండి వారి రాకపోకలు అత్యంతపరతంత్రములు; వీరి రాకపోకలు అత్యంతము స్వతంత్రములు, అట్లే జీవులయొక్క జన్మలు అత్యంతము పరతంత్రములు, పరమాత్మయొక్కయును,

పరమాత్మ సంకల్పముతో వచ్చిన నిత్యముక్తులయొక్కయును జన్మలు అత్యంతము స్వతంత్రములు. జీవులు ఈ లోకమునకు వచ్చుటను జన్మ అనియును, ఈ లోకమునుండి పోవుటను మరణమనియును అందుము. పరమాత్మయును, ముక్తుడును ఈ లోకమునకు వచ్చుటను అవతారమనియు, వెళ్ళిపోవుటను అంతర్ధానమగుట యనియును అందుము.

శ్లో॥ యదాయదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్. 7

ప. వి :— యదా, యదా, హి, ధర్మస్య, గ్లానిః, భవతి, భారత, అభ్యుత్థానం, అధర్మస్య, తదా, ఆత్మానం, సృజామి, అహమ్.

టీక :—

హే భారత ! = ఓ అర్జునా !
యదాయదాహి = ఎప్పుడెప్పుడు,
ధర్మస్య = ధర్మమునకు,
గ్లానిః = నాశమును,
అధర్మస్య = అధర్మమునకు,
అభ్యుత్థానం = అభివృద్ధియును,
భవతి = కలుగుచున్నదో,





తదా = అప్పుడు,
ఆత్మానం = నన్ను,
అహం = నేను,
సృజామి = సృష్టించుకొనుచున్నాను.

తా. ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానిచేకూరునో, అధర్మమునకు అభివృద్ధి కలుగునో, అప్పుడు నన్ను నేను సృజించుకొందును.

అ మృ త వా హి ని :-

అర్జునా ! నేను అవతరించుటకు ప్రత్యేకముగా ఒక సమయమును ఏర్పాటు చేసికొంటినేమో అను అభిప్రాయము నీకు కలుగవచ్చును. ఆసమయము ప్రత్యేకముగా ఏమియును లేదు. ధర్మమునకు హానికలుగుటయు, అధర్మమునకు వృద్ధి కలుగుటయు అను ఈ రెండే నా అవతారములకు కారణములు. అధర్మమును రూపుమాపుటకును, ధర్మమును సంరక్షించుట కును నేనే రావలసిన ఆవశ్యకము కలిగినయెడల, ఆ సమయమున నేనే వత్తును. ఆ వచ్చుట పేరే అవతారమందురు. అవతారమనగా దిగుట. నా అత్యున్నతస్థానమునుండి ఈ లోకమునకు దిగుదును.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే ॥ ౮

ప. వి :— పరిత్రాణాయ, సాధూనాం, వినాశాయ, చ, దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి, యుగే, యుగే.

టీక :—

సాధూనాం = సత్పురుషులయొక్క,
పరిత్రాణాయ = రక్షణముకొరకును,
దుష్కృతాం = పాపాత్ములయొక్క,
వినాశాయచ = నాశనముకొరకును,
ధర్మసంస్థాపనార్థాయ = ధర్మమును లెస్సగా ప్రవర్తింప జేయుటకొరకును,
యుగే యుగే = ప్రతియుగమునందును (ప్రతిసమయమునందును)
సంభవామి = అవతరించుచున్నాను.

తా. సాధువులను రక్షించుటకును, దుర్మార్గుల నశింపజేయుటకును, ధర్మమును సంస్థాపనముజేయుటకును, యుగయుగమునందును అవతరించుచుందును.

అ మృ త వా హి ని :—

ఏడవ, ఎనిమిదవ శ్లోకములు రెండును పరమాత్మ అవతరించుటకు కారణములు చెప్పుచున్నవి. "ఎప్పుడు ధర్మమునకు హానికలుగునో, అధర్మమునకు అభివృద్ధి కలుగునో, అప్పుడు అవతరించుచుందును" అనినాడు పరమాత్మ.

ధర్మమనగా నేమి ? అని నిర్ణయించవలసియున్నది.

దేనివలన మానవునకు ఐహిక పారమార్థిక ఉన్నతి లభించునో, అది ధర్మము. అనగా దేనివలన జీవునకు భయమునుండి రక్షణలభించునో, అభయము సిద్ధించునో, అది ధర్మము. సాధువులను పరిరక్షించుట భగవంతుని ప్రధానకర్తవ్యము. సాధువులన నెవరు? రెండవ అధ్యాయములో 'స్థితప్రజ్ఞులు' అనియును, పన్నెండవ అధ్యాయమున 'భక్తులు' అనియును, పదునాల్గవ అధ్యాయమున 'గుణాతీతులు' అనియును, చెప్ప బడినట్టివారే సాధువులు.

ఏమాత్రమును కాంక్షలులేక, ఆసక్తిరహితులై, బ్రహ్మలోక పర్యంతమైన భోగములందును పరమవైరాగ్యము గలిగి, కర్తృత్వాహంకారాభిమానములు లేక, పరమాత్మనే పరమగతిగాదలచి, ఆయనయందు అపరిమిత ప్రేమగలవారై, ఆయనను చూడక, కైంకర్యము చేయక, నామ గుణ వైభవ లీలలను సంకీర్తనచేయక, నమస్కరించక, ఒకక్షణములో అరభాగముకూడ ప్రాణములు నిలుపలేనివారలై, ఆయన గుణములను, వైభవములను, లీలలను తెలుపునట్టి నామము లను తలంచినంతమాత్రముననే, ఆనందముతో శరీరము పులకరించ, కంఠము గద్గదముకాగా, నేత్రములనుండి ఆనంద బాష్పములు ప్రవహించ, "హేకృష్ణా! గోవిందా! నారా యణా! శ్రీరామచంద్రప్రభో! అపారకరుణాసింధో!" అని ఉచ్చైస్స్వరమున సంకీర్తనము చేయుచు, ఉన్మత్తుల భాతి గంతులు వేయుచు, తాము తరించికూడ, లోకమును

తరింపజేయుటకై లోకమున సంచరించుచుందురో, వారు సాధువులు.

"ఇట్టి సాధువులను నేనెట్లు రక్షించునది ? వారికి ఏమి కావలయును ? వారి విషయమున రక్షించుటయననేమి ? వారికి బ్రహ్మలోకపర్యంతమైన భోగములందును, ఏపదార్థ లందును, ఏవ్యక్తియందును, కించిన్మాత్రముకూడ మమకారము, ఆసక్తి, లేకపోవుటచే ఇవికావలయును, ఈయ వలసినది అనిగాని, అయ్యో ! ఇవి పోయినవి, పోవుచున్నవి కాపాడుము అనిగాని, ప్రార్థించరు. పోనీ, వారు ప్రార్థించక పోయినను, నేనే ఈయవచ్చునుగదా అనుకొనినను, అది వారి రక్షణయను భావమే వారికుండదు. ఎప్పుడైనను అవసరమువచ్చినయెడల నాకార్యక్రమములో వారిని నిమిత్త మాత్రులుగా చేసికొనినచో, నాకార్యసఫలతకొరకే వారికి ఏదైన ప్రసాదించి నాపని చేయించుకొనవలయునేగాని, వారికి ప్రత్యేకముగా అక్కర లేదు. నాకొరకే నేను చేసికొనునవి వారి రక్షణకని ఎట్లు తృప్తిపడియుందును ? చివరికి వారు మోక్షమందుకూడ వైరాగ్యము గలిగియుందురు. కాని, వారికి ఒక్కటే మహాకాంక్ష యుండును. అది వారు జయించలేరు. జయించుటకు ప్రయత్నముకూడ చేయరు. అంతేకాదు - జయించవలయుననెడి అభిలాషయే ఉండదు. అట్టి కాంక్ష ఉండుటయే ధర్మమును, స్వరూపమును, జీవితముయొక్క సార్థకతయునని భావించి, వృద్ధిపరచుకొందురు. ఏదా కాంక్ష?

సర్వకాల సర్వావస్థలయందును, సర్వదా, సర్వథా, వారికి నాయొక్క దర్శన, స్పర్శన, సంభాషణాదులతో, నా నిత్య ప్రత్యక్షానుభవము సిద్ధించవలయును. ఇదే వారి యొక్క ఆద్యంతములు లేని కాంక్ష. ఇది తీర్చుటకే నేను అవతరించు చుందును.

"అయితే, దుష్టులను నశింపజేయుటయును, ధర్మమును స్థాపించుటయును గూడ నీయవతారములకు కారణములుగా చెప్పితివే అందువా? నిజమే. కాని ఆ రెండు కారణములును ఆనుషంగికములు. కేవలము వాటికొరకేయైనచో, నేను అవతరించవలసినపని లేదు. సత్యసంకల్పుడనుగనుక "దుష్టులు నశించవలయును! ధర్మము ఉద్ధరింపబడవలయును" అని సంకల్పించుకొనినచో, వెంటనే అట్లే అయితీరును. కాని, నేను ప్రత్యక్షముగరాకుండ 'నాభక్తులకు నేను కనపడవల యును' అని అనుకొన్నచో, నేను రాకుండ జరిగెడిదికాదు. "నీవు సత్యసంకల్పుడవుగనుక అట్లు 'వారికి ప్రత్యక్షము కావల యును. వారికి నా యథార్థదర్శనము కావలయును' అని సంకల్పించుకొన్నచో, జరుగదా" అందువా? ఏమిజరుగును? నా సత్యసంకల్పముయొక్క బలముచే, నేను వచ్చుటయే జరుగును. నేనురాకుండ, వచ్చినట్లు వారికి తృప్తికలిగించిన యెడల, వారిని మోసగించినట్లు అగును. కాన, నా సత్య సంకల్పము ప్రకారము సత్యముగ వచ్చితీరవలయును. ఆ వచ్చుటయే అవతారమనగా.

అవతారిక :-

అవతారమువలన, ఇంకను సాధుపరిత్రాణ మెట్లు గునో చెప్పుచున్నాడు.

శ్లో॥ జన్మ కర్మచ మే దివ్య
మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ
నైతి మామేతి సోఽర్జున !

ప. వి :—జన్మ, కర్మ, చ, మే, దివ్యం, ఏవం, యః, వేత్తి, తత్త్వతః, త్యక్త్వా, దేహం, పునః, జన్మ, న,ఏతి, మాం, ఏతి, సః, అర్జున :

క :—

హే అర్జున ! = ఓ అర్జునా !
మే = నాయొక్క,
జన్మ = పుట్టుకయును,
కర్మచ = పనియును,
దివ్యం = అప్రాకృతము,
ఏవం = ఈ విధముగ,
తత్త్వతః = యథార్థముగ,
యః = ఎవ్వడు,
వేత్తి = తెలిసికొనుచున్నాడో,
సః = వాడు,

దేహం = శరీరమును,
త్యక్త్వా = విడిచి,
పునః = మరల,
జన్మ = పుట్టుకను,
న + ఏతి = పొందడు,
మాం = నన్నే,
ఏతి = పొందును.

తా. ఓ అర్జునా ! నాజన్మయును, కర్మయును దివ్యములైనవి. ఈ విధముగ తత్త్వతః ఎవడు తెలిసికొనునో, వాడు ఈదేహమును వదలిన తరువాత, మరల జన్మకు రాడు. నన్నే పొందుచున్నాడు.

అ మృ త వా హి ని :—

అర్జునా ! నాజన్మములు, కర్మలు, లీలలు మొదలైన వన్నియును దివ్యములు - అనగా నిర్మలములును, పరమ పవిత్రములును, అప్రాకృతములును అయినవి. హేయమును, తుచ్ఛమును అయిన, ప్రకృతికి సంబంధించిన జన్మ కాదు నాది. సత్త్వరజస్తమోగుణములు నాకు లేవు. అవి నన్నేమియును అంటవు. కనుకనే నన్ను 'నిర్గుణుడు' అందురు. నిర్గుణుడు అనగా హేయగుణరహితుడు అని భావము. సగుణుడు అనగా, సకల కల్యాణగుణ పరిపూర్ణుడు అని భావము. హేయగుణములైన సత్త్వరజస్తమోగుణములకు సంబంధించిన జన్మలు, కర్మలు, నాకు లేవు. సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వ సర్వశక్తిత్వ సర్వేశ్వరత్వాది దివ్యకల్యాణగుణములను

పీడకమే, కేవలము సాధుపరిత్రాణముకొరకే నేను అవత రించెదను. కనుక, నాజన్మలు, కర్మలు దివ్యములైనవి. నేను జన్మించినను, ఏకర్మ చేసినను, ఏలీల చేసినను, అన్నియును లోకకల్యాణకారణములే. అన్నియును దివ్యములే. అన్నియును సాధుపరిత్రాణ సమర్థములే.

సాధుపరిత్రాణము రెండువిధములు. ఒకటి-పెక్కుమంది మహాత్ములు ఆయన దివ్యదర్శనముకొరకు వేచియుందురు. దర్శనము ఒక్కక్షణమాలస్యమైన ప్రాణములు నిలుపలేని ఆర్తి కలిగియుందురు. వారికి తన దివ్యదర్శనము కలుగ జేయుటయే వారికి రక్షణము. అంతకంటె వారికేమి కావల యును! గోపికలు, గోపకులు, అక్రూరాదులు, యశోదా నందాదులు, దేవకీవసుదేవులు, ముచికుందుడు, కుచేలుడు మొదలగు ఎందరో భక్తులకు, వారివారి భావనానుగుణముగ దర్శనమీయవలసి యున్నది. దేవకీవసుదేవులకు పుత్రుడుగా అవతరించవలసిన వరముగలదు. ఆకాలము వచ్చినది.యశోదా నందులవద్ద పుత్రభావముతో అనేకలీలలుచేసి, ఆనందింప జేయవలసియున్నది. గోపికలతో, గోపకులతో కలసిమెలసి మెలగవలసి యున్నది. ఇది ఆసమయములో గల సాధులకు సంబంధించినది.

రెండు-భావి సాధులు ఈ దివ్యమైన జన్మలు, లీలలు, కర్మలు, స్మరించి, కీర్తించి, భావించి తరించవలసియున్నది.

ఈవిధముగ సమకాలికులగు సాధులను, భవిష్యత్సాధులను
గూడ ముక్తికి అర్హులనుచేయవలసి యున్నది. గోపికల
యిండ్లలో పాలుదొంగిలుట, వెన్ననపహరించుట, దధిభాండ
ములు వ్రక్కలుచేయుట, దిసమొలల స్నానములుచేయు
యువతుల చీర లెత్తుకొనిపోవుట, మొదలగు బాల్యలీలలతో,
గోకులములోని సర్వుల చిత్తముల నాకర్షించి వారిని ముక్తుల
గావించెను. తరువాతివారు ఇవన్నియును తలంచుకొనుట
చేత, కీర్తించుకొనుటచేతగూడ ముక్తికర్హులగుదురు. ఈ
బాల్యలీలలచేత, ఆనందముతోనో, విచారముతోనో, భయము
తోనో, ప్రతివారి చిత్తములును కృష్ణునియందే నాటుకొని
యుండెడివి. ఎక్కడ కృష్ణుడు వచ్చునో, ఏమిదొంగిలించునో,
అని భయముతో వేయికన్నుల కనిపెట్టుకొని యుండుటలో,
యోగులవలె చిత్తముకృష్ణునియందేఅనన్యముగా ఉండెడిది.
కృష్ణుడు మనయింటికివచ్చిన బాగుండును. ఈనాడు ఇంకను
రాలేదేమి అని రాకపోయిన విచారించి, వచ్చిన ఆనందించి,
అట్లు కొందరి చిత్తములు, ఆయనయందే ఉండెడివి.
ఈవిధముగ కొంతమందికిని, ఏదోఒక వంకపెట్టుకొని ఎప్పు
డును కృష్ణునితో జగడమాడుట కొంతమందికిని యిష్టము.
అట్టివారితో ఏవో జగడము పెట్టుకొని, వారి చిత్తములు తన
వైపునకు త్రిప్పికొని, "భక్తానాం ఆకర్షయతీతి కృష్ణః" అను
వ్యుత్పత్తిని సార్థకముచేసికొనువాడు. ఇదికూడ సాధు
పరిత్రాణమేగదా!

దేవకీవసుదేవులను కారాగృహమునుండి విడిపించెను. తాను ప్రసాదించిన వరముప్రకారము యశోదానందులను తన బాల్యలీలలచే ఆనందింపజేసెను. కుచేలాదుల ననుగ్రహించెను. నలకూబరమణిగ్రీవుల శాపవిముక్తులనుచేసి, నారద భగవానులవాక్కు సత్యముచేసెను. అక్రూర ముచికుంద మైథిల శ్రుతదేవోద్ధవుల నుద్ధరించెను. జరాసంధుని కారాగారమున బంధితులైనరాజులను బంధవిముక్తులగావించెను. నరకాసురునిచే బంధింపబడిన పదునారువేల రాజకన్యల వివాహమాడి, ప్రాణములను, మానములను కాపాడెను. తన భక్తులైన పాండవులను, ద్రౌపదిని ఎన్నోపర్యాయములు ప్రాణసంకటములగు విపద్దశలనుండి రక్షించెను. పాండవ వంశాంకురమైన పరీక్షిత్తును బ్రతికించెను. ఇట్టివెన్నియో చేసినాడు. ఇదంతయు సాధుపరిత్రాణమేకదా !

పూతన, తృణావర్తుడు, వ్యోముడు, కేశి, బకాసురుడు, అఘాసురుడు, ధేనుకాసురుడు, ప్రలంబాసురుడు మొదలగు దుష్టరాక్షసులనెందరినో బాల్యముననే సంహరించెను. కంసుడు, నరకాసురుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, సాల్వుడు, పౌండ్రకుడు, కేశిరాజు మొదలగు దుష్టుల వధించినాడు. కౌరవ పాండవ యుద్ధనెపమున భూభారమడగించినాడు. బకుడు, హిడింబాసురుడు, కిమ్మీరుడు, జరాసంధుడు, కాలయవనుడు, ఘటోత్కచుడు, కాలకేయులు, నివాతకవచులు

మొదలగువారిని తనవారిచేతను, పరులచేతను చంపించి నాడు. చివరకు తానుతేకున్న ఇంక ఎవ్వరిచేతను జయింప బడుటకు వీలులేని యాదవులను తన అవతారసమాప్తి కాల మున వారిలోవారు పోరి హతులగునట్లు చేసినాడు. ఇట్లు భూమండలము నిష్కంటకముగ చేయుటచే, "వినాశాయ చ దుష్కృతాం" అను రెండవ ప్రయోజనమును నెరవేర్చుకొని నాడు. ఇదికూడ ఒకవిధమైన సాధుపరిత్రాణమేగదా!

ఇక మిగిలినది ధర్మసంస్థాపనము. ధర్మమనగా భగవంతుని పొందుటకు సాధనమైన ఉపాయము. భగవ త్కైంకర్యబుద్ధితో చేయు ధర్మార్థకామములు మోక్షకారణ ములే యగును. కనుక నవి ధర్మములు. దానికి విరుద్ధమైన ధర్మార్థ కామములు సంసార హేతువులు. కనుక, అధర్మములు. ఇక్కడ జీవుడు సంసారబంధనమునుండి విముక్తుడై భగవంతుని పొందుటకు ఏది సాధనమో అదే ధర్మమని తేలినది. దానిని సంస్థాపనము చేయుటయే భగవంతుని ధర్మసంస్థాపనమనగా.

ధర్మము ద్వివిధము- సామాన్యధర్మము, విశేషధర్మము అని. పూర్తిగ ఇంద్రియములను జయించలేక, ఆస్తికులై, పరమార్థముకావలయు ననువారికొరకు ఏర్పడినది సామాన్య ధర్మము. ఈ సామాన్యధర్మమును సక్రమముగా, నిర్వంచ నముగా, నిర్దుష్టముగా ఆచరించగలిగిననాడు, విశేషధర్మము

నకు అధికారికాగలడు. పరమాత్మను పొందుటకు నిరపాయ మైన, సులభమైన, నిస్సందిగ్ధమైన, ఫలము నిచ్చుటలో నిశ్చితమైన ఉపాయము భక్తి. భక్తివలననే ప్రతిజీవియును భగవంతుని పొందవలయును. "నాన్యః పంథా అయనాయ విద్యతే" "భగవంతుని పొందుటకు ఇంకొక ఉపాయము లేదు", "భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి, భక్తివశః పురుషః" "భక్తియే భగవంతుని పొందించును; భక్తియే దర్శింపజేయును;భగవంతుడు భక్తికి వశుడు," "సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ! భక్తినిష్ఠో భవ! భక్తినిష్ఠో భవ! భక్త్యా సర్వం సిద్ధ్యతి. భక్త్యాఽసాధ్యం నకించిదస్తి" "సర్వోపాయములను వదలి, భక్తిని ఆశ్రయించుము! భక్తినిష్ఠుడవు కమ్ము! భక్తినిష్ఠుడవు కమ్ము! భక్తివలన సర్వమును సిద్ధించగలదు. భక్తిచేత సాధించరాని దేదియును లేదు" అని శ్రుతులు చెప్పుచున్నవి. పురాణశ్రేష్ఠమైన శ్రీభాగవతములో"అహంభక్తపరాధీనోహ్యస్వతంత్రఇవద్విజ!" "నేను భక్తపరాధీనుడను. నాకు స్వాతంత్ర్యము లేదు" అని పరమాత్మ చెప్పినట్లున్నది. ఇంకను అనేకపురాణాంతరములలో గూడ"జన్మాంతరసహస్రేషు తపోజ్ఞానసమాధిభిః,నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" "అనేక వేలజన్మ లలో, మానవుడు చేసిన తపస్సులచేతను, జ్ఞానవిచారణ చేతను, సమాధులచేతను, పాపములన్నియును పూర్తిగ నశించుటవలన, భగవద్భక్తి లభించును" అనియును,

"అయంహి భగవాన్ కీర్తితశ్చ సంస్మృతశ్చ ద్వేషానుబంధేనాపి అఖిలసురాసురాది దుర్లభం ఫలం ప్రయచ్ఛతి కిముత సమ్యగ్భక్తిమతా" "అహో! భగవంతుడు ద్వేషానుబంధము చేత, తనను కీర్తించుట చేతను, స్మరించుట చేతను, దేవతలకును, రాక్షసులకును దుర్లభమైన మోక్షమును ఇచ్చుచున్నాడు. అనన్యభక్తుల సంగతి చెప్పవలయునా?" అనియును, "పరబ్రహ్మ పరంధామ యోఽసౌ బ్రహ్మ తథాపరమ్। తమారాధ్య హరిం యాతి ముక్తిమప్యతిదుర్లభామ్" "పరంధాముడు, పరబ్రహ్మము అయినహరిని ఆరాధించుట చేత మానవుడు అతిదుర్లభమైన మోక్షమును పొందుచున్నాడు" అనియును, "మమారాధ్య నరో ముక్తిమవాప్నోత్యవిలంబతామ్" "నన్ను ఆరాధించుట చేత, ఆలస్యములేకుండ ముక్తి లభించుచున్నది" అనియును చెప్పబడియున్నది. "సాతు కర్మ జ్ఞాన యోగేభ్యోప్యధికతరా తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః" "ఆ భక్తి కర్మ జ్ఞాన అష్టాంగయోగములకంటె కూడ గొప్పది. కాబట్టి, ముముక్షువులు భక్తినే ఆచరించవలయును" అని నారదభగవానులును, "తదేవ కర్మ జ్ఞాన యోగేభ్యః ఆధిక్య శబ్దాత్ తత్సంస్థస్యామృతత్వోపదేశాత్" "ఆ భక్తియే కర్మ జ్ఞాన అష్టాంగయోగములకంటె అధికము. భక్తివలన మోక్షము చెప్పబడినది" అని శాండిల్య మహర్షియును, తమ భక్తిసూత్రములందు ప్రతిపాదించియున్నారు.

కనుక ధర్మము అనగా భక్తియే; ధర్మసంస్థాపనమనగా భక్తి సంస్థాపనమే అని సారాంశము.

ఉపనిషత్సారమైన భగవద్గీతను అవతరింపజేసిన దీ భక్తి స్థాపననిమిత్తమే. గీతలో తనను పొందుట కుపాయ మేమి చెప్పియున్నాడో చూడుడు - "నాహం వేదై ర్నతపసా న దానేన నచేజ్యయా శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా; భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవం విధోఽర్జున ! జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!" అనియును, "మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః, నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాండవ !" అనియును, "భక్త్యా మా మభిజానాతి" అనియును, "మన్మనాభవమద్భక్తో మద్యాజీ మాంనమస్కురు మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసిమే"అనియును, తనను పొందునట్టి ఏకైక ఉపాయము భక్తియనియే సిద్ధాంతము చేసియున్నాడు. కనుక భక్తి స్థాపనమే ధర్మస్థాపనమనగా. ఇది అర్జునునికి భగవద్గీత బోధించుటచేతను, ఉద్ధవునికి ఉద్ధవగీతలు బోధించుటచేతను, పూర్తిగ నెరవేర్చెను. ధర్మమునకున్న ఆటంకములన్నియును తీసివేసి, నిష్కంటకముజేసెను. ఈ విధమున ధర్మసంస్థాపనము చేసినాడు కృష్ణపరమాత్మ. చివరకు ధర్మరాజును సింహాసన మెక్కించి, భీష్మునిచేత సకల ధర్మోపదేశములను చేయించి, ధర్మరాజుచేత ధర్మముగా రాజ్యమును పాలింపజేయుట ర్మసంస్థాపనము కాదా ?

ఈ విధముగ "నా జన్మలు, కర్మలు కూడ దివ్యము లైనవి. ఈ విషయము తెలిసికొన్నవారు, ఈ దేహామును వదలి మరల జన్మకురారు. పునరావృత్తి రహితమైన పరము పదమును పొందుచున్నారు. అనగా నన్నే పొందుచున్నారు" అని చెప్పినాడు కృష్ణపరమాత్మ.

ఈశ్లోకములో భగవంతుని సగుణ సాకారములయొక్క విశిష్టత బాగుగ చెప్పబడియున్నది. కాని, మన దేశములో ఇప్పుడు కొంతమందికి, సగుణోపాసన చాల తక్కువస్థాయికి చెందినదనియును, అజ్ఞానులకొరకు కల్పింపబడినదనియును అభిప్రాయము. నిర్గుణోపాసనయే పరాకాష్ఠయనియును, అది అందుకొనుటకు సగుణోపాసన ఒకమెట్టు అనియును చెప్పు చుందురు. కొందరు అసలు అవతారవాదమునే నమ్మరు. సర్వత్ర వ్యాపించియున్న పరబ్రహ్మము, ఒకశరీరములో ఎట్లు ఇముడగలడు ? ఇంద్రియములకు అగోచరుడైనవాడు ఈ చర్మచక్షువుల కెట్లు గోచరించగలడు అని వారివాదన. అంతియేగాని, పరమాత్మ సర్వశక్తిసంపన్నుడనియును, దయామయుడనియును వారు నమ్మరు. అజ్ఞానులు, అసమర్థులు అయిన యీ బద్ధజీవులయందు కేవలము ప్రేమచేత తన ఉన్నతస్థానమునుండి దిగి, ఈ జీవుల కందుబాటులోనికివచ్చి, తన అప్రాకృత మహత్వమునకు, పవిత్రతకు, భంగము లేకుండనే, వీరికి దర్శన స్పర్శన సంభాషణాది భాగ్యములను కలుగజేయుననియును, కలుగజేయగలడనియును నమ్మరు.

భగవంతుడే స్పష్టముగ "సంభవామి యుగే యుగే" అని చెప్పుచున్నను విశ్వసించరు. మాకు భగవద్గీతయే ప్రమాణ మందురు. కాని, ఇట్టి ఘట్టములలో మాత్రము, కప్పదాటు వేసి, ఈ మాటలు అర్జునుని కళ్ళనీళ్ళు తుడుచుటకు చెప్పిన ఓదార్పు వాక్యములు అని అందురు. బయటకు చెప్పరుగాని, అంతర్యములో వారి ఉద్దేశము గీతలోకూడ కొన్ని కొన్ని అసత్యములు ఉన్నవనియే. కానిచో ఇట్లెందులకందురు ? ఇక వారికి గీత ప్రమాణమెట్లగును ? వారి బుద్ధియే వారికి ప్రమాణము.

కొంతమంది "యద్దృశ్యం తన్నశ్యం" అన్న సూత్ర మును ఉదాహరణగా చెప్పి, ఏది కనిపించుచున్నదో, అది నశించునదే అని సిద్ధాంతీకరించి, కాబట్టి సగుణరూపము సత్యముకాదు అందురు.

కాని, పిడుగునకును, బీచునకును ఒకే మంత్రమన్నట్లు ఈ ఉదాహరణ పరమాత్మ విషయములో పనికిరాదు. ఇది కేవ లము ప్రాకృతవస్తుతత్త్వముల విషయముననేగాని, అప్రాకృత తత్త్వము విషయమునగాదు. అయితే, కొందరు మనస్సునకు ఏకాగ్రత కుదురుటకు ఏదో ఒక రూపమును నిర్ణయించుకొని ఆ రూపమునే సదా ధ్యానించుచుందురు. అట్టి రూపము భ్రాంతిమూలకమైనది. అయినను మానవుని ఉన్నతస్థాయికి తీసికొనిపోవుటకు అది సహాయకారి కాగలదు. కాని ఎప్పటి కైనను, మానవుడు ఆపద్ధతిని వదలిపెట్టవలసినదే. "యద్దృశ్యం

తస్నశ్యం" అను సూత్రము ఇట్టి రూపములకే వర్తించును. కాని, పరమాత్మ ధర్మసంస్థాపనార్థము అప్పుడప్పుడు ఈ లోకములోనికి వచ్చునప్పుడు ధరించు రూపములకుగాదు. అది నశించుటగాని, మార్పు చెందుటగాని లేదు. అయితే క్రొత్తగా వచ్చినట్లును, వయోధర్మము ననుసరించి మార్పు చెందుచున్నట్లును, చివరకు నశించినట్లును కనుపించిన కనుపించవచ్చును. అంతమాత్రముచేత అది ప్రాకృతరూప మనుటకు వీలులేదు. పరమాత్మ ఒక నటనకొరకు, తన మాయను జీవులపై ప్రయోగించి, అట్లు కన్పింపజేయును. ఆ భ్రాంతి మనకేగాని ఆ స్వరూపమునకుగాదు. కనుకనే తనయొక్క అవతారములు, కర్మలు, అన్నియును దివ్యములు అని ఈ శ్లోకములో చెప్పినాడు.

సాకార మనినంతమాత్రముచేతనే అన్నిరూపములును భ్రాంతిమూలకములని భావించరాదు. భగవంతుడు నిర్గుణుడు అనినప్పుడు ఈ ప్రాకృతగుణములు లేనివాడని ఎట్లు గ్రహించవలయునో, నిరాకారుడు అనినప్పుడుకూడ ఈప్రాకృత రూపము లేనివాడనియే గ్రహించవలయునుగాని అసలే రూపము లేనివాడని భావించరాదు. అసలే రూపము లేనివాడైనచో విశ్వరూపసందర్శనయోగములో అర్జునునకు రూప మెట్లు చూపించినాడు ? తనను నమ్మిన భక్తుని మోసగించుటకు

ఒక మాయారూపమును కల్పించి చూపినాడా? అట్లుగాదు. తన అవ్యయరూపమునే చూపినాడు.

అర్జునునకు కనుపించిన విశ్వరూపము ఎట్టిది? ప్రాకృతమా? అప్రాకృతమా? అజ్ఞానదృష్టికి గోచరించదగినదా? జ్ఞానదృష్టికి గోచరించదగినదా? అది జ్ఞానదృష్టికే గోచరించినది. జ్ఞానదృష్టికి ఎప్పుడును సత్యరూపమే గోచరించును. జ్ఞానదృష్టి ఎప్పటికిని భ్రమలకు వశపడదు. విశ్వరూపములో అర్జునుడు చూచినరూపముకూడ భ్రాంతి మూలకమే అని చెప్పినచో, దానిని చూచుటకు దివ్యదృష్టి కావలయునా? మనమందరమును ఈప్రాకృతదృశ్యములను దివ్యదృష్టిపొందియే చూచుచున్నామా? కాబట్టి మన బుద్ధికి మించిన విషయములనుకూడ మనవాసనలకు అనుకూలముగా త్రిప్పుటకు ప్రయత్నించక ప్రమాణగ్రంథములను, పెద్దలను విశ్వసించి తరించుట మంచిది.

అప్రాకృతబుద్ధికి పరమాత్మయొక్క యథార్థజ్ఞానము గోచరించునుగాని, అచ్చట భ్రాంతికి అవకాశములేదని చెప్పుటకు ఇంకొక ఉదాహరణము - ఈ అధ్యాయములోనే ముప్పది అయిదవ శ్లోకములో "యద్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ! యేనభూతాన్యశేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథోమయి" అనగా, "అర్జునా! ఆ జ్ఞానమును పొందిన తరువాత నీవు మరల ఇట్టి మోహమును పొందవు. ఆ జ్ఞానము

చేత సమస్తభూతములను నీయందును, అట్లే నాయందును చూడగలవు" అని చెప్పినాడు కృష్ణపరమాత్మ.

ఎట్టి జ్ఞానమును పొందిన తరువాత ? ఆ ముందుదైన ముప్పది నాల్గవశ్లోకములోనే "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యంతి తేజ్ఞానం, జ్ఞానిన స్తత్త్వదర్శినః" అనగా, "అట్టి జ్ఞానమును నీవు జ్ఞానసంపన్నులైనట్టియును, పరమాత్మ సాక్షాత్కారము గలిగినట్టియును మహాత్ముల సన్నిధికిపోయి, సాష్టాంగనమస్కారముచేతను, ప్రశ్నలువేయుటచేతను, సేవ చేయుటచేతను తెలిసికొనుము" అని చెప్పినాడు.

కృష్ణపరమాత్మ దృష్టిలో ఈ జ్ఞానమే పరిపూర్ణమైనది. ఇదియే జ్ఞానమునకు పరాకాష్ఠ. భ్రాంతిరహితమైనది. అప్రాకృతమైనది. దీనిని మించి జ్ఞానముండుటకు అవకాశము లేదు.

ఇట్టి భ్రాంతిరహితజ్ఞానమునకు ఏమిగోచరించునని చెప్పినాడు పరమాత్మ ? సగుణసాకారములే. అంతమాత్రమే గాక, పరమాత్మ, జీవులు, ఈ ప్రంపచము సర్వమును గోచరించునని చెప్పినాడు.

నిజముగ ఈ ప్రపంచము, జీవులు మిథ్యయే అయిన అవి ఎట్లు గోచరించును ? ఇట్టి అప్రాకృత జ్ఞానమునకు గోచరించునది తత్త్వత్రయమే. తత్త్వత్రయము అనుభవమునకు వచ్చిన జ్ఞానమే ఈ అప్రాకృత జ్ఞానము.

"నాయొక్క అవతారములు దివ్యములు" అని కృష్ణ

పరమాత్మ చెప్పుచున్నను, కృష్ణుడు బ్రహ్మముకాడు అను వాదమునకు కూడ లేశమైనను లేదు.

వారు జీవేశ్వరులు పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము లందురు. పరబ్రహ్మముయొక్క ప్రకృతిని రెండుభాగములు చేసినారు - ౧. మలినప్రకృతి. ౨. శుద్ధప్రకృతి అని. మలిన ప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము జీవుడనియును, శుద్ధప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మము యొక్క ప్రతిబింబము ఈశ్వరుడనియును చెప్పుదురు.

ఇది వారికి ఎచ్చట లభ్యమైనదోగాని మన మతకర్తలు ముగ్గురును ప్రమాణముగా స్వీకరించిన ప్రస్థానత్రయములో ఎచ్చటను లేదు.

ఇదియే సత్యమైనచో ప్రతిబింబములు చైతన్యము లెట్లగును ? జడములే కావలయును గదా !

జడములే అయినయెడల వానికి శాస్త్రములలో చెప్ప బడిన విహితానుష్ఠాన నిషిద్ధానుష్ఠానములును, వానిఫలము లగు సుఖదుఃఖానుభవములును ఎట్లు పొసగును ? జడముల కెచ్చటనైనను భోగము చెప్పబడినదా ?

అద్దమునందు మన ప్రతిబింబము కలుగుచున్నది. అద్దము కదలుటచేత ప్రతిబింబమునకు చలనాదులు సంభ వించుచున్నవి. కాని ఆ చలనాదులు దానికి అనుభవమునకు వచ్చుచున్నవా ? రావుగదా ! ఎందుచేత ? జడముగనుక.

ఇక వానికి ము క్తి అనగానేమి? అసలు ముక్తికలుగుట అనగానేమి ? ప్రకృతి సంబంధము పోవుటయా ? లేక ప్రకృతి పోవుటయా ? లేక ప్రతిబింబము పోవుటయా ? లేక బ్రహ్మమే పోవుటయా ?

బ్రహ్మము ఎప్పుడును పోదు; కదలదు; మెదలదు; ఏమియును చేయదు. దాని నాశ్రయించికొనియున్న ప్రకృతికిని భంగములేదు. ఈ రెండును ఉన్నంతకాలము ప్రతిబింబము తప్పదు. అది ఉన్నంతకాలము ముక్తియెట్లు ? అది యథా ప్రకారముగనే ఉన్నచో ఇంక ముక్తి అనగానేమి?

కాక ప్రతిబింబమునకు కారణమైన ప్రకృతి లేకుండ పోవలయునని అందురా ? కొంతవరకు అట్లు ఒప్పుకొన్నను, ప్రతిబింబమునకు కారణమైన వస్తువు పోవునప్పటికి ప్రతిబింబము నష్టమైపోవుచున్నదిగదా ! అద్దముపోయినచో మన ప్రతిబింబ మేమైపోవుచున్నది ? నశించిపోవుచున్నదిగదా ! అయితే స్వరూపనాశనమే ముక్తియా ?

కొందరిట్లు చెప్పుదురు - "ప్రతిబింబమున కాధారమైన ప్రకృతి ఎప్పుడును పోదుగాని, పరిశుద్ధ ప్రకృతిలోని ప్రతిబింబమును ఈశ్వరుడనియును, అపరిశుద్ధ ప్రకృతిలోని ప్రతిబింబమును జీవుడనియును శాస్త్రములు చెప్పుచున్నవి గనుక జీవుడు తన జీవత్వముపోయి ఈశ్వరుడు కావలయుననిన, తనకు కారణమైన ప్రకృతిని పరిశుద్ధము చేసికొనవలయును. అప్పుడు తానే ఈశ్వరుడగును" అని.

అయితే, వారి మతముప్రకారము ప్రకృతిలో ప్రతి బించిన ప్రతిబింబమే ఆ ప్రకృతిని బాగుచేసికొనవలయు గదా ! అది ఎట్లు పొసగును ? అది తెలియని విచారణాయో సచున్నది.

మనము ఒక మురికిఅద్దము వద్దకు పోయినప్పుడు దులో మన ప్రతిబింబము మురికిగానే కలుగుచున్నది. ప్రతిబింబము మురికిగాలేకుండ ఉండవలయునని అద్దమును తిబింబమే బాగుచేసికోవలయునా ?

ఇది ఏవిధమైన ఉపయోగమును లేని విచారణక్రింద ణమించును.

సరే, ఇక వీరిదృష్టిలో గీతబోధించిన కృష్ణుడు ఎవరు ? మా ? చేతనమా ? ఈశ్వరుడా ? లేక పరబ్రహ్మమా ?

కృష్ణపరమాత్మ జడమే అయిన, పరబ్రహ్మము కాక మున, ఇక మనము గీతకు విలువ ఈయవలసిన పనిలేదు.

అర్జునునితో తనను గురించి గీతలో ఎన్నోచోట్ల ప్పుకొనినాడు కృష్ణపరమాత్మ. ఎచ్చట చెప్పినను తానే బ్రహ్మమనియును, ఈ సర్వజగత్తునకును తానే మూలా రణము, ఆధారము అనియును, అందరికంటె తానే శ్రేష్ఠుడ యును, తనకంటె అధికుడుగాని, తనతో సమానుడుగ్గాని నియును చెప్పినాడేకాని, తాను పరబ్రహ్మము యొక్క

ప్రతిబింబమునని ఎచ్చటను చెప్పకొనలేదు. "అర్జునా ! సన్నిందుల కట్లు పొగడెదవోయీ ? నీవును నేనును గూడ అస్వతంత్రులమేనోయి ! మన యిద్దరను అదుపులో పెట్టి మన్నపై అధికారమును నిర్వహించువాడు పైన ఇంకొకడున్నాడు. వానిపేరే పరబ్రహ్మము.వాడు ఒక్కడు మాత్రమే ఈప్రకృతికి వశముకానివాడు. వాడు కదలడు; చలింపడు. ఇక నీవుగాని నేనుగాని ఈప్రకృతితరంగము లెటువిసిరిన అటు పోవువారమే. మనము వాని ప్రతిబింబములు మాత్రమే. మనకేమియు స్వాతంత్ర్యములేదు" అని ఏమైన చెప్పినాడా ? చెప్పలేదే!

నిజముగ తాను పరబ్రహ్మము యొక్క ప్రతిబింబమే అయిన యెడల అది తన గౌరవమునకు భంగకరమనియెంచి అట్లు చెప్పలేదా ? పోనీ, ఈ విషయము దశోపనిషత్తులలో గాని, బ్రహ్మసూత్రములలోగాని ఉన్నదా అని విచారించినను వానిలోకూడ ఎచ్చటను లేదు. కాబట్టి ఈ బింబ ప్రతిబింబ వాదన వట్టినిరాధారము, అప్రమాణము అయిన సిద్ధాంతమని తేలిపోయినది.

ఇక గీత ప్రమాణమనుకొనువారిదృష్టిలో కృష్ణపరమాత్మ పరబ్రహ్మమేగాని ప్రతిబింబముకాదు. ఈ జీవులు, జగత్తు మిథ్యకాదు; భ్రాంతికాదు. అంతమాత్రమేగాక పదునాల్గవ అధ్యాయము చివరిశ్లోకములో "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ

మమృతస్యావ్యయస్యచ. శాశ్వతస్యచ ధర్మస్య సుఖ స్యైకాంతికస్యచ" అనగా "అమృతస్వరూపుడును, అవ్యయుడు నైన నిరాకార పరబ్రహ్మమునకును, శాశ్వతధర్మవ నకును, మోక్షమునకును గూడ నేనే ఆధారుడను" అని కూడ చెప్పుకొని యున్నాడు.

"నా యొక్క జన్మలు కర్మలు దివ్యములైనవి అని తెలిసికొన్నవారు మోక్షమును పొందుదురు" అని చెప్పుటలో పరమాత్మయొక్క సగుణరూపము కల్పితము, భ్రాంతి మూలకము అన్న భావన ఉన్నంతకాలము మానవునకు ముక్తి లేదనియును, ఎప్పటికైనను పరమాత్మకు నామరూపములు, కల్యాణగుణములు, సత్యములని విశ్వసింపగలిగినజ్ఞానము - అనగా తత్త్వత్రయజ్ఞానము కలిగినప్పుడే ముక్తిలభించునని యును, కృష్ణపరమాత్మ అభిప్రాయము.

కాబట్టియే పన్నెండవ అధ్యాయములో అర్జునుడు సాకారనిరాకారోపాసకు లిద్దరిలో ఎవరు శ్రేష్ఠులు అని అడిగి నప్పుడు కూడ, సాకారోపాసకులే యోగమును బాగుగా తెలిసినవారిలో శ్రేష్ఠులు అని నా అభిప్రాయము అని నిస్సందేహముగ చెప్పినాడు.

ఈ విధముగ ఈ శ్లోకములో కృష్ణపరమాత్మ తన యొక్క సగుణరూప వైభవమును వర్ణించినాడు.

శ్లో॥ వీతరాగ భయక్రోధా
మన్మయా మా ముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా
పూతా మద్భావ మాగతాః॥ ౧౦

ప. వి :—వీతరాగభయక్రోధాః, మన్మయాః, మాం, ఉపాశ్రితాః, బహవః, జ్ఞానపతసా, పూతాః, మద్భావం, ఆగతాః.

టీక :—

వీత = పోగొట్టబడిన,
రాగ = అనురాగమును,
భయ = భయమును
క్రోధాః = కోపమును గలిగినవారును,
మన్మయాః = నాయందే యుండువారును,
మాం = నన్ను,
ఉపాశ్రితాః = ఆశ్రయించినవారును అగు,
బహవః = పెక్కుమంది సాధుపురుషులు,
జ్ఞానతపసా = జ్ఞానతపస్సుచేత,
పూతాః = పరిశుద్ధులై,
మద్భావం = మోక్షమును,
ఆగతాః = పొందిరి,

తా. రాగము, భయము, క్రోధము లేనట్టియును, నాయందే తన్మయులైనట్టియును, నన్నాశ్రయించియున్నట్టియును, పెక్కుమంది సాధు పురుషులు, జ్ఞానతపస్సుచేత పవిత్రులై నన్ను పొందియున్నారు.

అమృతవాహిని :-

రాగమనగా ఆసక్తి. భోగమునందుగాని, వ్యక్తియందుగాని, పదార్థమునందుగాని, కల అభిలాషనే రాగమందురు. భయమనగా - ఏవిధమైన దుఃఖముగాని, కష్టముగాని, అనర్థముగాని కలుగగలదను భావనచేత అంతఃకరణములో పుట్టు ఒకరకమైన సంచలన రూపవికారము. ఆ వికారమునే భయమందురు.

క్రోధమనగా, తనకు అపకారము చేసినవారియందుగాని, న్యాయమునకు విరుద్ధముగా ప్రవర్తించినవారియందుగాని, తన చిత్తవృత్తికి ప్రతికూలముగా ప్రవర్తించినవారియందుగాని కలుగు ఉద్రేకపూరితమైన అంతఃకరణవృత్తి. అట్టి అంతఃకరణవృత్తినే క్రోధమందురు.

ఈ మూడు వికారములును ఎంతమాత్రమును, ఎవరి అంతఃకరణములో లేవో, వారు వీతరాగభయక్రోధులు.

'మన్మయులు' అనగా- ఇది పరమాత్మ చెప్పినదికాబట్టి 'భగవన్మయులు' అని అర్థము. భగవంతునియందు అనన్యమైన ప్రేమ గలవారగుటచే, ఎప్పుడు, ఎక్కడ చూచినను, వారికి లోపల బయట భగవంతుడే. చేష్టలలో భగవంతుడు,

మాటలలో భగవంతుడు, ఆలోచనలో భగవంతుడు. "తత్ప్రాప్య, తదేవావలోకయతి, తదేవశ్రుణోతి, తదేవభాషయతి, తదేవ చింతయతి" అని నారదభగవానులు చెప్పిన విధముగా నుందురు. వారే భగవన్మయులు అని చెప్పబడుదురు. ఇక్కడ కృష్ణపరమాత్మ స్వయముగా చెప్పుచున్నాడుగాన, "మన్మయాః" అని చెప్పినాడు. అనగా ఎవరు భగవంతుని యొక్క జన్మలు, కర్మలు, గుణములు, లీలలు, దివ్యములుగా, యథార్థ స్వరూపమును తెలిసికొనగలిగినారో వారు ఇక భగవంతుని విడిచి ఎట్లుండగలరు ? వీరిని గురించియే తొమ్మిదవ అధ్యాయములోని "సతతం కీర్తయంతో మాం" అను పదునాల్గవ శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు, శ్రీమద్రామానుజులు "అత్యర్థం మత్ప్రియత్వేన, మత్కీర్తన యతన నమస్కారైర్వినా క్షణార్థమపి ప్రాణమలభమానాః" అని వర్ణించియున్నారు. అట్టివారు కేవలము భగవదాశ్రితులుగానే ఉందురు. కనుక వారినిగురించి "మా ముపాశ్రితాః" అనియును చెప్పియున్నాడు.

భగవంతుడు అమృతస్వరూపుడు. "మధురం మధురం మధురాధిపతే రఖిలం మధురం" అన్నట్లు, ఆయన మధుర స్వరూపుడు. అట్టివానిని ఏ కొంచెమైనను తెలిసికొనినవారు, ఆయనను వదలి ఒక్కక్షణమైనను ఎట్లుండగలరు ? బెల్లమును చీమలుపట్టుకొన్నట్లు, ఆయనను ఆశ్రయించి యుందురు. ఆయనను ఆశ్రయించి యుండుటలోనే వారికి, ఆనందము,

తృప్తి అపారముగానుండును. ఇక వారికేమియు, తమ కొరకు కర్తవ్యమని వేరుగ ఉండదు. అంతయును భగవంతుని కొరకే. వారేది చేసినను, ఏమి మాట్లాడినను, ఏమి ఆలోచించినను, గాలి పీల్చినను, జీవించినను, భగవంతునికొరకే. "నాస్త్యేవ తస్మిన్ తత్సుఖ సుఖిత్వం" అని, గోపికలవలె నుందురు. ప్రియతముని సుఖమే తమసుఖము. ఆయన ఆనందమే తమ ఆనందము. ఆయనతృప్తియే తమ తృప్తి. తమకని వేరుగ ఏమియును అక్కరలేదు. తమసుఖము, ఆనందము- వీనిని గూర్చిన స్పృహయే ఉండదు. ఇట్టివారే యథార్థ ప్రపన్నులు; యథార్థ జ్ఞానులు.

అట్టివారి శరణాగతిస్వరూప మెట్లుండుననగా, "ప్రభో! నేను నీవాడను. నీపాదముల మీద పడితిని. నన్ను నీ యిష్టము వచ్చినట్లు ఉపయోగించుకొనుము! నేను నీ చేతిలోని పరికరమును" అని సర్వార్పణము చేయుకొందురు.

ఈ మానవలోక సుఖముకొరకు భగవంతుని ఆశ్రయించువాడు అధమాధముడు. బ్రహ్మలోకపర్యంతమైన ఊర్ధ్వలోక సుఖముకొరకై కాశ్రయించువాడు అధముడు. మోక్షముకొరకై కాశ్రయించువాడు మధ్యముడు. భగవంతుని పొందుటలోనే తన కానందమున్నదని ఉండువాడు ఉత్తముడు. తన ఆనందము మీదను, సుఖము మీదను స్పృహయేలేక, భగవంతుని సేవించుచును, భగవంతుని ఆనందమే తన ఆనంద

ముగా, భగవంతుని సుఖమే తన సుఖముగా భావించుకొనీ, తన సంకల్పము కూడ లేకుండ, కేవలము పరమాత్మచేతిలో ఒక పరికరముగా నున్నవాడు ఉత్తమోత్తముడు.

ఇట్టివారిని "జ్ఞానతపసా పూతా" అన్నాడు పరమాత్మ. "జ్ఞానతపస్సుచేత పవిత్రులైనవారు" అని అర్థము. భగవంతుని యందు అనన్యమైన భక్తిగల ప్రపన్నుల హృదయములలో భగవంతుడే స్వయముగా భగవత్తత్త్వ జ్ఞానాగ్నిని మహోజ్జ్వలముగా ప్రజ్వలింపజేయును. ఆ అగ్నితో వారి సర్వకర్మలును భస్మమైపోవును. పుణ్యము, పాపముకూడ భస్మమైపోయిన, ఇంక పరమపవిత్రముగాక మరేమి? వీరినిగురించియే ఈ అధ్యాయములోనే ముందు "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం" అని చెప్పబడినది.

"బహవో మద్భావమాగతాః" - "పెక్కుమంది నన్ను పొందుచున్నారు" అని - ఇది పన్నెండవ అధ్యాయములో రాబోవు "అహం సముద్ధర్తా" అను కృష్ణపరమాత్మ అభయమును ముందుగ సూచనచేయుచున్నది. ఇట్లు భగవంతుని ఆశ్రయించినవారి రక్షణభారము ఆయనదేకనుక, ఇక వారు భగవంతుని బలమైన మాయనుజూచి భయపడవలసినపని లేదు. ఈ మృత్యురూపమైన సంసారసముద్రమునుండి వీరిని భగవంతుడే స్వయముగా ఉద్ధరించును. కనుక, వారి ఉద్ధరణ విషయములో ఈషణ్మాత్రమైనను సందేహము ఉండదు.

ఆశ్రయించవలెనేకాని అందరును తరింతురు. కాక, తమ శక్తి సామర్థ్యములను నమ్ముకొని సంసారసముద్రమునీది, భగవంతునిదగ్గరకు తామే చేరుటకు ప్రయత్నించెడివారికి "క్లేశోఽధికతర స్తేషాం" అన్నట్లు, చాల కష్టములు సంభవించును. నూటికి - కాదు కోటికి - ఒక్కడు చేరగండో లేడో ! ఈభావమును వ్యక్తముచేయుటకే పరమాత్మ "నన్ను నమ్ముకొన్నవారు అట్లుకాదు; అందరును - ఒక్కరుకూడ బీరువోకుండ-నావద్దకురావలసినదే!" అనుభావమును సూచించుచు "బహవో మద్భావ మాగతాః" అన్నాడు.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజా మ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ ! సర్వశః ॥ ౧౧

ప. వి :— యే, యథా, మాం, ప్రపద్యన్తే, తాన్, తథా, ఏవ, భజామి, అహం, మమ, వర్త్మ, అనువర్తన్తే, మనుష్యాః, పార్థ, సర్వశః -

టీక :—

హేపార్థ ! = ఓ అర్జునా !
యే = ఎవ్వరు,
యథా = ఏప్రకారముగా (ఏభావముతో),
మాం = నన్ను,



ప్రపద్యన్తే = భజించుచున్నారో,
తాన్ = వారలను,
తథైవ = ఆప్రకారమే,
అహం = నేను,
భజామి = భజించుచున్నాను,
మనుష్యాః = మనుష్యులు,
మమ = నాయొక్క,
వర్త్మ = మార్గమునే,
సర్వశః = అన్నివిధములచేతను,
అనువర్తన్తే = అనుసరించుచున్నారు.

తా. అర్జునా! ఎవరు నన్నెట్లు భజింతురో, నేను కూడ వారిని అట్లే భజింతును. మానవులు అన్నివిధములను నామార్గమునే అనుసరించుచున్నారు,

అ మృ త వా హి ని :—

"అర్జునా! ఎవరు నన్నెట్లు భజించిన, వారిని నేనట్లే అనుగ్రహింతును" అని అభయహస్త మిచ్చుచున్నాడు కృష్ణపరమాత్మ.

ఈ విషయమునే కొంచెము విపులముగా ఏడవ అధ్యాయములో చెప్పినాడు. "ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!" "ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని భక్తులలో నాలుగు తరగతులు గలవు. ఆపదల నివారణార్థము నన్ను భజించినయెడల, ఆ ఆపదలనే నివారణమొనర్తును. జిజ్ఞాసు

వులు జ్ఞానము నభిలషించి భజించెదరు. వారికి యథార్థ తత్త్వజ్ఞానమును ప్రసాదింతును. అర్థార్థులు ఇహలోకపరలోక భోగములు కావలయునని భజింతురు. వారికి వారి వారి మనోరథములను ప్రసాదింతును. జ్ఞాని: ఈయనకు నాయను గ్రహముచే యథార్థతత్త్వమంతయును కరతలామలకమువలె నుండుటచే, భ్రమాత్మక దృష్టి నశించినది. కనుక మనోగత కామములన్నియును, ఆ జ్ఞానాగ్నిలో దూదిపింజెలవలె భస్మ మైపోయినవి. దేనియందును కాంక్షలు లేకపోవుటచే, ఆతని దృష్టిలో ఆపదలు, అనర్థములు లేనేలేవు. జ్ఞానము కరతలా మలకమగుటచే, జిజ్ఞాసుదశ దాటిపోయినది. బ్రహ్మాదిలోక పర్యంతమైన భోగములందున్నైతము, వమనాన్నమునందువలె వైరాగ్యము కలుగుటచే, అర్థార్థిత్వము అడుగంటిపోయినది. ఇక మిగిలినది భగవంతుడనైన నేనే. సర్వకాలసర్వావస్థల యందును, భక్తిరసామృత మహాంబుధిలో, వ్యక్తిత్వమును కూడ పోగొట్టుకొని నాతో ఆడుకొనుచు, పాడుకొనుచు ఉండుటయే. ఇతనికి ఈ స్థితియే శాశ్వతముగా అనుగ్ర హింతును. ఎవరు ఎట్లు భజించిన వారిని అట్లే అనుగ్ర హింతును.

ఇంకొకవిధముగకూడ విచారణ చేయవచ్చును:

భగవంతుని అనన్యభక్తులే భగవంతుని వారి వారి మనోభావముల ననుసరించి, అభిరుచిని అనుసరించి, అనేక ప్రకారములుగ భజింతురు. అందరును పరిపూర్ణ భక్తులే.

అందరకును యథార్థజ్ఞానమున్నది. అయినను, వారి వారి నుండి వేరు వేరు ప్రకారములుగా భజనము పైకి విజృంభించు చున్నది. కాని వారి హృదయములలో భేదభావము మాత్రము లేదు.

కొంతమంది భగవంతుని విష్ణుస్వరూపముగా భజింతురు. కొంతమంది రామరూపమున, కొంతమంది కృష్ణ రూపమున, కొంతమంది నారసింహరూపమున భజింతురు. వారికి అట్లే దర్శనమిచ్చి అనుగ్రహించును. ఈవిధమునగాక ఇంకొకవిధమైన భేదములుకూడ గలవు. ఇవి నారద భగవానులు భక్తిసూత్రములలో చెప్పియున్నారు-"గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాన్తాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయాసక్తి, పరమవిరహాసక్తి, రూపైకధాప్యేకాదశధా భవతి" అని.

౧. భగవంతుని గుణములయందును, మహిమలయందునుగల ప్రేమ, ౨. ఆయనయొక్క అప్రాకృత దివ్య మంగళ స్వరూపసౌందర్యమునందు ప్రేమ, ౩. ఆయనను పూజించుటయందు ప్రేమ, ౪. ఆయనను స్మరించుటయందు ప్రేమ, ౫. ఆయనకు దాస్యము చేయుటయందు ప్రేమ, ౬. ఆయనతో సఖ్యముచేయుటయందు ప్రేమ, ౭. ఆయనను చిన్నబిడ్డనువలె భావించి సేవచేయుటయందు ప్రేమ, ౮. ఆయనకు భార్యగ నుండుటయందు ప్రేమ, ౯. ఆయనకు

సర్వార్పణము చేసికొనుటయందు ప్రేమ, ౧౦. తన్మయత్వము నందు ప్రేమ, ౧౧. ఆయనతో అర్ధక్షణముకూడ వియోగమును సహించలేకపోవుటయందు ప్రేమ.

ఇన్ని విధములలో ఏవిధముగ భజించినవారినైనను, వారి భజన ప్రక్రియకు అనుగుణముగ అనుగ్రహించును.

ఈ శ్లోకములో అట్టి అనన్యభక్తులయందు భగవంతుని కున్న గౌరవాతిశయముకూడ కనిపించుచున్నది - "భజామ్యహం" అని ప్రయోగింపబడియున్నది. భగవంతుడు కూడ భక్తులను భజించునట! భగవంతునికి భక్తులయం దెట్టి ప్రేమ! ఎట్టివాత్సల్యము ! ఎంతగౌరవము ! అన్నికల్యాణగుణములతో పాటు, ఇవియును అపారములు, అనంతములే. భక్తులయందు తనకెంత మహోత్కృష్ట గౌరవమున్నదో, ఉద్ధవునితో కృష్ణ పరమాత్మ చెప్పిన ఈ వాక్యములవలన గ్రహింపవచ్చును.

"నతథా మే ప్రియతమ ఆత్మయోని ర్నశంకరః
నచ సంకర్షణో నశ్రీ ర్నై వాత్మాచ యథాభవాన్
నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్
అనువ్రజామ్యహం నిత్యం - పూయేయే త్యంఘ్రిరేణుభిః"॥
(శ్రీభాగవతము)

"ఉద్ధవా ! నీవంటిభక్తులు నాకు ఎంతప్రియతములో అంతగ బ్రహ్మ, శంకరుడు, బలరాముడు; లక్ష్మి - వీరుకూడ ప్రియతములుకారు. చివరకు నామీద నాకుకూడ అంత

ప్రేమ లేదు. ఎంతమాత్రమును కాంక్షలు లేనట్టియును, మును లును, శాంతులును, వైరభావము లేనివారును, సర్వత్ర సమ దర్శులును అయిన ఇట్టిమహాత్ముల పాదధూళిచేత, నన్ను నేను పావనమొనర్చుకొనుటకై వెంటతిరుగుచుందును"

పాదధూళియే శిరస్సున ధరించెదనన్న వానికి, భజించెద ననుటలో నాశ్చర్యమేమున్నది? అది ఆయనకు భక్తుల యందున్న అపారకరుణకు చిహ్నము.

"మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః" పూర్తిగ ఇదేపాదము మూడవ అధ్యాయములోని ఇరువది మూడవ శ్లోకముయొక్క ఉత్తరభాగముగా, ఏమియును మార్పులేకుండ నున్నది. అక్కడి సందర్భము వేరుగాని, ఇట్టిదే. అక్కడ "నేను కర్మలు చేయకపోయినయెడల, మాన వులు నన్నే అనుసరించి చెడిపోదురు" అని. ఇక్కడ "నేను నాభక్తులను ఇంతగ ప్రేమించుటచేత, మనుష్యులు కూడ పరస్పరము ప్రేమించుకొని బాగుపడుదురు" అని.

ఇంకొక విధమునకూడ విచారణ చేయవచ్చును - "మానవులు అన్నివిధములను, నామార్గమునే అనుసరించు చున్నారు" అనగా, లోకములో ఎన్ని మతములున్నవో, ఎన్ని సంప్రదాయములున్నవో, అన్నియును భగవంతుని పొందు టకై ఏర్పరుపబడిన మార్గములే. ఇంతియుకాక, అన్యదేవతల

నారాధించువారుకూడ భగవంతుని ఆరాధించువారే అగు చున్నారు - ఆయా దేవతలందరును భగవంతునికి అవయవ భూతులే కనుక. కాని, ఆయా దేవతల నారాధించువారికి ఆ జ్ఞానము లేక, ప్రత్యేకముగా ఆయా దేవతలకే పరత్వమిచ్చు చున్నారు. ఆ కారణమున ఆ ఆరాధనము అవిధిపూర్వకమైనది- అనగా అక్రమమైనది. ఈ విషయమే తొమ్మిదవ అధ్యాయములో ఇరువదిమూడవ శ్లోకములో చెప్పబడినది.

అ వ తా రి క :-

అయిన మొదల ముక్తికొరకు సర్వులును నిన్ను భజించవచ్చునుగదా! అటుల ఏల భజించుటలేదు అనినచో, సమాధానము చెప్పుచున్నాడు :-

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం
యజన్త ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే
సిద్ధిర్భవతి కర్మజా॥ ౧౨

ప. వి :—కాంక్షన్తః, కర్మణాం, సిద్ధిం, యజన్త, ఇహ, దేవతాః, క్షిప్రం, హి, మానుషే, లోకే, సిద్ధిః, భవతి, కర్మజా.

టీక :—

ఇహ = ఈ భూలోకమందు,
కర్మణాం = కర్మములయొక్క,
సిద్ధిం = ఫలసిద్ధిని,

కాంక్షన్తః = అపేక్షించువారు,
దేవతాః = ఇంద్రాది దేవతలనుగూర్చి,
యజన్త = ఆరాధించుచున్నారు,
హి = కారణమేమనగా,
మానుషేలోకే = ఈ మానవలోకమందు,
కర్మజా = కర్మవలన గలిగెడి,
సిద్ధిః = ఫలము,
క్షిప్రం = శీఘ్రముగా,
భవతి = అగుచున్నది.

తా. కర్మఫలమునందు ఆసక్తిగలవారు, కర్మలయొక్క సిద్ధిని కోరినవారై, ఈలోకమున దేవతల నారాధించుచున్నారు. కారణమేమనగా మానవలోకమునందు కర్మఫలము శీఘ్రముగా లభించుచున్నది.

అ మృ త వా హి ని :-

ఈ శ్లోకములో ప్రస్తావించిన విషయమే, ఏడవ అధ్యాయములో మరల విచారణ చేయబడినది. మానవులలో అధికసంఖ్యాకులు విషయోపభోగములయందు కాంక్షలు గలిగి యుందురు. ఈ విషయోపభోగములు దేవతలిచ్చెదరని వారికి బాగుగ నమ్మకము. శాస్త్రజ్ఞానముచేత విషయోపభోగములు శాశ్వతములు కావనియును, శాశ్వతబ్రహ్మానందానుభవము నకు భోగకాంక్ష ప్రతిబంధకము అనియును తెలిసినను, అనాదికాలసంబంధముచే పెరిగి వచ్చుచున్న పాపసంస్కార,

ములు మనస్సును విషయాసక్తముగజేసి విషయోపభోగముల వైపునకే ఈడ్చును. సామాన్యమానవులందరును ఆ సంస్కారములకే లోబడి అటువైపునకే పోదురు. కనుకనే, "మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్ యతతి సిద్ధయే యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" అని చెప్పబడినది.

ఈ కారణమున ఇక్కడ పుత్త్రులను, భార్యను, ఐశ్వర్యమును కోరియో, స్వర్గాది ఊర్ధ్వలోక సుఖములను కోరియో, మానవులలో చాలమంది ఇంద్రాదిదేవతలను ఆరాధింతురు. కాంక్షలయొక్క ప్రభావము అట్టిది.

"కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్య దేవతాః" అని ఏడవ అధ్యాయములో చెప్పబడినది. విషయము తెలిసినను, అంతమాత్రము చాలదు. కాంక్షలు పోయినగాని భగవంతుని భజించలేరు. "ఇహ మానుషే లోకే" అనుటచేత కర్మచేయుటకు ఒక్క మానవజన్మలోనే అధికారముగలదని ధ్వనించుచున్నది.

కాంక్షలతో కూడియున్నవారు ఇతర దేవతల నారాధించుటకు ఇంకొక ప్రబలకారణముకూడ గలదు. ఇతర దేవతలు సర్వజ్ఞులు కాకపోవుటచేత, తమను ఉపాసనచేయు వారికి వారి కోరికప్రకారము ఫలమిచ్చినయెడల వారికి అది హితమా అహితమా అని ఆలోచించలేరు. వారు కోరిన కోరికకు తగినకర్మ, సక్రమముగా చేసిరా లేదా అని మాత్రమే

చూతురు. కర్మ సక్రమముగా జేసినయెడల ఫలమిత్తురు. ఆ ఫలముయొక్క ఫలము కోరినవారే అనుభవించవలయును, తమ కేమియును సంబంధములేదు అన్నట్లుందురు. మరి భగవంతు డట్లుకాదు. తన భక్తులవిషయములో వారి హితాహితములు విచారించునుగాని, వారు ఏదికోరిన అది ప్రసాదించడు. భక్తుల యథార్థ హితాహితముల నాలోచించి ఫలమును ప్రసాదించును. ఒకవేళ భక్తుడు సకామభావముతో భగవంతుని భజించినయెడల, ఆ కామము నెరవేర్చినచో దానివలన భక్తునకు నెమ్మదినెమ్మదిగ వైరాగ్యముగలిగి భగవంతునిమీది ప్రేమ వృద్ధిపొందుట కవకాశమున్నయెడల ఆ కామమును నేరవేర్చును. పోనీ, వైరాగ్యమునకును, ప్రేమకును ప్రతిబంధకము కాకుండనైనను ఉండవలయును గదా! ప్రతిబంధకమగునెడల వారెంత ఉపాసనచేసినను, ఎంతప్రార్థించినను, అహితమైన ఫలమును మాత్రము ఈయడు. కనుక, ఇంతదూరమాలోచించలేని మందబుద్ధులైన సాంసారిక ప్రజలు, భగవంతుని భజించక ఇతర దేవతలనే భజింతురు.

ఇంకొక రహస్యముగూడ గలదు. ఇంద్రాది ఇతర దేవతలను ఉపాసనజేసి ఫలములను పొందుటకు కర్మ సక్రమముగా నెరవేర్చగలిగితిమా లేదా అని మాత్రము చూచిన చాలును. భావము పరిశుద్ధమగుటగాని, కామక్రోధాది దుర్గుణములు పూర్తిగ నశించుటగాని అవసరములేదు. కర్మ

సక్రమముగా జరిగిన చాలును. దేవతలు ఫలమును ప్రసాదింతురు. భగవంతు డట్లుకాదు. ఆయన అనుగ్రహమును పొందవలయుననిన, బాహ్యకర్మకాదు కారణము - భావశుద్ధి. 'భావగ్రాహీ జనార్దనః' అని యున్నదిగదా! భావపరిశుద్ధిలేని దేహ్యమునకు కర్మ ఎంత సక్రమముగ జరిగినను ఫలము రాదు. భావపరిశుద్ధి కలిగిననాడు, ఏ ప్రబలకారణముల చేతనైనను బాహ్యమునకు కర్మ సక్రమముగా జరుపలేక పోయినను, కర్మ పూర్తికాకపోయినను, పూర్తిఫలమును పొందుటలో ఎంతమాత్రమును సందేహము లేదు. సామాన్య సాంసారికప్రజలు శారీరకముగ ఎంతకష్టమైన పడగలరుగాని మానసికముగా కొద్దికష్టముకూడ పడలేరు. అనగా, కాంక్షలు పోగొట్టుకొనుటకు మాత్రము ఈషణ్మాత్రమైనను శ్రమపడలేరు. ఈ కారణముచే, భగవంతునివైపు వారి చిత్తములు పోవు. ఇతర దేవతలనే ఆశ్రయించుటకు పరుగులెత్తుచుండును.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మ విభాగశః ।
తస్య కర్తార మపి మాం
విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥ ౧౩

ప. వి :—చాతుర్వర్ణ్యం, మయా, సృష్టం, గుణకర్మవిభాగశః, తస్య, కర్తారం, అపి, మాం, విద్ధి, అకర్తారం, అవ్యయమ్.

టీక :—

చాతుర్వర్ణ్యం = నాలుగువర్ణముల వ్యవస్థయు,
మయా = నాచేత,
గుణ కర్మ విభాగశః = గుణములయొక్కయును, కర్మల యొక్కయును విభజననుబట్టి,
సృష్టం = సృజింపబడినది,
తస్య = ఆ సృష్టికి,
కర్తారం అపి = కర్తనైనను,
మాం = నన్ను,
అకర్తారం = కర్త కానివానినిగను,
అవ్యయం = నాశనము లేనివానినిగను,
విద్ధి = తెలిసికొనుము !

తా. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులను ఈ నాలుగు వర్ణముల వ్యవస్థను గుణకర్మవిభాగముననుసరించి నేనే సృష్టించితిని. కనుక దానికి నేనే కర్తనైనను, నన్ను అకర్తగను, అవ్యయునిగను తెలిసికొనుము.

అమృతవాహిని :—

జీవుడు అనాది కాలమునుండియును అనేక జన్మలనెత్తి యున్నాడు. ఆ జన్మలన్నిటిలోను, అపారముగ కర్మ చేసి యున్నాడు. ఆ చేసినకర్మను ప్రతిజన్మలోను కొంతకొంత అనుభవించుచున్నాడు. అనుభవించినదానికంటె అత్యధికముగా ప్రతిజన్మలోను మరల కర్మ చేయుచున్నాడు. ఇట్లు అనుభవించబడిన కర్మకంటె చేయబడుచుండు కర్మ మిక్కుట

మగుచుండుటచే, వ్యయముకంటె సంపాదన ఎక్కువగు చుండుటచే, కర్మ పర్వతమువలె నిలువయుండును. ఆ కర్మ సత్త్వరజస్తమోగుణములయొక్క హెచ్చుతగ్గుపాళ్ళతో కూడుకొని యుండును. పరమాత్మ సృష్టిసమయములో, జీవుని కర్మలోని గుణములననుసరించి, జీవుని బ్రాహ్మణాది జన్మలలో పుట్టించుచుండును. దీనిని గుణకర్మ విభాగమందురు.

ఈ పద్ధతిలో వర్ణవ్యవస్థ జగత్తులో నడచిపోవుచున్నది. ఒకేవర్ణములోని స్త్రీ పురుషుల సంయోగముచేత సంతానము గనుట ధర్మశాస్త్ర పద్ధతిని సమంజసము. ఇట్లు జరుగుచున్నంత కాలము వర్ణశుద్ధి జాగ్రత్తగ రక్షింపబడుచుండును. కాని, మానవులలో పారమార్థికదృష్టికి ప్రాధాన్యము తగ్గిననాడు, వారి విచారణ పద్ధతియే వేరుగానుండును. ఏపని చేసినను ఐహికముగ దీనిచేత నేమిప్రయోజనము, ఎంతప్రయోజనము, అని మాత్రమే విచారింతురు. పారమార్థికదృష్టి సన్నగిల్లి, ఐహికదృష్టికి ప్రాధాన్యము పెరుగుచున్నకొలదిని, పారమార్థిక దృష్టితో ఏర్పాటుచేయబడిన ధర్మములు, అర్థముకావు. అనవసరముగనో, తెలివితక్కువగనో, లేకపోయిన తమ స్వార్థపూరణమునకో, తమ ఆధిక్యముకొరకో, ఏర్పాటు చేసికొన్నవిగా తోచును. కనుక, సాత్త్వికముగనో, దౌర్జన్యముగనో, సంస్కరణ ప్రారంభింతురు. వారికే సంఘములో బలమబ్బినకొలదిని, పారమార్థికదృష్టిగలవారు ఎంతగోలచేసినను ఎవరును వినరు. వివాహములు వర్ణాంతరములలో చేసికొనిన

నష్టమేమి అని ప్రారంభము. దానితో వర్ణసంకర సంతానము కలుగును. వర్ణశుద్ధికి హానికలుగును. కేవలము ఈ దృష్టియే ప్రబలిననాడు సంతానము కనుటకు వివాహ మెందులకు ? వివాహము జరుగనియెడల సంతానము కలుగదా ? ఎవరికి ఎవరియందు ప్రేమకలిగిన, వారు వారు భార్యాభర్తలుగ నుండవచ్చును - ఇట్టి విచారణ బలమగును. తరువాత సంతానము కలుగుటయు, కామతృప్తియు ప్రధానముగాని, ఒక స్త్రీ ఒక పురుషునితోనే ఉండవలయునను నియమ మెందులకు ? ఇది అర్థము లేని కట్టుబాటు అను సిద్ధాంతము బయలు దేరును. ఈ విధముగా ధర్మము ఎన్నెన్ని బోల్తాలుకొట్టునో ఎవరికి తెలియును ? అన్ని శాఖలలోను ఇట్లే విచారణ సాగును. నెత్తిని నోరుపెట్టుకొని ఎవరు ఎంత మొత్తుకొన్నను విను వారుండరు. వాతావరణమునకు లొంగిపోయెడి దుర్బలహృదయు లందరును, తమ తమ అంతఃకరణములను చంపుకొని ఐహికము లైన ఇబ్బందులను తట్టుకొనలేక ఈ మార్గముననే వత్తురు. పట్టువలగలవారు ఏ అడవులకో, కొండలకోపోయి, ఏమియును చేయలేక, జగత్తునుచూచి ఊరుకొనలేక పరమాత్మనుగూర్చి మొరపెట్టుకొనుచు, ప్రారబ్ధకర్మ తీరిపోగానే ఈ భౌతికశరీర మును ఎక్కడనో ఒకచోట వదలిపెట్టి, వారి గతికొలదిని వారు పోదురు.

ఇప్పుడు అరణ్యములలోను, కొండలలోనుగూడ స్వేచ్ఛగనుండుటకు వీలులేనిస్థితి ఏర్పడినది. ఇట్టి స్థితియే

ంతుని అవతారమునకు తగినసమయము. ఆయన
మే మరల ధర్మసంస్థాపనము చేయవలయును; చేయును
ఆయన ధర్మసంస్థాపనములో ఈ చాతుర్వర్ణ్యవ్యవస్థ
ప్రధానమైనది అని ఈ శ్లోకములో చెప్పబడినది. మానవ
ములో ఈ చాతుర్వర్ణ్యవ్యవస్థ ప్రధానమైనది గనుక
క చెప్పియున్నాడు. కాని, దీనిని ఉపలక్షణముగా తీసి
ఇంకను జీవునియొక్క దేవ పితృ పశుపక్ష్యాది సమస్త
కు యీ గుణకర్మవిభాగమే కారణమని గ్రహించవల
. ఈ సృష్టి అంతయును భగవంతుడే చేయుచున్నాడు.
ఆయనలో విషమదృష్టి లేకపోవుటచే ఈ కర్తృత్వము
ను అంటుటలేదు. కావున ఆయన అకర్తయే.

మన భారతదేశములో ప్రస్తుతము ఈ వర్ణవ్యవస్థ ఒక
మస్యగా బయలుదేరి ప్రతివారి హృదయములోను ఒక
ందోళన కలిగించుచున్నది. మేము శాస్త్రములను
ము అనువారు, ఈ వర్ణవ్యవస్థ మానవులలో మానవులు
టు చేసికొన్నదేగాని, పరమాత్మ ఏర్పాటు చేయలే
, కాబట్టి, దేశకాలానుగుణముగా దాని స్వరూపమును
ర్చుటయో, లేక పూర్తిగా తీసివేయుటయో చేయవచ్చు
, చేయవలయుననియు అనుచున్నారు.

ఇక శాస్త్రములను నమ్మనము అను వారి విషయము.
వీరిలో రెండురకములవారు కలరు.

శాస్త్రములను నమ్మమందురు; శాస్త్రములే మాకు ప్రమాణము అందురు. కాని, వారికి నచ్చిన విషయములు మాత్రము నమ్మెదరు; నచ్చనివి త్రోసివేయుదురు.

దీనికి కారణము, వారాచరించు ఆచారములు ఒక అలవాటు చొప్పున ఆచరింతురేగాని, నిజముగా పరమార్థము కొరకుగాదు. వారి కుటుంబములో పరంపరగా వచ్చుచున్న ఆచారములు కొన్ని శాస్త్రవిరుద్ధములైనవిగూడ ఆచరించుట కును, మొదటినుండియు ఆచారము లేనివి శాస్త్రములకు అను కూలములైనవానినిగూడ ఆచరించకపోవుటకును ఇదియే కార ణము. కాబట్టియే ఆచారములు తప్పరాదని పైకి ఉపన్యా సము లిచ్చుచు, పూటకూళ్ళలో తినుచుండుట, శాస్త్రసమ్మ తముగా నడుచుకొను నిజమైన అనుష్ఠానపరులనుకూడ తమ పంక్తికి రానీయకపోవుట, తమకుమాళ్ళుగాని, దగ్గర దేహ బంధువులుగాని, లేక మొగమోటమి కలవారుగాని యైనచో ప్రతిచోటను ప్రతివారితోడను తిని తిరుగువారినైనను సరియే, తమపంక్తిని కూర్చుండబెట్టుకొని భుజించుట చేయుచుందురు. వీరికి తాము అనుష్ఠానపరులని ప్రజలు అనుకొనుచుండిన చాలును. వీరుచేయు అనాచారములు ప్రజలు చూడకుండిన చాలును. పైన భగవంతుడు చూచుచున్నాడను భీతి వీరి కుండదు. మన పూర్వులు, ఇట్టివారికే 'ఆస్తికనాస్తికులు' అని పేరుపెట్టినారు. అనగా, ఆస్తికులవలె పైకినటించుచు, నాస్తి

కుల వలె శాస్త్రములకు విరుద్ధముగా ప్రవర్తించువారు. వీరి వలననే ధర్మప్రచారమునకు ఎక్కువ ప్రమాదము.

వీరును వర్ణవ్యవస్థ ఉండితీరవలయును అని చెప్పు దురు. కాని, ఈ వర్ణవ్యవస్థ ఎట్లు ఏర్పడినది అనుప్రశ్న వచ్చు నప్పటికి, శాస్త్రములకు కొంచెము భేదముగానే సిద్ధాంతము చేయుచున్నారు.

ఇక రెండవవారు: వీరు శాస్త్రములే మాకు ప్రమాణ మందురు. తమకు నచ్చినను నచ్చకపోయినను, ఆ శాస్త్రము లలో చెప్పినదే సత్యమని విశ్వసించి దాని ప్రకారము నడచు కొనుటకు ప్రయత్నించువారు.

వీరు తమ భావములను బయటకు ప్రచారము చేయుటకు ఇప్పటి వాతావరణమునకు జంకియును, ప్రభుత్వాదరణము లేకను లోలోపల ఆవేదనతో బాధలు పడుచున్నారు.

ఇక వర్ణవ్యవస్థ మానవులు తమలోతామే ఏర్పాటు చేసికొనినారు అనువారు చెప్పునదేమనగా, "గుణకర్మ విభాగశః" అని గీతలో ఉన్నది కాబట్టి, మానవుని గుణములనుబట్టియును, చేయబడునట్టి కర్మలను బట్టియును వర్ణములు ఏర్పడినవి. కనుక సత్త్వగుణము గలవాడే బ్రాహ్మణుడు. పాళ్ళకలయిక భేదములనుబట్టి, రాజస తామస గుణములు గలవాడే ఛండా లుడు. ఈ విధముగ నిర్ణయించవలయునే గాని ఎవడును

పుట్టుకతో బ్రాహ్మణుడుగాని, శూద్రుడుగాని, ఛండాలుడు గాని కాడు అని.

అవును; నిజమే; గుణకర్మలనుబట్టియే వర్ణ వ్యవస్థ ఏర్పడినది. కాదని ఎవరనగలరు? ఎవరును అనలేరు. అయితే, బోధనలో సౌకర్యముకొరకు వారి నొకవిధముగ ప్రశ్నించుచున్నాము -

ఒక మానవుని గుణమునుబట్టి జాతిని నిర్ణయించుటకు ముందు వాని గుణమును పరిశీలించవలయునుగదా! ఎట్లు పరిశీలించుట? ఒకరిమాట అటుంచి కేవలము తన మనస్సు లోనే ఏ సమయములో ఏగుణము పనిచేయుచున్నదో తెలిసి కొనలేడే మానవుడు! ఇక ఇతరుల హృదయములలో దూరి వారికి ఏ యే గుణములు పనిచేయుచున్నవో చూడగలడా?

ప్రతి మానవునకును-మానవునకేమి-ప్రతిజీవికిని సత్త్వ రజస్తమోగుణములు మూడును సర్వదా 'గస్తీ' తిరుగుచుండును. వారి వారి మానసిక స్వభావములనుబట్టి, ఒక్కొక్క-గుణము పనిచేయుకాలము ఎక్కువ తక్కువలు గలదిగ ఉండును. కేవలము స్థితప్రజ్ఞులైన మహాత్ములకు తప్ప - నూటికి నూరు మందికికూడ ఇట్లే జరుగుచుండును. ఇది కొంచెము సూక్ష్మ ముగ విచారించుకొగలిగినవారికి మాత్రమే తెలియును. ఏ గుణమైనను తీవ్రముగా ప్రకోపించినప్పుడు మాత్రమే సామాన్యులు తెలిసికొనగలరు.

ఒకడు తన కుమార్తెను ఒక బ్రాహ్మణునకిచ్చి వివాహము చేయ సంకల్పించుకొని, బ్రాహ్మణుడు ఎవరా అని ఆలోచించుకొని, చివరకు సత్త్వగుణప్రధానుడు అని ఒకనిని నిర్ణయించుకొని, ఆతనిని తీసికొనివచ్చి పెండ్లిపీటలమీద కూర్చుండబెట్టెననుకొనుడు. తక్కిన తతంగమంతయును జరిపి, చివరకు మంగళసూత్రము కట్టించవలసిన సమయమునకు, ఏకారణముచేతనైనను పెండ్లికుమారునికి రజోగుణమో తమోగుణమో ప్రకోపించి, చికాకుపడు ననుకొనుడు! అప్పుడేమి చేయవలయును? ఆ పిల్లను వానికిచ్చి వివాహము చేయుటయా మానుటయా? లేక ఆ గుణములు పెండ్లికుమార్తెకే కలిగెననుకొనుడు! అప్పుడేమి చేయవలయును? కేవలము గుణములనుబట్టియే జాతిని నిర్ణయించుట ఎట్లు?

అయితే దీనికి మీరుమాత్ర మెట్లు చెప్పుదురు? గుణములను బట్టి వర్ణము లేర్పడినవని మీ రంగీకరింపరా అని వారు ప్రశ్నింపవచ్చును.

మేమును గుణములనుబట్టియే వర్ణములని అంగీకరింతుము. అయితే, దీనిలో వారికిని మాకును కొంచెము భేదమున్నది. గుణములనుబట్టియే నిర్ణయించినను, ఆ నిర్ణయముచేయు బాధ్యత, వారు మానవులమీద పెట్టినారు; మేము భగవంతుని మీద పెట్టినాము. భగవంతునిమీద మేము పెట్టుటేమి?

ఆయనయే స్వయముగా 'మయా సృష్టం' 'నేను సృష్టించి నాను' అని చెప్పినాడుగదా యీ శ్లోకములోనే! అట్లుకాదు, మానవులే ఏర్పాటుచేసినారు అని చెప్పుటకు ఆధారముగాని అధికారముగాని ఎవరికి గలదు?

ఇక ఆయనచేయు నిర్ణయము ఎట్లుండుననగా, ఎవనికి గాని ఈ జన్మలోని గుణములు ఈ జన్మలోనే అతని వర్ణమునకు కారణములుగావు. మానవుడు పుట్టి,జ్ఞానము గలిగినదిమొదలు చనిపోవువరకును వానిచేత చేయబడిన కర్మలను, వానిగుణము లను పరీక్షించి, భగవంతుడు మరుజన్మలో దానికి తగిన వర్ణములో పుట్టించును. పాఠశాలలోని విద్యార్థి సంవత్సరము పొడుగునను చదివిన విద్యనుబట్టి వచ్చిన అంకములనుబట్టి మరుసంవత్సరములో విద్యార్థిని ఉపాధ్యాయులు పైతరగతి లోనో, క్రిందితరగతిలోనో కూర్చుండబెట్టుదురుగాని, పిల్ల వాడు ఎంత తెలివిగలవాడైనను, సంవత్సరము పూర్తికానిదే పైతరగతిలో కూర్చుండబెట్టుటగాని, తెలివితక్కువవాడైనచో క్రిందితరగతిలో కూర్చుండబెట్టుటగాని చేయరుగదా! అట్లే పరమాత్మయును ఈ జీవులయొక్క ఈ జన్మలోని గుణములను బట్టి, ఈజన్మలోనే వర్ణముల నేర్పాటుచేయడు.

ఈ పద్ధతి పూర్వమునుండియును ఆచరణలో బాగుగ కనుపించుచున్నది, శ్రీరామచంద్రమూర్తిగాని, శ్రీకృష్ణ

పరమాత్మగాని, లేక ఇతరులైన మహాత్ములుగాని అవతరించి ధర్మప్రచారము చేయునప్పుడు కూడ, ఇట్లే జరిగినది.

ధర్మరాజువంటి సాత్త్వికపురుషుడు దాదపు ఋషులలో కూడ లేడని చెప్పినచో అతిశయోక్తికాదు. కేవలము ధర్మదేవతయొక్క అంశముచేత జనించిన మహాత్ముడు. అయినను సర్వులును ధర్మరాజును "ఓ రాజోత్తమా !" అని సంబోధించిరేగాని బ్రాహ్మణోత్తమా - అని ఎవరును సంబోధించలేదు. నిజముగ ఎవరికి సత్త్వగుణముండిన వాడే బ్రాహ్మణుడు, వర్ణములు పుట్టుకతో రాలేదు, గుణములవల్లనే వచ్చినవి అను పక్షములో, ధర్మరాజును బ్రాహ్మణుడనియే పేర్కొనవలయును. కాని, ఎవరును, ఏపురాణములోను, అట్లు పేర్కొనలేదు. వివాహాది వ్యవహారములలో క్షత్త్రియ జాతితోనే సంబంధము కలుపుకొనెనుగాని, ఎచ్చటను బ్రాహ్మణాది వర్ణములతో జరుపుకొనలేదు. ద్రోణాచార్యులు, అశ్వత్థామ మొదలైనవారు కొందరు అతిరాజసులు. అయినను వారిని బ్రాహ్మణోత్తములనియే వ్యవహరించెడివారు. చివరకు కృష్ణపరమాత్మకూడ అట్లే పిలిచినాడు. కారణమేమి ? విదురుడు గొప్పమహాత్ముడు. పరమసత్త్వగుణప్రధానుడు. అయినను వానిని సచ్ఛూద్రుడనిరేగాని, బ్రాహ్మణుడనలేదు. పవిత్రతలో బ్రాహ్మణసమానుడేగాని, యిచ్చిపుచ్చుకొను వివాహాది విషయములలో కాదు. విదురునకు శూద్రకన్యనే యిచ్చి వివాహముచేసిరికాని, బ్రాహ్మణకన్యనుగాని,క్షత్త్రియ

కన్యనుగాని యిచ్చి వివాహము చేయలేదు. దీనినిబట్టి ఈ జన్మలోని గుణములు ఈ జన్మలోని వర్ణమునకు కారణములు కావని రూఢి యగుచున్నది.

అయితే, పురాణములలో అక్కడక్కడ, కొంతమంది తపస్సుచేసి యీ జన్మలోనే వర్ణములు మార్చుకొనినట్లు కనుపించుచున్నదే అను సందేహము రావచ్చును. అవును నిజమే. అవి ప్రత్యేక పరిస్థితులు. పూర్వమైనను; ఎంతమంది క్షత్రియులుతపస్సు చేయలేదు? వారందరును బ్రాహ్మణులైరా? ఎవరో కొద్దిమందిమాత్రము తపస్సుచేసి, వరములను పొందినవారుమాత్రము అట్లు కాగలిగినారు. మిగిలినవారు ఎంత సత్త్వగుణప్రధానులైనను, పవిత్రతలో బ్రాహ్మణ సమానులైరిగాని, వర్ణములు మారలేదు.

ఇంకొక విషయము గమనింపవలయును. పురాణములలో చాలచోట్ల బ్రాహ్మణుడైనను కోపమున్నచో, ఛండాలునితో సమానుడు అనియును, ఛండాలుడైనను విష్ణుభక్తియున్నచో బ్రాహ్మణుడే అనియును ఉన్నది. దీని ప్రకారము చూసినను పుట్టుకనుబట్టియే వర్ణము ఏర్పడినదని రూఢియగుచున్నది.

అయితే, ఇక్కడ ఒక సందేహము కలుగుటకు అవకాశమున్నది. క్రిందటి జన్మలో సాత్త్వికకర్మలుచేసి సాత్త్విక గుణములు కలిగియున్నవాడే ఈ జన్మలో బ్రాహ్మణుడై

చెప్పుచున్నారు గదా ! అదే నిజమైనచో ఈజన్మలో
నుపించు బ్రాహ్మణులందరును పూర్వజన్మ సంస్కార
సత్వగుణప్రధానులుగనే ఉండవలయును. అట్లు
లేదే ! మహాకోపిష్ఠులుగను, రాజస తామస కర్మ
వారుగను కూడ ఉన్నారే ! ఈ జన్మలో కనుపించు
గాని, పంచములుగాని, రాజసతామస ప్రధానులుగనే
యును; అట్లు ఉండుటలేదు. వారలలో గూడ మహో
భావులు ఉన్నారు గదా ! ఇది ఎట్లు పొసగును ? అని.

కాని ఈ సందేహము వర్ణములు పుట్టుకనుబట్టి
సిద్ధాంతమునకు ఏమియును అనుకూలించదు.
సమాధానము చెప్పుకొనుట మంచిది.

శాస్త్రములు "నీవు సత్పుత్రుని గనుము" అని శాసించు
కలుగబోవు సంతానముయొక్క గుణముల మంచి
తల్లిదండ్రుల బాధ్యత ఏమున్నది ? బాధ్యత
మంచిసంతానమునుకనుమని శాస్త్రము ఎందులకు
చున్నది ? అని విచారించినచో అట్టి బాధ్యత తల్లి
కు ఉన్నది. అట్టి రహస్యములు తెలిసికొని ప్రవర్తించ
ను.

భార్యాభర్తలు కలియునప్పుడు తాత్కాలికముగ వారి
భావములనుబట్టియును, వారు కలియు వేళను
ను, కలుగబోవు సంతానమునకు బుద్ధులు, గుణములు

మారుచుండును. ఒక్క స్థితప్రజ్ఞునకు తప్ప ప్రతివారికీ సత్వరజస్తమోగుణములు గ్రస్తిరగుచుండునని చెప్పికొంటిమి గదా! భార్యాభర్తలు కలిసినప్పుడు గర్భమగుసమయములో ఏ కారణముచేతనైనను ఈ ఇరువురిలో ఎవరికైనను సత్వగుణమో, రజోగుణమో, తమోగుణమో ప్రకోపించినచో ఆ గుణముల యొక్క పాళ్ళభేదమునుబట్టి పుట్టబోవు శిశువునకు సత్వగుణమో,రజోగుణమో,తమోగుణమో సంక్రమించును. కాబట్టి, తక్కువ కులములో పుట్టినవారైనను, ఆదంపతులకు ఆసమయములో సత్వగుణము ప్రకోపించినచో ఆ పుట్టబోవు శిశువు మహాసాత్వికుడై యుండును.

ఈ విధముగానే అన్నివర్ణములలోను కూడ వారు కలిసిన కాలమునుబట్టికూడ జరుగును.

హిరణ్యకశిపుని తండ్రి కశ్యపప్రజాపతి. చాలా గొప్ప మహాత్ముడు. కేవల సత్వగుణప్రధానుడు. అయినను భార్యబలవంతముమీద సాయంసంధ్యా సమయములో భార్యతో కలియుటచేత తమోగుణప్రధానుడైన ఘోరరాక్షసుడు హిరణ్యకశిపుడు పుట్టినాడు.

ఇదియునుగాక సహవాసబలము విశేషముగా ఉన్న యెడలకూడ మంచివారు చెడ్డవారుగను, చెడ్డవారు మంచివారుగను మారుచుందురు.

ఇక పరమాత్మ సృష్టించినవర్ణములు నాలుగేగదా! పంచములను ఐదవవర్ణ మెచటినుండి వచ్చినది ?

ఈ సందేహము రావచ్చును.

దీని నొక ఉదాహరణరూపమున వివరింతుము మనము నాలుగు రకములైన మామిడిపండ్లను కొన్నాము. బాగుగాపండుటకు నాలుగు ప్రోగులుగ పెట్టినాము. ఒక వారమురోజులు అగునప్పటికి, ఈ నాలుగు ప్రోగులునుకాక, ఐదవప్రోగు ఒకటి ఏర్పడును. మనము ముందు పెట్టినది నాలుగు ప్రోగులేకదా ! ఈ ఐదవ ప్రోగు ఎక్కడిది ? ఈ నాలుగింటిలోనే, కుళ్ళిపోయినవియును, డాగులుపడినవియును, ఇతర కారణములచేత రుచితప్పిపోయినవియును, తినినచో ఆరోగ్యము పాడుచేయునవియును బయలుదేరును. ఇట్లు చెడిపోయిన పండ్లను పై నాలుగింటిలో ఏ ప్రోగులో కలుపుదుము ? దేనిలో కలుపుటకును వీలులేక ప్రత్యేకముగా, ఎడముగా ఒకచోట ప్రోగుపెట్టుదుము.

ఆ విధముగనే పరమాత్మ సృష్టించినది నాలుగు వర్ణములేయైనను, కొంతకాలమునకు వర్ణసాంకర్యమేర్పడి, దాని ఫలముగ ఈ అయిదవవర్ణము ఏర్పడినది.

శ్లో॥ న మాం కర్మాణి లింపంతి
న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి
కర్మభి ర్న స బధ్యతే॥ ౧౪

ప. వి. :—న, మాం, కర్మాణి, లింపంతి, న, మే, కర్మఫలే, స్పృహా, ఇతి, మాం, యః, అభిజానాతి, కర్మభిః, న, సః, బధ్యతే.

టీక :—

మాం = నన్ను,
కర్మాణి = (సృష్ట్యాది) కర్మలు,
నలింపంతి = అంటవు,
మే = నాకు,
కర్మఫలే = కర్మఫలమునందు,
స్పృహా = కోరిక (ఇచ్ఛ)
న = లేదు,
ఇతి = ఈ ప్రకారముగా,
మాం = నన్ను,
యః = ఎవడు
అభిజానాతి = తెలిసికొనుచున్నాడో,
సః = వాడు,
కర్మభిః = కర్మలచే,
నబధ్యతే = బంధింపబడడు.

తా. నన్ను సృష్ట్యాది కర్మలు బంధింపవు. ఏలయన, నాకికర్మ ఫలమునం దెట్టి యిచ్ఛయునులేదు. ఈ ప్రకారముగ నన్నెవడు తెలిసికొను చున్నాడో, వాడుకూడ కర్మలచేత బంధింపబడడు.

అమృతవాహిని :-

కర్మ చేయు మానవునియొక్క అంతఃకరణములో, అహంకారము, మమకారము, ఆసక్తి ఫలాభిలాష ఉన్నప్పుడు అతనిచేత చేయబడుకర్మలు సంస్కారరూపమున అతని అంతఃకరణమున దాగియుండును. అనగా అప్పుడు మాత్రమే ఆ కర్మలు అంతఃకరణమున సంస్కారములను పుట్టించ గలవు. ఆ సంస్కారములే కారణములుగా దానికి మరల జన్మలును, సుఖదుఃఖములును సంప్రాప్తములగుచుండును. కర్మలచేత బంధింపబడుటయనగా ఇదియే అర్థము. భగవంతునికి ఏ భోగములందును కోరికలేదు. ఆయన అవాప్త సమస్తకాముడు. కావున ఆయనకు ఏమియును కొరతలేదు. అహంకారములేదు, మమకారములేదు, ఆసక్తిలేదు; అయితే, కర్మలు మాత్రము చేయుచున్నాడు. కారణము ? నిర్హేతుక కారుణ్యము. కారుణ్యమహోదధి గనుక, జగత్కల్యాణార్థము కర్మలు చేయక ఎట్లుండగలడు ? కనుక ఆయనను ఈ కర్మలు ఎంతమాత్రమును అంటవు. ఇదే విషయము మూడవ అధ్యాయములోని ఇరువది రెండవ శ్లోకములో చెప్పియున్నాడు - "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి" అని. ఇంతేకాదు - "ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే" "ఈ విధముగ నన్నెవడు తెలిసికొనుచున్నాడో, వాడుకూడ కర్మలచేత బంధింపబడడు" అనికూడ చెప్పుచున్నాడు. పదమూడవ

పదునాల్గు శ్లోకములలో చెప్పియున్నట్లు జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములు మొదలగా సమస్త కర్మలును చేయు చున్నప్పటికిని ఆయన అకర్తయే అనియును, ఆ కర్మలతో ఆయన కెట్టి సంబంధము లేదనియును, కర్మలు చేయుటలో గాని, కర్మఫలముల ననుభవింపజేయునప్పుడు ఆ వ్యక్తుల యందుగాని, ఆయనకు ఈషణ్మాత్రమును విషమభావము లేదనియును, కర్మఫలమం దాసక్తి, మమకారము మొదలైనవి ఎంతమాత్రమును లేవనియును, కనుక ఆయనకు కర్మలు బంధనములు కాజాలవనియును తెలిసికొని మహాత్ములుకూడ కర్మబంధనములో పడరు. అట్టి మహాత్ములనుకూడ కర్మలు బంధించలేవు.

భగవంతుని యథార్థస్వరూపము అనుభవపూర్వకముగ తెలిసిన మహాత్ములకుగూడ, వారిచేత చేయబడు కర్మల యందుగాని, కర్మఫలమునందుగాని అహంకారము, మమకారము, ఆసక్తి, కోరిక, అభిమానము మొదలైనవి లేశ మాత్రమును ఉండవు. వారుకూడ కేవలము లోక సంగ్రహము కొరకే కర్మలు చేయుదురు. కాబట్టి వారినికూడ ఆ కర్మలు బంధించలేవు అని భగవంతుని అభిప్రాయము.

నిష్కామముగ కర్మలుచేయు సాధకునే కర్మలు బంధించ లేక పోయినప్పుడు, ఇక మహాత్ములను బంధించునా ? సాధకు లను వారి నిష్కామకర్మలు బంధించకపోగా, అంతఃకరణ పరిశుద్ధిని కలిగించి, అందువలన పూర్వకర్మలయొక్క

బంధనమునుకూడ తొలగించుచున్నవి. మహాత్ములకు బంధనములే లేవు కనుక, ఇక వారిచేత చేయబడు కర్మలు, వారి బంధనములను తొలగించుననుట భ్రమయే కాగలదు. అయితే, వారిచేత చేయబడు కర్మల ప్రయోజనమేమి ? లోకకల్యాణామే. కనుక ఎవరికి కర్మలయందు, కర్మఫలములయందు, అహంకారము, మమకారము, అభిమానము, ఆసక్తి, కోరిక మొదలగునవి కలవో, వారు భగవంతుని జన్మలయొక్కయు, కర్మలయొక్కయు, దివ్యత్వమును తెలిసికొనలేరు అని గ్రహించవలయును.

**అవతారిక :-**

భగవంతుడు తనజన్మలయొక్కయు, కర్మలయొక్కయు దివ్యత్వమును, దానిని యథార్థముగ తెలిసికొనుటలోగల మహత్త్వమును చెప్పి, ఇప్పుడు పూర్వపు ముముక్షువులను ఆదర్శముగ ఉంచుకొని, నీవుకూడ నిష్కామముగ కర్మలు చేయవలయును అని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం
పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ ౧౫

ప. వి :—ఏవం, జ్ఞాత్వా, కృతం, కర్మ, పూర్వైః, అపి, ముముక్షుభిః, కురు, కర్మ, ఏవ, తస్మాత్, త్వం, పూర్వైః, పూర్వతరమ్, కృతం.

టీక :—

పూర్వైః = పూర్వులైన,
ముముక్షుభిః అపి = ముముక్షువులచేతగూడ,
కర్మ = కర్మ,
కృతం = చేయబడినది,
ఏవం జ్ఞాత్వా = ఈ విధముగ తెలిసికొని,
తస్మాత్ = ఆ కారణమువలన,
పూర్వైః = పూర్వులచేత,
కృతం = చేయబడినదియు,
పూర్వతరం = పురాతనమైనట్టిదియునగు,
కర్మైవ = కర్మనే,
త్వం = నీవు,
కురు = చేయుము.

తా. పూర్వులైన ముముక్షువులు కూడ కర్మచేసిరి. కాబట్టి ఈ విధముగ తెలిసికొని, చాల పురాతన కాలమునుండియు పూర్వులచేత చేయబడుచున్న కర్మనే నీవుకూడ చేయుము.

అమృతవాహిని :—

ముముక్షువు అనగా బ్రహ్మలోకపర్యంతమైన భోగములుకూడ దుఃఖమయములు, క్షణభంగురములు అని తలచి, అన్నిటియందును వైరాగ్యముతో, జననమరణరూప సంసార సముద్రమునుండి బయటపడి, భగవదానందము ననుభవించవలయునను తీవ్రకాంక్షతో ప్రయత్నించువాడు. "అర్జునా!

నీవు ముముక్షువువు గనుక, నీవుకూడ పూర్వమునుండియు ముముక్షువులచేత అనుసరించబడు మార్గముననే నడుపుము. చాల పురాతన కాలమునుండియును, పూర్వులచేత ఆచరింపబడు కర్మనే చేయుము !" అని భగవంతుడు చెప్పుచున్నాడు.

యథార్థమాలోచించిన కర్మను వదలినంతమాత్రమున బంధనమునుండి విముక్తుడుకాడు. విపరీతజ్ఞానము కలవారికి కర్మబంధనమను భ్రాంతి కలుగును. బంధనమునకు కారణము మనస్సు అని పెద్దలు చెప్పినారు - "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని.

అయితే, ఇందులో ఒక రహస్యమున్నది. మనస్సే బంధనమునకును, మోక్షమునకును కారణమెట్లగును ? ఏదైన ఒకే వస్తువు విరుద్ధఫలముల కుపయోగించునా ? చావున కుపయోగించునదే బ్రతుకునకు గూడ ఉపయోగించునా ? దీపము వెలుగు నిచ్చును. కాని చీకటినిగూడ ఇచ్చునా ? మనస్సు బంధనమునకో, మోక్షమునకోగాని, రెంటికిని ఎట్లు కారణము కాగలదు ? ఇక్కడ పెద్దల అభిప్రాయమేమనగా, నిజమాలోచించిన మనస్సుకూడ బంధనమునకు కారణము కాదు; గుణములును, కాంక్షలును కారణములు. ఎవని మనస్సులో రాగద్వేషములు, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు కలవో, వానికి బంధనము; ఎవనిమనస్సులో ఇవి లేవో వానికి మోక్షము - ఇదే దానిలోని రహస్యము.

ఈ రాగద్వేషాదులను పూర్తిగ జయించినవాడు, కర్మలలో మునిగి తేలుచున్నను, వానిని కర్మలు బంధించలేవు. ఈ రాగ ద్వేషములు మనస్సులో ఉన్నవాడు, కర్మలు చేయకుండ, 'నన్ను ముట్టుకోకు నామాలకాకీ' అని, దూరముగ కూరుచున్నను బంధనము తప్పదు. అయితే, కర్మచేయక ప్రపంచముతో సంబంధములేకుండ దూరముగ నుండుటచే, ఆ రాగ ద్వేషములు మొదలైనవి క్రియారూపముగ కనుపడక పోవచ్చును; ఆ కారణమున ఇతరులకు వానివలన ప్రమాదము కలుగకపోవచ్చును. కాని ఆ దూరముగ ఉన్నవానికి మోక్షము మాత్రము లేదు. కనుక రాగద్వేషాదులతో కూడి యున్న మనస్సు బంధనమునకు కారణము. రాగద్వేషాదులు లేక, భగవత్ప్రేమతో నిండియున్న మనస్సు మోక్షమునకు కారణము. ఈ రహస్యము తెలిసినవాడు కర్మ చేయుటకు ఎందుకు భయపడవలయును ?

ఇందులో ఇంకొక రహస్యముకూడ కలదు. రాగద్వేషాదులు లేకుండ, మనస్సును పరిశుద్ధి చేసికొనిన పిమ్మటకూడ, ఇక తాను కర్మ చేయుట ఎందులకు అని ఎవరైనను అనుకొను పక్షములో, అది సరిగాదు. అట్టివాని మనస్సులోకూడ ఒక లోపమున్నది. ఏమనగా, అతడు కర్మచేసినను నష్టము లేదు; చేయకపోయినను నష్టము లేదు. అంతమాత్రమున ఏమియును చేయక ఊరకున్నయెడల, అది ఒక విధమైన స్వార్థము

కాగలదు; సంకుచితస్వభావమే కాగలదు. కర్మచేసినను, చేయకపోయినను తనకు ఒక్కటే అయినప్పుడు, ఇతరులకొరకు ఎందులకు చేయరాదు? ఒక్క తనసుఖము, తనబాగు మాత్రమే చూచుకొన్నవాడగుచున్నాడు. అప్పుడది స్వార్థము, సంకుచితస్వభావమునుకాక మరేమి అగును?

దీని నొక ఉదాహరణము వలన స్పష్టపరుప యత్నింతుము - పదిమంది ఒక పాడునూతిలో పడినారనుకొందము. వారందరును ఎవరు వచ్చెదరో, ఎవరు పైకితీయుదురో అని ఎదురుతెన్నులు చూచుచుందురు. ఎవరును రారు - చివరకు ఏదోవిధముగ వారిలో సమర్థుడైనవాడొకడు మిక్కిలి శ్రమచేసి పైకివచ్చినాడు; వానిపని నెరవేరినది. ఇక వానికి ప్రయత్నముతో ఏమిపని? కనుక హుటాహుటిగ ఇంటికి పరుగెత్తుటయేనా? నూతిలోనుండి గోలచేయువారి మొరవినక తనకేమని పరుగెత్తినచో అది దోషము కాదా? ఆ విధముగ పైకివచ్చినవాడు ఎప్పుడును అట్లు పరుగెత్తడు. సమర్థుడైనచో, మిగిలినవారినికూడ తానే పైకిలాగును. సమర్థుడు కానిచో పదిమందిని పిలుచుకొనివచ్చి పైకితీయించుటకు ప్రయత్నమైన చేయును. అంతేకాని, ఏమియు చేయక తన త్రోవను తాను పోవుట జరుగదు. అట్లుగాక, తమంతతాముగ ఎవ్వరును నూతినుండి పైకి రాలేకపోయినను, ఎవరో దయాస్వభావులు, నూతిలోని వారి మొరవినివచ్చి, వారిలో ఒకరిచేతిని పట్టుకొని రను కొందము. ఇక అతడు పైకి వచ్చుటలో ఎట్టి సందేహమున్న

లేదు. కాని అతడు క్రిందివానికి చేయి అందీయవలయును. అట్లైన అందరును పైకివత్తురు. లేక మొదటివాడు, పైవాడు తన చేయిపట్టుకొన్నాడు గనుక ఇంక తనకు ప్రమాదము లేదు అని, క్రిందివానికి చేయి అందీయక, పైకిరావచ్చునా ? వాడు తనక్రిందివానికి చేయి అందిచ్చినను, అందీయకపోయినను, తనకు వచ్చు నష్టము లేకపోవచ్చును. అందిచ్చినచో క్రింది వాడుకూడ పైకి వచ్చును గదా! లేకపోయిన వాడు రాలేడు. దయగలవాడు ఊరుకొనలేడు. తనపై ఇతరులు దయజూపవలయునని కోరువాడు, తానుకూడ ఇతరులపై దయజూపవలయును. ఇది సృష్టిసూత్రము. కాని ఉన్న రహస్యమేమన కేవలము స్వార్థపరుడై, సంకుచిత స్వభావము కలవాడై. క్రిందివానికి చేతినీయకపోయినచో, పైవాడు క్రిందివానికి కూడ చేతి నందిమ్ము అని చెప్పెడిమాటను పెడచెవిని పెట్టినచో, పైవాడు ఇతనినికూడ లేవదీయడు; మరల క్రిందికే వదలును. అప్పుడు ఇతనికి బుద్ధివచ్చి, నీవు చెప్పినట్లేవిందును బాబో అని ప్రార్థించి, మరల సరియైన మార్గములోనికి వచ్చును.

అట్లే, లోకముతో నాకు సంబంధమేమి ? లోకము ఎటుబోయిన నాకేమి అని తనమోక్షోపాయమును మాత్రము తాను వెదకుకొనువాడు, పైకి మోక్షమువైపు గమనము చేయుచున్నట్లు తాను అనుకొన్నను, ఇతరులకు అట్లు కనుపించినను, యథార్థమునకు అతనికిని, మోక్షము గగన

కుసుమమే. కారణమేమనగా, ఆతని మనస్సులో, ఆతనికి తెలియకుండ, స్వార్థము, సంకుచిత స్వభావము ఇంకను ఉన్నవి. అవి మోక్షమునకు ప్రతిబంధకసామగ్రి. కనుకనే భగవంతుడు తనకొరకు కాకపోయినను లోకముకొరకు ప్రతివాడును కర్మచేసితీరవలయును అని ముక్తకంఠముతో పలుతావుల హెచ్చరిక చేసినాడు.

శ్లో॥ కిం కర్మ కి మకర్మేతి
కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి
యజ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ౧౬

ప. వి :—కిం, కర్మ, కిం, అకర్మ, ఇతి, కవయః, అపి, అత్ర, మోహితాః, తత్, తే, కర్మ, ప్రవక్ష్యామి, యత్, జ్ఞాత్వా, మోక్ష్యసే, అశుభాత్.

టీక :—

కింకర్మ = కర్మ ఎట్టిది,
కిం అకర్మ = అకర్మ ఎట్టిది,
ఇత్యత్ర = అను నీకర్మ జ్ఞానవిషయమున,
కవయోఽపి = పండితులుకూడ,
మోహితాః = భ్రమపడుచున్నారు,
యత్ = దేనిని,
జ్ఞాత్వా = తెలిసికొని,

అశుభాత్ = అశుభమునుండి (సంసారమునుండి),
మోక్ష్యసే = విడుదలపొందగలవో,
తత్ కర్మ = ఆ కర్మాకర్మలనుగూర్చి,
తే = నీకొరకు,
ప్రవక్ష్యామి = లెస్సగా చెప్పెదను.

తా. ఏదికర్మ ? ఏది అకర్మ ? అను విషయమున తెలివిగలవారు కూడ పొరబడుచున్నారు. అట్టి కర్మనుగూర్చి బాగుగా జెప్పెదను. అది తెలిసికొనుటచేత అశుభరూపమైన సంసారమునుండి తరించగలవు.

అ మృ త వా హి ని :—

ఈ శ్లోకములో అర్జునునకు భగవంతుడు కర్మతత్త్వమును గూర్చి చెప్పెదను అని ప్రతిజ్ఞ చేయుచున్నాడు. ఈ కర్మతత్త్వమునుగూర్చి తెలిసికొనుటలో బుద్ధియుంతులైనవారుకూడ పొరబడుచున్నారు. ఈ కర్మయొక్క తత్త్వమును సరిగ తెలిసికొనుటచేత మానవుడు ఈ సంసార బంధనము నుండి సులభముగ తరించగలడు.

కేవలము శాస్త్రములనుజూచి, పరిశీలించి, ఇది కర్మ, ఇది అకర్మ అని తెలిసికొనుట కష్టమైనపని. ఎంత శాస్త్ర పరిచయము కలవాడునుకూడ ఆ నిర్ణయము చేసికొనలేడు. "సూక్ష్మా గతిర్హి ధర్మస్య దుర్జ్ఞేయా హ్యకృతాత్మభిః" అని భారతములో చెప్పబడినది. ఇక్కడ 'అకృతాత్మభిః' అనగా దుష్టులచేత అని అర్థము చెప్పరాదు. దుష్టులకు ధర్మము తెలియదు అని చెప్పుటకు శాస్త్రప్రమాణము కావలయునా

యేమి ? అకృతాత్ములు అనగా ఎవరి బుద్ధి పరిపూర్తిగ వాసనారహితము కాలేదో వారు. బుద్ధిప్రతిభ ఎంతకలవా డైనను స్వపరభేదము ఈషణ్మాత్రమున్నను, సంప్రదాయాభి మానము ఏమాత్రమున్నను, యథార్థమైనధర్మమును నిర్ణ యించలేడు. ధర్మమన్నను కర్మమన్నను, ఇక్కడ ఒకటే. కర్మను అకర్మయనియు, అకర్మను కర్మయనియు పొరపడరాదు. పనిచేసినంతమాత్రమున అది కర్మయనిగాని, పనిచేయనంత మాత్రమున అది అకర్మయనిగాని తలంచుట పొరపాటు. ఈ విషయమున గొప్ప గొప్ప బుద్ధిమంతులు కూడ పొరబడు చుందురన్నచో, ఇక సామాన్యుల విషయము చెప్పవలయునా? ఈఅధ్యాయములో పదునెనిమిదవశ్లోకమునుండి ముప్పది రెండవ శ్లోకమువరకును, కర్మగాని, అకర్మ (త్యాగము) గాని, ఎట్టిభావముతో చేసిన బంధమునకు హేతువగును ? కర్మ గాని, అకర్మ (త్యాగము)గాని ఎట్టిభావముతో చేసిన మోక్షము నకు హేతువగును ? కర్మయొక్క స్వరూపమేమి ? అకర్మ (త్యాగము) యొక్క స్వరూపమేమి ? ఈ విచారణ చేయ బడినది.

శ్లో॥ కర్మణో౽హ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యంచ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః॥ ౧౭

ప. వి. :—కర్మణః, అపి, బోద్ధవ్యం, బోద్ధవ్యం, చ, వికర్మణః, అకర్మణః, చ, బోద్ధవ్యం, గహనా, కర్మణః, గతిః.

టీక :—

కర్మణః = కర్మయొక్క,
(తత్త్వం) = (యథార్థస్వరూపము),
బోద్ధవ్యం = తెలియదగినది.
చ = మరియు,
వికర్మణః అపి = వికర్మయొక్క యథార్థ స్వరూపము కూడ,
బోద్ధవ్యం = తెలియదగినది.
అకర్మణశ్చ=అకర్మయొక్క యథార్థస్వరూపము కూడ,
బోద్ధవ్యం = తెలియదగినది.
హి = ఎందుచేతననగ,
కర్మణః = కర్మయొక్క,
గతిః = యథార్థస్వరూపము,
గహనా = తెలియుట కష్టసాధ్యమైనది.

తా. కర్మయనగానేమి, వికర్మయనగానేమి, అకర్మయనగానేమి తెలిసికొనవలయును. కర్మయొక్క స్వరూపమును తెలిసికొనుట చాల కష్టము.

## అమృతవాహిని :-

కర్మ అనగానేమి ? కర్మ అను సంస్కృతపదమునకు ఆంధ్రమున పని అని అర్థము. కనుక, ప్రతిపనియు కర్మయే.

కాని ఇక్కడ అర్థము అదికాదు. వర్ణాశ్రమానుకూలమగు శాస్త్రవిహితకర్మ.

వికర్మ యనగా, శాస్త్రనిషిద్ధమైన దుష్కర్మ. అబద్ధము, కపటము, దొంగతనము, వ్యభిచారము, హింస, మొదలగు పాపకర్మలన్నియును వికర్మలే.

అకర్మ యనగా, ఏపనిని, ఎంతమాత్రమును, ముట్టుకొనకుండ నుండుట.

ఇది కర్మ, వికర్మ, అకర్మలయొక్క స్థూలమైన, సామాన్యమైన అర్థము.

కాని, ఇంతమాత్రముతో ఈ విచారణ పూర్తికాలేదు. ఈ శాస్త్రవిహితమగు వర్ణాశ్రమానుకూల కర్మయే, భావభేదముచేత కర్మ కావచ్చును; వికర్మ కావచ్చును; అకర్మ కావచ్చును.

## కర్మ

ఏ భావముతో, ఏవిధముగా చేసిన ఎట్టి క్రియ కర్మ అనబడును ? ఏ స్థితిలో, ఏ మానవుడు శాస్త్రవిహితమైన ఎట్టికర్మను చేయవలయును ?

ఈ విషయమై, జ్ఞానులు, తత్త్వదర్శులు అయిన మహాత్ములే యథార్థమును తెలియ సమర్థులు. కాబట్టి మానవుడు వర్ణాశ్రమానుకూలమైన శాస్త్రవిహితమగు కర్మలలో,తన అధికారమునకు తగిన కర్తవ్య కర్మ ఏదో,దాని నెట్లు

ఆచరించవలయునో తత్త్వవేత్తలైన మహాత్ములవలననే తెలిసికొనవలసియున్నది. వారి సూచనలను, ఆజ్ఞలను అనుసరించియే, ఆచరించవలయును.

## వికర్మ

అట్లే వికర్మనుగూడ సామాన్యమానవుడు తెలిసికొనుట అసాధ్యమైన విషయము. పాపమును పుణ్యమని, పుణ్యమును పాపమని నిర్ణయించుకొను ప్రమాదము కలదు. శాస్త్రవిహితమైన, వర్ణాశ్రమకర్మలే, అధికారిభేదముచే ఒకనికి ధర్మమైన,కర్తవ్యమైన కర్మ; ఇంకొకనికి అధర్మము, అకర్తవ్యమునై, వికర్మ (పాపము) కావచ్చును. ఒకనికి ఒక సమయములో ధర్మము, కర్తవ్యమునైన కర్మ, అతనికే ఇంకొక సమయములో వికర్మ కావచ్చును. ఒక సమయములో ఒకనికి ధర్మము, కర్తవ్యము అయిన కర్మ, అవస్థాభేదమునుబట్టి ఆ సమయములోనే ఇంకొకనికి వికర్మ కావచ్చును. దానిని యథార్థముగా జ్ఞానులు, తత్త్వదర్శులు అయిన మహాత్ములు గాని తెలియలేరు. కనుక వారి సూచనలను, ఆజ్ఞలను అనుసరించియే ముముక్షువు ఆచరించవలయును.

## అకర్మ

అకర్మనుగూడ సామాన్యులు తెలిసికొనలేరు. కేవలము శరీరముతోను, ఇంద్రియములతోను, మనస్సుతోను, ఏమియును చేయకుండనుండుటయే అకర్మ యని విచారణ చేయుదురు. ఇది సరియైన విచారణకాదు. ఇదికూడ భావ

భేదముచేత, కర్మగాని, వికర్మగాని, కాగలదు. అకర్మను కర్మగాను, వికర్మగాను, కర్మను, వికర్మను, అకర్మగాను అజ్ఞానులు తలంచెదరు. దానియొక్క యథార్థ స్వరూపము కూడ జ్ఞానులు, తత్త్వదర్శులు అయిన మహాత్ములే తెలిసికొన సమర్థులు. కనుక, ఏభావముతో, ఏప్రకారముగా, ఏక్రియ చేసిన, అది అకర్మ అగునో, ఏస్థితిలో, ఏమానవుడు, ఏప్రకారము ఆచరించవలయునో, ఈ విషయము ముముక్షువైనవాడు అట్టి మహాత్ములనడిగి, వారి ఆజ్ఞలననుసరించియే ఆచరించవలయును.

కాబట్టి కర్మయొక్క స్వరూపము చాల గహనమైనది. ఏది కర్మ,ఏది వికర్మ, ఏది అకర్మ అను నిర్ణయము చేయుటలో కేవలము విద్యాబుద్ధుల దృష్టిలో ఎంత గొప్పపండితుడు, బుద్ధిమంతుడు అయినను,సామాన్యముగ పొరబడుచునే యుండును. ఇక సామాన్యమానవుని విషయము చెప్పవలయునా ?

అభిమానమును విడిచి, జ్ఞానులు, తత్త్వదర్శులు అయిన మహాత్ములవద్దనే తెలిసికొనవలసియుండును. లేకున్న విపరీత జ్ఞానమునకులోనై, ప్రమాదపడుట సిద్ధము.

**అ వ తా రి క :—**

ఇప్పుడు పదునారవ శ్లోకములోని తన ప్రతిజ్ఞననుసరించి కర్మతత్త్వమును చెప్పుటకు ఉపక్రమించుచున్నాడు.

శ్లో॥ కర్మ ణ్యకర్మ యః పశ్యే
దకర్మణిచ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ ౧౮

ప. వి :— కర్మణి, అకర్మ, యః, పశ్యేత్, అకర్మణి, చ, కర్మ, యః, సః, బుద్ధిమాన్, మనుష్యేషు, సః, యుక్తః, కృత్స్న కర్మకృత్.

టీక :—

కర్మణి = కర్మయందు,
అకర్మ = అకర్మను,
అకర్మణి = అకర్మయందు,
కర్మ చ = కర్మను,
యః = ఎవ్వడు,
పశ్యేత్ = చూచునో,
సః = వాడే,
మనుష్యేషు = మనుష్యులలో,
బుద్ధిమాన్ = తెలివిగలవాడును,
యుక్తః = యోగియును,
సః = వాడే,
కృత్స్నకర్మకృత్ = సకలకర్మల నాచరించినవాడును,
(భవతి = అగుచున్నాడు).

తా. కర్మయందకర్మను, అకర్మయందు కర్మను, ఎవడు చూచునో, వాడే మానవులందరిలో తెలివిగలవాడు; వాడే యోగి: వాడు సమస్త కర్మలను ఆచరించినవాడు అగుచున్నాడు.

అమృతవాహిని :_

కర్మయొక్కయు, అకర్మయొక్కయు స్వరూప నిర్ణయములో చాల జాగ్రత్త వహించవలయును. గీతయొక్క యథార్థ రహస్యమంతయును, ఈ ఒక్క నిర్ణయము మీాద ఆధారపడి యున్నది. ఇంతగీత చెప్పినదియును, ఈ ఒక్క నిర్ణయముకొరకే. కర్మచేయవలయునా ? చేయనక్కరలేదా ? ఏది శ్రేష్ఠము ? ఇదియే తేలవలసిన సారాంశము.

పెక్కుమంది, కర్మ బంధనకారణమనియు, కాన కర్మ చేయరాదనియు, స్వరూపముతో కూడ కర్మ త్యజించవలయుననియు చెప్పుచున్నారు. కొంతమంది, కర్మచేయవలయుననియు, కర్మ స్వరూపముతో త్యజించుట గీతానుమతము కాదనియు చెప్పుచున్నారు. ఇది అతిజాగరూకతతో విచారించవలసిన గహన విషయము. దీనికిముందు కర్మ అనగా నేమిరో విచారించవలెను. కర్మనుగూర్చిన విచారణ పదునేడవ శ్లోక వ్యాఖ్యానములో కొంతవరకు చేసితిమి.

ఇక్కడ కర్మఅనగా, సామాన్యముగ జరుగునట్టి శారీరక ధర్మములైన చూచుట, తిరుగుట, కూర్చుండుట, నిలబడుట,

శయనించుట, వాసనజూచుట మొదలగు పనులని అర్థము చెప్పరాదు. ఈ అర్థమే సన్న్యాసమార్గీయుల అర్థమైన యెడల, వారుమాత్రము చూచుటలేదా ? వినుటలేదా ? తిరుగుట, నిలబడుట, శయనించుట, మొదలగునవి చేయుటలేదా ? కాన, వారు కర్మను స్వరూపముతో త్యజించుటను చెప్పి యున్నారనగా - ఆ కర్మ వేరు. కర్మ స్వరూపముతో త్యజించ వలయునని చెప్పినవారికిగూడ చూచుట, మొదలగు కర్మలు చేయకుండ నుండలేమని తెలియును. అవిగూడ కర్మలేగదా అని ఆక్షేపించువారు, వారిని కర్మ చేయుటలేదనుటేల ? చూచుట మొదలగునవి వారును చేయుచునే యున్నారుగదా ! కనుక, ఇక్కడ కర్మకు సన్న్యాసమార్గీయులు ఈ అర్థము చెప్పక, ఒక విశిష్టమైన అర్థమును చెప్పుచున్నారు.

కర్మయోగులుకూడ ఇవన్నియును కర్మలే అని అంగీకరింపరు. అట్లంగీకరించినచో చూచువాడు, వినువాడును కూడ కర్మయోగి కావలసివచ్చును. అయితే, కర్మ అనగా ఏమి ? శాస్త్రవిహితమైన కర్మ అని అర్థము చెప్పినారు. స్వర్గాది భోగములయందలి కాంక్షతో శాస్త్రవిహితమైన యజ్ఞయాగాదులు చేసినవాడు కర్మయోగి యగునా? గీత అభిప్రాయములో వాడు కర్మయోగికాడు. అట్టివారిని గూర్చియే రెండవ అధ్యాయములో వేదవాదరతులనియు, నాన్యదస్తీతి వాదులనియు, కామాత్మలనియును, స్వర్గపరులనియును, అవిపశ్చితులనియును, మాయాపహృత చేతసులనియును,

భోగైశ్వర్య ప్రసక్తులనియును కృష్ణపరమాత్మ పేర్కొనినాడు. ఇంకను ఆ అధ్యాయములోనే, నలుబది తొమ్మిదవ శ్లోకములో 'కృపణాః ఫలహేతవః' అని జాలిపడినాడు.

కనుక, కామ్యముతో శాస్త్రవిహిత కర్మలు చేసినంత మాత్రమున, అవి కర్మలునుగావు, వాడు కర్మయోగియును గాడు, శాస్త్రవిహితకర్మలను నిష్కామ్యముగా చేసినప్పుడు మాత్రమే, అవి కర్మలు అగుచున్నవి. వాడు కర్మయోగి యగుచున్నాడు. వీనికి కర్మలయందును, ఫలమునందును, ఆసక్తి, మమకారము, అభిలాష, మొదలైనవి ఎంతమాత్రమును ఉండవు. కాని, తాను నిష్కామ్యముగా చేయుచున్నాననియు, అది తనబాధ్యత అనియు స్పృహ ఉండును. ఆ స్పృహ ఉన్నంతవరకు, వానిచేత చేయబడునది కర్మ.

భగవంతుని చేతిలో ఒకపరికరముగనయి, తనకు కామ్యముగాని, సంకల్పముగాని లేక, పరమాత్మ ఇచ్ఛాను సారమే తనద్వారా పనులు జరుగుచున్నప్పుడు, అది అకర్మ అనబడును. అప్పుడు ఆతని అంతఃకరణములో తాను కర్మ చేయుచున్నాననిగాని, అది తన బాధ్యత అనిగాని స్పృహ ఉండదు. కనుక ఆతడు కర్మచేసినను, చేయనివాడే అగు చున్నాడు. ఇట్లు కర్మ చేయనివాడే అయినను, వానిచేత కర్మ జరుగుచునేయుండును. ఇదియే కర్మలో అకర్మ, అకర్మలో కర్మ అనగా. ఇట్టివాడే మానవులలో ఉత్తమోత్తముడు. వాడు

సమస్త తపస్సులు, వ్రతములు మొదలగునవన్నియును చేసిన వాడే అగుచున్నాడు. ఇట్టివానికి పరమాత్మయొక్క పరిపూర్ణ సాక్షాత్కారము అగును. కాన, ఇకవానికి చేయవలసినది ఏదియును మిగులదు.

శ్లో॥ యస్య సర్వే సమారంభాః
కామ సంకల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం
త మాహుః పండితం బుధాః॥ ౧౯

ప. వి ;— యస్య, సర్వే, సమారంభాః, కామసంకల్పవర్జితాః, జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం, తం, ఆహుః, పండితం, బుధాః.

టీక ;—

యస్య = ఎవనియొక్క,
సర్వే = సమస్తములయిన,
సమారంభాః = కర్మలును,
కామసంకల్పవర్జితాః = కామము చేత, సంకల్పము చేతను విడువబడియున్నవో
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం = జ్ఞానమనెడి అగ్ని చేత తగుల బెట్టబడిన కర్మలు గలిగిన,
తం = వానిని,
బుధాః = జ్ఞానులు,
పండితం = పండితునిగా,
ఆహుః = చెప్పుదురు.

తా. ఎవనియొక్క సమస్తకర్మలును కామమును, సంకల్పమును లేక చేయబడుచున్నవో, ఎవనియొక్క కర్మలు జ్ఞానమను అగ్నిలో దహింపబడినవో, అట్టిమహాత్ముని తెలిసినవారు 'పండితుడు' అని చెప్పుదురు.

అ మృ త వా హి ని :-

కేవలము పరమాత్మ చేతిలో పరికరముగా పరిణమించిన మహాత్ములకు కామముగాని, సంకల్పముగాని ఉండవు. వారు ఏకర్మ చేసినను, కామరహితులుగను, సంకల్పరహితులుగను చేయుదురు. యథార్థమాలోచించిన, వారు కర్మ చేయుటకాదు; వారిచేత కర్మ చేయబడును. అంతియేగాని వారు కర్మ చేయరు. వారి ద్వారమున పరమాత్మయే కర్మచేయును. శ్రీరామచంద్ర మూర్తిచేతిలోని బాణమువలె, కృష్ణపరమాత్మ చేతిలోని సుదర్శనమువలె, వారును ఒక పరికరముగా పరిణమించిరన్న మాట. రామచంద్రమూర్తి సంకల్ప ముప్రకారమే బాణము పనిచేయును. కృష్ణపరమాత్మ సంకల్ప మెట్లుండిన సుదర్శన మట్లు చేయును. వాటికి స్వాతంత్ర్యముగాని, సంకల్పముగాని ప్రత్యేకముగ ఉండవు. అట్లే పండితులకును ప్రత్యేకముగా కామముగాని, సంకల్పముగాని ఏమాత్రమును ఉండవు. పరమాత్మ ఏదిచేయించిన అది చేయుదురు.

కామ సంకల్పవర్జితులు అనగా 'కామశ్చ సంకల్పశ్చ కామసంకల్పౌ, తాభ్యాంవర్జితాః యేతే కామసంకల్పవర్జితాః' అని.

కామమనగా ఇహలోక ఊర్ధ్వలోక భోగములయందు

ఆసక్తి, వానిని అనుభవించవలయునని యెడి కాంక్ష, ఫలాభిలాష. ఇట్టి కామము మహాత్ములవద్ద వాసనామాత్రముగ గూడ ఉండదు. రాముని వారికి ఇంకను భోగములందు ఆసక్తి ఎట్లుండును ? ఉండినచో రాముని వారెట్లగుదురు ? కారు. మహాభక్తశిఖామణి ముత్తివి సుందర రామదాసుగారు చెప్పు కొన్నారు-"అమరేంద్ర భోగము లవి ఎంతమాత్రము ? కమలజునైన లక్ష్యము సేయకున్నాము, రామునివారమైనాము, ఇతరాదులగణన సేయము" అని. అట్టివారు కామవర్జితులు. అంతేకాదు, సంకల్పవర్జితులు కూడ. వారికి ప్రత్యేకముగ సంకల్పమే ఉండదు. తెలిసినవారు అట్టివారిని 'పండితులు' అందురు. పండితుడైనవాడే కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూడగలడు; అట్లు చూడగలిగినవాడే పండితుడు. ఆతనిచేత చేయబడిన కర్మలన్నియును జ్ఞానమనెడి అగ్నిచేత దహింపబడిపోవును. ఒక్క ప్రారబ్ధము మాత్రము అనుభవముచే నశించును. సంచితాగామికర్మలు మరల జన్మకలిగించుటకు శక్తిమంతములుకావు. ఏలయన వారి జ్ఞానమనెడి అగ్నిచేత అవి భస్మమైపోవును గనుక. ఆ కర్మలు దగ్ధపటన్యాయముగ నుండును. ఏ జ్ఞానముచేత కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూడగలుగుచున్నాడో, ఏజ్ఞానముచేత భగవంతుని అవతారముల యొక్కయు, కర్మలయొక్కయు దివ్యత్వము అనుభవములోనికివచ్చి, కామసంకల్పవర్జితుడైనాడో, అట్టి యథార్థజ్ఞానము, లోకకల్యాణార్థము చేయబడు వానికర్మ

లన్నిటిని దూదిప్రోగును అగ్ని దహించివేసినట్లు దహించి వేయును. కనుక వానికి కర్మలు బంధనములుకావు.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి
నైవ కించిత్కరోతి సః॥ ౨౦

ప. వి :—త్యక్త్వా, కర్మఫలాసంగం, నిత్యతృప్తః, నిరాశ్రయః, కర్మణి, అభిప్రవృత్తః, అపి, న, ఏవ, కించిత్, కరోతి, సః.

టీక :—

సః = వాడు (అట్టిపండితుడు),
కర్మఫలాసంగం = కర్మయందును, దాని ఫలము నందును ఆసక్తిని,
త్యక్త్వా = విడిచి,
నిత్యతృప్తః = నిత్యతృప్తుడును,
నిరాశ్రయః = నిరాశ్రయుడును (అగుచు),
కర్మణి = కర్మయందు,
అభిప్రవృత్తోఽపి = బాగుగా ప్రవర్తించుచున్నను,
కించిత్ = కొంచెముకూడ (ఏకర్మను),
నకరోత్యేవ = చేయనివాడే (అగుచున్నాడు).

తా. అట్టిపండితుడు కర్మలయందును, ఫలమందును, ఏమాత్రము ఆసక్తిలేక, నిత్యతృప్తుడై, నిరాశ్రయుడై, కర్మలయందు బాగుగా ప్రవర్తించుచున్నను, ఏమియును చేయనివాడే అగుచున్నాడు.

అమృతవాహిని :—

అట్టిమహాత్ములకు (పండితులకు) కర్మలయందుగాని, కర్మఫలమునందుగాని, ఆసక్తి ఎంతమాత్రమును ఉండదు.

కర్మలయం దాసక్తి యనగా కొంత వివరణ మవసరము. కొంతమందికి, ఫలమున్నను లేకపోయినను, కేవలము బాహ్య కర్మలయందు ఆసక్తి ఉండును. కనుక ఆ కర్మ చేయకుండ నుండలేరు. కర్మలో నిమగ్నులై, కర్మ చేయుచున్న సమయములో, ఇతరమైన ప్రపంచముయొక్క జ్ఞానమే ఉండదు. భగవంతుని స్మృతికూడ ఉండదు. కాని మహాత్ములకు ఏకర్మల యందును ఇట్టి ఆసక్తి ఉండదు. ఇట్లే కర్మఫలమునందును ఆసక్తి ఉండదు. బ్రహ్మలోకపర్యంతమైన భోగములను తృణ ప్రాయముగ చూచువారికి ఏకర్మఫలమునందు ఆసక్తి యుండును ? ఉండదు. వారు నిత్యతృప్తులు గనుక - నిత్యుడైన భగవంతునియందే ఆనందించుచుందురు గనుక.

భగవదనుభవముయొక్క రుచి ఏమాత్రము లభించినను, ఆ ఆనందముముందు కొన్ని కోట్ల బ్రహ్మాధిపత్యములు లభించుటచే గలిగిన ఆనందముకూడ, సూర్యునిముందు మిణుగురు పురుగువలె నుండును. మేరుపర్వతము లభించినవానికి, బొగ్గులరాశియందు ఆసక్తియుండునా ? అసలు స్పృహ యుండునా ? భగవద్రామానుజులనుగూర్చి " యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ వ్యామోహత:

తదితరాణి తృణాయమేనే" అని చెప్పియున్నారు. ఇక్కడ 'నిత్యతృప్తుడు' అనినప్పుడు, నిత్యశబ్దమునకు మేము 'పరమాత్మ' అని అర్థము చెప్పుచున్నాము. మా బుద్ధికి ఈ అర్థమే సమంజసముగా కనబడుచున్నది. ఈ శ్లోకములో పరిపూర్ణమహానుభావుని పరిపక్వస్థితి వర్ణింపబడియున్నది. అట్టిమహానుభావులు సర్వకాలసర్వావస్థలయందును భగవంతునియందే ఆనందించుచుందురు. నిత్యశబ్దమునకు భగవంతుడని అర్థము చెప్పినయెడల ఏ బాధయును కనుపడుట లేదుకూడ.

అయితే, నిత్యతృప్తుడు అనగా ఎల్లప్పుడును ఆనందముతో నుండువాడు అని అర్థము చెప్పుకొనినయెడల నష్టమేమి అని అడుగవచ్చును.

నష్టమేమియును లేదుగాని, భగవంతునియందు ఆనందించువాని విషయములో 'ఎల్లప్పుడు' అని చెప్పవలసిన పనిలేదు. భగవంతుని ఒకసారిపొందినతరువాత ఆ అనుభవమునకు ఇక తిరోభావము ఉండదు. కనుక, నిత్యశబ్దమునకు ఎల్లప్పుడు అని చెప్పుటకంటె భగవంతుడు అని చెప్పుటయే సమంజసము.

అట్టివారు నిరాశ్రయులుగనుందురు. నిరాశ్రయులనగా, ఏమియును ఆశ్రయములేనివారు అని అర్థము. వారికి ఒక్క పరమాత్మయే ఆశ్రయము. ఇంక ఏ ఆశ్రయమును వారికి

ఉండదు. ఇంక దేనిని ఆశ్రయించవలసిన అవసరము వారికి లేదు. బ్రహ్మాండమంతటిలోను, ఏవ్యక్తినిగాని, ఏవస్తువును గాని, ఏభోగములనుగాని ఆశ్రయించవలసినపని వారికి లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమును అనుభవించువారగుటచే, వారుకూడ పూర్ణకాములయ్యెదరు. పరిపూర్ణపరబ్రహ్మముయొక్క పరిపూర్ణ సాక్షాత్కారమునుపొంది, సర్వకాల సర్వావస్థలయందును ఆ బ్రహ్మానందములోనే మునిగిపోయి ఇతర ప్రపంచమును మరచియే యుందురు. ఇక ఆశ్రయించుట ఎట్లు?

పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచున్ తిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మరచెన్ సురారిసుతు డేతద్విశ్వమున్ భూవరా!

ఇదియే ప్రహ్లాదునిస్థితిగా భాగవతమున వర్ణింపబడి యున్నది.

ఇంకొకచోట ప్రహ్లాదుడే తండ్రితో "అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేషమత్తచిత్త మేరీతి నితరంబుజేర నేర్చు?" 'భగవంతుని పాదారవింద ధ్యానామృతము తప్పత్రాగి, మత్తెక్కియున్న వారిచిత్తము మరల ఇంకొకవైపునకు ఎట్లు పోగలదు?' అనినాడు.

యామునాచార్యులు "తవామృతస్యందిని పాద పంకజే నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి" 'పరమాత్మా, అమృత

వాహిని ప్రవహించుచుండు నీ పాదపద్మములలో ఒక్కసారి చిత్తము ప్రవేశించవలెనేగాని, ఇక మరల బయటకు ఎట్లు రాగలదు ? రావలయునన్న ఇచ్ఛయేయుండదు' అనినారు.

పరిపూర్ణ బ్రహ్మానుభవము కలిగిన మహాత్ములందరి స్థితియును ఒక్కవిధముగనే యుండును. శంకరభగవత్పాదు లిట్లు అనుచున్నారు- "అస్మాకం యదునందనాంఘ్రి యుగళ ధ్యానావధానార్థినాం, కిం లోకేన దమేనకిం నృపతినా స్వర్గాపవర్గైశ్చకిం?" 'కృష్ణపరమాత్మ పాదపద్మములను ధ్యానించుటయందు రుచిమరిగిన మాకు ఇహలోక సంబంధమైనట్టియును, స్వర్గాది ఊర్ధ్వలోక సంబంధమైనట్టియును రాజ్యములతోడను, భోగములతోడను ఏమిపని? చివరకు అపవర్గము చేతకూడ మాకు ప్రయోజనములేదు' అని. కనుక నిత్య తృప్తులైనవారు నిరాశ్రయులుగ నుండక ఎట్లుందురు ?

నిరాశ్రయ శబ్దమునకు భగవంతునికంటె ఇతరమును ఆశ్రయించనివారని అర్థము చెప్పవలయునేగాని, భగవదాశ్రయముకూడ లేనివారని అర్థముచెప్పుట శాస్త్రవిరుద్ధము. నిర్గుణశబ్దమువలె - "యథా నిర్గుణః సత్త్వాది ప్రాకృతగుణ రహితః, కల్యాణగుణః పరిపూర్ణః, తథా నిరాశ్రయః ఇతరాశ్రయ రహితః భగవదాశ్రయ సంపన్నః ఇతిభావః"

"నిర్గుణుడనగా సత్త్వాది ప్రాకృతగుణములు లేనివాడు.

కల్యాణగుణ పరిపూర్ణుడు. అట్లే నిరాశ్రయుడు అనగా ఇతరాశ్రయము లేనివాడు. భగవదాశ్రయ సంపన్నుడు.

ఇట్టివాడు కర్మలయందు ఎంతగా ప్రవర్తించుచున్నను, ఏమియును చేయనివాడే అగుచున్నాడు.

గీతలో చర్చింపబడిన విషయము కర్మ చేయుటయా చేయకపోవుటయా అనికాదు. కర్మనెట్లుచేయుట అని. కర్మ ఎట్లు చేసిన బంధనమగును ? ఎట్లుచేసిన ముక్తిప్రదమగును ? ఈ విషయమే బాగుగా చర్చించబడినది. దీనినే ప్రవృత్తిమార్గమనియు, నివృత్తిమార్గమనియు పెద్దలు పలుకుదురు. కాని ఇప్పుడు కొంతమంది, ప్రవృత్తిమార్గమనిన కర్మచేయుట అనియును, నివృత్తిమార్గమనిన కర్మ చేయకుండుట అనియును పొరబడుచున్నారు. ప్రవృత్తిమార్గమనగా మరలమరల సంసారములోనికి వచ్చుచు పోవుచునుండు మార్గమనియు, నివృత్తిమార్గమనగా మరల సంసారములోనికి రానిమార్గమనియు అర్థము. కర్మచేయుటయా, చేయకపోవుటయా అను ప్రశ్నకిక్కడ తావులేదు. కర్మ చేయకపోవుట గీతకెంతమాత్రమును సమ్మతముకాదు. గీతలో ప్రతిపాదింపబడినది మాత్రము నివృత్తిమార్గమే. శాస్త్రవిహితమైన వర్ణాశ్రమ ధర్మములను, కర్మములను నిష్కామముగా, అహంకార మమకారములు లేక, భగవత్కైంకర్యబుద్ధితో చేసినయెడల, అది నివృత్తిమార్గము. కామ్యముతో యజ్ఞయాగాదులు చేయుట ప్రవృత్తిమార్గము. రెండవ అధ్యాయ

ములో వేదవాదరతులు, నాన్యదస్తీతివాదులు, కామాత్ములు, స్వర్గపరులు, అవిపశ్చితులు, అపహృతచేతసులు, భోగైశ్వర్య ప్రసక్తులు, అని కృష్ణపరమాత్మచేత చెప్పబడినవారు ప్రవృత్తి మార్గనిష్ఠులు. వీరు ఈలోకమునుండి ఉత్తరలోకములకును, ఉత్తరలోకములనుండి ఈలోకమునకు, మరలమరల చుట్లు పెట్టుచుందురు.

కనుక ఈ శ్లోకములో చెప్పబడిన కర్మలయందును, వానిఫలములందును, అహంకారమమకారములు, ఫలాభిసంధి లేక, పరమాత్మచేతిలో పరికరముగానుండి నిత్యతృప్తుడై, నిరాశ్రయుడై కర్మలుచేయు మహాపురుషునకు ఆ కర్మము లంటవు. కనుక ఏమియును చేయనివాడే అగుచున్నాడు. నివృత్తిమార్గనిష్ఠుడనగా ఇతడే. కాని, ఇంద్రియముల ద్వారమున మాత్రము కర్మలు చేయక ఊరకయున్నవాడు పైకిమాత్రము కర్మలు చేయకపోయినను, మనసు పరమాత్మయందు లేక పోవుటచే అన్ని కర్మలను చేసినట్లే అయి బంధనము మాత్రము తప్పుటలేదు అని భావము.

శ్లో॥ నిరాశీ ర్యతచి త్తాత్మా
త్యక్త సర్వ పరిగ్రహః।
శారీరం కేవలం కర్మ
కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ ౧౨

ప. వి :—నిరాశీః, యతచిత్తాత్మా,త్యక్తసర్వపరిగ్రహః,శారీరం, కేవలం, కర్మ, కుర్వన్. న, ఆప్నోతి, కిల్బిషం.

టీక :—

నిరాశీః = ఆశలు లేనివాడును,
యతచిత్తాత్మా = స్వాధీనమైన మనస్సును, ఇంద్రియములును కలవాడును,
త్యక్తసర్వపరిగ్రహః = విడువబడిన సమస్తవస్తుసంపాదనము గలవాడునై,
శారీరం కేవలం కర్మ = కేవలము శరీరముతో కర్మలను,
కుర్వన్ = చేయుచున్నవాడైనను,
కిల్బిషం = పాపమును,
నాప్నోతి = పొందడు.

తా. ఆశలేనివాడును, మనస్సు ఇంద్రియములు వీనితో కూడ శరీరమును జయించినవాడును, తనదని ఒకటియును లేకుండ సర్వమును త్యజించినవాడును నైన మహాపురుషుడు కేవలము శరీరముతోను, ఇంద్రియములతోను కర్మలు చేయుచున్నను పాపమును పొందడు.

అ మృ త వా హి ని :—

ఇరువదియవశ్లోకములో చెప్పబడిన మహాపురుషుని కంటె, ఈమహాపురుషుడు వేరైనవాడుగా కొందరు భావించుచున్నారు. అట్లు భావించవలసిన అవసరమేమియును కనబడుటలేదు. ఇరువదియవశ్లోకము మొదలు ఇరువది మూడవ శ్లోకమువరకును ఒకమహాపురుషుని గూర్చియే

వర్ణింపబడియున్నది అనుటే సమంజసముగ కనబడుచున్నది. కొన్నిచోట్ల పైకి పునరుక్తిదోష మున్నట్లు కనబడుటవలన దానిని పరిహరించు నుద్దేశముతో కొంతమంది, ఈ నాల్గు శ్లోకములలో వర్ణింపబడినది వేరువేరు మహాత్ములు అని సిద్ధాంతముచేసి తృప్తిపడుచున్నారు. అంత బాధపడనక్కర లేదు.

నిరాశీః - బ్రహ్మలోకపర్యంతమైన భోగములందుకూడ, చివరకు మోక్షమునందుకూడ ఎంతమాత్రమును ఆశ లేనివాడు. నిత్యతృప్తుడు నిరాశ్రయుడును అయినవానికి ఆశ ఉండునా ?

యతచిత్తాత్మా - శరీరము, ఇంద్రియములు, మనస్సు స్వాధీనములో ఉన్నవాడు.

ఎవనికి ఆశ లేదో, వానికి శరీరము, ఇంద్రియములు, మనస్సు అధీనములోనే ఉండును. ఆశ ఉన్నవానికి ఇవి తాను చెప్పినట్లు వినవు. స్వాధీనములో ఉండవు. గీతలోనే కృష్ణ భగవానుడు, పదునారవ అధ్యాయమున "ఆశాపాశశతై ర్బద్ధాః" అని అన్నాడు. అనగా 'ఆశలనెడి వందలకొలది పాశములచేత కట్టుబడినవారు' అని. శరీరము మోకులచేతనో, గొలుసుల చేతనో బంధింపబడియున్నప్పుడు ఆ శరీరము స్వాధీనములో ఉండునా ? ఇష్టమువచ్చినట్లు ఉపయోగించుకొనుటకు వీలుండునా ? అట్లే ఆశలు మిక్కుటముగా ఉన్నవారికి, శరీరము, ఇంద్రియములు, మనస్సు కూడ స్వాధీనములో

ఉండవు. ఇక్కడ చెప్పబడిన మహాపురుషులు ఎంతమాత్రమును ఆశ లేనివారు. కనుకనే శరీరము, ఇంద్రియములు, మనస్సు స్వాధీనములో ఉన్నవారు అని చెప్పబడినది.

మనస్సు ఇంద్రియములు రాగద్వేషములకు స్థానములు. రాగద్వేషములు మనోబుద్ధీంద్రియములనే ఆశ్రయించుకొని ఉండును. కాని మహాత్ముల విషయముమాత్రము వేరు. వీరి మనో బుద్ధీంద్రియములు రాగద్వేషరహితములు. కనుక వారి మీద శబ్దాది విషయసాంగత్యముయొక్క ప్రభావము ఏమాత్రమును పనిచేయలేదు. వారి శరీరము కూడ ఎప్పుడు ఎక్కడ ఎట్లు ఉంచదలచిన అప్పుడు అక్కడ అట్లే ఉండును. కనుకనే వారిని 'యతచిత్తాత్ములు' అన్నారు.

త్యక్తసర్వపరిగ్రహాః - అనగా సృష్టిలో ఏవస్తువుమీద గాని, ఏవ్యక్తిమీదగాని, ఏభోగమునందుగాని మమకారము, ఆశ ఎంతమాత్రమును లేకపోవుటచే, "యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం" అనియును, "సంతుష్టో యేన కేనచిత్" అనియును, "యదృచ్ఛాలాభసంతుష్టః" అనియును చెప్పినట్లు, అనేక భోగములు సంప్రాప్తించినను, అనేక కష్టములు, నష్టములు సంభవించినను రాగద్వేషములు లేక, అనుభవించుచుండును. ఒక్కొక్క మహాత్మునిలో ఒక్కొక్క గుణము ప్రధానముగా ప్రకాశించుచుండును. కాని పూర్ణ బ్రహ్మానుభావునిలో అన్ని గుణములును ప్రకాశించును,

ఈ 'యదృచ్ఛాలాభసంతుష్టః' అనుటకు ప్రబలమైన ఉదాహరణము అజగరమహర్షి -

అజినవల్కల దుకూలాంబరంబులు గట్టి
యైన గట్టకయైన నలరుచుందు
అందోళికా రథ హయనాగముల నెక్కి
యైన నెక్కకయైన నరుగుచుందు
కర్పూర చందన కస్తూరికాలేప
మైన భూరజమైన నలదుకొందు
తల్పశయ్యలనైన తర్ణశిలాతృణ
భస్మంబులందైన బండుచుందు

మానయుక్తమైన మానహీనంబైన
తీయనైన మిగుల తిక్తమైన
గుడుతు సగుణమైన గుణవర్జితంబైన
అల్పమైన చాల అధికమైన.

లేదని ఎవ్వరి నడుగను
రాదని చింతింప,పరులు రప్పించినచో
కాదని ఎద్దియు మానను
ఖేదముమోదమునులేక క్రీడింతు మదిన్.

ఇది ప్రధానమైనగుణము అజగరర్షిలో. ఈ గుణమునకుమహా ప్రతిసాధకుడును ఈఋషిని ఆదర్శముగ పెట్టుకొనవలయును.

ఇటులన్నంతమాత్రమున ఇక ఏపనియును ముట్టుకొన గూడదను భ్రమ కలుగరాదు. ఈ ఒక్కగుణము మాత్రమే నూటికినూరుపాళ్ళున్నను పూర్ణమానవుడు కాడు. మమకారము,

ఆశ మొదలగునవి ఎంతమాత్రమును లేని జనకచక్రవర్తివలె, కర్మవీరుడు కావలయును. ఆయన ఒక్కక్షణము విశ్రాంతి లేకుండ రాజకార్యకలాపములలో మునిగియుండెడివాడు. కాని ఆయన అంతఃకరణములో దేనియందును 'ఇది నాది' అనుభావమే ఈషణ్మాత్రమును లేదు. మిథిలనగరమంతయును తగులబడిపోయినను, తన దేమియును ఒక్క గడ్డిపరక కూడ పోలేదు అని చెప్పుకొన్న ధీరుడు.

ఓర్పులో ఏకనాథుడు, సమర్థరామదాసు మంచి ఆదర్శ పురుషులు.

ఏకనాథుడు ఒకనాడు గంగానదినుండి స్నానముచేసి వచ్చుచుండుగా, త్రోవలోనున్న ఒక మహామ్మదీయుడు అన్యాయచేత, తన మేడమీదనుండి ఇన్నినీళ్ళు పుక్కిటబట్టి ఈయనమీద ఉమిసినాడు. వెంటనే చిత్తములో ఏమాత్రమును వికారములేకనే మరల గంగానదికిపోయి స్నానముచేసి వచ్చినాడు ఏకనాథుడు. మరల ఉమిసినాడు మహామ్మదీయుడు. మరల ఏకనాథుడు స్నానముచేసి వచ్చినాడు. ఇట్లు వంద మార్లు కుమించి ఉమిసినాడు మహామ్మదీయుడు. ఏకనాథుడు మామూలుగానే అన్నిమార్లును స్నానముచేసివచ్చుచున్నాడు. పాపము ఆ మహామ్మదీయునికి ఆశ్చర్యమును, వెనువెంటనే పశ్చాత్తాపమును కలిగినవి. చప్పున మేడదిగివచ్చి ఏకనాథుని పాదములపై బడి క్షమాభిక్ష వేడుకొన్నాడు. అసలు ఏకనాథుడు

క్షమాస్వరూపుడుగదా! అయనకు కోపమువచ్చినగదా క్షమించుటకు! ఆనందించి, లేవదీసి ఆశీర్వదించి పంపినాడు.

సమర్థరామదాసు శివాజీ గురువు. ఇంకను ఆయన కొరకు ప్రాణములనుగూడ అర్పించుటకు సిద్ధముగానున్న శిష్యులు ఎన్నో వేలమంది గలరు. ఒకప్పుడు ఆయన శివాజీని చూచుటకై పోవుచుండెను. ఆయన వెంట కొంతమంది శిష్యులు గలరు. కొంతదూరము పోయినతర్వాత శిష్యులు ఆకలివేయుచున్నదని చెప్పిరి. అంతట సమర్థరామదాసు ప్రక్కనేఉన్న ఒక జొన్నచేనునుజూపి 'మీరు దానిలో ఎన్ని ఊచబియ్యము తినినచో మీ ఆకలితీరునో అంతమాత్రమే తిని రావలసినది' అని చెప్పినాడు. వారుపోయి భుజించుచుండిరి. సమర్థరామదాసు ఒక చెట్టుక్రింద పరుండియున్నాడు. ఆ చేనురైతు ఐశ్వర్య సంపన్నుడు. ఆయనవచ్చి చూచునప్పటికి తన పొలములో ఈ గోచిపాతరాయుళ్ళు జొన్నకంకులు కొట్టుకొని తినుచున్నారు. పట్టలేని కోపమువచ్చినదా యజమానికి. ఇటు జూచునప్పటికి చెట్టుక్రింద సమర్థరామదాసు కనుపడినాడు. ఈ దొంగలకు గురువు ఈయనయే యనియు, ముందుగా ఈయనకు బడితపూజ చేసిననేగాని తక్కినవారికి బుద్ధిరాదనియు భావించి, ఒకదంటుతీసికొని సమర్థరామదాసును వీపు చిట్లునట్లు, దంటువిరిగిపోవువరకును బాదినాడు. వీపు రక్తము కారుచున్నది. శిష్యులకు కోపమువచ్చినది. కాని సమర్థరామదాసుని ఆజ్ఞ - ఎవరును ఏమియును అనరాదు, ఇక

ఎవరేమి చేయుదురు ? తన కండ్లయెదుట తమగురువును బట్టి వీపు బ్రద్దలుకొట్టుచున్నను శక్తిగలిగియును ఏమియును ప్రతిక్రియ చేయక ఊరకుండవలసివచ్చినది. శివాజీతోకూడ చెప్పవద్దని బాగుగా కట్టుదిట్టముచేసినాడు సమర్థరామదాసు. వారమురోజులు శివాజీయొద్దనున్న తరువాత ఒకనాడు శివాజీకి తాను స్వయముగా గురువునకు అభ్యంజనము చేయించవలయునని సంకల్పము కలిగినది. గురుదేవులపాదములపై బడి అర్థించినాడు. సమర్థరామదాసు ఏమియును అనలేకపోయినాడు. కాని రైతు తన వీపు చిట్లకొట్టినవిషయము శివాజీకి తెలిసిపోవును అని మాత్రము భయపడినాడు. ఆభయమెందులకన, శివాజీ ఛత్రపతి, తనగురువునకు ఇట్టి మహాపరాధము చేసినవానికి ఎంతటి ఘోరశిక్ష విధించునో! గత్యంతరములేక అంగీకరించినాడు. వీపునకు తైలము పట్టించుటకై వీపువంక చూచునప్పటికి వీపంతయును అట్టలుకట్టి అప్పుడే ఎండుచూపుచున్నపుండ్లు కనబడినవి. ఇదేమి అని అడిగినాడు కంగారుగా కోపముగా జరిగిన సంగతి అంతయును చెప్పినాడు సమర్థరామదాసు. వెంటనే ఆ రైతునకు కబురు పంపినాడు శివాజీ అంతకుముందే ఆ రైతునకు తెలిసినది తాను కొట్టినది సామాన్యుని కాదనియును, ఛత్రపతి శివాజీయొక్క గురువు అనియును. తనజీవితము మీద ఆశవదలుకొనియేయున్నాడు. ఇంతలో ఈ కబురుకూడ వచ్చినది. ఇక మరణదండనము తప్పదు, అని అందరకును అప్పగింతలు పెట్టుకొని గొల్లున

ఏడ్చుచు వచ్చినాడు. ఈ లోపల జరిగినదేమి ? ఆతనికి శిక్ష వేయు బాధ్యత తనకే విడువవలసినదిగ తన గురుత్వాధికారముతో చెప్పినాడు సమర్థరామదాసు. 'దయాస్వరూపుడు గనుక కొంచెము శిక్షతగ్గించునేమో, మనము ఏమిచేయగలము !' అని శివాజీ అంగీకరించినాడు. రైతు వచ్చినాడు - తనచేత దెబ్బలుతినిన సాధువు సింహాసనముమీద కూర్చొని యుండుట చూచినాడు. ప్రక్కన శివాజీ చేతులుకట్టుకొని నిలబడి యున్నాడు. ఇది చూచిన ఆ రైతునకు గుండె జల్లుమని పోయినది. ప్రాణములపై ఆశ పూర్తిగా వదలుకొన్నాడు. సమర్థరామదాసు తనను కొట్టినవానికి ఏమిశిక్ష విధించవలయునో ఒక కాగితముమీద వ్రాసి, చదువుటకు ఆ కాగితము శివాజీ చేతికిచ్చినాడు- శివాజీ ఆశ్చర్యపోయినాడు -

ఏమున్నదా కాగితములో ? ఒకమంచి గ్రామము - పుత్రపౌత్ర పారంపర్యముగ సర్వాధికారములతో అనుభవించవలసినది అని ఉన్నది. ఇదా శిక్ష అని శివాజీ ఉడికిపోయినాడు. అయితే ఏమిచేయగలడు - గుర్వాజ్ఞ. సరే; ఆ నేరస్థుడు విన్నాడు ఈ తీర్పు. ఆతనికి భరించలేని ఆవేదన కలిగినది. ఒక్కసారి పాదములపైబడి కన్నీటిచే పాదములు కడుగుచు, నివేదించుకొనినాడు - 'ప్రభో! ఇక మరణదండన తప్పదన్న నిర్ణయముతో ఆశలన్నియును వదలుకొని వచ్చితిని. తమరు ఇచ్చిన ఈ శిక్షవినిన గుండె బ్రద్దలైపోవుచున్నది. మీకింత

మహాపరాధముగావించిన ఈ మహాపాపియందు ఈ కరుణ చూపించుట తగునా ? తమ రీతిక్షచెప్పిన తరువాత, దీని కంటె మరణదండనమే మేలని తోచుచున్నది. ఇక ఈ నా పాపమునకు పరిహారమున్నదా తండ్రీ!' అని వాపోయి నాడు. 'నాయనా! ఈపశ్చాత్తాపమే నీ పాపములన్నిటిని కడిగి వేసినది. పవిత్రుడవైతివి పొమ్ము! సుఖముగానుండుము !' అని సమర్థరామదాసు ఓదార్చి పంపినాడు.

ఈ ఓర్పు అనన్యసామాన్యముగదా! కేవలము ఓర్పే సమర్థరామదాసుగా అవతరించెనేమో అనిపించును.

కేవలము అహింసయొక్క అవతారమే బుద్ధభగవానుడు. ఇట్లు ఒక్కొక్క మహాగుణము ఒక్కొక్కరిలో బాగుగా ప్రజ్వరిల్లుచుండును. పూర్ణమానవునిలో అన్ని మహాగుణములును మహోజ్జ్వలముగా ప్రజ్వరిల్లుచుండును. ఇట్లు ఈవిషయమంతయును ప్రసంగాంతరముగా వచ్చినది.

ప్రస్తుతమేమనిన 'త్యక్తసర్వపరిగ్రహాః' అని - దేని మీదను వారికి మమకారము ఆసక్తి మొదలగునవి ఉండవు. ఇట్టి మహాత్ములు కర్మలు చేసినను బంధనములంటవు. శరీరము ఇంద్రియములు మాత్రము కర్మలో ప్రవర్తించుచున్నను, మనస్సుమాత్రము పరమాత్మయందే చలనములేకుండ నిలచి యుండుటచే ఆ కర్మలు ఇతనిని బంధించలేవు.

కొందరు 'శారీరం కేవలం కర్మ కుర్వన్' 'కేవలము

శారీరక కర్మలు' అని అర్థముచెప్పి, 'ఏ యే కర్మలు చేయక పోయిన శరీరము నిలువదో, ఆ కర్మలు మాత్రము' అని వ్రాసి యున్నారు.

కాని, కర్మలను జూచి అంతభయపడవలసిన పనిలేదని మా అభిప్రాయము.

ఇట్టిమహాత్ములు కర్మ చేసినను పుణ్యకర్మ లే చేయుదురు గాని పాపకర్మలు చేయరుగదా ! ఇక వారు కర్మలు చేసినను పాపమంటదు అనుట ఎందులకు ? అట్లనుటచేత మహాత్ములైన తరువాత పాపము చేసినను భయములేదు; ఆ పాపము వీరి నంటదు అను అర్థము ధ్వనించుటలేదా అని ప్రశ్న రావచ్చును.

ఇక్కడ 'కిల్బిషం' అనగా రెండు రకములుగా అర్థము చెప్పవలయును -

మొదటిది - బంధము అని. పుణ్యమును బంధనమే; పాపమును బంధనమే. పాపము చేయక పుణ్యముచేసినను, స్వర్గాదిభోగములచేతను, మంచి జన్మలచేతను పరమగతికి పోనీయక బంధించుచున్నది పుణ్యము. కనుక ఈ బంధనమును దృష్టిలో ఉంచుకొని బంధనమును 'కల్బిషం' అని ప్రయోగించినాడు.

రెండవ అర్థము - 'కిల్బిషం' అనగా పాపమే. జగత్తులో పాపపుణ్యమిశ్రితముకాని కర్మయే లేదు. ఆ పాపపుణ్యముల

పాళ్ళు హెచ్చుతగ్గులు కావచ్చును. ఇతర జీవులకు బాధ కలిగించుటయే పాపము; హితము కలిగించుటయే పుణ్యము. మానవుడు కాయిక వాచిక మానసికకర్మలలో దేనిని చేసినను, కొంతమందిజీవులకు అహితము, కొంతమందిజీవులకు హితము జరుగుచుండునేగాని, ఏపనిలోను కేవలము అందరికిని హితమే గాని, అహితమేగాని జరుగదు. పోనీ కొంతమందికి హితము గలిగి, మిగిలినవారికి హితముగాని, అహితముగాని, ఏది యును లేక ఉండునేమో అని అనుకొనుటకును వీలులేదు. నూటికి ఒక్కనికి హితము గలిగి మిగిలిన తొంబది తొమ్మిది మందికిని హితము, అహితము కూడ లేకుండనున్నచో అదికూడ పాపమిశ్రితముకాని పుణ్యమే. అట్లుండదు. తొంబది తొమ్మిది మందికిని హితము కలిగి, ఒక్కనికి అహితము కలిగినచో అదియును పాపమిశ్రితమే.

ఇట్లు విచారణ చేసికొన్నయెడల, ఏ పనిలో ఇతరుల కెక్కువ హితము, తక్కువ అహితమును ఉండునో, ఏపనిలో ఎక్కువమందికి హితము, తక్కువమందికి అహితము ఉండునో, అవన్నియును పుణ్యకార్యములే. ఆ పనులు మానవుడు చేయక తప్పదు. అప్పుడు ఆ పనిలోని పాపము ఇట్టి మహాత్ముల నంటదు. 'నాచేత ఒక్క జీవికిగూడ అహితము జరుగరాదు. అట్లు జరిగినయెడల ఆ పనిని నేను ముట్టుకొనను' అని అనరాదు. అట్లు ముట్టుకొనకుండ కూర్చొనుటకు మానవునకు అధికారమునులేదు; అట్లు కూర్చొననులేడు. కనుక, ఈ

లోకమున జన్మించిన తరువాత పాపము చేయను అనుకొను టకు ఎవ్వనికిని అధికారములేదు; శక్తియునులేదు. ఎవరైనను అట్లు భీష్మించుకొని కూర్చున్నను, ఆ భీష్మించుకొనుట వృథయే కాగలదు. అవసరము వచ్చినప్పుడు చేయడు. అనవసరసమయములో చేసియేతీరును. ఇదే అభిప్రాయమును కృష్ణపరమాత్మ అర్జునునితో "యదహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే,మిథ్యైషవ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి" 'అర్జునా! యుద్ధముచేయను అని నీవు పట్టు దలతో ఊరకొన్నను, నీ పట్టుదల వృథయే అగును. నీ ప్రకృతియే నిన్ను బలవంతముగా యుద్ధము చేయించును' అని చెప్పియున్నాడు.

కాన, ఎవడును, ఎప్పుడును, ఏమియును చేయకుండ ఎట్లును ఉండలేడు. తనకు విధ్యుక్తమైన ధర్మమును జూచి, దీనిచేత మనకు దోషముకూడ సంభవించును అను భయ ముతో ఎవడైనను అప్పుడు ఆ పనిచేయక ఊరకున్నను, అతనిని ప్రకృతి ఆ వ్రతముమీద నిలచి ఉండనీయదు. "కార్య తే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః" అని మూడవ అధ్యాయములో అయిదవ శ్లోకమున చెప్పబడియున్నది. కనుక, ఎట్లును చేయక తప్పనప్పుడు, దేశము, కాలము, పరిస్థితి గమనించి తన విధ్యుక్త ధర్మములను, తన కర్తవ్య కర్మలను చేయుచుండవలయును. అట్లు నిష్కామ్యముగా తన విధ్యుక్త

కర్మలను, ధర్మములను చేయుచున్నయెడల, ఆ కర్మలోని పుణ్యపాపములంటవు.

ఒకడు రైలుబండిని నడుపుచున్నాడు - దగ్గరకు వచ్చిన తరువాత ఆ పట్టాలమీద ఒక మనుష్యుడు కూర్చొని కనుపించినాడు. ఆతనికి ఘోరమైన చెవుడు. అందువలన వెనుకనుండి బండివచ్చుధ్వని వినలేడు. అప్పుడా నడుపువాడు ఏమిచేయవలయును? బండి అకస్మాత్తుగా ఆపినయెడల బండిలోని కొన్ని వందలమందికి మరణము సంభవించును. పోనిచ్చినయెడల పట్టాలమీదనున్న ఆ వ్యక్తి మరణించును. ఆ నడుపువాడు, బండిని ఆపుట ధర్మమా? పోనిచ్చుట ధర్మమా? ఈ రెండును కాకుండ చేయదగినది ఏది? ఈ రెండును పనులే. ఏది ధర్మమో తెలియనప్పుడు ఊరక కూర్చొందును అనుటకును వీలులేదు. ఈ కూర్చొనుట ఈ రెండుపనులలో ఒకటైన బండిని పోనిచ్చుటలోనికే వచ్చును. అయితే, అప్పుడు ఆపుట, పోనిచ్చుట - ఏదిచేసినను ప్రమాదము తప్పదు. కాని ఈ రెండు ప్రమాదములలో ఏది హెచ్చు? ఏది తగ్గు? ఏది అన్యాయము? ఏదిన్యాయము? ఆలోచించవలయును. జాలిపడుచు అయినను, బండినిమాత్రము ఆ పట్టాలమీదనున్న మనుష్యునిమీదనుండి పోనీయవలసినదే. అదే నడుపువాని ధర్మము, విధియునుకూడ. అట్లు చేయుటలో ఆ పట్టాలమీదనున్న మనుష్యుడు మరణించుట చేత కలిగెడి పాపము ఈ నడుపువానికి అంటదు. ధర్మముల

స్వరూపము బాహ్యముగా అనేకభేదములుగా కనుపడవచ్చును. మానవపుష్టైనవాడు ఏధర్మమునుగూర్చి ఆలోచించినను, ఇతరులకు హితముచేయుట, హితముజరుగుట అను మూలసిద్ధాంతమును ఆశ్రయించియే ఆలోచించవలయును. మానవజీవితము ఇతరులకు హితముచేయుటకే ఏర్పడినది. ఇక్కడఉన్న రహస్యమేమనగా, ఎవరును అందరకు హితముగా ప్రవర్తించలేరు. తనవలన ఇతరులకు జరుగు హితము న్యాయమైనదా, అన్యాయమైనదా అని ఆలోచించవలయును.

ఇద్దరిమధ్య ఒకవ్యవహారము జరుగుచున్నది. రెండు పక్షములవారును తన పక్షమే నెగ్గవలెననెడి అభిలాషతోనే ఉందురు. కనుక తమపక్షము నెగ్గుటయే తమకు హితమని తలంచుచుందురు. కాని న్యాయాధిపతి ఇద్దరకును హితము చేయగలడా ? ఎవరికో ఒకరికి హితము జరుగును. ఒకరికి అహితము జరుగును. అయితే, ఎవరిపక్షము న్యాయమో విచారించి, మొగమోటము, అభిమానము, మమకారము మొదలైనవి లేకుండ న్యాయాధిపతి తీర్పుచెప్పినప్పుడు ఒకరికి హితముకలిగి, మరొకరికి అహితము కలుగుటలో, న్యాయాధిపతికి ఆ పాపమంటదు. ఇట్లే ప్రతివ్యవహారమును ఆలోచించవలయును.

అందరకును మంచిగా ఉండవలయునని ప్రయత్నించువాడు వెఱ్ఱివాడు. ఆహారపదార్థములకు సంబంధించినపంటకు

నష్టముకలుగజేయు పురుగులకు రైతు మందు వేయును. ఎలుకలను చంపించును. వీనివలన రైతుకు పాపములేదు. పరిసరగ్రామములకు ప్రమాదమును గలుగజేయు క్రూర జంతువులను రాజులు వేటాడుదురు. ఆ క్రూరమృగములను చంపుటచేత రాజులకు పాపములేదు. దానివలన ప్రజల కెంతయో మేలుకలుగుచున్నది. అన్నిపనులలోను మంచి, చెడ్డ, కలిసియే యుండును. విచారణశీలుడు ఏపనిలో మంచి ఎక్కువ ఉన్నది అను విషయమును గమనించి, ఆపనిని చేయవలయును. ఏపనిలో ఎక్కువచెడ్డఉన్నది. అనునది గమనించి ఆపనిని విడిచిపెట్టవలయును.

ఈ సిద్ధాంతము మీదనే ఆధారపడి కృష్ణపరమాత్మ పైన చెప్పిన 'మహాత్ములు కర్మలుచేసినను పాపమంటదు' అనుట. అంతియేకాని మహాత్ములు పాపము చేయుదురు; అయినను వారికి పాపము అంటదు అని విపరీతార్థము చెప్ప రాదు.

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో
ద్వంద్వాతీతో విమత్సరః ।
సమ స్సిద్ధావసిద్ధౌచ
కృత్వాపి న నిబధ్యతే॥ ౨౨

ప. వి :—యదృచ్ఛాలాభసంతుష్టః, ద్వంద్వాతీతః, విమత్సరః, సమః, సిద్ధౌ, అసిద్ధౌ, చ, కృత్వా, అపి, న, నిబధ్యతే.

టీక :—

యదృచ్ఛాలాభసంతుష్టః = అయాచితముగాలభించిన దానితో తృప్తిపడియుండువాడును,
ద్వంద్వాతీతః = ద్వంద్వముల కతీతుడును,
విమత్సరః = అసూయ లేనివాడును,
సమస్సిద్ధావసిద్ధౌచ = సిద్ధించుటయందును, సిద్ధించక పోవుటయందును సమభావము వాడును అయిన మహాత్ముడు,
కృత్వాపి = కర్మలను చేసియును గూడ,
న నిబధ్యతే = బంధింపబడడు.

తా. ప్రారబ్ధకర్మానుసారము లభించినదానితో తృప్తి బొందియుండు వాడును, ద్వంద్వముల కతీతుడును, ఎంతమాత్రమును అసూయలేని వాడును, సిద్ధించుటయందును, సిద్ధించకపోవుటయందును సమత్వముగల వాడునునైన మహాత్ముడు కర్మలు చేసియును కూడ బంధింపబడడు.

**అమృత వాహిని :-**

ఈ శ్లోకములో కూడ పరిపూర్ణమైన మహాత్ముల విషయమే చెప్పుచున్నాడు.

'యదృచ్ఛాలాభసంతుష్టః' అనగా ఏ సమయమునకు ఏది ఎట్లు లభించిన దానితోడనే సంతుష్టి చెందియుండువాడు.

యథార్థమాలోచించిన ఏ మానవునకును తనయిచ్ఛాను సారముగా ఈ జన్మలో జరుగదు. వెనుకటి జన్మలలో తాను

చేసిన కర్మలయొక్క ఫలము ఇప్పుడు అనుభవించుచున్నాడు. మరల క్రొత్తగా కర్మలు చేయుటకు మానవునకు అధికార మున్నదేగాని, వెనుకటి జన్మలలో చేసిన కర్మలలో ఎంత భాగము ప్రారబ్ధముగా పంచబడినదో, దానినుండి తప్పించుకొనుటకుగాని, దానినిమించి అనుభవించుటకుగాని అధికారములేదు. మంచిగాని, చెడ్డగాని, ప్రారబ్ధము అనుభవించక ఎవరికిని తప్పదు. దానిని బ్రహ్మదేవుడుకూడ తప్పించలేడు; భగవంతుడు తప్పించడు; మార్చడు; తగ్గించడు; హెచ్చింపడు. ఇది అచలమైన భగవన్నియమము. ఈ రహస్యము తెలిసిన మహాత్ములు దేనికొరకును ఏకారరు. ఏది లభించిన అదియే భగవత్ప్రసాదమని ఆనందముతో తలదాల్చి అనుభవింతురు. అది లాభమా, నష్టమా, జయమా, అపజయమా, సుఖమా, కష్టమా, బ్రతుకా, చావా - ఈ భేద భావమే వారికుండదు. "యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం" అని యుందురు. వారికి అనుకూల పదార్థములు లభించినప్పుడు సంతసించుటయును, వానిని కాపాడుకొనుటకును, వృద్ధిపొందించుటకును ప్రయత్నించుటయును, ప్రతికూల పదార్థములు లభించినప్పుడు ద్వేషించుటయును, దుఃఖించుటయును ఉండదు. అన్ని సందర్భములలోను, ప్రారబ్ధమని, భగవంతుని విధానమని తెలిసికొని శాంతముతోను, ప్రసన్నచిత్తముతోను ఉందురు.

దేవాలయమునకు పోవుట భగవత్ప్రసాదమండలి

పూజ్యభావముతోనేగదా ! అక్కడ ప్రసాదముగ పులిహోర లభించిననేమి ? దధ్యన్నము లభించిననేమి ? శర్కరపొంగలి లభించిననేమి ? చప్పిడి పొంగలి లభించిననేమి ? ఏది దొరికినను మహాభాగ్యమని కండ్లకద్దుకొని, ఆనందముతో అనుభవింతుము. కారమెక్కువైనదని, బెల్లము తక్కువైనదని తేలిక భావముతో ప్రసాదమందు ఏమాత్రమైనను నిరసన చూపువాడు మహాపాపి.

అట్లే భగవంతునిచేతనే మనకర్మల యొక్క ఫలముగా ప్రసాదించబడిన ప్రారబ్ధము మహాప్రసాదముగా ఆనందముతో అంగీకరించి అనుభవించవలయును. పూర్తిగా కాంక్షలు పోయిన మహాత్ములుగాని అట్లుండలేరు.

'ద్వంద్వాతీతః' అనగా ద్వంద్వములకు అతీతుడైన వాడు. ద్వంద్వములనగా సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు, శీతోష్ణములు మొదలైన అనుభవములు. వీనిని జయించనివారు యదృచ్ఛాలాభసంతుష్టులుగా ఉండలేరు. ప్రారబ్ధకర్మానుసారము ఏది లభించినను, ఒకరు తిట్టినను, పొగడినను, ఒకరు కొట్టినను, పూజించినను, అంతఃకరణమునందు ఏవిధమైన వికారమును లేకయుండుట ద్వంద్వాతీతస్థితి.

'విమత్సరః' - ఇతరుల ఉన్నతి చూచి ఓర్వలేనితనము చేత - అనగా విద్యలోగాని, బుద్ధిలోగాని, ఐశ్వర్య

ములోగాని, గౌరవమర్యాదలలోగాని, సుగుణసంపత్తిలోగాని, ఇంకను ఏ విషయములోగాని, ఇతరులు పైకి వచ్చుచున్న యెడల సహించలేనితనముచేత అంతఃకరణములో కలిగెడి ఒకవిధమైన వికారమును మత్సరము అందురు. మహాత్ములకు ఈ గుణము ఎంతమాత్రమును ఉండదు. అసూయ ఉన్నవాడు, భగవద్విషయము వినుటకే అర్హుడుకాడు. ఇంక మహాత్ము డెట్లగును ? కనుక 'మత్సరములేనివారు' అని చెప్పబడినది.

'సమస్సిద్ధావసిద్ధౌ' అనగా నెరవేరుటయందును. నెరవేరకపోవుటయందును సమముగా నుందువారు.

ప్రారంభించినపని నిర్విఘ్నముగా పరిసమాప్తి చెందుట సిద్ధి. మధ్యలో విఘ్నము చెందుట అసిద్ధి. ఏ ఉద్దేశముతో కర్మ చేయుచున్నామో, ఆ ఉద్దేశము నెరవేరుట సిద్ధి. ఆ ఉద్దేశము నెరవేరకపోవుట అసిద్ధి. ఇట్టి సిద్ధ్యసిద్ధులయందు సంతోషించుట, దుఃఖించుట సామాన్యమానవుని లక్షణము. మహాత్ములలో ఈ లక్షణము ఉండదు. 1

ఇట్టి మహాత్ములు కర్మ చేసియును బంధింపబడరు. కర్మలు వీరిని బంధించలేవు. 2

---

1 ఈ లక్షణమును గురించి రెండవ అధ్యాయములోని నలుబది ఎనిమిదవ శ్లోకముయొక్క వ్యాఖ్యానము చూడుడు.

2 కర్మలు ఎందువలన బంధించలేవో మూడవ అధ్యాయములోని నాల్గవ శ్లోకముయొక్క వ్యాఖ్యానమున చూడుడు.

శ్లో॥ గతసంగస్య ముక్తస్య
జ్ఞానావస్థిత చేతసః ।
యజ్ఞా యాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయతే ॥ ౨౩

ప. వి ;— గతసంగస్య, ముక్తస్య, జ్ఞానావస్థితచేతసః, యజ్ఞాయ' ఆచరతః, కర్మ, సమగ్రం, ప్రవిలీయతే.

టీక :—

గతసంగస్య = ఆసక్తిలేనివాడును,
ముక్తస్య = (అరిషడ్వర్గమునుండి) విడువబడినవాడును,
జ్ఞానావస్థిత చేతసః = బ్రహ్మజ్ఞానమందు నిలిచియున్న మనస్సుగలవాడును.
యజ్ఞాయాచరతః = యజ్ఞముకొరకే కర్మలు చేయువాడును అగు,
(అస్య = వానియొక్క)
కర్మ = కర్మ,
సమగ్రం = పూర్తిగా,
ప్రవిలీయతే = నశించిపోవుచున్నది.

తా. ఎవనియొక్క ఆసక్తిపూర్తిగ నశించినదో, ఎవడు ముక్తుడో, ఎవనియొక్క చిత్తము భగవద్విషయజ్ఞానమునందు నిలిచియున్నదో, ఎవడు యజ్ఞముకొరకే కర్మలు చేయుచున్నాడో, అట్టివానియొక్క సమస్త కర్మలును పూర్తిగ విలీనమై పోవుచున్నవి.

## అమృతవాహిని :-

భగవద్విషయజ్ఞానము బాగుగ కలిగిన మహాత్ములకు ఆసక్తి యుండదు; పూర్తిగ నశించును. కర్మయందుగాని, కర్మఫలస్వరూపములైన భోగములయందుగాని, ఎంతమాత్రమును కోరికయే ఉండదు. భగవద్ధ్యానామృతముయొక్క రుచిమరిగినవారికి ఇతరభోగము లెట్లు రుచించును ? ప్రహ్లాదుడు -

"మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీవీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు

అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు" అనియును,

యామునాచార్యులవారు - 'తవామృత స్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్యదిచ్ఛతి' అనియును, శంకరాచార్యులవారు - 'అస్మాకం యదునందనాంఘ్రియుగళ ధ్యానావధానార్థినాం కిం లోకేన దమేన కింనృపతినా స్వర్గాప

వరేశ్చైకిమ్' అనియును చెప్పియున్నారు. అట్టివారినిగూర్చియే, 'గతసంగస్య' అని చెప్పబడినది.

'ముక్తస్య' - ముక్తుడు అనగా సర్వబంధములనుండి విడివడినవాడు. సమస్తబంధములకును అనర్థములకును మూల కారణములు దేహాభిమానము, మమత్వము - ఈ రెండే. ఈ రెండును లేనివాడు మానవుడు ముక్తుడే.

'జ్ఞానావస్థిత చేతసః' - సర్వకాల సర్వావస్థలయందును భగవత్సంబంధమైన జ్ఞానమందే చలించకయుండు చిత్తము కలవాడు. కేవలము భగవదనుభవములోనే అచంచలముగా మగ్నుడై యుండువాడు. భగవంతుని జన్మలయొక్కయును కర్మలయొక్కయును దివ్యత్వమును బాగుగా తెలిసికొని అనుభవములో కలవాడై, ఒక్కక్షణముకూడ భగవంతుని మరువలేనివాడు.

ఇట్టిమహాత్ములు యజ్ఞముకొరకే కర్మలు చేయుదురు. వారికర్మలలో పరమార్థమేగాని ఈషణ్మాత్రముకూడ స్వార్థము ఉండదు.

యజ్ఞముకొరకు అనగా లోకసంగ్రహముకొరకు, లోక కల్యాణముకొరకు అని చెప్పికొనవలెను.

ఏమానవుడైనను లోకసంగ్రహమునే-అనగా పరమార్థ మునే-దృష్టిలో ఉంచుకొని, తన వర్ణమునకును, ఆశ్రమము నకును, అర్హమగు శాస్త్రవిహితమైన ఏకర్మ చేసినను, ఆ కర్మ

లన్నియును యజ్ఞముకొరకు చేయబడినవే. ఇక్కడ యజ్ఞమనగా లోకసంగ్రహమే. మూడవ అధ్యాయములోని తొమ్మిదవ శ్లోకములోగూడ "యజ్ఞార్థాత్కర్మణః" అని ఈ భావమే సూచించబడినది.

ఇట్టి మహాత్ముల యొక్క సమస్తకర్మలును పూర్తిగ నశించుచున్నవి. అనేక జన్మలలో చేయబడి, సంచిత రూపముగా మిగిలియున్న అన్నికర్మలును, ఆ కర్మలయొక్క సంస్కారములును, అంతఃకరణములో ఉండుటచే ఆ సంస్కారములవలన చేయబడినట్టియును, జ్ఞానము కలిగిన తరువాత లోకసంగ్రహార్థము చేయబడినట్టియును, ఈ జన్మలోని నవీన కర్మలు ఏ విధముగను బంధింపలేవు. బంధనహేతువులైన వెనుకటి జన్మలలోని కర్మలును, జ్ఞానము కలుగుటకు పూర్వమాచరించిన ఈ జన్మములోని కర్మలును నశించుచున్నవి. జ్ఞానము గలిగిన తరువాత చేయబడిన కర్మలు బంధించవు సరిగదా, లోకకల్యాణమున కుపకరించును.

ఇట్లు సమస్తకర్మలయొక్క బంధనములును నశించుచున్నవి.

**అవతారిక :—**

భగవత్ప్రాప్తికొరకు వర్ణాశ్రమ పద్ధతుల ననుసరించి ఎవరికి కర్తవ్యముగా ఏ యే కర్మలను శాస్త్రము విధించుచున్నదో, ఆ కర్మలు వారికి యజ్ఞములు. ఆ యజ్ఞముల

నెరవేర్చుటకై ఆవశ్యకములైన క్రియాకలాపములను నిస్స్వార్థ భావముతో, భగవత్కైంకర్యరూపముగా చేయుటయే యజ్ఞము కొరకు కర్మచేయుటయనగా. ఈ విధముగ భగవత్ప్రాప్తికి సాధనములైన కర్తవ్యకర్మలను అనేక విధములైన యజ్ఞములుగా వర్ణించిచెప్పుచు, ఈ శ్లోకములో సర్వము బ్రహ్మాత్మకమే గనుక, కర్మయొక్క బ్రహ్మాత్మకత్వము చెప్పుచున్నాడు :

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి
ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం
బ్రహ్మకర్మసమాధినా ॥ ౨౪

ప. వి :—బ్రహ్మ, అర్పణం, బ్రహ్మ, హవిః, బ్రహ్మాగ్నౌ, బ్రహ్మణా, హుతం, బ్రహ్మ, ఏవ, తేన, గన్తవ్యం, బ్రహ్మకర్మసమాధినా.

టీక :—

అర్పణం = స్రుక్ స్రువములనెడిపాత్రములు,
బ్రహ్మ = బ్రహ్మస్వరూపమే;
హవిః = నేయి,అన్నము మొదలగు హోమద్రవ్యములును,
బ్రహ్మ = బ్రహ్మమే;
బ్రహ్మాగ్నౌ = బ్రహ్మరూపమైన అగ్నియందు,
బ్రహ్మణా = బ్రహ్మస్వరూపుడైన యజమానిచేత,

హుతం = చేయబడు హోమమును,
బ్రహ్మ = బ్రహ్మమే;
బ్రహ్మకర్మసమాధినా = సర్వము బ్రహ్మస్వరూపమని
యెడి జ్ఞానముతో యజ్ఞమును చేయు,
తేన = బ్రహ్మజ్ఞానిచేత,
గన్తవ్యం = పొందదగినఫలమును,
బ్రహ్మైవ = బ్రహ్మమే.

తా. అర్పణము బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోత బ్రహ్మము. హోమముచేయుట అనెడి క్రియ బ్రహ్మము. ఇట్లు కర్మయందు బ్రహ్మభావన గలిగిన మానవుని వలన పొందబడు ఫలమును బ్రహ్మమే.

అ మృ త వా హి ని :—

భగవత్ప్రాప్తికి సాధనమైన కర్మను యజ్ఞమని చెప్పుట తత్త్వజ్ఞానులమతము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "వాసుదేవ స్సర్వం" అను సంప్రదాయమునుబట్టి విశ్వమంతయును బ్రహ్మము వ్యాపించియుండుటచేత సర్వమును బ్రహ్మాత్మక ముగ చూచుట అను అభ్యాస మీశ్లోకమున చెప్పబడినది. యథార్థమునకు సర్వమునందును వ్యాపించియుండినది బ్రహ్మవస్తువే. "అంత ర్బహిశ్చ నారాయణః" అనియును, "వ్యాప్య నారాయణస్థితిః" అనియును శ్రుతులయందు చెప్ప బడియున్నట్లు, ఆ పరమాత్మయే సర్వమునందును వ్యాపించి

నిండియుండుటచే సకలమును బ్రహ్మాత్మకముగా జూచుట సాధకుడు అభ్యసించవలయును.

అర్పణము బ్రహ్మము. వేనిద్వారా హవనసామగ్రి అగ్నియందు సమర్పింపబడునో ఆ పదార్థములకు 'అర్పణములు' అని పేరు.

"అర్ప్యతే అనేన ఇతి అర్పణం" అని. ఘృతము మొదలగు హోమద్రవ్యములు అగ్నిలో వేల్చుటకు ఉపకరించు పరికరములైన స్రుక్‌స్రువములు అర్పణములు అని చెప్పవలయును. అనగా స్రుక్‌స్రువాదులుకూడ బ్రహ్మాత్మకములే. హోమద్రవ్యములుకూడ బ్రహ్మాత్మకములే. కర్త బ్రహ్మాత్మకము. అగ్ని బ్రహ్మాత్మకము. హోమము చేయుట అను క్రియ బ్రహ్మాత్మకము.

ఇట్లు అన్నియును బ్రహ్మాత్మకములగుటచే బ్రహ్మమయములు. ఈ విధముగ నెవడు దృఢనిశ్చయముగలిగియున్నాడో వాడు 'బ్రహ్మకర్మసమాధి'. ఇట్లు బ్రహ్మకర్మసమాధియైన పురుషునిచేత పొందబడునది బ్రహ్మమే. ఈ విధముగ సర్వమును బ్రహ్మాత్మకముగా తలంచి కర్మచేయువానిచే ఇతరఫలములు పొందబడవు. వానికి లభించునది బ్రహ్మమే.

"స్రుక్స్రువాదులు బ్రహ్మము; హోమద్రవ్యములు బ్రహ్మము; అగ్ని బ్రహ్మము; హోమముచేయుటయను క్రియ

బ్రహ్మము; కర్త బ్రహ్మము; ఫలము బ్రహ్మము" అని యజ్ఞము చేయువారు తాముచేయు యజ్ఞము బ్రహ్మాత్మకముగా జూతురు. (బ్రహ్మత్వ మారోపించుకొందురు)

బ్రహ్మమే స్రుక్స్రువాదులు. బ్రహ్మమే హోమ ద్రవ్యము. బ్రహ్మమే అగ్ని. బ్రహ్మమే హోమక్రియ. బ్రహ్మమే కర్త. బ్రహ్మమే ఫలము - ఇది బ్రహ్మరూపమైన యజ్ఞము.

**అవతారిక :-**

ఇంకను, ఇతరములైన యజ్ఞములనుకూడ చెప్పు చున్నాడు :

శ్లో॥ దైవ మే వాపరే యజ్ఞం
యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం
యజ్ఞే నై వోపజుహ్వతి ॥ —25

ప. వి :— దైవం, ఏవ, అపరే, యజ్ఞం, యోగినః, పర్యుపాసతే, బ్రహ్మగ్నౌ, అపరే, యజ్ఞం, యజ్ఞేన, ఏవ, ఉప జుహ్వతి.

టీక :—

అపరేయోగినః = కొందరు కర్మనిష్ఠులు,
దైవం = దేవతల నుద్దేశించి చేయబడు,
యజ్ఞమేవ = యజ్ఞమునే,
పర్యుపాసతే = అనుష్ఠించుచున్నారు;

అపరే = మరికొందరు,
బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమనెడి అగ్నియందు,
యజ్ఞేనైవ = యజ్ఞముచేతనే,
యజ్ఞం = యజ్ఞమును,
ఉపజుహ్వతి = హోమము చేయుచున్నారు.

తా. కొందరు కర్మనిష్ఠులు దేవతాపూజారూపమైన యజ్ఞమునే ప్రధానముగ అనుష్ఠించుచున్నారు. మరికొందరు పరబ్రహ్మరూపమైన అగ్నియందు యజ్ఞముచేతనే యజ్ఞము చేయుచున్నారు.

అమృతవాహిని:—

కొంతమంది యోగులు బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన శాస్త్రసమ్మతమైన దేవతలనుద్దేశించి, శాస్త్రసమ్మతమైన యజ్ఞములను జేయుచున్నారు. మమత్వము, ఆసక్తి, ఫలాభిలాష లేక, కేవలము పరబ్రహ్మప్రాప్తికొరకే ఈ యజ్ఞములను శ్రద్ధాభక్తులతో శాస్త్రవిధి ననుసరించి చక్కగా ఆచరించెదరు. కనుక వీటినిగూడ యజ్ఞము లనుచున్నారు. ఇంకను ఆ యా దేవతలనుద్దేశించిచేయు మంత్రజపము, ఆ యా దేవతలనుద్దేశించిచేయు ఉత్సవములు, బ్రాహ్మణ భోజనములు కూడ ఈ యజ్ఞములలో అంతర్గతములే. తన కర్తవ్యమనియెంచి, మమకారము ఆసక్తి ఫలాభిలాష ఏమాత్రమును లేక, కేవలము భగవత్ప్రాప్తియే ఫలముగా శ్రద్ధాభక్తులతో శాస్త్రవిధిననుసరించిపూర్తిగ అనుష్ఠించుటయే

పర్యుపాసనము - దైవయజ్ఞమును చక్కగా ఆచరించుట - అనగా.

"కొందరు బ్రహ్మమనెడి అగ్నియందే యజ్ఞముచేతనే యజ్ఞమును చేయుచున్నారు" అని. పురుషసూక్తములోకూడ "యజ్ఞేనయజ్ఞ మయజంత దేవాః" అని యున్నది. కొద్ది మార్పుతో ఇదే గీతలో చెప్పబడినది. "యజ్ఞం యజ్ఞేనైవోప జుహ్వతి" అని.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" "వాసుదేవ స్సర్వం" అని చెప్పబడినట్లు విశ్వమంతయును పరబ్రహ్మపదార్థముచే సందులేక నిండియున్నది.

ప్రహ్లాదుడు చెప్పినాడు - "ఇందుగల డందు లేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకిజూచిన అందందేగలడు దానవాగ్రణి! వింటే!" అని.

నిష్కామభావనతో, లోకసంగ్రహార్థము, లోకకల్యాణ దృష్టితో, లోకమునందు వేదమునందుకూడ తనకు విధింప బడిన సర్వవ్యవహారములను చేయుచుండుటయే దీనికర్థము.

అనాదికాలమునుండియును వెంటబడి వచ్చుచున్న అజ్ఞానము కారణముగా, స్వస్వరూపమును, పరస్వరూపమును కూడ తెలియలేక, జననమరణరూప సంసార సముద్రములో దిక్కులేక అల్లాడుచున్నాడు జీవుడు. పరమాత్మకు తనకును

ఉన్న యథార్థసంబంధమును మరచిపోయి మరియు అధోగతి పాలగుచున్నాడు.

ఆచార్యోపదేశముద్వారా, శాస్త్రముద్వారా తన స్వరూపమును పరమాత్మ స్వరూపమును తెలిసికొని, తనకును పరమాత్మకును ఉన్నసంబంధము తెలిసికొని, లోకకల్యాణ హేతువులైన ఆయన కల్యాణగుణములను సర్వకాల సర్వావస్థలయందును సంకీర్తన చేయుచు, స్మరించుకొనుచు, మనన విచారణలు చేసికొనుచు, తన జీవితమును పరమాత్మ సేవ యందు పూర్తిగ అర్పణము చేయుటయే ఈ శ్లోకముయొక్క ఉత్తరార్ధమునకు ముఖ్యమైన అర్థము.

అవతారిక :—

ఇంకను పలువిధములైన యజ్ఞములు చెప్పుచున్నాడు.

శ్లో॥ శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే
సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్ విషయా నన్యే
ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ ౨౬

ప. వి :— శ్రోత్రాదీని, ఇంద్రియాణి, అన్యే, సంయమాగ్నిషు, జుహ్వతి, శబ్దాదీన్, విషయాన్, అన్యే, ఇంద్రియాగ్నిషు, జుహ్వతి.

టీక :—

అన్యే = కొందరు,
శ్రోత్రాదీని = శ్రోత్రము మొదలైన,

ఇంద్రియాణి = ఇంద్రియములను,
సంయమాగ్నిషు = నిగ్రహమనెడి అగ్నియందు,
జుహ్వతి = హోమము జేయుచున్నారు;
అన్యే = మరికొందరు,
శబ్దాదీన్ = శబ్దము మొదలైన,
విషయాన్ = విషయములను,
ఇంద్రియాగ్నిషు = ఇంద్రియములనెడి అగ్నియందు;
జుహ్వతి = హోమము జేయుచున్నారు.

తా. కొందరు శ్రోత్రాది ఇంద్రియములను సంయమమను అగ్నియందు హోమము చేయుచున్నారు. మరికొందరు శబ్దాదివిషయములను ఇంద్రియములనెడి అగ్నియందు హోమము చేయుచున్నారు.

## అమృతవాహిని :-

గీతయొక్క అభిప్రాయముప్రకారము, శాస్త్రవిహితమైన ప్రతిసత్కర్మయును - వర్ణమునకును ఆశ్రమమునకును అనుగుణముగా ఆచరించబడినయెడల - అది యజ్ఞమే అగును. అయితే, యజ్ఞములో అగ్ని కావలయును. అగ్నియందు హోమము చేయుటకు హోమద్రవ్యములు కావలయును. కనుక ప్రతిసత్కర్మమును- అనగా ప్రతిసాధనను - యజ్ఞముగా నిరూపించుటకు రూపకాలంకారము ఉపయోగించబడినది.

ఈ శ్లోకములో రెండు విధములైన యజ్ఞములు చెప్పబడినవి. మొదటిది అగ్నిసంయమము. సంయమనే అగ్ని.

హోమద్రవ్యములు ఇంద్రియములు. సంయమములనెడి అగ్నులయందు ఇంద్రియములనెడి హోమద్రవ్యములను ఆహుతి చేయుచున్నారు. ఒక్కొక్క యింద్రియమునకు ప్రత్యేక సంయమ విధానముగలదు. కాబట్టి 'సంయమాగ్నిషు' అని బహువచన ప్రయోగము. సంయమము అనగా ఇంద్రియములను తన వశమునందుంచుకొనుట. రెండవ అధ్యాయములో "ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః" "ఇంద్రియములు వివేకియైనవాని మనస్సునుకూడ బలాత్కారముగ ఆకర్షించి విషయములలోనికి లాగును" అని యున్నది. అట్టి బలవంతములైన, ప్రమాదకరములైన ఇంద్రియములను తనవశమందుంచుకొనుటయే, వాటి స్వాతంత్ర్యమును లేకుండ జేయుటయే, మనస్సును చలింపజేయు గుణమును రూపుమాపుటయే, సంసారభోగములందు ప్రవర్తించకుండ నిలుపుటయే సంయమములనెడి అగ్నులయందు ఇంద్రియములను హోమముచేయుట - దీనినే అష్టాంగయోగ ప్రక్రియలో ప్రత్యాహారమందురు. "స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః" అని.

ఈ విషయమునే రెండవ అధ్యాయములోని ఏబదియెనిమిదవ శ్లోకములో తాబేలును దృష్టాంతముగా చెప్పియున్నాడు కృష్ణపరమాత్మ

మరికొందరు ఇంద్రియములనెడి అగ్నులయందు శబ్దాది విషయములను హోమము చేయుచున్నారు.

ఇంద్రియములను అగ్నులుగా ఉపమించినారు. రాగద్వేషరహితములై పూర్తిగ వశమైన ఇంద్రియములతో మహాత్ములు ఎన్ని విషయములమధ్య సంచరించుచున్నను, వారికి విషయములంటవు అను విషయము ఇచ్చట చెప్పబడినది.

అట్టివారు విషయముల ననుభవించుచున్నను వారికి ప్రమాదములేదు అని కొందరు అర్థము చెప్పుచున్నారు. కాని అది సరియైన అర్థముకాదు. అట్టి మహాత్ముల ఇంద్రియములను విషయములు ఎంతమాత్రమును చలింపజేయలేవు. విషయముల ప్రభావము ఇంద్రియములద్వారా పోయి చిత్తమువిూద తన శక్తిని ప్రసరింపజేయలేదు. ఇంద్రియములు అగ్నిరూపములగుటచేత, ఇంద్రియములలో పడిన విషయములు భస్మమైపోవునేగాని, చిత్తమువిూద వాటి ప్రభావము పడదు.

ఉదాహరణమునకు- ఒక మహాత్మునివద్దకు ఒకడు వచ్చి "మహానుభావా! మీరు పరమాత్మస్వరూపులు. లోకమును ఉద్ధరించుటకు అవతరించినారు" అని ఏమేమో పొగడును. ఆ పొగడ్తలు అతని శ్రవణేంద్రియమునకు సోకునుకాని, అవి అంతటితో భస్మమైపోవును. ఆ కారణమున ఆ పొగడ్తలవలన చిత్తములో 'పొంగుట' అను వికారము కలుగదు.

అట్లే ఒకడువచ్చి ఆ మహాత్ముని దూషించును. అది కూడ అంతే. కనులకు అనేక దృశ్యములు గోచరించును. ఆ దృశ్యములలో మంచివి చెడ్డవి కూడ ఉండును. కాని ఆ దృశ్యముల ఆకారములు నేత్రేంద్రియమువరకే పోవును. అక్కడ అవి భస్మమగుటచే ఆ ఆకారములవలన - మంచివిగాని, చెడ్డవిగాని-వికారములు చిత్తములో కలుగవు. సామాన్య మానవునకు సుందరియైన ఒక స్త్రీ కనుపించినప్పుడు - ఆ రూపము నేత్రేంద్రియములో పడినప్పుడు - చిత్తములో కామవికారము చెలరేగును. మహాత్ములకు చిత్తమునకు తెలియును కాని వికారము మాత్రము కలుగదు. అనగా ఆ రూపముయొక్క ప్రభావము చిత్తమును ఏమియు చేయలేదు.

ఈ స్థితినిగురించియే రెండవ అధ్యాయములో అరువది నాల్గవ శ్లోకమున "రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్, ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి" "రాగద్వేషరహితములైనట్టియును, స్వాధీనములైనట్టియును ఇంద్రియములచేత విషయములందు సంచరించుచున్నను, స్వాధీనమైన మనస్సుకలవాడు తనస్థితియందే క్షేమముగ ఉండగలుగుచున్నాడు" అని యున్నది.

మహాత్ములు ప్రపంచములో సంచరించునప్పుడు ఏయే విషయములతో ఇంద్రియములకు సంయోగము కలిగినప్పటికిని, వారి చిత్తములో ఏవిధమైన వికారమును, ఎంతమాత్ర

మును కలుగదు అని భావము. ఇట్టివారినే గుణాతీతులు అని కూడ అందురు.

"ఉదాసీనవదాసీనో గుణైర్యో నవిచాల్యతే" 'దేనికిని తగులపడక ఉదాసీనునివలె నున్నవాడై గుణములచేత చలించడు" అనిన దిట్టివారిని గూర్చియే.

ప్రారబ్ధవశమున ఏది లభించినను పొంగక, క్రుంగక, సంతుష్టచిత్తులై, స్థిరచిత్తముతో తమ విధ్యుక్త ధర్మమును నిర్విచనముగ, నిర్దుష్టముగ, నిరభిమానముగ భగవత్సేవా బుద్ధితో ఆచరించుకొనుచు పోవుటయే వారి స్వభావము. ఇట్టిస్థితియే ఇంద్రియములనెడి అగ్నులయందు శబ్దాదివిషయములను హోమము చేయుటయని ఈ శ్లోకములో చెప్పబడినది.

అవతారిక:_

ఇప్పుడు మరియొక విధమైన యజ్ఞమును చెప్పుచున్నాడు :

శ్లో॥ సర్వాణీన్ద్రియకర్మాణి
ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ
జుహ్వతి జ్ఞానదీపితే ॥ ౨౭

ప. వి :—సర్వాణి, ఇంద్రియకర్మాణి, ప్రాణకర్మాణి, చ, అపరే, ఆత్మసంయమయోగాగ్నౌ, జుహ్వతి, జ్ఞానదీపితే.

టీక :—

అపరే = మరికొందరు,
సర్వాణి ఇన్ద్రియకర్మాణి=సమస్తేంద్రియములయొక్క-
కర్మలను,
ప్రాణకర్మాణిచ = ప్రాణకర్మలను,
జ్ఞానదీపితే = జ్ఞానముచేత ప్రకాశింపజేయబడిన,
ఆత్మసంయమయోగాగ్నౌ = మనస్సంయమమనెడి
అగ్నియందు,
జుహ్వతి = హోమముచేయుచున్నారు.

తా. మరికొందరు సమస్తేంద్రియములయొక్క- కర్మలను, ప్రాణముల కర్మలను, జ్ఞానముచేత ప్రజ్వలింపజేయబడిన మనస్సంయమమనెడి అగ్నియందు హోమము చేయుచున్నారు.

అ మృ త వా హి ని :—

ఈ శ్లోకమున సమాధి చెప్పబడినది. ఈ సమాధినే యజ్ఞరూపమున చెప్పుచున్నాడు. దీనిలో అగ్ని ఆత్మసంయమము. అనగా మనస్సంయమము. ఈ అగ్నియందు వేల్చబడు పదార్థములు సకలేంద్రియములయొక్క-యును పంచప్రాణవాయువులయొక్క-యును కర్మలు - అనగా చేష్టలు.

ఈ మనస్సంయమము జ్ఞానముచేత ప్రకాశింపజేయబడినది. అనగా సమాధికాలములో సుషుప్తిలోవలె శూన్యస్థితి కాదని భావము. సుషుప్తికిని, సమాధికిని ఉన్న భేదమును

గమనింపజేయుటకై 'జ్ఞానదీపితే' అను విశేషణము ప్రయోగింప బడినది. అనగా సమాధికాలములో సుషుప్తిలోవలె శూన్య స్థితిగా ఉండక వివేకవిజ్ఞానములు జాగ్రుతములై యుండునని భావము.

భగవద్ధ్యానములో మనస్సును లగ్నముచేయుటకు రెండుమార్గములు ప్రచారములో నున్నవి.

ఒకటి : ఇంద్రియములను నియమించుకొని, తరువాత మనస్సును భగవంతునియందు లగ్నముచేయుట.

ఇది ఇరువదియారవ శ్లోకము పూర్వార్ధమున చెప్పబడినది.

రెండు : మొదట మనస్సుతో భగవంతుని చింతన చేయుచు, చేయుచు, అభ్యాసవశమున నెమ్మది నెమ్మదిగా మనస్సును భగవంతునియందు సంలగ్నముచేయుట. అప్పుడు సమాధిసిద్ధించును. ఆ సమాధిసమయమున ఇంద్రియముల యొక్కయును, ప్రాణములయొక్కయును కర్మలు - చేష్టలు - అన్నియును తమంతతామే ఆగిపోవును.

ఈ రెండవ ప్రక్రియ ఈ శ్లోకమున చెప్పబడినది.

అ వ తా రి క :_

ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయయజ్ఞము - వీటిని గురించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా
యోగయజ్ఞా స్తథాఽపరే ।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ
యతయ స్సంశితవ్రతాః । ౨౮

ప. వి:— ద్రవ్యయజ్ఞాః, తపోయజ్ఞాః, యోగయజ్ఞాః, తథా, అపరే, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః, చ, యతయః, సంశితవ్రతాః.

టీక :—

అపరే = కొందరు,
ద్రవ్యయజ్ఞాః = ద్రవ్యసంబంధమైన యజ్ఞములను చేయుదురు,
(అపరే = మరికొందరు),
తపోయజ్ఞాః = తపోరూపమైన యజ్ఞములనుచేయుదురు;
(అపరే = మరికొందరు),
యోగయజ్ఞాః = యోగరూపమైన యజ్ఞములను చేయుదురు;
తథా = అట్లే,
సంశితవ్రతాః = దృఢమైన వ్రతములుగల,
యతయః = యతీశ్వరులు,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ = స్వాధ్యాయ రూపమైన జ్ఞానయజ్ఞములను చేయుదురు.

తా. కొందరు ద్రవ్యసంబంధమైన యజ్ఞములు చేయుదురు. కొందరు తపోరూపమైన యజ్ఞములను చేయుదురు. కొందరు యోగరూపమైన యజ్ఞములను చేయుదురు. కొంతమంది దృఢసంకల్పముగలయతులు స్వాధ్యాయరూపమైన జ్ఞానయజ్ఞములను చేయుదురు.

అమృతవాహిని :-

ఈ శ్లోకమున నాలుగు యజ్ఞములు చెప్పబడినవి.

మొదటిది - ద్రవ్యయజ్ఞము. ధనము మొదలగు ప్రాపంచిక పదార్థములే ప్రధానముగ వినియోగించి చేయబడు యజ్ఞము. తన వర్ణమునకును, ఆశ్రమమునకును తగినట్లు, విధ్యుక్తముగ సంపాదించబడిన పదార్థములతో, ఇంద్రాది దేవతల యజించుటయును, లోకసేవ చేయుటయును - నూతులు చెరువులు మొదలగునవి త్రవ్వించుట, దేవాలయములు, ఆసుపత్రులు, సత్రములు మొదలగునవి కట్టించుట, తోటలు వేయించుట, ఆకలిగొన్నవారికిని, అనాథులకును, రోగులకును, దుఃఖములోనున్నవారికిని, అసమర్థులైనవారికిని, భిక్షుకులకును ఇంకను ఇట్టి వారికి తన శక్తికి తగినట్లు అన్నము, వస్త్రము, ఔషధములు, మొదలగునవి యిచ్చి సేవజేయుటయును, చదువుకొన్నవారికిని, బ్రాహ్మణులకును, సాధువులకును, గో భూ వస్త్రాభరణాదులను దానముచేసి సత్కరించుటయును, ఇంకను అనేకవిధములుగ తన ద్రవ్యమును అవసరము వచ్చినప్పుడు ధర్మకార్యములకుగాని, ఇతర ప్రాణులకుగాని,

ఇతరప్రాణులకుగాని ఉపయోగించుట - మొదలగునవన్నియును ద్రవ్యయజ్ఞములగును.

ఈ యజ్ఞములన్నియును మమకారము, కర్తృత్వాభిమానము, ఆసక్తి, ఫలాభిలాష, మొదలగునవి త్యజించి చేసినయెడల, ఇవన్నియును భగవత్ప్రాప్తికి సాధనములగును. కాని, ఈ యజ్ఞములకు గృహస్థే అధికారి యని చెప్పవలయును. ఎందులకనగ, ధనసంపాదనచేసినగాని ఈ యజ్ఞములు చేయ వీలులేదు.

రెండవది తపోయజ్ఞము - భగవత్ప్రాప్తియే పరమోద్దేశముగా అంతఃకరణమును, ఇంద్రియములను పరిశుద్ధిచేసికొనుటకై మమకారము, ఆసక్తి, కర్తృత్వాభిమానము, ఫలాభిలాష - వీనిని విడిచి, వ్రతములు, ఉపవాసములు, చేయుట, తన వర్ణాశ్రమ ధర్మమును నెరవేర్చునప్పుడు కలుగు శారీరక మానసిక కష్టములను ఓర్చుకొనుట, మౌనము ఆహారనియమము, అరణ్యవాసము మొదలగు శాస్త్రవిహిత కర్మలన్నియును తపోయజ్ఞములు.

దీనికి అధికారము ప్రధానముగా వానప్రస్థులకే కలదు. కాని ఇతరాశ్రమములవారుకూడ యథాశక్తిగ, శాస్త్రానుమతి ననుసరించి ఆచరించవచ్చును. కనుక తమ తమ యోగ్యతానుసారముగా - అన్ని ఆశ్రమములవారికిని ఈ యజ్ఞములందు అధికారముగలదు.

(19)

మూడవది యోగయజ్ఞము - ఇక్కడ యోగశబ్దము నకు అష్టాంగయోగమని అర్థము చెప్పుట సమంజసముగా కనపడుచున్నది. కర్మయోగమనిగాని, జ్ఞానయోగమనిగాని చెప్పరాదు. చెప్పబడిన యజ్ఞములన్నియును ఈ రెండు మార్గములలో దేనికో ఒకదానికి చెందియే యుండును. కనుక ప్రత్యేకించి ఈ అర్థమును చెప్పక అష్టాంగయోగమనియే అర్థము చెప్పుట తగును. అనగా పాతంజలియోగ ప్రక్రియాను రూపమైన 'చిత్తవృత్తినిరోధ' రూప యజ్ఞమే ఇచ్చట ప్రస్తావింపబడినది.

ఈ యజ్ఞము కూడ మమకారము, ఆసక్తి, కర్తృత్వాభి మానము, ఫలాభిలాష లేక ఆచరించబడినయెడల భగవత్ప్రాప్తికి ఉపయోగపడగలదు. పతంజలి ఈ యోగము నకు ఎనిమిది అంగములు చెప్పియున్నాడు.

"యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధయోఽష్టావంగాని" (౨-౨౯)

"యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి - ఈ ఎనిమిది యును యోగముయొక్క అంగములు"

వీనిలో యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యా హారములను మొదటి అయిదు అంగములును బహిరంగ సాధనలనియును, ధారణ ధ్యాన సమాధులను చివరి మూడు అంగములును అంతరంగసాధనలనియును చెప్పబడినవి.

యమములు :—"అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహాః యమాః" (౨-౩౦)

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము అపరిగ్రహము - అను నీ అయిదును యమములు.

(1) అహింస : ఏ ప్రాణికిని ఎప్పుడును ఏ విధముగను ఏమాత్రమును కష్టమును కలిగించకుండుట. *

(2) సత్యము : భూతహితమునే ఆదర్శముగ నుంచుకొని కపటరహితముగను, ప్రియముగను చేయు యథార్థ భాషణము.

(3) అస్తేయము : ఏవిధముగను ఎవరియొక్క స్వత్వమును దొంగిలించకుండుటయును, లాగుకొనకుండుటయును.

(4) బ్రహ్మచర్యము : మనోవాక్కాయములతో ఏ అవస్థలోగాని, ఏ పరిస్థితిలోగాని, అన్ని విధములైన మైథునములను పూర్తిగ త్యజించుట - వీర్యమును ఏవిధముగను వ్యయపెట్టకుండుట.

(5) అపరిగ్రహము : జీవితమునకు ఎంత అవసరమో అంతవరకేతప్ప, ఎక్కువ ప్రాపంచిక పదార్థములను సేకరించకుండుట. ఇంక విలాసముల సంగతి చెప్పవలయునా ?

ఈ అయిదును యమములు.

---

* విపులముగ పదునారవ అధ్యాయవ్యాఖ్యయందు చూడగలరు.

నియమములు : "శౌచ సంతోష తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాః నియమాః" (2-32)

"శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అను నీ అయిదును నియమములు"

(1) శౌచము : అన్నివిధములను, లోపల, బయట, పవిత్రముగను, శుభ్రముగను ఉండుట.

(2) సంతోషము : ప్రియముగాని, అప్రియముగాని, సుఖముగాని, దుఃఖముగాని ఏవి ప్రాప్తించినను, ఎప్పుడును వికార రహితముగ సంతుష్టుడై ఉండుట.

(3) తపము : ఏకాదశి ఉపవాసము, ధనుర్మాస వ్రతము- ఇట్టివ్రతములను- తమతమ సంప్రదాయ నిర్ణయము ప్రకారము ఏర్పడిన వానిని - మమకారము, ఆసక్తి, కర్తృత్వాభిమానము, ఫలాభిలాష లేక ఆచరించుట; ఆ వ్రతముల మూలమున కలిగిన శారీరక మానసిక శ్రమలను ఉత్సాహముతో సహించుట.

(4) స్వాధ్యాయము : యథార్థతత్త్వజ్ఞానప్రదములును, ముక్తిదాయకములును అగు ఆధ్యాత్మిక ఉద్గ్రంథములగు వేదము, భగవద్గీత, శ్రీమద్రామాయణము, శ్రీభాగవతము, మహాభారతము మొదలగువాటిని, శ్రద్ధాభక్తులతో, అర్థవిచారణతో - అధ్యయనము చేయుట; సర్వశాస్త్రముల సార్థ

మైన దివ్యములైన భగవన్నామసంకీర్తనము, భగవద్గుణాను భవము- భగవంతుని జన్మలను, కర్మలను గూర్చిన విచారణ చేయుట.

(5) ఈశ్వర ప్రణిధానము : సర్వస్వమును ఈశ్వరునికి సమర్పణముజేసి ఆయన ఆజ్ఞలను పాలించుచు ఉండుట. ఈ అయిదును నియమములు.

ఆసనములు : "స్థిరసుఖాసనం". (౨-౪౬)

'స్థిరముగా, సుఖముగా కూర్చొనుటకు ఆసనము.'

యోగసంప్రదాయములో అనేక ఆసనములు చెప్పబడినవి. అవి వందలకొలదిగ గలవు. అవి అన్నియును శారీరకముగను, బౌద్ధికముగను చాల ఉపయోగకరమైనవిగనే ఉన్నవి. కాని, కేవలము ఆధ్యాత్మిక సాధకులకు పూర్తిగ ఉపయోగపడునవి సిద్ధ, పద్మ, స్వస్తికాసనములు మాత్రమే. ఆసనములందు ముఖ్యముగా చూడదగిన విషయము మేరుదండము (అనగా వెన్ను), కంఠము, శిరస్సు-ఈ మూడును నిటారుగ వంకరటింకరలు లేకుండ నిలబెట్టబడియుండవలయును. నిద్రరాకుండనుండు నెడల, కండ్లుమూసికొని యుండుటకూడ ఉత్తమమే. కొంతమందికి కండ్లుమూయగనే నిద్ర వెంటబడును. అట్టివారు కండ్లు తెరచియుండుట మంచిది. కాని నిద్రను స్వాధీనములోనుంచుకొనుటకు బాగుగ ప్రయత్నించి, కండ్లు మూయుగలుగుట ఉత్తమపద్ధతి. ఎవరు ఏ ఆసనము మీద

బాధలేకుండ, ఎక్కువసమయము కూర్చొనగలరో, వారికి ఆ ఆసనము ఉత్తమమైనది.

## ప్రా ణా యా మ ము

"శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః"
(౨-౪౯)

"శ్వాస ప్రశ్వాసలయొక్క గతినిరోధము ప్రాణాయామము."

శ్వాసమనగా బయటిగాలిని లోపలకు పీల్చుకొనుట. ప్రశ్వాసమనగా లోపలిగాలిని బయటకు వదలుట. ఈ రెంటిని నిరోధించుటయే ప్రాణాయామము.

దీనిని అనుభవపరులవద్ద జాగ్రత్తగ నభ్యసించవలయునే గాని గ్రంథములలో జూచి ఎవరును స్వతంత్రముగా అభ్యసించ రాదు. అట్లు అభ్యసించినయెడల నిష్ప్రయోజనము మాత్రమే గాదు, ప్రమాదముకూడ తటస్థించును. కనుక హెచ్చరిక గలిగి యుండవలయును.

## ప్ర త్యా హా ర ము

"స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార
ఇవేంద్రియాణాం ప్రత్యాహారః" (౨-౫౪)

"ఇంద్రియములు తమతమవిషయములతో సంయోగము త్యజించి చిత్తముయొక్క స్వరూపమును పొందుటయే ప్రత్యాహారము"

## ధా ర ణ ము

"దేశబంధ శ్చిత్తస్య ధారణా" (3-౧)

చిత్తమును ఏదో ఒకచోట స్థిరము చేయుటయే ధారణ అనబడును.

స్థూలములుగాని, సూక్ష్మములుగాని, బాహ్యములు గాని, ఆంతరములుగాని, ఏదో ఒక వస్తువుమీద, లేక ఏదో ఒకవిషయముమీద - ఏదో ఒకచోట - చిత్తమును బంధించి, స్థిరముగ నిలుపవలయును. ఇదియే 'ధారణ' అని చెప్పబడును.

ఇక్కడ విషయము భగవంతుడే గనుక, ధారణ ధ్యాన సమాధులు భగవంతునియందే అభ్యసించవలయును.

## ధ్యా న ము

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం" (3-౨)

ధారణచేయు ప్రదేశమందు చిత్తము ఏకధారగా ప్రవహించుటయే ధ్యానము.

నదీప్రవాహమువలె అవిచ్ఛిన్నముగా మనస్సును ధ్యేయవస్తువునందు నిలుపగలిగినయెడల అది ధ్యానమన బడును.

## స మా ధి

"తదే వార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః" (3-3)

ధ్యేయవస్తువు మాత్రము తెలియుచు, తన వ్యక్తిత్వము లేనట్లుగా నుండు స్థితిని సమాధి అందురు.

సాధకుడు ఒకవస్తువును ధ్యానించునపుడు, ధ్యానము చేయగా, చేయగా కొంతకాలమునకు చిత్తము కేవలము ధ్యేయమునందే నిలుకడ చెందును. ఆ స్థితిలో తాను ధ్యేయ వస్తువుకంటె భిన్నముగా నున్నట్లే తోచదు- ఇట్టి స్థితి సమాధి అనబడును.

అష్టాంగయోగమునందు అభిరుచి గలిగి, జాగ్రత్తగ అభ్యసించువారికి ఏమాత్రమైన ఉపకరించునను అభిప్రాయముతో ఈ సంక్షిప్త పరిచయము చేయబడినది.

ఇరువదియేడవ శ్లోకములో గూడ ఆత్మసంయమ యోగమును గూర్చి చెప్పబడియున్నది. దానికిని ఈయోగమునకును భేదమేమను సంశయము కలుగవచ్చును.

అచ్చట యమ నియమా మాసన ప్రాణాయామ ప్రత్యాహారముల అభ్యాసమునకు ప్రాధాన్యము లేదు. కేవలము ధారణ ధ్యాన సమాధులకే ప్రాధాన్యముకలదు. ఈ ధారణా ధ్యాన సమాధుల నభ్యసించుటలోనే ఈ మొదటి అయిదును సిద్ధించగలవు.

ఇచ్చట మొదటనుండియును ఒక క్రమముగా అభ్యసించుట చెప్పబడినది - ఇదియే భేదము.

ఈ అష్టాంగయోగమునందుకూడ అన్ని ఆశ్రమముల వారికిని అధికారమున్నది. కాని వానప్రస్థులకును, సన్న్యాసులకును అభ్యసించుటకు అవకాశము ఎక్కువ కలదు.

## స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము

స్వాధ్యాయమనగా భగవంతుని యథార్థతత్త్వము, ఆయనయొక్క గుణములు, ప్రభావములు, లీలలు, జన్మలు, కర్మలు, చరిత్రలు మొదలగునవి ప్రధానముగ వర్ణింపబడియున్న శాస్త్రములను నిత్యమును యథాక్రమముగ అధ్యయనముచేయుట, అర్థవిచారణము చేయుట, భగవత్స్తోత్రములు పఠించుట, భగవంతుని నామములను, గుణవైభవములను సంకీర్తనము చేయుట - ఇదే స్వాధ్యాయజ్ఞానయజ్ఞమనబడును.

ఉపనిషత్తులు, శ్రీమద్రామాయణము, భాగవతము, భగవద్గీత మొదలగు గ్రంథములను సక్రమముగ అధ్యయనము చేయవలయును. వాటి అర్థవిచారణ చేయవలయును. అర్థవిచారణమునే జ్ఞానమందురు. దానినే అహంకారము, మమకారము, కర్తృత్వాభిమానము, ఆసక్తి, ఫలాభిలాష ఎంతమాత్రమునులేక చేయవలయును. వ్యాజ్యములు గెలుపవలయుననియో, ఇంకను ఆస్తిరావలయుననియో, సుందరకాండ పారాయణము చేయుట మొదలగునవి 'పసగాని రేగుబండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లు' అజ్ఞానమే కాగలదు.

ఇక్కడ స్వాధ్యాయ శబ్దమునకు జ్ఞాన శబ్దమును జోడించుటలో స్వాధ్యాయము భగవత్ జ్ఞానమునకు హేతు వగుటచేత, దానిని జ్ఞానయజ్ఞ మనవలయునను భావము ధ్వనించుచున్నది. పదునెనిమిదవ అధ్యాయములో కూడ

"అధ్యేష్యతేచ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞాన యజ్ఞేన తే నాహ మిష్టస్యామితి మేమతిః" (౧౮-౭౦)

'మనకిద్దరకును జరిగిన సంవాదరూపమైన ఈ ధర్మ్యమగు ఈ గీతాశాస్త్రమును ఎవడు అధ్యయనము చేయునో, వాడు నన్ను జ్ఞానయజ్ఞముచేత పూజించినవాడు; ఇది నా అభిప్రాయము' అని కృష్ణపరమాత్మయే అధ్యయనమును జ్ఞాన యజ్ఞముగా చెప్పియున్నాడు.

కొంతమంది 'స్వాధ్యాయ యజ్ఞము' 'జ్ఞానయజ్ఞము' అని రెండుగా విడదీసి అర్థము చెప్పియున్నారు. పై కారణముచే అట్లు చెప్పుట అంత సమంజసముకాదని తేలుచున్నది.

'సంశితవ్రతాః యతయః' సంశితవ్రతులైన యతులు ఈ స్వాధ్యాయ జ్ఞానయజ్ఞమును చేయుదురని. సంశితవ్రతులు అనగా దృఢమైన సంకల్పము, పట్టుదల కలవారని భావము. అట్టి సంకల్పము పట్టుదలగలిగి, యతయః అనగా యత్నము చేయువారు అని అర్థము.

అయితే, కొంతమంది యతయః అనుదానికి సన్న్యాసాశ్రమస్వీకారము చేసినవారు అని అర్థమును చెప్పినారు.

కాని 'సంశితవ్రతులైనయతులు' అనగా 'దృఢసంకల్పము పట్టుదలకల వారై, భగవత్ప్రాప్తియేతప్ప ఇంకొక స్పృహయే లేక ప్రయత్నము చేయునట్టి సర్వసంగపరిత్యాగులు' అను అర్థము నిష్కర్షగా చెప్పవచ్చును. ఆ అవకాశము సన్న్యాసాశ్రమములో ఎక్కువగ ఉన్నదని మాత్రము చెప్పవచ్చును.

చేయగలిగిన అందరును చేయవచ్చును; నిషేధము లేదు. కాని ఇతరులకు ఆ అవకాశములు మాత్రము చాల తక్కువ.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం
ప్రాణేఽపానం తథా పరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా
ప్రాణాయామ పరాయణాః ॥

శ్లో॥ అపరే నియతాహారాః
ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో
యజ్ఞక్షపిత కల్మషాః॥

ప. వి :—అపానే, జుహ్వతి, ప్రాణం, ప్రాణే, అపానం, తథా అపరే, ప్రాణాపానగతీ, రుద్ధ్వా, ప్రాణాయామ పరాయణాః.

ప. వి :—అపరే, నియతాహారాః, ప్రాణాన్, ప్రాణేషు, జుహ్వతి, సర్వే, అపి, ఏతే, యజ్ఞవిదః యజ్ఞక్షపితకల్మషాః.

టీక :—

ప్రాణాయామపరాయణాః = ప్రాణాయమము చేయువారగు,
అపరే = మరికొందరు,
ప్రాణాపానగతీ రుద్ధ్వా = ప్రాణాపానవాయువుల గతులను నిగ్రహించి,
అపానే = అపానవాయు వ్యాపారమందు,
ప్రాణం = ప్రాణవాయువ్యాపారమును,
తథా = అట్లే,
ప్రాణే = ప్రాణవాయువ్యాపారమందు,
అపానం = అపానవాయువ్యాపారమును,
జుహ్వతి = హోమము చేయుచున్నారు;
అపరే = మరికొందరు,
నియతాహారాః (సన్తః) = మితాహారులగుచు,
ప్రాణాన్ = ఇంద్రియవ్యాపారములను,
ప్రాణేషు = ఇంద్రియములయందు,
జుహ్వతి = హోమము చేయుచున్నారు;
ఏతే సర్వేఽపి = ఈ సమస్తమైనవారును,
యజ్ఞవిదః = యజ్ఞమును తెలిసినవారు.
యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞముచేత నశింపజేయ బడిన పాపములు గలవారు.

తా. ప్రాణాయామమునందు ఆసక్తి, ఆహార నియమము గల కొందరు ప్రాణాయామ ప్రక్రియలో అపానమునందు ప్రాణమును

హోమముచేయుచున్నారు. కొంతమంది ప్రాణమునందు అపానమును హోమము చేయుచున్నారు. కొంతమంది ప్రాణాపాన సంచారములను నిలిపి, ప్రాణములను ప్రాణములందు హోమముచేయుచున్నారు. వీరందరునుగూడ యజ్ఞములను తెలిసినవారును, యజ్ఞములచేత పాపములు నశించినవారును అయి ఉన్నారు.

అమృతవాహిని :—

'నియతాహారులై ప్రాణాయామ పరాయణులైనవారు' అని చెప్పబడినది. ఆధ్యాత్మిక సాధకులందరును నియతాహారులుగనే ఉండవలయును. కడుపులో సగముభాగము అన్నముతో నింపవలయును. మిగిలిన సగములో సగము - అనగా మొత్తములో నాల్గవభాగము- నీటితో నింపవలయును. మిగిలిన నాల్గవభాగము వాయుసంచారముకై వదలవలయును. అంతమాత్రముగ తినెడి ఆహారముకూడ సాత్త్వికాహారమై ఉండవలయును. ఇది సామాన్యముగ సాధకులకందరకును కావలసినదే. కాని ప్రాణాయామ పరాయణులకు ప్రత్యేక ఆహారవిధానము. యోగశాస్త్రములో చెప్పబడినది. ఆహారనియమమును పాటించువారే అష్టాంగయోగమును - ప్రాణాయామమును - అభ్యసించవలయును. అప్పుడే ప్రాణాయామము సులభసాధ్యము కాగలదు. యోగశాస్త్రములో యోగులు కేవలము ఆవుపాలు, నేయి, అన్నము మాత్రమే గ్రహించవలయును అని యున్నది. తరువాత ఇంకను, పండ్లు మొదలైనవి తీసికొన్నను, ముందు కనీసము ఆరునెలలు పాలు అన్నము నేయి - వీనితోనే ఉండవలయును.

ఈ విధముగ ఆహారనియమములను గురించి ప్రత్యేక ముగ చెప్పబడియున్నది. ఆ విధముగ నియతాహారులై, ప్రాణాయామపరాయణులైన వారిలో కొంతమంది అపానము నందు ప్రాణమును హోమముచేయుచున్నారు. అపానమునకు స్థానము గుదము. ప్రాణమునకు స్థానము హృదయము. బయటివాయువును లోపలికి కొనిపోవుటపేరు శ్వాసము. దీనిని అపానముయొక్క గతి అందురు. అపానముయొక్క స్థానము శరీరముయొక్క క్రిందిభాగములో కలదు. బయటి నుండి వాయువు లోపలకు పోవునప్పుడు, దాని గతి శరీరము లోని క్రిందివైపునకే ఉండును. కనుక ఇది అపానవాయుగతి అనబడినది. లోపలిగాలిని బయటకు విడుచుట ప్రశ్వాసము. దీనిని ప్రాణముయొక్కగతి అని అందురు. ప్రాణముయొక్క స్థానము అపానస్థానముకంటె పైన, హృదయములో గలదు. లోపలి వాయువు నాసికారంధ్రముల ద్వారా బయటకు వచ్చునప్పుడు శరీరముయొక్క పై వైపునకు దీనినడక ఉండును.

ఈప్రాణాయామప్రక్రియలో అపానవాయువు అగ్నిగా పోల్చబడినది. ప్రాణవాయువు హవిస్సు. శ్వాసను పూరక మనియును, ప్రశ్వాసను రేచకమనియును యోగశాస్త్రములో అందురు. పూరక ప్రాణాయామమే అపానమునందు ప్రాణ మును హోమముచేయుట అనగా. యోగి గాలిని పూరించి నప్పుడు-బయటిగాలిని లోనికి పీల్చినప్పుడు - ఆ బయటగాలి

హృదయస్థానములో నున్న ప్రాణవాయువునుకూడ తీసికొని నాభిస్థానముగుండపోయి గుదస్థానములోనున్న అపానవాయువులో విలీనమగుచున్నది.

ఈ ప్రాణాయామ ప్రక్రియలో మాటిమాటికి బయటి గాలి పీల్చబడి - అనగా పూరకముచేయబడి - లోపల నిలుపబడుచున్నది. కనుక దీనిని ఆంతరకుంభకమనికూడ అందురు. ప్రాణాయామ మాహాత్మ్యమంతయును ఈ ప్రాణాపానగతులను నిరోధించుటలోనే ఉన్నది.

కొంతమంది ప్రాణములో అపానమును హోమము చేయుచున్నారు. ఇక్కడ ప్రాణవాయువు అగ్నిగా పోల్చబడినది. అపానవాయువు హవిస్సు. అనగా రేచక ప్రాణాయామము నే ప్రాణమునందు అపానమును హోమముచేయుట అందురు. యోగి రేచక ప్రాణాయామము చేయునపుడు లోపలి వాయువు బయటకు విడువబడును. ఆ క్రమములో వాని హృదయస్థానములోనున్న వాయువు పైకి వెళ్ళినప్పుడు క్రిందినుండి అపానవాయువు దానివెంట పైకి హృదయ స్థానముసకువచ్చి, అక్కడ ప్రాణవాయువులో విలీనమగును. దీనినే ప్రాణములో అపానమును హోమము చేయుట అందురు. మాటిమాటికి లోపలివాయువు బయటకు విడువబడి, అక్కడ నిలుపబడుచున్నది. కనుక, దీనిని బాహ్యకుంభకమనికూడ అందురు.

'ప్రాణాయామపరాయణాః' 'నియతాహారాః' అను విశేషణములు ఈ త్రివిధప్రాణాయామములు చేయువారికిని సంబంధించినవి. ప్రాణములను ప్రాణమునందు హోమము చేయువారి కొరకే ఆ విశేషణములు అని కొందరు వ్రాసియున్నారు. అమృతవాహిని అభిప్రాయము మాత్రము ఆ విశేషణములు త్రివిధములైన ప్రాణాయామములు చేయువారికిని వర్తించునని.

ప్రాణములయందు ప్రాణములను హోమముచేయుట అననేమి ? శరీరమునందు అయిదు వాయువులు గలవు. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అని. ప్రాణమునకు హృదయము, అపానమునకు గుదము, సమానమునకు నాభి, ఉదానమునకు కంఠము, వ్యానమునకు శరీరమంతయును స్థానములు. ఈ పంచవిధవాయువులను పంచప్రాణములనికూడ అందురు. ఈ పంచవాయువులను జయించి, నిరోధించుటకూడ యజ్ఞమనియే కృష్ణపరమాత్మ మతము. ఈ యజ్ఞములో అగ్నియును హవిస్సును కూడ ప్రాణములే. కనుక, ప్రాణములను ప్రాణములయందు హోమముచేయుట అని చెప్పబడినది. ఈ ప్రాణాయామములో ప్రాణాపానముల రెంటియొక్క గతి నిరోధించబడును. అనగా, రేచక పూరకములు జరుగవు; శ్వాసప్రశ్వాసలను నిరోధించి పంచప్రాణవాయువులను వానివాని స్థానములలో నిలిపివేయబడును. ఇదియే ప్రాణాపానగతులను నిరోధించి ప్రాణము

లను ప్రాణములయందు హోమముచేయుటయనగా. ఈ ప్రక్రియలో బయటివాయువును లోపలకుపిల్చి నిలుపుటగాని, లోపలివాయువును బయటకు విడిచి నిలుపుటగాని ఉండదు. వాటివాటి స్థానములలోనే యథాతథముగ నిలిపివేయ బడును. దీనినే యోగసంప్రదాయములో కేవలకుంభకము అందురు.

ఈయజ్ఞములలో ఏయజ్ఞముచేసినవారైనను, యజ్ఞము తెలిసినవారే; యజ్ఞముచేత పాపములు నశించినవారే అని చెప్పబడిన దీశ్లోకములలో. ఈ అధ్యాయములోనే ఇరువది మూడవ శ్లోకములో "యజ్ఞాయాచరతః కర్మ - సమగ్రం ప్రవిలీయతే" 'కేవలము యజ్ఞముకొరకే కర్మలు చేయువాని సమస్తకర్మలును నశించుచున్నవి' అని యున్నది. అదే విషయము ఇక్కడ ఇంకను సుస్పష్టముగ చెప్పబడినది. ఇరువదినాల్గవ శ్లోకముదగ్గరనుండి ఇంతవరకు వర్ణింపబడిన యజ్ఞములలో, అహంకారము, మమకారము, ఆసక్తి, ఫలాభిలాష, కర్తృత్వాభిమానము లేక, కేవలముభగవ ప్రాప్తియే ఫలముగ ఎంచుకొని, ఏ యజ్ఞమును ఆచరించిన వారైనను, వారందరును యజ్ఞస్వరూపమును బాగుగా తెలిసిన వారే అగుదురు. అంతమాత్రమే కాదు; ఆ యజ్ఞముచేత జన్మజన్మాంతరములలో చేయబడిన వారి పాపములన్నియును నశించుచున్నవి. వారు సమస్తకర్మబంధములనుండియును విముక్తులగుచున్నారు.

యజ్ఞస్వరూపము తెలియనివారును, యజ్ఞముకొరకే యజ్ఞముచేయనివారును, కర్మబంధములనుండి విముక్తులు కాదు సరిగదా, ఇంకను మిక్కిలి బలమైన క్రొత్త క్రొత్త కర్మబంధములలో బంధింపబడుచున్నారు.

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో
యాన్తి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య
కుతోఽన్యః కురుసత్తమ ! 31

ప. వి ;— యజ్ఞశిష్టామృత భుజః, యాన్తి, బ్రహ్మ, సనాతనం, న, అయం, లోకః, అస్తి, అయజ్ఞస్య, కుతః, అన్యః, కురుసత్తమ.

టీక :—

హే కురుసత్తమ ! = ఓ అర్జునా !
యజ్ఞశిష్టామృతభుజః = యజ్ఞము చేయుగా మిగిలిన అమృతమును భుజించువారు,
సనాతనంబ్రహ్మ = శాశ్వతపరబ్రహ్మమును,
యాన్తి = పొందుచున్నారు,
అయజ్ఞస్య = యజ్ఞమును చేయనివానికి,
అయం లోకః = ఈ లోకము,
నాస్తి = లేదు,
అన్యః = పరలోకము,
కుతః ? = ఎక్కడిది ?

తా. అర్జునా! యజ్ఞము చేయగా మిగిలిన ప్రసాదరూపమైన అమృతమును భుజించువారు శాశ్వతపరబ్రహ్మమును పొందుచున్నారు. ఏ విధమైన యజ్ఞమును చేయనివారికి ఈలోకమే లేదు; ఇంక పరలోక మెక్కడిది ? రెండులోకములకును చెడుచున్నారు.

అమృతవాహిని :—

[illegible] యజ్ఞముచేయగా మిగిలిన అమృతము -అనగా - దేవతలను గూర్చి చేయుచున్న యజ్ఞములో, అగ్నియందు, నేయి మొదలగు పదార్థములను హోమముచేయుట లోక ప్రసిద్ధము. అట్లు హోమము చేయగా మిగిలినపదార్థము 'అమృతము' అని శాస్త్రము చెప్పుచున్నది. ఇంకను ఋషులు పంచమహాయజ్ఞములను చెప్పియున్నారు. ఆ ప్రకారము దేవతలకు, ఋషులకు, పితరులకు, మానవులకు, ఇంకను ఇతరప్రాణులకును తమ శక్తికి తగినట్లు విధిపూర్వకముగ అన్నమును విభాగించి పంచగా, మిగిలిన అన్నముకూడ యజ్ఞశిష్టమైన అమృతము అనబడును. కాని గీతలో పరమాత్మ భగవత్ప్రాప్తి లక్ష్యముగ కలిగిన సర్వసత్కర్మలను యజ్ఞములనియే చెప్పియున్నాడు. ఈ సాధనలన్నిటిలో అన్నమునకు సంబంధము లేదు. కనుక ఈ సాధనలన్నిటిని, సక్రమ పద్ధతులలో అహంకార మమకారములను, ఫలాభిలాషను, కర్తృత్వాభిమానమును, ఆసక్తిని వదలి అనుష్ఠించిన యెడల, అంతఃకరణము పూర్తిగ పరిశుద్ధిచెందును. అట్టి పరిశుద్ధాంతకః కరణమునందు పరమాత్మధ్యానముచేత ప్రసాదరూపమైన

ప్రసన్నత లభించును. ప్రసాదరూపమైన ఆ ప్రసన్నతతోడి ధ్యానముచేత అంతఃకరణములో కలిగిన ఆ సాత్త్వికసుఖము నందే నిత్యతృప్తుడుగా ఉండుటే అమృతమును భుజించుట యనగా.

ఈ యజ్ఞములను సాధకుడు తీవ్రమైన పట్టుదలతో, మహావిశ్వాసముతో, సక్రమముగా నిర్వహించినయెడల ఈ జన్మలోనే భగవత్ప్రాప్తి లభించగలదు. పట్టుదలలోగాని, విశ్వాసములోగాని, కొంచెము లోటు ఉన్నయెడల, ఆ లోటు యొక్క మోతాదునుబట్టి ఇంకను కొన్ని జన్మలలో భగవత్ప్రాప్తి లభించగలదు. కాని వృథామాత్రముకాదు. రెండవ అధ్యాయములో నలుబదవ శ్లోకములో "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్" 'ఈ ధర్మము ఎంత స్వల్పముగా చేసినను, మహాభయమునుండి- అనగా సంసార భయమునుండి-రక్షించుచున్నది' అనియును, ఆరవ అధ్యాయములో నలుబదవ శ్లోకములో "నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి" 'తండ్రీ! భగవత్ప్రాప్తి కొరకు ప్రయత్నించువాడు ఎప్పుడును దుర్గతిపాలు కాడుసుమా' అనియును ఈ భావమే సుస్పష్టము చేయబడినది. ఈశ్లోకములో "నాయం లోకోఽస్త్యయజ్ఞస్య - కుతోఽన్యః కురుసత్తమ" 'ఈ యజ్ఞములలో దేనిని చేయనివానికి ఈ లోకము లేదు; పరలోకమును లేదు' అని యున్నది. గీతలో చెప్పబడినవి గాని, ఇంకను ఇతర శాస్త్రములలో చెప్పబడినవిగాని, భగవ

ప్రాప్తికి సాధనములు అనేకము లున్నవి. వాటిలో ఏదియును కామ్యముగాగాని; నిష్కామ్యముగాగాని చేయక, కేవలము విషయోపభోగములే ప్రధానముగానెంచి, మానవజన్మమును వృథాచేసికొనువాడు 'అయజ్ఞస్య' అనుపదముతో చెప్పబడి నాడు. అట్టివానికి ఈలోకము లేదనగా-ఈలోకము సుఖదాయక ముగ ఉండవలయునన్నచో ఆ యజ్ఞములను కామ్యముగా నైన చేయవలయునుగదా ! అట్లును చేయక, ఇప్పుడనుభవించు నవి పూర్వజన్మలలో చేసిన కర్మల ఫలమని అంతకంటెను తెలియక, పూర్వజన్మలలో చేసిన సత్కర్మలయొక్క ఫలమైన భోగము లనుభవించునప్పుడు తనంతవాడు లేడని ఎగిరి పడుచు, దుష్కర్మలయొక్క ఫలమైన కష్టములు లభించి నప్పుడు అయ్యో అని క్రుంగబడి గోలబెట్టుచు, ఇప్పుడు ఏ యజ్ఞమును చేయక, ఈ మానవదేహమును విడిచినవానికి మరల ఈలోకము ఎట్లు లభించును ? అనగా మానవదేహ మెట్లు దొరకును ? దొరకనేదొరకదు. ఇక వానికి పరమపదము లభించునా ? అది అసలే లేదు.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా
వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా
నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32

ప. వి ;—ఏవం, బహువిధాః, యజ్ఞాః, వితతాః, బ్రహ్మణః, ముఖే, కర్మజాన్, విద్ధి, తాన్, సర్వాన్, ఏవం, జ్ఞాత్వా, విమోక్ష్యసే.

టీక :—

ఏవం = ఇట్లు,
బహువిధాః = పలువిధములైన,
యజ్ఞాః = యజ్ఞములు,
బ్రహ్మణః ముఖే = వేదమునందు,
వితతాః = సవిస్తరముగా చెప్పబడియున్నవి,
తాన్ సర్వాన్ = యజ్ఞములన్నిటిని,
కర్మజాన్ = కర్మలవలన పుట్టినవిగా,
విద్ధి = తెలిసికొనుము !
ఏవం = ఈ విధముగా,
జ్ఞాత్వా = తెలిసికొని,
విమోక్ష్యసే = బంధనములనుండి ముక్తుడవు కాగలవు.

తా. ఈ ప్రకారముగ అనేకవిధములైన యజ్ఞములు వేదమునందు విస్తరించి చెప్పబడియున్నవి. ఈ యజ్ఞము లన్నియును కర్మవలన కలిగినవని తెలియుము, ఈవిధముగ తెలిసికొనుటచేత సంసారబంధమునుండి విముక్తుడవు కాగలవు.

**అమృతవాహిని :—**

"అర్జునా! ఇప్పుడు నీకు నేను చెప్పిన ఈ యజ్ఞములు మాత్రమేకాదు-ఈప్రకారముగ అనేకవిధములైన యజ్ఞములు వేదములందు విస్తారముగ చెప్పబడియున్నవి. మమకారము, అహంకారము, కర్తృత్వాభిమానము,ఫలాభిలాష,ఆసక్తి వదలి,

వాటిలో వేసిని అనుష్ఠించినను, వాడు యజ్ఞముకొరకు కర్మ చేసినవాడే అగుచున్నాడు. వానికి భగవత్ప్రాప్తి లభించు చున్నది - కనుక ఇప్పుడు నేను పైన చెప్పిన యజ్ఞములు చేసినవారు ఎట్లు కర్మబంధములనుండి విముక్తిని బడయు చున్నారో, వారును అట్లే విముక్తిని బడయుగలరు. సనాతన బ్రహ్మమును పొందగలరు. అట్లు వేదమునందు విస్తరించి చెప్పబడిన యజ్ఞములన్నియును కర్మజములే - అనగా కర్మల చేత కలిగినవే."

సమస్త యజ్ఞములును మనస్సుయొక్కయు, శరీరము యొక్కయు క్రియలవలననే సంపన్నము లగుచున్నవి. కొన్ని యజ్ఞములు కేవలము మనస్సుచేతమాత్రమే చేయబడునవి. కొన్ని మనస్సుచేతను, ఇంద్రియములచేతను చేయబడునవి. కొన్ని మనస్సుచేతను, ఇంద్రియములచేతను, శరీరము చేతను కూడ చేయబడునవి. ఈ మూటికిని సంబంధము లేకుండ ఏ యజ్ఞమును జరుగదు. ఈ సమస్తయజ్ఞములును మనస్సుచేతను, ఇంద్రియములచేతను, శరీరముచేతను జరుగు క్రియలవలననే ఏర్పడుచున్నవి కనుక, తాను ఈ మనస్సు, ఇంద్రియములు, శరీరము మొదలైనవానిలో ఏదియును కాడు కనుక, తనద్వారా ప్రత్యేకముగా ఏక్రియయును జరుగదు కనుక, ఈ తత్త్వము తెలిసినయెడల ఈ యజ్ఞములందు

సాధకునికి కర్తృత్వాభిమానము లేకుండ పోవును అని భావము.

కర్మ బంధన హేతువని భ్రాంతిపడువారు కలరు. కర్మ చేయకుండ ఒక్కక్షణమైనను ఉండలేడే మానవుడు! కర్మ చేయకుండ ఉండలేనప్పుడు, కర్మ బంధన హేతువే అయి తీరి నప్పుడు - ఇక మానవునకు బంధవిముక్తి లేనేలేదా? ఈ అభి ప్రాయము సమంజసమైనదికాదు.

విముక్తికిని, భగవత్ప్రాప్తికిని హేతువులుగా చెప్పబడిన యజ్ఞము లన్నియును ఈ మానసికములైన, ఐంద్రియికము లైన, శారీరకములైన కర్మలవల్లనే ఏర్పడుచున్నవి అని తెలిసి కొనిననాడు కర్మ చేయుటలో భయపడవలసినది ఉండదు. మనస్సుయొక్క, ఇంద్రియములయొక్క, శరీరముయొక్క క్రియా లైన కర్మలతో సంబంధములేని భగవత్ప్రాప్తిసాధనరూప మైన యజ్ఞమేలేదు. కనుక భగవత్ప్రాప్తికోరు మానవుడు ఏ మమకారము, అహంకారము, కర్తృత్వాభిమానము, ఫలాభి లాష, ఆసక్తి, మొదలైనవి లేకుండ ఈ యజ్ఞములలో ఏదో ఒక యజ్ఞమును అవశ్యము అవలంబించియే తీరవలయును.

ఈ సమస్త యజ్ఞములును కర్మలవల్ల కలుగునవే అని తెలియుటచేత, ఈ మూడువిధములైన జ్ఞానముచు కలుగును. కాన యజ్ఞములుచేసి బంధనవిముక్తుడు కాగలడు - సనాతన పరబ్రహ్మమును పొందగలడు అని భావము.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరన్తప !
సర్వం కర్మాఖిలం పార్థ !
జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

ప. వి :— శ్రేయాన్, ద్రవ్యమయాత్, యజ్ఞాత్, జ్ఞానయజ్ఞః, పరన్తప, సర్వం, కర్మ, అఖిలం, పార్థ, జ్ఞానే, పరిసమాప్యతే.

టీక :—

హే పరన్తప ! = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా!
ద్రవ్యమయాత్ = ద్రవ్యసాధనసాధ్యమైన,
యజ్ఞాత్ = యజ్ఞముకంటె,
జ్ఞానయజ్ఞః = జ్ఞానయజ్ఞము,
శ్రేయాన్ = శ్రేష్ఠమైనది,
హే పార్థ ! = ఓ అర్జునా !
సర్వం కర్మ = సకలకర్మయు,
అఖిలం = నాశనముకానిదగుచు,
జ్ఞానే = జ్ఞానమందు,
పరిసమాప్యతే = ముగియుచున్నది.

తా. ఓ అర్జునా ! ద్రవ్యమయ యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. అన్నివిధములైన కర్మలను పూర్తిగ జ్ఞానమునందే ముగియుచున్నవి.

అమృతవాహిని :—

యజ్ఞములు ద్రవ్యమయములని జ్ఞానమయములని రెండువిధములుగ నున్నవి. ప్రాపంచిక పదార్థముల ఆవశ్యకము, ప్రాధాన్యము ఎక్కువగా కలిగిన యజ్ఞములు ద్రవ్యమయ యజ్ఞములు. వివేకము, విచారణ, ఆధ్యాత్మిక జ్ఞానము-వీనితో మాత్రమే సంబంధము. వీనికే ప్రాధాన్యము కలిగిన యజ్ఞములు జ్ఞానయజ్ఞములు.

ఈ శ్లోకములో ద్రవ్యమయ యజ్ఞములకంటె జ్ఞానమయ యజ్ఞములే శ్రేష్ఠములని చెప్పబడినది. అంతమాత్రమున ద్రవ్యమయ యజ్ఞములు చేయనక్కరలేదని భావించరాదు. అతిథికి భోజనము పెట్టుటయు ద్రవ్యమయ యజ్ఞమే దానికంటె జ్ఞానమయ యజ్ఞము గొప్పది అనిన ఇక అతిథిసత్కారము విడిచి గీతను అధ్యయనము చేసికొనుచు కూర్చుండుటకాదు. తన అధికారమునకు తగినట్లు శక్తిసామర్థ్యములననుసరించి ద్రవ్యమయయజ్ఞములను చేయవలసినదే. ద్రవ్యమయ యజ్ఞములు అప్రధానములని అందరును విడిచిపెట్టిన జగద్వ్యాపారమే ఆగిపోవలసివచ్చును. సృష్టిచక్రమునకు దెబ్బతగులును. ప్రతిమానవుడు చేయవలసిన కర్మలలోను ప్రధానములు, అప్రధానములు ఉండును. అప్రధానములన్న వాటినిగూడ విడిచిపెట్టుటకు వీలులేదు. అప్రధానములన్న పదములో వదలవలసినవి అను అర్థమేలేదు. వదలుటయో

చేయుటయో అనునది తనకు అధికారముండుట లేకపోవుటల మీాద ఆధారపడియుండును గాని ప్రధానతాప్రధానతలను బట్టి కాదు.

ద్రవ్యమయయజ్ఞములో జ్ఞానమయ యజ్ఞమును జూచుట మహాత్ముల లక్షణము.

"పత్రం పుష్పం ఫలం తోయం" అని కృష్ణపరమాత్మ చెప్పినాడుగదా అని ప్రతిధనవంతుడును తాను దానము చేయదలచినప్పుడు తన లోభమును సమర్థించుకొనుటకై ఈ శ్లోకమును ఉపయోగించుకొని, తనకు శక్తిసామర్థ్యములు కలచోట కూడ - వందరూపాయలు ఇచ్చుటకు శక్తిగలిగి యుండియును - "పత్రం పుష్పం ఫలం తోయం" అని ఒక తులసీదళమును, ఒక కాయను తెచ్చియిచ్చిన ఎట్లుండును ? జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమనినాడుగదాయని తన విధ్యుక్తధర్మము లైన కర్తవ్యకర్మలను ద్రవ్యయజ్ఞము అప్రధానము అను మిషపై అనుష్ఠించకుండ ఉండుటకాదు ఇక్కడ భావము ప్రతియజ్ఞములోను ద్రవ్యభాగమును, జ్ఞానభాగమును కలిసియే ఉన్నవి. ఈ రెంటిలో జ్ఞానభాగమునకే శ్రేష్ఠత్వము చెప్పబడి నది. ఒక్కొక్క యజ్ఞములో జ్ఞానభాగముకంటె ద్రవ్యభాగము ఎక్కువగను ప్రధానముగను ఉండవచ్చును. అప్పుడు దానికి ద్రవ్యమయయజ్ఞమని పేరు. ఒక్కొక్క యజ్ఞములో ద్రవ్య భాగముకంటె జ్ఞానభాగము ఎక్కువగను ప్రధానముగను ఉండవచ్చును, అప్పుడు దానికి జ్ఞానయజ్ఞమని పేరు. ఈ రెండు

యజ్ఞములలో కూడ బంధనములను నాశనము చేయుటలో జ్ఞానభాగమే ఉపయోగపడునది. కనుక దానికి శ్రేష్ఠత్వము సిద్ధించినది. ఈ జ్ఞానభాగమే లోపించిననాడు ఆ ద్రవ్యమయ యజ్ఞములన్నియును బంధనములకే కారణములగును. పోనీ ఆ యజ్ఞములను స్వరూపతః వదలివేయుదమన్న వీలులేదు. చేసియేతీరవలయును. చేసియేతీరవలసినవియగు ద్రవ్యమయ యజ్ఞములను చేసియును, బంధనములో పడకుండనుండుటకు ఉపయోగపడునది జ్ఞానభాగమే గనుక, ద్రవ్యమయయజ్ఞము కంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమని చెప్పబడినది. ఈ తత్త్వము తెలిసినవాడు కర్మ చేయును; విముక్తుడగును. చేయబడినకర్మ దానిలో అంతర్హితమైయున్న జ్ఞానములో విలీనమగుచున్నది. కనుక సమస్తకర్మలును జ్ఞానములో విలీనమగుచున్నవి అని చెప్పబడినది.

అవతారిక :-

ఈ జ్ఞానము లభించు విధానము చెప్పుచున్నాడు -

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన
పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం
జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ 34

ప. వి :— తత్, విద్ధి, ప్రణిపాతేన, పరిప్రశ్నేన, సేవయా, ఉపదేక్ష్యన్తి, తే, జ్ఞానం, జ్ఞానినః, తత్త్వదర్శినః,

టీక :—

తత్ = ఆ జ్ఞానమును,
ప్రణిపాతేన = సాష్టాంగ నమస్కారముచేతను,
పరిప్రశ్నేన = సంశయములు తీరువరకును వేయు
ప్రశ్నలచేతను,
సేవయా = సేవచేతను,
విద్ధి = తెలిసికొనుము,
జ్ఞానినః = జ్ఞానులును,
తత్త్వదర్శినః = తత్త్వదర్శులును (అయిన),
తే = వారు,
జ్ఞానం = జ్ఞానమును,
ఉపదేక్ష్యన్తి = ఉపదేశించెదరు.

తా. ఆ జ్ఞానమును జ్ఞానసంపన్నులును భగవద్దర్శనము పొందిన వారును అయిన మహాత్ముల సన్నిధికిపోయి, సాష్టాంగ నమస్కారము చేతను, చక్కగ ప్రశ్నలు వేయుటచేతను, సేవచేయుటచేతను తెలిసికొనుము. నీ శ్రద్ధాభక్తులకు సంతోషించి నీకు వారాజ్ఞానమును ఉపదేశింతురు.

## అమృతవాహిని :—

పైన చెప్పబడిన జ్ఞానము మహాత్ముల అనుగ్రహముచేత లభించవలసినదే. ఇంకొకవిధముగ సాధ్యముకాదు. కేవలము శాస్త్రాధ్యయనము చేతనే జ్ఞానము సంపాదించుకొందమన్న, "శాస్త్రజ్ఞానం బహుక్లేశం,బుద్ధేశ్చలన కారణమ్, గురుద్వారా హరింబుద్ధ్వా విరమేత్సర్వకర్మసు" 'శాస్త్రమువలన సంపాదింప

బడు జ్ఞానము చాలకష్టములకు హేతువు. బుద్ధికూడ చలించును. విపరీతజ్ఞానము సంభవించును. కనుక గురువు దగ్గరకుపోయి భగవంతునిగూర్చి తెలిసికొనవలయును. ఇంతకంటె మిగిలిన ప్రయత్నములన్నియును విరమించ వలసినది' అని శాస్త్రములలోనే చెప్పబడినది.

ఇదే భావమును తెలియపరచుచు, ఉపనిషత్తు చెప్పినది - "ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్ నిబోధత !" 'లెమ్ము ! మేలుకొమ్ము! శ్రేష్ఠుల దగ్గర జేరి జ్ఞానమెరిగి క్షేమపడుము!' అని. కనుక యథార్థమైన పరమార్థజ్ఞానము కావలయునన్నచో పూర్తిగ పరమార్థానుభవముగల మహాత్ముల నాశ్రయించ వలసినదే. ఎవరివద్దకుపోయి జ్ఞానమును పొందవలయునో, ఎవరు జ్ఞానము నుపదేశించ నర్హులో వారిని ఈ శ్లోకములో వర్ణించినాడు పరమాత్మ - జ్ఞానులు, తత్త్వదర్శులు అని. ఈ రెండువిశేషణములును సార్థకములు. అట్టి మహాత్ములసన్నిధికి పోయి తెలిసికొనవలయును. ఎట్లు తెలిసికొనవలయును ? -

ప్రణిపాతము : విశ్వాసముతో, శ్రద్ధాభక్తులతో దండము వలె పాదములచెంత పడవలెను. దీనినే ప్రణిపాత మందురు. ఇది అభిమానత్యాగమును సూచించును.

పరిప్రశ్నము : భగవత్తత్త్వమును తెలిసికొనవలయు ననెడి నిజమైన కాంక్షతో శ్రద్ధా భక్తి విశ్వాసపూర్వకముగా తనకు అవగతమగువరకును అడుగుట పరిప్రశ్న మనబడును -

ఈశ్వర తత్త్వమునుగూర్చి, జీవతత్త్వమునుగూర్చి, ప్రకృతి తత్త్వముగూర్చి విషయము బాగుగ తెలియువరకును ప్రశ్నలు వేయవలయును. తానెవడు ? సంసారమననేమి ? ఈ దుఃఖములు, బంధనములు కలుగుటకు కారణమేమి ? ఇవి పోవు మార్గమేమి ? భగవంతుడన నెవరు ? ఆయనకును మనకును సంబంధమేమి ? బంధనమననేమి ? ముక్తియననేమి ? భగవంతుని పొందుటకు ఉపాయమేమి ? - ఇట్టి ప్రశ్నలువేసి, విషయములను స్పష్టముగ తెలిసికొనవలయును.

తెలిసికొనవలయుననెడి సదుద్దేశముతో ప్రశ్నలమీద ప్రశ్నలువేయుటే పరిప్రశ్నమగును. తర్కముసకో, వితండవాదమునకో, పరీక్షచేయుటకో, ప్రశ్నలు వేయరాదు.

సేవ : శ్రద్ధాభక్తివిశ్వాసములు పూర్తిగ కలిగి, ఆచార్యుని సన్నిధిలో నివసించుట, ఆజ్ఞలను పాలించుట, వారి మానసిక భావములను, ఉద్దేశములను గమనించి, అనుగుణముగ మెలగుట, వారి శరీరమునకు సుఖమును గలిగించుటకే అన్నివిధముల ప్రయత్నించుట - ఇట్టి కార్యక్రమము సేవ అనబడును.

శిష్యులు మూడువిధములని పెద్దలు చెప్పుదురు - ఉత్తములు, మధ్యములు, అధములు అని.

గురువుయొక్క భావములు గురువు చెప్పకముందే గ్రహించి శ్రద్ధాభక్తులతో సేవచేయువారు ఉత్తములు.

గురువు చెప్పకముందు గ్రహింప లేకపోయినను, గురువు చెప్పినతరువాత అయినను, శ్రద్ధాభక్తులతో సేవచేయువారు మధ్యములు. గురువు చెప్పినతరువాతకూడ, శ్రద్ధాభక్తులు లేక, తప్పదుగదాయని సేవచేయువారు అధములు - శ్రద్ధాభక్తులు లేకపోవుటయేగాక గురువు చెప్పినతరువాతకూడ ఎట్లును సేవచేయనివారును, చేయకపోగా తిరస్కరించువారును, తిరస్కరించుటతో ఆగక వ్యతిరేకముగా దుష్ప్రచారమును చేయువారును - ఇట్టివారు ఏతరగతిలో చేరుదురో శాస్త్రములలో లేదు.

మహాత్ములు కరుణాస్వరూపులు గదా! ప్రణిపాతము, పరిప్రశ్నము, సేవలు - చేయుచునే తెలిసికొనవలయునా ? ఇవిలేకుండ తెలిసికొనుటకు వీలులేదా ? చెప్పరా ? వారికి కూడ గౌరవముపై ఈ కాంక్ష, ఈ భేదభావము ఎందుకుండ వలయును ? - ఇట్టి సందేహములు చాలమందికి కలుగు చుండును.

యథార్థమైన పరమాత్మానుభవము కలిగినవారికి ఏవిధమైన కాంక్షలుగాని, భేదభావములుగాని, రాగద్వేషములు గాని ఎంతమాత్రమును ఉండవు. వారు ఇవన్నియును కోరరు. కాని భగవద్విషయికమైన ఉపదేశము పొందుటకు శ్రద్ధ,భక్తి. విశ్వాసము, సరళత్వము, అభిమానరాహిత్యము మొదలగు లక్షణములే అర్హతను తెలియజేయునవి. అర్హతలేనివారికి ఉపదేశించరాదు. ఉపదేశించినను వృథాయగును; అంత

మాత్రమేగాక విపరీతఫలమును గూడ ఇచ్చును. కనుక అర్హతలేనివారికి చెప్పకపోవుటలో వారి కరుణయే వ్యక్తమగుచున్నది.

రోగికి జ్వరము తగ్గిన లక్షణములు కనుపడినయెడల వైద్యుడు పథ్యమును పెట్టించును. ఆ లక్షణములు కనుపడక, జ్వరమున్నట్లు తోచినయెడల, ఎంత అడిగినను, పథ్యమును పెట్టించడు. రోగికి పథ్యమును పెట్టించుటకును, పెట్టించకపోవుటకును కూడ వైద్యునకు రోగియందు గల కరుణయే కారణమైనట్లు, ఇచ్చుట గురువునకును కరుణయే హేతువు. అదియునుగాక, అడిగెడివారుచేయు గౌరవమర్యాదలు మహాత్ములకు ఆవశ్యకములు కాకపోయినను, అభిమానము, దౌర్జన్యము, పరీక్షాదృష్టి, కపటభావము - ఇట్టి లక్షణములు కనుపడినయెడల, ఆ మహాత్ముల పరిశుద్ధాంతఃకరణములో ఉపదేశముచేయవలెననెడి ప్రవృత్తి కలుగదు. కాబట్టి తత్త్వజ్ఞానము కావలయునను వారు అవశ్యము ఈ లక్షణములు కలిగియుండియే అడుగవలయును.

లేగదూడ ఆకలితో 'అంబా !' అని అరిచినవెంటనే ఆ ధ్వని వినిన ఆవునకు స్తనములయందు పాలు చేపువచ్చినట్లు, ప్రశ్న వేయువాని లక్షణములు వాత్సల్యపరిపూర్ణములైన మహాత్ముల అంతఃకరణములలోని జ్ఞానసముద్రమును ఒక్కసారిగా ఉప్పొంగి ప్రవహింపజేయును. కాబట్టియే శ్రుతికూడ "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్. సమిత్పాణిః, శ్రోత్రియం

బ్రహ్మనిష్ఠం" 'తత్త్వజ్ఞానము కావలయునెడల, వాడు సమిధలు చేతబట్టుకొని, శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన గురువునే ఆశ్రయించవలయును' అని చెప్పుచున్నది.

గీతలోని శ్లోకములోనున్న 'జ్ఞానినః', 'తత్త్వదర్శినః' అను రెండు విశేషణములకును ఈ శ్రుతియందున్న 'శ్రోత్రియం' 'బ్రహ్మనిష్ఠం' అను రెండు విశేషణములకును ఏమియును భేదము లేదు.

'జ్ఞానినః తత్త్వదర్శినః' అని బహువచనము ప్రయోగించుటచేత, 'అనేకులగు మహాత్ములవద్దకు పోయి తెలిసికొనవలసినది'అని పరమాత్మ చెప్పినట్లు కొంతమంది వ్యాఖ్యానించుచున్నారు. ఆ భావము సమంజసముగా లేదు. ఆ బహువచన ప్రయోగము అట్టి మహాత్ములయందు ఆదరభావము కొరకేగాని, పెక్కుమందిని అడుగవలసినదిగ ఆదేశించుటకు కాదు. అయితే, ఆశ్రయించవలసినది ఒక్క గురువునే అయినను, శాస్త్రము ఒకవిధమైన అవకాశము ఇచ్చినది. ఏమంటే, ఏ భ్రమ ప్రమాదములచేతనైనను ఒకరిని ఆశ్రయించిన తరువాత, కొంతకాలమునకు వారిలో పరమార్థమునకు వ్యతిరేక లక్షణములు కనుపడినయెడల, వారిని త్యజించి సరియైనవారిని ఆశ్రయించవచ్చును.

అంతేకాక, క్రమశిక్షణ ప్రకారము శాస్త్రజన్యజ్ఞానము పొంది, భగవత్ప్రాప్తిమాత్రము లభించక ఉన్నవారిని కూడ అవసరమునకు ఆశ్రయించి, కొంతవరకు లాభము పొంద

వచ్చును. కాక శిష్యుడుగ కూడ నుండవచ్చును. అట్టి సందర్భమున సాధకుడు ఆ మొదటివారియందు గౌరవ ప్రపత్తులను విడువకనే, పరమార్థానుభవము పొందిన వేరొక ఆచార్యుని ఆశ్రయించవచ్చును.

మరియు, కొంతవరకు జ్ఞానముకలిగి, చక్కని మార్గములో, త్రికరణశుద్ధిగ సాధన చేయుచుండువారిని ఆశ్రయించి కూడ సాధన ప్రారంభించవచ్చును. కాని, అక్కడ శిక్షణ పూర్తి అయిన తర్వాత, అంతకు పైవారివద్దకు పోయి ఆశ్రయింపవచ్చును; నిరభిమానులైన గురువులు కొందరు తమంతతామే, తమకంటె సమర్థులైనవారివద్దకు పంపుదురు.

కాక, ఒక్కొక్కప్పుడు సమర్థులైన గురువులుకూడ శిష్యుని అభిమానము పోవుటకో, ఇంకను ఇట్టి అనేక కారణాంతరములచేతనో, తమ శిష్యులను ఇతరులవద్దకు పంపి జ్ఞానోపదేశము చేయించుటకూడ కద్దు.

వ్యాసులవారు తమ శిష్యుడును, కుమారుడును అయిన శుకుని, తమ శిష్యుడైన జనకునివద్దకు పంపినారు.

ఇట్టి ప్రత్యేక కారణములున్న తప్ప పరిపూర్ణభగవదనుభవము గలవారు లభించినప్పుడు మరల ఇంకొకరిని ఆశ్రయించరాదు.

శ్లో॥ యత్ జ్ఞాత్వా న పున ర్మోహ
మేవం యాస్యసి పాణ్డవ !
యేన భూతా న్యశేషేణ
ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి ॥ 35

ప. వి :— యత్, జ్ఞాత్వా, న, పునః, మోహం, ఏవం, యాస్యసి, పాణ్డవ, యేన, భూతాని, అశేషేణ, ద్రక్ష్యసి, ఆత్మని, అథో, మయి.

టీక :—

పాణ్డవ ! = ఓ అర్జునా !
యత్ జ్ఞాత్వా = ఏ జ్ఞానమును పొంది,
పునః = మరల,
ఏవం మోహం = ఇట్టి మోహమును,
న యాస్యసి = పొందవో,
యేన = దేనిచేత,
అశేషేణ = సమస్తమైన,
భూతాని = భూతములను,
ఆత్మని = నీయందును,
అథో = అలాగుననే,
మయి = నాయందును,
ద్రక్ష్యసి = చూడగలవో (అట్టిది ఈ జ్ఞానము).

తా. అర్జునా ! ఈ జ్ఞానమును పొందిన తరువాత మరల నీ విట్టి మోహమును పొందవు. ఈ జ్ఞానముచేత సమస్త భూతములను నీ యందును, అట్లే నాయందును చూడగలవు.

**అ మృ త వా హి ని :-**

"అర్జునా ! అట్లు మహాత్ముల సన్నిధికిపోయి పొందిన జ్ఞానము ఎంతటి మహిమకలదో తెలియునా ? ఆ జ్ఞానము లభించిన తరువాత, ఇప్పుడు నీకు కలిగిన అజ్ఞానజనిత మోహము మరల ఎన్నటికిని నీకు కలుగదు."

అర్జునునకు కలిగిన మోహము కొందరు తనవారు, మరికొందరు పరులు అనెడి మమకారము. తనవారి నింత మందిని చంపవలసివచ్చినదే అను దుఃఖమును, తనవారంద రును చనిపోయిన తరువాత తన కా రాజ్యము వచ్చినను, ఎవరు చూచి సంతోషింతురు అను అసంతృప్తియును, కుల ములోనున్న పెద్దలును యువకులును మొత్తము పురుషులం చనిపోయినయెడల, నిగ్రహము లేకను, చెప్పువారు లేకను కులస్త్రీలు చెడిపోదురే అను ఆందోళనమును, కులస్త్రీలు చెడిన వర్ణసంకరము, అధర్మము వ్యాపించిపోవునే అను పాపభీతియును, వర్ణసంకరమైన యెడల వర్ణసంకరపు సంతా నము పెట్టిన పిండోదకములు ముట్టక పితరులు అధోగతిని కూలుదురే అను బాధయును, ఇన్ని అనర్థములకును కారణ మైన ఈ ఘోరయుద్ధము చేయుటచేత తమకు పాపమే లభించ గలదన్న భయమును, పోనిమ్మని చేసినను యుద్ధములో జయము తమకే లభించునో, శత్రువులకే లభించునో అను సంశయమును - ఇట్టివన్నియును అర్జునుని హృదయమును అన్నివైపులనుండి చుట్టుముట్టి కలచుచుండెను.

ఈ భయంకరమైన అవస్థకు కారణము యథార్థమైన జ్ఞానము లేకపోవుటయే. కనుక అట్టి జ్ఞానము కలిగిననాడు ఈ మోహమంతయును పోవును. మరల ఎన్నిటికిని రాదు. ఎన్ని కష్టములు, నష్టములు పడిన్యైనను, అభిమానము పూర్తిగ విడిచి మానవుడు ఈ జ్ఞానమునే సంపాదించి తీరవలయునని కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు.

జ్ఞానము కలిగిన తరువాత మరల ఈ మోహమురాదు అని చెప్పుటలో భావమేమనగా - ఈ జ్ఞానము నిత్యమైనది. సూర్యుడు ఉదయించుటతోనే అంధకారము ఎట్లు పూర్తిగ పోవుచున్నదో, అట్లే హృదయాకాశమున జ్ఞానసూర్యుడు ఉదయించుటతోనే, మోహాంధకారము పటాపంచలై పోవును. అయితే, ఈ ప్రాకృత సూర్యుడు ఉదయించిన తరువాత అస్తమించుటయును, మరల అంధకారము వచ్చుటయును కలదు. కాని జ్ఞానసూర్యుడు ఒకసారి ఉదయించిన తరువాత అస్తమించుట యనునది లేనేలేదు; అందుచే పోయిన ఈ మోహాంధకారము మరల వచ్చుట యనునదియు లేనే లేదు. యథార్థమైన భగవత్తత్త్వజ్ఞానము నిత్యమైనది, అచలమైనది. కనుక పెద్దలవద్దకుపోయి ఈ జ్ఞానమును సంపాదించుకొనవలసినదిగ అర్జునుని హెచ్చరించుచున్నాడు పరమాత్మ.

ఇంకను "ఈ జ్ఞానము కలిగిన తరువాత సర్వభూతములను నీయందును, అట్లే నాయందును చూడగలవు?" అని

చెప్పుటలో పరమాత్మ ముఖ్యమైన రెండు సమస్యలను పరిష్కరించినాడు.

బ్రహ్మముకాక ఈ జగత్తును, జీవులును సత్యముగ ఉన్నారా, లేరా అనునది ఒకటి.

మానవుడు పరమాత్మను అనుభవించునప్పుడు-సమాధి దశలో - ఈ ప్రపంచము గోచరించునా, గోచరింపదా అనునది రెండు.

ఈ రెండు సమస్యలును ముముక్షువులకు చాల అవసర మైనవి. కాబట్టి వీటిని పరిశీలింతము.

బ్రహ్మముకాక ఈ జగత్తును, జీవులును ఉన్నారా లేరా అనునది ముందు చూతము.

ఈ శ్లోకములో "ఈ జ్ఞానము కలిగిన తరువాత నీయందును నాయందును ఈ సకలచరాచర భూతములను చూడగలవు" అని కదా చెప్పబడినది !

ఎట్టి జ్ఞానము కలిగిన తరువాత ? పరిపూర్ణ జ్ఞానము కలిగిన తరువాత. ఇంతటి మహత్తరమైన స్థాయిలో ఉన్న జ్ఞానికూడ ఈ ప్రపంచమును జీవులను చూచును అని చెప్పి నప్పుడు, ప్రపంచమును, జీవులును కనిపించుట భ్రాంతిమూల కమేగాని, యథార్థము కాదని చెప్పుట నిరాధారమైనదిగ నిరూపింపబడినది.

"ప్రపంచమును, జీవులను చూడగలవు"అని చెప్పుటలోనే అవి సత్యముగా ఉన్నట్లు తేలుచున్నది. సత్యముగా లేనిచో

వానిని చూడగలవని ఎట్లు చెప్పినాడు ? లేనివానిని భ్రాంతిచేత చూతువని చెప్పినాడా ? కాదు. ఇది భ్రాంతిలేని జ్ఞానమేగదా!

ఈ ఒక్క శ్లోకమేగాక, గీతలో ఇంకను పలుచోట్ల ఈ శ్లోకార్థమువచ్చు శ్లోకములుగలవు. ఉదాహరణమునకు రెండు చూపెదము.

ఆరవ అధ్యాయములో ఇరువది తొమ్మిదవ శ్లోకము - "సర్వభూతస్థ మాత్మానం, సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" 'యోగము చేత పొందబడిన పరమాత్మ గలవాడు. అనగా పరమాత్మను పొందినయోగి సర్వత్ర సమదృష్టి కలవాడగుచు పరమాత్మ యందు సర్వభూతములను, సర్వభూతములయందు పరమాత్మను చూచుచున్నాడు.'

దీని తరువాతి ముప్పదియవ శ్లోకము - "యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి - తస్యాహం నప్రణశ్యామి, సచమే నప్రణశ్యతి" 'ఆ విధముగా నెవడు సర్వభూతములయందు నన్నును, నాయందు సర్వభూతములను చూచుచున్నాడో, అట్టివానికి నేను ఎప్పుడును కనుపించుచునే ఉందును. నాకు వాడు కనుపించుచునే ఉండును' అనియును చెప్పినాడు శ్రీకృష్ణ పరమాత్మ.

ఇంకను చూడుడు - ఇట్టి జ్ఞానమునకు సంబంధించినదే శ్రీభాగవతమున ఏకాదశస్కంధమున రెండవ అధ్యాయ

ములో నలుబదియైదవ శ్లోకమున చెప్పబడినది. "సర్వభూతేషు యఃపశ్యేత్ భగవత్ భావ మాత్మనః, భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః" 'ఎవడు సర్వభూతములందును పరమాత్మనే చూచుచున్నాడో, తన కాత్మస్వరూపుడైన పరమాత్మయందే సర్వభూతములను చూచుచున్నాడో వాడే భాగవతోత్తముడు' అని.

దీనినిబట్టి చూచినచో కృష్ణపరమాత్మ గీతలో తత్త్వత్రయమునే ప్రతిపాదించినాడు- పరమాత్మ సత్యము, జీవులు సత్యము, ఈ ప్రపంచము సత్యము అనియే చెప్పినాడు - అని స్పష్టపడుచున్నది.

అసలు జ్ఞానమనగా ఉన్నవస్తువును, సర్వకాల సర్వావస్థలయందును చూచుట కుపయోగపడునది. అట్లుపయోగపడకపోయినచో అది అజ్ఞానమే. లేనివస్తువు ఉన్నట్లు కనుపించుట ఎట్టి భ్రాంతియో, ఉన్నవస్తువు కనుపించకపోవుటకూడ అట్టి భ్రాంతియే.

ఇక సమాధిని గురించి పరిశీలింతము.

సమాధిలో ఈ ప్రపంచము గోచరించదనియు, మరల వెలికి వచ్చినతరువాత గోచరించుననియు కొందరు చెప్పుదురు. ఇదికూడ్యనిరాధారమైన సిద్ధాంతమే. సరియైన సమాధి అయినచో, లోపలకుపోవుట వెలికి వచ్చుట అని ఉండునా ఏమి? ఒకసారి పరమాత్మను స్పృశించిన మనస్సు మరల

పరమాత్మను విడిచి వెలికి ఎట్లువచ్చును? వెలికివచ్చినదనినచో అది పరమాత్మను అనుభవించ లేదన్నమాట. "అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేష మత్తచిత్త మేరీతి నితరంబు జేరనేర్చు" అని ప్రహ్లాదు డనలేదా!

అయితే, కొంతమంది మహాత్ములు పరమాత్మను పూర్తిగా అనుభవించికూడ, కేవలము పరమాత్మ చేతిలో పరికరమాత్రులై, పరమాత్మ ఆజ్ఞచేత మరల ప్రపంచములో వ్యవహరించుచుందురు. కాని వారి మనస్సు ప్రపంచముతో అంటిపెట్టుకొనియున్నట్లు బాహ్యమునకు ఎంతకనుపించినను, పరమాత్మలో విలీనమయియే ఉండును. వారి పరమార్థాను భవమునకు ఆవగింజంతకూడ కొరత ఉండదు. ఇట్టి స్థితియే సరియైనసమాధి. అప్పుడప్పుడు సమాధిలోనికిపోవుట, మరల వెలికి వచ్చుచుండుట అనుస్థితి పరిపూర్ణసమాధి కాదు. "పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్, భాషించుచున్, హాసలీలానిద్రాదులు సేయుచున్, తిరుగుచున్, లక్షించుచున్, సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుండై మరచెన్ సురారిసుతు డేతద్విశ్వమున్ భూవరా!" అను ప్రహ్లాదునిస్థితియే ఆదర్శము. అదియే నిజమైన సరియైన పరిపూర్ణమైనసమాధి. ప్రపంచములో తిరుగుచు,అన్నివ్యవహార ములను చేయుచు, ప్రపంచమును మరచినాడట! ఆహా! ఎట్టిదశ! ఇట్టిస్థితి సామాన్యుల కెట్లు అర్థమగును? దీనిని సహజసమాధి అనికూడ అందురు. నిజమునకు భ్రాంతిరహిత

జ్ఞానమనగా ఇదియే. ఈశ్లోకములో కృష్ణపరమాత్మ చెప్పినది ఇట్టిజ్ఞానమే.

అయితే, కొంతమంది పండితులు "యద్ జ్ఞాత్వా నపున ర్మోహ మేవం యాస్యసి పాండవ!" అన్నచోట వేరొక విధముగ అర్థము వ్రాసినారు. ఏమంటే, "అర్జునా! ఆచార్యునిచే ఉపదేశింపబడిన ఇట్టి జ్ఞానప్రకారమును తెలిసికొనిన పిమ్మట మరల ఇట్టి 'నేను, నావారు' అను అహంకార మమకారరూపమగు మోహమును పొందబోవు. ఇట్టి జ్ఞానము వలన బ్రహ్మాది స్తంబపర్యంతములగు సమస్తభూతములను నీయందు చూడగలవు. అనగా, వాసుదేవుడనగు నాకును క్షేత్రజ్ఞులు (జీవులు) అనబడు భూతములకును సమస్త వేదాంతములయందును ప్రతిపాదింపబడిన ఐక్యమును కనుగొందువు, 'సర్వం బ్రహ్మ' అను నిశ్చయము కలుగునన్న మాట" - ఇదీ వారుచెప్పిన అర్థము -

ఒకవిధముగా వీరును తత్త్వత్రయమును ఒప్పుకొనక తప్పలేదు. ఐతే, సూటిగా ఒప్పుకొనక తలచుట్టును చేయి త్రిప్పి ముక్కును చూపించినట్లు కొంచెము డొంకతిరుగుడుగా ఒప్పుకొనినారు. మొత్తముమీద భ్రాంతిరహిత జ్ఞానము కలిగిన తరువాతకూడ పరమాత్మ, జీవులు, ప్రపంచము గోచరించునని ఒప్పుకొనినారు. అయితే, ఈజీవులు, ప్రపంచము పరమాత్మలో ఐక్యమైనట్లు గోచరించునట. ఇది విశిష్టాద్వైతము

నకును అద్వైతమునకును వారు జాగ్రత్తగ ఉంచుకొనగలిగినా మనుకొనిన భేదము.

దీనినిబట్టి పరమాత్మలో జీవులు ఐక్యమైన తరువాత కూడ వస్తునిచతుష్ణ గోచరించుచుండుననకూడ వీరు ఒప్పుకొనినట్లయినది. అట్లు ఒప్పుకొని పరమాత్మ తప్ప ఈ జీవులు, ప్రపంచము మిథ్యయని ఈశ్లోకమునిరూపించినట్లు సమర్థించినా మని తృప్తిపడినారు. ఇది ఎట్లున్నదనగా, ఒకనికి జబ్బు చేసి, సంధిపుట్టి తాను త్రాగు పాలలోను, నీటిలోను పురుగు లున్నట్లు కనుపించినదట. ఆ సంధి పోవుటకు వైద్యుడు మందుఇచ్చి, కొన్నిరోజులు గడచినతరువాత ఆరోగితో "ఆ పురుగులు కనుపించుట పోయినదా ?" అని అడుగగా, "ఆ. ఇబ్బందిలేదు, సంధికుదిరినది. మీరు మందుఇచ్చుటకు పూర్వము పురుగులు పాలపైని తేలియాడుచు కనుపించెడివి. ఇప్పుడు ఆ పాలలో కలిసిపోయి తిరుగుచున్నట్లు కనుపించు చున్నవి" అని చెప్పినాడట ! అట్లున్నది ఈ వ్యాఖ్యానము.

పురుగులు ఏమియును కనుపించకుండ పోయినప్పుడు నిజముగా జబ్బుకుదిరినట్లు గుర్తుగాని, ఆ పురుగులు అట్లే ఉండి పైగా పదార్థములలో కలిసిపోయినట్లు కనుపించిన జబ్బుకుదిరినదని చెప్పుట కుదురునా ?

అట్లే, ఈ ప్రపంచము, జీవులు మిథ్యయగుటే శాస్త్ర రీత్యా సత్యమయినచో- ఈప్రపంచము జీవులు ఉన్నట్లు కనుపించుట శాస్త్రరీత్యా భ్రాంతియే అయినచో - సరియైన

జ్ఞానము కలిగిన తరువాత అట్టి భ్రాంతిపోయి, అది కనుపించకపోవలయును. అట్లు కనుపించకపోకపోగా, పరమాత్మలో ఐక్యమైనట్లుకూడ కనుపించినచో, ఆ జ్ఞానము ఎట్టి జ్ఞానము ?

ఉన్నపదార్థములకు ఐక్యముగాని లేనిపదార్థములకు ఐక్యమేమి ? ఉన్నవస్తువును తీసికొనిపోయి లేనివస్తువులో కలుపుమని చెప్పినచో ఎట్లు కలుపుట ? ఆకాశకుసుమము రసముతీసి, దానిలో కర్పూరము రంగరించి తలనొప్పికి రాచుకొమ్మనిన ఎట్లు ? ఎన్నటికిని ఆమందు రాచుకొనుటయు జరుగదు. వీని తలనొప్పి పోవుటయును జరుగదు.

ప్రత్యాబ్దికశ్రాద్ధము పెట్టి, పిండములు కలుపుటకు ఏ చెరువుకో, కాలువకో పోవునుగాని, తన ఇంటి ప్రక్కనట్టిపై దాపులో ఉన్నదిగదా అని ఎండమావులలో కలిపి వచ్చునా ? కలుపుటకు అచ్చట నీరుండినగదా ! ఊరకే అచ్చట భూమిమీదపారవైచి రావలసినదే. సంప్రదాయము పోషించుకొనుటకు మూలములో లేకపోయినను ఇట్టి అర్థములు చెప్పవలసివచ్చుననిన, అసలు సంప్రదాయమనగా ఏమి ? శాస్త్రములలో ఏది ఉండిన అదియే సంప్రదాయము. మన ఉద్దేశముగాక, శాస్త్రములలో ఉన్నదానిని, మనలను చేయుమని చెప్పినదానిని అనుసరించుటయే నిజమైన సంప్రదాయము.

మహాసమాధిలోనైతము ప్రపంచము గోచరించు ననుట

సరియైన సిద్ధాంతము. ఈ సందర్భముగ మహాభారతములోని ఈక్రింది విషయము గమనింపవలసినది.

కౌరవులకును పాండవులకును సంధికుదురక, యుద్ధము జరుగుటయే నిశ్చయమని తలచిన ధృతరాష్ట్రుడు ఒకనాడు తన మానసిక వేదనను నివారించుకొనుటకు సనకసనందనాదు లలో ఒకరగు సనత్సుజాతులు అను మహాత్ముని ధ్యానించెను. వెంటనే ఆ మహాత్ముడు దర్శనమిచ్చి మాట్లాడినాడు. మరల ఇంకొకమారు ఇట్లే పరితాపపడి, తన తండ్రియైన వ్యాస భగవానుని స్మరించెను. ఆ మహాత్ముడుకూడ వెంటనేవచ్చి, దర్శనమిచ్చి మాట్లాడినాడు. ఇచ్చట మనకు కావలసిన విషయమేమనగా, సర్వకాలసర్వావస్థలయందును భగవద్ధ్యాన ములోనే మునిగియుండి 'సర్వసంకల్పసన్న్యాసీ' అనువిధముగా, ఎట్టిసంకల్పములును- దుష్ట సంకల్పము లేకాదు, మంచిసంకల్ప ములుకూడ లేక,అమనస్కులై, జీవన్ముక్తులైన మహాత్ములు ఎచ్చటనో ధృతరాష్ట్రుడు తమ్ము తలచుకొన్న విషయమును ఎట్లు గ్రహించగలిగినారు ?

వ్యాసభగవానుల మానసిక దశయందును, సన త్సుజాతుల మానసిక దశయందును ఎవరికిని సందేహము ఉండదు; ఉండరాదు. సనత్సుజాతులనగా బ్రహ్మమానసిక పుత్రులు. జ్ఞానములో వారిని మించిపోవుటకు దేహధారులకు అవకాశము లేదు. ఇక వ్యాసభగవానుడందమా, కేవలము జ్ఞాన శాఖలో, ప్రపంచమునకును, మహర్షులకునుగూడ ప్రబోధము

చేయుటకు ప్రత్యేకముగ వచ్చిన భగవదవతారము. ఇట్టి వీరు సర్వకాల సర్వావస్థలయందును భగవంతునియందే లీనమై, బ్రహ్మానందములో మునిగియుందురేగాని, ఎచ్చట ఎవరు తమ్ము తలచుకొనుచున్నారో అను ఆలోచనలో ఉండరుగదా! అట్టి మహాత్ములకు ఇచ్చట ధృతరాష్ట్రుడు తలచుకొనినది ఎట్లు తెలిసినది? పరమాత్మతో పాటు ఈజీవులు, ఈప్రపంచము కూడ సత్యమనియును, అట్టి పరిపూర్ణ జ్ఞానము లభించిన తరువాత, మహాసమాధిలో కూడ, ఈ ప్రపంచము గోచరించుచునే ఉండుననియును దీనిచే స్పష్టపడినది. కృష్ణపరమాత్మ ఈ శ్లోకములో చెప్పినది ఇట్టి జ్ఞానమే.

పై ఆధారములనుబట్టి చూచినచో, పరమాత్మను అనుభవించునప్పుడు ప్రపంచము గోచరించదనియు, ప్రపంచమును చూచుచున్నప్పుడు పరమాత్మ గోచరించదనియు చేయబడు వాదము నిరాధారమైనదని స్పష్టపడినది.

అ వ తా రి క :_

ఇంకను ఈ జ్ఞానముయొక్క మహిమను వర్ణించుచున్నాడు పరమాత్మ.

శ్లో॥ అపి చే దసి పాపేభ్యః
సర్వేభ్యః పాపకృ త్తమః।
సర్వం జ్ఞానప్లవేనై వ
వృజినం స న్తరిష్యసి ॥ 36

ప. వి :— అపి, చేత్, అసి, పాపేభ్యః, సర్వేభ్యః, పాపకృత్తమః, సర్వం, జ్ఞానప్లవేన, ఏవ, వృజినం, సన్తరిష్యసి.

టీక; —

(త్వం = నీవు,)
సర్వేభ్యఃపాపేభ్యః = సమస్తమైన పాపులకంటెను,
పాపకృత్తమః అసిచేత్ అపి = మిక్కిలి పాపములను చేసినవాడవైనను,
సర్వం వృజినం = సమస్తమైన పాపమును,
జ్ఞానప్లవేనైవ = జ్ఞానమనెడి తెప్పచేతనే,
సన్తరిష్యసి = లెస్సగ దాటగలవు.

తా. నీవు పాపులందరికంటెను అతిశయించిన పాపములు చేయువాడవైనను, ఈ జ్ఞానమనెడి నావచేత సమస్త పాపములను నిస్సందేహముగ తరించగలవు.

అమృతవాహిని :—

"అర్జునా ! నీవు పాపులకెల్ల మేటియైన పాపివైనను, ఎన్ని ఘోరపాపములు చేసియున్నను, ఆ నీ పాపసముద్రమునకు ఈ జ్ఞానము ఓడవంటిది సుమా ! ఈ జ్ఞానమను ఓడచేత నీ పాపసముద్రమునంతను సులభముగ నిస్సందేహముగ దాటగలవు" అని కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు.

ఈ శ్లోకములో 'అపిచేత్' అని ప్రయోగింపబడియున్నది. ఈ ప్రయోగము ఏమి తెలియజేయుననగా 'అర్జునా! యథార్థమాలోచించిన నీవు ఎంతమాత్రమును పాపివికావు.

నీవు దైవీసంపద కలవాడవు. ఆసురీసంపద ఈషణ్మాత్రమును నీయందు లేదు. అయినను ఈ జ్ఞానము నీవంటి పుణ్యాత్ములనే కాదు; పాపాత్ములనైనను తరింపజేయగలదు. ఇంక నీవంటి పుణ్యాత్ముల విషయము వేరుగ చెప్పవలయునా' అని కృష్ణ పరమాత్మ చెప్పినాడు.

ఇచ్చట ఎంతపాపియైనను ఈ జ్ఞానముచేత తరించగలడు అనుటచే, జ్ఞాని అయినవాడు, పాపములు చేసినను భయము లేదు అని విపరీతార్థము చెప్పరాదు. గతజన్మపరంపరలో గాని, ఈ జన్మలో ఈ జ్ఞానము కలుగుటకు పూర్వముగాని, ఎంతపాపము చేసియున్నను, ఈజ్ఞానము కలుగుటచే, సూర్యుడు వచ్చునప్పటికి అంధకారమువలె పాపములన్నియును నశించ గలవు. ఈపాపము మహాసముద్రమువలె ఉన్నను, ఈ జ్ఞాన మను ఓడచేత అతిసులభముగా ఈ పాపసముద్రమును దాట వచ్చును అనియే భావము.

అయితే, అంతమహాపాపికి ఈ జ్ఞానము లభించునా ? అట్టివానికి జ్ఞానమం దధికారము కలదా ? అను సంశయము కలుగవచ్చును. అట్టిదియు ఒకొక్కప్పుడు సంభవమే. మహాత్ముల అనుగ్రహలేశముచేతనో, భగవత్కరుణ అదృష్ట ముగానుండి, ఏ అకస్మాత్ సంఘటనలవలననో ఇట్టి జ్ఞానము కలుగుట కద్దు. అదృష్టవశమున ఆ జ్ఞానము లభించవలయునే గాని, ఆ క్షణములోనే అతనికి పాపములనుండి ఉద్ధరణము జరిగితీరును. ఇక వానిని ఎవరును పాపి అనుటకు వీలులేదు.

ఇదే భావముగల శ్లోకము తొమ్మిదవ అధ్యాయములో కలదు - "అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్ సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః" 'ఎంత దురాచారుడైనను అనన్యభావముతో నన్ను పూజించినయెడల వానిని సాధువుగనే తలంచవలయును' అని భావము. ఈ భజనమును, ప్రస్తుతము మనము విమర్శించు జ్ఞానమును ఒకటే. పరమాత్మయందలి అనన్యభక్తినే జ్ఞానమనికూడ పరమాత్మ పలుచోట్ల ఉపయోగించినాడు. కనుకనే భక్తులలో శ్రేష్ఠతము డైన భక్తుని 'జ్ఞాని' అని పేర్కొనినాడు. *

ఇంకొక విధముగ కూడ చెప్పవచ్చును - పాపమనగా ప్రతిబంధకము. కామ్యముగా చేసిన పుణ్యముకూడ భగవదనుభవమునకు ప్రతిబంధకమే. కనుక సమస్త పాపములనుండి తరించగలవు అనగా, సమస్త కర్మబంధములనుండి బయట పడగలవు అని భావము.

అ వ తా రి క :-

పరమార్థ విషయము ఏ ఒక్క ఉదాహరణచేతను పూర్తిగ చెప్పుటకు వీలుపడదు. అనగా భావము పూర్తిగ వ్యక్తము చేయుటకు ఏఒక్క ఉదాహరణమును చాలదు. కనుక ఇంకొక ఉదాహరణము కూడ చెప్పుచున్నాడు.

---

* "ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ !" అను శ్లోకవ్యాఖ్యానము చూడుడు.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిః
భస్మసాత్కురుతే ఽర్జున!
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి
భస్మసాత్కురుతే తథా॥ 37

ప. వి :— యథా, ఏధాంసి, సమిద్ధః, అగ్నిః, భస్మసాత్, కురుతే, అర్జున, జ్ఞానాగ్నిః, సర్వకర్మాణి, భస్మసాత్, కురుతే, తథా.

టీక :—

హే అర్జున ! = ఓ అర్జునా !
సమిద్ధః అగ్నిః = లెస్సగామండుచున్న అగ్ని,
ఏధాంసి = కట్టెలను,
యథా = ఏవిధముగ,
భస్మసాత్కురుతే = సంపూర్ణముగా భస్మము చేయుచున్నదో,
తథా = ఆవిధముగనే,
జ్ఞానాగ్నిః = జ్ఞానమనెడి అగ్ని,
సర్వకర్మాణి = సమస్తకర్మలను,
భస్మసాత్కురుతే = సంపూర్ణముగా భస్మము చేయుచున్నది.

తా. అర్జునా ! బాగుగ మండుచున్న అగ్ని కట్టెలను ఎట్లు భస్మము చేయుచున్నదో, అట్లే జ్ఞానాగ్ని సమస్తకర్మలను భస్మము చేయుచున్నది.

**అ మృ త వా హి ని :—**

అర్జునా ! జ్ఞానముయొక్క మహిమ ఎంతటిదో ఇంకను వినుము. మిక్కిలిగా ప్రజ్వలించుచున్న అగ్ని కట్టెలను ఎట్లు దహించి భస్మము చేసివేయునో, అట్లేజ్ఞానము శుభాశుభకర్మలను వాటి వాటి ఫలములైన సుఖదుఃఖములను, ఇన్నిటికిని కారణమైన అవిద్యను పూర్తిగ నాశనము చేయును.

ఈ అధ్యాయములోనే పందొమ్మిదవ శ్లోకములో "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" అని ఈ జ్ఞానము యొక్క మహిమ కొనియాడబడినది. జ్ఞానికి సంచితకర్మ నశించుచున్నది. ఆగామి నశించుచున్నది. ప్రారబ్ధము అనుభవించక ఎవరికిని తప్పదు, కాని, జ్ఞానికిమాత్రము శరీరము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు - వీనిమీద అభిమానము లేకపోవుటచే శరీరము అనుభవించుచున్నను అది ఆతనికి అంటదు.

శ్లో॥ నహి జ్ఞానేన సదృశం
పవిత్ర మిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః
కాలే నాత్మని విన్దతి ॥ 38

ప. వి :—న, హి, జ్ఞానేన, సదృశం, పవిత్రం, ఇహ, విద్యతే, తత్, స్వయం, యోగసంసిద్ధః, కాలేన, ఆత్మని, విన్దతి.

టీక :—

ఇహ = ఈ లోకమందు,
జ్ఞానేన = జ్ఞానముతో,

సదృశం = తుల్యమైనదియు,
పవిత్రం = (అంత) పవిత్రమైనదియు,
నవిద్యతేహి = (ఇంకొకటి) లేదుకదా !
యోగసంసిద్ధః = కర్మయోగసిద్ధిని పొందినవాడు,
కాలేన = కాలక్రమమున,
ఆత్మని = తనయందు,
తత్ = ఆ జ్ఞానమును,
స్వయం = స్వయముగానే,
విన్దతి = పొందుచున్నాడు.

తా. జ్ఞానమునకు చాలిన పవిత్రమైన దీ లోకమున ఇంకొకటి లేదనుట నిస్సందేహము - నిష్కామబుద్ధితో కర్మయోగము నాచరించి, సిద్ధిపొందినవాడు యథాసమయమున ఆ జ్ఞానమును తన అంతఃకరణమున స్వయముగా పొందుచున్నాడు.

అ మృ త వా హి ని :_

"అర్జునా ! జ్ఞానముతో సరిపోల్చదగిన పవిత్రమైన వస్తువు జగత్తులో ఇంకటి లేదు. జ్ఞానములో ఇంత మహిమ యును, సామర్థ్యమును కలవు. కనుకనే ఈ జ్ఞానము సమస్త పాపములను భస్మము చేయగలుగుచున్నది."

ఈ లోకములో మానవులు పవిత్రములుగా తలచునవి అనేకములున్నవి. యజ్ఞము, దానము, తపము, పూజ, సేవ, వ్రతములు, ఉపవాసములు, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులతో కూడిన అష్టాంగ

యోగమును, శమము, దమము, జపము, ధ్యానము మొదలగు ఎన్ని సాధనలు శాస్త్రములందు చెప్పబడి ఉన్నవో, అవన్నియును గంగ యమున త్రివేణి భాగీరథి కృష్ణ మొదలగు పవిత్ర తీర్థములును - ఇత్యాదులన్నియును మానవుని పాపములను భస్మముచేసి, మానవుని పవిత్రుని చేయునవే. అయినను, ఇవన్నియును భగవత్తత్వజ్ఞానమునకు సరిపోవు. ఇవన్నియును ఆ భగవత్తత్వజ్ఞానమును పొందుటకు సాధనములు గనుకను, ఈ జ్ఞానము ఈ సాధనలకన్నిటికిని ఫలస్వరూపము గనుకను, ఈ సాధనలన్నియును ఈ భగవత్తత్వజ్ఞానము కలుగుటకు సహాయభూతములు కనుకను, వీనినన్నిటిని కూడ పవిత్రములని చెప్పుచున్నారు. వీటికి ఈ పవిత్రత ఈ జ్ఞానముయొక్క సంబంధముచేత కలిగినదే. ఈ భగవత్తత్వ జ్ఞానము కలిగిన తరువాత మానవులలో దుష్టమైనభావములు దుష్టమైన ఆచరణ ఉండుటకు వీలులేదు. మోసము, చోరత్వము, జారత్వము, అసత్యము, హింస మొదలగు పాపములకు కారణము రాగద్వేషములు. ఈ రాగద్వేషములకు కారణము అహంకార మమకారములు. అహంకార మమకారములకు కారణము మోహాంధకారము. జ్ఞానసూర్యుడు ఉదయించినతరువాత ఈ మోహాంధకారము పటాపంచలై పోవును. "యద్ జ్ఞాత్వా నపునర్మోహ మేవం యాస్యసిపాండవ!" అని ఈఅధ్యాయము లోనే చెప్పబడియున్నది. మోహాంధకారము నశించిననాడు దానిచేత కలిగిన అహంకారమమకారములు, రాగద్వేషములు

దుష్టభావనలు, దుష్టాచరణము - సమస్తము మాయమై పోవలసినదే. పునాదిచెడునప్పటికి సౌధము కూలవలసినదే కదా! వేరు నశించునప్పటికి వృక్షమునశించక ఎట్లుండును? అట్లే ఇన్ని అనర్థములకును కారణమైన మోహాంధకారము నశించిన తరువాత ఏ ఒక్క అనర్థమును ఉండజాలదు.

ఒక మాయలమారి రాక్షసుడు తనమాయచేత ఒక గ్రామములో అనేక భయంకరపరిస్థితులను కల్పించి ప్రజలకు మహాదుఃఖములను, కష్టములను కలిగించుచున్నాడు. ఆ దుఃఖములను ఆ కష్టములను పోగొట్టుకొనుటకు ఆ ప్రజలు అనేకప్రయత్నములు చేయుచున్నారు. కాని అవి పోవుటలేదు. ఎందులకనగా, ఆ ప్రజలకు ఆ బాధలు ఈ దుష్టరాక్షసుని దుష్టయోగశక్తులద్వారమున వచ్చుచున్నవని తెలియదు. అందుచేత ఇంకొకవిధముగ వీరెంత ప్రయత్నము చేసినను ఆ విపత్తుతప్పుటలేదు. చివరకు కొంతమంది ఇది ఈ రాక్షసుని కృత్యమే అని గ్రహించి, ఒకనాడు మాయోపాయముచే ఆ రాక్షసుని సంహరించినారు-అంతే - వేరుగ ఏ ప్రయత్నమును అక్కరలేకయే ఆ మాయలన్నియును నశించి, ప్రజలకు సుఖము చేకూరినది.

అట్లే, ఈ మోహాంధకాసురుని సంహారమైనతరువాత ఈ అహంకారమమకారములు సర్వనాశనమైపోవలసినదే. ఈ భగవత్తత్త్వజ్ఞానము మోహాంధకారమును త్రుటిలోనాశనము చేయగలదు. అసలు జ్ఞానము మోహాంధకారమును నాశనము

చేయుటకు ప్రయత్నించవలయునా యేమి ? జ్ఞానభానుని ఎదుట మోహాంధకారము తనంతట తానే నశించును. ఇంతటి ప్రభావముగల ఈ జ్ఞానమునకు జగత్తులో సాటి ఏది గలదు ? కనుక మానవుడు ఎంతప్రయత్నించియును ఈ జ్ఞానమునే సంపాదించవలయును. ఈ జ్ఞానము ఎవరియందు యథార్థముగా కలదో, వారికి సర్వపాపములు నశించుటయే కాదు, వారి మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరము, అత్యంతపవిత్రములై పోవును. వారి ప్రతిరోమమునుండియును ఆ జ్ఞానప్రకాశము ప్రజ్వలించుచుండును. కనుక శ్రద్ధాపూర్వకముగ చేయబడిన అట్టి మహాత్ముల దర్శన స్పర్శన సంభాషణ వందన చింతనాదులచేతకూడ మానవులు అట్టి జ్ఞానమును పొంది పరమపవిత్రులగుదురు. కనుక భగవత్తత్త్వ జ్ఞానమునకు మించిన పరమపవిత్రమైన వస్తు వీలోకమున ఇంకొకటి లేదు.

మూలశ్లోకమున 'ఇహ' అని ప్రయోగింపబడియున్నది. ఇహమనగా ప్రకృతిపరిణామమైన ఈ ప్రకృతిజగత్తు అని భావము.

భగవదితరమైన సృష్టినంతను ఉద్దేశించి ఈ పద ప్రయోగము చేయబడినది. బ్రహ్మలోక పర్యంతము ఎక్కడ వెదకినను ఈ జ్ఞానమునకు సరిపోలిన పవిత్రవస్తువు దొరుకదు. కాని ఈ జ్ఞానమునకు ఫలస్వరూపమైన భగవత్తత్త్వముకలదు. దానికంటె అని అర్థము రాకుండ 'ఇహ' అని వాడబడినది. కనుకనే, పదవ అధ్యాయములో అర్జునుడు "పరంబ్రహ్మ

పరంధామ పవిత్రం పరమం భవాన్" అనినాడు. మహాభారతములో భీష్ముడుకూడ "పవిత్రాణాం పవిత్రం యోమంగళానాం చ మంగళమ్" అని భగవంతునిగూర్చి చెప్పియున్నాడు. అట్టిపరమాత్మను సాక్షాత్తుగ అనుభవించుటకు కారణమైన ఈ భగవత్తత్త్వ జ్ఞానమునకు మించి ఈ ప్రాకృతజగత్తులో ఇంకొక పవిత్రవస్తువేమియును లేదు అని భావము.

ఈ జ్ఞానము బయటినుండి సంపాదింపబడునదికాదు. పరిశుద్ధమైన నీ అంతఃకరణమునందే, పరమాత్మయొక్కగాని, మహాత్ములయొక్కగాని అనుగ్రహముచేత కలుగవలయును. నిష్కామకర్మయోగముద్వారా పరిశుద్ధమైన అంతఃకరణములో ఇట్టి జ్ఞానము ఉదయించును.

అవతారిక :-

ఈ జ్ఞానమును పొందుటకు పాత్రతను నిర్ణయించు చున్నాడు.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
తత్పర స్సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి
మచిరే ణాధిగచ్ఛతి ॥ 39

ప. వి :- శ్రద్ధావాన్, లభతే, జ్ఞానం, తత్పరః, సంయతేన్ద్రియః, జ్ఞానం, లబ్ధ్వా, పరాం, శాన్తిం, అచిరేణ, అధిగచ్ఛతి.

టీక :—

శ్రద్ధావాన్ = శ్రద్ధావంతుడును,
తత్పరః = తత్పరుడును,
సంయతేన్ద్రియః = జితేంద్రియుడును అయిన పురుషుడు,
జ్ఞానం = ఇట్టి జ్ఞానమును,
లభతే = పొందుచున్నాడు,
జ్ఞానం = జ్ఞానమును,
లబ్ధ్వా = పొంది,
పరాం శాన్తిం = పరమశాంతిని,
అచిరేణ = శీఘ్రముగా,
అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా. శ్రద్ధావంతుడును, తత్పరుడును, జితేంద్రియుడును అయిన పురుషుడు ఈ జ్ఞానమును పొందుచున్నాడు. జ్ఞానమును పొంది పరమ శాంతిని పొందుచున్నాడు.

**అ మృ త వా హి ని :—**

జ్ఞానము పొందుటకు అర్హత చేకూర్చు మూడు లక్షణములు ప్రధానముగా చెప్పబడినవి - శ్రద్ధ, తత్పరత, జితేంద్రియత అని.

శ్రద్ధ : జ్ఞానమును పొందవలయుననెడి శ్రద్ధ ఉండవలయును. వేదములయందును, శాస్త్రములయందును, పరమాత్మయందును మహాత్ములవచనములయందును, పరలోకములయందును పరిపూర్ణవిశ్వాసము కలిగి, వీటిన్ని

గూర్చి, పరమాత్మ శ్రేష్ఠములు, పరమపూజ్యములు అను భావము కలిగి ఉండుటే శ్రద్ధ. శ్రద్ధచేతనే జ్ఞానము లభించును. శ్రద్ధలేని వాడు ఎన్ని చేసినను ఫలము మాత్రము శూన్యము. కనుకనే "శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం" అని చెప్పబడియున్నది. ఈ శ్రద్ధకు వేదముకూడ ఎంతవిలువ ఇచ్చినదో చూడుడు - "శ్రద్ధయా దేవా దేవత్వ మశ్నుతే, శ్రద్ధా ప్రతిష్ఠా లోకస్య దేవ" (తై ౩-౧-౨-3) 'శ్రద్ధవలననే దేవతలు దేవత్వమును ప్రాపించిరి. శ్రద్ధయే సమస్తలోకములకు ఆధారదేవత' అనియును, శ్రద్ధయా సత్య మాప్యతే" (యజుర్వేద - ౧౯-౩౦) 'శ్రద్ధ చేతనే సత్యస్వరూపుడైన భగవంతుడు లభించుచున్నాడు' అనియును, నిరుక్తములో కూడ "శ్రద్ధా శ్రద్ధానాత్" 'సత్యము యొక్క స్థాపన దేనిచేత లభించుచున్నదో అది శ్రద్ధ' అనియును, "శ్రద్ధావిత్తో భూత్వాత్మన్యే వాత్మానం పశ్యేత్" - (బృ.ఉ. ౪-౪) 'శ్రద్ధాధనము వలననే అంతఃకరణమునందు బ్రహ్మమును చూడుము' అనియును, గీతలోనే పదునేడవ అధ్యాయములోని మూడవ శ్లోకమున "శ్రద్ధామయోఽయం పురుషః" 'ఈ పురుషుడు శ్రద్ధామయుడు' అనియును శ్రద్ధకు ప్రాముఖ్య మీయబడినది.

శ్రద్ధలేకపోయినను, మహాత్ముల సన్నిధికేగి నమస్కారములు, సేవ, ప్రశ్నలు మొదలైనవాటిచేత జ్ఞానమును పొందుట అసంభవమా అను శంక రావచ్చును.

కాని, శ్రద్ధలేనివారు మహాత్ముల సన్నిధికి ఎందుకు పోవలయును ? పరీక్షచేయుటకా ? తన యొక్క విద్యను

ప్రతిభను చూపించుటకా ? పేరుప్రతిష్ఠలకొరకా ? దంభము నకా? ఇట్టి అభిప్రాయములతో కూడ కొంతమంది మహాత్ముల సన్నిధికేగి ప్రణామాదులుచేసి ప్రశ్నించుటకద్దు. కాని దీనివలన జ్ఞానప్రాప్తిలభించదు. ఈ గీతలోనే పదునేడవ అధ్యాయములో ఇరువదిఎనిమిదవ శ్లోకమున "అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతంచయత్ అస దిత్యుచ్యతే పార్థ! నచ తత్ప్రేత్యనో ఇహ" 'శ్రద్ధలేక చేయబడిన హోమము, దానము, తపస్సు, కర్మలు మొదలగునవన్నియును వ్యర్థములే. ఈ లోకమునగాని పరలోకమునగాని ఏమియు లాభించునవిగావు' అని పరమాత్మ చెప్పినాడు.

కనుక శ్రద్ధలేక మహాత్ముల సన్నిధికిపోయి, దంభము నకు ఎన్ని చేసినను, జ్ఞానము లభించదు. కనుక శ్రద్ధ అత్యంత మవసరము.

ఏ మానవునకు జ్ఞానమునందు శ్రద్ధకలిగినదో, ఆ శ్రద్ధ యొక్క మోతాదునుబట్టి జ్ఞానసాధనయందు తత్పరత ఏర్పడును. తత్పరత శ్రద్ధకు చిహ్నము. శ్రద్ధయొక్క కార్య రూపము తత్పరత. ఎవనికి ఏ విషయమునందు శ్రద్ధకలదో వాడు ఆ విషయమైన సంపాదన ప్రయత్నములో తత్పరుడై యుండును. ఇది సృష్టియొక్క నియమము.

కాని ఈ విషయమునందు సరియైన దృష్టిలేకపోవుటచే, లోకమున పెక్కుమంది తమకున్న ఏదో ఆవగింజంతశ్రద్ధను చూచుకొని, అదే అపారమైన శ్రద్ధగా భావించుకొని,

ఆ మాత్రమునకే గర్వపడుచు, శ్రద్ధతక్కువగుటచే కార్యసిద్ధి కాకపోవునప్పటికి, అది తమ శ్రద్ధయొక్క లోపమని గ్రహింపక, తాము ఎంతశ్రద్ధతో ప్రయత్నము చేసినను, కార్యము నెరవేరలేదు కనుక ఈ విధానము అసత్యము అనియో, భగవత్ప్రాప్తికి ఎంత ప్రయత్నించినను, లభించలేదు కాన, భగవంతుడు నిర్దయుడు అనియో, అసలు భగవంతుడే లేడు అనియో సిద్ధాంతములు చేయుట జరుగుచున్నది. ఇట్లు తలచుట కేవలము భ్రమమూలకము. సిద్ధికలుగకపోవుటకు యథార్థకారణము అభ్యాసమునందు తత్పరతలేకపోవుట. తత్పరత లేకపోవుటకు కారణము శ్రద్ధలేకపోవుట. శ్రద్ధను బట్టియే తత్పరత ఏర్పడును. తత్పరతనుబట్టి అభ్యాసము యొక్క తీవ్రతయును, నిష్కల్మషతయును ఉండును. నిష్కల్మషము, తీవ్రము అయిన అభ్యాసమునుబట్టి సిద్ధి యుండును. కనుక అన్నిటికిని మూలము శ్రద్ధ. శ్రద్ధకలుగగనే తరువాత కలుగు పరిణామము తత్పరత.

అభ్యాసమున నిజమైన తత్పరత కలిగిననాడు జితేంద్రియత్వము సహజముగా కలుగును. ఇది కూడ సృష్టియొక్క అచలనియమమే.

ఏకాదశి ఉపవాసము చేయవలయుననిన, గుండెలు బాదుకొని, ప్రతిదినముకంటె ఆనాడు ఒకగంటముందుగ, పదిముద్దలెక్కువగతిను భోజనప్రియుడు తన వ్యాపార వ్యవహారమునందు మునిగి, భోజనమునకు పిలుచువారిపై

వినుగుకొని, మందలించి, లాభసాటి అయిన ఆ వ్యవహారము పూర్తిచేసికొనువరకును భోజనము ప్రసక్తియే లేక, దిన మంతయు గడిపి, అనంతరమువచ్చి మధ్యాహ్నము భోజనము నకు పిలిచినవారిని తిరిగి మందలించుట ప్రారంభించినాడు. వ్యాపారమునవచ్చు లాభమును ఆశించుచున్న ఆతనికి, ఆలాభముపై గల శ్రద్ధవలన, భోజనము కూడ గుర్తురానంతగ, ఇతరులు గుర్తుచేసినను, భోజనముపై ఆసక్తి కలుగకపోగా, ఆ గుర్తుచేసినవారిపై చిరాకుపడునంతగ - ఆ వ్యాపార కార్యక్రమముపై తత్పరత కలిగినది. అంతేకాదు; భోజన సమయమునకు క్షణము జాగైనను సహింపలేని ఆతనికి దినమంతయును అభోజనముగా ఉండగలుగునట్లు జిహ్వపై విజయము లభించినది. ఈ క్రమము ననుసరించియే పరమాత్మ శ్రద్ధ, తత్పరత, జితేంద్రియత-అని క్రమము ప్రతిపాదించినాడు.

ఈ రహస్యము తెలియకపోవుటచే సాధకుడు ఫలము నుండి వంచింపబడుచున్నాడు. తత్పరత తక్కువగునప్పటికి ఏకొంచెమో అభ్యాసముచేసి అంతమాత్రముననే 'ఎంత అభ్యా సము చేసితిని ! ఎంతతపస్సు చేసితిని ! ఎంతకష్టపడితిని ! ఫలముమాత్రము లభించలేదు' అని వాపోవుట, నిరుత్సాహ పడుట, మార్గమునుండి జారుట కలుగుచున్నవి. పూర్ణమైన శ్రద్ధ, పూర్ణమైన తత్పరత కలవాడు ఎంతకష్టపడినాననిగాని, ఎంత అభ్యాసము చేసినాననిగాని భావించడు. ఎంత చేసినను

ఇంకను అసంతృప్తితోనే ఉండును. తాను చేసినది బహు స్వల్పమనియే తలచును.

యథార్థమైన తత్పరత పూర్ణముగా ఉన్న నాడు, ఏవిషయమున తత్పరతకలదో దానినిగూర్చిన ఆ ప్రయత్నమునకు భిన్నమైనవాటియందు స్పృహయే ఉండదు. ఇదియే 'సంయతేంద్రియత' అనగా.

పైన చెప్పిన కథలోని వ్యక్తికి ఆకలియందు స్పృహయే లేదే ! అట్లుండగలుగుటకుగాని, ఆకలిని జయించుటకుగాని అతడు ప్రత్యేకముగ ఎన్నడైన అభ్యాసము చేసినాడా ? లేదు. ఆ తత్పరతయే సహజముగా ఆ శక్తిని కలిగించినది.

ఇట్లు జ్ఞానము లభించినతరువాత పరమశాంతికి- అనగా భగవదనుభవసుఖమునకు - కాలవిలంబము ఉండదు. సూర్యుడుదయించుటకును, అంధకారము నశించుటకును మధ్య కాలవిలంబ మేమి ఉండును ? సూర్యునిరాక, అంధకారము పోక, సకలవస్తు సాక్షాత్కారము ఒకేమారు జరుగును. అట్లే జ్ఞానసూర్యోదయము, అజ్ఞానాంధకార నాశనము, భగవత్సాక్షాత్కారము ఒకేమారు లభించగలవు. కాలవిలంబము ఉండదు. భగవత్సాక్షాత్కారమైన ఇక శాంతి సుఖములసంగతి వేరుగ చెప్పవలయునా ? కండశర్కర నోటిలో వేసికొనుటయును, మాధుర్యము అనుభవము లోనికి వచ్చుటయును ఒకేమారుగదా !

అ వ తా రి క :—

ఇక, శ్రద్ధలేని వాని గతిని గూర్చి చెప్పుచున్నాడు పరమాత్మ.

శ్లో॥ అజ్ఞ శ్చాశ్రద్ధధానశ్చ
సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽ స్తి న పరో
నసుఖం సంశయాత్మనః ॥ ४०

ప. వి :—అజ్ఞః, చ, అశ్రద్ధధానః, చ, సంశయాత్మా, వినశ్యతి, న, అయం, లోకః, అస్తి, న, పరః, న, సుఖం, సంశయాత్మనః.

టీక :—

అజ్ఞః = జ్ఞానహీనుడును,
అశ్రద్ధధానశ్చ = శ్రద్ధలేనివాడును,
సంశయాత్మా = సంశయచిత్తుడును,
వినశ్యతి = నశించిపోవుచున్నాడు;
సంశయాత్మనః = సంశయచిత్తునకు,
అయంలోకః = ఈ లోకమును,
నాస్తి = లేదు;
పరశ్చ = పరలోకమును,
న = లేదు,
సుఖం = సుఖమును,
న = లేదు.

తా. జ్ఞానహీనుడును, శ్రద్ధలేనివాడును, సంశయచిత్తుడును నశించు చున్నాడు. సంశయచిత్తునకు ఈ లోకమునులేదు, పరలోకమునులేదు, సుఖమునులేదు.

## అ మృ త వా హి ని :-

జ్ఞానహీనుడు అనగా, సత్యాసత్యములయొక్కయును, ఆత్మానాత్మలయొక్కయును, కర్తవ్యాకర్తవ్యముల యొక్కయును వివేచన చేసికొను శక్తిలేనివాడు అని భావము.

శ్రద్ధలేనివాడు అనగా, భగవంతునియందును, పరలోకముల యందును, మోక్షమునందును, ఆ మోక్షమును పొందు ఉపాయములను చెప్పుశాస్త్రములయందును, మహాపురుషుల యందును, వారి ప్రబోధముల యందును విలువ, విశ్వాసము లేనివాడు అని భావము.

సంశయాత్ముడు అనగా, భగవంతునియందును, పరలోకములయందును, ఇంకను ఇతరవిషయములయందును ఏనిశ్చయమును లేనివాడు; అన్నివిషయములందును సందేహము కలవాడు అని భావము.

ఈ ముగ్గురిలోను సంశయచిత్తుడు ఎక్కువగ దుఃఖములపాలు కాగలడు. కనుకనే సంశయచిత్తునకు ఈలోక సుఖము, పరలోక సుఖముకూడ లేదని చెప్పబడినది.

పురుషార్థములు నాలుగు - ధర్మము, అర్థము, కామము, మోక్షము అని. ఈముగ్గురిలో ఏఒకనికిని మోక్షము లేదు అనుటలో ఎంతమాత్రమును సందేహము లేదు.

కాని, ఎవనిలో అజ్ఞానదోషము మాత్రము ఉండీ, శ్రద్ధకు లోపము ఉండదో, సంశయము ఉండదో, అట్టివానికి మోక్షము లభించకపోయినను, కామ్యములతో సత్కర్మలాచరించుటచేత, ఇహలోకసుఖములు, పరలోకసుఖములు లభించవచ్చును.

ఎవనిలో వివేచనాజ్ఞానము ఉండి, సంశయము లేక, శ్రద్ధలో మాత్రము లోపము ఉన్నదో, అట్టివాడు ఏ విషయమైనను విపరీతముగనే నిర్ణయము చేయును. కనుక అతనికి మోక్షము లేదు; పరలోకసుఖమును లేదు. అయినను, ఐహిక కార్యక్రమములలో మాత్రము మంచిబుద్ధిమంతుడుగ ఉండి ఈలోకములో సుఖమనుభవించవచ్చును.

ఈ ఇద్దరికంటె విలక్షణమైనవాడు సంశయచిత్తుడు. వీనికి దేనియందును నిశ్చయము కలుగదు. ప్రతివిషయముననుసందేహమే కలుగుచుండును. ఇతనిలో వివేచనాశక్తి ఉన్నను, చిత్తము సంశయయుక్తమగుటచే, దేనియందును నిలుకడ ఉండదు. మోక్షవిషయమున ఒకప్పుడు ఒకసాధనను నిశ్చయించుకొని ప్రారంభించును. మరల ఇంకొకటి విచారించి దీనిని విడిచి, దానిని అవలంబించును. ఇట్లే పరలోకసాధనల విషయమునను ఒక నిర్ణయముమీద నిలబడి ఉండలేడు. క్షణక్షణమును మార్పుచేసికొనుచుండును. ఇహలోక విషయమునగూడ ఒక నిశ్చయముమీద నిలిచి ఉండలేడు. ప్రతి విషయమునను అనుమానమే; సందేహమే; ఏదియును

చేయలేడు; ఆకారణమున ఏదియును అనుభవించలేడు. ఈ పని చేయవలయునని, ఇట్లు చేయవలయునని, నిర్ణయము చేసికొని, ఆ నిర్ణయముమీాద నిలబడి, ప్రయత్నము చేయుట ఇతనికి చేతగాదు. ప్రతిదానిలోను, ప్రతిపదార్థము విషయమునను, ప్రతివ్యక్తిని గురించియును, ఎప్పుడును సందేహమే. ఇందువల్ల ఇతనికి ఇహలోకమునను సుఖము లేదు; పరలోకమునను సుఖము లేదు; ఇక మోక్షము విషయము చెప్పవలయునా ?

అజ్ఞానము, అశ్రద్ధ, సంశయచిత్తము - ఈ మూడు లక్షణములును ఒకరివద్దనే ఉన్నచో ఇక చెప్పుట కేమున్నది ?

అవతారిక :-

ఇక సంశయరహితుడై అంతఃకరణమును స్వాధీనము చేసికొన్న కర్మయోగిని గూర్చి ప్రశంసించుచున్నాడు. పరమాత్మ.

శ్లో॥ యోగసన్న్యస్త కర్మాణం
జ్ఞాన సంఛిన్న సంశయమ్ ।
ఆత్మవంతం న కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ ! ౪౧

ప. వి :—యోగసన్న్యస్తకర్మాణం, జ్ఞానసంఛిన్న సంశయం, ఆత్మవంతం, న, కర్మాణి, నిబధ్నన్తి, ధనంజయ ;

టీక :—

హే ధనంజయ ! = ఓ అర్జునా !
యోగసన్న్యస్తకర్మాణం = సమత్వబుద్ధితో సమస్త కర్మలను విడిచినట్టి యును,
జ్ఞానసంఛిన్నసంశయం = వివేకముతో సమస్త సంశయములను ఛేదించుకొని నట్టిదియును,
ఆత్మవంతం = బ్రహ్మనిష్ఠుని,
కర్మాణి = కర్మలు,
ననిబధ్నన్తి = బంధించలేవు.

తా. ఓ ధనంజయా ! సమత్వబుద్ధియోగముతో సమస్తకర్మలను నాయందు బాగుగా అర్పణముచేసినట్టియును, వివేకముతో సమస్త సంశయములను ఛేధించునట్టియును, స్వాధీనమైన అంతఃకరణముగలట్టి యును మహాత్ముని కర్మలు బంధించలేవు,

అ మృ త వా హి ని :—

'యోగసన్న్యస్తకర్మాణం' అనగా, యోగముచేత బాగుగ అర్పింపబడిన కర్మలుగలవానిని అని భావము. అహంకారము, మమకారము, ఫలాభిలాష, ఆసక్తి, కర్తృత్వాభి మానము, మొదలగునని ఎంతమాత్రమును లేక, సమత్వ బుద్ధితో, సమస్తకర్మలను భగవంతునియందు లెస్సగా సమర్పించుచుండవలెను. ఇదే పన్నెండవ అధ్యాయములో ఆరవ శ్లోకమున "యేతుసర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః' అని చెప్పబడినది,

కొందరు "యోగసన్న్యస్తకర్మాణం" అనుదానికి "కర్మలను స్వరూపముతో విడిచినవానిని" అని అర్థము చెప్పినారు. కాని కృష్ణపరమాత్మ అభిప్రాయము అదిగా తోచుట లేదు. తరువాతి శ్లోకములో 'తస్మాత్' అను శబ్దముతో ఆ శ్లోకమునకు ఈ శ్లోకమునకు సంబంధము కలుపబడియున్నది. 'కాబట్టి అర్జునా! యోగమందుండి యుద్ధము చేయుము' అను హెచ్చరిక ఉన్నది తరువాతి శ్లోకములో. ఈ శ్లోకములో స్వరూపతః కర్మలను త్యజించుటే చెప్పబడిన యెడల, తరువాతి శ్లోకములో 'తస్మాత్' ప్రయోగమునకు అర్థము ఉండదు.

'జ్ఞానసంఛిన్నసంశయం' అనగా, జ్ఞానముచేత నాశము చేయబడిన సంశయములు కలవానిని అనిభావము. సమత్వ బుద్ధితో సమస్తకర్మలను భగవంతునకు పూర్ణముగ అర్పణ చేయుటచేత, యథార్థమైన భగవత్తత్త్వజ్ఞానము లభించుచున్నది. ఆ జ్ఞానముచేత సర్వసంశయములును పూర్తిగ నశించిపోవుచున్నవి. కనుక జ్ఞానముచేత నశింపజేయబడిన సంశయములు కలవాడు అని చెప్పబడినది.

'ఆత్మవంతం' అనగా భగవంతుని పొందినవానిని అని భావము. ఆత్మ అనగా జీవాత్మ, భగవంతుడు, మనస్సు మొదలగు అర్థములుకలవు. ఆ యా ప్రకరణములనుబట్టి ఆ యా అర్థములను గ్రహించవలయును. ఇక్కడ భగవంతుడు అను అర్థము సమంజసముగా ఉన్నది. జీవాత్మ అను అర్థము

ఇక్కడ సంబంధించదు. ఇక చిత్తము, మనస్సు అను అర్థములు చెప్పి, చిత్తము స్వాధీనములో కలవానిని అనినారు కొందరు. పై విశేషణముల క్రమమును చూచిన భగవంతుడు అను అర్థమే పొసగునట్లున్నది. ఇక్కడ సామాన్యసాధకుని విషయము చెప్పుటలేదు. యోగముచేత సమస్త కర్మలును భగవంతునియందు పూర్ణముగ అర్పణము చేసినవాని విషయము చెప్పుచున్నాడు. అట్టివాడు అంతకుముందే ఇంద్రియములతో సహా అంతఃకరణమును జయించి ఉండవలయును. అప్పుడుగాని పూర్తిగ సమత్వబుద్ధిరూపమైన యోగము సిద్ధించదు. అది సిద్ధించినప్పుడు ఆ యోగబలముచే సమస్త కర్మలను భగవంతునియందు సర్వార్పణము చేయగల సామర్థ్యము లభించును. పూర్ణముగ సమస్త కర్మలను అర్పణము చేసిన ఫలముచే, భగవత్తత్త్వముయొక్క యథార్థ జ్ఞానము కలుగును. ఆ జ్ఞానము లభించుటే తడవుగా, మోహాంధకారము తొలగిపోవును. ఇంక సంశయములకు తావెక్కడ ? మోహాంధకారము తొలగుట, భగవత్సాక్షాత్కారము, అన్నియును ఒకదాని వెంబడి ఒకటి కాలవిలంబము లేకయే కలుగును గదా ! *

కనుక 'ఆత్మవంతం' అనగా ఇక్కడ భగవంతుని పొందినవానిని అను అర్థమే అమృతవాహినికి సమ్మతము.

* మువ్వది తొమ్మిదవ శ్లోక వ్యాఖ్యానము చూడుడు.

'ఇట్టివానిని కర్మలు బంధించవు' ఇది. శ్లోకముయొక్క చివరి సారాంశము. ఇక్కడ కర్మలు అనగా ఎట్టికర్మలు ?

బంధనకారణములగు ప్రాచీనములైన అనంతములగు కర్మలు అని పూర్వులలో కొందరి వ్యాఖ్య.

కర్మాణి అనగా కర్మలు అని మాత్రమే మరికొందరు పూర్వవ్యాఖ్యాతలు వ్రాసిరి. కాని ఎట్టి కర్మలు అను విభజన చేయలేదు.

పరిశీలించి చూచినచో ఇక్కడ కర్మాణి అనగా చేయ బోవు కర్మలనెడి అర్థమునకే ప్రాధాన్యమీయవలయును. వెనుక చేసిన కర్మలను గురించి ఇక్కడ ప్రస్తావనలేదు.

అర్జునుడు యుద్ధరూపమైన కర్మ చేయుననియు, కర్మ బంధమునకు కారణమనియు భ్రమలోనుండుటచే ఆ భ్రమను తొలగించుటకు చెప్పినట్టి సందర్భము గనుక, ఇట్టి యోగిని కర్మలు బంధించవు అని చెప్పినప్పుడు, ఇక చేయబోవు కర్మలను ఉద్దేశించియే చెప్పబడినట్లు భావించవలయును. అర్జునుడు, కర్మ బంధించు స్వభావముగలదగుటచే కర్మ చేయను అనియును, వెనుకటి కర్మలు బంధించినవా లేదా అనియును, ఏమియును చేయకుండ ముక్కుమూసికొని కూర్చున్నచో, ఆ వెనుకటి కర్మల బంధనముకూడ నశించును అనియును - నిశ్చయించుకొనుటచే, వెనుకటి కర్మలగురించి ప్రశ్న లేదు. అర్జునునికి భయము చేయబోవు కర్మలనుగురించియే. కనుక నే

పరమాత్మ కర్మలు బంధించలేవు అని చెప్పుచున్నా
అయితే కర్మ చేయుచున్నప్పుడున్న సమత్వబుద్ధి, భగవత్త
యథార్థజ్ఞానము వెనుకటికర్మలనుగూడ నశింపజేయగ
యథార్థమే; కాని, ఇక్కడ సందర్భము మాత్రము చేయబ
కర్మలను గురించియే.

**అ వ తా రి క :—**

చివరకు అర్జునుని యుద్ధమునకు పురికొల్పి అధ్యా
మును ముగించుచున్నాడు పరమాత్మ.

శ్లో॥ తస్మా దజ్ఞాన సంభూతం
హృత్స్థం జ్ఞానాసి నాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగ
మాతి ష్ఠోత్తిష్ఠ భారత ! ౪

ప. వి :—తస్మాత్, అజ్ఞానసంభూతం, హృత్స్థం, జ్ఞానా
ఆత్మనః, ఛిత్త్వా, ఏనం, సంశయం, యోగం, ఆ
ఉత్తిష్ఠ, భారత ।

టీక :—

హే భారత ! = ఓ అర్జునా !
తస్మాత్ = కాబట్టి,
ఆత్మనః = నీయొక్క,
అజ్ఞానసంభూతం = అవివేకమువలన పుట్టినదియును,

హృత్థ్సం = హృదయమున బాగుగా నాటుకు
పోయినదియు నైన,
ఏనం సంశయం = ఈ సంశయమును,
జ్ఞానాసినా = జ్ఞానమనెడి ఖడ్గముచేత,
ఛిత్వా = ఛేదించి,
యోగం = కర్మయోగమును,
ఆతిష్ఠ = ఆచరింపుము !
ఉత్తిష్ఠ = లెమ్ము !

తా. కాబట్టి అర్జునా ! అజ్ఞానముచేత కలిగి, హృదయమున బాగుగ నాటియున్న ఈ నీ సంశయమును జ్ఞానమనెడి ఖడ్గముచేత ఖండించి కర్మ యోగమును ఆచరించుము ! యుద్ధమునకు లెమ్ము !

అ మృ త వా హి ని :—

అర్జునా ! ఈ నీ సంశయము అజ్ఞానముచేత కలిగినది. నా చేత నీకు ఉపదేశింపబడిన ఈ జ్ఞానమను ఖడ్గమును చేత బట్టుకొని, ఈ సంశయమును తెగనరుకుము. అధైర్య పడకుము. నీవు భరతవంశములో పుట్టినవాడవు. నీ పూర్వులైన చక్రవర్తులు అనేకులు దేనిని ఆచరించి ఇహమున యశమును పరమున మోక్షమునుకూడ పొందినారో, ఆ కర్మయోగము నందే నీవుకూడ స్థిరుడవై యుండుము ! నీ స్వధర్మమైన ధర్మ యుద్ధమునకు సంసిద్ధుడవై లేచి నిలబడుము !

(28)

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే-జ్ఞానయోగోనామ
చతుర్థోఽధ్యాయః

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం యదుగిరి
యతిరాజ సంపత్కుమార మునీంద్రాణాం శిష్యేణ,
సీతారామయతినా విరచితాయాం 'అమృతవాహినీ' నామక
శ్రీ గీతావ్యాఖ్యాయాం చతుర్థోఽధ్యాయః -

ఓం తత్ సత్



# అమృతవాహిని

## 5



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రులు

ముముక్షుజన మహాపీఠాధిపతులు

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీమద్భగవద్గీతా - పంచమోఽధ్యాయః

# కర్మ సన్న్యాస యోగః

అర్జున ఉవాచ :-

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ !
పున ర్యోగం చ శంససి
య చ్ఛ్రేయ ఏతయో రేకం
త న్మే బ్రూహి సునిశ్చితమ్॥

ప. వి :-సన్న్యాసం, కర్మణాం, కృష్ణ, పునః, యోగం, చ, శంససి, యత్, శ్రేయః, ఏతయోః, ఏకం తత్, మే, బ్రూహి, సునిశ్చితమ్

టీక :—

కృష్ణ = ఓ కృష్ణా !
కర్మణాం సన్న్యాసం = కర్మసన్న్యాసమును,
పునః = మరల,
యోగంచ = కర్మయోగమును,
శంససి = పొగడుచున్నావు,
ఏతయోః = ఈ రెంటిలో,

యత్ = ఏది,
శ్రేయః = శ్రేయస్కరమైనదిగా,
సునిశ్చితమ్ - బాగుగా నిశ్చయింపబడినదో,
తత్ = దానిని,
మే = నాకు,
బ్రూహి = చెప్పుము.

తా. అర్జునుడు అడుగుచున్నాడు - కృష్ణా ! నీవు కర్మసన్న్యాసమును, కర్మయోగమును కూడ ప్రశంసించుచున్నావు. ఈ రెంటిలో ఏ ఒక్కదానిచే నాకు శ్రేయస్సు నిశ్చితమై యున్నదో దానిని చెప్పుము.

## అ మృ త వా హి ని :-

కృష్ణా ! కొంతసేపు కర్మసన్న్యాసమును పొగడుచున్నావు. మరల కొంతసేపు కర్మయోగమను పొగడుచున్నావు. ఈ రెంటిలో ఏది ఆచరణలో పెట్టవలయును ? పోనీ, ఈ రెండును ఆచరణములో పెట్టుకొందమనిన రెండును పరస్పర విరుద్ధములుగదా ! అట్టి ఈ రెంటిని ఎవ్వరైనను ఒకే కాలమునందు ఎట్లు ఆచరణలో పెట్టుకొనగలడు ? ఏదో ఒకటియే ఆచరించవలయును. దానిని నేను ఆలోచించి నిర్ణయించుకొనలేను. కనుక నీవే ఈ రెంటిలో ఏది శ్రేయస్కరమో దానిని నిర్ణయించి చెప్పుము అని అడిగినాడు అర్జునుడు.

కృష్ణపరమాత్మ నాల్గవ అధ్యాయములో "కర్మణ్యకర్మ యః పశ్యేత్" 'ఎవడు కర్మయందకర్మను చూచునో' (4-18) అనియును, "జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణం" 'ఎవని కర్మలు జ్ఞానము అనెడి అగ్నిచేత దగ్ధము చేయబడినవో' (4-19) అనియును, "బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా" 'బ్రహ్మమే అర్పణము, బ్రహ్మమే హవిస్సు, బ్రహ్మమే అగ్ని, కర్తయును బ్రహ్మమే - ఈ విధముగ సర్వత్ర బ్రహ్మభావన కలిగియున్న వానిచేత పొందబడునది బ్రహ్మమే' (4-24) అనియును, "శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప! సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" 'ఓ పరంతపా! ద్రవ్యమయమైన యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము. ఓ పార్థా! అన్నిరకములైన కర్మలును జ్ఞానమునందే పర్యవసించుచున్నవి' (4-33) అనియును, "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా" 'జ్ఞానము అనబడు అగ్ని సర్వ కర్మలను భస్మము చేయుచున్నది' (4-37) అనియును చెప్పిన చోటులన్నిట జ్ఞానమే పొగడబడినది అని అర్జునుడు తలచినాడు. ఇంతయును ఇట్లు చెప్పి చివరకు "తస్మా దజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః। ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత" 'కనుక, అర్జునా! నీ హృదయమందున్న అజ్ఞానమూలకమైన ఈ సంశయమును జ్ఞానము అను ఖడ్గముతో తెగనరికి, యోగమును ఆశ్రయింపుము' అని

కర్మయోగమునే ఆచరించవలసినదిగ, యుద్ధము చేయ వలసినదిగ చెప్పినాడు. ఇంతవరకు అర్జునునకు బోధింపబడిన గీతలో "ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః" 'ఈ విధముగ తెలిసికొని పూర్వకాలములోని ముముక్షువులు కూడ కర్మ చేసిరి' (4-15) అనియును, మూడవ అధ్యాయ ప్రారంభములో అర్జునుడు "జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన ! త త్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ !" "వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే । త దేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్" 'ఓ జనార్దనా ! కర్మ కంటె బుద్ధి - జ్ఞానము - శ్రేష్ఠము అని నీ మతమైనచో, కేశవా ! నన్నెందుకు ఈ ఘోరమైన కర్మయందు నియోగించుచున్నావు ? కలగలుపుగా నున్న నీ వాక్యములతో నా బుద్ధిని భ్రమపెట్టు చున్నట్లున్నావు. నాకు శ్రేయస్సు లభింపజేయు ఒకే ఒక్క అంశమును నిశ్చయించి చెప్పుము' అని ప్రశ్న వేసిన తరువాత కూడ కృష్ణపరమాత్మ "య స్త్వింద్రియాణి మనసా నియ మ్యారభ తేఽర్జున ! కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే" 'అర్జునా ! ఎవడు మనస్సుతో ఇంద్రియములను నిగ్రహించి, ఆసక్తిలేక కర్మేంద్రియములచేత కర్మయోగము ఆచరించునో వాడు శ్రేష్ఠుడు' (3-7) అనియును, "నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః" 'శాస్త్ర విహిత మైన కర్తవ్య కర్మను చేయుము. కర్మచేయకుండుట కంటె

కర్మ చేయుటయే శ్రేష్ఠము' (3-8) అనియును, "యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః" 'యజ్ఞమునందు భగవదర్పణము చేసి మిగిలిన అమృతము అనెడి అన్నమును భుజించెడి సత్పురుషులు సమస్త పాపముల నుండియును విడువబడుచున్నారు' (3-13) అనియును, "తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ! అసక్తో హ్యాచరన్కర్మ పర మాప్నోతి పూరుషః" 'కాబట్టి, ఆసక్తి లేనివాడవై కర్తవ్య కర్మను చేయుము. ఆసక్తిలేక కర్మములు చేయుచున్న మానవుడు పరమపదమును పొందుచున్నాడు' (3-19) అనియును, "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః" 'జనకుడు మొదలగు జ్ఞానులందరును నిష్కామకర్మచేతనే గదా పరమపదమును పొందిరి' (3-20) అనియును, "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు" 'ఓ అర్జునా ! నాకు కర్తవ్యము ఏమియును లేదు. మూడు లోకములలో కూడ నాకు పొందవలసినది ఏదియును లేదు. అనగా అన్నియును నా అధీనములోనే ఉన్నవి. అయినను ఇట్టి నేను కూడ కర్మను చేయుచున్నాను' (3-22) అనియును, "సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత! కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్" 'కావున, ఓ అర్జునా! అజ్ఞానులైన ప్రజలు ఆసక్తితో-ఫలాపేక్షతో-కర్మలు చేయుచున్నట్లు జ్ఞాని కూడ ఆసక్తిలేనివాడై, లోకసంగ్రహము కొరకు కర్మ చేయవలయును' (3-25) అనియును కర్మయోగమును

పొగడినాడు. ఇక ఆ మూడవ అధ్యాయములోనే "యస్త్వాత్మ రతి రేవ స్యా దాత్మ తృప్తశ్చ మానవః । ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే" "నైవ తస్య కృ తేనార్థో నాకృ తే నేహ కశ్చన । న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థ వ్యపాశ్రయః" (3-17,18) 'ఆత్మయందే రతుడును, ఆత్మయందే తృప్తుడును, ఆత్మయందే సంతుష్టుడును అగు వానికి చేయదగిన కర్మ - చేయవలసిన కర్మ-ఏదియును లేదు. అతనికి ఈ లోకము నందు కర్మ చేయుటచేతగాని, చేయకపోవుట చేతగాని ఎంతమాత్రమును లాభనష్టములు లేవు. అతనికి పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సకల భూతములందును, ఆశ్రయించి సంపా దించవలసిన స్వార్థము ఈషన్మాత్రము కూడ లేదు' అని యును జ్ఞానమును పొగడినాడు. ఈ కారణముచేత అర్జునుడు ఏదియును నిశ్చయించుకొనలేక తబ్బిబ్బు చెందినాడు.

మూడవ అధ్యాయము మొదట అర్జునుడు కర్మను, జ్ఞానమును కూడ పొగడియుండుటచేత ఆ కలగలుపు మాట లతో భ్రమచెంది, "వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయ సీవ మే" 'కలగలుపు మాటలతో నా బుద్ధిని భ్రమింప జేయుచున్నట్లున్నావు' అని చెప్పికొంటినే, తరువాత మరల ఇట్లు రెంటిని పొగడుచున్నాడే అని కొంచెము తబ్బిబ్బుచెందిన వాడై, "నాకేమియును తెలియదు. ఈ రెంటిలో ఏది శ్రేయస్కరమైనదో అది నీవే నిశ్చయించి చెప్పుము" అని కోరినాడు.

నిజమునకు అర్జునునికి కృష్ణపరమాత్మ కర్తవ్యమును నిరూపించి, ఆజ్ఞాపించియేయున్నాడు. బాగుగా కలతచెంది యుండుటచే గ్రహించలేకుండ ఉన్నాడు అర్జునుడు. "తస్మాద్యుధ్యస్వ భారత" (2-18) 'కాబట్టి, అర్జునా! యుద్ధము చేయుము' అనియును, "తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః" (2-37) 'కనుక' అర్జునా! యుద్ధము చేయుటకే కృతనిశ్చయుడవై లెమ్ము'అనియును, "తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగస్సమాచర" (3-9) 'అర్జునా! యజ్ఞము కొరకు ఆసక్తిరహితుడవై కర్మచేయుము' అనియును, "నియతం కురు కర్మ త్వం" (3-8) 'నియమితకర్మ చేయుము' అనియును, "తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర" (3-19) 'కాబట్టి, ఎల్లప్పుడును ఆసక్తిరహితుడవై కర్తవ్యమైన కర్మను బాగుగ ఆచరించుము' అనియును, "నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః" (3-30) 'ఫలాపేక్ష లేక, మమకార రహితుడవై, వ్యసనము లేనివాడవై యుద్ధముచేయుము' అనియును, "కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్" (4-15) 'కాబట్టి నీవు కూడ పూర్వులచేత చేయబడి నట్టిదియును, బహుపురాతనమైనట్టిదియును అగు కర్మనే చేయుము' అనియును, "తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః ॥ ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠో త్తిష్ఠ భారత" (4-42) 'కాబట్టి ఓ అర్జునా! నీ హృదయమందున్నదియును, అజ్ఞానమువలన పుట్టినదియును అగు ఈసంశయ

మును, జ్ఞానమనెడి ఖడ్గముతో నరికివేసి, కర్మయోగమును ఆచరింపుము. లెమ్ము!' అనియును, ఇంతవరకు ఆరుచోట్ల 'నీవు కర్మయోగమునే-యుద్ధమునే-చేయుము' అని వాచ్యముగ విధించినాడు. అయినను చిత్తము బాగుగ కలతచెందియుండుట చేత అదే మరల మరల అడుగుచున్నాడు అర్జునుడు.

అ వ తా రి క :-

అర్జునుడు అడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పుచు కృష్ణపరమాత్మ ఈ రెండవ శ్లోకము ప్రారంభించినాడు.

శ్రీ భగవానువాచ :-

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ
నిశ్శ్రేయసకరా వుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్
కర్మయోగో విశిష్యతే॥ —౨

ప. వి :-సన్న్యాసః, కర్మయోగః, చ, నిశ్శ్రేయసకరౌ, ఉభౌ, తయోః, తు, కర్మసన్న్యాసాత్, కర్మయోగః, విశిష్యతే.

టీక :-

సన్న్యాసః = కర్మసన్న్యాసమును,
కర్మయోగశ్చ = కర్మయోగమును,
ఉభౌ = అను నీరెండును,

నిః శ్రేయసకరౌ = మోక్షమును కలుగజేయునవే.
(తథాపి = అయినను)
తయోస్తు = రెండింటిలోను,
కర్మసన్న్యాసాత్ = కర్మసన్న్యాసముకంటె,
కర్మయోగః = కర్మయోగము,
విశిష్యతే = శ్రేష్ఠమైనది.

తా. శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు - కర్మసన్న్యాసమును, కర్మ యోగమును రెండును కూడ మోక్షదాయకములే. ఆ రెంటిలో కర్మ సన్న్యాసము కంటె కర్మయోగమే శ్రేష్ఠమైనది.

**అమృతవాహిని:—**

ఈ శ్లోకములో కృష్ణపరమాత్మ బాగుగ స్పష్టయించి నిశ్చయించి చెప్పుచున్నాడు. సమాధానము రెండు భాగ ములుగ ఉన్నది. ఒకటి - కర్మసన్న్యాసము, కర్మయోగమును కూడ మోక్షము నిచ్చునవియే అని ముందు సమాధానము. మానవకల్పితములైన మార్గములైనచో అవి మోక్షమును కలుగజేయగలవా లేదా అను సందేహము సహజము. ఏల యనగా - "మమ మాయా దురత్యయా" అని చెప్పబడిన భగవన్మాయను ఎవడును అతిక్రమించలేడు గదా! కనుక బ్రహ్మాదిదేవతలు సైతము మాయకు లోబడినవారే. వారి బుద్ధియును భ్రమప్రమాదములు అను దోషములు కలదే.

అందుచేత వారు స్వతంత్రముగ ఏది ఆలోచించినను వారి ఆలోచనలచేత తేలిన సిద్ధాంతములు సరియైనవి కావచ్చును; కాకపోవచ్చును. కాని, ఈ రెండు మార్గములును భగవంతుడు ఏర్పాటు చేసినవే. మూడవ అధ్యాయములో మూడవ శ్లోకములో "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ!" 'ఓ అర్జునా! పూర్వమునందు జ్ఞానయోగము - కర్మసన్న్యాసము - కర్మయోగము అను ఈ రెండు నిష్ఠలును - మార్గములును - నాచేతనే చెప్పబడినవి' అని భగవానుడే స్వయముగ చెప్పియున్నాడు. అందువలననే ఈ రెండు మార్గములును మోక్షదాయకములే అని భగవానుడు ఇక్కడ చెప్పుట.

ఇక రెండవదానిలో - అయినను, ఈ రెండు మార్గములలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే మిక్కిలి శ్రేష్ఠమైనది అని చెప్పియున్నాడు. ఈ విషయము చాల జాగ్రత్తగ పరిశీలించవలసియున్నది.

మానవుడేమి చేయవలయును ?

తరించుటకై జీవునకు భగవంతునిచేత ఈ మానవ దేహము ప్రసాదింపబడినది. ఒక్క మానవదేహము తప్ప ఇంక ఏ దేహమును తరించుటకు ఉపయోగించునది కాదు. అందుచేతనే ఈ మానవదేహమును గూర్చి శాస్త్రములలో "మోక్షద్వారం సుదుర్లభం" అని చెప్పబడియున్నది. అనగా

జీవుడు మోక్షము పొందవలెనన్నచో, మానవ దేహము ద్వారానే పొందవలయును. మోక్షద్వారమైనమానవదేహము 'సుదుర్లభం' - దొరకుట చాలకష్టము. ఒక్క భగవంతుని అనుగ్రహమువలన లభించవలసినదే. ఎట్లో అట్లు దొరకినది - ఇది జలబుద్బుద సమానము. క్షణభంగురము. ఇట్టి ఈ మానవ దేహమును భగవదనుగ్రహము చేత పొందికూడ ఈ దేహము పడిపోవులోపల దీనిచేత పొందవలసిన ప్రయోజనము పొందక పోయినయెడల అంతకంటె తెలివితక్కువతనమేముండును ? కనుక ఈ మానవదేహము లభించినందుకు మోక్షమునకే ప్రయత్నించవలయును. అయితే మోక్షమునకెట్లు ప్రయత్నించ వలయును ? మార్గమేది ? భగవంతుడు "ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ" 'పూర్వమే నాచేత రెండు మార్గములు చెప్పబడినవి' అని చెప్పియున్నాడు. అవియే జ్ఞానయోగము, కర్మయోగము. జ్ఞానయోగమనినను, సాంఖ్యయోగమనినను, కర్మసన్న్యాసయోగ మనినను పర్యాయపదములుగనే భగవానుడు ప్రయోగించియున్నాడు. కర్మయనియు, యోగ మనియును, కర్మయోగ మనియును, కర్మయోగమును గురించి ప్రయోగించియున్నాడు. కనుక కర్మసన్న్యాసము, కర్మ యోగముకూడ మోక్షదాయకములే అని చెప్పియుండుటచే, మోక్షమును కోరువారు ఈ రెండు మార్గములలో దేనినైనను స్వీకరించవచ్చును. కాని కృష్ణపరమాత్మ అభిప్రాయము ప్రకారము ఈ రెంటిలో కర్మయోగమే మిక్కిలి శ్రేష్ఠమైనది,

ఈ రెండును మోక్షదాయకములే అయినప్పుడు 'అందులో ఒకటి శ్రేష్ఠము' అని ఎందులకనవలయును ?

మానవులు రెండు రకములైన వారుందురు. ఒకరకము వారు ఇతరులకు అపకారము చేయరు. ఉపకారమును చేయరు. వారిహితమేదో వారు చూచుకొనుచుపోదురు. ఇంకొక రకమైనవారు తమ హితమును చూచుకొనుచు, తమకు వీలున్నంత వరకు, చేతనైనంతవరకు అవకాశమును ఏమాత్రమును జారవిడుచుకొనకుండ ఇతరుల హితముకొరకు కూడ పాటుపడుచుందురు. మొదటి తరగతి వారికి కర్మసన్యాసమును రెండవ తరగతి వారికి కర్మయోగమును సరిపడును.

కొంతమందికి కర్మ బంధనకారణమని బాగుగా అభిప్రాయమేర్పడియున్నది. కర్మయే కేవలము బంధనమైన, మోక్షప్రాప్తికి సంబంధించిన సాధనయే కర్మసన్యాసముతో ప్రారంభము కావలసి వచ్చును. ఒకదశలోమాత్రము కర్మలు చేయుట ఎట్లు పొసగును ? శంకర, రామానుజ, మధ్వాది మత ప్రవర్తకులందరును కూడ అంతఃకరణ శుద్ధికొరకు నిష్కామ్యముగా కర్మలు చేయవలయుననియే విధించియున్నారు. కర్మయే బంధనకారణమైన కామ్యముగా చేసినను, నిష్కామ్యముగా చేసిన బంధించియే తీరవలయును. కాని అట్లులేదు. నిష్కామముగా చేసిన కర్మ అంతఃకరణము నందలి మలినమును, దోషములను పోగొట్టి పరిశుద్ధి చేయునని చెప్పి

యున్నారు. దీనినిబట్టి ఆలోచించిన బంధమోక్షములకు కారణము భావముగాని కర్మ కాదు. అందువలననే "నైవతస్య కృతేనార్థో నాకృతే నేహకశ్చన" (3-18) అనినట్లు అట్టి మహాత్ములకు కర్మ చేయుటచేతగాని, చేయకపోవుటచేత గాని, కలుగు లాభనష్టములు ఎంతమాత్రమును ఉండవు. కనుక అట్టివారు కర్మ చేసినను, చేయకపోయినను ఒకటే. అయినప్పుడు వారు కర్మ చేసినచో ఆకర్మ చేత లోకమునకు మేలుకలుగు సందర్భములో వారు ఎందుకు చేయరాదు ? చేసి నందువలన వారికి నష్టములేదాయె; లోకమునకు మేలాయె; అట్టిసందర్భములో దయార్ద్రహృదయులైన మహాత్ములు తమకు లాభము లేనంతమాత్రమున, తాము కర్మ చేసిన లోకమునకు హితము కలుగుచుండగా, కర్మ చేసినను, చేయక పోయినను తమకు లాభనష్టములు లేవు గనుక ఇతరుల మేలు కొరకు తామెందుకు చేయవలయునని కర్మ చేయక ఊరకుండ గలరా ? అది వారికి చేతనౌనా ? అందుకనియే దయామయు డైన కృష్ణపరమాత్మ "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన। నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి" 'అర్జునా! నాకు కర్మ చేయవలసిన ఆవశ్యకము ఎంతమాత్రమును లేదు. మూడులోకములలో నాది కానిది ఏదియును లేదు. కాబట్టి నాకు ఇది కావలయును అను కోరికయే లేదు. అయినను నేను కూడ కర్మ చేయుచునే యున్నాను' అని చెప్పియున్నాడుగదా! కారణముకూడ తెలిపియున్నాడు. "యద్య దాచరతి శ్రేష్ఠ

స్త త్త దే వేతరో జనః । స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే” ‘పరమార్థానుభవముగల మహాత్ములు దేనిని చేయుదురో ఇతర జనులు సైతము దానినే చేయుదురు. ఆ మహాత్ముడు దేనిని ప్రమాణముగా గొనునో దానినే లోకులు అనుసరింతురు’ అని చెప్పి, దానికి ఉదాహరణముగ తనను చెప్పికొనినాడు. కనుక మానవుడు ఏది చేసినను కేవలము తనకొరకనే చేయరాదు. ఏదియైనను కేవలము తనకొరకనే చేయువానిని గూర్చియే భగవంతుడు మూడవ అధ్యాయము లోని పదమూడవ శ్లోకములో “భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మ కారణాత్” అని చెప్పియున్నాడు. అనగా ‘ఏ పాపాత్ములు కేవలము తనకొరకే అన్నము వండుకొను చున్నారో, వారు పాపమునే భుజించుచున్నారు. అన్నమును కాదు.’ ఇక్కడ అన్నము ఉపలక్షణముగా మానవుడు చేయు సమస్త కర్మలను గురించి ఉద్దేశించి చెప్పబడినది. మానవుడు ఏపని చేసినను తనకొరకును, లోకము కొరకును కూడ అయి ఉండవలయును. అంతియేగాని కేవలము తనకొరకనియే ఏపనిని చేయరాదు. సరే. ఇక ఆ మానవుడు తనకని ఏమియును చేసి కొనవనక్కరలేని స్థితి కలిగినదనుకొందము; ఇక ఏమిచేయ వలయును ? ఇంక నేను ఏమియును చేయనక్కరలేదని కర్మలు మానరాదు. తన బాధ్యతలో ఇంతవరకు సగమే నెరవేరినది. అందుచేత తనకని ఏమియును చేయనక్కరలేకపోయినది. కాని మిగిలిన బాధ్యత అట్లనే ఉన్నదిగదా ? లోకముకొరకని చేయ

వలసినది మిగిలిలేదా ? అది చేయకపోయినను తన బాధ్యత నిర్వహించని దోషము రాగలదు. కనుక 'ఓమానవుడా ! కేవలము స్వార్థపరుడవై, నీ మోక్షమును మాత్రమే చూచుకుని అంతటితో నీపని అయిపోయినదని మురియబోకుమా !' అని గీత హెచ్చరించుచున్నది. కనుక గీతకు 'కర్మసన్న్యాసముకంటె, కర్మయోగమే పరిపూర్ణముగా అభిమతము' అని సిద్ధాంతమైనది.

శ్లో॥ జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ
యో నద్వేష్టి నకాంక్షతి ।
నిర్ద్వంద్వో హి మహాబాహో!
సుఖం బంధా త్ప్రముచ్యతే ॥ 3

ప. వి :-జ్ఞేయః, సః, నిత్యసన్న్యాసీ, యః, న, ద్వేష్టి, న, కాంక్షతి, నిర్ద్వంద్వః, హి, మహాబాహో, సుఖం, బంధాత్, ప్రముచ్యతే.

టీక :—

మహాబాహో = ఓ అర్జునా !
యః = ఎవడు,
న ద్వేష్టి = ద్వేషించడో,
న కాంక్షతి = కోరడో,
నిర్ద్వంద్వః హి = ద్వంద్వములు లేనివాడో,

సః = వాఁడు,
నిత్యసన్న్యాసీ = నిత్యసన్న్యాసి,
(ఇతి = అని)
జ్ఞేయః = తెలియఁదగినవాఁడు, (తెలిసికొనుము
అని భావము)

(అట్టివాఁడు) సుఖం = సుఖముగా,
బంధాత్ = బంధనమునుండి
ప్రముచ్యతే = ముక్తుఁడగుచున్నాఁడు.

తా. అర్జునా! ఎవఁడు ఎవ్వరిని ద్వేషించఁడో; ఏమియునుకోరఁడో; సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాఁడో; వాఁడు నిత్యసన్న్యాసి. సంసార బంధనమునుండి సుఖముగా బయటపడుచున్నాఁడు.

## అమృతవాహిని :-

ద్వంద్వములనగా సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు, శీతోష్ణములు, జననమరణములు మొదలగునవి.

ఇంకను కృష్ణపరమాత్మ చెప్పుచున్నాఁడు - అర్జునా! సన్న్యాసి అనగా కర్మను విడిచిపెట్టినవాఁడేయని తలంచకుము. కర్మను చేయువాఁడు కూడ సన్న్యాసియే. భగవత్సృష్టిలో ఏజీవిని ఏ సందర్భములోను, ఎంతమాత్రమును ఎవఁడు ద్వేషించఁడో; బ్రహ్మలోకపర్యంతమైన భోగములయందే కాదు, చివరకు జన్మరాహిత్యమునందు కూడ ఎవనికి ఎంత

మాత్రమును కోరిక లేదో; సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు, చావుబ్రతుకులు మొదలగు ద్వంద్వముల యందు ఎవనికి ఎంతమాత్రము స్పృహాయే లేదో, వాడు నిత్యసన్న్యాసి సుమా ! మహాభయంకరమైన, మహాప్రబల మైన ఈ సంసారబంధనములనుండి ఎంతమాత్రమును కష్టములేకుండ సుఖముగా అతడు ముక్తి పొందుచున్నాడు. ఈ విషయమును నీవు బాగుగా తెలిసికొనుము.

సన్న్యాసికి, నిత్యసన్న్యాసికి భేదమేమి అని ప్రశ్న. ఉపవాసి, నిత్యోపవాసి అని భేదమున్నట్లే, సన్న్యాసి, నిత్య సన్న్యాసి అని భేదమున్నది.

ఉపవాసి అనగా ఏమియును ఆహారమును తీసికొనక ఉండువాడు; నిత్యోపవాసి అనగా జిహ్వాచాపల్యమునకు లోబడి కాకుండ, కేవలము క్షున్నివారణను మాత్రమే దృష్టిలో ఉంచుకొని అరకడుపు ఆహారముతో, పాతిక కడుపు నీటితో, మిగిలిన పాతిక కడుపు గాలికి వదిలి ఇట్లు రెండు పూటల భుజించుచు, మధ్యమధ్య ఏమియును భుజించనివాడు. జిహ్వాచాపల్యము లేక ఇట్లు భుజించినను ఉపవాసియే అగు చున్నాడు. ఆహారము మీదనే దృష్టియుంచుకొని బాహ్యము కు భుజించకున్నను వాడు భుజించినవాడే అగుచున్నాడు. అట్లే ఎవనికి ఎంతమాత్రమును కోరికలు లేవో, ఎవడు ఏ జీవని

ఎంతమాత్రమును ద్వేషించడో, ఎవడు సుఖదుఃఖాది ద్వంద్వములను లెక్కచేయడో అట్టివాని రాగద్వేషములు నశించినవి గనుక, అతడు లోకకల్యాణముకొరకు భగవదర్పణ బుద్ధితో అన్నికర్మలు చేసినను, వాడు కర్మలు చేయనివాడే. వాడే నిత్యసన్న్యాసి. వాడు మృత్యురూపమగు సంసార సాగరమునుండి అనాయాసముగా తరించుచున్నాడు. ప్రకృతి యొక్క ఇనుపసంకెళ్ళనుండి అనాయాసముగా బయటపడు చున్నాడు. ప్రకృతిబంధనములనుండి వాడు తన ప్రయత్న ముతో బయటపడుటకు ప్రయత్నించినగదా, కష్టముగానో, అనాయాసముగానో బయటపడుట! - వాడు భగవదనుగ్రహ ముతో బయటపడుచున్నాడు. కనుక సుఖముగా బయటపడు చున్నాడు. కాని కర్మసన్న్యాసి మాత్రము ఇంత అనాయాస ముగా, ఇంత సుఖముగా బయటపడలేడుసుమా అని కృష్ణ పరమాత్మ భావము. "క్లేశో౽ధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్" (12-5) అని చెప్పబడియున్నదిగదా!

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః
ప్రవదంతి న పండితాః ।
ఏకమ ప్యాస్థిత స్సమ్య
గుభయో ర్విందతే ఫలమ్ ॥ ౪

ప. వి :—సాంఖ్యయోగౌ, పృథక్, బాలాః, ప్రవదంతి, న, పండితాః, ఏకం, అపి, ఆస్థితః, సమ్యక్, ఉభయోః, విందతే, ఫలమ్.

టీక :—

సాంఖ్యయోగౌ = కర్మసన్న్యాసమును, కర్మయోగమును,
పృథక్ = వేరువేరు ఫలములనిచ్చునవిగా,
బాలాః = వివేకములేనివారు,
ప్రవదంతి = చెప్పుచున్నారు;
పండితాః = పండితులైనవారు,
న (ప్రవదంతి) = అట్లు చెప్పరు;
ఉభయోః = రెంటిలో,
ఏకమపి = ఏ ఒక్కదానినైనను,
సమ్యక్ = బాగుగా,
ఆస్థితః = అనుష్ఠించువాడు,
ఫలం = ఫలమును,
విందతే = పొందుచున్నాడు.

తా. కర్మసన్న్యాసమును, కర్మయోగమును వేరువేరని అజ్ఞానులు తలతురు. పండితులు అట్లు చెప్పరు. పైకి రూపములు వేరువేరుగ ఉన్నను, ఫలముమాత్ర మొక్కటే. కనుకనే ఈ రెంటిలో దేనినైనను బాగుగ అనుష్ఠించినవాడు మోక్షఫలమును పొందుచున్నాడు.

## అమృతవాహిని :—

అర్జునా ! కర్మసన్న్యాసమును, కర్మయోగమును, వేరువేరు మార్గములే అయినను ఫలముమాత్రము రెంటికిని

ఒక్కటే. ఈ రెండును వేరువేరు ఫలములనిచ్చునవిగా, తెలియనివారు - అజ్ఞానులు - చెప్పుదురు. తెలిసినవారు అట్లు ఎన్నటికిని చెప్పరు. ఈ రెంటిలో దేనిని బాగుగా అనుష్ఠించినను మోక్షమును పొందగలరు. కర్మసన్న్యాసమును ఆశ్రయించినవాడును, కర్మయోగమును ఆచరించినవాడును ఇద్దరును మోక్షమును పొందుచున్నారు అని కృష్ణపరమాత్మ భావము.

కర్మసన్న్యాసము, కర్మయోగము వేరుగా అజ్ఞానులు తలచెదరు. పండితులు అట్లు తలంచరు అనినప్పుడు ఈ రెండు పేర్లును ఒకదానినే చెప్పు పర్యాయపదములని పరమాత్మ చెప్పినట్లు భ్రాంతిపడరాదు. ఈ రెండు మార్గములును వేరువేరే. కాని ఈ రెంటియొక్క ఫలముమాత్రము ఒక్కటే. ఫలము నిచ్చుటలో ఈ రెండును ఒక్కటే అనియే భావము. కానిచో ఈ శ్లోకములోనే ఈ రెంటిలో ఏ ఒక్కదానిని ఆశ్రయించినను ఫలమును పొందుచున్నాడు అనియును, రెండవ శ్లోకములో కర్మసన్న్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠమైనది అనియును చెప్పినదానికి అర్థముండునా? కృష్ణపరమాత్మ ఈ రెండుచోట్ల ఇట్లు చెప్పుటచే ఆయన అభిప్రాయములో మార్గములు మాత్రము వేరువేరైనవే; ఫలము నిచ్చుటలో మాత్రము ఒక్కటే అనియే.

ఇంక ఇతరులు కొంతమంది ఇట్లందురు: కర్మయోగము ప్రత్యేకముగ మోక్షము నీయలేదు. సాధకుడు కర్మయోగము

ననుష్ఠించి, తరువాత కర్మసన్న్యాసమునకు అధికారియై మోక్షమును పొందుచున్నాడు. ఇక్కడ కర్మయోగముచేత కూడ మోక్షము లభించుచున్నది అని చెప్పుట క్రమముగా ముక్తి అని - అనగా ముక్తికి కర్మ పరంపరయా హేతువు అనిగాని, లేక కర్మయోగమునందు కూడ అభిలాష కలిగించుటకై స్తుతి అనిగాని తలంచవలయును. మోక్షము మాత్రము కర్మ సన్న్యాసముచేతనే కలుగును.

ఈ అర్థము కొంచెము పట్టుదలతో ప్రయత్నించినట్లు అనిపించుచున్నది. వక్తయొక్క యథార్థమైన అభిప్రాయమే ఇక్కడ మనకు కావలసినది. వక్త చాల వెనుకనుండి ఈ రెండు మార్గములును మోక్షప్రదములని చెప్పుచునే ఉన్నాడు. ఇవి రెండును స్వతంత్రమార్గములని కూడ ఆయన అభిప్రాయము. ఫలము నిచ్చుటలో మాత్రము రెండును ఒక్కటియే అనినాడు. కనుక కేవలము ఫలము దృష్టితో చూచినయెడల ఈ రెండు మార్గములవారును వివాదపడవలసిన పనిలేదు. ఎవరికి ఏ మార్గము నచ్చిన ఆ మార్గమునే అవలంబింపవచ్చును. మోక్షమును పొందవచ్చును.

కృష్ణపరమాత్మకు ఈ రెండు మార్గములలో ఏదిత్తమము? ఏది శ్రేష్ఠము? కర్మయోగము స్వాయముగా మోక్షము నియ్యగలది అని ఆయన చెప్పినాడా లేదా? ఈ అంశములు మాత్రము జాగ్రత్తతో విచారించవలసి ఉన్నది.



కర్మసన్న్యాసమార్గమునందు అంతఃకరణశుద్ధికొరకు ప్రారంభములో కర్మచేసినను, సిద్ధదశయందు మాత్రము కరతే వదలిపెట్టియే తీరవలయును. కర్మయోగములో ప్రారంభదశ యందు తన అంతఃకరణశుద్ధి కొరకను, సిద్ధదశయందు లోక కల్యాణము కొరకను కర్మ చేయబడుచునే ఉండును. కృష్ణపర మాత్మ "ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభ యో ర్విందతే ఫలమ్" అని ఈ రెండు మార్గములచేత మోక్షమున్నట్లు ఒప్పుకొనియే ఉన్నాడు. కాని ఆయనకు ఈ రెంటిలో కర్మయోగమే చాల ఇష్టమని గీతలో పలుచోట్ల బాగుగ కనబడుచున్నది. అందు వలననే "కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే" అని ఎలు గెత్తి చాటినాడు. ఈ సందర్భమును గురించి రెండవశ్లోకము యొక్క వ్యాఖ్యానములో వివరించియున్నాము.

అవతారిక:-

మరల ఈ శ్లోకములోకూడ ఈ రెంటిచేతను కలుగు ఫలము ఒక్కటే అని నిరూపించుచున్నాడు.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం
తద్యోగై రపి గమ్యతే ।
ఏకం సాంఖ్యంచ యోగంచ
యః పశ్యతి స పశ్యతి ॥ ౫

ప. వి :— యత్, సాంఖ్యైః, ప్రాప్యతే, స్థానం, తత్, యోగైః, అపి, గమ్యతే, ఏకం, సాంఖ్యం, చ, యోగం, చ, యః, పశ్యతి, సః, పశ్యతి.

టీక :—

సాంఖ్యైః = సాంఖ్యులచేత = జ్ఞానులచేత - కర్మ సన్న్యాసులచేత,

యత్ స్థానం = ఏస్థానము - పరమధామము,

ప్రాప్యతే = పొందబడుచున్నదో,

తత్ = ఆ స్థానము - పరమధామము,

యోగైరపి = అహంకార మమకారములను త్యజించి, భగవదర్పణబుద్ధితో కర్మలు చేయువారి చేతకూడ,

గమ్యతే = పొందబడుచున్నది,

సాంఖ్యంచ = కర్మసన్న్యాసమును,

యోగంచ = భగవదర్పణబుద్ధితో కర్మ చేయుట అను యోగమును,

ఏకం = ఒకటిగా - ఒకే ఫలము నిచ్చునవిగా,

యః = ఎవడు,

పశ్యతి = చూచుచున్నాడో - తెలిసికొనుచున్నాడో,

సః = వాడు,

పశ్యతి = చూచుచున్నాడు - యథార్థమును తెలిసికొనినవాడు.

తా. కర్మసన్న్యాసులు పొందెడి మోక్షమును, భగవదర్పణబుద్ధితో కర్మచేయు యోగులు సైతము పొందుచున్నారు. కర్మసన్న్యాసమును, భగవదర్పణబుద్ధితో చేయు కర్మయోగమును కూడ మోక్షమునిచ్చుటలో ఒక్కటే అని ఎవడు తెలిసికొనుచున్నాడో వాడే యథార్థము తెలిసినవాడు.

అమృతవాహిని :—

కృష్ణపరమాత్మ ఇంకను సాంఖ్య యోగులను గురించియే చెప్పుచున్నాడు - సాంఖ్యులనినను, జ్ఞానులనినను, కర్మసన్న్యాసులనినను ఒకే అర్థములో కృష్ణపరమాత్మ ప్రయోగించి యున్నాడు.

అర్జునా! కర్మసన్న్యాసులు ఏ స్థానమును పొందుచున్నారో, అదే స్థానమును రాగద్వేష శూన్యులై, ఆసక్తి, ఫలాభిలాష లేక అహంకార మమకార రహితులై కేవలము భగవంతుని చేతి పరికరమాత్రులై భగవత్కైంకర్యబుద్ధితో కర్మచేయువారు సైతము ఆ స్థానమునే పొందుచున్నారు.

"యదేవ యోగాః పశ్యంతి
సాంఖ్యైస్తదనుగమ్యతే ।
ఏకం సాంఖ్యంచ యోగంచ
యః పశ్యతి స బుద్ధిమాన్ ॥"

(శాంతిపర్వము - 305 - 19)

తా. యోగులు దేనిని సాక్షాత్కరించుకొనుచున్నారో, సాంఖ్యులు కూడ దానినే పొందుచున్నారు. ఎవడైతే సాంఖ్యమును, యోగమును (ఫలమునిచ్చుటలో) ఒకటిగా చూచునో వాడే బుద్ధిమంతుడు అనియును,

"యదేవ యోగాః పశ్యంతి
తత్సాంఖ్యై రపి దృశ్యతే ।
ఏకం సాంఖ్యంచ యోగంచ
యః పశ్యతి సతత్త్వవిత్ ॥"

(శాంతిపర్వము - 316 - 4)

తా. యోగులు దేనిని సాక్షాత్కరించుకొనుచున్నారో, సాంఖ్యుల చేత కూడ అదియే చూడబడుచున్నది. కాబట్టి సాంఖ్యమును, యోగమును ఒకటిగా చూచువాడే యథార్థముగా తత్త్వము తెలిసినవాడు అని గీతలోని భావమే భారతము శాంతిపర్వములోని పై శ్లోకములలోకూడ చెప్పబడి యున్నది.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో !
దుఃఖ మాప్తు మయోగతః ।
యోగయుక్తో ముని ర్బ్రహ్మ
న చిరే ణాధిగచ్ఛతి ॥ ౬

ప. వి :— సన్న్యాసః, తు, మహాబాహో, దుఃఖం, ఆప్తుం, అయోగతః, యోగయుక్తః, మునిః, బ్రహ్మ, న, చిరేణ, అధిగచ్ఛతి.

టీక :—

మహాబాహో! = అర్జునా!

అయోగతః = నిష్కామ కర్మయోగము లేనివానికి,

సన్న్యాసస్తు = కర్మసన్న్యాసము,
ఆప్తుం = పొందుటకు,
దుఃఖం = దుర్లభము,
యోగయుక్తః = కర్మయోగియైన,
మునిః = ముని,
బ్రహ్మ = పరమాత్మను,
నచిరేణ = శీఘ్రముగా,
అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా. కర్మయోగముచే అంతఃకరణపరిశుద్ధి కలిగి సమస్తేంద్రియములను, చిత్తమును బాగుగా వశమందుంచుకొనిన తరువాతగాని సన్న్యాసమున కధికారము లేదు. ముందు భ్రాంతిచేత సన్న్యాసము నాశ్రయించినయెడల, దానిచేత దుఃఖమేగాని సుఖములేదు. కాబట్టి, కర్మయోగముతో కూడినవాడై, అంతఃకరణపరిశుద్ధి కలిగిన ముని శీఘ్రముగ పరమాత్మను పొందుచున్నాడు.

అ మృ త వా హి ని :—

అర్జునా ! ఇంకొక రహస్యమున్నది. కర్మయే పనికి రానిది, బంధనము అయిన, అది ఎట్లు చేసినను బంధనమే కావలయును. అట్లు అగుటలేదు. కర్మసన్న్యాసమునే సమర్థించుకొనువారుకూడ ఆ కర్మసన్న్యాసము సిద్ధించుటకు మొదట కర్మయోగమును ఆశ్రయించియే తీరవలయును. లేనియెడల దుఃఖమేతప్ప ప్రయోజనము ఉండదు. ఆ విష

యము వారుకూడ అనుచునే యున్నారు. వారి అభిప్రాయము ప్రకారమైనను కర్మ అజ్ఞానచిహ్నమే అయిన,నిష్కామ్యముగా నైనను, అట్టి కర్మ నాచరించిన, అంతఃకరణశుద్ధియై జ్ఞానము కలుగుట ఎట్లు సంభవించును ? అజ్ఞానిగా ఉన్నప్పుడే నిష్కామ్యముగా చేసినచో, అది బంధన హేతువు కాకపోగా, అంతఃకరణ పరిశుద్ధిని కలుగజేసి, జ్ఞానమునకు హేతువగు చున్నదే ! ఇక వాసనారహితముగానుండు సిద్ధదశయందు కర్మ చేసిన బంధన మెట్లగును ? అజ్ఞానదశలో చేసిన సాధకుని అంతఃకరణపరిశుద్ధికి, జ్ఞానమునకు హేతువగును. సిద్ధదశలో చేసిన లోకకల్యాణమునకు హేతువగును. కనుక ఎట్లు చూచినను కర్మయోగియే అతిశీఘ్రముగ పరమాత్మను పొందుచున్నాడు.

మరొక విధమునకూడ అర్థము చెప్పవచ్చును.

అయోగతః = అంతఃకరణ పరిశుద్ధికిని, జ్ఞానమునకును హేతువైన కర్మయోగము నాచరించక,

సన్న్యాసః = సన్న్యాసము,

దుఃఖం = దుఃఖమును,

ఆప్తుం = పొందుటకే.

అనగా చక్కగా కర్మయోగము నాచరించి, అంతః కరణ పరిశుద్ధిని, జ్ఞానమును పొందకయే, కర్మసన్న్యాసమును

గ్రహించినయెడల, ఆ సన్న్యాసమువలన ప్రయోజనము దుఃఖమే అని. అంతియేగదా ! అంతఃకరణపరిశుద్ధిలేనివానికి సన్న్యాసమునకు అధికారములేదు. శంకరానందులు ఈ అధ్యాయములోని నాల్గవ శ్లోకముయొక్క వ్యాఖ్యానములో "తత్త్వమస్యాది వాక్యాని పుంస శ్చిత్తశు ద్ధ్యభావే బ్రహ్మాతత్త్వం బోధయితుం న శక్నువంతి ! చిత్తశుద్ధిశ్చ కర్మోపాసనాభ్యాం వినా నసిద్ధ్యతే॥"

'తత్త్వమసి' మొదలగు వాక్యములు చిత్తశుద్ధిలేని పురుషునకు బ్రహ్మాతత్త్వమును బోధించలేవు. చిత్తశుద్ధియో, కర్మోపాసనములు లేక సిద్ధించదు - అని సిద్ధాంతము చేసి యున్నారు. కనుక కర్మయోగము నాచరించి చిత్తశుద్ధిని పొందకుండ, సన్న్యాసమును గ్రహించినయెడల, అట్టి సన్న్యాసము దుఃఖమును పొందుటకే. దానివలన దుఃఖమే ప్రయోజనము. ఇక, రాగద్వేషశూన్యులై, ఆసక్తి, ఫలాభిలాష - లేక, అహంకార మమకార రహితులై, భగవత్కైంకర్య రూపముగా భగవదర్పణబుద్ధితో కర్మచేయు యోగులో సులభముగా శీఘ్రముగా పరబ్రహ్మమును పొందుచున్నారు. ఇట్టివారినిగూర్చియే భగవంతుడు "తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్" అని గర్జించినాడు. కాన యోగులకు - అనగా భక్తులకు - మోక్షము పొందుటలో ఆలస్యమును లేదు, ఆయాసమును లేదు. సారాంశమేమన, సన్న్యా

సముయొక్క, కర్మయోగముయొక్క ఫలము ఒకటే; అయినను సాధనలో కర్మయోగముకంటె సన్న్యాసము కఠినతరము. కర్మయోగము సులభము, శీఘ్రఫలదము. కాబట్టియే మూడవ శ్లోకములో "సుఖం బంధాత్ప్రముచ్యతే" అనియును, ఈ ఆరవ శ్లోకములో "బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి" అనియును ఉన్నది. కనుక కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే మిక్కిలి శ్రేష్ఠమైనది.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మ భూతాత్మా
కుర్వన్నపి నలిప్యతే॥ ౭

ప. వి :— యోగయుక్తః, విశుద్ధాత్మా, విజితాత్మా, జితేంద్రియః, సర్వభూతాత్మ భూతాత్మా, కుర్వన్, అపి, న, లిప్యతే.

టీక :—

విశుద్ధాత్మా = వాసనారహితమైన అంతఃకరణము కలిగినట్టియు,
విజితాత్మా = బాగుగా స్వాధీనమైన మనస్సు కలిగినట్టియు,
జితేంద్రియః = ఇంద్రియములను జయించినట్టియు,

సర్వభూతాత్మ భూతాత్మా = సమస్తమైన జీవులకును ఆత్మగానున్న పరమాత్మకు ఆత్మభూతుడైనట్టియు,
యోగయుక్తః = కర్మయోగి,
కుర్వన్ అపి = కర్మలు చేయుచున్నను,
నలిప్యతే = (వాటిచేత) అంటబడడు.

తా. నిష్కామ్యముగ కర్మయోగము ఆచరించుటచే పరిశుద్ధమైనట్టియు, స్వాధీనమైనట్టియు అంతఃకరణము కలవాడును, ఇంద్రియములను జయించినవాడును, సర్వభూతములకును ఆత్మభూతమైన పరమాత్మ కలవాడును - అనగా పరమాత్మను పొందినవాడును - అయిన మహాత్ముడు లోకకల్యాణార్థము కర్మ చేయుచున్నను, ఆ కర్మ వానిని బంధించలేదు. అంతేకాక లోకమునకు మిక్కిలి మేలుకూడ చేకూర్చును.

## అ మృ త వా హి ని :-

సాధకుడు భగవదర్పణబుద్ధితో భగవత్కైంకర్య రూపముగా కర్మలు చేయుటచేత కొంతకాలమునకు ఆసక్తి, ఫలాభిలాష పూర్తిగ నశించి, తరువాత రాగద్వేషములు నశించగా, అంతఃకరణము పూర్తిగ వాసనారహితమై పరిశుద్ధి చెందును. అంతఃకరణము పూర్తిగ పరిశుద్ధియైననాడు, మనస్సు పరమ సాత్త్వికమై సకలసద్గుణములును, పరిపూర్ణమైన ప్రేమయు కలిగిన పతివ్రత భర్తకు ఎట్లు స్వాధీనయై

యుండునో అట్లు వశమైపోవును. మనసు వశమైనంతనే ఇంద్రియములు తమంత తామే వినయ విధేయతలు కలిగిన సేవకుల వలె భయభక్తులతో మెలగును. ఆ స్థితిపొందిన యోగిచేత భగవత్కైంకర్య రూపముగా ఎన్నికర్మలు చేయబడిననేమి ? ఆ కర్మలు ఆతనిని ఎంతమాత్రమును అంటవు. ఇక బంధించుట ఎక్కడ ?

"సర్వభూతాత్మ భూతాత్మా" - పిపీలిక మొదలుకొని బ్రహ్మపర్యంతమైన సకల జీవరాసులకును, ఆత్మయైన పరమాత్మ ఎవనికి ఆత్మయో వాడు సర్వభూతాత్మ భూతాత్ముడు. వాడు తనకు ఆత్మయైన పరమాత్మయొక్క ప్రేరణచేతనే సకలమైన కర్మలను చేయుచుండును. అతనికి ఒక్క పరమాత్మయందు తప్ప ఇల్లు, వాకిలి, గొడ్డు, గోద, శరీరము, మనస్సు, బుద్ధి మొదలగు దేనియందును కించిన్మాత్రముకూడ మమత్వము ఉండదు. అట్టివాడు ఎన్నికర్మలు చేసిననేమి ? ఆతనికి అవి ఎంతమాత్రమును అంటవు.

ఎవనికి అంతఃకరణము వాసనలతో కూడుకొనియుండి మనస్సు, బుద్ధి, ఇంద్రియములు స్వాధీనములో ఉండవో, అట్టి వానికి స్వాభావికముగనే విషయములయందు ప్రవృత్తి కలుగును. విషయములయందు ప్రవృత్తి కలుగుటతో రాగద్వేషములు బలపడును. ఇక సిద్ధ్యసిద్ధులయందు సమత ఎట్లుండగలదు ?

కాబట్టి నిష్కామ్యముగ కర్మలు చేయుట అభ్యసించవలయును. నెమ్మది నెమ్మదిగా అంతఃకరణము పరిశుద్ధమై మనస్సు, ఇంద్రియములు పూర్తిగ వశపడునప్పటికి సాధకుడు సిద్ధుడై యోగి అనబడును. అట్టివాడు లోకసంగ్రహార్థము ఎన్ని కర్మలు చేసినను అవి వానిని అంటవు సరిగదా, లోకమునకు కల్యాణదాయకములుకూడ అగును.

**అవతారిక :-**

ఇప్పుడు కర్మయోగికి తనచేత చేయబడు కర్మలయందెట్లు అహంకారము ఉండదో ఎనిమిది తొమ్మిది శ్లోకములలో చెప్పుచున్నాడు.

శ్లో॥ నైవ కించిత్కరోమీతి<br>యుక్తో మన్యేత తత్త్వవిత్ ।<br>పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర<br>న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ ౮

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణ<br>న్నున్మిషన్ నిమిషన్నపి ।<br>ఇంద్రియాణీంద్రియార్థేషు<br>వర్తంత ఇతి ధారయన్ ॥ ౯

ప. వి :—న, ఏవ, కించిత్, కరోమి, ఇతి, యుక్తః, మన్యేత, తత్త్వవిత్, పశ్యన్, శృణ్వన్, స్పృశన్, జిఘ్రన్, అశ్నన్, గచ్ఛన్, స్వపన్, శ్వసన్. ౮

ప. వి :—ప్రలపన్, విసృజన్, గృహ్ణన్, ఉన్మిషన్, నిమిషన్, అపి, ఇంద్రియాణి, ఇంద్రియార్థేషు, వర్తంతే, ఇతి, ధారయన్. ౯

టీక :—

యుక్తః = యోగి - భగవదర్పణబుద్ధితో, భగవత్కైంకర్యరూపముగా కర్తృత్వాభిమానాహంకారము లేక కర్మను చేయువాడు -

తత్త్వవిత్ = తత్త్వము తెలిసినవాడై నిష్కామకర్మయోగముచేత అంతఃకరణపరిశుద్ధి ద్వారా తత్త్వజ్ఞానము కలవాడై -

పశ్యన్ = చూచుచు,

శృణ్వన్ = వినుచు,

స్పృశన్ = తాకుచు,

జిఘ్రన్ = ఆఘ్రాణించుచు,

అశ్నన్ = భుజించుచు,

గచ్ఛన్ = నడచుచు,

స్వపన్ = నిద్రించుచు,

శ్వసన్ = ఊపిరి విడుచుచు,
ప్రలపన్ = మాట్లాడుచు,
విసృజన్ = (మలమూత్రములు) విడుచుచు,
గృహ్ణన్ = గ్రహించుచు,
ఉన్మిషన్ = కన్నులు తెరచుచు,
నిమిషన్ అపి = కన్నులు మూయుచు కూడ,
ఇంద్రియాణి = ఇంద్రియములు,
ఇంద్రియార్థేషు = శబ్దాది విషయములందు,
వర్తంతే = వర్తించుచున్నవి,
ఇతి = అని,
ధారయన్ = నిశ్చయించి,
కించిత్ = కొంచెముకూడ,
నకరోమ్యేవ = నేనుచేయుటలేనేలేదు.
ఇతి = అని,
మన్యేత = తలంచును.

తా. తత్త్వము తెలిసిన కర్మయోగి చూచుచు, వినుచు, తాకుచు, వాసన చూచుచు, భుజించుచు, నడచుచు, నిద్రించుచు, శ్వాస తీసికొనుచు, మాట్లాడుచు, విడుచుచు, గ్రహించుచు, కండ్లు తెరచుచు, మూయుచు - ఇన్ని పనులు జరుగుచున్నను, ఇంద్రియములు శబ్దాది విషయములందు ప్రవర్తించుచున్నవి, నేనేమియు చేయుటలేదు అని తలంచును. కర్తృత్వాహంకారములు ఎంతమాత్రమును అతనికి ఉండవు. అందుచేత ఆ కర్మలు అతనికి అంటవు.

## అమృతవాహిని:—

తత్త్వము తెలిసినవారికి కర్మలయందు అహంకార కర్తృత్వాభిమానము లుండవు. అహంకారము కర్తృత్వాభిమానము కలవారును - సంసారులును - చూచుచుందురు. అభిమానము లేనివారును - యోగులును - చూచుచుందురు. సంసారులు చూచుటచేత ఆ చూపుయొక్క ప్రభావము చిత్తముమీాద పడును. దానికి ఫలము తగినరీతిని చిత్తములో వికారము కలుగును. ఆ వికారమునకు అనుగుణముగా వాడు కర్మ చేయును. అందువలన అట్టివాని చూపుగాని, దానిచేత కలిగిన చిత్తవికారముగాని, ఆ వికారానుగుణముగ వాడు చేయు కర్మగాని పాపముగానో, పుణ్యముగానో ఉండును. అప్పుడు వాడు ఆ పాపపుణ్యములచేత బంధింపబడును. ఆ పాప పుణ్యఫలములు అనుభవింపవలసివచ్చును.

అహంకార కర్తృత్వాభిమానములు లేని యోగియును చూచును. కాని ఆ చూపుయొక్క ప్రభావము చిత్తముమీాద పడదు; వికారమును కలిగించదు. అందుచేత అతడు చిత్త వికారములకు లోనై ఏ కర్మయును చేయడు. ఆ కారణమున ఆ కర్మ పాపపుణ్య రూపముగా అతనిని బంధించదు. ఆ ఫల మును వానికి చెందదు.

అతని అంతఃకరణము ఏ వాసనయు లేక పరిశుద్ధమై యుండును గనుక, అతడు ఇంక కర్మ ఎట్లు చేయును? అని

సందేహము రావచ్చును. లోకములో ప్రతివారును కర్మ చేయుటకు వారి వాసనలే కారణముగదా ! ఇతనికి వాసనలే లేవు. ఇక ఇతడు కర్మ ఎట్లు చేయును ?

ఇట్టివాడు కూడ కర్మ చేయకుండ ఉండడు. అయితే, ఇతడు చేయు కర్మకు భగవత్ప్రేరణమే కారణము. అందువలన ఆ కర్మచేత ఇతడు బంధింపబడకపోగా, లోకమునకు కల్యాణము చేకూర్చినవాడగును.

**అవతారిక :—**

ఇంకను యోగిని గురించియే చెప్పుచు, అతడు కర్మ చేత ఎందుకు అంటబడడో చెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సంగం త్యక్త్వా కరోతియః ।
లిప్యతే న స పాపేన
పద్మపత్ర మి వాంభసా ॥ ౧౦

ప. వి :— బ్రహ్మణి, ఆధాయ, కర్మాణి, సంగం, త్యక్త్వా, కరోతి, యః, లిప్యతే, న, సః, పాపేన, పద్మపత్రం, ఇవ, అంభసా.

టీక :—

యః = ఎవడు,
కర్మాణి = కర్మలను,

బ్రహ్మణి = పరమాత్మయందు,
ఆధాయ = సమర్పించి,
సంగం = ఆసక్తిని,
త్యక్త్వా = విడిచి,
కరోతి = చేయుచున్నాడో,
సః = వాడు,
అంభసా = నీటిచేత,
పద్మపత్రమివ = తామరాకువలెనే,
పాపేన = పాపముచేత,
నలిప్యతే = అంటబడడు.

తా. భగవదర్పణబుద్ధితో, పరమాత్మయందే సమర్పించి, ఆసక్తి లేక, కర్మలు చేయువాడు, నీటిచేత తామరాకు అంటబడనట్లు, ఆ కర్మల యొక్క పాపపుణ్యములచేత అంటబడడు.

## అమృతవాహిని :—

తత్త్వము బాగుగా అనుభవములో ఉన్న యోగి సమస్త కర్మలను తన ప్రభువైన పరమాత్మ నిమిత్తమే చేయును. తనకని ఏమియును చేయడు. అతనికి కర్మలమీద కూడ ఆసక్తి ఉండదు. సామాన్యులకు ఫలముసందు కాంక్ష ఉండుటయే కాక, కర్మలయందు కూడ ఆసక్తి ఉండును. ఫలాభిలాష వదలగలిగినను కర్మలయందు ఆసక్తిని వదలుట కష్టము. ఇక తత్త్వరహస్యము తెలిసిన యోగియో, ఈ కర్మ యిష్టము,

ఈ కర్మ యిష్టములేదు అను తన యిష్టానిష్టములతో ఎంత మాత్రమును సంబంధములేకుండ, ఏ యే కర్మలు చేయుటకు భగవంతుడు ప్రేరేపించునో ఆ కర్మలనే నిర్లిప్తుడై చేయును. ఈ ప్రకారముగా సమస్తకర్మలను, ఫలమునుకూడ సర్వేశ్వరుడైన, జగత్ప్రభువైన పరమాత్మయందే సమర్పించి చేయువానిని, సదా నీటిలోనే ఉన్నను తామరాకును నీరు అంటనట్లు, కర్మలు అంటవు. ఇట్టివానిని గురించియే పన్నెండవ అధ్యాయములో "యేతు సర్వాణికర్మాణి మయి సన్న్యస్య మత్పరాః అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే, తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్" అని కృష్ణ పరమాత్మ చెప్పియున్నాడు. ఇంక ఇట్టివానికి కర్మ అంటుట కూడ ఎక్కడ ?

అవతారిక :-

అందువలననే కర్మయోగులు సాధనదశలో అంతఃకరణ శుద్ధి కొరకు కర్మ చేయుదురు అని ఈ శ్లోకములో చెప్పుచున్నాడు.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా
కేవలై రింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వంతి
సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥ ౧౧

ప. వి :— కాయేన, మనసా, బుద్ధ్యా, కేవలైః, ఇంద్రియైః, అపి, యోగినః, కర్మ, కుర్వంతి, సంగం, త్యక్త్వా, ఆత్మ శుద్ధయే.

టీక :—

యోగినః = కర్మయోగులందరును,
సంగం = ఆసక్తిని,
త్యక్త్వా = త్యజించి,
ఆత్మశుద్ధయే = అంతఃకరణపరిశుద్ధికొరకు,
కేవలైః = కేవలము,
ఇంద్రియైః = ఇంద్రియములచేతను,
మనసా = మనస్సుచేతను,
బుద్ధ్యా = బుద్ధిచేతను,
కాయేన = శరీరముచేతను,
అపి = కూడ,
కర్మ = కర్మలు,
కుర్వంతి = చేయుచున్నారు.

తా. కర్మయోగులు ఆసక్తి లేకుండ అంతఃకరణపరిశుద్ధి కొరకు మాత్రమే, కేవలము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, శరీరములద్వారా కర్మ చేయుచున్నారు.

## అమృతవాహిని :—

కర్మయోగులందరును మొదటినుండియు - అనగా సాధనదశలో కూడ - కర్మ కాంక్షలతో చేయరు. ఆసక్తిలేక

కేవలము అంతఃకరణపరిశుద్ధి కొరకే కర్మ చేయుదురు. అందువల్ల కర్తృత్వాహంకారము ఎంతమాత్రమును లేకుండ, కేవలము మనస్సు బుద్ధి ఇంద్రియములచేతమాత్రమే కర్మ చేయుదురు. ఆసక్తితో ఫలాభిలాషతో చేయబడిన కర్మ బంధనమునకు హేతువగును. ఆసక్తిరహితముగా ఫలాపేక్ష లేక చేయబడినకర్మ అంతఃకరణ పరిశుద్ధిని కలుగజేయును.

కాని కొంతమంది, కర్మ చేయుటయే నీ ధర్మముగాని, దానివలన చిత్తశుద్ధి కలుగుచున్నదా లేదా అను విచారణ ఉండకూడదని చెప్పుచున్నారు. ఆ అభిప్రాయము సరియైనది కాదు. ఈ శ్లోకములోనే "ఆత్మశుద్ధయే" 'చిత్తశుద్ధికొరకు' అని కృష్ణపరమాత్మ చెప్పినాడు. అనగా చిత్తశుద్ధికొరకు కర్మ చేయవలెనని కృష్ణపరమాత్మ చెప్పినట్లే గదా!

మురికిపోవుటకు పాత్రను తోమవలసినదిగ యజమాని ఆజ్ఞాపించినప్పుడు మురికిపోవుచున్నదా లేదా అని చూచు కొనుచు, మురికిపోవునట్లు పాత్రను తోమవలయునేగాని, మురికిపోయినను పోకపోయినను పాత్రనుమాత్రము తోముదును అని పనివాడు అనినచో యజమాని ఏమనును? ఆ పనివాని యందు యజమాని అనుగ్రహము వచ్చునా?

అట్లే 'ఆత్మశుద్ధయే' చిత్తశుద్ధికొరకే కర్మ చేయుము అని పరమాత్మ శాసించి, పెద్దలైన పూర్వులందరును చిత్తశుద్ధి కొరకే కర్మ చేసిరి అని చెప్పుచుండగా, చిత్తశుద్ధి అయినన్నూ

కాకపోయినను కర్మ మాత్రము చేయుదును అనినచో పరమాత్మ ఏమనును? మనయందు పరమాత్మ అనుగ్రహము వచ్చునా? కాబట్టి అట్లు అనరాదు.

**అవతారిక :—**

కర్మ ఎట్లుచేసిన శాంతికలుగునో, ఎట్లుచేసిన బంధము కలుగునో— ఈ విషయమును చెప్పుచున్నాడు.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా
శాంతి మాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ
ఫలే సక్తో నిబధ్యతే ॥ ౧౨

ప. వి :—యుక్తః, కర్మఫలం, త్యక్త్వా, శాంతిం, ఆప్నోతి, నైష్ఠికీం, అయుక్తః, కామకారేణ, ఫలే, సక్తః, నిబధ్యతే.

**టీక :—**

యుక్తః = నిష్కామ కర్మయోగి,
కర్మఫలం = కర్మయొక్క ఫలమును,
త్యక్త్వా = త్యజించి (త్యజించుటచేతనే),
నైష్ఠికీం = ఆధ్యాత్మిక సంబంధమైన,
శాంతిం = శాంతిని,

ఆప్నోతి = పొందుచున్నాడు;
అయుక్తః = అట్టియోగికానివాడు (కామ్యముతో కర్మ చేయువాడు),
ఫలే = ఫలమునందు,
సక్తః = ఆసక్తి కలిగినవాడై,
కామకారేణ = ఆ ఆశ చేతనే,
నిబధ్యతే = బంధింపబడుచున్నాడు.

తా. నిష్కామకర్మ చేయువాడు కర్మఫలమును త్యజించుటచేతనే ఆధ్యాత్మికశాంతిని పొందుచున్నాడు. కాంక్షకలవాడు కర్మఫలమునందు ఆశకలవాడై ఆ ఆశచేతనే బంధింపబడుచున్నాడు.

అమృతవాహిని :-

ఈ శ్లోకములో పురుషుడు శాంతినిపొందుటకు మార్గమేమి, ఎందువలన బంధింపబడుచున్నాడు అను విషయములను సంశయరహితముగ తేల్చి చెప్పినాడు. ఫలమందు ఎంతమాత్రమును అభిలాష లేక కర్మ చేయువాడు ఆధ్యాత్మిక శాంతిని పొందుచున్నాడు. దానికి కారణము ఫలాభిలాషను త్యజించుటయే. అనగా ఆశ లేనివానికే యథార్థమైన శాంతి.

ఉత్తరభాగములో ఇతరునికి లేదను విషయమును చెప్పుచున్నాడు. ఫలమునందలి ఆశతో కర్మ చేయువాడు బంధింపబడుచున్నాడు. దానికి కారణము ఫలాభిలాషయే.

ఆశ కలవానికి ఎక్కడకు పోయినను శాంతి లభించదు. వాని ఆశచేతనే వాడు బంధింపబడుచున్నాడు. పదునారవ అధ్యాయమున పన్నెండవ శ్లోకములో "ఆశాపాశశతై ర్బద్ధాః" అని చెప్పబడి యుండుటచేత ఆశయే బంధించెడి పాశము, ఆశాపాశములచేతనే జీవులన్నియును బంధింపబడియున్నవి అని తెలియవలయును. ఆశ లేనివాడే యథార్థమైన సుఖి. కనుక ఆశ లేనివాడే పైన చెప్పబడిన ఆ శాంతిసుఖమును అనుభవించగలుగును.

శ్లో॥ సర్వ కర్మాణి మనసా
సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ
నైవ కుర్వన్ నకారయన్॥ ౧౩

ప. వి:-సర్వకర్మాణి, మనసా, సన్న్యస్య, ఆస్తే, సుఖం, వశీ, నవద్వారే, పురే, దేహీ, న, ఏవ, కుర్వన్, న, కారయన్.

టీక:—

వశీ = మనోబుద్ధీంద్రియ శరీరములు వశమునందు కలవాడు,
మనసా = వివేకయుక్తమైన మనస్సుచేత,
నవద్వారే = తొమ్మిది ద్వారములుగల,

పురే = పురమనియెడి.
దేహే = శరీరమునందు,
సర్వకర్మాణి = కర్మల నన్నిటిని,
సన్న్యస్య = విడిచిపెట్టి,
నైవకుర్వన్ = చేయనివాడై,
నకారయన్ = చేయించనివాడై,
సుఖం = సుఖముగా,
ఆస్తే = ఉన్నాడు.

తా. మనోబుద్ధీంద్రియ శరీరములు వశమునందుగల యోగి వివేకయుక్తమైన మనస్సుచేత, తొమ్మిది ద్వారములు గల పురమను శరీరమునందు, సమస్తకర్మలను విడిచిపెట్టి, తానుచేయక చేయించక, సుఖముగ ఉన్నాడు.

## అమృతవాహిని :_

ఈశ్లోకములోకూడ భగవదర్పణబుద్ధితో కర్మలుచేసి సిద్ధిపొందిన యోగియొక్క మహిమనే ఇంకను కొనియాడు చున్నాడు పరమాత్మ.

ఆసక్తి విడిచి, ఫలాభిలాషారహితముగా భగవత్కైంకర్యరూపముగా భగవదర్పణబుద్ధితో కర్మచేసిన యోగియొక్క అంతఃకరణములోని సమస్తమైన మలములు, దోషములు, వాసనలు పూర్తిగ నశించి పరిపూర్ణ విశుద్ధిచెందగా,

రాగద్వేషములు కర్తృత్వాహంకారములు ఎంతమాత్ర మును లేనిస్థితిలో ఆతని మనోబుద్ధీంద్రియ శరీరములు పరమ సాత్త్వికములై, పూర్తిగ అతని వశమందుండును. కనుక అత నికి 'వశీ' అను పదము ప్రయోగించబడినది. అతనికి యథార్థ జ్ఞానము ప్రకాశించును. ఆ స్థితిలో అతడు బాహ్యమునకు ఇతరుల దృష్టిలో కర్మకలాపములలో ఎంత మునితేగిలు చున్నట్లు కనబడినను, యథార్థమునకు అతడేమియు చేయుట లేదు. చేయించుటయును లేదు.

'నేను చేయుచున్నాను. చేయించుచున్నాను' అను కొనుటకు అహంకారాభిమానాదులున్నగదా! అవి లేనప్పుడు అతని అంతఃకరణములో అట్టి వృత్తియేరాదు. అజ్ఞాని నిజముగా తాను చేయకపోయినను కర్తృత్వాహంకారాభి మానాదులతో, ఆ కర్మల నన్నిటిని తనపై త్తిపై వేసికొని, బంధింపబడుచున్నాడు. యోగియో, యథార్థముగా తాను చేసినట్లు లోకులకు కనబడినను, తన పరిపూర్ణ పరిశుద్ధ సాత్త్వి కాంతఃకరణములో యథార్థజ్ఞానము ప్రకాశించుటచే, దాని వలన కలిగిన వివేకముతో పరిపుష్టి చెందిన మనస్సుతో, కర్మల నన్నిటిని నవద్వారములతో కూడిన శరీరమునందు విడుచుచున్నాడు. ఎనిమిది తొమ్మిది శ్లోకములలో చెప్పినట్లు, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, బుద్ధి మొదలగువాని వ్యాపారములే సమస్తకర్మలకును కారణమని తెలిసికొని, ఆ

కర్మలయందు కర్తృత్వాహంకారాదులు ఎంతమాత్రమును లేకయుండుటయే మనస్సుతో కర్మలనన్నిటిని శరీరమునందు విడుచుట అనబడును. అట్లు విడిచి పరమాత్మయందే సుఖముగ నివసించుచున్నాడు. ఇటువంటివానిని కర్మలు ఎట్లు అంట గలవు ? పరమశాంతికి తక్కువ ఏమి ఉండును ? ఆనందమో ఆనందము! ఇట్టివాడే కృష్ణునకు అభిమతమైనవాడు.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి
లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మ ఫల సంయోగం
స్వభావస్తు ప్రవర్తతే ॥ ౧౪

ప. వి :- న, కర్తృత్వం, న, కర్మాణి, లోకస్య, సృజతి, ప్రభుః, న, కర్మఫలసంయోగం, స్వభావః, తు, ప్రవర్తతే.

టీక :-

ప్రభుః = పరమాత్మ,
లోకస్య = లోకమునకు,
కర్తృత్వం = (ప్రత్యేముగా ఒక) కర్తృత్వమును,
న (సృజతి) = కలుగజేయలేదు;
కర్మాణి = (ప్రత్యేకముగా) కర్మలను,
న (సృజతి) కలుగజేయలేదు;

కర్మఫలసంయోగం = కర్మలయొక్క ఫలములతో (ఒక్కొక్కరికి ప్రత్యేకముగా) సంబంధమును,
న సృజతి = కలుగజేయలేదు;
స్వభావస్తు = ప్రకృతియే,
ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది (ఇట్టివన్నియు కలుగజేయుచున్నది).

తా. సకల జీవరాసులకునై కర్తృత్వమును, కర్మలను, కర్మఫల సంయోగమును పరమాత్మ సృజించలేదు. ఇదంతయును ప్రకృతియే - స్వభావమే - చేయుచున్నది.

## అమృతవాహిని :_

లోకములో జీవులన్నియును, అనేక కర్మలు చేయుచు కర్తృత్వాహంకారమును పొందుచున్నవి. తాము చేయు కర్మలయొక్క ఫలమును అనుభవించుచున్నవి. ఇది ఎట్లు జరుగుచున్నది ఈ శ్లోకములో వివరింపబడినది.

పరమాత్మకు ఏ విధమైన పక్షపాతమును లేదు. రాగద్వేషములును లేవు. అందువలన ఈ వ్యక్తి ఈ కర్మయే చేయవలయును అని, ఎవరికిని ప్రత్యేకముగ స్వతంత్రముగ పరమాత్మ ఏర్పాటు చేయలేదు.

ఒకడు పాపము చేయుచున్నాడు; ఒకడు పుణ్యము చేయుచున్నాడు; ఒకడు కష్టములు, నష్టములు, దుఃఖములు అనుభవించుచున్నాడు; వేరొకడు సుఖములు, లాభములు, ఆనందము అనుభవించుచున్నాడు - ఏమియును హేతువు లేకయే. పనికట్టుకొని పరమాత్మ ఒకనిచేత పాపమును చేయించి, కష్టములు నష్టములు, దుఃఖములు అనుభవింప జేయుట, వేరొకనిచేత పుణ్యమును చేయించి సుఖములను, లాభములను, ఆనందమును అనుభవింపజేయుట, మరొకనిచేత పాపపుణ్యములను మిశ్రమముగ చేయించి, కష్టములు, నష్టములు, దుఃఖములు, సుఖములు, లాభములు, ఆనందము కలగలుపుగా అనుభవింపజేయుట ఎట్లు సంభవించును? ఎన్నటికిని అట్లు జరుగదు. "సమోఽహం సర్వభూతేషు" అనిన పరమాత్మ అట్లు చేయునా? ఆయనకు పక్షపాతము లేదే!

అయితే ఎవరు చేయుచున్నారు? ఎవరివలన ఈ పాపపుణ్యములు జరుగుచున్నవి? మానవుడు తాను చేయవద్దని ఎంత అనుకొన్నను బలవంతముగా జరుగుచున్నవే అని సందేహము కలుగవచ్చును. గీత మూడవ అధ్యాయములో అర్జునుడు ఇట్టి ప్రశ్నయే వేసినాడు - "అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః" (36) 'కృష్ణా! మానవుడు ఇష్టమున్నను లేకున్నను బలవంతముగా దేనిచేత ప్రేరేపింపబడి, పాపము చేయుచున్నాడో చెప్పుము.'

ఈ ప్రశ్నకును ఇక్కడ సందర్భమునకును సంబంధము లేకపోలేదు. అక్కడ దానికి కారణము కామము అని చెప్పినాడు పరమాత్మ. ఇక్కడ స్వభావము అని చెప్పినాడు.

స్వభావము అనగానేమి ? స్వభావమనినను ప్రకృతి యనినను ఒకటే. ఈ స్వభావము చాల బలమైనది. అందువలననే పరమాత్మ గీత మూడవ అధ్యాయములో "సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి" (33) 'తెలిసినవాడు కూడ తన పూర్వజన్మవాసనానుకూలముగనే లోకమునందు ప్రవర్తించుచున్నాడు. సకల ప్రాణులను తమ తమ ప్రకృతినే - స్వభావమునే - అనుసరించుచున్నవి. అట్లు వాసనలనే అంటిపెట్టుకొని నడచువారిని నిగ్రహమేమి చేయుగలదు?' అనినాడు. అనగా ప్రకృతి - స్వభావము- అంత బలమైనది అని భావము

స్వభావము బలమైనదే, జయించుట కష్టసాధ్యమే; కాని అసాధ్యము కాదు. ఈ విషయము తెలిసికొని సాధకులు హెచ్చరిక కలిగి యుండవలయును.

ఈ శ్లోకములో కూడ అంతయు చేయునది స్వభావమే అని చెప్పినాడు. స్వభావమనగా ప్రకృతి సంబంధమైన వాసనయే. అనాది కాలమునుండి వచ్చుచున్నట్టిదియు, పూర్వా

పూర్వకర్మలచే కలిగిన దేవమనుష్యాది శరీరములుగా పరిణ మించినట్టిదియు, ప్రకృతియొక్క సంసర్గముచే ఆ యా శరీర ములయందు కలుగు ఆత్మాభిమానమువలన జనించునట్టిదియు అగు వాసన - ఈ వాసనయే ఇంతయును చేయుచున్నది. కాని అజ్ఞానులు ఇది గ్రహించలేక, తమచేత అన్నియును పర మాత్మయే చేయించుచున్నాడనియును, తమ కీ కష్టములు పర మాత్మయే తెచ్చిపెట్టినాడనియును అందురు. ఈ తత్త్వము బాగుగ తెలిసినగాని, ఈ సంసారబంధములనుండి బయట పడు సక్రమమైన మార్గము తెలియలేరు; తెలిసిన తరువాత ప్రయత్నించనూలేరు. అందువలననే దయాస్వరూపుడైన భగ వంతుడు మన హితమునుకోరి ఒక్కొక్క విషయమునే అనేక సందర్భములలో అనేక విధములుగ మనకు తెలుపు చున్నాడు. అంతియేగాని, "భగవంతుడు చేయడు; ఆయునకు పక్షపాతము లేదు; ఆత్మ అంతకంటె చేయదు; ప్రకృతివలననే అంతయును జరుగుచున్నది. ఆ ప్రకృతికి ఆత్మకు సంబంధము లేదు; కనుక ఆ పాపపుణ్యముల ఫలములు ఆత్మకు సంబం ధించవు" అని అర్థము చెప్పరాదు.

శ్లో॥ నాదత్తే కస్యచి త్పాపం
నచైవ సుకృతం విభుః ।
అజ్ఞానే నావృతం జ్ఞానం
తేన ముహ్యంతి జంతవః ॥ 15

ప. వి :— న, అదత్తే, కస్యచిత్, పాపం, న, చ, ఏవ, సుకృతం, విభుః, అజ్ఞానేన, ఆవృతం, జ్ఞానం, తేన, ముహ్యంతి, జంతవః.

టీక :—

విభుః = పరమాత్మ,
కస్యచిత్ = ఎవనియొక్కయును,
పాపం = పాపమును,
సుకృతం చ = పుణ్యమును కూడ,
నాదత్తే = స్వీకరించడు,
అజ్ఞానేన = అజ్ఞానముచేత,
జ్ఞానం = జ్ఞానము,
ఆవృతం కప్పబడియున్నది;
తేన = అందుచేత,
జంతవః = సకల జీవరాసులును,
ముహ్యంతి = మోహింపబడుచున్నవి.

తా. పరమాత్మ స్వతంత్రముగా ఎవనియొక్క పాపపుణ్యములతోను సంబంధము కలుగజేసుకొనడు. జ్ఞానము అజ్ఞానముచే కప్పబడినది. అందువలన సకల జీవులు మోహములో పడిపోవుచున్నవి.

అమృతవాహిని :—

ఈ శ్లోకములో ఎవరి పాప పుణ్యములతోను పరమాత్మకు ఏమియును సంబంధము లేదని వివరించుచున్నాడు.



పై శ్లోకములో, పరమాత్మ ఎవరిచేతను పుణ్యమునుగాని పాపమునుగాని చేయించుటలేదు. స్వతంత్రముగ, అహేతుకముగ, ఎవరిని ఏ ఫలములు అనుభవింపజేయుటలేదని చెప్పబడినది. కనుకనే ఎవరియొక్క పాపపుణ్యములతోను పరమాత్మకు ఎంతమాత్రమును సంబంధము లేదు. ఆయనకు ఎంతమాత్రమును అంటవు కనుక ఆ పాపపుణ్యములయొక్క ఫలము ఆయన అనుభవించవలసిన అగత్యములేదు. ఎవరి పాపపుణ్యములు వారే చేయుచున్నారు. ఆ ఫలములను వారే అనుభవించుచున్నారు.

అయితే వారు ఎందుకు చేయవలయును? మంచియే చేయవచ్చును గదా! ప్రతివారును తమకు అహితమునే చేసికొనుచున్నారే! - నిజమే. సర్వులయొక్క జ్ఞానము అజ్ఞానముచేత కప్పబడినది. అందుచేత సర్వులును మోహములో పడిపోవుచున్నారు. ఆ కారణమున స్వస్వరూపజ్ఞానము మరుగుపడి, దేహమే తా ననెడి దేహాత్మాభిమానముచే, మరల మరల పాపపుణ్యములు చేయుచుండుట, వాటి ఫలములను అనుభవించుటకు అధోలోకములకు, ఊర్ధ్వలోకములకు పోవుట ఇక్లే మోహములోపడి కర్మలుచేయుట, వాటిని అనుభవించుటకై దేహములు ధరించుట, ఆ దేహములయందు ఆత్మాభిమానరూపమైన మోహము పొందుట, దానివలన మరల దాని కనుగుణమైన కర్మలయొక్క వాసన ఉత్పన్నమగుట, ఆ

వాసనచేత మరల కర్మలు చేయుట, వాటియొక్క ఫలరూప మైన శరీరములు, మరల వాటియందు ఆత్మాభిమానము - ఇట్లే అంతులేనంత వాసనాపరంపర ప్రవాహముగా పెరిగి పోవును. జ్ఞానము అజ్ఞానముచే కప్పబడియుండుటచే ఈ విధముగ జీవనము నాయను మోహసముద్రములో మునిగి పోవుచున్నది.

శ్లో॥ జ్ఞానేన తు త దజ్ఞానం
యేషాం నాశిత మాత్మనః ।
తేషా మాదిత్యవత్ జ్ఞానం
ప్రకాశయతి తత్పరమ్ ॥ ౧౬

ప. వి :—జ్ఞానేన, తు, తత్, అజ్ఞానం, ఏషాం, నాశితం, ఆత్మనః, తేషాం, ఆదిత్యవత్, జ్ఞానం, ప్రకాశయతి, తత్పరమ్.

టీక :—

తు = కాని,
ఏషాం = ఎవరియొక్క,
తదజ్ఞానం = ఆ అజ్ఞానము,
ఆత్మనః = పరమాత్మకు సంబంధించిన,
జ్ఞానేన = జ్ఞానముచేత,
నాశితం = నశించిపోయినదో,
తేషాం = వారియొక్క,

జ్ఞానం = జ్ఞానము,
ఆదిత్యవత్ = సూర్యునివలె,
తత్పరం = సచ్చిదానందఘన పరమాత్మ తత్త్వమును,
ప్రకాశయతి = ప్రకాశింపజేయుచున్నది.

తా. కాని, ఎవరియొక్క ఆ అజ్ఞానము భగవత్సంబంధమైన జ్ఞానముచే నశించిపోయినదో, వారియొక్క జ్ఞానము సూర్యునివలె పరమాత్మయొక్క యథార్థస్వరూపమును ప్రకాశింప చేయుచున్నది.

అ మృ త వా హి ని :—

సకల జీవుల యొక్క జ్ఞానము అజ్ఞానముచే కప్పబడియున్నదని పై శ్లోకములో చెప్పబడియున్నది. అయితే, ఆ అజ్ఞానముచే కప్పబడియున్న జ్ఞానము ఎట్లు మనకు ఉపయోగములోనికి వచ్చుట అను ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది ఈ శ్లోకములో. భగవత్సంబంధమైన జ్ఞానముతో ఆ అజ్ఞానము నశించిపోయినచో, అడ్డముగా కప్పబడిన మేఘములు పోగా సూర్యుడు జగత్తును ప్రకాశింపజేసినట్లు, ఆ జ్ఞానము పరమాత్మ తత్త్వమును ఉన్నదున్నట్లు ప్రకాశింపజేయును.

•

అయితే జ్ఞానము అజ్ఞానము చేత కప్పబడియున్నదికదా! కప్పియున్న అజ్ఞానము జ్ఞానముచేత నశించిపోవలయుననిన, ఆ జ్ఞానము ఏది! కప్పబడియున్న లోపలి జ్ఞానమా? ఆ జ్ఞానమే

అయినచో, ఆ జ్ఞానము ఎప్పుడును ఉంటనే ఉన్నది. అదియే కప్పియున్న అజ్ఞానమును నశింపజేయునెడల అజ్ఞానము దానిని మొదటనే కప్పలేకపోయెడిది. కప్పగలిగినదిగదా! ఇప్పుడు ఎట్లైన మనము ఆ అజ్ఞానము అను కప్పును తొలగించుకొనిన యెడల ఆ జ్ఞానము ఇక తన ప్రభావమును చూపగలదు.

మహాప్రకాశముగల దీపము, పైన మట్టికుండచేత కప్పబడి యున్నది. లోపల ఉన్న దీపము అపరిమిత ప్రకాశము గలదే. కాని అది మనకు ఉపయోగపడవలయునన్న పై కుండను ఏదో రూపమున తొలగించవలయును.

ఇప్పుడు జ్ఞానమును కప్పిన అజ్ఞానమును జ్ఞానముతోనే నశింపజేయవలయును. అనగా కప్పబడియున్న జ్ఞానము వేరు, కప్పిన అజ్ఞానమును నశింపజేయు జ్ఞానము వేరు అని తలంచవలయును. అజ్ఞానమును నశింపజేయు జ్ఞానమేది?

పదమూడవ అధ్యాయములో -

"అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥"
(13-7)

"ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్ ॥"
(13-8)

"అసక్తి రనభిష్వంగః పుత్ర దార గృహాదిషు ।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥" (13-9)

"మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జనసంసది ॥" (13-10)

"అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥" (13-11)

'గౌరవమును కోరకుండుట, దంభము లేకుండుట' అహింస, ఓర్పు, మనోవాక్కాయములయందు ఏకవిధముగా ఉండుట, గురుసేవ, శుచిత్వము, స్థైర్యము, మనోనిగ్రహము, ఇంద్రియ విషయములందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జన్మము - మృత్యువు - ముసలితనము - వ్యాధి మొదలగువాటియందలి దుఃఖములను, దోషములను విచారించుకొనుట, సక్తత లేకుండుట, దారా పుత్ర గృహాదుల యందు లంపటుడు కాకుండుట, ఇష్టానిష్టములు ప్రాప్తించినప్పుడు చిత్తమును చలించనీయక సమముగ ఉండుట, పరమాత్మయందు అనన్యభావముతో చలించని భక్తి కలిగి యుండుట, పవిత్రమును, ఏకాంతమును అయిన ప్రదేశమునందు ఉండుట, సాంసారి జనులతో కలిసి ఉండకపోవుట, గురువు వద్ద శ్రవణముచేసిన ఆత్మానాత్మవివేకమునందే స్థిరముగ నిలిచి యుండుట, తత్త్వజ్ఞానమునకు ఫలమైన పరమాత్మను

సదా చింతించుకొనుట - ఇది జ్ఞానమని చెప్పబడుచున్నది - అని ఉన్నది. ఇక్కడ చెప్పబడినట్లు ఆచరణయందు ఉంచుకొన్న యెడల కప్పబడియున్న అజ్ఞానము నశించి జ్ఞానము ప్రకాశించును కనుక - యధార్థ జ్ఞాన సాధనము గనుక - దీనిని కూడ జ్ఞానమనియే చెప్పిరి. ఈ జ్ఞానముచేత అజ్ఞానమును నశింపజేసికొనవలయును. అప్పుడు లోపలఉన్న జ్ఞానము సూర్యునివలె ప్రకాశించి, భగవద్దర్శనము లభింపజేయును.

"ఆదిత్యవత్ జ్ఞానం - ప్రకాశయతి తత్పరమ్".

అనగా సూర్యుడు వచ్చుటచేత సకలపదార్థములు ఎట్లు ప్రకాశించుచున్నవో, అట్లే ఈ జ్ఞానము లభించుటచే భగవత్తత్త్వము ఉన్నదున్నట్లు మనకు గోచరించును.

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన
స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం
జ్ఞాన నిర్ధూత కల్మషాః ॥ ౧౭

ప. వి :-తద్బుద్ధయః, తదాత్మానః, తన్నిష్ఠాః, తత్పరాయణాః, గచ్ఛంతి, అపునరావృత్తిం, జ్ఞాననిర్ధూత కల్మషాః.

టీక :—

తద్బుద్ధయః = ఆ పరమార్థతత్త్వమునందే బుద్ధి గలట్టియును,

(8)

తదాత్మానః = దానియందే మనస్సు లగ్నమై
నట్టియును,

తన్నిష్ఠాః = దానియందే నిష్ఠగలట్టియును.

తత్పరాయణాః = ఆ పరమార్థతత్త్వమే ఆశ్రయ
ముగా కలవారు,

జ్ఞాననిర్ధూతకల్మషాః (సంతః)=జ్ఞానముచే పోగొట్టబడిన
పాపముకలవారై,

అపునరావృత్తిం = పరమపదమును,

గచ్ఛంతి = పొందుచున్నారు.

తా. పరమార్థ తత్త్వమునందే దృఢాధ్యవసాయము కలిగిన బుద్ధి గలట్టియును, లగ్నమైన మనస్సుగలట్టియును, నిష్ఠగలట్టియును, పరమార్థ తత్త్వమే ఆశ్రయముగా గల సాధుపురుషులు, జ్ఞానముచేత తమ పాపములన్నియు నిశ్శేషముగా నశించగా. పరమపదమును పొందు చున్నారు.

అ మృ త వా హి ని :—

అట్టి జ్ఞానము సూర్యునివలె, పరమాత్మ తత్త్వమును ప్రకాశింపచేయుగా, ఆ పరమాత్మ తత్త్వమును సాక్షాత్కా రింప చేసికొనిన మహాత్ములను ఈశ్లోకములో వర్ణించి చెప్పు చున్నాడు. వారియొక్క బుద్ధి కేవలము పరమాత్మ తత్త్వము నందే నిశ్చయాత్మకమై సంచరించుచుండును. సకల చరాచర ప్రపంచమును వ్యాపించి సకల జీవసముదాయముల యొక్క

హృదయసీమల నెల్చియున్న వాత్సల్య సౌశీల్య సౌలభ్య జ్ఞాన శక్త్యాదికల్యాణగుణమహోదధియును, ప్రేమమయుడును, ఆనంద మయుడును, సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, సర్వోత్తము డును, సకలలోకశరణ్యుడు నైన భగవంతునియొక్క గుణ ప్రభావ లీలావైభవములయొక్క తత్త్వమును సరహస్యముగా సంశయ విపర్యయరహితముగా తెలిసికొని, సదా, సర్వదా, సర్వత్ర అచంచలమైన నిశ్చయము కలిగి యుండుట వారి లక్షణము. వారియొక్క మనస్సు ప్రేమామృత మహాబ్ధి - పురుషోత్తముడు- అయిన భగవంతునికంటె ఇతరమైన సమస్త విషయముల నుండి పూర్తిగ విరక్తిచెంది, ఆయనయందే తన్మయమై సదా సర్వదా ఆయననే చింతించుకొనుచుండును.

వారు అట్టి సచ్చిదానందఘనునియందే స్థిరముగనిలిచి యుందురు. వారికి ఆ పరమాత్మయే పరమగతి. పరమా శ్రయము. జ్ఞానమును కప్పియున్న అజ్ఞానము సమూలముగ నశించిపోవుటచేత జ్ఞానము ప్రకాశించగా బంధనకారణము లైన శుభాశుభ కర్మలును, రాగద్వేషాది దుర్గుణములును, విక్షేపము, ఆవరణము మొదలగు దోషములును అన్నియును పూర్తిగ తొలగిపోయినవారు. వీరు మరల తిరిగిరాని పరమ పదమునకు అధికారులగుచున్నారు.

అవతారిక :-

ఇక అట్టి మహాత్ములయొక్క సమత్వమును తెల్పు చున్నాడు.

శ్లో॥ విద్యావినయసంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకేచ
పండితా స్సమదర్శినః ॥ ౧౮

ప. వి :- -విద్యావినయ సంపన్నే, బ్రాహ్మణే, గవి, హస్తిని, శుని, చ, ఏవ, శ్వపాకే, చ, పండితాః, సమదర్శినః.

టీక :—

విద్యా వినయ సంపన్నే=విద్యయును, వినయమునుగల,
బ్రాహ్మణే = బ్రాహ్మణునియందును,
గవి = ఆవునందును,
హస్తిని = ఏనుగునందును,
శునిచ = కుక్కయందును,
శ్వపాకేచ = కుక్కను వండుకొని తిను చండాలుని యందునుకూడ,
పండితాః = పండితులు,
సమదర్శినః = సమమైన దృష్టిగలవారుగ ఉందురు.

తా. పండితులైన వారియొక్క దృష్టి విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందును, ఆవునందును, ఏనుగునందును. కుక్కయందును, ఛండాలునియంధును సమముగనే ఉంధును.

**అమృతవాహిని :-**

పండితు లనగా ఎవరో విచారణ చేయవలసి యున్నది. పండితశబ్దమునకు "యేషాం జ్ఞానేన నాశిత మాత్మనః అజ్ఞానం తే పండితాః" 'ఎవరియొక్క అంతఃకరణమునందలి అజ్ఞానము జ్ఞానముచేత నశించినదో వారు పండితులు' అని శంకరాచార్యులవారును, "సమదర్శిత్వమేవ పాండిత్యం" 'సమదర్శిత్వమే పాండిత్యము' అని ఆనందతీర్థులును, "పండితాః ఆత్మ యాథాత్మ్యవిదః" 'ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెలిసినవారు పండితులు' అని రామానుజులును, "యేషాం జ్ఞానేన నాశిత మాత్మనః అజ్ఞానం తే పండితాః" అని హనుమంతుడును, "పండితాస్తత్త్వ యాథాత్మ్యవిదః" 'తత్త్వముయొక్క యథార్థ స్వరూపము తెలిసినవారు పండితులు' అని కేశవ కాశ్మీరభట్టాచార్యులును, "పండితాఃజ్ఞానినః" 'పండితులనగా జ్ఞానులు' అని మధుసూదన సరస్వతులును నిర్వచనము చేసియున్నారు.

సచ్చిదానందఘన పరబ్రహ్మముయొక్క యథార్థ తత్త్వమును బాగుగ అనుభవరూపముగ తెలిసినవారే సిద్ధ పురుషులు, మహాత్ములు. విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందును, పరమపవిత్ర జంతువైన ఆవునందును, ఏనుగునందును, కుక్కయందును, చండాలుని యందును సమబుద్ధి కలిగియుండుట వారి లక్షణము. పండితులను గుర్తించు

టకు ఇదే ఆధారము. మానవులలో ఉత్తమోత్తము డైన బ్రాహ్మణుని, చండాలుని, పశువులలో ఉత్తమోత్తమమైన గోవును, మధ్యమ తరగతికి చెందిన ఏనుగును, నీచమైన కుక్కను ఉదాహరణముగ చూపించి పండితుల యొక్క సమదర్శిత్వమును మచ్చుకు చూపించుటయైనది. ఈ విధముగ సకల జీవులయందును వారు సమదర్శులుగ ఉందురు.

వారియొక్క సమదర్శిత్వము వ్యవహారమునందు కని పెట్టుట ఎట్లు? సర్వత్ర వ్యవహారము ఒకేవిధముగ ఉండునా? అట్లుండదు. సమత్వము భావమునకు సంబంధించినదిగాని, బాహ్యమైన కర్మకు సంబంధించినది కాదు. ఒకరియందు తక్కువభావము, ఒకరియందు ఎక్కువభావము లేకుండ వారి ప్రేమ సర్వత్ర సమముగా నుండును. ఆకలితో తనచోటునకు వచ్చినవారిని, మీరు బ్రాహ్మణులా, క్షత్రియులా, వైశ్యులా, శూద్రులా, చండాలురా - ఈ మొదలగు ఆలోచనలులేక, ఎవరైనను సరియే ప్రేమతో ఆదరణముతో భోజనము పెట్టును. తనవారైన ప్రేమతో ఆదరణముతో పెట్టుట, లేని యెడల ఎందుకు వచ్చినదిరా అని విసుగుగొనుచు పెట్టుట ఉండదు. తనకు చేతనైన సాహాయ్యము చేయుటలో, దుఃఖ నివారణ చేయుటలో, మానవులని, జంతువులని, మానవులలో బ్రాహ్మణుడని, చండాలుడని, జంతువులలోకూడ ఆవు అని, కుక్కఅని భేదము ంచకుండ, అన్నిటియొక్క అవసరములు తీ

యున్నంతవరకు నెరవేర్చుటయే. ఆ అవసరములు నెరవేర్చుట కూడ వారికి హితముకలుగుట, వాటికి ఉపయోగపడుటను దృష్టిలో ఉంచుకొనియే చేయును. అందువలన పైకి క్రియారూపములో మాత్రము భేదము కనుపడుచునే యుండును. ఆకలియైన మానవుడువచ్చిన అన్నము పెట్టును. ఆవు వచ్చిన గడ్డి, జనపకట్ట మొదలగునవి వేయును. అంతేగాని, 'నేను సమదర్శిని. నాకు అన్నియు సమానమే' అని మానవునకును, ఆవునకునుకూడ అన్నమే పెట్టుటయో, లేక గడ్డి, జనుపకట్ట వేయుటయో చేయడు. అట్లే ఈయన సమదర్శి అయిన, మానవునకు అన్నము, ఆవుకు గడ్డి జనుపకట్ట వేయునేమి అనియును, ఈయనకు ఈ భేదము ఎందుకు అనియును, ఈ భేదము ఉన్నవాడు సమదర్శి ఎట్లు అగును అనియును తలంచరాదు. ఇట్లే అన్నివైపులనుండియును, అన్నివిషయములలోను అని తెలిసికొనవలయును.

ఇది బాహ్యమైన వ్యవహారము విషయము.

ఇంకొకవిధముగకూడ సమదర్శిత్వమును విచారణ చేయవలయును.

పరమాత్మ సకలభూతములయందును లోపల బయట కూడ వ్యాపించి యున్నాడు. వారు ఆ పరమాత్మను సర్వత్ర సమముగా చూతురు. ప్రాపంచికదృష్టిలో ఇది పవిత్రమైన

వస్తువు, ఇది అపవిత్రమైన వస్తువు, ఇది ఉత్తమమైనది; ఇది నీచమైనది, అందుచే పరమాత్మ ఈ వస్తువులలో ఎక్కువగ వ్యాపించి ఉండును. ఈ వస్తువులలో తక్కువగ వ్యాపించి ఉండును అని అనుకొనక, అన్నిటియందును, మానవులలో ఉత్తమోత్తముడైన బ్రాహ్మణునియందును, నీచాతినీచుడుగ భావింపబడు చండాలుని యందును, పశువులలో ఉత్తమమైన ఆవునందును, మధ్యమమైన ఏనుగునందును, నీచమైన కుక్క యందునుకూడ సమముగానే పరమాత్మవ్యాపించియుండుటను వారు చూచుచుందురు కాన సర్వత్ర సమముగ వ్యాపించి యున్న పరమాత్మను చూతురు. ఇట్టివారిని గురించియే "వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః" అని గీతలో చెప్పబడినది. కనుక అట్టి మహాపురుషులకు సర్వత్ర పరమాత్మదృష్టి ఉండుటచేత సర్వత్ర సమదృష్టి సహజమైపోవును. సర్వత్ర సమదృష్టి సహజమైపోయినప్పటికిని, లోకదృష్టితో వ్యవహారమునందు యథాయోగ్యమైన భేదము ఉండనే ఉండును. వ్యవహారములో భేదమున్నను పరమార్థదృష్టిలో సమత్వమునకు ఎంతమాత్రమును అడ్డు లేదు. కనుక, ఇట్టి తత్త్వజ్ఞానులైన మహాపురుషులు వ్యవహార దృష్టిలో జీవనము దాయమునకుగాని జీవికిగాని విపత్తు కలిగినప్పుడు; భేదభావము ఎంతమాత్రమును లేకుండ. ఆ విపత్తును నివారణ చేయుటకు యథాశక్తి యథాయోగ్యముగా ప్రయత్నించుదురు.

అంతేగాక, సమః అనగా పరమాత్మ. అందరియందు సర్వత్ర పరమాత్మనే చూచువాడు సమదర్శి. ఇట్టి సమదర్శియే పండితుడు.

శ్లో॥ ఇహైవ తైర్జిత స్సర్గో
యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ ౧౯

ప. వి :—ఇహ, ఏవ, తైః, జితః, సర్గః, యేషాం, సామ్యే, స్థితం, మనః, నిర్దోషం, హి, సమం, బ్రహ్మ, తస్మాత్, బ్రహ్మణి, తే, స్థితాః,

టీక :—

ఏషాం = ఎవరియొక్క,
మనః = మనస్సు,
సామ్యే = సమత్వమునందు,
స్థితం = నిలిచియున్నదో,
తైః = వారిచేత,
ఇహైవ = ఇక్కడనే,
సర్గః = సంసారమును,
జితః = జయించబడినది;

హి = ఎందుల కనగా,
బ్రహ్మ = పరబ్రహ్మము,
నిర్దోషం = దోషరహితమైనదియును,
సమం = సమముగా నుండునదియును,
తస్మాత్ = కాబట్టి,
బ్రహ్మణి = పరబ్రహ్మమునందు,
తే = వారు,
స్థితాః = నిలిచియున్నారు.

తా. ఎవరియొక్క మనస్సు సమత్వమునందే నిలిచియున్నదో, వారిచేత బంధనరూపమైన ఈ సంసారము ఇక్కడనే జయించబడినది. కారణమేమనగా - పరబ్రహ్మ వస్తువు ఎంతమాత్రమును దోషములు లేనిది, సమస్తమునందును సమముగా నుండునది కాన, సమదర్శులైన వారు ఆ పరబ్రహ్మమునందే స్థిరముగా నిలిచియుందురు.

**అ మృ త వా హి ని :—**

ఈ శ్లోకములో కూడ సమదర్శులైనవారి వైభవమే చెప్పబడినది.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ! శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః ॥" అని చెప్పిన ప్రకారముగా సర్వభూతములందును సమభావము కలిగిన మహాత్ములు ఇక్కడనే సంసారబంధనములను త్రెంచు

కున్నారు. అనగా ప్రారబ్ధకర్మరీత్యా వారి శరీరమునకు ఇంకను ఆయుష్కాలము మిగిలియుండుటచేత, ఈ లోకములో వారు న్నను ముక్తులే. సంసార బంధనము లేమియును వారికి లేవు. సర్వత్ర వారికి పరమాత్మానుభవము ఉండనే ఉన్నది. ఇంక వారికి ముక్తదశ కాక మరేమి ? వారు చేపట్టిన వస్తు వెట్టిది ? "నిర్దోషం హి సమం బ్రహ్మ" ఆ పరబ్రహ్మతత్త్వము దోష రహితమైనది. సత్త్వ రజ స్తమో గుణములుగాని, వాటికి సంబంధించిన రాగద్వేషములుగాని, రాగద్వేషములకు సంబంధించిన విషమత్వముగాని లేనిది ఆ పరబ్రహ్మతత్త్వము. "సర్వేభ్యః పాపేభ్య ఉదితః" 'సకల పాపములకు అతీతమైనది' (ఛాందోగ్యోపనిషత్), "ఏష ఆత్మా అపహతపాప్మా విరజో విమృత్యు ర్విశోకో విజిఘ త్సోఽపిపాసః" (ఛాం - ఉ - 8-1-15) 'ఈ పరమాత్మ పుణ్యపాపములు, జరామృత్యువులు లేనివాడు. శోకరహితుడు. ఆకలిదప్పులు లేనివాడు' అని శ్రుతి చెప్పుచున్నది. కనుక పరబ్రహ్మవస్తువు నిర్దోషమైనది. భగ వంతుడు అఖిలహేయ ప్రత్యనీకుడు. అంతమాత్రమే కాక సకల కల్యాణగుణ మహోదధి. సత్యకాముడు. సత్యసంకల్పుడు. సర్వేశ్వరేశ్వరుడు. అట్టి పరబ్రహ్మమునందు సదా నిలిచి యుండువారు గనుక, మహాత్ములుకూడ నిర్దోషులు. వారు కూడ సత్త్వ రజ స్తమోగుణముల కతీతులై ఉందురు. కనుకనే వారికికూడ రాగద్వేషాదులుగాని, విషమబుద్ధిగాని లేక, సమత్వము వారికి సహజమైపోవును.

**అవతారిక :–**

ఇంకను అట్టి మహాత్ముల లక్షణము చెప్పుచున్నాడు.

శ్లో॥ న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య
నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధి రసమ్మూఢో
బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః ॥ ౨౦

ప వి :—న, ప్రహృష్యేత్, ప్రియం, ప్రాప్య, న, ఉద్విజేత్, ప్రాప్య, చ, అప్రియం, స్థిరబుద్ధిః, అసమ్మూఢః, బ్రహ్మవిత్, బ్రహ్మణి, స్థితః.

**టీక :—**

స్థిరబుద్ధిః = పరమాత్మయందే స్థిరమైన బుద్ధి కలిగినట్టియు,

అసమ్మూఢః = సంశయము, భ్రమ, మోహము ఎంత మాత్రమును లేనట్టియు,

బ్రహ్మణి స్థితః = సర్వకాల సర్వావస్థలయందును పరమాత్మయందే త్రికరణములచేతను నిలిచి ఉండునట్టియు,

బ్రహ్మవిత్ = పరమాత్మానుభవము కలవాడు,

ప్రియం = ఇష్టమైనదానిని,

ప్రాప్య = పొంది,
న ప్రహృష్యేత్ = సంతోషించడు,
అప్రియం ప్రాప్యచ = అనిష్టమైనదానిని పొందికూడ,
నోద్విజేత్ = దుఃఖించడు.

తా. స్థిరబుద్ధి కలవాడును, సంశయము, భ్రమ, మోహము - ఇవి ఎంతమాత్రమును లేనివాడును, సర్వకాల సర్వావస్థల యందును పరమాత్మయందే త్రికరణములచేతను నిలిచియుండువాడును, భగవదనుభవ పరుడును అగు మహాత్ముడు లోకములో ఇష్టములభించినప్పుడు సంతోషించుట, అనిష్టము లభించినప్పుడు దుఃఖించుట చేయడు.

అమృతవాహిని :—

పరమాత్మప్రాప్తస్థితిని పొందిన మహాత్ముల లక్షణములు చెప్పబడుచున్నవి. భగవదనుభవపరులైన మహాత్ములు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలోను, భూత భవిష్య ద్వర్తమాన కాలములలోనుకూడ కాయేన మనసా వాచా భగవంతుని యందే నిలిచియుందురు. అట్టి మహాత్ములను గుర్తుపట్టుట ఎట్లో చెప్పుచున్నాడు. వారిబుద్ధి అన్ని అవస్థలలోను, అన్ని పరిస్థితులలోనుకూడ స్థిరమైనదిగా ఉండును. ఏపరిస్థితియుకూడ వారి బుద్ధిని చలింపచేయలేదు. వారియొక్క అంతఃకరణములో సంశయములుగాని, భ్రమగాని, మోహముగాని ఈషణ్మాత్రము కూడ ఉండవు. వారికి వాసనలు, కాంక్షలు నశించినవి. ఆకారణమున, వారికి ఇష్టానిష్టములన్నవి లేనేలేవు. లోక

ధర్మమునననుసరించి చూచినను ఇష్టము లభించినప్పుడు సంతోషించరు. అనిష్టము లభించినప్పుడు దుఃఖించరు. ప్రారబ్ధ కర్మానుసారముగ ఏది లభించిన దానినే నిర్లిప్తతతో "యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం" అని ఉందురు.

శ్లో॥ బాహ్యస్పర్శే ష్వస క్తాత్మా
విందత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయు క్తాత్మా
సుఖ మక్షయ మశ్నుతే ॥ ౨౧

ప. వి :— బాహ్యస్పర్శేషు, అసక్తాత్మా, విందతి, ఆత్మని, యత్, సుఖమ్, సః, బ్రహ్మయోగయుక్తాత్మా, సుఖం, అక్షయం, అశ్నుతే.

టీక :—

బాహ్యస్పర్శేషు = బాహ్యవిషయములయందు,
అసక్తాత్మా = ఆసక్తిలేని అంతఃకరణము కలవాడు,
ఆత్మని = అంతఃకరణమునందు,
యత్సుఖం = ఏ సుఖమును - భగవద్ధ్యానమువలన కలిగిన ఏ సుఖమును -
విందతి = పొందుచున్నాడో,
సః = వాడు,

బ్రహ్మయోగయుక్తాత్మా = సచ్చిదానందఘన పరబ్రహ్మమునందలి ధ్యానయోగమునందే నిలుకడ కలిగిన మనస్సు కలిగిన వాడై,

అక్షయం = నాశరహితమైన,

సుఖం = ఆనందమును,

అశ్నుతే = అనుభవించుచున్నాడు.

తా. బాహ్యవిషయములయందు ఆసక్తిలేని మనస్సు కలవాడు, అంతఃకరణమునందు ధ్యానమువలన కలిగిన ఆనందమును పొందుచున్నాడు. తరువాత వాడు పరబ్రహ్మధ్యానమునందే నిలుకడకలిగిన మనస్సుకలవాడై, అంతములేని ఆనందమును అనుభవించుచున్నాడు.

## అమృతవాహిని :—

సాధకుడు పరమాత్మధ్యానము చేసికొనుచున్నను బాహ్యవిషయములయందు అనగా ప్రాపంచిక భోగములయందు ఆసక్తి ఉన్నంతకాలము, ఆ ధ్యానమువలన కలుగవలసిన ఉన్నతి కలుగదు. కనుక బాహ్యవిషయములయందు ఆసక్తి పూర్తిగ పోవలయును. అప్పుడు భగవద్ధ్యానమువలన అంతఃకరణములో ఒకరకమైన సాత్త్వికానందము కలుగును. ఆ ఆనందము అనుభవమునకు వచ్చుటతోడనే ఇక మనస్సును

బాహ్యవిషయములమీదికి పోనీయకుండ ఆపవలసిన కష్టము ఉండదు. ఆ సుఖమును మరిగిన మనస్సు సహజముగనే భగవద్ధ్యానమునందు మగ్నమగును. మనస్సు ఆ పరబ్రహ్మ ధ్యానమునందే స్థిరముగా నిలుకడ చెందినంతనే అతడు నాశనము లేని - అనగా శాశ్వతమైన - బ్రహ్మానందమును అనుభవించును.

ఈ శ్లోకములో సాధకునికి గొప్ప హెచ్చరిక కలదు. సాధకుడు ప్రాపంచిక భోగములయందు వైరాగ్యమును కలిగియుండవలయును. మనస్సులో ఆసక్తి ఉండును. దానిని సాధకుడు గ్రహించలేక, తన మనస్సును నమ్మి సాధన సాగించుకొనుచుపోవును. మనస్సులో ఆ ఆసక్తి నెమ్మది నెమ్మదిగా, సాధకునకు తెలియకుండగనే, వృద్ధిని చెందుచుండును. ఆధ్యాత్మిక సాధనలో ఎంతోపైకిపోతిననుకొను వాడు సైతము ఎప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగా క్రిందకు కూలుట జరుగుచుండుటకు ఆసక్తియే కారణము. అందువలన సాధకుడు ప్రతిక్షణమును ఎంతో హెచ్చరిక కలిగి సాధన రంగములో ముందుకు నడక సాగించవలయును. లేనియెడల, సమయముకొరకు వేచియుండి, ఏ కనుకుపాటు సమయములోనో, దాగియున్న ఆ ఆసక్తి అను పెద్దపాము ఒక్కసారి కాటు అందుకొనును.

ఒకొక్క వ్యాధి పైకి తెలియకుండ, లోలోపలనే వృద్ధిచెంది, మానవుని ఒక్కసారిగా ప్రమాదావస్థలోనికి

తెచ్చును. అట్టిది ఆసక్తి. ఎక్కడను మట్టి దొరకని పెద్ద పెద్ద రాతిభవనములలోకూడ మొలిచి, ఎన్ని సారులు పెరికి పార వైచినను, అక్కడనే మెల్లి మెల్లిగా సారమును గ్రహించి వృద్ధిపొందెడు రావి, మఱ్ఱి వృక్షములవంటిది ఆసక్తి. బ్రహ్మ లోక భోగములయందు సైతము మహావైరాగ్యము కల వారము అనుకొని పట్టుదలతో సాధనచేయువారియొక్క, ఏమి యును తడిలేని, శుష్కమైన అంతఃకరణములలోకూడ ఈ ఆసక్తి తెలియకుండ సారమును గ్రహించి వృద్ధిపొందు చుండును. విషయోపభోగములు అను ఆహారమీయకుండ ఉపవాసములతో ఎంత శుష్కింపచేసినను, ఆ ఆసక్తి అంతః కరణములోని స్వల్పాతిస్వల్పములైన సందులనే ఆధారముగ చేసికొని వృద్ధిపొందుచునే ఉండును. కనుక సాధకుడు చాల హెచ్చరిక కలిగి ఉండవలయును.

విషయములను అంతఃకరణము ఎంతమాత్రము స్మరించి నను, అది ఆసక్తికి సారవంతమైన ఆహారమే. సాధకునకు తెలియకుండ విషయస్మరణము జరుగుచుండును. పరమ వైరాగ్యమున్నదనుకొనువాడు కూడ, ప్రతిక్షణము చిన్ని చిన్ని విషయములనుకూడ ఎట్లు స్మరించుచుండునో చూడుడు. పండుకొనుటకు ఈరోజు సౌకర్యములేదే అను భావము కలిగిన దనుకొనుడు- ఆ భావము, దాగి బలహీనముగా ఉన్న ఆసక్తికి ఒక బలవర్ధకమైన దివ్యౌషధమువలె బలమిచ్చును. తనకు

గౌరవము లభించవలయును అను భావము అంతకంటెను బలకరము. ఇట్టివి సాధకునకు తెలియకుండ అంతఃకరణములో ప్రతిక్షణమును బయలుదేరుచునే ఉండును. ఇట్లు చక్కగ తనను తాను పోషించుకొనుచు తెగబలియును ఆసక్తి. సమయముకొరకు వేచి, అవకాశము వచ్చినప్పుడు తలక్రిందులుగా పడద్రోయగలదు.

ఈ సందర్భమునే ఇంకొకరకముగా రెండవ అధ్యాయములో ఏబది తొమ్మిదవ శ్లోకములో హెచ్చరిక ఇచ్చియున్నాడు పరమాత్మ.

కనుక ఏనాటికి అంతఃకరణములో ఆసక్తి పూర్తిగ నశించిపోవునో, లేక ఇక బ్రతికిబట్టగట్టని స్థితికి బలహీనమైపోవునో, అప్పుడు ధ్యానముచేయుటచేత అంతఃకరణములో ఒక విలక్షణమైన సాత్త్వికానందము అనుభవమునకువచ్చును. ఆ రుచి మరిగిన మనస్సు ఇక దానిని విడిచి పెట్టలేదు. ఆస్థితికి వచ్చువరకే మనస్సును బాహ్యవిషయములమీదికి పోనీయకుండ ఆపవలసిన కష్టము. ఆ కష్టము ఇక ఉండదు. ఆ హేతువున మనస్సు పరమాత్మ ధ్యానములో బాగుగా స్థిరత చెందును. తరువాత అతడు శాశ్వతానందమునకు అర్హుడగుచున్నాడు.

**అవతారిక :—**

బాహ్యవిషయములయందు ఆసక్తి లేకుండుటచే పరమార్థప్రాప్తిని చెప్పి, ఇప్పుడు ఈ శ్లోకములో బాహ్య

విషయములయందు ఆసక్తి దుఃఖములకు కారణము అని నిరూపించి, ఆసక్తిని తప్పక విడువవలసినదిగా హెచ్చరించుచున్నాడు పరమాత్మ.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే ।
అద్యంతవంతః కౌంతేయ !
న తేషు రమతే బుధః ॥ ౨౨

ప. వి :‒యే, హి, సంస్పర్శజాః, భోగాః, దుఃఖయోనయః, ఏవ, తే, అద్యంతవంతః, కౌంతేయ, న, తేషు, రమతే, బుధః.

టీక :‒

కౌంతేయ! = ఓ అర్జునా!
సంస్పర్శజాః = ఇంద్రియములకు విషయములకు సంయోగము కలుగుటవలన పుట్టిన,
భోగాః = సుఖములు,
యే (సంతి) = ఏవి కలవో,
తే = అవి,
దుఃఖయోనయ ఏవ = దుఃఖములకే హేతువులగుచున్నవి;
హి = ఏలయనగ,

ఆద్యంతవంతః = ఆదియును అంతమును కలవి-అనగా
అనిత్యములు,

(తతః = అందువలన)

తేషు = ఆ సుఖములయందు,

బుధః = వివేకము కలవాడు,

న రమతే = ప్రీతిచేయడు (అనగా కాంక్షపొందడు).

తా. అర్జునా! ఇంద్రియములు విషయములయందు ప్రవర్తించుట వలన కలుగు సుఖములు, నిలకడగ ఉండునవి కాకపోవుటచే - అనగా ఆద్యంతములు కలిగి, నశించెడివగుటచే- దుఃఖములకే కారణములగు చున్నవి. కనుకనే యథార్థము నెరిగిన బుధులు వాటిని కాంక్షచేయరు.

## అ మృ త వా హి ని :—

బాహ్యవిషయములకును, ఇంద్రియములకును సంయోగము కలిగినప్పుడు భ్రమచేత సుఖభ్రాంతి కలుగుచున్నది. అందుచేత వాటిని భోగములుగా తలచి అజ్ఞానులు కోరు చున్నారు. యథార్థ మాలోచించిన అవి దుఃఖములకే కారణములగుచున్నవి.

మిడుతలు జ్వాలనుచూచి, అజ్ఞానముచేత,మహాసుఖము కలుగునని భ్రమించి, రాబోవు మహాభయంకరమైన పరిణామమును తెలిసికొనలేక గుంపులు గుంపులుగా ఎగిరి ఎగిరివచ్చి దానిలోబడి దగ్ధమైపోవుచున్నవి. అదేవిధమున అజ్ఞానులైన

మానవులును ప్రాపంచిక విషయోపభోగములే సుఖహేతువులుగా భావించి, అపరిమితమైన ఆసక్తితో, వాటిని అనుభవించుటకే విశ్రాంతి అనునది ఎరుగక రాత్రిందివములు ప్రయత్నములు సలుపుచున్నారు. చివరకు మహాదుఃఖములనే పొందవలసినవారగుచున్నారు. ఇది తెలియలేకుండ నున్నారు మానవులు.

ఈ విషయములే సుఖహేతువులని తలంచి అనుభవించుటచేత మరల మరల అనుభవించవలయుననెడి ఆసక్తి వృద్ధి చెందును. ఆసక్తిచేతనే కామము, దానికి విఘ్నము కలుగునను కొనినప్పుడు క్రోధము - ఇట్లే అనర్థదాయకములైన దుర్గుణములన్నియు ఒక్కుమ్మడిగ కలుగును. ఆ గుణములున్నచోట అనేకవిధములైన, నీచాతినీచములగు దుర్లక్షణములును, దురాచారములును వచ్చి ఒక్కుమ్మడిగా ఆ వ్యక్తిని చుట్టుముట్టును. ఇక ఆతని జీవితమే పాపమయమై పోవును. దానికి ఫలముగా ఇహపరలోకములు రెండును చెడిపోయి, ఇక్కడను అక్కడనుకూడ అపరిమితములైన భయంకర బాధలు యాతనలు అనుభవించవలసివచ్చును. ఇంతేగాక, ఆభోగము లనుభవించుటకు ఏ యే పదార్థములు వ్యక్తులు సాధనములుగ తలంచుచున్నారో, ఆ సమస్తమును క్షణభంగురమగుటచేత మాటిమాటికి నష్టమైనశించిపోవుచుండును. అప్పుడు దుఃఖమును పొందుటయేకాదు - వాటియొక్క

సంబంధముచేత కలిగిన సంస్కారములు మాటిమాటికిని జ్ఞాపకమునకు తెచ్చుచుండుటచేత మానవుడు సదా దుఃఖసముద్రములోమునిగి అపరిమితముగా బాధపడుచున్నాడు. నెత్తి బ్రద్దలు కొట్టుకొనుచు ఏడ్చుట, అరచుట చేయుచుండును.

ఇంకను - అజ్ఞాని మిగిలినవారికంటె తాను అన్నిటిలోను ఎక్కువగ నుండవలయునని తలంచుచుండును గాన, ధనములోగాని, వస్తుసామగ్రిలోగాని, పేరుప్రతిష్ఠలలోగాని, ఇంక ఏవిషయములోనైనను తనకంటె ఇతరులు ఎక్కువగ నుందురేమో అను అనుమానము కలుగునప్పటికే భయము, అసూయ అగ్నివలె వారి హృదయమును కాల్చివేయుచుండును.

జాగ్రత్తగ ఆలోచించినయెడల విషయసంయోగముచే కలిగెడి భోగములు వాస్తవమునకు సర్వథా దుఃఖములకే కారణములగుచున్నవని తెలియగలదు. వాటియందు సుఖమన్నది ఏమాత్రమును లేదు. అజ్ఞానముచేత సుఖముగా తోచుచున్నది. కనుకనే కృష్ణభగవానుడు ఈ ప్రాపంచిక విషయోపభోగములన్నియును దుఃఖహేతువులే అని నిర్ణయించినాడు.

ఇవి 'ఆద్యంతవంతః' - ఆది, అంతము కలవి. అనగా జలబుద్బుదములవలె, మెరపులవలె క్షణభంగురములు, అనిత్యములు. వీటియందు సుఖము లేశముకూడ లేకపోయినను, అజ్ఞానముచేత సుఖదాయకములుగా కొంతమంది తలంచినను,

ఆ సుఖముకూడ నిత్యముకాదు. క్షణికమే. సృష్టిలోని ప్రతి వస్తువును అనిత్యమే అయినప్పుడు, అనిత్యమైన వస్తువుతో నిత్యసుఖము దొరకునా ? రెండవ అధ్యాయములో పదు నాలుగవశ్లోకములో కూడ "ఆగమాపాయినః" 'విషయోప భోగములు రాకపోకలు కలిగినవి'అని చెప్పబడియున్నది. కనుక తత్త్వము తెలియని వివేకహీనులు మాత్రమే ఈ విషయోప భోగములందు ప్రీతిచేయుదురు. కాని వివేకముగల సాధువులు వీటియందు కాంక్ష చేయరు.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం
ప్రాక్శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం
స యుక్తస్స సుఖీ నరః ॥ ౨౩

ప. వి : శక్నోతి, ఇహ, ఏవ, యః, సోఢుం, ప్రాక్, శరీర విమోక్షణాత్, కామక్రోధోద్భవం, వేగం, సః, యుక్తః, సః, సుఖీ, నరః.

టీక :—

యః నరః = ఏ మానవుడు,
కామ క్రోధోద్భవం వేగం = కామక్రోధములచే కలుగు వేగమును,
ఇహైవ = ఇక్కడనే,

శరీర విమోక్షణాత్ ప్రాక్ = శరీరపతనమునకుముందే,
సోఢుం = అరికట్టుటకు,
శక్నోతి = సమర్థుడగుచున్నాడో,
సః = వాడు,
యుక్తః = యోగి;
సః = వాడు,
సుఖీ = సుఖవంతుడు.

తా. ఏ నరుడు కామము యొక్క వేగమును, క్రోధముయొక్క వేగమును - అనగా కామక్రోధములచే అంతఃకరణములో కలిగిన క్షోభమును - ఇక్కడనే - తనశరీరము పడిపోవులోపలనే - అరికట్టుటకు సమర్థుడగునో, వాడే యోగి; వాడే సుఖవంతుడు.

## అ మృ త వా హి ని :—

సాధకుడు ఎప్పుడు కామక్రోధములవలన అంతఃకరణమునందు కలిగిన క్షోభమును - నిలుపగలుగునో - అనగా జయించగలుగునో - వాడే యోగి. అటువంటివానినే ధీరుడనికూడ వ్యవహరింతురు. వీరుడైనవాడు సముద్రమువలె శత్రుసైన్యము తనను చుట్టుముట్టినను ఏమియును చలించక ధైర్యముగా ఏకాకియై ఆ సైన్యమును ఒక్క అడుగుకూడ ముందునకు వేయనీయక ఆపగలుగవచ్చును. కాని వాడు తన అంతఃకరణములోని ఈ క్షోభమును కళ్ళెముపట్టి ఆపలేడు అట్లు ఆపగలిగినవాడే ధీరుడు వాడే యోగి. వాడే

యథార్థముగ సుఖవంతుడు. అంతవరకును ఎంతటివారికైనను సుఖము మాత్రము శూన్యము.

ఈ శరీరముతో ఉండగనే, ఈ శరీరము పడిపోవు లోపలనే కామక్రోధములమీద విజయము సంపాదించవలయును. మానవశరీరముకంటె ఇతరమైన దేవతాదేహములందుగాని, పశు పక్షి మృగాది దేహములందుగాని, సాధనచేసి కామక్రోధములను జయించుటకు అవకాశము లేదు. దేవతా జన్మలలో విలాసములకు భోగములకు ప్రాధాన్యము ఉండుట చేతను, పశు పక్షి మృగాది జన్మలలో జడత్వము ఎక్కువగ ఉండుటచేతను, సాధనకు వీలులేనట్టివి. "ఇహైవ" 'ఇక్కడనే' అనుటలో ఈ మానవశరీరములోనే అట్టి అవకాశము కలదు. అట్టి అవకాశమును జారవిడుచుకొనవద్దు అని పరమాత్మ మానవులను హెచ్చరించుచున్నాడు.

ఈ మానవదేహమును గూర్చి "మోక్షద్వారం సుదుర్లభం" అని చెప్పబడియున్నది. జీవునకు పరమాత్మచేత ఈ మానవదేహము ప్రసాదించబడినదే మోక్షమును సంపాదించుటకు. అట్టి మహోత్కృష్ట ఫలమునకు సాధనమైన ఈ దేహమును పొందు విషయసుఖములకై - శునక, సూకరాది దేహములలోకూడ అతిసులభముగా లభ్యమగు నీచమైన విషయసుఖములకే ఉపయోగించుకొని, అమోఘమైన సదవ

కాశమును చేతులార పాడుచేసికొనిన వారికంటె తెలివితక్కువ వారు ఎవరుందురు? కేనోపనిషత్తులలోకూడ "ఇహ చే దవేదీ దథ సత్య మస్తి నచే ది హావేదీన్ మహతీ వినష్టిః" (2-5) 'ఈ మానవదేహములోనే భగవంతుని తెలిసికొనిన మంచిది. ఈ శరీరము ఉండగనే తెలిసికొననియెడల చాల గొప్ప హాని గలదు' అని చెప్పబడియున్నది.

అట్లే చేసికొనవచ్చును. కాని అప్పుడే తొందర ఏమి అనుకొని ఒక్కక్షణము కూడ ఆలస్యము చేయరాదు. ఈ శరీరము నశించితీరునది అనుట నిశ్చయమేగదా! కాబట్టి శరీరము విడిచిపోవులోపలనే విజయమును పొందితీరవలయును. పోనీ ఈ శరీరము నశించునది అగుటేకాదు. ఎప్పుడు నశించు నది నిర్ణయములేదు. ఏక్షణమున పడిపోవునో తెలియదు. ఆ కారణమున ఎప్పటికప్పుడే ఒక్కక్షణముకూడ వృథచేయక, పట్టుదలతో భగవంతునిపై భారమునైచి సాధన చేయ వలయును.

కామక్రోధములవలన కలిగిన వేగము అనగా :

స్త్రీ పురుషులకు, ఒకరియందు ఒకరికి సుఖాభిలాషతో కలిగెడి ఇచ్ఛను 'కామము' అందురు. అంతేకాదు, పతిసతి పుత్త్రాది దేహబంధువులు, ధనము, ఇల్లు, వాకిలి, స్వర్గాది ఊర్ధ్వలోకములలోని భోగములు మొదలగు విషయముల

యందు ఆసక్తి ఉండుటచే వానిని పొందుటకు, అనుభవించుటకు, కలిగెడి ఇచ్ఛను కూడ కామమనియే అందురు. ఈ ఇచ్ఛచే అంతఃకరణములో ఉద్భవించెడి నానావిధములైన సంకల్ప వికల్పములయొక్క మహాప్రవాహమే కామమువలన కలిగిన వేగమనగా.

కామమునకు విఘ్నములు బాధలు సంభవించినప్పుడుగాని, మనోబుద్ధీంద్రియములకు ప్రతికూల విషయములు సంప్రాప్తించినప్పుడుగాని, దానికి కారణమైన పదార్థమునందో వ్యక్తియందో ద్వేషభావము కలిగి, అందువలన అంతఃకరణమునందు ఉద్భవించెడి ఉద్రేకమును క్రోధ మందురు. ఈ క్రోధముచే అంతఃకరణమున కలిగెడి నానావిధములైన సంకల్ప వికల్పములయొక్క మహాప్రవాహమే క్రోధముచేత కలిగెడి వేగమనగా -

ఈ వేగములు కార్యరూపములోనికి పరిణతి చెందనీయకుండ అరికట్టి, వాటిని కారణసహితముగ నశింపజేయుటకు తగినశక్తిని పొంది, వాటిని నశింపచేయుటయే విజయమును సంపాదించుట అనగా. దీనిని సాధించగలిగినవాడే యోగి అనబడును. అతడే నిజమైన సుఖి.

సృష్టిలో మానవులందరును సుఖము కావలయుననియే అభిలషింతురు. దానికై ప్రయత్నింతురు. కాని నిజమైన సుఖ

మేదియో దాని నెట్లు సాధించవలయునో తెలియకపోవుటచేత, ప్రాపంచిక విషయోపభోగములయందే సుఖమున్నదను భ్రమతో, ఆ విషయోపభోగములనే కోరుచు వాటికొరకే విశ్రాంతిలేక రాత్రిందివములు ప్రయత్నములు సలుపుచుందురు. తమ ప్రయత్నములకు అడ్డువచ్చినను, తమకు సాహాయ్యము చేయకపోయినను, క్రోధమునకు పాల్పడుదురు. కాని కామ క్రోధములకు వశపడియున్నవారికి ఎన్నటికిని సుఖము దొరకదు.

కామమునకు వశపడినవాడు తన లాభమునకై, తల్లి, తండ్రి, భార్య, పతి, పుత్త్రులు, ధనము, పేరుప్రతిష్ఠలు మొదలగు వాటికొరకును, క్రోధమునకు వశపడినవాడు ఇతరులకు అనిష్టము చేయుటకును, అనేకరకములైన అనర్థములు పాపములు చేయుచుండును. దీనిచే సుఖము లేకపోగా, ఈలోకములో, రోగములు, శోకములు, అవమానములు, అపకీర్తి, అశాంతి, నానావిధములైన బాధలు మొదలగునవి అనుభవించవలయును. పరలోకములో అనేకవిధములైన భయంకర నరకయాతనలను అనుభవించవలయును. తరువాత పశు పక్షి క్రిమి కీటకాది నీచమైన క్షుద్రమైన జన్మలనెత్తి పలువిధములైన క్లేశములను అనుభవించవలయును. ఈ విధముగా సుఖమును పొందకపోగా, సదా మహాదుఃఖములనే పొందుచుండును.

ఈ భోగములన్నియును దుఃఖహేతువులు, క్షణభంగురములు అని తెలిసికొని, కామ క్రోధాది శత్రువర్గముపై

పూర్తి విజయమును పొందినవారు- వారుమాత్రమే- సదా సుఖవంతులుగా ఉందురు. ఈ విషయమే పరమాత్మ ఈ శ్లోకములో ప్రతిపాదించినాడు.

'స సుఖీ నరః' అని ఇక్కడ నరశబ్దము ప్రయోగించబడినది. దీనిచే తెలియవలసిన విశేషమున్నది. కామ క్రోధాది దుర్గుణము లన్నిటిని పూర్తిగ జయించి,బ్రహ్మలోక పర్యంతము లైన సమస్త భోగములందును పరమవైరాగ్యము కలిగి, సచ్చిదానందఘనపరబ్రహ్మమును పొందినవాడే నిజమైన నరుడు. స్త్రీ పురుష వివక్షతో సంబంధము లేదు. అజ్ఞానముచేత మోహితుడై విషయోపభోగములయందలి వ్యసనములో చిక్కుకొని, భగవంతుని మరచిపోయినవాడు, కామ క్రోధాది పరాయణుడై పశు పక్షి శునక సూకరాది జంతువులవలె ఆహారము, నిద్ర, మైథునము, కలహము మొదలగువాటి యందే మగ్నుడై ప్రవర్తించువాడు నరుడు కాడు. నరరూపమున ఉన్న పశువు అని పరమాత్మ భావము.

**అవతారిక:-**

శరీరము ఉండగనే కామక్రోధోద్భవమైన వేగమును అరికట్టినవాడు, నిజమైన సుఖి అని ప్రతిపాదించిన పరమాత్మ, ఆ సుఖస్వరూపమును వివరించుచు, అట్టివాని స్థితినిగూర్చి చెప్పుచున్నాడు ఈ తరువాతి శ్లోకములో.

శ్లో॥ యోఽంతస్సుఖోఽన్తరారామః
తథా న్తర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం
బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ — ౨౪

ప. వి :— యః, అంతస్సుఖః, అంతరారామః, తథా, అంతర్జ్యోతిః, ఏవ, సః, యోగీ, బ్రహ్మనిర్వాణం, బ్రహ్మభూతః, అధిగచ్ఛతి.

టీక :—

యః = ఎవడు,
ఏవ = నిశ్చయముగా,
అంతస్సుఖః = అంతరాత్మగానున్న పరమాత్మయందే సుఖమనుభవించువాడుగాను,
అంతరారామః = అంతరాత్మయైన పరమాత్మయందే ఆనందించువాడుగాను ఉండునో,
యః = ఎవడు,
అంతర్జ్యోతిః = అంతరాత్మయైన పరమాత్మనుగూర్చిన జ్ఞానమే-స్ఫురణయే - గలిగిఉండునో,
సః = అట్టివాడు,
యోగీ = యథార్థమైన భగవదనుభవము కలవాడు-
బ్రహ్మభూతః = బ్రహ్మస్వరూపుడే - అతడు

బ్రహ్మనిర్వాణం = పరిపూర్ణ భగవదనుభవానంద
మును - పరమపదమును,

అధిగచ్ఛతి = పొందుచున్నాడు-

తా. బాహ్యవిషయములకు సంబంధించిన సుఖములకై పరుగులు పెట్టక, తనకు అంతరాత్మగా ఉన్న పరమాత్మయందే సుఖమనుభవించువాడును, అంతరాత్మయైన పరమాత్మయందే ఆనందించువాడును, అంతరాత్మగా వెలుగొందుచున్న ఆ పరమాత్మకు సంబంధించిన జ్ఞానమే - స్పృహయే - కలిగియుండువాడును అగు మహాత్ముడు, యథార్థమైన భగవదనుభవముకల యోగి. అతడు బ్రహ్మస్వరూపుడే. అతడు పరిపూర్ణ భగవదనుభవానందరూపమగు పరమపదమును పొందుచున్నాడు.

అమృతవాహిని :-

యథార్థమైన భగవదనుభవముకల యోగి స్థితినిగూర్చి చెప్పుచున్నాడు పరమాత్మ ఈ శ్లోకములో-"యోఽంతస్సుఖః" అని ప్రారంభించి. అంతరాత్మయైన పరమాత్మయందే సుఖము అనుభవించువాడు అని అర్థము. సుఖము కావలెనని కోరుట జీవ లక్షణము. సర్వజంతువులును అట్లు కోరుచునే ఉన్నవి. కాని, నిజముగ సుఖమును పొందుచున్నవా ? లేదు. ఎందుచేత ? యథార్థమైన సుఖమునకు అవకాశము లేనిచోట సుఖమును గురించి వెదకుచు తమ శక్తియుక్తులను వ్యర్థము చేయుచున్నవి. జంతువులలో శ్రేష్ఠుడు అనబడుచున్న మానవుడు కూడ - కోటికి ఏ ఒకడో తప్ప - అంతకుమించిన వివేకము లేక

వ్యవహరించుచు, యథార్థమైన సుఖమునుండి తననుతానే వంచించుకొనుచున్నాడు.

సుఖము శబ్దస్పర్శరూపరసగంధములు అను బాహ్య విషయములలో ఉన్నదనుకొని యత్నించుటయే ఈ ఆత్మ వంచన. యథార్థమైన సుఖము ఈ బాహ్యవిషయములలో లేదు. ఈ బాహ్యవిషయములవలన కలుగుచున్నది సుఖ భ్రాంతియేగాని యథార్థమైన సుఖముకాదు.

యథార్థమైన సుఖము దేశ కాల పాత్ర అవస్థాదులచేత భంగింపబడదు. మరి విషయానుభవమువల్ల కలిగిన ఈసుఖము అట్లున్నదా ? ఒకే విషయమువలన ఒక ప్రదేశమున సుఖము పొందినవాడే, అదే విషయమువలన మరొక ప్రదేశమున దుఃఖము పొందుచున్నాడు. ఒక విషయమువలన ఒక కాలమున సుఖమును పొందినవాడు, మరొక కాలమున అదే విషయము వలన దుఃఖము పొందుచున్నాడు. ఒకనికి సుఖదాయకమైన విషయమే మరొకనికి దుఃఖదాయకము అగుచున్నది. ఒక అవస్థలో సుఖము కలిగించిన విషయమే మరొక అవస్థలో దుఃఖము కలిగించుచున్నది. అందుచేతనే బాహ్యవిషయముల వలన- అనగా శబ్ద స్పర్శ రూప రస గంధముల వలన- కలుగు నది సుఖభ్రాంతి కాని యథార్థమైన సుఖముకాదు.

సుఖముకొరకై బాహ్యవిషయములపై ఆధారపడక యథార్థమైన సుఖము - దేశ కాల పాత్ర అవస్థాదులచే

భంగింపబడని సుఖము - భగవదనుగ్రహమువలన, భగవదను భవమువలన కలుగునని గ్రహించి, ఆశ్రయించి, తనకు అంత ర్యామిగా ఉన్న ఆ పరమాత్మయందే సుఖము అనుభవించు వాడు 'అంతస్సుఖుడు'.

అనాదిగా జననమరణరూప సంసారచక్రమున పరి భ్రమించుచు, అవిరతముగ విశ్రాంతిచెందుచున్న - శ్రమించు చున్న-జీవికి, ఏనాటికైన ఈ సంసారచక్రపరిభ్రమణము ముగిసిననాడే విశ్రాంతి. రంగులరాట్నమున కూర్చుండి, ఆ రంగులరాట్నముయొక్క వేగమువలన కనులుతిరుగుచున్న బాలునికి ఆ కనులుతిరుగుట ఎట్లు తప్పును ? రంగులరాట్నము తిరుగుట మానినప్పుడుకదా ! తిరుగుట ఆగినది - విశ్రాంతి లభించినది. అనగా దుఃఖము పోయినది. అది చాలదు. దుఃఖ నివృత్తి ఒకటేకాదు కావలసినది - ఆనందప్రాప్తికూడ కావలయును. బాలునికి కనులుతిరుగుటకు కారణమైన రంగుల రాట్నముయొక్క చలనము ఆగినది. ఆ కనులుతిరుగుట పోయినది. కాని, అదే కాదు. బాలునికి కావలసినది. ఆ రంగుల రాట్నమునుండి విడివడి తన తల్లి ఒడిలోనికి చేరవలయును. అప్పుడుగాని యథార్థమైన ఆనందమును పొందలేడు. రంగుల రాట్నము ఆగుట దుఃఖనివృత్తి; తల్లి ఒడిలోచేరుట ఆనంద ప్రాప్తి. అట్లే జననమరణరూపసంసారచక్ర పరిభ్రమణము

అగుటొక్కటేకాదు కావలసినది - భగవత్ప్రాప్తిరూపమైన యథార్థమైన ఆనందము లభించవలయును. అంతరాత్మగా ఉన్న పరమాత్మనుగుర్తించి, ఆశ్రయించి, అట్టి ఆనందమును అనుభవించువాడు 'అంతరారాముడు'.

అంతరాత్మగా ఉన్న ఆ పరమాత్మనుగూర్చిన జ్ఞానము- స్పృహ- తప్ప, ఇతర స్పృహలేనివాడు 'అంతర్జ్యోతి'.

అట్టివానికి ఇతరస్పృహ ఉండదు. శరీరము ఉన్నంత వరకు పరమాత్మసంకల్పము ప్రకారము ఆ శరీరముద్వారా జరుగవలసిన అన్నిపనులు జరిగిపోవుచునే ఉండును-అయితే, అతనికి ఆయాపనులు చేయవలయును అను సంకల్పముకాని, అవి తనద్వారా జరుగుచున్నవి అను స్పృహకాని ఉండదు. సర్వకాలసర్వావస్థలయందును అంతరాత్మగా ఉన్న ఆ పరమాత్మకు సంబంధించిన జ్ఞానములోనే- స్పృహలోనే- మునిగి ఉండును.

"పానీయంబులు ద్రావుచున్ కుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచున్ నడచుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానత"

కల ప్రహ్లాదునిస్థితి అట్టిది. అదే యథార్థమైన యోగము. అట్టివాడే యథార్థమైనయోగి.

యథార్థమైనయోగి బ్రహ్మభూతుడే, బ్రహ్మస్వరూపుడే. కొలిమిలో బాగుగకాలి ఎఱ్ఱవారిన ఇనుపగుండు,

వస్తుతః ఇనుపగుండే అయినను, అగ్నిగోళమే అగుచున్నది కదా! దానిని సమీపించిన, స్పృశించిన అగ్నియే అనుభవము లోనికి వచ్చుచున్నది కాని, అయస్తత్త్వము కాదుకదా! అట్లే బ్రహ్మభూతుడైన అట్టి మహాత్ముని సాహచర్య సాన్నిధ్య ములు భగవత్సాహచర్య సాన్నిధ్యములుగనే ఫలించును. అందుచేతనే అట్టివానిని బ్రహ్మభూతుడు అనినాడు పరమాత్మ. బ్రహ్మభూతుడైన అట్టి యోగి బ్రహ్మనిర్వాణమును - పరిపూర్ణ భగవదనుభవానందమును - బ్రహ్మానందమును - పొందును.

ఈ శ్లోకమునందలి "అంతస్సుఖః" "అంతరారామః" "అంతర్జ్యోతిః" అను వానిలోని 'అంతః' అను పదమునకు తనకు అంతరాత్మగా ఉన్న పరమాత్మయందే - అన్న అర్థమేకాక, సర్వసృష్టిలోను వ్యాపించి, సర్వాంతర్యామిగా ఉన్న - అని కూడా చెప్పుకొనవచ్చును. నిజమునకు ఈ రెండు అర్థములు పరస్పరవిరుద్ధములు కాకపోవుటేకాదు, పరస్పరపోషకములు కూడ.

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణ
మృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మాన
స్సర్వభూతహితే రతాః ॥ —౨౫

ప. వి :— లభన్తే, బ్రహ్మనిర్వాణం, ఋషయః, క్షీణకల్మషాః, ఛిన్నద్వైధాః, యతాత్మానః, సర్వభూతహితేరతాః.

టీక :—

క్షీణకల్మషాః = సర్వపాపములు నశించినట్టియును,
ఛిన్నద్వైధాః = ఛిన్నాభిన్నము చేయబడిన శీతోష్ణాది ద్వంద్వములును, సందేహములును కలిగినట్టియును,
యతాత్మానః = నియమించబడిన మనస్సు కలిగినట్టియును,
సర్వభూతహితేరతాః = సర్వభూతముల విషయమునను హితమునే కోరుచు ప్రవర్తించునట్టియును,
ఋషయః = ద్రష్టలైన మహాత్ములు,
బ్రహ్మనిర్వాణం = పరబ్రహ్మప్రాప్తిని,
లభన్తే = పొందుచున్నారు.

తా. శీతోష్ణాది ద్వంద్వములను, సకలసందేహములను, సమూలముగ జయించి మనస్సును పరమాత్మధ్యానమందే నియమించి, సర్వభూతములకును హితమునేకోరి ప్రవర్తించుచు, ఇట్టి యోగాచరణము వలన భగవదనుభవమునకు విరోధరూపములగు సర్వకల్మషములు నశించినవారై మహాత్ములు - ద్రష్టలు - పరిపూర్ణ భగవదనుభవమును పొందుచున్నారు.

## అమృతవాహిని :—

'క్షీణకల్మషాః' అనగా పుణ్యపాపరూపమైన సర్వకల్మషములు నశించినవారు అని అర్థము. కల్మషము అనగా పాప

మొక టేకాదు, పరిపూర్ణ భగవదనుభవమునకు - మోక్షము నకు ఆటంకము కలిగించు పుణ్యమును కల్మషమే. అందుచే పాపము చేయకుండుటేకాక, కామ్యకర్మలుకూడ కాక, కేవలము భగవత్సేవారూపకర్మ చేయు నిష్కామకర్మ యోగులు క్షీణకల్మషులు.

'ఛిన్నద్వైధాః' అనగా ద్వంద్వములను జయించినవారు అని అర్థము. ద్వంద్వములు అనగా శీతోష్ణాదులు, సుఖదుఃఖాదులు. 'శీతోష్ణ సుఖదుఃఖేషు సమః' అన్నట్లు, అన్నిటిని సమముగా చూడగలిగినవారు ద్వంద్వములను జయించినవారు అనవచ్చును. శీతోష్ణములను సమముగ చూడవచ్చును. కష్ట సుఖములనుగూడ సమముగా స్వీకరింపవచ్చును. కాని, మానావమానములను సమముగా చూచుట, స్వీకరించుట, కష్టతరము. కీర్తికాంక్ష, గౌరవముపై అభిమానము - చిట్ట చివరివరకు అంటిపెట్టుకొని ఉండునవి. మానావమానములు గూడ సమముగ చూడగలిగిననాడుగాని ద్వంద్వాతీతుడు కాడు. అట్టి ద్వంద్వాతీతస్థితిని అధిగమించినవారు - అనగా పొందినవారు - 'ఛిన్నద్వైధాః' -

'యతాత్మానః' అనగా నియమించబడిన మనస్సు కల వారు అని అర్థము. శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములను సమముగ చూడవలయును కనుక, సమముగ

చూచు ప్రయత్నము చేయుట, చూచుట - అనికాక, మనస్సునందు ఆస్పృహాయే రానిస్థితి సాధించవలయును. ఒకదానియందు ఇష్టము, మరొకదానియందు అనిష్టము, ఇట్టి ఇష్టానిష్టములు, రాగద్వేషములు, మూలముట్టుగ నశించి, ఎల్లవేళల భగవద్ధ్యానమున నిలిచిన, సర్వమునందును పరమాత్మనే దర్శింపగలిగిన మనస్సుకలవారు 'యతాత్మానః'.

అట్టివారి చర్యలన్నియు కేవలము సర్వభూతములకు హితమును కూర్చునివిగ ఉండుటలో ఆశ్చర్యములేదు. వారికి స్వసంకల్పమే ఉండదు. వారు కర్తలుకారు. వారి దేహేంద్రియాదులు నిమిత్తములుగ చేసికొని, పరమాత్మయే వ్యవహరించుచుండును. బాహ్యదృష్టికి వారుచేయుచున్నట్లు కనబడినను, చేయునది వారుకాదు - పరమాత్మయే. కాని, వ్యావహారికముగ చెప్పవలసివచ్చినప్పుడు వారు చేసినట్లే చెప్పబడును. కనుక 'సర్వభూతహితేరతాః' అని చెప్పబడినది.

అట్టివారు ఋషులు-ద్రష్టలు-పై లక్షణములుకల ద్రష్టలైన ఋషులు పరిపూర్ణ పరబ్రహ్మానుభవమును - బ్రహ్మనిర్వాణమును - పొందుచున్నారు అని వివరించుచున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

శ్లో॥ కామక్రోధ వియుక్తానాం
యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం
వర్తతే విదితాత్మనామ్ ॥ ౨౬

ప. వి :— కామక్రోధవియుక్తానాం, యతీనాం, యతచేతసామ్, అభితః, బ్రహ్మనిర్వాణం, వర్తతే, విదితాత్మనామ్.

టీక :—

కామక్రోధవియుక్తానాం = కామక్రోధములను పూర్తిగ విడిచినట్టియు,
యతచేతసాం = మనస్సును జయించినట్టియు,
విదితాత్మనాం = ఆత్మజ్ఞానము పరిపూర్ణముగా కలిగినట్టియు,
యతీనాం = యతీశ్వరులకు,
బ్రహ్మనిర్వాణం = పరిపూర్ణ భగవదనుభవరూపమైన ముక్తి,
అభితః = సర్వత్ర,
వర్తతే = కలుగుచున్నది.

తా. కామక్రోధములను పరిపూర్ణముగ విడిచినట్టియు, మనో జయము సాధించినట్టియు, ఆత్మజ్ఞానము లభించినట్టియును యతీశ్వరులకు పరిపూర్ణ భగవదనుభవరూపముక్తి సర్వత్ర - దేశకాల పాత్రాది భేదములేకయే - కలుగుచున్నది.

**అ మృ త వా హి ని :-**

కామక్రోధాదులను పూర్తిగా విడుచుట యతులకు ప్రథమము, ప్రధానము అగు లక్షణము. సర్వదుర్గుణములకును మూలకారణము కామమే. కామమే క్రోధముగా పరిణమించుచున్నది. ఈ కామక్రోధవికారములే తక్కిన దుర్గుణములన్నియును. "కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః, మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్" 'పాపము చేయుటకు కారణమైనది కామము. ఈ కామమే క్రోధముగా పరిణమించుచున్నది. ఇది రజోగుణముచేత పుట్టినది. ఎంత తినినను కడుపునిండుట లేనిది; మోక్షసంపాదనకు కృషి చేయువానికి ఇది గొప్ప శత్రువు అని తెలిసికొనుము' అనియును, "ధూమే నావ్రియతే వహ్నిః యథాదర్శో మలేనచ, యథోల్బే నావృతో గర్భః తథా తే నేద మావృతమ్" 'పొగచేత అగ్నియును, మలినముచేత అద్దమును, మావిచేత గర్భమును ఆవరింపబడినట్లు ఈ కామముచేత ప్రాణికోటి అంతయును ఆవరింపబడియున్నది' అనియును మూడవ అధ్యాయమున హెచ్చరించినాడు పరమాత్మ.

కామమువలన క్రోధము పుట్టుచున్నది అనుటకంటె, కామమే క్రోధముగా పరిణమించుచున్నది అనుట మేలు. అట్టి కామక్రోధములను మూలముట్టుగా విడువనినాడు యతి అగుటెట్లు ? అంతేకాదు - 'యతచేతసాం' నియమింపబడిన

మనస్సు కలవారు యతచేతసులు. విడువవలసినవి విడుచుటతో పాటు, అవలంబింపవలసినవి అవలంబించుటకూడ విధికదా! విడువనున్నవి విడుచుటకును అవలంబింపనున్నవి అవలంబించుటకును మనస్సు అధీనమునందుంచవలయును. అట్లు మనస్సును అధీనమునందుంచుకొనినవారు యతచేతసులు. కామక్రోధములను విడుచుటతోపాటు భగవద్ధ్యానమున నిలుచుటకూడ జరిగిననాడు వారు యతచేతసులు అనబడుదురు.

తరువాతి లక్షణము విదితాత్మత. భగవద్ధ్యానమునందు మనస్సు నిలువవలెనన్న భగవత్స్వరూపమునుగూర్చి - తత్త్వమునుగూర్చి - స్పష్టమైన అవగాహన అవసరము. భగవత్తత్త్వమునుగూర్చిన స్పష్టమైన అవగాహన లేనిచో, తక్కిన అన్ని సాధనలను సక్రమముగా చేసినను పూర్ణఫలము లభింపదు. స్పష్టమగు అట్టి అవగాహన కలుగుట భగవదనుగ్రహమువలన కాని సాధ్యముకాదు. ఆయనకు సంపూర్ణ శరణాగతి చేసిన వారికిగాని అట్టి అనుగ్రహము లభింపదు. ఫలితార్థము - సంపూర్ణముగ శరణాగతిచేసి, భగవదనుగ్రహము లభించి, తత్ఫలముగ, భగవత్తత్త్వమునుగూర్చిన స్పష్టమైన అవగాహన పొందినవారే - విదితమైన ఆత్మస్వరూపము కలవారే - అనగా పరమాత్మస్వరూపము కలవారే - విదితాత్ములు.

ఇచ్చట 'విజితాత్మనాం' అన్న పాఠాంతరము గలదు. జయింపబడిన మనస్సుగలవారు అని చెప్పుకొనవచ్చును.

మనస్సును నియమించినవారు యతచేతసులు; జయించినవారు విజితాత్ములు. నియమించుటకంటె జయించుట పైదికదా! కనుక పునరుక్తి లేదు. అంతేకాక, జయింపబడిన పరమాత్మ తత్త్వము కలవారు అని చెప్పినను అనౌచిత్యము లేదు. కేవలము అనుగ్రహస్వరూపుడగు పరమాత్మ భక్తులచేతిలో జయింపబడుటకే, వారు చెప్పినట్లు నడచుకొనుటకే సిద్ధముగ ఉండునుగదా! "అహం భక్తపరాధీనః అస్వతంత్రఇవ ద్విజ" అన్న భాగవతసూక్తియును, "గీత్వాతు మమనామాని నర్తయే న్మమ సన్నిధౌ, ఇదం బ్రవీమి తే సత్యం క్రీతోఽహం తేన చార్జున!" 'నా నామసంకీర్తన చేయుచు నృత్యముచేయు వానికి నేను అమ్ముడుపోవుచున్నాను' అన్న ప్రతిజ్ఞయును ఇచ్చట స్మరింపదగినవి. అట్టివారికి బ్రహ్మనిర్వాణము - పరిపూర్ణ పరబ్రహ్మానుభవరూపదివ్యానుభూతి-ముక్తి- 'అభితః' అనగా సర్వత్ర - ఎచ్చటబడిన అచ్చటనే - దేశ కాల అవస్థాది నియమములు లేకుండ లభించును.

ఇచ్చట 'అభితః' అనుపదము చాలప్రధానమై పరిపూర్ణ భగవదనుభవరూపముక్తి కేవలము శరీరపతనానంతరమున లభించును అను భావమును త్రోసివేయుటకై పరమాత్మచేత ప్రయోగింపబడినది. ఇచ్చట ఈ పదమేగాక పందొమ్మిదవ శ్లోకమున "ఇహైవ తైర్జిత స్సర్గః" అనియును, రాబోవు ఇరువది ఎనిమిదవ శ్లోకమున 'యస్సదా ముక్త ఏవ సః' అనియును

కూడ వివరించుటద్వారా ఈ విషయమునే నొక్కిచెప్పు చున్నాడు పరమాత్మ.

అయితే విశిష్టాద్వైతదర్శనము జీవన్ముక్తస్థితిని ఒప్పలేదని భావము లోకమున కలదు. మతాంతరులేకాక విశిష్టాద్వైత పండితులును పెక్కురు ఇట్లే అనుచున్నారు. కాని భగవద్రామానుజ భాష్యములు ఆధారముగ విచారించినచో ఈవాదము నిలువదనియును, జీవన్ముక్తిపదము ఉపయోగింపకపోయినను, వీరు భావించునట్లు భగవద్రామానుజులు జీవన్ముక్తస్థితిని గూర్చి విరుద్ధాభిప్రాయము కలవారుకారనియును స్పష్టపడును.

'ఇహైవ తైర్జితస్సర్గః' అన్నచోట భగవద్రామానుజులు 'సాధనానుష్ఠానదశాయామేవ తైః సర్గోజితః సంసారోజితః' అని వ్యాఖ్యానించిరి. 'యస్సదాముక్త ఏవసః' అనుదానిని 'సాధ్య దశాయామివ సాధనదశాయామపి ముక్తఏవ సః' అని వ్యాఖ్యానించిరి. పై పంక్తులలోని 'సాధనానుష్ఠానదశ' 'సాధనదశ' అన్నపదములు ఆధారముగా సాధ్యదశయందలి అనుభవము సాధనయందు కలుగుట అసంగతము కనుక ఇచ్చట 'సంసారోజితః' అనగా 'జితప్రాయః' అనియును, 'సదా ముక్తఏవ' అనగా 'ముక్తప్రాయ ఏవ' అనియును చెప్పుచున్నారు చాల మంది పెద్దలు.

సాధ్యదశ అనగా పొందదగినస్థితి అని అర్థము. పొంద దగినస్థితి ఏది? శరీరపతనానంతరము అప్రాకృతము, పంచోపనిష

స్మయము అగు స్థానవిశేషము - పరమపదము - పొంది, నిత్యసూరులతో కలిసి సాయుజ్యము క్తినందుట - ఇది సాధ్య దశ. సాధనదశ అనగా సాధనకు ఆధారభూతమగు శరీరగతస్థితి. ఈ శరీరగతస్థితిలో భగవత్సేవారూపముగా చేయు దినచర్యాను ష్ఠానము. సాధనదశ అనినను, సాధనానుష్ఠానదశ అనినను ఇట్లు అన్వయించుట యుక్తము. పరమపదమును పొందినప్పుడు సంసారము ఎట్లు జితము అని చెప్పబడునో, ఇచ్చట శరీరగత స్థితిలో, భగవత్సేవారూపయజ్ఞముగ జీవితము గడుపుచున్నను, అట్లే సంసారము జితము. అట్టివానికి బంధనము లేదు అని అర్థము. బంధనము లేకుండుట ముక్తి అనుటలో తప్పేమి ? సాధ్యదశయందు ఎట్లు ముక్తుడో సాధనదశయందును అట్లే ముక్తుడు అని నిష్కర్షగా భగవద్రామానుజులు చెప్పు చున్నారు. అనగా పరమపదము పొందినవారు ఎట్లు ముక్తులో, ఇట్టిస్థితి పొందినవారు శరీరగతస్థితిలో ఉన్నను అట్లు ముక్తులే అనియే దానిభావము.

సాధనానుష్ఠానదశ అనగా శరీరగతస్థితి అనుటకుకూడ భగవద్రామానుజుల భాష్యమున ఆధారము కలదు. ఈ అయిదవ అధ్యాయమునందే "శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్" అన్న శ్లోకమునకు భాష్యము వ్రాయుచు 'శరీరవిమోక్షణాత్ ప్రాగిహైవ - సాధనాను ష్ఠాన దశాయామేవ' 'శరీరవిమోక్షణమునకు ముందే -

అనగా సాధనానుష్ఠానదశయందే' - అని వివరించిరి. దానిని బట్టి పై అన్వయము సవ్యమైనదే అని స్పష్టపడుచున్నది.

అయితే ఈ 'శక్నో తీహైవ...' అన్న శ్లోకవ్యాఖ్యలో చివర 'స యుక్తః - ఆత్మానుభవాయ అర్హః; సఏవ శరీర విమోక్షణోత్తరకాల మాత్మానుభవైకసుఖః సంపత్స్యతే' అని వ్రాసిరి. దీనినిబట్టి ఆత్మానుభవమునకు - అనగా భగవదనుభవమునకు - అర్హత శరీరము ఉండగనే కలిగినను, గభవదనుభవరూపమోక్షము శరీరవిమోక్షణానంతరమే కలుగును అని తెలుచున్నది కదా అన్న పూర్వపక్షము రావచ్చును. కాని ఇచ్చట జాగ్రత్తతో పరిశీలించినచో అట్టి పూర్వపక్షమునకు అవకాశము ఉండదు. అర్హత కలిగినతరువాత ఫలప్రాప్తికి విలంబనము ఉండదు భగవద్రాజ్యములో. భగవదనుభవార్హత కలిగిన క్షణమునందే అనుభవము కలిగితీర వలయును. భగవదనుభవము పొందినవానిని బాధింపగల ప్రజ్ఞ ప్రకృతికే ఉన్నచో, ప్రకృతి భగవంతునికంటె శక్తి సంపన్నమైనదిగా చెప్పవలసివచ్చును. విడువవలసిన ప్రకృతి బాధ విడిచినతరువాత, కలుగవలసిన భగవదనుభవము కలిగినతరువాత, ఇంకను ఆతనిని బద్ధుడే అనుట అసంగతము. మరి అప్రాకృతము, పంచోపనిషన్మయము అయిన పరమపద లోకమునకు పోవుట మిగిలినది కదా అనిన, అందుచేతనే 'జీవత్' అను విశేషణము ముందుంచబడినది. ఆ భేదము

అనుభవమున లేదు. ఇప్పుడు శరీరగతుడై యుండియును ప్రకృతి బాధ లేనివాడు, భగవదనుభవానందము కలవాడు. అప్పుడు శరీరము లేదు. ఆ అప్రాకృత పరమపదమున ఈ ప్రకృతిబాధ లేక, భగవదనుభవానందము కలవాడు. భేదమొక్కటే - శరీరగతస్థితి, రహితస్థితి.

ఇక - 'శరీర విమోక్షణోత్తరకాల మాత్మానుభవైక సుఖః సంపత్స్యతే' అన్నచోట 'ఏక' అన్నపదము ప్రధానముగ గమనింపవలయును. పరమపదమునందు భగవదనుభవానంద మున - బ్రహ్మానందమున - ఓలలాడుటతప్ప, దాసస్ప్రహాతో కింకరభావముతో ఆయనచేత అనుభవింపబడుటతప్ప వేరుగ అనుష్ఠానము లేదు. కర్మలేదు. అందుచే శరీర విమోక్షణోత్తర కాలమందు ఆత్మానుభవైకసుఖము - అనుభవము తక్క వేరొకటి లేనిసుఖము - పొందును. శరీర విమోక్షణా త్పూర్వము సేవారూపయజ్ఞముగ, స్వసంకల్పము లేకయే, పర మాత్మ చేతిలో పరికరమాత్రముగ ఉపయోగపడుచు ఉండును. "పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్...... సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుండై" ఏతద్విశ్వమును మరచిన ప్రహ్లాదునిస్థితిలో ఉండును అన్నమాట. అందుచేతనే శరీరగతస్థితిలోని ఈ తక్కిన వేవియును లేకుండుటను సూచించుచు 'ఆత్మానుభవైక సుఖః సంపత్స్యతే' అనినారు భగవద్రామానుజులు.

ఇదికాక శ్రీభాష్యమున నాల్గవ అధ్యాయము రెండవ పాదమందలి ఏడవ సూత్రము - "సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య" అన్నదానికి భాష్యము వ్రాయుచు, ఉత్క్రమణము పండిత పామరులకు సమానమే అని సిద్ధాంతము చేసినారు. ఆ సందర్భమున ముందుగ పూర్వపక్షవాదము ప్రతిపాదించుచు "ఇయ ముత్క్రాన్తిః కిం విద్వ దవిదుషో స్సమానా ? ఉత అవిదుష ఏవేతి చింతాయాం అవిదుష ఏవేతి ప్రాప్తం; కుతః ? విదుషోఽత్రైవ అమృతత్వవచనాత్ ఉత్క్రాన్త్యభావాత్ విదుషోహ్యత్రైవ అమృతత్వంశ్రూయ్యతే యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది స్థితాః, అథ మర్త్యోఽమృతో భవతి అత్ర బ్రహ్మ సమశ్నుత ఇతి-ఏవం ప్రాప్తే అభిధీయతే 'సమానా చాసృత్యుపక్రమాత్' ఇతి - విదుషో ప్యాసృత్యుపక్రమాత్ ఉత్క్రాన్తి స్సమానా" అని సిద్ధాంతీకరించిరి. పండితులకు, పామరులకు కూడ నాడీ ప్రవేశమునకు ముందు ఉత్క్రాన్తి సమానమే. నాడీప్రవేశసమయమున పామరులకు నూటఒక్కనాడులలో ఏదో ఒకనాడి ద్వారమున ఉత్క్రమణము జరుగవచ్చును. కాని, పండితులకు శిరస్సును భేదించుకొనిపోవు సుషుమ్న అను నాడీవిశేషము ద్వారా ఉత్క్రమణము సిద్ధించుచున్నది. అదే భేదము. మొత్తముమీద ఉత్క్రమణము పండితులకును అనివార్యము అని భగవద్రామానుజుల సిద్ధాంత సారాంశము.

పండితులకు ఉత్క్రాన్తిలేదు అనువారు కాఠకశ్రుతి ప్రమాణముగ చూపుటచే, వీరును ఉత్క్రమణము కలదు

అనుటకు మరొక కారకశ్రుతినే ప్రమాణముగ చూపుచు, పూర్వపక్షులు ఉదాహరించిన శ్రుతిని కాదనకుండ, దానిని కూడ ఈ సిద్ధాంతమునకు అనుకూలముగ వ్యాఖ్యానించి సమన్వయపరచినారు. ఈ సందర్భమున ఆ శ్రుతియందున్న "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అనుదానిని సమన్వయించుచు, "ఉపాసన వేలాయాం యో బ్రహ్మానుభవః తద్విషయమి త్యభిప్రాయః" అని వివరించిరి.

ఇచ్చటనే బ్రహ్మమును పొందును అన్నమాటకు ఉపాసన వేళలో కలుగు బ్రహ్మానుభవమే ఇచ్చట ఉద్దేశింపబడినది- అని భగవద్రామానుజులు వ్రాయుటచే సర్వకాల సర్వావస్థల యందును తెంపులేని పరబ్రహ్మానుభవము జీవించియుండగా సాధ్యము కాదనియును పరిమితమైన ఉపాసన వేళలో కలుగు తాత్కాలికానుభూతియే ఆ మంత్రమున ఉద్దేశింపబడినది అనియును భగవద్రామానుజుల అభిప్రాయముగా కొందరు వ్యాఖ్యానించుచున్నారు.

కాని అది సరికాదు అనిపించును.

ఉపాసన వేళ అనియును, కాని వేళ అనియును రెండు వేళలు ఉండవు యోగికి. తొమ్మిదవ అధ్యాయమున "సతతం కీర్తయంతో మాం" అన్న శ్లోకమును వ్యాఖ్యానించుచు "అత్యర్థ మత్ప్రియత్వేన మత్కీర్తన యతన నమస్కారై

ర్వినా క్షణానుమాత్రేఽప్యాత్మధారణ మలభమానాః మద్గుణ విశేషవాచీని నామాని శ్రుత్వా పులకాంచిత సర్వాంగాః హర్ష గద్గదకంఠాః నారాయణ కృష్ణ వాసుదేవ ఇత్యేవ మాదీనినామాని సతతం కీర్తయంతః" అన్న భగవద్రామానుజుల దృష్టిలో అట్టియోగికి ఉపాసనవేళ కానివేళ ఎట్లుండును? పరమపదగతస్థితిలో అనుభూతితక్క ఉపాసన ఉండదు. అందు చేత శరీరగతస్థితిని ఉద్దేశించి వాడినదే ఉపాసనవేళ అన్న పదము. ఫలితార్థము-భగవద్రామానుజుల దృష్టిలో సాధనదశలు, ఉపాసనవేళ అనునవి శరీరగతస్థితిని తెలియజేయుపదములు.

అయితే "తదాపీతేస్సంసార వ్యపదేశాత్" (౪-౨-౮) అన్న సూత్రమును వ్యాఖ్యానించుచు "అపీతి - అప్యయః బ్రహ్మప్రాప్తిః సాచార్చిరాదినా మార్గేణ దేశవిశేషం గత్వా ఇతి వక్ష్యతే. అతిదవస్థాప్రాప్తేః సంసారః - దేహ సంబంధ లక్షణోహి వ్యపదిశ్యతే తస్య 'తావదేవ చిరం యావ న్నవిమోక్ష్యేఽథ సంపత్స్యే' ఇతి. అశ్వఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవానీతి" అని వ్రాసిరి.

దీనినిబట్టి వారిభావము మరొకవిధముగ చెప్పవచ్చు ననుటకు వీలులేదు. ఏలయన, ఈ సందర్భమందు చర్చ ముఖ్య ముగ 'విద్వాంసులకు సైతము ఉత్క్రమణము కలదు' అనుటను

సమర్థించుచు సాగినది. ప్రధానాశయము ఉత్క్రమణము కలదో లేదా అనునదే కాని, శరీరగతుడై ఉండగా భగవదనుభవము సంభవమా కాదా అనునది కాదు. 'అతదవస్థాప్రాప్తేస్సంసారః' అనుచోట సంసారమనగా దేహసంబంధము - దేహముతో కూడి ఉండుట. దేహముతో సంబంధము - కూడి ఉండుటవరకు - కాదనినవారెవరు ? జీవన్ముక్తి అంగీకరించినవారుమాత్రము ప్రారబ్ధపూర్తివరకు శరీరగతస్థితి అనివార్యమని అంగీకరింపలేదా ? కాగా, శరీరమునందు ఉన్నను, ఆ స్పృహ - సంగము - ఉండదు గనుక అది బంధనముగ అనిపించదు. అనిపించకపోవుటే కాదు - అది బంధనముకాదు.

"సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః (౪-౨-౯) అను తరువాతి సూత్రవ్యాఖ్యానములోకల 'ఇతశ్చ విదుషోఽపి బన్ధో నాత్ర దగ్ధః యతః సూక్ష్మశరీర మనువర్తతే' అనుపంక్తిలోని బంధశబ్దమునకు శరీరముతో కూడి ఉనికి అనియే భావము. పూర్వసూత్ర వ్యాఖ్యలోని 'తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే' అన్నశ్రుతిలో ప్రాదేశిక పరమపద ప్రాప్తి ఉద్దేశింపబడినదే కాని, భగవదనుభవ జనితానంద ప్రాప్తికాదు.

విద్యాప్రాప్తికి ఫలముగ ఉత్తరపూర్వాఘముల - అనగా ఆగామిసంచితముల - అశ్లేషవినాశము చెప్పి, విద్యా

మాహాత్మ్యముచే నశింపక ప్రారబ్ధమే శరీరస్థితి హేతుభూతముగ ఉండును అని వివరించిరి. సంచితాగాములు బ్రహ్మవిద్యా మాహాత్మ్యముచే నశింపగా, ప్రారబ్ధము అనుభవముచే నశింపగా, ఇక అతనికి పాపము ఎట్లుండును? "అశ్వఇవ రోమాణి విధూయ పాపం, చంద్రఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య......" అన్నచోట చెప్పబడిన పాప మెక్కడిది? నిజమునకు అది పాపముకాదు. శరీరముతోడి సంబంధమే అచ్చట పాపముగా నిర్దేశింపబడినది. అట్లే "ఇతరశ్చ విదుషోఽపి బంధో నాత్రదగ్ధః" అన్నచోటకూడ బంధము అనగా సూక్ష్మశరీరముతో కూడిన ఉనికి అనియే అర్థము. అది బంధముకాదా అనిన, సర్వదా, సర్వథా ఆత్మావలోకనశీలుడై ఉండువానికి శరీరస్పృహ ఉండినగదా బంధము! అట్టిస్పృహయే లేనివారికి బంధ మెచ్చట? కాదు- ఇచ్చట 'బంధః' అని వాడబడినది గనుక బంధము అనియే చెప్పవలయును అనినచో, 'సంసారోజితః' - సంసారము జయింపబడినది - అన్నచోట జితప్రాయమని ఏల చెప్పవలయును? ఇట్టి సందర్భములలో భగవద్రామానుజుల యథార్థాభిప్రాయము ఏది అను జిజ్ఞాసతో వ్యవహరింపవల యును. కేవలము రామానుజుల గ్రంథములను పరిశీలించినచో, వారు జీవన్ముక్తి అన్నపదము వాడకపోయినను అట్టి అను భవముయొక్క ఉనికిని వ్యతిరేకింపలేదనియును, విద్వాంసునికి ఉత్క్రమణమే లేదు అను వాదమును ఖండించు సందర్భమున వచ్చిన ఈచర్చను ఈవిధముగ సమన్వయము చేసికొనవలయు ననియును అమృతవాహిని అభిప్రాయము.

అట్టి అనుభవము కలిగినవాడు జన్మరాహిత్యమును, ప్రాదేశిక పరమపదప్రాప్తినికూడ ఇచ్ఛగింపడు. అందుచేతనే కులశేఖరులు "నాస్థాధర్మే......" అన్న శ్లోకములో వరుసగా ధర్మార్థకామములను త్రోసిపుచ్చి, అంతటితో ఆగక "జన్మ జన్మాంతరేఽపి......" అనుటమూలమున జన్మరాహిత్య రూపమును, *అగు ముక్తిని సైతము తిరస్కరించినారు. ఎట్టి అనుభవము కలిగినను, శరీరగతస్థితి బంధనమే అను సిద్ధాంతమే అంగీకరించినచో, కులశేఖరులు బంధనమునే కోరుకొనిరని చెప్పవలయును. అది సరికాదు. భగవదనుగ్రహామువలన ఆ అనుభూతి కలిగిన క్షణమునుండి, ఇక ప్రకృతి ఆతనిని ఏమియు చేయలేదు. అతనికి పతనభయమును లేదు. అనుభవము పరమ పదమునందలి అనుభవమునకు అభిన్నమైనది. ఇక ఈ శరీర ముతో ఉన్నచో, ఇతర చేతనులకు సేవచేయు అవకాశము అధికముగ కలదు - కనుకనే వారు అట్లు సెలవిచ్చిరి.

జీవన్ముక్తులు అన్నపదము భగవద్రామానుజులు ఉప యోగించలేదు. కాని రామానుజుల అవతారమే అని విశ్వసింప బడుచున్న మనవాళమహాముని ఆస్థానమందలి అష్టదిగ్గ జములలో ఒకరు- ఎరుంబి అప్పా అనువారు 'విలక్షణమోక్షాధి కారి నిర్ణయము' అను తమ గ్రంథములో జీవన్ముక్తులు అను పదమునుగూడ ప్రయోగించినారు. *

* 'విలక్షణ మోక్షాధికారి నిర్ణయము' యొక్క ఆంధ్రానువాదమునుబట్టి ఇది వ్రాయుచున్నాము. మూల తమిళగ్రంథము చూచుట సందర్భ పడలేదు. - వ్యాఖ్యాత.

* ప్రాదేశిక పరమపద ప్రాప్తిరూపమును

సారాంశముగ ఈ శ్లోకమున 'అభితః' అనుట మూలమున కృష్ణపరమాత్మ దేశకాల అవస్థాది నియమములు లేకయే భగవదనుభవమును ప్రతిపాదించినాడు అని అమృత వాహిని అభిప్రాయము.

శ్లో॥ స్పర్శా న్కృత్వా బహి ర్బాహ్యాన్
చక్షుశ్చై వాంతరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యంతర చారిణౌ ॥ ౨౭

శ్లో॥ యతేంద్రియమనోబుద్ధిః
ముని ర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛా భయక్రోధః
య స్సదా ముక్త ఏవ సః ॥ ౨౮

ప. వి :—స్పర్శాన్, కృత్వా, బహిః, బాహ్యాన్, చక్షుః, చ, ఏవ, అంతరే, భ్రువోః, ప్రాణపానౌ, సమౌ, కృత్వా, నాసాభ్యంతరచారిణౌ. ౨౭

ప. వి :—యతేంద్రియమనోబుద్ధిః, మునిః, మోక్షపరాయణః, విగతేచ్ఛాభయక్రోధః, యః, సదా, ముక్తః, ఏవ, సః. ౨౮

టీక :—

బాహ్యాన్ = బాహ్యములైన,
స్పర్శాన్ = విషయములను,
బహిరేవకృత్వా = త్రోసిపుచ్చి,
చ = మరియు,
చక్షుః = దృష్టిని,
భ్రువోః అంతరే = భ్రూమధ్యమునందు (నిలిపి),
నాసాభ్యంతరచారిణౌ = ముక్కులో ఆడుచుండెడి,
ప్రాణాపానౌ = ఉచ్ఛ్వాస నిశ్వాసములను,
సమౌకృత్వా = సమముగచేసి,
యః = ఎవడు,
యతేంద్రియ మనోబుద్ధిః = ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని నియమించినవాడో,
విగతేచ్ఛాభయక్రోధః=ఇచ్ఛ, భయము, క్రోధము పూర్తిగ నశించినవాడో,
మోక్షపరాయణః = మోక్షమునందు పూర్ణమైన నిష్ఠ గలిగినవాడో,
సః = అట్టి,
మునిః = ముని,
సదా = ఎల్లప్పుడును,
ముక్తఏవ = ముక్తుడే.

తా. బాహ్యవిషయములను దూరముగ త్రోసిపుచ్చి, దృష్టిని భ్రూమధ్యమందు నిలిపి, ముక్కులో సంచరించు ప్రాణాపానములను - ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములను - సమముగచేసి, మనోబుద్ధీంద్రియములను నియమించి, ఆశాభయక్రోధములను పూర్తిగ నశింపజేసికొనినవారు, మోక్షమే ప్రయోజనముగాగల మునులు ఎప్పుడును ముక్తులే. అనగా జీవించియున్నను ముక్తులే అని భావము.

**అమృతవాహిని:—**

బాహ్యవిషయములను దూరముగ త్రోసిపుచ్చి, దృష్టిని భ్రూమధ్యమందు నిలిపి, ప్రాణాపానగతులను సమము చేయుట మునియొక్క లక్షణముగా చెప్పుచున్నాడు పరమాత్మ. ఇందు బాహ్యవిషయములు అనగా బాహ్య విషయాభిలాష,ప్రాకృతములైన శబ్ద స్పర్శ రూప రస గంధములు అనుభవించుటకై పడు తపన. దానిని ముందుగ దూరముగ త్రోసిపుచ్చవలయును. ఆనందానుభవముకొరకై కదా ఈ విషయములను కోరుట ! అట్టి ఆనందానుభవము వీనివలన సాధ్యముకాకపోవుటేకాక, ఇవి ఆనందానుభవమునకు ఆటంకములుకూడ అను సత్యమును మననము చేసికొనుట మూలమున ఇది సాధింపవచ్చును.

ఇక రెండవది దృష్టిని భ్రూమధ్యమందు నిలుపుట. భ్రూమధ్యము ప్రణవస్థానము. మంత్రజప సమయమునను, ధ్యానసమయమునను దృష్టి భ్రూమధ్యమందు నిలుపుట

యోగసంప్రదాయము. అంతేకాక, భ్రూమధ్యస్థానీయమైన ప్రణవమునందే సదా దృష్టిని నిలిపియుంచుటగాకూడ దీనిని సమన్వయించుకొనినచో, ఐకకాలికముగాకాక సార్వకాలికముగాకూడ చెప్పవచ్చును. ఇచ్చట దృష్టిని ఉద్దేశించి 'చక్షుః' అని ప్రయోగించుటచే, పై బాహ్యావిషయములు అన్నప్పుడు జ్ఞానేంద్రియ విషయములు వచ్చినవి గనుక కర్మేంద్రియములన్నింటికి ఇది ఉపలక్షముగ చెప్పి, కర్మేంద్రియ వ్యాపారములన్నియు భగవత్సేవారూపముగ రూపొందించుకొనవలసినదిగా హెచ్చరించినాడు పరమాత్మ అనియు చెప్పుకొనవచ్చును. ప్రాణాపానములను సమముచేయుట తరువాతి లక్షణము. "ప్రాణోఽపాన స్సమానశ్చోదాన వ్యానౌచ వాయవః" అని అయిదువాయువులు. శరీరమునందు వాని స్థానములు నిర్దేశింపబడియే ఉన్నవి. "హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభి సంస్థితః ఉదానః కంఠదేశస్థో వ్యాన స్సర్వశరీరగః" అని. అధోముఖముగ మలములను బయటకు వెడలించువాయువును అపానము అందురు. కాని, ఇచ్చట "నాసాభ్యంతరచారిణౌ" అన్న విశేషణము ప్రయోగించుటచే ఇచ్చట ప్రాణాపానములు అనగా ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు అనిచెప్పవలయును.

ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు సమముగా - సమగతి కలవిగా - చేయవలయును. ఇది ప్రాణాయామసాధనమునకు లక్ష్యమైనది. సరియగు గురువు లభించి సక్రమరీతిలో సాధన

జరిగిననేతప్ప, ప్రాణాయామసాధన ప్రమాదభూయిష్ఠము. ఇందుకు మరొకరీతి కలదు. ఏదైన సమాక్షరములు కల నామమును తీసికొని, మనస్సున అది ఉచ్చరించుకొనుచు సగభాగమున ఉచ్ఛ్వాసము, సగభాగమున నిశ్శ్వాసము చొప్పున అభ్యాసము చేసినచో ఇది సులభసాధ్యము. కొంతకాలమునకు సహజముగనే ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు సమగతి కలవిగ ఏర్పడును. అజపామంత్రమని ప్రసిద్ధిపొందిన 'హంసః' అనునది క్రమగతిలో 'హంసోహంసోహంసో' అనురీతిలో ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలను కలిపి సాధనచేసి, సహజసమస్థితిని సాధించుట ప్రాచీనులు సూచించుమార్గము. అట్లే, 'రామ' మొదలైన నామములను ఉపయోగింపవచ్చును. ఇది సాధించినవాడు 'యతేంద్రియమనోబుద్ధి' కాగలడు. 'విగతేచ్ఛాభయక్రోధుడు' కాగలడు. మోక్షపరాయణుడైన ఇట్టి ముని ఎల్లప్పుడును ముక్తుడే.

బాహ్యవిషయానుభవరతిని దూరముగ త్రోసిపుచ్చుటచే ఇంద్రియజయము సిద్ధము. దృష్టిని భ్రూమధ్యమందు నిలుపుటచే, అనగా, భ్రూమధ్యస్థానీయమైన ప్రణవమందు మాత్రమే దృష్టికలిగియుండుటచే మరొకదానివైపు పోవుటకు అవకాశమే కలుగదుకదా మనస్సుకు! ఆ విధముగ మనోజయము సిద్ధించును. ప్రాణాపానములను, ఉచ్ఛ్వాస నిశ్శ్వాస

ములను - నామజపముద్వారా సమగతి కలవిగా చేయుటచే ఆ విధముగ జరుగు అవిరత నామజపముచేతను, సమగతికల ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములచేతను - అనగా సహజసిద్ధమైన ప్రాణాయామముచేతను - బుద్ధి నిర్మలమై శుద్ధసత్త్వమగును. ఆ విధముగ బుద్ధిజయము సిద్ధించును. అట్టివాడు 'యతేంద్రియ మనోబుద్ధి'. అట్టివాడు 'విగతేచ్ఛాభయక్రోధుడు' కూడ.

క్రోధమునకు మూలము తన ప్రయోజనమునకు భంగము కలుగుచున్నదను భయము. ఒక వస్తువునందో, అనుభవమునందో తీవ్రమైన అభిరతి ఉన్ననాడే, అది పోవునో, దానికి భంగము కలుగునో అను భయము సంభవించును. అనగా, భయమునకు మూలము ఇచ్ఛ. బాహ్యవిషయానుభవరతి నశించిననాడు ఇక ఇచ్ఛకు తావేది ? ఇచ్ఛలేనినాడు భయము లేదు. భయము లేనివానికి క్రోధమునకు అవకాశమే లేదు. అందుచే అన్నింటికి మూలముగ బాహ్యవిషయానుభవరతిని దూరముగ త్రోసివుచ్చవలయును అని హెచ్చరించినాడు పరమాత్మ.

ఇన్ని సాధించినవాడు మోక్షపరాయణుడు. మోక్షమందే నిష్ఠగలవాడు. పరాయణుడు అనగా నిష్ఠకలవాడు - అనగా, అది సాధించనిదే నిలువలేనివాడు, ప్రాణములు నిలువలేనివాడు అని చెప్పవలయును. ముముక్షువు అను పదము

మోక్షకాంక్ష ప్రారంభమైనవారి కందఱికిని వాడబడుచున్నను అది గౌణము. ముఖ్యార్థమునమాత్రము భగవదనుభవరూప మోక్షము పొందితీరవలయుననెడి పరమార్తితో విలంబనము సహింపలేనిస్థితిలో - ఆ అనుభవము పొందక ప్రాణములు నిలుపలేని స్థితిలో - ఉన్నవాడే ముముక్షువు - మోక్షపరాయణుడు. వానినే ముని అనవలయును. ముని అనగా ఆత్మావలోకనశీలుడు. అట్టివాడు ఎప్పుడు ఎక్కడ ఎట్లుఉన్నను ముక్తుడే. సర్వమునందును బాహ్యాభ్యంతరములలో సర్వదా పరమాత్మనే దర్శించుచు అనుభవించుచున్న అతడు ముక్తుడుకాక బద్ధుడెట్లగును ?

శ్లో॥ భోక్తారం యజ్ఞ తపసాం
సర్వలోకమహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి ॥ 29

ప. వి :— భోక్తారం, యజ్ఞతపసాం, సర్వలోకమహేశ్వరం, సుహృదం, సర్వభూతానాం, జ్ఞాత్వా, మాం, శాంతిం, ఋచ్ఛతి.

టీక :—

మాం = నన్ను,
యజ్ఞతపసాం = యజ్ఞములకు, తపస్సులకు,
భోక్తారం = భోక్తగా,

సర్వలోక మహేశ్వరం = సర్వలోకములకు, దేవతో
లకు ప్రభువుగా,

సర్వభూతానాం = సర్వజీవులకు,
సుహృదం = మిత్రునిగా, మేలుకోరువానినిగా,
జ్ఞాత్వా = తెలిసికొని,
శాంతిం = శాంతిని,
ఋచ్ఛతి = పొందుచున్నాడు.

తా. సమస్తమైన యజ్ఞములకు, తపస్సులకు నేనే భోక్తను. సమస్త లోకములకు, దేవతలకు నేనే ప్రభుడను. సమస్తప్రాణులకు నేనే మేలుచేయువాడను. అట్టి నన్ను తెలిసికొనినవాడు నా అనుభవరూపమగు శాంతిని పొందుచున్నాడు.

అమృతవాహిని :-

సమస్త యజ్ఞములకును, తపస్సులకును నేనే భోక్తను అని నిష్కర్షగ చెప్పుచున్నాడు పరమాత్మ. లోకమున అనేక ప్రయోజనములుకోరి యజ్ఞయాగాదులు చేయబడుచున్నవి. ఒక్కొక్కయజ్ఞమున ఒక్కొక్కదేవత ప్రధానముగ అర్చింపబడుచున్నట్లు తోచుచున్నది. అట్లు అర్చించుటచే ఆ యా దేవతల అధికారపరిధులకు లోబడిన ఫలములను మాత్రమే యజమాని పొందుచున్నాడు. నిజమునకు అన్ని యజ్ఞములకు భోక్త పరమాత్మయే. అంతేకాక, స్వార్థదృష్టితో కాక పదిమందికి ఉపకరించు ఏ సత్కార్యము తలపెట్టినను అది యజ్ఞమనియే చెప్పవలయును. అట్టి సత్కార్యముల ఫలము ప్రత్యక్షముగ తోడివారు అనుభవించుచున్నట్లు కనబడినను, అది

ఆరూపముగ అనుభవించువాడు పరమాత్మయే. అందుచే, సమస్త యజ్ఞములకును తానే భోక్తనని నిర్ధారించి చెప్పినాడు పరమాత్మ. సర్వతపస్సులకును - సర్వోపాసనలకును - ఆయనయే భోక్త. ఎప్పుడు ఎక్కడ ఎవరు ఏ రూపనామములను అర్చించినను, ఉపాసించినను, ఆ అర్చనలు, ఉపాసనలు చెందునది ఆయనకే. ఎందుచేతననగా-సర్వలోకములకు, సర్వదేవతలకు ప్రభువు ఆ పరమాత్మయే. దయాసముద్రుడు కనుక సర్వులకు ఆయన సుహృత్తు - మిత్రుడు - మేలుచేయువాడు. పరమాత్మను గూర్చిన ఈ జ్ఞానము కలిగినవాడు శాంతిని - భగవదనుభవరూపముక్తిని - పొందుచున్నాడు.

ఇచ్చట 'మాం' 'నన్ను' అని చెప్పుటచే - సగుణోపాసన చేసినను, నిర్గుణోపాసన చేసినను, చివరకు పొందునది సగుణసాకారతత్త్వమగు తననే అని సిద్ధాంతీకరించుచు పరమాత్మ ఈ అధ్యాయమును ముగించుచున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాస
యోగోనామ పంచమోఽధ్యాయః

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యాణాం
శ్రీ యదుగిరి యతిరాజ సంపత్కుమార...
శిష్యేన సీతారామయతినా విరచితే ...మృతవాహినీ
నామక గీతాభాష్యే కర్మసన్న్యాసయోగోనామ
పంచమోఽధ్యా...



---

# అమృతవాహిని

## 7




శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రులు

ముముక్షుజన మహాపీఠాధిపతులు

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీమద్భగవద్గీతా — షష్ఠోఽధ్యాయః

# ఆత్మ సంయమ యోగః

శ్రీ భగవానువాచ :-

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం
కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ
న నిరగ్ని ర్న చాక్రియః ॥ ౧

ప. వి:-అనాశ్రితః, కర్మఫలం, కార్యం, కర్మ, కరోతి, యః, సః, సన్న్యాసీ, చ, యోగీ, చం న,నిరగ్నిః, న, చ, అక్రియః.

టీక :—

యః = ఎవడు,
కర్మఫలం = కర్మయొక్క ఫలమును,
అనాశ్రితః = కోరనివాడై,
కార్యం = చేయదగిన,
కర్మ = కర్మను,
కరోతి = చేయుచున్నాడో,
సః = వాడు,

సన్న్యాసీ చ = సన్న్యాసియును,
యోగీ చ = యోగియును (అయి ఉన్నాడు)
నిరగ్నిః = అగ్నిహోత్రాదులు వదలినవాడు,
న = కాదు
అక్రియః = కర్మ చేయనివాడు,
న = కాదు,

తా॥ శ్రీకృష్ణ పరమాత్మ చెప్పుచున్నాడు - కర్మయొక్క ఫలమునందు ఎంతమాత్రమును ఆశలేక, కర్తవ్య కర్మమును చేయువాడే సన్న్యాసి, వాడే కర్మయోగికూడ. అంతేకాని, కేవలము అగ్నిహోత్రాదుల వదలిపెట్టినంత మాత్రమున, కర్మ చేయనంతమాత్రమున, వాడు సన్న్యాసియునుకాడు, యోగియునుకాడు.

## అమృతవాహిని :-

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు :-

కర్మయొక్క ఫలములను - అనగా స్త్రీ పుత్ర ధన గౌరవ ప్రతిష్ఠాది ఇహలోక సంబంధమైనవట్టియును, బ్రహ్మాది లోక పర్యంతమైన ఊర్ధ్వలోకముల యొక్కయును, అతల-వితల- సుతల- రసాతల- మహాతల - తలాతల పాతాళములను అధోలోకముల యొక్క యును, (అధోలోకములన్న ఇక్కడ నరకలోకములు కాదు. ఇవియును మహాభోగలోకములు) భోగము నెంతమాత్రమును కోరక, తన వర్ణమునకును, ఆశ్రమమునకును తగిన శాస్త్రవిహితమైన కర్మలను యథా

విధిగా, యథాయోగ్యముగా, సోమరితన మెంతమాత్రమును లేకుండ, తనశక్తికి తగినట్లు, కర్తవ్యబుద్ధితో, ఉత్సాహ పూర్వకముగా, ఎల్లప్పుడు చేయచుండువాడే నిజముగా సన్న్యాసి; వాడే నిజముగ యోగి.

కర్మయోగి కర్మలయొక్క ఫలము నెంతమాత్రమును కోరక, ఆసక్తిలేక, అహంకారమును త్యజించి, రాగద్వేష రహితుడై, భగవదర్పణబుద్ధితో, భగవత్కైంకర్య రూప ముగ కర్మచేయుటచేత, సాంఖ్యులకు లభించెడి జ్ఞానమును లభించి తీరును. అందుచేత ఇతనిలో సన్న్యాసిత్వమును, యోగిత్వమును కూడ ఉన్నవి. కనుకనే పరమాత్మ అట్టి వానిని గూర్చి వాడే సన్న్యాసి, వాడే యోగి అని చెప్పినాడు. కేవలము అగ్నికార్యములు వదలినంత మాత్రమున, కేవలము క్రియాకలాపములు వదలినంత మాత్రమున వాడు సన్న్యాసియును కాడు, యోగియును కాడు.

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు
ర్యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్త సంకల్పో
యోగీ భవతి కశ్చన ॥ 2

ప. వి:- యం, సన్న్యాసం, ఇతి, ప్రాహుః, యోగం, తం, విద్ధి, పాండవ, న, హి, అసన్న్యస్త సంకల్పః, యోగీ, భవతి, కశ్చన.

టీక :—

పాండవ = అర్జునా !
యం = దేనిని,
సన్న్యాసమితి = సన్న్యాసమని,
ప్రాహుః = చెప్పుచున్నారో,
తం = దానిని,
యోగం (ఇతి) కర్మయోగమని,
విద్ధి = తెలిసికొనుము,
హి = ఏలయన,
అసన్న్యస్త సంకల్పః = సంకల్పములను త్యజించిన వాడు,
కశ్చన = ఎవ్వడును,
యోగీ = యోగి,
న భవతి = కానేరడు,

తా॥ అర్జునా ! తెలిసిన మహాత్ములు సన్న్యాసమని దేనిని అనుచున్నారో, దానినే కర్మయోగమని తెలిసికొనుము. సంకల్పములను విడిచిపెట్టలేనివాడు ఎన్నటికిని యోగికాజాలడు.

అ మృ త వా హి ని :—

సన్న్యాసము, యోగము రెండును ఒక్కటే. అయిదవ అధ్యాయములో "సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి నపండితాః" (5-4) 'సాంఖ్యమును (కర్మసన్న్యాసమును)

టీక ;—

యోగం = భగవదనుభవరూపమగు యోగమును,
ఆరురుక్షోః = పొందగోరినట్టి,
మునేః = మునికి (సాధకునకు),
కర్మ = నిష్కామముగా చేయు కర్మ,
కారణము = హేతువుగా (సాధనముగా),
ఉచ్యతే = చెప్పబడుచున్నది,
తస్య = ఆ,
యోగారూఢస్య = యోగారూఢునికి (సిద్ధునకు),
శమః = శమమే,
కారణం = హేతువుగా,
ఉచ్యతే = చెప్పబడుచున్నది,

తా॥ ఆరురుక్షువైన మునికి కర్మ కారణమనియును, యోగారూఢునికి శమమే కారణమనియును చెప్పబడుచున్నది.

అమృతవాహిని :-

ఆరురుక్షువనగా యోగమును గూర్చి అభ్యాసము చేయువాడు. యోగారూఢుడు అనగా యోగసిద్ధిని పొందినవాడు. ఈ శ్లోకములో చెప్పబడిన విషయ మేమనగా - మానవుడు ఆరురుక్షువు కావలయు ననిన నిష్కామముగా కర్మ ఆచరించవలయును. అట్లు నిష్కామముగా , అనగా

ఫలాపేక్ష లేక - చేయుటచే ఆరురుక్షుత్వము కలుగును. ఆరురుక్షువనగా యోగసిద్ధిని పొంద కోరిక కలవాడని చెప్పకొని యున్నాము గదా ! - ముముక్షువు అనినట్లు.

ముక్తిపొంద కాంక్షగలిగి ప్రయత్నించువాడు ముముక్షువు. ముక్తిని పొందినవాడు ముక్తుడు. అట్లే యోగ సిద్ధిని పొందదలచినవాడు ఆరురుక్షువు. పొందినవాడు ఆరూఢుడు. ఆరురుక్షుత్వము లభించవలయు ననిన ఫలాపేక్షా రహితముగా భగవదర్పణబుద్ధితో, భగవత్కైంకర్యరూపముగ కర్మచేయ వలయును. అప్పుడు వాడు 'ఆరురుక్షువు' అనబడును.

సంకల్పములుకూడ లేనిదశ కలిగిననాడు అతడే ఆరూఢుడు అనబడును. కనుక ఆరూఢుడు అనబడుటకు సంకల్పరాహిత్యరూపమైన శమమే కారణము. కాని ఇక్కడ కర్మ చేయకుండుట అనునది లేదు. ఆరురుక్షువుగా ఉన్నప్పుడు కర్మ ఫలాపేక్షా రహితముగా చేయబడును. ఆరూఢుడుగా ఉన్నప్పుడు అతని చేత కర్మ చేయబడుచున్నను, అది సంకల్ప రహితముగా జరుగును. అప్పుడు ఆ కర్మ చేయువానికి మంచికి గాని, చెడుకుగాని ఉపయోగపడదు; వ్యర్థమును కాదు - అది లోకకల్యాణదాయకముగా ఉండును. ఈ స్థితిని అందుకొన్న వానిని గురించియే పరమాత్మ రెండవ అధ్యాయములో స్థిత ప్రజ్ఞుడనియు, పన్నెండవ అధ్యాయములో భక్తుడనియును, పదునాల్గవ అధ్యాయములో గుణాతీతుడనియును, వర్ణించి

యున్నాడు. ఇట్టి మహాత్ములు వారికొరకు కాకపోయినను లోకముకొరకు కర్మ చేయుచునే యుందురు. ఆ కర్మచేత వారు బంధించబడరు.

అట్టివారుకూడ కర్మ చేయుదురనియును, అవి వారిని బంధించవనియును పరమాత్మ నాల్గవ అధ్యాయమునందు పందొమ్మిదవ శ్లోకములో "యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః, జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః" 'ఎవనియొక్క సమస్తకర్మలు కామముచేతను, సంకల్పముచేతనుకూడ స్పృశించబడకుండ ఉండునో, వానిని బుధులు పండితుడు అనుచున్నారు' అని చెప్పియున్నాడు. ఇందులో కర్మ చేయరు అని చెప్పలేదు. వారు కర్మ చేయుదురు; కాని ఆ కర్మ చేయబడుటకు కారణము కామముగాని, సంకల్పముగాని కాదు. వారిద్వారా కర్మ జరుపబడును - జరుపబడుచున్నట్లు కనబడుట కాదు, జరుపబడును. దానికి కారణము లోకమునందు పరమాత్మకు గల అనుగ్రహమే.

శ్లో॥ యదాహి నేంద్రియార్థేషు
న కర్మ ష్వనుషజ్జతే
సర్వసంకల్పసన్న్యాసీ
యోగారూఢ స్తదోచ్యతే॥

ప. వి :-యదా, హి, న, ఇంద్రియార్థేషు, న, కర్మసు, అనుషజ్జతే, సర్వసంకల్పసన్న్యాసీ, యోగారూఢః, తదా, ఉచ్యతే.

టీక :—

యదా = ఎప్పుడు,
ఇంద్రియార్థేషు = ఇంద్రియ భోగములయందును,
కర్మసు = కర్మలయందును,
నానుషజ్జతే = ఆసక్తి ఉంచడో,
తదా = అప్పుడు,
సర్వసంకల్పసన్న్యాసీ = సర్వ సంకల్పములను త్యజించినవాడై,
యోగారూఢః (ఇతి) = యోగారూఢుడని,
ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. ఎప్పుడు ఇంద్రియ భోగములయందును కర్మయందును ఎంత మాత్రమును, ఆసక్తి లేక సర్వసంకల్పపరిత్యాగము సిద్ధించినదో, అప్పుడు అతనిని యోగారూఢుడు అని చెప్పుదురు.

అమృతవాహిని :—

ఈ శ్లోకమును వెనుకటి శ్లోకములతో సంబంధించినదే. ఇందులో యోగారూఢుని లక్షణము చెప్పబడియున్నది. అతనికి ఇంద్రియ భోగములయందు ఏమాత్రమును అభిలాష ఉండదు. "ఇంద్రియార్థేషు" అనగా ఇంద్రియములతో అనుభవించు భోగములందు అని అర్థము. ఈ శబ్దముచేత ఊర్ధ్వ లోకములయందలి, పాతాళ లోకముల యందలి భోగము

లన్నియును చెప్పబడినవి. తరువాత సర్వసంకల్పరహితుడుగ ఉండును. ఈస్థితి కలిగిననాడు వాడు యోగారూఢుడు.

ఇతడు కర్మచేయక ఉండునని అభిప్రాయపడరాదు. ఎప్పుడును, ఎంతమాత్రమును ఒడుదుడుకుపడక, శాంత చిత్తముతో, సిద్ధ్యసిద్ధులయందును, నిందాస్తుతులయందును, మానావమానములయందును, సమభావముతో కర్మ చేయుచునే యుండును. ఇట్టి మహాత్ముని గురించియే "ఇహైవ తైర్జితస్సర్గో" (5-19) అని చెప్పబడియున్నది. అతడు ఇక్కడనే ఈ లోకములో జీవించియుండగనే సంసార బంధనములను త్రెంచుకొని బయటపడుచున్నాడు. కనుక ఇతనిని జీవన్ముక్తుడు అనవచ్చును.

శ్లో॥ ఉద్ధరే దాత్మ నాత్మానం
నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాఽత్మనో బంధు
రాత్మైవ రిపు రాత్మనః

ప. వి :- ఉద్ధరేత్, ఆత్మనా, ఆత్మానం, న, ఆత్మానం, అవసాదయేత్, ఆత్మా, ఏవ, హి, ఆత్మనః, బంధుః, ఆత్మా, ఏవ, రిపుః, ఆత్మనః.

టీక :-

ఆత్మనా = తనచేత,

ఆత్మానం = తనను,

ఉద్ధరేత్ = ఉద్ధరించుకొనవలయును,
ఆత్మానం = తనను,
నావసాదయేత్ = అధోగతిని పొందించుకొనగూడదు,
హి = ఏలయనగా,
ఆత్మనః = తనకు,
ఆత్మైవ = తానే,
బంధుః = బంధువు,
ఆత్మనః = తనకు,
ఆత్మైవ = తానే,
రిపుః = శత్రువు.

తా. తనను తానే ఉద్ధరించుకొనవలయును. తన్ను తాను అధోగతిపాలు చేసికొనగూడదు. కారణమేమన - తనకు తానే బంధువు. తనకు తానే శత్రువు.

**అమృతవాహిని :—**

మానవుడు తనను తానే ఉద్ధరించుకొనవలయును. తనను తాను ఉద్ధరించుకొనవలయు ననెడి అభిప్రాయము లేనియెడల ఎవడును ఉద్ధరించ లేడు.

జీవుడు అజ్ఞానమునకు వశపడిపోయి, అనాదికాలము నుండి ఈ దుఃఖమయమైన సంసారసముద్రములో మునుగుచు, తేలుచు అనేక విధములైన ఉచ్చనీచ జన్మములనెత్తి పలువిధములైనమహాభయంకర బాధలు అనుభవించుచున్నాడు. ఇట్లు కష్టపడుచున్న జీవునియందు కరుణకల్గి, తరింపుటకు

ఉపయోగపడు మానవదేహమును ప్రసాదించి, ఒక మహో ద్భుతమైన సదవకాశమును కల్పించినాడు పరమాత్మ. ఈ మానవదేహమును పొందుటవలన జీవుడు, కోరిక పట్టుదల తీవ్రముగ ఉన్నచో, ఒక్కజన్మలో మృత్యు సంసారసాగరము నుండి బయటపడి సునాయాసముగ పరమానందస్వరూపు డైన పరమాత్మను పొందగలడు. కనుక, అమూల్యమైన, దుర్లభమైన ఈ సదవకాశమును వ్యర్థముచేసికొనక ఉపయో గించుకొని, ప్రయోజనమును పొందినవాడు తనను తానే ఉద్ధరించుకొనిన వాడగుచున్నాడు.

కాక - ఆ సదవకాశమును వృథా చేసికొని రాగ ద్వేషములు, కామక్రోధములు, లోభ మోహములు, మొద లగు దుర్గుణములలో చిక్కుకొని, అనేకవిధములైన దుష్క ర్మలను చేయుచు, అందువలన మానవదేహముచేత సాధించ వలసిన మహాఫలమగు భగవత్ప్రాప్తినుండి వంచింపబడి, రౌర వాది నరకములకు పోయియును, నీచజన్మల నెత్తియును, అనేక బాధలకును, అనేక కష్టములకును పాలుపడువాడు తనను తాను అధోగతిపాలు చేసికొనిన వాడగుచున్నాడు.

భగవానుడు ఇట్లు చెప్పుటచేత "మానవుడు సన్మా ర్గమున నడిచి తరించుటకును, దుర్మార్గమున నడిచి అధోగతి పాలగుటకును, ప్రారబ్ధకర్మయే కారణము; ప్రారబ్ధమే పాప మును చేయించి, అధోగతికిని; పుణ్యమును చేయించి, ఊర్ధ్వ

గతికిని; మోక్షమార్గము వెంట నడిపి తరించుటకును కారణ మగుచున్నది. మానవునికి స్వాతంత్రత ఎక్కడిది ?" అని కొంతమంది తలచునది తప్పనియును, మానవుని బంధ మోక్షములు ప్రారబ్ధాధీనములు కాక, అతని చేతిలోనే ఉన్న వనియును సారాంశము తేలినది. కనుక సాధనమార్గములో ప్రయాణము చేయుము. నిన్ను నీవు సంసారకూపమునుండి ఉద్ధరించుకొనుము అని పరమాత్మ మానవునకు హెచ్చరిక తెలుపుచున్నాడు.

తనకు తానే బంధువు; తనకు తానే శత్రువు అనికూడ చెప్పినాడు. సన్మార్గములో నడిచి తనను తాను ఉద్ధరించుకొనువాడు తనకు తానే బంధువు. దుర్మార్గములో నడిచి తనను తాను అధోగతిపాలు చేసికొనువాడు తనకు తానే శత్రువు. తన మనస్సును విషయాసక్తమైనదిగా ఉంచుకొనువాడే తనకు తాను శత్రువు. తన మనస్సును రాగద్వేష విహీనముగా తయారుచేసికొనువాడే తనకు తాను బంధువు.

మానవునకు బంధ మోక్షములకు కారణము మనస్సే. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥"
'మానవులకు మనస్సే బంధమోక్షములకు కారణము. విషయాసక్తమైన మనస్సు బంధనమునకు - నిర్విషయమైన మనస్సు మోక్షమునకును హేతువు' అని శాస్త్రములయందు చెప్పబడి

యున్నది. కనుక తన హితమును తెలిసిన మానవుడు తన మనస్సును పరిశుద్ధము చేసికొని హరిని భజింపవలయును.

'ఆత్మ' అనగా 'మనస్సు' అనికూడ అర్థము కలదు. మనస్సు అనినను ఇచ్చట పొసగును. మనస్సే తనకు బంధువు. మనస్సే తనకు శత్రువు. ఎట్లనగా "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనుటచే బంధమునకు గాని, మోక్షమునకుగాని ప్రధానకారణము మనస్సే.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు
బుద్ధిం చ సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ

ఇంద్రియాణి హయాన్యాహుః..." అని ఉపనిషత్తు మనస్సును ప్రగ్రహము - కళ్ళెము - అన్నది. ఆవిధముగా ఎవరుగాని ఉద్ధరింపబడవలెనని మనస్సు ప్రధానసాధనము. అందుచేత ఇచ్చట ఆత్మ అనగా మనస్సు అని చెప్పినను బాధలేదు.

ఇచ్చట మరియొక విధముగ కూడ అన్వయింపవచ్చును.

తానున్న స్థితినుండి ఉన్నతి పొందవలసిన ప్రతివ్యక్తియు, ఎవరో వచ్చి తనను ఉద్ధరించవలెనని ఆశించుటయు ఆక్రోశించుటయు చూతుము. ఎవరో వచ్చి తనను ఉద్ధరించవలెనను భావము ఏవిధముగను తగదు అని హెచ్చరించుచున్నాడు శ్రీకృష్ణుడు.

తనను తానే ఉద్ధరించుకొనవలయును. తన వినాశమును తాను కొనితెచ్చుకొనరాదు - అనగా తాను ఏపని చేసినను, అది తన ప్రయోజనమును సాధించునది - తనను ఉద్ధరించునది- కావలయునుగాని, తన ప్రయోజనమును భంగపరచి, తనను అధోగతికి త్రోయునది కారాదు. సామాన్య దృష్టికి ఇది చాల సంకుచిత స్వార్థదృష్టిగా కనబడును కాని, నిజమునకు అది కాదు - చాల విశాల దృక్పథముతో, దూర దృష్టితో చేసినది ఈ హెచ్చరిక.

ఇది అర్థము కావలయుననినచో కొంత వివేచన అవసరము. వ్యక్తియొక్క భద్రతగాని, అసలు ఉనికియేగాని, సమాజముయొక్క భద్రతమీద, ఉనికిమీద ఆధారపడి ఉండును. సమాజ మనగా తనవంటి వ్యక్తుల సమూహమే కదా! క్రమశిక్షణ లేకుండ ఎవరిచిత్తము వచ్చినట్లు వారుండు సమూహమును గుంపు అందుము. క్రమశిక్షణతో పరస్పరము ఆటంకము కాకుండునట్లు ప్రవర్తించు సమూహమును సమాజము అందుము. అనగా సమాజము, సమాజముగా నిలబడ గలుగుట అనునది, అందులోని వ్యక్తులయొక్క క్రమశిక్షణ మీద ఆధారపడి ఉండును అన్నమాట. ఆ క్రమశిక్షణకు విరుద్ధముగా నడచినవ్యక్తి చేజేతుల తనయొక్క భద్రతకును, ఉనికికిని, రక్షకముగా ఉన్న సమాజమును విచ్ఛిన్నముచేసి, పరోక్షముగా, తనయొక్క వినాశమునకు ప్రాతిపదిక ఏర్పరచుకొనినాడు అని అర్థము.

అట్లే సమాజములోని ఇతర వ్యక్తుల సహకారము, సానుభూతి లేకుండ ఏవ్యక్తియు ఒక్కక్షణము కూడ మనుట

సాధ్యముకాదు. తోడివారి సహకార సానుభూతులను తాను ఆశించుచున్నప్పుడు, తనసహకార సానుభూతులు తోడివారికి ఈయవలసిన బాధ్యతకూడ ప్రతివ్యక్తికిని ఉన్నది. ఈ విధమైన పారస్పరిక సహకార సానుభూతుల పైననే ఆధారపడి ఉన్నది సమాజముయొక్క భద్రత. ఇతరులనుండి తన కేగాని, వారినుండి తాను ఆశించు, పొందు సహకార సానుభూతులు తోడివారికి ఇచ్చుటకు సిద్ధపడని వ్యక్తి, సమాజ వ్యవస్థ ఛిన్నాభిన్న మగుటకు హేతువై, పరోక్షముగా తన పతనమునకు తానే కారకుడై తన గోయి తానే త్రవ్వుకొనువా డగుచున్నాడు.

తనను తా నుద్ధరించుకొనవలయు ననినచో, వ్యక్తిగత మైన తన ప్రయోజనముతోపాటు సమాజ ప్రయోజనమును కూడ దృష్టిలో ఉంచుకొని వ్యవహరించవలయునన్నమాట. తన నాశనమును తాను కొని తెచ్చుకొనరాదనినచో, వ్యక్తి గతమైన ప్రయోజనమును కలిగించునదే అయినను, సమాజ ప్రయోజనమునకు భంగకరమైనచో, తాత్కాలికముగా తనకు ప్రయోజనకారిగా కనపడినను, సమాజమునకు అపకారము చేసి, సమాజ విచ్ఛిత్తికి హేతువు అగుట మూలముగా, పరోక్షముగా తన వినాశనమునకు కారణ మగును కనుక, అట్టిపని చేయరాదని అర్థము.

తాత్కాలికముగా జిహ్వకు రుచికరముగా, ఇష్టముగా ఉండును కదా అని శరీరారోగ్యమునకు భంగము కలిగించు పదార్థము తినినచో అది ఏ విధముగ అపకారముచేసి, తన ఉనికికే ముప్పు తెచ్చునో, అదే విధముగ ఇదియును.

దీనికి ప్రధానమైనది సంయమనము. నిగ్రహింపబడి, నియమింపబడిన మనస్సు తనకు బంధువు అని చెప్పవలయును. ఆ విధముగకాక, అదుపు తప్పి తనకు లొంగని మనస్సుకంటె మించిన శత్రువు తనకు ఉండదు.

శ్లో॥ బంధు రాత్మాత్మన స్తస్య
యే నాత్మై వాత్మనా జితః।
అనాత్మన స్తు శత్రుత్వే
వర్తే తాత్మైవ శత్రువత్॥ ౬

ప. వి :-బంధుః, ఆత్మా, ఆత్మనః, తస్య, యేన, ఆత్మా, ఏవ, ఆత్మనా, జితః, అనాత్మనః, తు, శత్రుత్వే, వర్తేత, ఆత్మా ఏవ, శత్రువత్.

టీక :—

యేన = ఎవనిచేత,
ఆత్మనా = తనద్వారా,
ఆత్మా=శరీరేంద్రియ సంఘాతములతో కూడిన మనస్సు,
జితః = జయించబడినదో,

తస్య = వానియొక్క,
ఆత్మా = మనస్సు,
ఆత్మనః = తనకు,
బంధుః = బంధువు,
అనాత్మనస్తు = మనోజయము లేనివానికి,
ఆత్మా = తన మనస్సు,
శత్రువత్ = శత్రువువలె,
శత్రుత్వే + ఏవ = అపకారము నందే,
వర్తేత = ప్రవర్తించుచున్నది.

తా. తన తీవ్ర ప్రయత్నరూప సాధనద్వారా మనస్సును జయించిన వానికి తన మనస్సే తనకు బంధువు. మనోజయము లేనివానికి తన మనస్సే తనకు శత్రువువలె అపకారమునందే ప్రవర్తించుచున్నది.

అ మృ త వా హి ని :-

ఈ శ్లోకములోకూడ పై శ్లోకములోని విషయమే వివరించబడినది. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" అను విషయము స్పష్టముగా చెప్పబడినది. "మానవుడా ! నీకు ఒకడు ఉపకారము చేయువాడుగాని, అపకారము చేయువాడుగాని లేడు. నీ మనస్సే నీకు ఉపకారము చేయునదిగాని, అపకారము చేయునదిగాని అగును. నీచేత జయింపబడిన మనస్సు నీకు బంధువు-అనగా ఉపకారము చేయునది. నిన్ను జయించిన మనస్సు నీకు శత్రువువలె ఎప్పుడును అపకారము చేయునదే అగుచున్నది.

శ్లో॥ జితాత్మనః ప్రశాంతస్య
పరమాత్మా సమాహితః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు
తథా మానావమానయోః ॥ 8

ప. వి ;—జితాత్మనః, ప్రశాంతస్య, పరమాత్మా, సమాహితః, శీతోష్ణసుఖదుఃఖేషు, తథా, మానావమానయోః.

టీక :—

శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణ సుఖ దుఃఖములయందు,
తథా = అట్లే,
మానావమానయోః = మానావమానములయందును,
జితాత్మనః = జయించబడిన మనస్సు గలవానికి,
(అందుచేతనే)
ప్రశాంతస్య=వృత్తులు శాంతించిన మనస్సుగలవానికి,
పరమాత్మా = భగవంతుడు,
సమాహితః = ప్రత్యక్షమైనవాడు.

తా. శీతోష్ణ సుఖదుఃఖములయందును, మానావమానముల యందును, ఎంతమాత్రమును వికారము చెందని మనస్సు గలిగిన ప్రశాంతచిత్తునకు పరమాత్మ సదా సర్వత్ర ప్రత్యక్షమే.

అ మృ త వా హి ని :—

మా న వు డు శరీరేంద్రియ సంఘాతముతో కూడిన మనస్సును జయించినవాడు, శీతోష్ణ సుఖదుఃఖములుగాని

మానావమానములుగాని, ఆతనికి ఎంతమాత్రమును వికారమును కలిగించలేవు. అట్టివాని అంతఃకరణము నిస్తరంగ సముద్రమువలె ప్రశాంతముగ ఉండును. ఇక ఆ మహాత్మునకు పరమాత్మ సదా సర్వత్ర ప్రత్యక్షముగనే ఉండును.

శ్లో॥ జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా
కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మ కాంచనః ॥ ౮

ప. వి :— జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా, కూటస్థః, విజితేంద్రియః, యుక్తః, ఇతి, ఉచ్యతే, యోగీ, సమలోష్టాశ్మ కాంచనః.

టీక :—

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా = జ్ఞాన విజ్ఞానముల రెంటి చేతను తృప్తిచెందిన అంతఃకరణము కలవాడును,

కూటస్థః = వికారము లేనివాడును,

విజితేంద్రియః = ఇంద్రియములయందు పూర్తి విజయమును సాధించినవాడును,

సమలోష్టాశ్మకాంచనః = మట్టి, రాయి, బంగారము - అన్నియు సమముగాచూచువాడును అగు,

యోగీ = యోగి,

యుక్తః = యుక్తుడు - అనగా భగవత్ప్రాప్తి లభించినవాడు,

ఇతి = అని,

ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. ఎవని అంతఃకరణము జ్ఞాన విజ్ఞానముల రెంటిచేతను తృప్తి చెందియున్నదో, ఎవని స్థితి వికారరహితమో, ఎవని ఇంద్రియములు పూర్తిగ జయించబడినవో, ఎవనికి మట్టి, రాయి, బంగారము - అన్నియు సమమో, అట్టి యోగి యుక్తుడు - అనగా భగవత్ప్రాప్తి పొందినవాడు అని చెప్పబడుచున్నాడు.

అమృతవాహిని :-

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముడు : జ్ఞానమనగా - భగవద్విషయిక సామాన్య జ్ఞానము; విజ్ఞాన మనగా-భగవంతుని విశేష మాహాత్మ్య జ్ఞానము. అంతఃకరణము ఇట్టి జ్ఞాన విజ్ఞానముల రెండింటిచేత తృప్తిచెంది యుండుట అనగా, ఇక తెలిసికొన వలసినది లేక, ఆ జ్ఞాన విజ్ఞానముల ప్రాప్తిచేత లభించిన ఆనందముతో తృప్తి చెంది యుండుట. ఆ స్థితి పొందినవాడు జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముడు.

కూటస్థుడు : ఏ పరిస్థితులలోను వికారములు లేక అచల భావముతో తన స్థితియందే నిలిచి యుండువాడు కూటస్థుడు.



విజితేంద్రియుడు : ఇంద్రియములను పూర్తిగ జయించిన వాడు. విషయము లన్నియును అనిత్యములు, తుచ్ఛములు అని బాగుగ తెలియుటచేత, ఏ విషయములయందును, ఎంతమాత్ర మును ఆసక్తి ఉండనివాడు; అందుచేతనే వాని ఇంద్రియములు విషయములయందు రుచిలేక నివృత్తిచెంది ఉండును. అంతియే కాదు - అట్టి పురుషుడు లోకసంగ్రహముకొరకు, భగవ త్కైంకర్య రూపముగ ప్రవర్తించునప్పుడు, తనఇష్టానుసారము వీటిని (ఇంద్రియములను) ఎక్కడ నిలిపిన అక్కడనే నిలిచి ఉండునుగాని, తమంత తాముగా తమ ఇష్టానుసారము ఎక్క డకును పోవు. పురుషుని చిత్తములో కించిన్మాత్రముకూడ క్షోభను కలిగించవు. ఈ విధముగ ఇంద్రియములను తన స్వాధీనమం దుంచుకొన్నవాడు విజితేంద్రియుడు.

సమలోష్టాశ్మకాంచనుడు : లోష్టము అనగా మట్టి; అశ్మము అనగా రాయి; కాంచనము అనగా బంగారము- వీటియందు సమబుద్ధి కలవాడు. లోకమునందు వాని వాని విలువల తారతమ్యమును బట్టి వానికి విలువ ఇచ్చుట, లేక నిరసించుట చేయనివాడు. అనగా పరమ వైరాగ్యసంపన్నుడు అని భావము. ఈ స్థితికి వచ్చిన యోగి భగవత్ప్రాప్తిని పొందినవాడు అని గ్రహించవలయును. అట్టియోగి ప్రారబ్ధము చేత ఇంకను ఆయుశ్శేషము మిగిలియుండి, అందరివలెనే శరీర ధారియై ప్రపంచములో సంచరించుచున్నను వానికి సర్వకాల

సర్వావస్థలయందును భగవదనుభవము కలుగుచునే ఉండును. దానికి అంతరాయము ఉండదు.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన
మధ్యస్థ ద్వేష్య బంధుషు।
సాధుష్వపిచ పాపేషు
సమబుద్ధి ర్విశిష్యతే॥

ప. వి :-సుహృన్మిత్రా, ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు, సాధుషు, అపి, చ, పాపేషు, సమబుద్ధిః, విశిష్యతే.

టీక :-

సుహృత్ = ప్రయోజనము నాశించక ఉపకారము చేయువారు

మిత్ర = మిత్రులు,
అరి = శత్రువులు,
ఉదాసీన = తటస్థులు,
మధ్యస్థ = మధ్యస్థులు,
ద్వేష్య = ద్వేషింపదగినవారు,
బంధుషు = బంధువులు - వీరందరియందును,
సాధుషు = సాధువులయందును,
పాపేషు చ = పాపులయందును,
అపి = కూడ,
సమబుద్ధిః — సమాన భావము కలవాడు
విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు

తా. సుహృత్తులు, మిత్రులు, శత్రువులు,
ద్వేషింపదగినవారు, బంధువులు మొదలగు వారి
యందును, పాపుల యందును కూడ సమబుద్ధి కల

అమృతవాహిని :—

సుహృత్తు లనగా - తమ చేత ఉ
వారు తిరిగి తమకు ఉపకారము చే
చివరకు కృతజ్ఞులుగా నైన ఉండవలయున
మును భావింపక నిష్కామ్యముగ ఉపకార

మిత్రు లనగా - తాము ఎవరియందు
యున్నారో, వారు తిరిగి తమయందు కూడ
యుండవలయునని కోరి స్నేహము చేయువా

శత్రువు లనగా - తన కపకారము
విషయములో మరల ప్రతీకారము చేయు
కలిగియుండి ప్రయత్నించువారు.

ఉదాసీను లనగా - ఇతరులకు మే
నుండి కోరరు. కీడును చేయను; కోరరు.

మధ్యస్థు లనగా ఇద్దరు వివాదపడున
ఎంతమాత్రమును లేక, వారి వివాదము
చేయువారు.

ద్వేష్యు లనగా - అకారణముగా కీడు తలచువారు.
బంధువు లనగా - అకారణముగా మేలుతలచువారు.
సాధువు లనగా - ధర్మాత్ములు.
పాపు లనగా - పాపాత్ములు.

మహాత్ములు వీ రందరియందునుకూడ సమబుద్ధికలిగి యుందురు. ఇది చాలకష్టమైన విషయము. ఏలయన సుహృత్తులు, మిత్రులు, ఉదాసీనులు, మధ్యస్థులు, సాధువులు అనబడు వారియందు, మానవునకు ప్రేమఉండుట సహజము. అట్లే శత్రువులు, ద్వేష్యులు, పాపులు అనబడు వారియందు ద్వేషము, అసహ్యాభావము కలుగుట సహజము. వివేకశీలురు అనబడు వారియందుకూడ పైన చెప్పబడిన వారినిగురించి సహజముగనే రాగద్వేషము లుండుట కనపడుచున్నది. ఇటువంటి అత్యంత విరుద్ధమైన వారియందుకూడ భేదబుద్ధి, రాగద్వేషములు ఎంతమాత్రమును లేకుండుట, - అత్యంతమును విశిష్టమైనది. ఇట్టి స్థితి కేవలము భగవద్దర్శనమైన మహానుభావులకే సాధ్యము. అట్టి మహానుభావులకు ఇట్లు పై చెప్పబడిన వా రందరియందును సమభావము ఉండుట ఒక గొప్పకాదు - మానవులయందే కాదు - ఇతర జీవులయందుకూడ వారు సమభావమే కలిగి యుందురు- "విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని। శునిచైవ శ్వపాకేచ పండితా

స్సమదర్శినః ॥" విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందును, ఆవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కను వండుకొని తిను చండాలునియందునుకూడ సమత్వ ముతో వర్తింతురు. ఇక మానవుల విషయము చెప్పవలయునా?

శ్లో॥ యోగీ యుంజీత సతత
మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా
నిరాశీ రపరిగ్రహః ॥ ౧౦

ప. వి :- యోగీ, యుంజీత, సతతం, ఆత్మానం, రహసి, స్థితః, ఏకాకీ, యతచిత్తాత్మా, నిరాశీః, అపరిగ్రహః.

టీక :—

యతచిత్తాత్మా = మనస్సును, ఇంద్రియములను, శరీరమును స్వాధీనము చేసికొని,
నిరాశీః = ఆశలేనివాడై,
అపరిగ్రహః = భగవదతిరిక్తమైన ఏ పదార్థమునందును మమకారము లేనివాడై,
యోగీ = పరమాత్మయందే చిత్తము లగించి,
ఏకాకీ = ఒంటరిగా,
రహసి = ఏకాంత ప్రదేశమందు,
స్థితః = ఉన్నవాడై,
సతతం = నిరంతరము,

ఆత్మానం = తనను,
యుంజీత = (భగవద్ధ్యానములో) నిలుపుకొనవలసి
యున్నది.

తా. శరీరేంద్రియములతో సహా మనస్సును వశమందుంచుకొన్న వాడును, ఆశారహితుడును, భగవదతిరిక్తమైన ఏ పదార్థమునందును మమకారము లేనివాడును, అయిన యోగి ఒంటరిగా ఏకాంత ప్రదేశమునందున్నవాడును అయి తనను భగవద్ధ్యానములో నియమించుకొనవలయును.

అమృతవాహిని :—

ఈ శ్లోకములో భగవద్ధ్యానములో సిద్ధిపొందుటకు ప్రయత్నించువాడు ఎట్టివాడుగ ఉండవలయునో చెప్పబడి యున్నది.

యతచిత్తాత్మా : అనగా శరీరముతో, ఇంద్రియములతో సహా మనస్సును వశమందుంచుకొన్నవాడు; వీటిని వశమందుంచుకొనని వానికి ధ్యానము సిద్ధించదు. మనస్సును భగవంతుని ధ్యానించుటకు నియమించిన, అది దానికి ఇష్టమైన ప్రాపంచిక వ్యవహారములనో, వస్తువులనో, భోగములనో ధ్యానించుటకు సిద్ధమగును. కనుక ధ్యానము చేయవలయుననిన ముందు శరీరేంద్రియములతో సహా మనస్సును వశమందుంచుకొనవలయును.

నిరాశీః : అనగా-ఏమియును ఆశలేనివాడు. ఇహలోక సంబంధములైనవియు, పరలోకసంబంధము లైనవియు అగు భోగ్యపదార్థములయందు ఏఅవస్థలోను, ఏవిధముగను, ఎంత మాత్రమును ఆశలేనివాడు. ఆశ మనస్సును ధ్యానములో నిలువనీయదు. కనుక ఆశనుకూడ త్యజించవలసియున్నది.

అపరిగ్రహః : అనగా - భగవదతిరిక్తములైన పదార్థములయందు వేనియందును మమకారము లేనివాడు. ధ్యానములో సిద్ధిపొందదలచినవాడు మమకారమునుకూడ వదలవలసి యున్నది. ఈ లక్షణములు కల యోగి, ఒంటరిగా అనగా-అభ్యాసమునకు విఘ్నమును కలిగించు సాంసారిక జనముతో సంబంధము లేకుండ, ఏకాంత ప్రదేశములో అనగా - అభ్యాసమునకు ఏవిధముగను విఘాతములురాని రహస్య ప్రదేశములో, తన్ను తాను తన ప్రయత్నముతో భగవద్ధ్యానమునందు నియమించుకొనవలయును.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య
స్థిర మాసన మాత్మనః ।
నా త్యు చ్ఛ్రితం నాతినీచం
చేలాజిన కుశో త్తరమ్ ॥ ౧౧

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుంజ్యా
ద్యోగ మాత్మవిశుద్ధయే ॥ ౧౨

ప. వి :— శుచౌ, దేశే, ప్రతిష్ఠాప్య, స్థిరం, ఆసనం, ఆత్మనః, న, అత్యుచ్ఛ్రితం, న, అతినీచం, చేలాజినకుశోత్తరం.

ప. వి :- తత్ర, ఏకాగ్రం, మనః, కృత్వా, యతచిత్తేంద్రియక్రియః, ఉపవిశ్య, ఆసనే, యుంజ్యాత్, యోగం, ఆత్మవిశుద్ధయే.

టీక :—

శుచౌ = పరిశుద్ధమైన,
దేశే = ప్రదేశమునందు,
న అత్యుచ్ఛ్రితం = మిక్కిలి ఎత్తుకానిదియును,
న అతి నీచం = మిక్కిలి క్రింద కానిదియును,
చేలాజినకుశోత్తరం = దర్భలు, పైన కృష్ణాజినమును, ఆపైన వస్త్రము కలిగినదియును,
స్థిరం = స్థిరమైనదియునగు,
ఆత్మనః = తనయొక్క,
ఆసనం = ఆసనమును,
ప్రతిష్ఠాప్య = ఏర్పాటు చేసికొని,
తత్ర ఆసనే = ఆ ఆసనమునందు,
ఉపవిశ్య = కూర్చొని,

మనః = మనస్సును,
ఏకాగ్రం = ఏకాగ్రముగా,
కృత్వా = చేసి,
యతచిత్తేంద్రియ క్రియః = చిత్తముయొక్కయును,
ఇంద్రియముల యొక్కయును వ్యాపారములను
నియమించినవాడై,
ఆత్మవిశుద్ధయే = అంతఃకరణ పరిశుద్ధికొరకు,
యోగం = యోగమును (ధ్యానమును),
యుంజ్యాత్ = అభ్యసించవలయును.

తా. పరిశుద్ధమైన ప్రదేశమునందు, మిక్కిలి ఎత్తు కానట్టిదియును, మిక్కిలి క్రింద కానట్టియియును, దర్భలును, పైన చర్మమును, ఆపైన వస్త్రమును కలిగినట్టిదియును స్థిరమైనట్టిదియు అగు ఆసనమును తనకొరకు ఏర్పాటు చేసికొని, ఆ ఏర్పాటుచేసికొనిన ఆసనమునందు కూర్చొని, మనస్సును ఏకాగ్రముచేసి, చిత్తముయొక్కయును; ఇంద్రియముల యొక్కయును వ్యాపారములను నియమించినవాడై అంతఃకరణ పరిశుద్ధి కొరకు ధ్యానయోగమును అభ్యసించవలయును.

అ మృ త వా హి ని :-

ధ్యానయోగ మభ్యసించదలచిన వానికి ముందు పరిశుద్ధమైన ప్రదేశము కావలయును. అపవిత్ర మానవులు నివసించునదిగాని, అట్టి అపవిత్ర మానవులచేత ఈయబడినది గాని, అయిన అది అపవిత్రమైనదే కాగలదు. కనుక అట్టిది

పనికిరాదు. అక్కడ అపరిశుద్ధ వస్తువులుండరాదు. గంగ, యమున, కృష్ణ, గోదావరి, కావేరి మొదలగు పుణ్యనదీ తీరములుగాని, పర్వత గుహలు, దేవాలయములు, పవిత్ర వనములు, మొదలగునవిగాని, అయిన యెడల చాల ఉత్తమములే.

తన గృహమందైనను, ఆశ్రమమునందైనను ధ్యానమునకని, ఒక ప్రదేశమును ఏర్పాటు చేసికొనవచ్చును. ఆ ప్రదేశమును చక్కగ ఊడ్చి, గోమయముతో అలికిన పవిత్రముగ నుండును. రాతితోడను, సున్నముతోడను కట్టినదైన యెడల చక్కగ కడిగియైనను శుభ్రము చేయవలయును.

అక్కడ ఒక ఆసనము ఏర్పాటు చేసికొనవలయును. ఆ ఆసనము కఱ్ఱదియైన యెడల ఉత్తమము. రాయి మొదలగు వానితో చేసినది అయిన రెండవపక్షము. వీటిలో దేనితోనో ఒకదానితో ఒకపీఠమును చేయించవలయును. కూర్చొనుటకు ఇరుకుకాకుండ, బాగుగ విశాలముగ ఉండవలయును. ఎక్కువ ఎత్తుగాని, ఎక్కువ పల్లముగాని కాకుండ ఉండవలయును. ఎక్కువ ఎత్తైన యెడల ఒక్కొక్కప్పుడు అభ్యాస కాలములో కునికిపాట్లువచ్చి పడవచ్చును. ఎత్తునుంచి పడుటచే చేయిగాని, కాలుగాని, విరిగినను విరుగవచ్చును. అందువలన ఎక్కువ ఎత్తు పనికిరాదు. మరీ పల్లమైనయెడల చీమలు, తేళ్ళు

పాములు మొదలగునవి ప్రాకి బాధ కలిగించవచ్చును. పొర పాటుననో, నిద్రమత్తువలననో మనచేయి, కాలు తాకి జల పాత్ర పడి నీరు ఒలికి మన క్రిందకే ప్రవహించవచ్చును.ఇవన్ని యును అభ్యాసకునికి ధ్యానభంగము కలిగించును.

ఇంక ఆ ఆసనము స్థిరమైనదిగా ఉండవలయును. లేని యెడల ఇటునటు కదలియో, కుంటినో కూర్చొనినవాడు పడవచ్చును; లేదా ధ్యానమునకు భంగము కలుగవచ్చును. కనుక ఎక్కువఎత్తు కానట్టియును, పల్లము కానట్టియును స్థిర మైన ఆసనమును ఏర్పాటు చేసికొనిన తరువాత ఆ ఆసనము పైన ముందుగ దర్భలు పరువవలయును. పైన లేడిచర్మము గాని, పులిచర్మముగాని, వేయవలయును. (గృహస్థులు పులి చర్మము ఉపయోగింపరాదని కొందరందురు.) ఆపైన ఒక తెల్లని ఉదికిన వస్త్రమును పరవవలయును. ప్రతిరోజును అవన్నియును దులుపుచుండవలయును. లేనియెడల వాటిలో చీమలుగాని, తేళ్ళుగాని, పురుగులు దోమలు మొదలైనవి గాని నివాసము ఏర్పరచుకొని అభ్యాసకులను బాధించవచ్చును.

పై వస్త్రము ప్రతిరోజును ఉదికినదే ఉపయోగించ వలయును. అభ్యాసకుని అధోమార్గముగుండ పోవు అపవిత్ర వాయువుల (అపానవాయువు మొదలగునవి) చేత అది అపవిత్ర మగుచుండును. కనుక ప్రతిరోజును ఉదికినదే వాడవలయును.

అట్టి ఆసనము మీద అభ్యాసకుడు కూర్చొని, చిత్తము యొక్కయును, ఇంద్రియముల యొక్కయును వ్యాపారములను నియమించవలయును.

ఇక్కడ చిత్తశబ్దమునకు అంతఃకరణమని అర్థము. మనస్సు చేత, సాంసారిక విషయములయొక్క చింతన జరుగును. బుద్ధి చేత విచారించి నిశ్చయించుట జరుగును. ఇవి అంతఃకరణముయొక్క క్రియలు. వీటిని సర్వవిధముల నిలుపగలుగుటయే అంతఃకరణముయొక్క క్రియలను జయించుట అనగా. ఇంద్రియ శబ్దమునకు అర్థము శ్రోత్రములు (చెవులు), త్వక్కు (చర్మము), చక్షువులు (నేత్రములు), జిహ్వ (నాలుక), ఘ్రాణము (ముక్కు) అను జ్ఞానేంద్రియములు ఐదును; వాక్కు (మాట్లాడుపరికరము), పాణి (చేయి), పాదము (కాలు), ఉపస్థము (మూత్రవిసర్జనేంద్రియము); గుదము (మలవిసర్జనేంద్రియము) అను కర్మేంద్రియములు ఐదును కలిసి పది ఇంద్రియములును. వినుట, స్పర్శ తెలిసికొనుట, చూచుట, రుచిని గ్రహించుట, వాసనను గ్రహించుట అను ఈ ఐదును జ్ఞానేంద్రియములయొక్క క్రియలు. మాట్లాడుట, పట్టుకొనుట, నడచుట, మూత్రమును విసర్జించుట, మలమును విసర్జించుట- ఈ ఐదును కర్మేంద్రియములయొక్క క్రియలు. వీటి నన్నిటిని తన ఇష్టప్రకారము నిలుపగలుగుట ఇంద్రియములయొక్క క్రియలను జయించుట అనగా. ఈ రెంటిని సాధించినవాడు యతచిత్తేంద్రియ క్రియుడు అగును.

(5)

తరువాత మనస్సును ఏకాగ్రము చేయవలయు అనగా - మనస్సుయొక్క వృత్తులు అనేక విధములుగ చిం వందరగ వ్యాపించి ఉండును. అట్టి వృత్తులను ధ్యేయవస్తు నందు కేంద్రీకరించుటయే మనస్సును ఏకాగ్రము చేయ అనగా. ఇక్కడ ప్రకరణమును బట్టి పరమాత్మయే ధ్యే వస్తువు. కాబట్టి పరమాత్మయందే మనస్సును ఏకాగ్ర చేయుట చెప్పబడినది. ఈ అధ్యాయములోనే పదునా శ్లోకములో "మచ్చిత్తః" అను విశేషణమును ఇచ్చి కృ భగవానుడు ఈ విషయమునే స్పష్టము చేసియున్నాడు కూ

ఇక ఈ ధ్యానయోగమును అభ్యాసము చేయ ఎందులకు ? "ఆత్మ విశుద్ధయే" 'అంతఃకరణ పరిశుద్ధికొరకు ఇట్లు చెప్పుటలో భావమును విచారణ చేయవలయును.

ధ్యానయోగమును అభ్యాసముచేయుట సాంసా సిద్ధులుగాని, గొప్పగొప్ప ఐశ్వర్యములను పొందుటకుగ ఎంతమాత్రమును కాదని దీనివలన నిర్ణయమైనది. మానవ పరమాశయము భగవంతుని పొందుటయే. అట్లు పొం వలయునన్నచో, అంతఃకరణములోనున్న రాగద్వేషము మొదలగు అవగుణములును, పాపములును, వీనికన్నిటికి కారణమైన అజ్ఞానముతో సహా నశించి, అంతఃకరణము శుద్ధము కావలయును. కనుక ఈ ధ్యానయోగముయొక్క అభ్యాసము కేవలము అంతఃకరణ పరిశుద్ధికొరకు మాత్ర చేయవలయును.

యోగమును అభ్యాసము చేయుట అనగా - పైన చెప్పినట్లు ఆసనము ఏర్పాటు చేసికొని, దానిపై కూర్చొని, అంతఃకరణము యొక్కయును, ఇంద్రియముల యొక్కయును క్రియలను నియమించి మనస్సును పరమాత్మయందు ఏకాగ్రము చేసి; నిరంతరముగ, తైలధారావిచ్ఛిన్నముగా, పరమాత్మను చింతించుకొనుచు ఉండవలయును. ఇదియే యోగమును అభ్యసించుట అనగా.

అవతారిక :-

ధ్యానయోగమును అభ్యసించుటకు ఆసనముపైన ఎట్లు కూర్చొనవలయునో, సాధకుని భావములు ఎట్లుండవలయునో, ఏ యే నియమములను పాటించవలయునో, ఏ ప్రకారము ధ్యానము చేయవలయునో - ఈ విషయములు చెప్పబడుచున్నవి రాబోవు రెండు శ్లోకములందు-

శ్లో॥ సమం కాయ శిరోగ్రీవం
ధారయ న్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశ శ్చానవలోకయన్॥ ౧౩

శ్లో॥ ప్రశాంతాత్మా విగతభీ
ర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మన స్సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆసీత మత్పరః ॥ ౧౪

ప. వి :-సమం, కాయశిరోగ్రీవం, ధారయన్, అచలం, స్థిరః, సంప్రేక్ష్య, నాసికాగ్రం, స్వం, దిశః, చ, అనవలోకయన్.

ప. వి ;-ప్రశాంతాత్మా, విగతభీః, బ్రహ్మచారివ్రతే, స్థితః, మనః,సంయమ్య, మచ్చిత్తః, యుక్తః, ఆసీత, మత్పరః.

టీక :—

యుక్తః = ధ్యానాభ్యాసియైన యోగి,
కాయ శిరోగ్రీవం = శరీరమును (వెన్నెముకను), శిరస్సును, కంఠమును- ఈ మూడిటిని,
సమం = సమముగాను,
అచలం = కదలిక లేకుండునట్లును,
ధారయన్ = నిలిపినవాడై,
స్థిరః = స్థిరుడై,
దిశః చ = దిక్కులను,
అనవలోకయన్ = చూడక,
స్వం = తనదగు,
నాసికాగ్రం = ముక్కుయొక్క అగ్రభాగమును,
సంప్రేక్ష్య = చూచుచు, ౧౩
బ్రహ్మచారివ్రతే = బ్రహ్మచర్యవ్రతమునందు,
స్థితః = ఉన్నవాడై,
విగతభీః = భయము లేనివాడై,

ప్రశాంతాత్మా = సకల వ్యాపారములనుండియును ఉపరతిని పొందుటచే ప్రశాంతిపొందిన అంతఃకరణము కలవాడై,
మనః = మనస్సును,
సంయమ్య = నియమించి,
మచ్చిత్తః = నా యందే చిత్తము నిలిపినవాడును,
మత్పరః = నన్నే పరమగతిగా కలవాడును అయి,
ఆసీత = ఉండవలయును. ౧౪

తా. కాయమును (వెన్నుపూసను), తలను, కంఠమును సమముగాను చలనము లేకుండునట్లుగాను, నిలిపినవాడై, స్థిరుడై, దిక్కులను చూడక, తన ముక్కుయొక్క అగ్రభాగమున దృష్టిని నిలిపి బ్రహ్మచర్యవ్రతమును అవలంబించినవాడై, భయరహితుడై, చక్కని ప్రశాంతిని పొందిన అంతఃకరణము కలవాడై, యోగాభ్యాసి (ధ్యానాభ్యాసి) మనస్సును నియమించి, నాయందే చిత్తము కలవాడగుచు, నన్నే పరమగతిగా తలచుచు ఉండవలయును.

అమృతవాహిని :—

ధ్యానమునకై ఆసనముపై కూర్చొను సమయమున మన ఇష్టము వచ్చినట్లు కూర్చొనరాదు. శరీరమును, తలను, కంఠమును సమముగా నుంచవలయును. ఇక్కడ కాయమనగా శరీరముయొక్క ఊర్ధ్వభాగము, వెన్నెముక అని అర్థము చెప్పవచ్చును. కనుక వెన్నెముకను సరిగ నిటారుగ ఎక్కడను

వంకర లేక నిలుపవలయును. అట్లే మెడను తలనుకూడ వంకర లేక సమముగ నిలుపవలయును. శరీరము చలించరాదు. కొంత మంది ధ్యానము చేసికొను సమయమున ఊగుదురు. ఇది పనికి రాదని పరమాత్మ అభిప్రాయము. కనుక ఊగుట మొదలగు కదలికలు లేకుండ స్థిరుడై ఉండవలయును. కాలుగాని, కాలి బొటనవ్రేలుగాని, చేయిగాని - ఏ భాగమును కదిలించరాదు. కేవలము చిత్రపు బొమ్మవలె, శిలాప్రతిమవలె కూర్చొన వలయును. దిక్కులను చూడరాదు. దిక్కులను చూచుచుండిన యెడల ధ్యానమునకు భంగము కలిగించు దృశ్యములు కనపడ వచ్చును. కనుక దిక్కులను చూడవద్దు అని గట్టిగా శాసించ బడినది. తరువాత తన ముక్కుయొక్క అగ్రభాగమునందు దృష్టిని నిలుపవలయును. ఈ విషయమును శ్రద్ధగా గమనించ వలయును. చాలమంది దిక్కులను చూడవద్దు అనునప్పటికీ, కండ్లు మూసికొనుటవలయును అనుకొందురు. అయితే, కండ్లు మూసికొనుటవలన ప్రత్యేకముగ ధ్యానమునకు భంగములేదు కనుక, కండ్లు మూసికొనరాదు అనికూడ నిర్ణ యము లేదు. కాని, చాలమందికి ధ్యానమునకు కండ్లు మూసి కొనగనే నిద్దురవచ్చి పైబడును. అందువలన కండ్లు మూసి కొనవద్దు అని చెప్పబడినది. తరువాత నాసికాగ్రదృష్టిచేత ధ్యానమునకు బాగుగ అనుకూలించు లాభములు కొన్ని కలుగును. వాటి అన్నిటిలో నిద్రాజయము ప్రధానమైనది. అందుకని కండ్లు మూసికొనక నాసికాగ్రమును చూచుచుండ వలయును.

అయితే కొంతమంది నాసికాగ్రమునందు దృష్టిని నిలిపి అనుటకు, మనస్సు నిలిపి అను అర్థమును చెప్పుచున్నారు. అట్లు చెప్పరాదు. ధ్యానములో మనస్సును పరమాత్మ యందు నిలుపవలయునుగాని, ఇక ముక్కు మొదలైన వాటి మీద నిలుపుటయూ చివరకు గీత బోధించినది! దృష్టినిలుపుట అనినప్పుడు దాని కర్థము చూపు అనియేగాని, మనస్సు కాదు. మూలములో 'సంప్రేక్ష్య' అనికూడ స్పష్టముగా నున్నది.

ధ్యానయోగము అభ్యాసము చేయు యోగి బ్రహ్మచర్యమును వ్రతముగ స్వీకరించవలయును. ఇక్కడ బ్రహ్మచర్యమనగా వీర్యధారణమనియే అర్థము. వీర్యము శరీరములోని ఒక అమూల్యమైన వస్తువు. దానిని జాగ్రత్తగ కాపాడుకొననియెడల మానవుని శారీరక మానసిక ఆధ్యాత్మిక సంబంధమైన బలములు క్షీణించిపోగలవు. కనుక శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులు వృద్ధిపొందవలయుననినయెడల వీర్యమును ఎంతమాత్రమును వ్యయముచేయక కాపాడుకొనియే తీరవలయును. బ్రహ్మచర్య వ్రతమనక, బ్రహ్మచారి వ్రతమనుట, సాధకుడు బ్రహ్మచర్యాశ్రమములో నున్న సరే-లేనియెడల ఏ ఆశ్రమములో నున్నవాడైనను, ధ్యానసిద్ధి కొరకు ప్రయత్నించువాడు బ్రహ్మచర్యము నాచరించియే తీరవలయును. కనుక బ్రహ్మచర్యాశ్రమములో నున్నవాని యొక్క- ఇతర నియమములుకూడ- బ్రహ్మచర్యమును కాపాడు

కొనుటకు ఉపయోగపడునంతవరకు మాత్రము - పాటించి తీర వలయును అను భావమును వ్యక్తము చేయుటకే యని తెలియవలయును.

ఆ ఆశ్రమములో వీర్యధారణ సులభసాధ్యమగుటకు అమితముగ ఉపయోగపడు నియమములు చాల గలవు. ఆ నియమములన్నింటిని చక్కగ పాలించుటచేత బ్రహ్మచర్య పాలనము అతిసులభమైపోవును.

యథార్థముగ వీర్యధారణము చేసినవాని శరీరములో ఒక విలక్షణమైన శక్తి ఏర్పడును. దానిచేత మనస్సుయొక్కయును, ప్రాణముల యొక్కయును గతి సహజముగ వశపడిపోవును. చిత్తము చింతించుట ధర్మముగ గలది. అయితే మానవుల చిత్తముయొక్క చింతనము ఒక దారి - డొంకగా నుండదు. క్షణక్షణమునకును మార్పుతో, ఏవో అనేకములుగా చింతనములు సముద్రములో తరంగములవలె కుప్పలు కుప్పలుగా బయలుదేరుచుండును. వాటినే వృత్తులు అందురు. వృత్తులన్నియు ఒకే గమ్యస్థానముగా వంకరలు మొదలైనవి లేకుండ, అవిచ్ఛిన్నముగ, నిరంతరముగా, త్వరితగతిని ప్రవహించుటయే ధ్యానమని చెప్పబడును. ఈ స్థితి వీర్యధారణ చేత సహజముగ లభించగలదు.

ఈ రోజులలో పరమార్థమందభిప్రాయముకలిగి ప్రయత్నించు వారిలో నూటికి తొంబదితొమ్మదిమంది ఎంత

ప్రయత్నించినను ధ్యానము చేయలేకుండ నున్నారు. వారి చిత్తము ధ్యేయ వస్తువుమీద నిలువదు. దానికి ముఖ్యాతి ముఖ్యమైన కారణము వీర్యధారణ లేకపోవుటయే. వివాహమై గృహస్థాశ్రమములో నున్నవారైనను, ఆ ఆశ్రమముయొక్క నియమములకు లోబడి, సంయమ పూర్వకముగా, భార్యతో వర్తించినను, అదికూడ బ్రహ్మచర్యముగనే పరిగణింపబడినది. బ్రహ్మచర్యమునకు ప్రాణమువంటిది వీర్యధారణముగనుక, అట్టి వీర్యధారణము సంపూర్ణముగ చేసినవానికిని, గృహస్థ ధర్మములకు లోబడి బ్రహ్మచర్యము నడిపినవానికిని, భేద మున్నప్పటికిని, గృహస్థ బ్రహ్మచర్యము వలనకూడ ధ్యానము నకు చాల సహాయము లభించగలదు. వీర్యధారణకును, ధ్యానమునకును అట్టి అవినాభావ సంబంధము ఉన్నది. వీర్య ధారణలేక, స్వేచ్ఛాప్రవర్తనతో జీవితము గడుపువారికి ధ్యానము నిలుచుట అనగా - నీటిమీద కొండలు తేలుట వంటిదే. ఒకప్పుడు ఇటువంటిది జరిగినను అది ఒక్క భగవ చ్ఛక్తికి సంబంధించినది మాత్రమే. ఇక మిగిలినచోట్ల అసంభవమే.

ఏమియును భయములేని వానికే ధ్యానయోగము విఘ్నరహితముగ సాగును. పరమాత్మ సర్వత్ర ఉన్నాడను విషయమును ధ్యానయోగి బాగుగా తెలిసికొనవలయును. సర్వత్ర భగవంతుడుండి, సత్వులను రక్షించుచున్నప్పుడు

ఆయనమీాద భారము వేసిన ధ్యానయోగికి, భయపడవలసిన పని ఏమి? ఆ స్థితి ఎందులకు వచ్చును? నిర్భయుడై ధ్యానమును అభ్యసించవలయును. అంతఃకరణములో ఏమాత్రము భయమున్నను, ఏకాంతము, నిర్జనమునైన ప్రదేశములో సహజముగనే, ఆ భయము పైకి విజృంభించును. ఆ భయముచేత చిత్తములో విక్షేపదోషము కలుగును. విక్షేపమువలన చిత్తము నిలుకడలేక చలించుచుండును. ఇంక ఆ చిత్తము ధ్యానములో ఎట్లు నిలువగలదు ? భగవంతుడు సర్వశక్తిమంతుడును, సర్వజ్ఞుడును, సర్వవ్యాపియును, కరుణామృతసముద్రుడును, అగుట చేత, ఇక్కడకూడ ఎప్పుడును ఉన్నాడుగదా ! ఆయన ఉండగా ఇంకను భయమెందులకు ? ఏ విధమైన భయమును చెందనవసరము లేదు అని సాధకుడు దృఢాధ్యవసాయము కలిగియుండవలయును.

పోనీ - ప్రారబ్ధమునను సరించి, ధ్యానసమయములో ఏ కారణము చేతనైనను, మృత్యువే సంభవించినను అదియును సాధకునకు మేలే. భగవంతుని ధ్యానించుకొనుచు, ఈదేహమును విడుచుట సంభవించిన యెడల ఇక వానికి ముక్తియే. సాధకుడు దేనికొరకు ఇంతశ్రమపడి సాధన చేయుచున్నాడో, అది లభించనే లభించును. "అంతకాలేచ మామేవ- స్మరన్ముక్త్వా కళేబరం యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః" అని ఎనిమిదవ అధ్యాయములో అయిదవ శ్లోకమున

ఈవిషయమే చెప్పబడినది. అందువలన ధ్యానయోగి ఈ విచారణముమీద దృఢముగ నిలబడియుండును కాబట్టి అతడు 'విగతభీః' భయముపోయినవాడు అని చెప్పబడినది.

శ్రుతికూడ "ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కుతశ్చ నేతి" 'ఆనందమయుడైన బ్రహ్మమును తెలిసికొనినవాడు దేనిచేతను భయపడడు (తై - ఉ - 2-9) అని ఉపదేశించినది.

ఇంకను ధ్యానయోగి ప్రశాంతాత్ముడై ధ్యానయోగమును ఆరంభించవలయును. చిత్తము ప్రశాంతముగ ఉన్నగాని ధ్యానము సాగదు. చిత్తము ప్రశాంతము కావలయునన్నచో, రాగద్వేషములు, హర్షశోకములు, కామక్రోధములు మొదలగు దుర్గుణములచేత దూషితములైన వృత్తులను, సాంసారిక సంకల్ప వికల్పములను పూర్తిగ త్రోసివేయవలయును. వైరాగ్యము ద్వారా చిత్తమును నిర్మలముగను, శాంతముగ నొనర్చుకొని, ధ్యానయోగ సాధన చేయవలయును. అట్లు చేయువాడు ప్రశాంతాత్ముడు. కనీసము పైన చెప్పిన అర్హతను సంపాదించుటకు త్రికరణశుద్ధిగ ప్రయత్నమైనను చేయుచు ధ్యానయోగమును అభ్యసించవలయును.

"మన స్సంయమ్య" - మనస్సును వశమందుంచుకొనవలయును. ఒకచోట నిరోధింపబడక పోవుటయును, ఎంత

నిరోధించినను బలాత్కారముగ విషయముల మీదికి పరుగు పెట్టటయును మనస్సునకు స్వభావము. ఇట్టి మనస్సును వశము చేసికొనకుండ ధ్యానయోగము యొక్క సాధనము సాగనే సాగదు. ధ్యానముచేయు సమయములో విషయములమీద ఉన్న మనస్సును మరలించి తెచ్చి, లక్ష్యముమీద నిలుప వలసిన భాధ్యత సాధకునకు పూర్తిగ గలదు. మనస్సు వశ మందున్నగాని ఈబాధ్యత నెరవేరుటకు వీలులేదు.

"మచ్చిత్తః" 'నాయందే చిత్తముగలవాడై' - అనగా పరమాత్మయందే చిత్తమును నిలిపినవాడై - ఉండవలయును. చిత్తముయొక్క వృత్తులన్నియును, ఒకే గమ్యస్థానము లక్ష్యముగా, వంకరలు మొదలైనవి లేకుండ, అవిచ్ఛిన్నముగ, నిరంతరముగ, దురితగతిని ప్రవహించుటయే ధ్యానమని పైన చెప్పితిమిగదా ! అయితే ఆగమ్యస్థానమేది ? ఈ విషయ మును 'మచ్చిత్తః' అను విశేషణముచేత ఆచిత్తమునకు నన్నే- అనగా పరమాత్మనే - గమ్యముగ ఉంచుకొనవలసినదని చెప్పుచున్నాడు.

యథార్థమైన ప్రేమ ఉన్నచోటనే నివాసము ఏర్పరచు కొనుట చిత్తమునకు స్వభావము. కనుక ఆ చిత్తమునకు యథార్థమైన మేలుకోరు వారిలో పరమోత్కృష్టుడును, పరమ సుహృత్తును, ప్రియతముడును, పరమేశ్వరుడును, సకలకల్యాణ గుణ మహోదధియును అయిన భగవంతునియొక్క తత్త్వ గుణ

వైభవ ప్రభావ రహస్యములను గురించి ఎప్పుడును కీర్తించు కొనుచు, భావించుకొనుచు, ఉన్న యెడల చిత్తమునకు సహజముగ భగవంతునిపై ప్రేమ జనించును. జగత్తుయొక్క తుచ్ఛత్వమును, అనిత్యత్వమును, దుఃఖమయత్వమును ఎప్పుడును విచారించుచుండిన యెడల చిత్తమునకు జగత్తుపై వైరాగ్యము కలిగి ప్రేమ తగ్గుచుండును. భగవంతునిమీద ప్రేమ పెరుగుచున్నకొలది జగత్తుమీద ప్రేమతగ్గి వైరాగ్యము కలుగును. జగత్తుమీద ప్రేమ తగ్గుచున్నకొలదిని భగవంతుని మీద ప్రేమ పెరుగును. ఇట్లు ఒకదాని కొకటి తోడ్పడు చుండును. భగవంతునిమీద ప్రేమ పెరుగుచున్నకొలది చిత్తమునకు భగవంతునిపై ధ్యానము సహజమైపోవును. ఈకారణమున 'మచ్చిత్తః' అని భగవానుడు చెప్పియుండెను.

"మత్పరః" అనగా 'నన్నే పరమగతిగా ఆశ్రయించినవాడవై 'అని అర్థము.అనగా భగవంతుడు-నాయందు ధ్యానము సిద్ధించవలయు నన్నచో మత్పరుడవు కమ్ము అనుచున్నాడు. కనుక, భగవంతుడే మనకు పరమగతి, పరమధ్యేయము, పరమాశ్రయము అని నమ్మి, భగవంతుని ఆశ్రయించవలయును. ఇంకను భగవంతుడే మనకు పరమ రక్షకుడు, స్వామి, జీవనము, ప్రాణము, సర్వస్వము అని గ్రహించి, విశ్వసించి, ఆయన మనకు ఏది ప్రాప్తింపజేసినను అదియే మహాప్రసాదమని, పరమసంతుష్టితో ఉండవలయును. ఇట్లుండువాడే భగవత్పరుడు అనబడుచున్నాడు.

అవతారిక :—

ఇట్లు ధ్యానయోగమును సాధించినవాని ఫలమును చెప్పబడుచున్న దీ శ్లోకములో -

శ్లో॥ యుంజన్నేవం సదాత్మానం
యోగీ నియతమానసః ।
శాంతిం నిర్వాణపరమాం
మత్సంస్థా మధిగచ్ఛతి ॥

ప. వి:- యుంజన్, ఏవం, సదా, ఆత్మానం, యోగీ, శాంతిం, నిర్వాణపరమాం, మత్సంస్థాం, అధి

టీక :—

ఏవం=ఈ ప్రకారముగ (పై శ్లోకములో చె

నియతమానసః = మనస్సును వశమందుం
యోగీ = ధ్యానాభ్యాసి,
ఆత్మానం = (వశమైన) మనస్సును,
సదా = ఎల్లప్పుడును,
యుంజన్ = (పరమాత్మనైన నాయందు)

మత్సంస్థాం = నాయందున్నట్టియును,

నిర్వాణపరమాం=మోక్షస్వరూపమైనట్టియును,
శాంతిం = శాంతిని,
అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా. మనస్సును వశమందుంచుకొన్న యోగి (ధ్యానాభ్యాసి) ఆవిధముగ వశమయిన తన మనస్సును పరమాత్మనైన నాయందు ఎల్లప్పుడును, నిశ్చలముగా నిలిపినవాడై, నాయందు నెలకొనియున్న మోక్షరూపమైన శాంతిని పొందుచున్నాడు.

అమృతవాహిని :-

మనస్సు ఏకాగ్రత చెందుట అవసరము. కాని ఈ సందర్భమున కొన్ని విషయములు గమనింపవలయును. పూర్వజన్మ సంస్కారబలమున కొంతమంది మనస్సు సహజముగనే ఏకాగ్రత చెందియుండును. అది ఏవిషయమున ప్రసరించిన ఆ విషయమున ఏకాగ్రముగ నిలువవచ్చును గాని, మన స్వాధీనములో ఉండి మనము ప్రసరింపజేయదలచిన వైపు ప్రసరింపదు. దాని ఇష్టము వచ్చినప్పుడు. ఇష్టము వచ్చిన చోటున నిలుచును. ఇది ప్రయోజనము లేదు.

ఒకొక్కడు తన మనస్సును ఏకాగ్రము చేయును. ఆ మనస్సు అతని ఆధీనములోనే ఉండును కూడ. అయినను అతడు భగవంతునియందుగాక ఇతర విషయములయందు తన మనస్సునుంచి ఏకాగ్రము చేయును. ఇట్లు చేయుట

మనశ్శక్తిని వ్యర్థము చేయుటయే. అంతేకాదు; దుర్వినియోగము చేయుటకూడ అగును. ఏకాగ్రమైన మనస్సును భగవంతునియందే లగ్నముచేసి యుంచినయెడల ఈ యోగము సుఖదాయకమగును. లేనియెడల క్లేశదాయకము మాత్రమే - ఇదే గీతాసిద్ధాంతము.

భగవంతునియందు మాత్రము నిష్ఠ లేకుండ, కేవలము మనోజయమును, ఇంద్రియ నిగ్రహమును కలిగియున్నవారికి, తమకును లోకమునకునుకూడ ఉపద్రవకారణములైన అనేక సిద్ధులు కలుగవచ్చును. ఇది గీతకేగాక, మోక్ష ప్రతిపాదకములైన సకల శాస్త్రములకునుకూడ అసమ్మతమే. కనుక మనస్సును భగవంతునియందే ఉంచవలయును.

ఇదే విషయము ఈ అధ్యాయములో ఇరువది తొమ్మిది, ముప్పదియవ శ్లోకములలోను, చివరిదైన నలుబది ఏడవ శ్లోకములోను మరల స్పష్టము చేయబడినది.

ఈ శ్లోకములో "యుంజన్నేవం సదాత్మానం" 'పరమాత్మయందే మనస్సును సదా నిలిపినవాడై' అని ఉన్నది. ఈ 'సదా' అను శబ్దమునకు అర్థము ఎప్పుడును అని. ఈ 'సదా' అనుశబ్దమును గురించి వ్రాయుచు, తిలక్ మహాశయుడు ఈ శ్లోకమునందు 'సదా' అను శబ్దముచే "ప్రతిదినమును, ఇరువది నాలుగు గంటలును అని చెప్పరాదు. ప్రతిదినమును ఒక

గడియయైననను యథాశక్తిగ ఈ అభ్యాసము చేయవలయునని ఇచ్ఛా వివక్షితము" అనినాడు.

కాని ఈ 'సదా' శబ్దము అభ్యాసము విషయమున ప్రయోగింపబడినదికాదు. అభ్యాసము దినమునకు ఏ ఒక్క గడియయో చేయవచ్చును. ఆ అభ్యాసముయొక్క ఫలము మనస్సు భగవంతునియందు సదా నిలుచుటయే. అట్లు నిలుచుటవలన ఏమి లభించునో ఈ శ్లోకమునం దున్నది. అదే భగవంతునియందే ఉన్నట్టియును, మోక్షరూపమైనట్టియును పరమశాంతి.

ఇచ్చట ఒకశంక కలుగవచ్చును - ఒక్కక్షణముకూడ ఎడములేకుండ మనస్సును పరమాత్మయందే నిలిపినయెడల, ఇక మిగిలిన కర్మలు జరుగు టెట్లు ? - అని ఈ సందేహమును మనస్సులో పెట్టుకొనియే తిలక్ మహాశయుడుకూడ "అట్టి స్థితిలో కర్మలు చేయుటకు వీలుపడదు కనుకను, కర్మలు జరిగియే తీరవలయును గనుకను, మనస్సును రోజున కొక్క గడియమాత్రము భగవంతునియందు నిలిపి, తరువాత మరల భగవంతుని నుండి మరలించి కర్మలు చేయవలయును" అను భావమును సూచించినాడు.

నిజమునకు పై శంకకు తావులేదు. సాధనదశలో అయినచో భగవంతునియందు మనస్సు నిలిపినప్పుడు ఇతర

కార్యక్రమములు సాగవు; ఇతర కార్యక్రమములు జరుగు నప్పుడు భగవంతునియందు మనస్సు నిలువదు. కాని, సిద్ధావస్థలో భగవంతునియందే నిశ్చలముగ నిలిచియుండుట మనస్సుకు సహజమగును, అప్పుడు అట్టి వానిచేత ఎన్ని కార్య కలాపములు జరుపబడుచున్నను, అతని మనస్సు భగవంతుని నుండి క్షణమాత్రముకూడ చలించదు. ఇది అనుభవగమ్యమైన విషయము. ప్రహ్లాదునిస్థితి ఇదియే. దీనినే సహజసమాధి అందురు. ఈ స్థితియే అత్యుత్తమమైనది.

పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్,
భాషించుచున్, హాసలీ
లా నిద్రాదులు సేయుచున్, దిరుగుచున్,
లక్షించుచున్, సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ
చింతామృతాస్వాద సం
ధానుండై మరచెన్ సురారిసుతుడే
తద్విశ్వమున్ భూవరా !

అని శ్రీ భాగవతములో వర్ణింపబడియున్నది ఈస్థితియే.

ఈ స్థితి లభించకపోగా, ఈ స్థితి ఉన్నదనియే తెలియని వారు, కదలినను, మెదలినను తమ ధ్యానమునకు భంగము వాటిల్లునని భయపడుచుందురు. అందుచేత వారు ఏ పని

యును ముట్టుకొనరు. చివరకు దాహమైనవారికి మంచినీరు ఇచ్చుటకూడ తమ ధ్యానమునకు భంగమే అని జంకుచుందురు. ఇక కర్మలకు ప్రాధాన్య మిచ్చువారుకూడ భగవద్ధ్యానములో ఉన్నప్పుడు ఏమియును కర్మలు చేయలేదనియే భావింతురు. అందుచేతనే, "ఎప్పుడును భగవంతుని ధ్యానము చేసికొనుచు ముక్కు మూసుకొని కూర్చుండినచో పను లెట్లు సాగును ? ఏదో దినమునకు ఏ ఒక్కగడియయో ధ్యానము చేసికొని, తరువాత కర్మలు చేయుచుండవలయును" అని చెప్పుదురు.

యథార్థమాలోచించిన ఈ రెండు సిద్ధాంతములలోను పూర్తిలేదు. పైన చెప్పబడిన సహజసమాధి సిద్ధించినప్పుడే మానవుడు పూర్ణుడు కాగలడు - అనగా పూర్ణమానవుడు కాగలడు. వానిచే గీత స్థితప్రజ్ఞుడనియును, భక్తుడనియును, యోగి యనియును, జ్ఞాని యనియును, గుణాతీతుడనియును చెప్పినది.

అందుచేత ఇచ్చట 'సదా' అనగా సర్వకాల సర్వావస్థలయందును అనియే చెప్పవలయును. అట్లు సదా పరమాత్మయందు మనస్సు నిలిపిన వారు పరమాత్మయందే నిలిచియున్న పరమశాంతి రూపమైన మోక్షమును పొందుదురు.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి
నచైకాంత మనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య
జాగ్రతో నైవ చార్జున !

ప. వి ;-న, అతి, అశ్నతః, తు, యోగః, అ_స్తి, న, చ, ఏకాంతం, అనశ్నతః, న, చ, అతి, స్వప్నశీలస్య, జాగ్రతః, న, ఏవ, చ, అర్జున.

టీక :—

అర్జున = అర్జునా !
యోగః = (ఈ) యోగము,
అత్యశ్నతః తు = ఎక్కువ భుజించువానికి,
న అ_స్తి = కలుగదు,
చ = మరియు,
ఏకాంతం = బొత్తుగ,
అనశ్నతః = భుజించని వానికిని,
న (అ_స్తి) = కలుగనేరదు,
చ = మరియు,
అతిస్వప్నశీలస్య = అతిగా నిద్రపోవువానికిని,
న అ_స్తి = కలుగనేరదు,
చ = మరియును,
జాగ్రతః = ఎప్పుడును మేలుకొని యుండువానికిని,
న (అ_స్తి) ఏవ = గలుగనే కలుగదు.

తా. ఓ అర్జునా ! ఈ యోగము ఎక్కువ భుజించువానికిని, బొత్తుగ భుజించని వానికిని, ఎక్కువగ నిద్రపోవు వానికిని, బొత్తుగ నిద్రపోనివానికినిక్షూడ సిద్ధింపదు,

## అమృతవాహిని :_

పైన చెప్పబడిన యోగము సిద్ధించుటకు ఆటంకములు చెప్పబడినవి ఈ శ్లోకములో. ఎక్కువగ భుజించువానికి ఈ యోగము సిద్ధింపదు. కావలసిన దానికంటె ఎక్కువ భుజించిన యెడల ఇంద్రియములు పొగరెక్కి చెప్పినమాట వినవు. కూరి కూరి భుజించుటచే నిద్ర, ఆలస్యము - ఇవి పెరిగిపోవును. జీర్ణశక్తికి మించి భుజించిన యెడల జీర్ణముకాక కడుపులో ఆహారము మిగిలిపోవును. ఆ ఆహారము అనేక రోగములకు కారణమగుటచే శరీరముయొక్క ఆరోగ్యము చెడిపోయి, సాధనకు భంగము కలుగును.

అట్లే బొత్తిగ భుజించని వానికిని ఈ యోగము సిద్ధింపదు. కావలసినంత కూడ భుజించకుండ పూర్తిగ మానినచో, శుష్కోపవాసములు చేయుటచేత ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు వీటియొక్క శక్తి అక్రమ విధానముగా క్షీణించిపోవును. అందుచేత ఆసనముమీద స్థిరముగ కూర్చొనలేడు. భగవంతునియందు మనస్సును నిలుపలేడు. ఈ విధముగ యోగమునకు విఘ్నము కలుగును. కనుక యోగమును సాధించుకొనదలచినవారు ఎక్కువ తినరాదు. బొత్తిగ మాననురాదు.

అట్లే అతిగా నిద్రపోవు వానికిని, అటులనే బొత్తిగ నిద్రపోని వానికిని కూడ ఈ యోగము సిద్ధింపదు.

అతిగా నిద్రపోవువానికి తమోగుణము వృద్ధిచెందును. ఆలస్యము, సోమరితనము పెరిగిపోవును. స్థిరముగ కూర్చొన లేదుకూడ. అధికముగ నిద్రపోవువానికి మానవ జీవితము యొక్క అమూల్యమైన కాలము వృథాగా నష్టమైపోవును. ఇక బొత్తిగ నిద్రపోక, ఎప్పుడును మేలుకొనుటచేత శరీర మనో బుద్ధీంద్రియ ప్రాణములకు అలసట ఎక్కువై పోవును. అందుచే అవి శిథిలములై పోవును. శరీరములో అనేక విధములైన రోగములు కలుగును. ఎప్పుడును కునికిపాట్లతో బాధపడు చుండవలసివచ్చును. శరీరములో ఉత్సాహశక్తి తగ్గి, బద్ధకము, సోమరితనము పెచ్చు పెరుగును. కాబట్టి అతిగా నిద్రపోవుట, బొత్తుగా నిద్రపోక మేలుకొని యుండుట- ఈ రెండును కూడ యోగమునకు విఘ్నకారణములే. యోగ మును సాధించదలచినవారు అతిగానిద్రపోనూరాదు; ఎల్ల ప్పుడును మేలుకొని యుండనూరాదు.

అవతారిక :-

ఆహార విహారాదులు యుక్తములుగ ఉన్నవానికి యోగము సిద్ధించుటను చెప్పుచున్నాడు.

శ్లో॥ యుక్తాహార విహారస్య
యుక్త చేష్టస్య కర్మసు ।
యుక్త స్వప్నావ బోధస్య
యోగో భవతి దుఃఖహా ॥ ౧౭

ప. వి :— యుక్తాహార విహారస్య, యుక్తచేష్టస్య, కర్మసు, యుక్త స్వప్నావబోధస్య, యోగం భవతి. దుఃఖహా.

టీక :—

యుక్తాహార విహారస్య = యుక్తమైన - అనగా ఉచితమైన - ఆహారమును, విహారమును,
కర్మసు = కర్మలయందు.
యుక్తచేష్టస్య = తగిన నడవడి కలట్టియు,
యుక్త స్వప్నావబోధస్య = తగిన నిద్దుర, తగిన మెలకువ కలిగినట్టియు వానికి,
దుఃఖహా = దుఃఖమును పోగొట్టు,
యోగః = యోగము (ధ్యానము);
భవతి = సిద్ధించుచున్నది.

తా. ఆహారవిహారములును, కర్మాచరణమును, నిద్రయును, మెలకువయును తగినరీతిలో, ఉంచుకొనగల వానికి దుఃఖనివారకమగు యోగము సిద్ధించుచున్నది.

అమృతవాహిని :—

జనన మరణరూపమైన దుఃఖమును పోగొట్టు యోగము సిద్ధించవలయునన్న, ఆహార విహారములు యుక్తములుగ ఉండవలయును. యుక్తము అనగా తగినంత అనియును, సాధనకు అనుగుణమైన అనియును రెండర్థములు చెప్పవలయును.

ఆహారమనగా భుజించబడెడి, త్రాగబడెడి పదార్థములు. తిరుగుట నడచుట మొదలగు క్రియలను విహారమందురు, విహారము అనుటచే ఉపలక్షణముగా మిగిలిన అవయవములయొక్క వ్యాపారములనుకూడ గ్రహింపవలెను.

ఆహార విహారములు తగిన రూపములలో, తగినంత పరిమాణములో ఉన్నవాడు యుక్తాహార విహారుడు, జనన మరణ రూపమైన దుఃఖములను నశింపజేయు యోగము సిద్ధించవలయుననిన, ఆహార విహారములు తగినంతగా ఉండుట అత్యావసరము. అంతేకాక ఆహారము సాత్త్వికమైనదిగకూడ ఉండవలయును. అదికూడ వర్ణాశ్రమానుకూలమైనదై, న్యాయముగా లభించినదై, పవిత్రమైనదై, తన ప్రకృతికిని, స్థితికిని, రుచికిని ప్రతికూలమైనది కాకుండ, తన సాధనకు సహాయము చేయునదై ఉండవలయును.

ఆహారముగ తీసికొను మొత్తముకూడ తన జీర్ణశక్తిని, ఆరోగ్యమును, సాధనను బట్టి ఆవశ్యకము, హితకరము అయినంతగ ఉండవలయును. "యదుహవా ఆత్మసమ్మిత మన్నం తదవతి తన్నహినస్తి యద్భూయో హినస్తిత దద్యత్కనీయో న తదవతి" (శతపథశ్రుతి) శరీరధారణకు కావలసిన ఆహారమును భుజించినయెడల అది యోగాభ్యాసికి ధ్యానానుష్ఠానములకు తగిన యోగ్యతను కలుగజేసి వానిని కాపాడునుగాని, అనర్థమును కలుగజేయదు. శుష్కోపవాసములను, అతిగతి

తినుటను కూడ గీత అంగీకరించలేదు. తినవలసిన మొత్తమును శాస్త్రము ఎట్లు నిర్ణయించినదో చూడుడు- "పూరయేదశనే నార్ధం తృతీయ ముదకేనచ, వాయో స్సంచారణార్థాయ చతుర్థ మవశేషయేత్॥" కడుపులోని అవకాశమును నాలుగు భాగములుగ విభజించి, రెండు భాగములు - అనగా సగము- అన్నము చేత నింపవలయును. మూడవ భాగము నీటితో నింప వలయును. నాలుగవ భాగము వాయుసంచారమునకు వదల వలయును అని ఉన్నది. కనుక సాధకుడు ఈ మొత్తమునకు ఎక్కువగాని, తక్కువగాని భుజించినయెడల అది యోగ మును కలుగజేయదు.

విహారము విషయమునకూడ అంతే. అనవసరముగ తిరుగరాదు. దీనిచేత మనకు తెలియకుండనే అనేక అనర్థ ములు కలుగుచుండును. ఇందుచేత ఈ అనర్థములు కలుగు చున్నవి అని సాధకుడు ఎంతో విచారించుకొనినగాని తెలి యదు. శరీర ఆరోగ్యమునకును, ఆధ్యాత్మిక సాధనకును, తన వర్ణాశ్రమ ధర్మానుకూలముగ తనకు వచ్చిన లోక వ్యవహార ములకును ఎంత అవసరమో అంతమాత్రమే అయినను, ప్రతి క్షణమును హెచ్చరిక కలిగియుండి, జాగ్రత్తతో విహారమును ఉపయోగించుకొనవలయును. అనవసరముగ అక్కడకు ఇక్క డకు తిరుగుచుండిన జ్ఞానేంద్రియములకు రాజస తామసాహా రములు అమితముగ దొరకుచుండును. దానిచేత చిత్తములో

అనేక విధములైన దుష్టసంస్కారములు విపరీతముగ పుట్టి పెరుగుచుండును. పూర్వజన్మ సంస్కారములతోనే వేగలేక హతమైపోవుచు, వాటిని నాశనము చేసికొనుటకై ప్రయత్నములు చేయవలసి యుండగా, ఇంకను విహారముతో అదివరకున్న దుష్టసంస్కారములకు వృద్ధిని, క్రొత్త దుష్టసంస్కారముల ఉత్పత్తిని విపరీతముగ కలుగజేసికొనుచుండిన, ఇక యోగము సిద్ధించుట అనుమాట ఎన్నికోట్ల జన్మలకో! ఈ సంస్కారముల మూలమున రాగద్వేషములు అంతులేక వృద్ధి చెందుచుండును. కాబట్టి విహారము ఎంతవరకు అవసరమో అంతవరకే న్యాయ్యముగను, ధర్మముగను ఉండవలయును. యోగసిద్ధి కోరువానికి మితిమించి ఎంతమాత్రమును కూడదు.

ఇక కర్మాచరణము :-ఇదికూడ తగినరీతిలో ఔచిత్య భంగము కాక ఉండవలయును. అనగా వర్ణము, ఆశ్రమము, పరిస్థితి, వాతావరణము-వీనిననుసరించి ఎవరికి ఏ యే కర్మలు కర్తవ్యములుగా శాస్త్రము విధించినదో, ఆ కర్మలను ఉచితమైన పద్ధతులలో తగినంతగ, యథాశక్తిగ, యథాయోగ్యముగ నిర్వహించుటయే యుక్తమైన కర్మాచరణము అనగా.

యుక్తమైన నిద్ర - యుక్తమైన మెలకువ అవసరము. సామాన్యముగ పగలు మేలుకొనియే ఉండవలయును. రాత్రి సమయములో మొదటి జామును, చివరి జామును విడిచి, మధ్య రెండుజాములను నిద్దురపోవలయును. అనగా రాత్రి ఆరు

గంటల నిద్దుర సామాన్యముగ అందరికి సరియైనది; యుక్తమైనది. కాని ధ్యానయోగి ఇంకను అయిదు గంటలకుగాని, తగ్గించుకొనవచ్చును. అయితే, నిద్దుర ఆతనికి సరిపోవలయును. ధ్యానసమయములోగాని, ఇంక ఇతర ఆధ్యాత్మిక కార్య సమయములలోగాని, లేదా నిద్దురపోగూడని సమయములలో గాని, కునికిపాట్లు, మత్తు రాకుండ ఉండవలయును. శరీరము నకు బద్ధకముతోచి, తన కర్తవ్య నిర్వహణములో లోపము రారాదు. శరీర ఆరోగ్యములో ఎగుడు దిగుడు రారాదు. ఇవన్నియును యోగసిద్ధికి విఘ్నములు. ఇది కలుగకుండ నెమ్మదిగ అభ్యాసము చేయుచు, నాలుగు గంటల నిద్దురను సరిపెట్టుకొనవచ్చును.

శరీరమునకు నిద్దుర అత్యావశ్యకమైనది. పనిచేయుటచే శరీరము, మనస్సు, ఇంద్రియములు బాగుగ అలసిపోవును. వాటికి విశ్రాంతి కల్పించినగాని, వాటికి పోయినశక్తి మరల పూరింపబడదు. శరీర మనో బుద్ధీంద్రియములకు యుక్తమైన నిద్దుర నూతనోత్తేజమును కలిగించును.

అట్లని సదా నిద్దుర పనికిరాదు. తగినంతగ మెలకువ ఉండవలయును. ఎక్కువ నిద్దురచే కలుగు అనర్థములు పదునారవ శ్లోకముయొక్క వ్యాఖ్యానములో చెప్పబడినవి. ఆ అనర్థములన్నింటిని తగినంత మెలకువ నివారించును.

ఈ శ్లోకములోని యుక్త శబ్దము ఆహారవు రముగాని, కర్మలుగాని, నిద్రగాని, మేలుకొనుట మునకు ప్రతికూలము కాకుండ, ఆరోగ్యము పరిస్థి వానినిబట్టి ఎంత ఆవశ్యకమో అంతమాత్రమే టను తెలుపుచున్నది.

ఇట్టి లక్షణములు కలవారికి దుఃఖములను గల యోగము లభించగలదు. యోగమనగా ఇక సిద్ధి అని అర్థము. ధ్యానసిద్ధి కలిగినవారికి పరమాన పరమశాంతికిని నిలయమైన భగవత్ప్రాప్తి అప్పుడు ఆతని సకల దుఃఖములను - వాటికి కార నముతోసహా - నశించిపోగవు. ఆ స్థితిలో యో సర్వథా ప్రశాంత ఆనంద మహాసాగరములో ఉండును ఇంక వానికి దుఃఖము లెక్కడివి? ఆత నివృత్తి అగుటేగాక నిరతిశయానంద ప్రాప్తికూడ

శ్లో॥ యదా వినియతం చిత్తం
ఆత్మన్యే వావతిష్ఠతే ।
నిస్స్పృహ స్సర్వ కామేభ్యో
యుక్త ఇ త్యుచ్యతే తదా ॥

ప. వి :- యదా, వినియతం, చిత్తం, ఆత్మని, ఏవ, నిస్స్పృహః, సర్వకామేభ్యః, యుక్తః, ఇ తదా.

టీక :—

యదా = ఎప్పుడైతే,
వినియతం = చక్కగ నిగ్రహింపబడిన,
చిత్తం = చిత్తము,
ఆత్మన్యేవ = పరమాత్మయందే,
అవతిష్ఠతే = నిలిచిపోవుచున్నదో,
సర్వకామేభ్యః = సమస్త కామములనుండి,
నిస్స్పృహః = స్పృహకూడ లేనిస్థితి లభించునో,
తదా = అప్పుడు,
యుక్తః ఇతి = యోగసిద్ధిని పొందినవాడు అని,
ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. చిత్తము చక్కగ నిగ్రహింపబడి, పరమాత్మయందే స్థిరముగ నిలిచిపోయి, సకలమైన కామములయందును స్పృహయే ఉండనిస్థితి లభించిననాడు, వాడు యోగసిద్ధిని పొందినవాడు అని చెప్పబడును.

అమృతవాహిని :-

ఈ శ్లోకములో యోగసిద్ధి పొందినవానిని గూర్చి వర్ణింపబడినది.

సాధకుడు చిత్తమును ఇతర విషయములనుండి ప్రయత్నముతో మరలించి, భగవంతునియందు నిలుపుటకు మాటిమాటికిని యత్నించును. కాని చిత్తము మాత్రము విషయ

ములపైకి పోవుటకే కోరును; భగవంతుని వైపు పోవుటకు మొరాయించును. నెమ్మదిగ అదలించియో, బెదరించియో, బుజ్జగించియో, బతిమాలియో భగవంతుని వైపునకు తీసికొని పోవుటకు సాధకుడు ప్రయత్నించును. అప్పుడు ఇంకను సాధకుని అంతఃకరణములో కామవాసన లుండుటచేత చిత్తము విషయముల వైపునకే పరుగులుపెట్టుచుండును. ఇట్లు ఏదో విధమున అచంచలమైన పట్టుదలతో భగవంతునిమీద భారము వైచి, ప్రయత్నము తీవ్రముకాగా, ఎప్పుడో ఒకప్పుడు సకల కల్యాణగుణ నిలయమైన పరబ్రహ్మసాగరముయొక్క గాలి చిత్తమునకు సోకును. అంతమాత్రముననే చిత్తమునకు ఒక విధమైన సుఖము, శాంతి, ఆనందము మొదలగునవి అనుభవమునకు వచ్చును. అంతటితో సాధకుని అంతఃకరణములోని కామవాసనలు బలహీనములగుట, తగ్గుట ప్రారంభించును. అప్పుడు చిత్తము ఇంకను దురితగతిని పరబ్రహ్మమువైపు పరుగు పెట్టుట మొదలుపెట్టును. ఇట్లు చిత్తము పూర్తిగ పరబ్రహ్మమునందు స్థిరముగ నిలిచిపోయినప్పుడు ఇక ఆతని అంతఃకరణములో కామవాసనలే ఉండవు. ఆస్థితిని పొందిననాడు ఆతనిని యోగ సిద్ధి పొందినవాడు అని బుధులు పలుకుదురు. ఆతని చిత్తములో ప్రమాదము, సోమరితనము, విక్షేపము మొదలగు దోషములు ఈషణ్మాత్రము కూడ ఉండవు. పరమాత్మ తప్ప ఇతరము అతని తలపులో ఉండనే ఉండదు. పరమశాంతి నిలయుడును, పరమానంద మహోదధియును, సచ్చిదానందఘనవిగ్రహు

డును అగు పరమాత్మయందు అనన్యమైన ప్రేమయును, శ్రద్ధయును కలిగియుండుటచే, బ్రహ్మాదిలోక పర్యంతమైన భోగములయందు కూడ పరమవైరాగ్యము లభించి, నిశ్చింతగ ఉండుటయే సమస్తమైన కామములయందును స్పృహయే లేకుండ ఉండుట' యనగా.

శ్లో॥ యథా దీపో నివాతస్థో
నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య
యుంజతో యోగ మాత్మనః ॥ ౧౯

ప. వి :- యథా, దీపః, నివాతస్థః, న, ఇంగతే, సా, ఉపమా, స్మృతా, యోగినః, యతచిత్తస్య, యుంజతః, యోగం, ఆత్మనః.

టీక :—

యథా = ఏ ప్రకారముగ,
నివాతస్థః = గాలిలేని స్థలమునందున్న,
దీపః = దీపము,
నేంగతే = కదలదో,
సా ఉపమా = ఆ ఉపమానమే,
ఆత్మనః = పరమాత్మయొక్క,
యోగం యుంజతః = ధ్యానము సిద్ధించినట్టి,

యోగినః = యోగియొక్క,
యతచిత్తస్య = జయింపబడిన చిత్తమునకు,
స్మృతా = చెప్పబడినది.

తా. చక్కగా జయింపబడి, పరమాత్మ ధ్యానమందు నిలిచిన యోగియొక్క చిత్తమునకు తగిన ఉపమానము గాలి లేనిచోట నిశ్చలముగ ఉన్న దీపము. ఆ దీపమువలెనే ఈ చిత్తమును నిశ్చలముగ ఉండును.

అ మృ త వా హి ని :-

పరమాత్మను ధ్యానించు సమయమున యోగియొక్క చిత్తము ఎట్లు ఉండునో ఈ శ్లోకములో చెప్పబడి ఉన్నది.

యోగియొక్క చిత్తము జయింపబడి బాగుగ వశమై యుండును. కనుక అట్టి చిత్తము పరమాత్మ ధ్యానములో ఏమియును చలనములేక నిలిచియుండును. ఎట్లు నిలిచి యుండునో ఉపమానము చూపించుచున్నాడు - గాలి లేనిచోట ఉన్న దీపమువలె అని. గాలి ఉన్నచోటున దీపము నాలుగు వైపులకును అపరిమితముగ చలించుచుండును. అట్లే సామాన్యుల చిత్తము స్థిరత్వములేక విషయములయందు అన్నివైపులకు ఉరుకులు, పరుగులు పెట్టుచుండును. కాని చిత్తమును జయించిన యోగులు భగవద్ధ్యానము చేసికొను సమయములో వారి చిత్తము ఆ ధ్యానమునందు ఎంతమాత్రమును చలనములేక ఉండును. గాలి లేనిచోట ఉన్న దీపము ఎంత

మాత్రమును చలనములేక, కేవలము ఊర్ధ్వముగ సువర్ణశలాక వలె ఉండునట్లు ధ్యానసమయములో యోగియొక్క చిత్తము కూడ నిశ్చలమై ఉండును. చిత్తవృత్తు లన్నియును ఆ పరమాత్మ వైపునకే, ఒకేరీతిగ, సరాసరిగ మహావేగముతో ప్రవహించుచుండును.

శ్లో॥ యత్రోపరమతే చిత్తం
నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మ నాత్మానం
పశ్య న్నాత్మని తుష్యతి ॥ ౨౦

ప. వి :- యత్ర, ఉపరమతే, చిత్తం, నిరుద్ధం, యోగసేవయా, యత్ర, చ, ఏవ, ఆత్మనా, ఆత్మానం, పశ్యన్, ఆత్మని, తుష్యతి.

టీక :—

యోగసేవయా = ధ్యానమును అభ్యాసము చేయుటచేత,
నిరుద్ధం = విషయములనుండి మరల్చబడి పరమాత్మ యందు నిలుపబడిన,
చిత్తం = చిత్తము,
యత్ర = ఏ దశయందు,
ఉపరమతే = ఆ పరమాత్మయందే ఆనందించుచున్నదో,

చ = మరియు,

యత్ర = ఏ దశయందు,

ఆత్మనా = (యోగి) తనద్వారా,

ఆత్మానం = పరమాత్మను,

పశ్యన్ = చూచుచు,

ఆత్మని = పరమాత్మయందే,

తుష్యతి = సంతుష్టిని చెందుచున్నాడో;

శ్లో॥ సుఖ మాత్యంతికం య త్త
దుబ్ధిగ్రాహ్య మతీంద్రియమ్ ।
వేత్తి యత్ర నచై వాయం
స్థిత శ్చలతి త త్త్వతః ॥ ౨౧

ప. వి :-సుఖం, ఆత్యంతికం, యత్, తత్, బుద్ధిగ్రాహ్యం, అతీంద్రియం, వేత్తి, యత్ర, న, చ, ఏవ, అయం, స్థితః, చలతి, తత్త్వతః.

టీక :—

యత్ర = ఏ దశయందు,

స్థితః = ఉన్న,

అయం = ఈ యోగి,

యత్ = ఏది,

అతీంద్రియం = ఇంద్రియములకు అందనిదియును,

ఆత్యంతికం = అంతములేనిదియును అగు,
సుఖం = సుఖమో,
తత్ = దానిని,
వేత్తి = తెలిసికొనుచున్నాడో,
చ = మరియు,
తత్త్వతః = భగవదనుభవమునుండి,
నైవ చలతి = మరలనే మరలడో;

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే ॥ ౨౨

ప. వి ;- యం, లబ్ధ్వా, చ, అపరం, లాభం, మన్యతే, న, అధికం, తతః, యస్మిన్, స్థితః, న, దుఃఖేన, గురుణా, అపి, విచాల్యతే.

టీక ;—

యం = దేనిని (భగవత్ప్రాప్తి రూపమగు ఏ అనుభవమును),
లబ్ధ్వా = పొంది,
తతః = దానికంటె,
అధికం = గొప్పదైన,

అపరం = ఇతర,

లాభం = లాభమును,

న మన్యతే = అంగీకరింపడో,

చ = మరియు,

యస్మిన్ = దేనియందు (భగవత్ప్రాప్తిరూపమగు ఏ అనుభవమునందు),

స్థితః = ఉన్నవాడు,

గురుణా = చాల గొప్పదియైన,

దుఃఖేనాపి = దుఃఖముచేతకూడ,

న విచాల్యతే = ఎంతమాత్రమును చలింప జేయబడడో;

శ్లో॥ తం విద్యా ద్దుఃఖ సంయోగ
వియోగం యోగ సంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో
యోగో౽ నిర్విణ్ణచేతసా ॥ ౨౩

ప. వి :—తం, విద్యాత్, దుఃఖసంయోగ వియోగం, యోగసంజ్ఞితం, సః, నిశ్చయేన, యోక్తవ్యః, యోగః, అనిర్విణ్ణ చేతసా.

టీక :—

దుఃఖసంయోగ వియోగం = సమస్త దుఃఖములకు నిలయమైన జన్మమృత్యురూప సంసారమును పోగొట్టునట్టి,

తం = దానిని (వెనుకటి మూడుశ్లోకములలో చెప్పిన భగవత్ప్రాప్తిరూపమైన అనుభవమును),
యోగసంజ్ఞితం = యోగమని చెప్పదగిన దానినిగా,
విద్యాత్ = తెలియవలయును.
సః యోగః = ఆ యోగము,
అనిర్విణ్ణ చేతసా = ఎన్నికష్టములు, దుఃఖములు, విఘ్నములు వచ్చినను చలించని, విసుగుచెందని మనస్సుగలవాని చేతనే,
నిశ్చయేన = నిశ్చయ పూర్వకమైన పట్టుదలతో,
యోక్తవ్యః = సాధింపదగినది.

తా. యోగాభ్యాస పాటవముచే చిత్తమును విషయాంతరముల నుండి నివర్తించి. సుఖానుభవమును పొందుచున్నాడు, శిక్షణను పొంది పరిశుద్ధమైన చిత్తముతో పరమాత్మను చూచుచు, ఆ పరమాత్మయందే సంతోషించుచున్నాడు, ఇంద్రియ గోచరము కానట్టియు, కేవలము వాసనారహితమైన బుద్ధిచేతనే గ్రహింపబడగినట్టియు, అంతము లేనట్టియు, సుఖమును అనుభవించుచున్నాడు, ఆ సుఖములనుండి ఏమాత్రమును చలించనినాడు, తాను పొందిన అనుభూతికంటె బ్రహ్మాధిపత్యమును సైతము అధికముగా తలచనినాడు. ఆ స్థితినుండి భయంకరమైన దుఃఖములచేత కూడ చలింపజేయబడనినాడు - దుఃఖములో ఎంతమాత్రమును సంబంధములేని ఆ స్థితియే యోగమనియును, అదే యోగసిద్ధి పొందుట అనియును తెలిసికొనవలయును. పట్టుదల ఉత్సాహము కల మనస్సు చేతనే నిశ్చయపూర్వకముగా అట్టి యోగము ఆచరింపదగినది.

(20, 21, 22, 23)

## అమృతవాహిని :—

ఈ నాలుగు శ్లోకములును ఒకే వాక్యముగా గ్రహింపవలెను. ఈ నాలుగు శ్లోకములలో యోగసిద్ధిని పొందినవాని స్థితి తెలుపబడినది. ఏ స్థితిలో సాధకుడు యోగారూఢుడో - అనగా సిద్ధిని పొందినవాడో - తెలిసికొనుటకు దీనిని లక్షణముగ గ్రహింపవచ్చును.

సిద్ధిని పొందిన యోగియొక్క చిత్తము విషయముల నుండి పూర్తిగ తొలగి, పరమాత్మ ధ్యానమందే నిలిచి, అక్కడనే ఆనందమును అనుభవించుచుండును. సాధకుని యొక్క చిత్తము అతని ప్రయత్నముతో పరమాత్మ ధ్యానములో నిలుపబడును. కొంచెము అజాగ్రత్తగ నున్నచో మరల విషయములమీదికే పరుగెత్తుకొని వచ్చును. ఎంతవరకు తన ప్రయత్నము చేతనే చిత్తమును పరమాత్మ ధ్యానములో నిలుపవలసిన స్థితియుండునో, అంతవరకును వాడు సాధకుడే. ఎప్పుడు చిత్తము తన ప్రయత్నము అక్కరలేకయే పరమాత్మ ధ్యానమునందు నిలిచి, అక్కడనే ఆనందించుచుండునో, అప్పుడు వాడు సిద్ధపురుషుడని తెలియవచ్చును. ఇక ఆ స్థితిలో యోగి తన చిత్తమును పరమాత్మ ధ్యానములో నిలుపుటకు ఎంతమాత్రమును ప్రయత్నము చేయనక్కరలేదు.

సిద్ధిపొందిన యోగి ఇక పరమాత్మ ధ్యానము చేయ నక్కరలేదని పొరపడరాదు. పరమాత్మ ధ్యానము అతని

చిత్తమునకు సహజమైపోవును. అంతేగాక, అది విడువలేని అభ్యాసముగ పరిణమించును. అందుచే అతని చిత్తము ఎవరు వదలమన్నను పరమాత్మ ధ్యానమును వదలదు; వదలలేదు కూడ. ఆ స్థితిలో యోగికి చిత్తమును ధ్యానములో నిలుపుటకు స్వప్రయత్నము అక్కర లేదనియే గ్రహింపవలయును. ఆస్థితిలో యోగి పరమాత్మ సాక్షాత్కారమును పొందగలడు. అటు చిత్తము పరమాత్మ ధ్యానములో ఆనందములో నిలిచి యుండును. ఇటు తాను పరమాత్మ సాక్షాత్కారములో ఆనందించుచుండును.

దీనివలన ముఖ్యముగ తెలియవలసినది ఏమన - సాధకుడు తన చిత్తమును పరమాత్మ ధ్యానములో నిలుపుటకు ఆవగింజంత ప్రయత్నము చేయవలసియున్నను, ఇంకను తాను సాధకుడే అనియును, ఎంతమాత్రము ఏమరుపాటు లేక, హెచ్చరికతో సాధనను సాగించవలసినదే అనియును గ్రహించవలయును. ఆంతటిస్థితిలో కూడ 'నేను సిద్ధిపొందితిని; ఇక నాకు విధినిషేధములతో పనిలేదు' అను భావము ఏమాత్రము కలిగినను, నెమ్మది నెమ్మదిగా, పడుచున్నట్లు తెలియకుండనే అధఃపతనము ప్రాప్తించును. కనుక సాధకుడు ఎంతవరకు సాధన సాగించుచుండవలయునో, ఒక రేఖ ఏర్పాటుచేసి చూపించి నాడు పరమాత్మ ఇక్కడ.

పరమాత్మ ధ్యానము చిత్తమునకు విడువలేని ఒక అభ్యాసముగ పరిణమించిననాడు, వాడు పరమాత్మ సాక్షా

త్కారమును పొంది, భగవదనుభవములోనే సంతుష్టుడై యుండును. ఇక ఆ యోగి కృతకృత్యు డన్నమాట.

అప్పుడు ఆ యోగికి ఒక సుఖము లభించగలదు. ఆ సుఖము ఇంద్రియములకు సంబంధించినది కాదు; ఇంద్రియాతీతమైనది. అది కేవలము వ్యవసాయాత్మికాబుద్ధితో - వాసనా రహితమైన బుద్ధితో - మాత్రమే తెలిసికొనదగినది. ఆ సుఖము ఆత్యంతికమైనది - అనగా నిత్యమైనది. నిత్యమైనది అనగనే పదునెనిమిదవ అధ్యాయములో ముప్పదియారు, ముప్పది ఏడు, ముప్పదిఎనిమిది, ముప్పదితొమ్మిది శ్లోకములలో చెప్పబడిన తామసిక రాజసిక సాత్త్విక సుఖములకంటె విలక్షణమైనది; అది ప్రాకృతమైనది కాదు, అప్రాకృతమైనది అని చెప్పినట్లే అయినది.

ఇంకను యోగియొక్క ఆ స్థితిని వర్ణించుచున్నాడు పరమాత్మ. ఆ స్థితి కలిగిన తరువాత మరల దానికి భంగము ఉండదు; చ్యుతి ఉండదు. ఇక అప్పుడు ఆ యోగికి ఆ అనుభవమునకు మించినది సృష్టిలోనే కనుపడదు. బ్రహ్మాధిపత్యముకూడ తృణప్రాయముగనే తోచును. ఇక ఆ స్థితిలో, ఎట్టి మహాదుఃఖములును యోగిని చలింపజేయలేవు, ఏలయన - ఆ దుఃఖములు ప్రాపంచిక దృష్టితో చాల గొప్పవికావచ్చును కాని యోగి దృష్టిలో దుఃఖములే కావు- ఇంక చలించు టెక్కడిది ?

ఇట్టి స్థితి యోగసిద్ధియని చెప్పబడును. ఈస్థితి లభించవలయుననినచో చాల పట్టుదలతో సాధన చేయవలయును "ఎన్ని దుఃఖములు, ఎన్ని విఘ్నములు, ఎన్ని కష్టములు వచ్చినను, అవి నన్నేమియును చేయలేవు. నాకు పరమాత్మను పొందుటయే ఏకైక లక్ష్యము; ఆ పరమాత్మను పొందువరకును, మరణమే సంప్రాప్తించినను సరే. సాధనను వదలను" అను మహాదృఢ నిశ్చయము కలిగియున్నవాడు మాత్రమే ఆ స్థితిని అనగా ఇటువంటి యోగసిద్ధిని - పొందగలుగును.

శ్లో॥ సంకల్ప ప్రభవాన్ కామాం
స్త్యక్త్వా సర్వా నశేషతః ।
మనసై వేంద్రియగ్రామం
వినియమ్య సమంతతః ॥ ౨౪

శ్లో॥ శనై శ్శనై రుపరమే
ద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మ సంస్థం మనః కృత్వా
న కించిదపి చింతయేత్ ॥ ౨౫

ప. వి :—సంకల్ప ప్రభవాన్, కామాన్. త్యక్త్వా. సర్వాన్, అశేషతః మనసా. ఏవ. ఇంద్రియగ్రామం. వినియమ్య. సమంతతః ;

శనైః, శనైః, ఉపరమేత్, బుద్ధ్యా, ధృతి, గృహీతయా, ఆత్మసంస్థం, మనః, కృత్వా, న, కించిత్, అపి, చింతయేత్.

టీక :—

సంకల్పప్రభవాన్ = సంకల్పములవలన కలుగునట్టి,
సర్వాన్ కామాన్ = సకలములైన కామములను,
అశేషతః = ఏమియు మిగులకుండ,
త్యక్త్వా = త్యజించి,
మనసైవ = మనస్సు చేతనే,
ఇంద్రియగ్రామం = ఇంద్రియ సమూహమును,
సమంతతః = అన్నివైపుల నుండియును,
వినియమ్య = బాగుగ మరలించి, నియమించి,
ధృతి గృహీతయా = ధైర్యయుక్తమైన,
బుద్ధ్యా = బుద్ధితో,
శనైశ్శనైః = క్రమక్రమముగా (ఎడతెగని అభ్యాసముతో),
ఉపరమేత్ = పరమాత్మయందు మనస్సును నిలుప వలయును.

(తథా = అట్లు)
మనః = మనస్సును,
ఆత్మ సంస్థం = పరమాత్మయం దున్నదానినిగా,
కృత్వా = చేసి.
కించిదప = (ఇతరమును) ఏమాత్రమును,
న చింతయేత్ = చింతించక ఉండవలయును.

తా. సంకల్పములవలన పుట్టిన సమస్త కామములను. వాసనలతో కూడ త్యజియించి. మనస్సు ద్వారా ఇంద్రియ సముదాయమును అన్ని వైపులనుండియును బాగుగా నిగ్రహించి. ధైర్యయుక్తమైన బుద్ధితో, క్రమక్రమముగా మనస్సును పరమాత్మయందే నిలుపవలయును. అట్లు మనస్సును పరమాత్మయందుంచి, ఇతరమును ఏ మాత్రమును కూడ చింతించకుండ వుండవలయును,

## అమృతవాహిని :—

కామములనగా ఈ లోకమునకు సంబంధించినవిగాని, పరలోకమునకు సంబంధించినవిగాని భోగములను అనుభవించవలయుననెడి కోరికలు. ఈ కోరికలు తీవ్రములు, మధ్యమములు, మందములు అని మూడు విధములు. ఇక్కడ "సర్వాన్ కామాన్" అనుటచేత ఈ మూడు విధములైన అన్ని కోర్కెలను చెప్పబడినవి. ఈ కోరికలన్నియును 'అశేషతః అనగా నిశ్శేషముగ త్యజించవలయును' వాసనకూడ ఉండరాదు.

ఒక గుడ్డలోనున్న కస్తూరిని తీసివేసినను వాసన ఉండనే ఉండును. ఆ వాసనకూడ లేకుండ శుభ్రముగ ఉదికినట్లుగ కోరికలు విడువవలయును. ఒక గిన్నెలో ఉన్న నేతిని తీసివేసిన తరువాతకూడ ఆ గిన్నెను నేతిజిడ్డు పట్టుకొనియే ఉండును. ఆ జిడ్డుకూడ లేకుండ తోమినట్లు కోరికయొక్క వాసనకూడ అంతఃకరణమునందు ఉండకుండ చేసికొనవలయును,

తరువాత మనసుద్వారా ఇంద్రియ సముదాయమును అన్నివైపుల నుండియును బాగుగ నిగ్రహించవలయును. విషయములయందు సంచరించుటయే ఇంద్రియములయొక్క స్వభావము. కాని, మనస్సు ఇంద్రియముల వెంట లేనిది ఏ ఇంద్రియమును, ఏ విషయమందును సంచరించలేదు. మనస్సు దుర్బలమైనయెడల ఇంద్రియములు ఆ మనస్సును బలాత్కారముగ లాగి తమతో ఉంచుకొనును. కాని నిర్మలమును, నిశ్చయాత్మకము అయిన బుద్ధియొక్క సహాయముతో మనస్సును ఏకాగ్రము చేసినయెడల, ఇంక ఇంద్రియములకు మనస్సుయొక్క సహాయము లభించదు. మనస్సుయొక్క సహాయము లభించక పోవుటచే ఇంద్రియములు విషయములను గ్రహించుటకుగాని, విషయములయందు సంచరించుటకుగాని అసమర్థములై పోవును, కనుక పదునొకండవ, పండ్రెండవ, పదమూడవ శ్లోకములయందు చెప్పిన విధముగ ధ్యానము నభ్యసించుటకై ఆసనముపై కూర్చొని, వివేక వైరాగ్యములయొక్క సహాయముతో మనస్సుద్వారా సమస్తేంద్రియములను బాహ్యవిషయములన్నిటి నుండియును అన్ని విధములను నిగ్రహించి, ఏ ఇంద్రియములను ఏ విషయము మీదకును ఏ కొంచెమును పోనీయక వాటిని అంతర్ముఖము చేయవలయును. మనస్సు ద్వారా ఇంద్రియ సముదాయమును బాగుగా నిగ్రహించుట అనగా ఇదియే.

తరువాత ధైర్యయుక్తమైన బుద్ధితో మనస్సును పరమాత్మయందు నిలుపవలయును, విషయములను చింతించు

చుండుట మనస్సునకు అనాది కాలమునుండియును అలవాటు. అట్టి మనస్సును చిరకాలమునుండి అలవాటైన విషయ చింతనమునుండి మరలించి పరమాత్మమీద నిలుపవలసియున్నది. తాను ఏ వస్తువును చింతించునో ఆ వస్తువునందు తదాకారమును చెందుట మనస్సుయొక్క స్వభావము. అక్కడ నుండి విడిచి వచ్చుటకు మనస్సు అంతంత మాత్రముతో అంగీకరించదు. ఇంత వరకును దానికి అభ్యస్తమైనదానికి వ్యతిరేకమైన అభ్యాసము అతి తీవ్రముగ సాగించుటయే మనస్సును అక్కడనుండి మరలించుటకు ఉపాయము. ఎప్పుడును విసుగు చెందనట్టియు, లక్ష్యముయొక్క నిశ్చయముమీద దృఢముగ నుండునట్టియు, ధైర్యముతో నిండినట్టియు బుద్ధిద్వారా మనస్సును బుజ్జగించి, అదలించి, బెదిరించి, అడ్డగించి, చక్కగ నచ్చజెప్పి క్రొత్త అభ్యాసములో నియోగించవలయును. ధైర్యమును కోల్పోవుటచేతగాని, తొందరపడుటచేతగాని, పనులుకావు. బుద్ధిని మాత్రము దృఢముగ ఉంచవలయును అభ్యాసము సాగనీయవలయును. కొంత కాలమునకు మనస్సు ప్రాతవిషయములను విడిచి; ఇప్పుడు అభ్యాసము చేయు క్రొత్త విషయమునందు తదాకారము చెందగలదు. ఇక, వెనుకటి విషయమునుండి తొలగుటకు అది ఎట్లు ఇష్టపడలేదో, అట్లే ఇప్పుడు ఈ విషయమునుండి తొలగుటకు కూడ ఇష్టపడదు. అందువలననే కృష్ణపరమాత్మ, మాటిమాటికిని ప్రయత్నించి, ధైర్యయుక్తమైన బుద్ధితో, మనస్సును పరమాత్మయందు నిలుపవలయును అని చెప్పియున్నాడు.

బాలుని చేతిలో పదునైన చాకు ఉన్నయెడల తల్లి వానికి ఈమాటలు, ఆమాటలు మంచిగ చెప్పియో, అవసరమైన అదలించియో, బెదరించియో, నెమ్మదిగ అతని చేతి నుండి ఆ చాకును తీసికొనినట్లే, వివేక వైరాగ్యములతో కూడిన బుద్ధిద్వారా మనస్సునకు సంసార భోగములయొక్క అనిత్యత్వమును, క్షణభంగురత్వమును, నీచత్వమును తెలిపియును, ఆ భోగములయందు తగుల్కొన్నచో కలుగు బంధనమును, అనుభవించవలసిన నరక యాతనలను చూపించి భయపెట్టియును, దానిని విషయ చింతనమునుండి నెమ్మదిగ మరలించవలయును.

మనస్సు విషయచింతనము పూర్తిగ విడుచువరకును, సాధకుడు ప్రతిదినమును ఆసనముపై కూర్చొని శరీరమును కదలకుండ సరిగ నిలిపి, ముందు ఇంద్రియములను బాహ్య విషయములనుండి మరలించ వలయును. తరువాత మనస్సును విషయచింతనమునుండి మరలించుటకు బుద్ధిద్వారా మాటి మాటికి ప్రయత్నించవలయును. దీనితో పాటు ధైర్యయుక్తమైన బుద్ధితో మనస్సును పరమాత్మ యందుంచుటకూడ ప్రయత్నించుచుండవలయును. ఈ ప్రకారము ప్రతిదినమును అభ్యాసము చేయుచు, అభ్యాసకాలమును నెమ్మదినెమ్మదిగ వృద్ధిచేయుచుండ వలయును.

శ్లో॥ యతో యతో నిశ్చరతి
మన శ్చంచల మస్థిరం ।
తత స్తతో నియమ్యైత
దాత్మన్యేవ వశం నయేత్ ॥ ౨౬

ప. వి ;—యతః, యతః, నిశ్చరతి, మనః, చంచలం, అస్థిరం, తతః, తతః, నియమ్య, ఏతత్, ఆత్మని, ఏవ, వశం, నయేత్.

టీక :—

చంచలం = చంచలమైనదియును, (కనుకనే)
అస్థిరం = నిలకడలేనిదియును అగు,
మనః = మనస్సు,
యతోయతః = ఎక్కడెక్కడ ప్రవర్తించుటకై,
నిశ్చరతి = బయలువెడలుచున్నదో.
తత స్తతః = అక్కడక్కడనుండి,
ఏతత్ = దానిని (ఆ మనస్సును),
నియమ్య = అడ్డగించి,
ఆత్మన్యేవ = పరమాత్మయందే,
వశం నయేత్ = వశము చేయవలసినది.

తా. చంచలమైనదియును, స్థిరత్వము లేనిదియును అగు మనస్సు ఏ యే విషయముల మీదకు పోవునో, ఆ యా విషయములనుండి నిరోధించి, పరమాత్మయందే నిలుచున్నట్లు చేయవలయును.

అమృతవాహిని :-

మనస్సు చంచలమైనది. అందుచేతనే అస్థిరమైనదికూడ కాబట్టి పూర్వాభ్యాస బలమున, అప్పుడప్పుడు విషయముల మీదకు పోవుచుండును. సాధకుడు అట్లు విషయములమీదకు తన మనస్సు పోయినప్పుడెల్ల, ఆ మనస్సును ఆయా విషయములనుండి మరలించి పరమాత్మయందే నిలుపుటకు మాటి మాటికిని అభ్యసించుచుండవలయును. గుఱ్ఱము నెక్కినవాడు గుఱ్ఱము త్రోవ తప్పినప్పుడెల్ల, కళ్ళెమును లాగి మరల త్రోవకు తెచ్చినట్లు. మనస్సును కూడ విషయములలోనికి పోయినప్పుడెల్ల, మరల వెనుకకు మరలించి, పరమాత్మయందే ఉంచుచుండవలయును.

ప్రారంభదశలో మనస్సు పరమాత్మ యందు నిలుచుటకు మొరాయించును. క్రొత్తగిత్తను బండి కాడిక్రిందకు తీసికొని వచ్చుటకు మొదట ఎంతకష్టపడవలయునో, గిత్త ఎంత మొరాయించునో రైతులందరకును తెలిసిన విషయమే. కాని, పట్టుదల వదలక ప్రయత్నించినయెడల కొంతకాలమునకు ప్రయత్న మక్కరలేకయే బండి తెచ్చునప్పటికే గిత్త తనంత తానుగా వచ్చి కాడిక్రింద నిలబడును. అట్లే సాధకుడు ధ్యానమునకు ప్రయత్నించినప్పుడు మనస్సు చెప్పినమాట వినక, మొరాయించును. ఎంత లాగినను రాక, గిత్త నాలుగు కాళ్ళు నేలకు తన్నిపట్టి వెనుకకు గింజుకొనునట్లు మనస్సుకూడ

వెనుకకు పరువెత్తును. సాధకుడు పరమాత్మ వైపునకు లాగు చుండిన, అది విషయములవైపునకు పరువెత్తును. ఇట్లు పట్టు దలతో, వదలక ప్రయత్నించిన, కొంతకాలమునకు మనస్సు వశపడి సాధకుడు ధ్యానమునకు కూర్చొనగనే తనంతతానే వచ్చి, పరమాత్మ ధ్యానములో నిలుచును.

శ్లో॥ ప్రశాంత మనసం హ్యేనం
యోగినం సుఖ ముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం
బ్రహ్మభూత మకల్మషమ్ ॥ ౨౭

ప. వి ;—ప్రశాంత మనసం, హి, ఏనం, యోగినం, సుఖం, ఉత్తమం, ఉపైతి శాంతరజసం, బ్రహ్మభూతం, అకల్మషం.

టీక :—

ప్రశాంత మనసం=ప్రశాంతమైన మనస్సుగలవాడును,
శాంతరజసం = రజోగుణ వికారములు లేనివాడును,
అకల్మషం = పాపరహితుడును,
బ్రహ్మభూతం=పరమాత్మ ధ్యానములో తన్మయత్వము చెందినవాడును అగు,

ఏనం యోగినం=ఇటువంటి యోగిని (వెనుకటి శ్లోకములో చెప్పిన యోగిని)

ఉత్తమం = శ్రేష్ఠమైన,
సుఖం = సుఖము,
ఉపైతిహి = పొందుచున్నదిగదా !

తా. ప్రశాంతమైన మనస్సు గలట్టియును, రజోగుణ వికారములు లేనట్టియును, పాపరహితుడైనట్టియును, పరమాత్మ ధ్యానములో తన్మయుడైనట్టియును యోగికి శ్రేష్ఠమైన సుఖము లభించుచున్నది.

అమృతవాహిని :—

వివేక వైరాగ్యముల ప్రభావముచే విషయచింతనము విడిచి చంచలత్వమును, విక్షేపమును ఎంతమాత్రమును లేక అన్నివిధములను స్థిరత్వమును చెంది, ప్రసన్నమై పరమాత్మ ధ్యానములో నిలిచిన మనస్సుకల యోగి ప్రశాంతమనస్కుడు అనబడును. ఆసక్తి, కామము, లోభము, తృష్ణ, మొదలగున వన్నియును రజోగుణమువలన కలుగు వికారములు. ఇవియే మరల రజోగుణమును వృద్ధిపరచునవికూడ. కనుక ఇవేమియును ఎంతమాత్రమును లేనివాడు శాంతరజస్కుడు అనబడును. వివేక వైరాగ్యముల ప్రభావముచే విషయ చింతనమును విడిచిన మనస్సు పరమాత్మ ధ్యానములో అచంచలముగ నిలిచినవాని సమస్త పాపములు భస్మీపటలము కాక ఏమగును? మనస్సు అదివరకు విషయ చింతనముతో తదాకారము చెందినట్లు, ఇప్పుడు పరమాత్మ ధ్యానముతో తదాకారము చెందగనే, సాధకునకు పరమాత్మతో తన్మయత్వము సిద్ధించును.

కనుక బ్రహ్మీభూతుడు అని చెప్పబడినాడు. ఇటువంటి యోగికి ఉత్తమోత్తమమైన సుఖము లభించుచున్నది.

శ్లో॥ యుంజన్నేవం సదాత్మానం
యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ
మత్యంతం సుఖ మశ్నుతే ॥ ౨౮

ప. వి :— యుంజన్, ఏవం, సదా, ఆత్మానం, యోగీ, విగత కల్మషః, సుఖేన, బ్రహ్మసంస్పర్శం, అత్యంతం, సుఖం, అశ్నుతే.

టీక :—

ఏవం = ఈ ప్రకారముగా,
సదా = ఎల్లప్పుడును,
ఆత్మానం = తనను,
యుంజన్ = పరమాత్మయందు నిలిపినట్టియు,
విగతకల్మషః = పుణ్య పాప రహితుడైనట్టియు,
యోగీ = యోగి,
సుఖేన = సులభముగా,
బ్రహ్మసంస్పర్శం = పరమప్రాప్తి రూపమైనట్టియు,
అత్యంతం = అనంతమైనట్టియు,
సుఖం = పరమానందమును,
అశ్నుతే = పొందుచున్నాడు.

తా. పైన చెప్పిన ప్రకారముగ ఎల్లప్పుడును తనను భగవంత యందే నిలిపినట్టియు, పుణ్య పాప రహితుడైనట్టియు యోగి పర ప్రాప్తి రూపమైన అనంత పరమానందమును సులభముగా పొం చున్నాడు.

## అమృతవాహిని :-

సంసార సముద్రమునుండి బయటపడగోరు సాధకు చేయవలసినది వేరుగా ఏమియును లేదు - తనను పరమాత్మ సమర్పణము చేసికొనుటయే. తనను సమర్పణము చేసికొ నంతనే - సమర్పణము చేసికొనిన తరువాత కాదు - సమ ణము చేసికొనవలయుననెడి సంకల్పము కలిగినంత మాత్రమ ననే - వాని పాపపుణ్యములు సకలమును ఒక్కసారిగా నశిం పోగలవు. పరమాత్మకే తనను సమర్పణము చేసికొనిన త వాత ఇక సాధకుడు చేయవలసినది లేదు. పరమాత్మ మనకు రక్షకుడు. పరమాత్మ తప్ప ఇంకొక దిక్కు లేదు అ దృఢాధ్యవసాయము చలనము లేకుండ అవిచ్ఛిన్నము ఉన్నప్పుడేగదా సర్వార్పణము సంభవము! అట్టివా అత్యంతమైన, అనంతమైన, నిత్యమైన పరమ సుఖము పొందుచున్నాడు. ఆ సుఖము బ్రహ్మసంస్పర్శనము వల కలిగినది. ఇక్కడ సంస్పర్శ అనునది సకలేంద్రియ వ్యాపారమ లకును ఉపలక్షణము. అనగా సకలేంద్రియములతో కూడ భ వంతుని అనుభవించిన సుఖము లభించగలదు. ఇది మహా

తత్కృష్టమైన నిత్యసుఖముగదా, దీనికొరకు ఎంత శ్రమపడవల యునో అని ఎంతమాత్రమును నిరాశచెంద నక్కరలేదు. సుఖేన - అతిసులభముగా లభించును. ఎందువలన ననగా - సాధకుడు చేయవలసినది ఏమియును లేదుగదా - తనను పరమాత్మకు సమర్పణ చేసికొని, ఆయననే రక్షకునిగా నమ్మి, నిర్భరుడై నిర్భయుడై యుండుటయే.

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం
సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః ॥ 29

ప. వి :-సర్వభూతస్థం, ఆత్మానం, సర్వభూతాని, చ, ఆత్మని, ఈక్షతే, యోగయుక్తాత్మా, సర్వత్ర, సమదర్శనః.

టీక ;—

యోగయుక్తాత్మా = యోగమునందే నిశ్చలముగ మనస్సును నిలుపగలిగినవాడు,
ఆత్మానం = పరమాత్మను,
సర్వభూతస్థం = సర్వభూతములందును ఉన్నవానినిగను,
ఆత్మని = పరమాత్మయందు,
సర్వభూతాని చ = సర్వభూతములను,

ఈక్షతే = చూచుచున్నాడు - అనగా తెలిసికొనుచున్నాడు. (అతడు)

సర్వత్ర = సకల జీవరాసులయందును, సర్వపదార్థములయందును,

సమదర్శనః = సమదృష్టి కలవాడు అగుచున్నాడు.

తా. ఎల్లప్పుడు నిశ్చలముగ భగవద్ధ్యానరూపమగు యోగమునందు మనస్సును నిలుపగలిగిన వ్యక్తి, సర్వపదార్థములయందును పరమాత్మను, సర్వపదార్థములను పరమాత్మ యందును దర్శింపగలిగి, అ విశిష్టదర్శనముచే సర్వత్రి సమదృష్టి కలవాడగుచున్నాడు.

అ మృ త వా హి ని :_

లోకమున బాహ్యదృష్టి, పరమార్థదృష్టి అని రెండు దృక్పథములు కలవు. బాహ్యదృష్టినే వస్తుదృష్టి అనవచ్చును. ఈ దృష్టికి సర్వమును వైవిధ్యముతో నిండి ఉండును; ఎల్లెడ భేదభావమే నిండి ఉండును. దీనిని అతిక్రమించి, పరమార్థదృష్టి - సమదృష్టి - సాధింపవలయును. అట్లు సాధించిన వ్యక్తి సర్వత్ర సమదర్శనుడు అనబడును.

అది ఎట్లు లభించును ?

నిశ్చలమగు భగవద్ధ్యానరూపమగు యోగమందు మనస్సును నిలుపవలయును. అట్లు నిలుపగలిగిననాడు సకల జీవరాసులయందును, సర్వపదార్థములయందును పరమాత్మను,

సకల జీవరాసులను, సర్వపదార్థములను పరమాత్మయందును చూడగలుగు యథార్థదర్శనము కలుగును. అప్పుడు సర్వము నందును, సర్వత్ర భేదభావము సమసిపోయి, సమభావము స్థిరపడును. అట్టి దర్శనము కలవాడే సర్వత్రసమదర్శనుడు.

సమః అనగా పరమాత్మ అని అర్థము కలదు. సర్వత్ర సమదర్శనుడు అనగా బాహ్యవస్తుదృష్టి విడిచి, సర్వము నందును, సర్వత్ర పరమాత్మనే దర్శించువాడు అనికూడ అన్వయించుకొనవచ్చును.

ఈ శ్లోకములో నారాయణ శబ్దముయొక్క అర్థము వ్యాఖ్యానింపబడినది. సర్వభూతములును పరమాత్మయందు ఉండుట అనునది, నారములకు అయనము అయినవాడు నారాయణుడు అను తత్పురుష సమాసముయొక్క అర్థమును, సర్వభూతములయందును పరమాత్మ ఉండుట అనునది, నారము లను అయనముగా కలిగినవాడు నారాయణుడు అను బహు వ్రీహి సమాసముయొక్క అర్థమును వివరించుచు, వ్యాపక మైన అర్థము కలది, అర్థపూర్తికలది అగు నారాయణ శబ్దము నకు వ్యాఖ్యారూపముగ చెప్పబడినది ఈ శ్లోకము.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర
సర్వంచ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి ॥ 30

ప. వి :-యః, మాం, పశ్యతి, సర్వత్ర, సర్వం, చ, మయి, పశ్యతి, తస్య, అహం, న, ప్రణశ్యామి, సః, చ, మే, న, ప్రణశ్యతి.

టీక :—

యః = ఎవడు,
సర్వత్ర = సర్వభూతములయందు,
మాం = నన్ను (వాసుదేవుడనైన నన్ను),
పశ్యతి = చూచుచున్నాడో,
చ = మరియు,
సర్వం = సమస్తమును,
మయి = నా యందు,
పశ్యతి = చూచుచున్నాడో,
తస్య = అతనికి,
అహం = నేను,
నప్రణశ్యామి = ఎన్నడును లేనివాడను కాను - అనగా సర్వత్ర అనుభవమునందే ఉందును,
స చ = వాడును,
మే = నాకు,
న ప్రణశ్యతి = ఎన్నడును లేనివాడు కాడు - అనగా సర్వత్ర నా అనుభవమునందే ఉండును.

తా. ఎవడు సకల భూతములయందును నన్ను చూచుచున్నాడో, నాయందు సర్వభూతములను చూచుచున్నాడో, వానికి నేను, నాకు వాడు - సర్వత్ర అనుభవమునందే ఉందుము.

అమృతవాహిని :-

సకల భూతములయందును పరమాత్మను చూడవలయును. అనగా అన్నిటియందును పరమాత్మ ఉన్నట్లే గదా! పరమాత్మలో సర్వభూతములను చూడవలయును. అనగా సర్వభూతములు పరమాత్మయందు ఉన్నట్లేగదా! ఇట్లు చెప్పుటలో సర్వభూతములకును లోపలను బయటనుకూడ పరమాత్మ వ్యాపించి యున్నాడనియే భావము. నీటి ప్రవాహములో ఒక కుండ ఉన్నట్లు భావించుదము. ఆ కుండకు లోపల నీరున్నది. నీటిలో కుండ ఉన్నది. కుండయొక్క పెంకులోకూడ నీరు ప్రవేశించగలదని అనుకొందము - అప్పుడు కుండకు లోపలను బయటను నీరు వ్యాపించి ఉన్నదని చెప్పినట్లే కాగలదు. ఇంతకన్న అనుకూలమైన ఉదాహరణము - ప్రకాశములో గాజుకుండ ఉన్నదనుకొందము. ఆ కుండలోపల ప్రకాశమున్నది. ప్రకాశములోపల కుండ ఉన్నది. అట్లే పరమాత్మ సర్వభూతములయందును కలడు. సర్వభూతములును పరమాత్మయందు కలవు. అనగా సర్వభూతములయందును లోపలను బయటను కూడ పరమాత్మ వ్యాపించి ఉన్నాడని అర్థము.

ఇరువది తొమ్మిదవదగు దీని వెనుకటి శ్లోకములో - పరమాత్మ సర్వభూతములకు లోపలను వెలుపలను వ్యాపించి ఉన్నాడని చెప్పబడినది. ఈ వ్యాపించిఉన్న స్వరూపము

అవ్యక్తస్వరూపము. పరమాత్మ ఒక మానవుని శరీరమువంటి శరీరము ధరించి, దివ్యమంగళ విగ్రహముతో, సకల కల్యాణ గుణసంపత్తితో అర్జునుని ముందు గోచరించుచు, గీతను బోధించుచున్నాడు. కనుక ఈ శ్లోకములో ఆ ఇరువదితొమ్మిదవ శ్లోకములో చెప్పిన స్వరూపమునకును నాకును అభేదము అను విషయము స్పష్టపరచుచున్నాడు. అట్లు చూచు భక్తునకు నేను ఎప్పుడును అనుభవములో లేకుండ ఉండను. అనగా అట్టి భక్తునకు ఎప్పుడును సౌందర్య మాధుర్య కారుణ్యైశ్వర్యౌదార్య సౌశీల్య వాత్సల్యాద్యనంత కల్యాణగుణ మహోదధినైన నా సచ్చిదానంద ఘనస్వరూపముయొక్క దేవదుర్లభ ప్రత్యక్ష సాక్షాత్కారము కలుగుచుండును. వాడెప్పుడును నా అనుభవములో లేకుండ ఉండడు; వానిని ఎప్పుడును నేను చూచుచునే ఉందును. అనగా నేను వానియొక్క యోగ క్షేమములు ఎప్పుడును కనిపెట్టుచు చూచుచునే ఉందును. ఈ విధముగా సర్వత్ర సమదర్శనుని అనుభవమును వివరించినాడు పరమాత్మ.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం
భజత్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి
స యోగీ మయి వర్తతే॥ ౩౧

ప. వి :–సర్వభూతస్థితం, యః, మాం, భజతి, ఏకత్వం, ఆస్థితః, సర్వథా, వర్తమానః, అపి, సః, యోగీ, మయి, వర్తతే.

టీక :—

సర్వభూతస్థితం = సర్వభూతములయందును ఉన్న,
మాం = నన్ను,
ఏకత్వం = ఏకీభావమందు,
ఆస్థితః = ఉన్నవాడై,
యః = ఎవడు,
భజతి = భజించుచున్నాడో,
సః యోగీ = ఆ యోగి,
సర్వథా = అన్ని విధములను,
వర్తమానోఽపి = వ్యవహరించుచున్నను,
మయి = నా యందే,
వర్తతే = వర్తించుచున్నాడు.

తా. సర్వభూతములయందు ఏకాకారముతో ఉన్న నాయొక్క ఆ ఏకత్వమునందు దృఢాధ్యవసాయముతో నన్ను భజించుచున్న యోగి అన్ని పనులను చేయుచున్నను నాయందు వర్తించుచున్నవాడే అగుచున్నాడు.

అమృతవాహిని :-

వెనుకటి రెండు శ్లోకములలో సర్వభూతముల యందును పరమాత్మ వ్యాపించి ఉండుట తెలుపబడినది. అట్లు సర్వ భూతములయందును ఏకాకారముతో ఉన్న పరమాత్మయొక్క ఆ ఏకత్వమునందే దృఢమైన అధ్యవసాయము కలిగియుండి,

ఆయనను భజించుచున్న వారందరును ఉత్తములే. కాని, "వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః" అని చెప్పి యున్నట్లు సకల భూతములయందును పరమాత్మయే పరిపూర్ణ ముగ వ్యాపించి యున్నాడని బాగుగా తెలిసి, నమ్మినవారై, బాహ్యమైన ప్రకృతి జన్యమైన భిన్నత్వమునందు దృష్టి ఉంచక, ఆ ఏకత్వమును దర్శించి, ఆయనను భజించువారు అత్యుత్తములు. మొదటివారు, శాస్త్రములయందు అట్లున్నది కనుక విశ్వాసముతో అట్లు భావింతురు. వీరు భావించుటే కాక అట్లు దర్శింతురు - కనుక శ్రేష్ఠులు. అట్టి యోగులు సాంసారిక జనుల దృష్టిలో విషయములయందు వర్తించినట్లు కనుపడినను, యథార్థమునకు పరమాత్మయందే వర్తించుచున్నారని తెలియ వలయును. ఈ శ్లోకములో పరమాత్మ ఈ విషయమే వివరించి చెప్పినాడు.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమం పశ్యతి యోఽర్జున !
సుఖం వా యది వా దుఃఖం
స యోగీ పరమో మతః ॥ 3_౨

ప. వి :_ఆత్మౌపమ్యేన, సర్వత్ర, సమం, పశ్యతి, యః, అర్జున, సుఖం, వా, యది, వా, దుఃఖం, సః, యోగీ, పరమః, మతః,

టీక :—

అర్జున ! = అర్జునా !
యః = ఎవడు,
సర్వత్ర = సకల భూతములయందును,
ఆత్మౌపమ్యేన = పరమాత్మ దృష్టిచేత,
సుఖం వా = సుఖమునుగాని,
యది వా దుఃఖం = లేక దుఃఖమునుగాని,
సమం = సమముగానే,
పశ్యతి= చూచుచున్నాడో,
సః యోగీ = ఆ యోగి,
పరమః = శ్రేష్ఠుడు (అని),
మతః = తలచబడినవాడు.

తా. అర్జునా ; సకల భూతములయందును పరమాత్మ భావన కలిగి యుండుటచే, సుఖదుఃఖములను సమముగానే చూడగలిగినవాడు - అట్టి యోగి - శ్రేష్ఠుడని ఎన్నబడుచున్నాడు.

## అమృతవాహిని :—

సకల భూతములయందును పరమాత్మ వ్యాపించి యున్నందున, అన్నిభూతములను పరమాత్మ భావనతోనే దర్శించు యోగి, సుఖము వచ్చినను, దుఃఖమే వచ్చినను, ఈ రెంటిచేతనుకూడ వికారమును చెందడు. సృష్టిలోని సుఖ కారణములైన గొప్పగొప్ప భోగములుగాని, దుఃఖకారణములు

తైన గొప్ప గొప్ప ఆపదలుగాని, ఆ యోగి చిత్తములో ఈషణ్మాత్రముకూడ వికారమును కలిగించలేవు. కనుకనే అట్టి యోగి మహోత్కృష్టుడని నిశ్చయించి చెప్పుచున్నాడు కృష్ణ పరమాత్మ.

అ ర్జు న ఉ వా చ :—

శ్లో॥ యోఽయం యోగ స్త్వయా ప్రోక్త
స్సామ్యేన మధుసూదన !
ఏత స్యాహం న పశ్యామి
చంచలత్వా త్స్థితిం స్థిరామ్॥ 33

ప. వి :-యః, అయం, యోగః, త్వయా, ప్రోక్తః, సామ్యేన, మధుసూదన, ఏతస్య, అహం, న, పశ్యామి, చంచలత్వాత్, స్థితిం, స్థిరాం.

టీక :—

మధుసూదన ! = మధుసూదనా !
యః = ఏ,
అయం = ఈ,
యోగః = యోగము,
సామ్యేన = సమత్వరూపముగ,
త్వయా = నీచేత,
ప్రోక్తః = చెప్పబడినదో,

ఏతస్య = అట్టి దీనియొక్క,
స్థిరాం = చలించనట్టి,
స్థితిం = స్థితిని,
చంచలత్వాత్ = (మనస్సుయొక్క) చాంచల్యము వలన,
అహం = నేను,
న పశ్యామి = కానలేకున్నాను.

తా. ఓ మధుసూదనా ! సమత్వరూపముగ నీచేత చెప్పబడిన ఈ యోగముయొక్క స్థిరమైన స్థితిని నా మనశ్చాంచల్యము కారణముగ నేను కానలేకుండ ఉన్నాను.

అమృతవాహిని :-

కృష్ణపరమాత్మ ఈ అధ్యాయములో ధ్యానయోగమును వర్ణించి, ధ్యానయోగముయొక్క ఫలరూపమైన సమత్వమును - అనగా సర్వభూతములయందును సమముగా పరమాత్మను భావించుటను, దర్శించుటను - అప్పటి విశిష్టానుభవమును వెనుకటి శ్లోకములో చెప్పియున్నాడు. ఆ సమదర్శన స్థితిని, అనుభవమును గూర్చి స్పష్టతకొరకు అర్జునుడు అడుగుచున్నాడు- 'కృష్ణా ! నిజమే. నీవు చెప్పుటచేత, అన్ని భూతములయందును పరమాత్మ సమముగా వ్యాపించి ఉన్నాడు. కనుక అన్ని భూతములయందును సమదృష్టి

కలిగియుండవలెను అని బాగుగ నమ్మి ఆ భావము నందే ఉందమన్న, మనస్సు అతిచంచలమైనదిగదా! అట్టి నిత్యచంచలమైన మనస్సుగల నేను సమత్వరూపమైన ఈ యోగమునందు ఎల్లప్పుడును స్థిరముగా ఉండగలనను ధైర్యము నాకు లేదు. 'ఏమో - ఎప్పుడు ఈ మనస్సు నాకు తెలియకుండ ఈ సమత్వభావమునుండి అకస్మాత్తుగ ఎక్కడకు పరుగెత్తిపోవునోగదా!' అని సంశయించుచున్నాడు అర్జునుడు.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ!
ప్రమాథి బలవ ద్దృఢమ్ ।
త స్యాహం నిగ్రహం మన్యే
వాయో రివ సుదుష్కరమ్ 34

ప. వి :- చంచలం, హి, మనః, కృష్ణ, ప్రమాధి, బలవత్, దృఢం, తస్య, అహం, నిగ్రహం, మన్యే, వాయోః, ఇవ, సుదుష్కరం.

టీక ;—

కృష్ణ! = ఓ కృష్ణా!
మనః = మనస్సు,
చంచలం = మిగుల చంచలమైనది.
ప్రమాథి = క్షోభ పెట్టు స్వభావముగలది.

బలవత్ = బలముగలది,
దృఢం హి = విషయములలో చరించుటయందే
పట్టుదలగలదిగదా!
అహం = నేను,
తస్య = అట్టి మనస్సుయొక్క,
నిగ్రహం = నిరోధము,
వాయోరివ = వాయువుయొక్క నిగ్రహమువలెనే,
సుదుష్కరం = మిక్కిలి కష్టసాధ్యముగా,
మన్యే = తలచుచున్నాను.

తా. కృష్ణా! మనస్సు అతిచంచలమైనది; క్షోభపెట్టుటయే స్వభావముగా గలది; బలమైనది; మంచి పట్టుదల గలదిగదా! దీనిని నిగ్రహించుట వాయువును నిగ్రహించుట వలెనే అతికష్టమని నేను భావించుచున్నాను.

అ మృ త వా హి ని :—

ఈ మనస్సు స్వభావముచేతనే చంచలమైనది. విషయములయందు సంచరించుట ఎంతకాలము నుండియో అలవాటుపడి యున్నప్పటికిని, దాని స్వభావమే చంచలమగుటచే, అలవాటైన ఆ విషయములయందే మానవుడు మనస్సును నిలుపలేకుండ ఉన్నాడు. మనస్సు విషయముల మీదికైనను తనంత తానుగా పోవలసినదేగాని వీడు పొమ్మనిన

పోదు; వీడు పొమ్మనినయెడల ఎదురుతిరుగును. వీడు పొమ్మనిన విషయముమీదికి కాక ఇంకొక విషయముమీదికిపోవును.

విషయములమీద సంచరించుటే మనస్సునకు స్వభావమును, అలవాటును అయిఉన్నప్పటికిని, ఆ విషయములయందైనను వీని ఇష్టమువచ్చినచోట ఉండుటగాని, ఒకదానిమీదనే స్థిరముగా నిలచుటగాని లేదు. ఇట్టిమనస్సుతో ఎట్లు వేగుట ? దీనిని నిగ్రహించుట- అనగా దీని సంచారమును ఆపుట - వాయుసంచారమును ఆపుట వలెనే ఎంతో కష్టమైనపని.

ఇంకను 'ప్రమాథి' - అనగా క్షోభపెట్టుటయే స్వభావముగా కలది. ఈశ్లోకములో మనస్సును గురించి 'ప్రమాథి' అని చెప్పబడిఉన్నది. కాని రెండవ అధ్యాయములోని అరువదియవ శ్లోకములో "ఇంద్రియాణి ప్రమాథీని" అని చెప్పబడిఉన్నది. అనగా 'ఇంద్రియములు మనస్సును విషయములవైపునకు బలాత్కారముగ లాగి, స్థిరముగా నుండనీయక, క్షోభపెట్టుచున్నవి' అని అర్థము. సారాంశమేమన - ఇంద్రియములును క్షోభపెట్టుటయే స్వభావముగా కలవి. మనస్సును క్షోభపెట్టుటయే స్వభావముగా కలది. ఇప్పుడీ శ్లోకము మనస్సునుగూర్చి చెప్పు ఘట్టము కనుక, 'మనస్సు క్షోభపెట్టు స్వభావము కలది' అని చెప్పబడినది. అక్కడ రెండవ అధ్యాయములోని అరువదియవ శ్లోకము ఇంద్రియములయొక్క

స్వభావము చెప్పుటకొరకు ఏర్పడినది. కనుక అక్కడ ఇంద్రియముల స్వభావము చెప్పబడినది. మొత్తముమీద ఇంద్రియములును, మనస్సును కూడ క్షోభపెట్టునవియే. ఇంద్రియములు మనస్సును, మనస్సు ఇంద్రియములను - ఇట్లు పరస్పరము క్షోభింపజేసికొను స్వభావము కలవి. అంతియేకాదు. రెండవ అధ్యాయములోని అరువది ఏడవ శ్లోకములో 'ఈ రెండును కలిసి, వివేకవంతమైన బుద్ధినికూడ సంక్షోభపెట్టును' అని చెప్పబడి ఉన్నది. ఇటువంటి మనస్సును జయించుట ఎట్లని అర్జునుని ప్రశ్న. పోనీ, మనస్సుయొక్క స్వభావము సంక్షోభపెట్టుటయే అయినను, స్థిరముగా నుండనిదే అయినను, దానిని అదిలించియో, బెదిరించియో, పసిబాలుని రెక్కపట్టుకొని ఒకచోట కూలవవేసినట్లు చేయుటకు సీలులేదే! అది చాల బలము కలది. మదించిన ఏనుగు వంటిది. మదించి అరణ్యములో తిరుగుచున్న ఏనుగును ఆ అరణ్యమునుండి తీసికొని వచ్చుటకు మావటీడు అంకుశముతో ఎన్నిమారులు ఎంతగా ప్రహరించుచున్నను, ఆ ఏనుగు, ఎంతమాత్రమును లక్ష్యముచేయక తన ఇష్టము వచ్చినట్లు స్వతంత్రముగ ఎట్లు సంచరించునో, అట్లే ఈ మనస్సనెడి ఏనుగు కూడ బుద్ధియను మావటీడు వివేకము అను అంకుశముతో ఎన్నిమారులు ఎంతగా ప్రహరించుచున్నను, ఎంతమాత్రమును లక్ష్యము చేయక, విషయారణ్యములోనే తన ఇష్టమువచ్చినట్లు స్వతంత్రముగ సంచరించుచున్నది. దృఢమైనది. దీనిని జయించుట

చాలకష్టము. విషయ సముద్రమునందు ముంచెడి * తంతు నాగము వంటిది. అది చాల దృఢమైనది. ఒక సన్నని త్రాడు వలె నీటిలో నుండును. నీటిలోనికి దిగిన మదించిన ఏనుగు నైనను సరే, పట్టుకొని, కాళ్ళకు చుట్టుకొని, ఇక కదలనీయదు. ఎంత బారైనను సాగును. ఏనుగు తొండముతో కట్టి లాగినను అది తెగదు. అంత దృఢమైనది. ఇట్లు మనస్సును గురించి వర్ణించి, అర్జునుడు - 'కృష్ణా, ఇటువంటి మనస్సును నిగ్రహించుట అతికష్టమైన పని. శరీరములో నిరంతరమును సంచరించెడి ఉచ్ఛ్వాస నిశ్శ్వాస రూపమైన వాయువును నిగ్రహించుట కేవలము నావంటివానికి సాధ్యమా? మనస్సును నిగ్రహించుట అంతకంటెకూడ కష్టమైనది' అని చెప్పుకొనుచున్నాడు.

శ్రీ భగవానువాచ :—

శ్లో॥ అసంశయం మహాబాహో !
మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ !
వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35

ప. వి:- అసంశయం, మహాబాహో, మనః, దుర్నిగ్రహం, చలం, అభ్యాసేన, తు, కౌంతేయ, వైరాగ్యేణ, చ, గృహ్యతే.

---

* తంతునాగము అనగా సర్పాకారముకల ఒక జలజంతువు. తెనుగులో 'నెగడు' అందురు.

టీక :—

మహాబాహో = గొప్పబాహువులు కల,
కౌంతేయ = అర్జునా !
అసంశయం = నిస్సందేహముగా,
మనః = మనస్సు,
చలం = చంచలమైనదియును,
దుర్నిగ్రహం = నిగ్రహించుటకు కష్టమైనదియును;
తు = అయినప్పటికిని,
అభ్యాసేన = అభ్యాసము చేతను,
వైరాగ్యేణ చ = వైరాగ్యము చేతను,
గృహ్యతే = నిగ్రహింపబడుచున్నది.

తా. అర్జునా ! నీవు చెప్పినది సత్యమే. సందేహ మెంతమాత్ర మునులేదు. మనస్సు అత్యంతము చంచలమైనదే: నిగ్రహించుట చాల కష్టసాధ్యమే. కాని, అసాధ్యము మాత్రము కాదు. నెమ్మది నెమ్మదిగ పట్టుదలతో ప్రయత్నించుటచేతను, వైరాగ్యము చేతను మనస్సును వశమునకు తెచ్చుకొనవచ్చును.

అ మృ త వా హి ని :—

నెమ్మదినెమ్మదిగ అయినను చేయుచున్నచో ఏ పని యైనను, ఎప్పటికైనను నెరవేరును. ఊరక కూర్చొనిన ఏ పని యును నెరవేరదు కదా ! ఇక మనస్సును స్వాధీనమునకు తెచ్చుకొను విషయములో ఎంత ప్రయత్నము చేయవలయును!

ఈ మనస్సును వశము చేసికొనుటకు అభ్యాసము, వైరాగ్యము అను రెండు ఉపాయములుకలవు. ఆ రెండు ఉపాయములచేతను మనస్సును నిగ్రహించి వశము చేసికొనుము - అని కృష్ణ పరమాత్మ అర్జునునికి చెప్పుచున్నాడు. పతంజలికూడ తన యోగదర్శనములో "అభ్యాస వైరాగ్యాభ్యాం త న్నిరోధః" 'అభ్యాస వైరాగ్యములచే చిత్తవృత్తులయొక్క నిరోధము సాధ్యమగును' అని చెప్పియున్నాడు.

అభ్యాస మనగా ఏమో, వైరాగ్య మనగా ఏమో, విచారించి తెలిసికొనవలయును.

## అ భ్యా స ము :-

మనస్సును అన్యవిషయములనుండి మాటిమాటికి మరలించి, లక్ష్యమునందు నిలుపుటకు ఎడతెగకుండ ప్రయత్నించుటను అభ్యాసము అందురు. ఇక్కడ ప్రకరణవిషయము భగవంతునియందు మనస్సు నిలుపుటకు సంబంధించినది. కనుక భగవంతునే తన లక్ష్యవస్తువుగా ఉంచుకొని, చిత్తవృత్తుల యొక్క ప్రవాహమును భగవంతునివైపునకు మరల్చుటకై మాటిమాటికి ప్రయత్నించవలయును. దీనికి అనేక విధానములు కలవు. సాధకుల సౌకర్యార్థము కొన్ని ఈ క్రింద వివరింపబడుచున్నవి.

(1) ఏకాంతప్రదేశమున ఆసనమును ఏర్పాటు చేసికొని, ఆ ఆసనముపై శరీరమును, మెడను, శిరస్సును సమముగ

చేసి, సుఖాసనముతో కూర్చొనవలయును. భగవంతుని అవతారములలో తనకు ఇష్టమైన మూర్తియందు మనస్సును నిలుపుటకు మాటిమాటికి యత్నించవలయును. సాధకుడు కొంచెము అజాగ్రత్తగ ఉన్న సమయము కనిపెట్టి మనస్సు మరల తన ప్రాతఅలవాటు ప్రకారము విషయములమీదికి పరుగుపెట్టును. దానిని మరల వెనుకకు మరల్చి, భగవన్మూర్తి యందు నిలుపవలయును. ఇట్లు ఓర్పుతో, విసుగులేక, నిత్యమును విడువకుండ అభ్యాసము చేసినయెడల, తప్పక మనస్సు వశమగును.

అభ్యాసము చేయునప్పుడు మనస్సును నిలుపుకాలము ఒక నిముసము దగ్గరనుండియే ప్రారంభింపవచ్చును. ఎంత మాత్రమును తొందరపడ రాదు. అభ్యాసమునకు నాగా ఉండ రాదు. నిముసము నిలుపుట బాగుగ అభ్యాసమై, ధైర్యము చిక్కిన తరువాత ఇంకొక నిముసము- ఇట్లు అభ్యాసకాలమును పెంచుచు, దీర్ఘకాలము అభ్యాసము చేయవలయును.

(2) భగవంతుడు సర్వత్ర వ్యాపించి ఉన్నాడు కనుక, మనస్సు ఎక్కడకు పోయినను సరే, అడ్డు పెట్టనక్కర లేదు కాని, అది ఏ వస్తువుమీదకు పోవునో ఆ వస్తువునందే సాధకుడు భగవంతుని భావించుచుండవలయును.

(3) మానసపూజ అభ్యసించవలయును. అంతర్యమునందే భావమయ మూర్తులను నిలిపికొని, తులసి, పుష్పములు

మొదలగున వన్నియును భావించుచు, ఆ భావమయ సామగ్రుల తోడనే షోడశోపచారములు మొదలగు పూజ చేయ వలయును.

(4) నాసిక ద్వారా వాయువును లోపలికి పీల్చునపుడును, బయటకు విడుచునప్పుడునుకూడ ఆ వాయువుతో కలిపి భగవన్నామమును స్మరణ చేయవలయును.

(5) ఏకాంత ప్రదేశమునందు ఆసనముపై స్థిరముగ కూర్చొని, భగవన్నామమును - శ్రీరామ లేక శ్రీకృష్ణ లేక సాధకునకు ఇష్టమైన మరొక నామము - ఏదో ఒక భగవన్నామమును, ప్రారంభమున నూటఎనిమిదితో ప్రారంభించి జపము చేయవలయును. ఎట్లనగా - నోటితో సంబంధము లేకుండ హృదయములోనే జపించవలయును. ఆ నామము తన మనస్సుతో తాను వినుచుండవలయును. అట్లు మొదటి నామమునుండి చివరి నామమువరకును మధ్య తెంపులేకుండ వినుచుండవలయును. మధ్యలో సాధకునకు తెలియకుండ, మోసగించి, అకస్మాత్తుగ మనస్సు ఎక్కడకో పరువెత్తును. సాధకుడు జాగ్రత్తతో గమనించి, హెచ్చరికతో, మరల మొదటినుండియును ప్రారంభించవలయును. ఇట్లు నిర్ణీత సంఖ్యలో నామములు తెంపులేకుండ వినుచు జపించగలిగిన గాని, నేను ఈ ఆసనమునుండి లేవను; ఆహారమును ముట్టను;

నీవు త్రాగను - అనునంత తీవ్రమైన పట్టుదలతో అభ్యాసము సాగించవలయును. మిగిలిన అన్ని అభ్యాసముల కంటెను, ఈ అభ్యాసము చాల సులభము. అయితే, పట్టుదల కావలయును. కాని, ఏదైనను ఐహిక విషయముల కొరకైనచో, పట్టుదలతో నిరశన వ్రతములను సాగించగలరు. పరమార్థ సాధనకొరకు ఇట్టి పట్టుదలతో చేయలేరు. ఐహికమైన పనులు సాధించుటకు నిరశనవ్రతములను సాగించువారిని చూచి, పరమార్థసాధకులు సిగ్గు తెచ్చుకొనవలయును. వారికి అనిత్యములైన ప్రాకృత విషయములను సంపాదించుటకొరకే, ప్రాణములనుకూడ లక్ష్యముచేయని ఆ పట్టుదల ఉన్నదే ! మహోత్కృష్టము, నిత్యము, అనంతము అయిన పరమార్థ లాభమునకై మనము ఇంత మాత్రము పట్టుదలతో కృషి చేయలేకుండ ఉన్నాము; ఛీ ! మనదికూడ ఒక బ్రతుకేనా ! అని బాగుగ మననము చేయవలయును.

(6) కేవలము భగవదనుభవము కలిగిన మహాత్ముల సాంగత్యముచేయుచు, అమృతతుల్యములైన వారి ప్రబోధములను శ్రద్ధాభక్తులతో వినుచు, తదనుసారము నడచుకొనుటకు త్రికరణశుద్ధిగా, ప్రయత్నించుచుండవలయును. అట్టి భగవదనుభవములు లభించకపోయిన యెడల, భగవదనుభవము లేకపోయినను, శుద్ధసత్త్వస్వభావులై, భగవన్మార్గములో నిష్ఠతో పయనించు మహాత్ముల సాంగత్యమును చేయవలయును.

(7) అభ్యాసము లన్నిటికిని పునాదివంటిది-"నా మనస్సు యొక్క చంచలస్వభావము నశింపచేసి, నీ యందే నిలుపుకొనుము మహాప్రభో" అని, సర్వశక్తిమంతుడును, సర్వజ్ఞుడును, వాత్సల్య మహోదధియును అయిన భగవంతుని, మహావిశ్వాసముతో, నిజమైన ఆర్తితో, హృదయపూర్వకముగ ప్రార్థించవలయును.

(8) మృదుమధురము లైనట్టియు, చిత్తాకర్షకము లైనట్టియు, కర్ణామృతము లైనట్టియు భగవద్గుణ వైభవ లీలా ప్రభావములతో కూడిన దివ్యకథలను వీలుచిక్కినప్పుడెల్ల, కాలమును నిముసముకూడ వృథగా పోనీయక మనస్సునకు వినిపించుచుండవలయును.

ఇంకను అనేకవిధములగు సాధనమార్గములు కలవు. స్వతంత్ర సాధన లన్నిటికంటెను, అయిదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ మార్గములు శీఘ్రఫలదములు.

## వైరాగ్యము :-

ఇహలోకముయొక్కయును, బ్రహ్మలోక పర్యంతము లైన పరలోకములయొక్కయును, భోగములపై ఎంతమాత్రమును ఆసక్తిలేకుండుటను వైరాగ్యమందురు. వైరాగ్యము కలవాని చిత్తము ఎట్టి విపత్తులకుకాని, ఎట్టి సుఖములకుకాని చలించదు. ఏ భోగముకూడ అతని చిత్తమును ఆకర్షించలేదు. అట్టి వైరాగ్యము లభించుటకు కొన్ని సాధనలు పేర్కొనబడుచున్నవి.

(1) ప్రాపంచిక భోగములయొక్క తుచ్ఛత్వమును, అనిత్యత్వమును, దుఃఖప్రదత్వమును మాటిమాటికి విచారించి మననము చేయుచుండవలయును.

(2) జన్మ - జర - వ్యాధి - మృత్యువు మొదలగు దోషములను, వానివలన కలుగు దుఃఖములను సదా మననము చేయుచుండవలయును.

(3) జగత్తు యొక్కయు, భగవంతుని యొక్కయును యథార్థస్వరూపములను తెలుపు సచ్ఛాస్త్రములను అర్థముతో కూడ అధ్యయనము చేయుచుండవలయును.

(4) పరమ వైరాగ్య సంపన్నులైన మహాత్ముల సాంగత్యము చేయుచుండవలయును. అట్టివారు లభించనప్పుడు వారి చరిత్రలను చదువుచు, వారి జీవితములలోని వైరాగ్య సంబంధములైన ఘట్టములను గూర్చి విచారణ చేసికొనుచుండవలయును.

(5) ఒకప్పుడు ప్రపంచములోకెల్ల మహోజ్జ్వలముగ ప్రకాశించిన గొప్పగొప్ప పట్టణములు ఇప్పుడు ఎట్లు శిథిలములై, పాడుపడి ఉన్నవో తలచుకొనుచుండుటయును, వీలు చిక్కినప్పుడు పోయి చూచి వచ్చుచుండుటయును చేయవలయును,

(6) ఎంతగొప్ప మహాసామ్రాజ్యములుకూడ ఊరును పేరును లేక, ఎట్లు నశించినవో విచారించుచుండవలయును. భూమండలము నంతను ఏకచ్ఛత్రాధిపత్యముగ ధర్మపరిపాలన చేసినట్టియును, మహాభోగము లనుభవించినట్టియును, జగత్ప్రసిద్ధములైన దానధర్మములు చేసి, కీర్తి ప్రతిష్ఠలు సంపాదించినట్టియును, మహాపరాక్రమ సంపన్నులైనట్టియును మాంధాతాది చక్రవర్తులు కూడ ఎట్లు నశించిరో, వారి వంశములుకూడ ఎట్లు నశించినవో, విచారించుకొనుచుండవలయును.

(7) మూడులోకములను కూడ గజగజ లాడించి, హాహాకారము లెత్తించిన హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, రావణ కుంభకర్ణులును - ఇంకను అంతటివారైన ఎందరో - సమయము వచ్చునప్పటికి కాలగర్భములో కలిసిపోయినారను విషయమును మాటిమాటికిని స్మరించుకొనుచుండవలయును.

(8) ఇట్టి తుచ్ఛ విషయోపభోగములయందు నాకు పరిపూర్ణ వైరాగ్యమును కలిగించవలసినది ప్రభూ అని సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, శరణాగత వత్సలుడును, కారుణ్యామృత మహోదధియును అయిన భగవంతుని మహావిశ్వాసముతో, ఆర్తితో, హృదయపూర్వకముగ ప్రార్థించవలయును.

ఈ విధముగ అభ్యాస వైరాగ్యముల రెంటిచేతను మనస్సు వశపడును. ఈ అభ్యాస వైరాగ్యములు, రెండును పరస్పరము సహాయపడును, అభ్యాసముచేత వైరాగ్యము వృద్ధిచెందును. వైరాగ్యముచేత అభ్యాసమును వృద్ధి చెందును.

శ్లో॥ అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా
శక్యోఽవాప్తుముపాయతః ॥ 36

ప. వి :_అసంయతాత్మనా, యోగః, దుష్ప్రాపః, ఇతి, మే, మతిః, వశ్యాత్మనా, తు, యతతా, శక్యః, అవాప్తుం, ఉపాయతః.

టీక :_

అసంయతాత్మనా = మనస్సును వశము చేసికొనని వానిచేత,

యోగః = యోగము,

దుష్ప్రాపః = పొందసాధ్యముకానిది,

వశ్యాత్మనా తు = స్వాధీనమైన మనస్సు కలిగి,

యతతా = ప్రయత్నించువానిచేత,

ఉపాయతః = ఉపాయముతో (నేర్పరితనముతో),

అవాప్తుం = పొందుటకు,

శక్యః = సాధ్యమైనది,
ఇతి = అని,
మే = నా యొక్క,
మతిః = అభిప్రాయము (నిశ్చయము)

తా. మనస్సును వశము చేసికొనని వానికి మాత్రము ఈయోగము దొరకదు. మనస్సును వశము చేసి కొనిన ప్రయత్న శీలునికి తేలికగా పొందుటకు శక్యమైనది - ఇది నా అభిప్రాయము.

అమృతవాహిని :-

అర్జునా ! అభ్యాస వైరాగ్యముల ద్వారా మనస్సును వశము చేసికొని ప్రయత్నించువానికి మాత్రమే ఈయోగము. వెనుకటి ఇరువది తొమ్మిదవ, ముప్పదవ, ముప్పది ఒకటవ, ముప్పది రెండవ శ్లోకములలో చెప్పబడిన సమత్వ రూపమైన యోగము - చక్కగా లభ్యముకాగలదు. మనస్సును వశము చేసికొననివానికి; ఎంతకాలమునకును ఈ యోగములభ్యము కాదు సుమా !

అభ్యాస వైరాగ్యములద్వారా సాధకుడు తన మనస్సును వశము చేసికొనలేనినాడు, వాని మనస్సు మీద రాగ ద్వేషములు అధికారమును చెలాయించుచుండును. ఆ రాగ ద్వేషములయొక్క ప్రేరణచేత మనస్సు కోతివలె విషయారణ్యములలో ఒక చోట ఎంతమాత్రమును నిలకడ లేక, ఇక్కడక్కు

అక్కడకు ఉరుకులు పరుగులు పెట్టుచుండును. అంతఃకరణములో భోగములయందు ఇంతగా ఆసక్తి కలిగియున్న వాని బుద్ధి కూడ బహుశాఖలు కలిగి స్థిరములేక అతిచంచలముగా ఉండును. ఇట్టివారిని గురించియే రెండవ అధ్యాయములో నలుబది ఒకటవ శ్లోకము నుండి, నలుబది నాల్గవ శ్లోకము వరకును వర్ణింపబడియున్నది. ఇట్టి స్థితిలో సమత్వయోగము ఎట్లు లభించును ? కనుక ఇక్కడ అసంయతాత్ములకు ఈ యోగము లభించదని చెప్పబడినది.

అభ్యాస వైరాగ్యముల ద్వారా వశపడిన మనస్సు, ప్రేమతో తొణికిసలాడు హృదయము కలిగిన మహాపతివ్రతయైన భార్య భర్తనువలె, సకల సద్గుణ శాలియైన సచ్ఛిష్యుడు గురువుపనువలె, సాధకుని ఆజ్ఞలను పాటించుచుండును. ఎప్పుడు ఎక్కడ ఎట్లు ఎంతసేపు నిలిపిన, అప్పుడు అక్కడ అట్లు అంతసేపును వినయ విధేయతలతో నిలిచియుండును. ఏపని చెప్పిన ఆ పని ఎంతమాత్రమును ఔను కాదు అనకుండ చేయును. ఆ స్థితిలో ఇంద్రియములు కూడ ముక్కుకు త్రాళ్ళు వేయబడిన గిత్తలవలె మనస్సునకు చెప్పినమాట వినునేగాని, అవి మనస్సును తమ యిష్టమువచ్చినట్లు లాగలేవు.

'యతతా' 'ప్రయత్న శీలునిచేత' అని చెప్పబడినది. అనగా అట్లు వశపడిన మనస్సుగలవాడు ఏమిచేయవలయును?

పరిపూర్ణ సిద్ధి కలుగు వరకును ప్రయత్నము చేయుచుండ వలయును. మనస్సు వశపడినంత మాత్రమున తనపని తీరిపో లేదు. ఆ మనస్సును పరమాత్మ ధ్యానమునందు పూర్తిగ నిలుపుటకు తీవ్రముగా ప్రయత్నించవలయును. అట్లు ప్రయ త్నించిన యెడల అతి శీఘ్రముగా సిద్ధిని పొందగలడు. యోగ సిద్ధిని పొందుటలో ముఖ్యాతి ముఖ్య పరికరమైన మనస్సే, మనకు శత్రువై నిలబడినప్పుడు ఎంత కష్టముండునో! కష్ట మేమి కర్మ-యోగము లభించనే లభించదు. అట్టి ముఖ్య పరి కరమైన ఆ మనస్సే ఇప్పుడు శ్రద్ధా వినయ విధేయతలతో మన చెప్పుచేతలలో ఉన్నప్పుడు ఎంత కష్టము తీరిపోయినదో చూడుడు! ఇంక సాధన అనగా వేరే ఏమియును లేదు - నిరాటంకముగా లక్ష్యము వైపునకు - గమ్యస్థానము వైపు నకు - పరుగు పెట్టుటయే. క్రమశిక్షణ కలిగి, చెప్పినమాట విను గుఱ్ఱము ఉన్నను, గమ్యస్థానమునకు చేరవలయునన్నచో ప్రయాణము చేయవలయును గదా! గుఱ్ఱము ఎంత బలము గలదైనను, ఎంత వేగముగా పరుగెత్తగలది యైనను, ఎంత క్రమశిక్షణ కలిగి మన కనుసన్నల మెలగునది యైనను, ఊరక కూర్చున్నచో గమ్యస్థానము చేరగలమా? లేదు. ప్రయా ణము చేయవలయును. ప్రయాణము చేయువానికే, అట్టి గుఱ్ఱము లభించిన ప్రయోజనము. ఈ భావమును వ్యక్త పరచుటకే 'మనస్సు వశపడినవానిచేత' అని, తరువాత 'ప్రయత్నశీలునిచేత' అను విశేషణము వేయుట.

అట్లు సాధన చేయువానికి భగవత్సాక్షాత్కారము త్వరలో లభించగలదు.

పరమాత్మసాక్షాత్కారమైనంతనే, సమస్త భూతములలో పరమాత్మనే చూడగలడు. సమస్తభూతములలో - ఎక్కడచూచిన అక్కడ పరమాత్మయే దర్శనమిచ్చునప్పుడు, ఇక రాగద్వేషములు ఎవరిమీద? సర్వత్ర సమబుద్ధియే సహజముగా లభించగలదు. అంతవరకును ప్రయత్న కాలములో, అనగా సాధనకాలములో, సంపూర్ణ చరాచర జగత్తులో లోపల, బయట, క్రింద, పైన, అన్నివైపులను సచ్చిదానంద ఘనస్వరూపుడు, సర్వశక్తిమంతుడు, సకల కల్యాణగుణ సాగరుడునైన భగవంతుడు సర్వవ్యాపకుడై, యున్నాడు అని త్రికరణశుద్ధిగా నమ్మి మననము చేయుచుండ వలయును. ఇట్లు విచారించుచు, మననము చేయుచున్న కొలది రాగద్వేషముల ప్రభావము క్షీణించుచుండును. రాగద్వేషములు క్షీణించుచున్న కొలది, అంతఃకరణములో సమత్వ భావము పొడచూపి, వృద్ధిపొందుచుండును.

అర్జున ఉవాచ :—

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో
యోగాచ్చలిత మానసః ।
అప్రాప్య యోగ సంసిద్ధిం
కాం గతిం కృష్ణ ! గచ్ఛతి ॥ 37

ప. వి :- అయతిః, శ్రద్ధయా, ఉపేతః, యోగాత్, చలితమానసః, అప్రాప్య, యోగసంసిద్ధిం, కాం, గతిం, కృష్ణ, గచ్ఛతి.

టీక :—

కృష్ణ ! = హే కృష్ణా !
శ్రద్ధయోపేతః = శ్రద్ధతో కూడుకొనియున్నను,
అయతిః = తీవ్రప్రయత్నము చేయనివాడు,
యోగాత్ = యోగమునుండి,
చలితమానసః = చలించిన మనస్సు కలవాడై,
యోగసంసిద్ధిం = భగవత్సాక్షాత్కారమును,
అప్రాప్య = పొందకయే,
కాం గతిం = ఏగతిని గూర్చి,
గచ్ఛతి = పోవుచున్నాడు ?

తా. కృష్ణా ! ఒకడు శ్రద్ధ ఉండికూడ, తీవ్రకృషి చేయని కారణమున అంత్యకాలమున వాని మనస్సు యోగమునుండి చలించిపోయినచో, అట్టి సాధకుడు యోగసిద్ధిని - అనగా భగవత్సాక్షాత్కారమును - పొందక ఏ గతికి పోవుచున్నాడు ?

అమృతవాహిని :-

'కృష్ణా ! ఒకనికి యోగమునందు శ్రద్ధ ఉండును. ప్రయత్నము చేయును; కాని తీవ్రప్రయత్నము చేయని కారణమున వాని ప్రయత్నము ఫలించకమునుపే, వాని శరీర పతన సమయము వచ్చినది. వాడు యోగసిద్ధిని పొందకయే

శరీరమును వదలిపెట్టి పోవుచున్నాడు గదా ! అట్టివాడు ఏగతికి పోవుచున్నాడు ?' - ఇది అర్జునుని ప్రశ్న. ఈ శ్లో. ములో 'అయతి' అనుశబ్దము ప్రయోగింపబడినది. 'యతి' అనగా 'ప్రయత్నశీలు' డని అర్థము. అనగా పరమార్థము కొరకై యత్నించువాడు యతి. 'అయతి' అనగా అట్లు యత్నింపని వాడు. అట్లని ఏమియును ప్రయత్నము చేయనివాడని అర్థము కాదు. తీవ్రప్రయత్నము చేయని మందసాధకుని గురించి వేసిన ప్రశ్న ఇది అని గ్రహించవలయును.

అర్జునుడు వేసిన ఈ ప్రశ్న యోగమునుండి పతితుడైన విషయలోలుని గురించి అని కొంతమందియును, యోగమునందు శ్రద్ధమాత్రము ఉండి, ఎంతమాత్రమును ప్రయత్నమే చేయని వానిని గురించి అని కొంతమందియును వ్యాఖ్యానించినారు. కృష్ణపరమాత్మ చెప్పిన సమాధానము ననుసరించి చూచినచో, 'యోగాచ్చలిత మానసః' అన్న దానికి పై రెండు వ్యాఖ్యానములును సరియైనవి కావని నిరూపింపబడుచున్నది. కృష్ణపరమాత్మ చెప్పిన సమాధానములో రెండు విషయములున్నవి. ఒకటి - "పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే, నహి కల్యాణకృత్ కశ్చిద్ దుర్గతిం తాత గచ్ఛతి" 'పార్థా ! అట్టివానికి ఈ లోకమునందుగాని, పరలోకమునందుగాని వినాశనము లేదు. ఏలయన పరమార్థవిషయములో కృషి చేయువాడెవడును దుర్గతిని

పొందడు' - అనునది. యోగమునుండి పడిపోయి విషయ లోలురైనవారికి దుర్గతి కలుగదు అని శాస్త్రసమ్మతమైన ఏ సంప్రదాయమైనను చెప్పునా ? శ్రద్ధ ఉండి, తీవ్రసాధన మాత్రము చేయనట్టివాని విషయములో, అతడు విషయ లోలుడై పాపము చేయకుండ ఉన్న పక్షమున అతనికి దుర్గతి కలుగదు అని చెప్పిన చెప్పవచ్చును. విషయలోలునకు దుర్గతి లేదని చెప్పుటయా ? అసంభవము. ఇక రెండవ విషయము- "ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" 'నీవు చెప్పిన యోగభ్రష్ట పురుషుడు పుణ్యము చేసినవారికి లభించు లోకములకు పోయి, చాల సంవత్సరములు అక్కడ నివసించి, తరువాత సదాచార సంపన్నులును, శ్రీమంతులును అయిన వారి ఇంట జన్మించుచున్నాడు-అనునది. అర్జునుడు అడిగిన ప్రశ్న విషయలోలురను గురించినదే అయిన యెడల, వారికి పుణ్యము చేసినవారికి లభించెడి ఊర్ధ్వలోకములలో అనేక సంవత్సరములు నివాసము లభించునా ? తరువాత సదాచార సంపన్నులైన శ్రీమంతుల ఇండ్లలో జన్మలభించునా ? కృష్ణ పరమాత్మ అట్లు చెప్పునా ? విషయలోలురకు కొన్ని లోక ములు ప్రత్యేకింపబడి ఉన్నవి. ఈ పుణ్యలోకములు లభింపవు. ఇక శ్రద్ధమాత్రము ఉండి యోగముకొరకు ప్రయత్నించని వారికి, వారు పాపములు చేయలేదు కనుక, నరకాది అధో లోకములు లభింపకపోవచ్చును. అంతేగాని, ఊర్ధ్వలోకము

లెట్లు లభించును ? కనుక ఇక్కడ అర్జును డడిగినది పెద్దరిని గురించియును కాక, పైన చెప్పినట్లు యోగమునందు శ్రద్ధ మాత్రము ఉండి, తీవ్రకృషి సలుపక మందగమనముతో కృషి చేయువానిని గురించియే అని తెలుచున్నది. అట్టివానికి కృషి ఫలింపకముందే శరీరపతనము కలిగినయెడల అతనికి ఏగతి కలుగును ? పాపము చేయలేదు గనుక నరకాది లోకములకు పోడు; పుణ్యము చేయలేదు గనుక పుణ్యలోకములు లభింపవు; యోగము సిద్ధింపక మునుపే మరణము ప్రాప్తించుటచే మోక్షము రాదాయె - ఇక వాడు ఏమి కావలయును ? అని అర్జునుడు అడుగుచున్నాడు. 'అయతి' అనుదానికి కేవలము ఏవిధమైన ప్రయత్నము చేయనివాడు అను అర్థము మాత్రమే చెప్పనక్కరలేదు. శబ్దమునకు ముందు వచ్చిన 'నఞ్' అనునది అభావమును తెలుపునదే అయినను, అల్పము అను అర్థములో కూడ చాలచోట్ల వాడబడియున్నది.

శ్లో॥ కచ్చి న్నోభయ విభ్రష్ట
శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి !
అప్రతిష్ఠో మహాబాహో ।
విమూఢో బ్రహ్మణః పథి ॥ 38

ప. వి :-కచ్చిత్, న, ఉభయ విభ్రష్టః, ఛిన్నాభ్రం, ఇవ, నశ్యతి, అప్రతిష్ఠః, మహాబాహో, విమూఢః బ్రహ్మణః, పథి.

టీక :—

మహాబాహో = మహాబాహువులు గల కృష్ణా !
బ్రహ్మణః = భగవత్ప్రాప్తికి సంబంధించిన,
పథి = మార్గమందు,
విమూఢః = జ్ఞానము లేని మూఢుడు,
అప్రతిష్ఠః (సన్) = నిరాశ్రయుడగుచు,
ఛిన్నాభ్రమివ = చెదరిపోయిన మేఘమువలె,
ఉభయ విభ్రష్టః = రెండువిధములుగను- అనగా ఇటు భగవత్ప్రాప్తి ఫలమును, అటు సాంసారిక భోగములును లేక ఉభయభ్రష్టుడై,
నశ్యతి కచ్చిత్ = నశించిపోడు గదా !

తా. గొప్ప బాహువులు గల కృష్ణా ! అట్టివాడు భగవత్ప్రాప్తిరూప ఫలమును పొందు మార్గమునుండి వంచింపబడి, దిక్కులేక, ఉభయ భ్రష్టుడై, చిన్న చిన్న ముక్కలుగా చెదరిపోయిన మేఘమువలె నశించదు గదా !

అమృతవాహిని :—

వివేక వైరాగ్యములు తక్కువ అగుటచే సాధనమందము కాగా, ఈలోగా ప్రాణప్రయాణ సమయమువచ్చి, సిద్ధి కలుగకముందే దేహమును విడిచి పోవుటచే, భగవత్ప్రాప్తి లేకుండ పోయినప్పటికి, చేసిన సత్కార్యములైనను నిష్కామ్య

ముగ చేయుటచే ఇహలోక సంబంధమైనవిగాని, బ్రహ్మలోక పర్యంతమైనవిగాని, భోగములు లభింపవు. ఇట్టిస్థితిలో ఇక వాడు ఏమికావలయును ? ఒక పెద్దమేఘమునుండి ఒక చిన్న ముక్క తెగిపోవుటచే, అది దీనినుండి విడిపోయినది. ముందున్న మేఘమును చేరలేకపోయినది- అప్పుడది చెల్లాచెదరై నశించి పోవును. వీడుకూడ అట్లే నశించిపోడు గదా ! పోనీ నరకము నకు పోవునేమో అనుకొన్న అట్లును పోడు - పాపము చేయ లేదుగదా ! ఇట్లు ఐహిక పారమార్థిక సుఖములకు రెంటికిని దూరమై ఉభయభ్రష్టుడై నశించునా ? లేక ఏమగును ? అతని గతిఏమి ? అని అర్జునుడు అడుగుచున్నాడు.

శ్లో॥ ఏత న్మే సంశయం కృష్ణ
ఛేత్తు మర్హ స్యశేషతః ।
త్వదన్య స్సంశయ స్యాస్య
ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39

ప. వి :- ఏతత్, మే, సంశయం, కృష్ణ, ఛేత్తుం, అర్హసి, అశేషతః, త్వదన్యః, సంశయస్య, అస్య, ఛేత్తా, న, హి, ఉపపద్యతే.

టీక :—

కృష్ణ = ఓ కృష్ణా !
మే = నాయొక్క,
ఏతత్ = ఈ,

సంశయం = సంశయమును,
అశేషతః = పూర్తిగా,
ఛేత్తుం = పోగొట్టుటకు,
అర్హసి = తగుదువు,
అస్య = ఈ,
సంశయస్య = సందేహముయొక్క,
ఛేత్తా = నివారణము చేయువాడు,
త్వదన్యః = నీకంటె మరొకడు,
నహ్యుపపద్యతే = లభింపనే లభింపడుగదా !

తా. కృష్ణా ! నాయొక్క ఈ సంశయమును పూర్తిగ నివారణ చేయుటకు నీవే అర్హుడవు. ఈ సంశయమును నివారణము చేయుటకు నీకంటె ఇతరుడెవడును ఎక్కడను లభింపడుగదా !

అమృతవాహిని :—

కృష్ణుడు పరమాత్మ అను విశ్వాసము పూర్తిగ కలవాడు అర్జునుడు. ఇప్పుడు అర్జును డడిగిన ప్రశ్న మరణానంతర విషయము. ఇది ఒక మహారహస్యమైన విషయము. అది బుద్ధి, తర్కము, మొదలగు వానికి ఎంతమాత్రమును అందని విషయము. ఇట్టి విషయమును తెలియజెప్పుటకు ఒక్క భగవంతునికే సామర్థ్యము కలదు. "ఐశ్వర్యస్యసమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః జ్ఞాన వైరాగ్యయోశ్చైవ-" అని ఈ ఆరుగుణములకు భగము అని పేరు. ఈ గుణములు కలవాడు భగవంతుడు.

"ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతింగతిం,
వేత్తి విద్యా మవిద్యాంచ స వాచ్యో భగవానితి" 'సమస్త
భూతములయొక్క ఉత్పత్తి ప్రళయములను, రాకపోకలను,
విద్యను, అవిద్యను తెలిసికొనగలవాడు భగవంతుడు అని
చెప్పబడుచున్నాడు "ఏవ మేష మహాంశ్శబ్దో మైత్రేయ భగ
వానితి, పరమ బ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః"
'ఓమైత్రేయా! ఈ విధముగ గొప్పదైన భగవచ్ఛబ్దము పర
బ్రహ్మమూర్తి అయిన ఒక్క వాసుదేవునికే వాచకము.
ఇంకెవరికిని వర్తింపదు' అని విష్ణుపురాణములో ఉన్నది.
"కృష్ణస్తు భగవాన్ స్వయం"అన్నట్లు సాక్షాత్ భగవంతుడే
శ్రీకృష్ణుడు. శంకరాచార్యులవారు కూడ గీతావ్యాఖ్యాన
ములో ఈకృష్ణునే వాసుదేవ పరబ్రహ్మమని చెప్పియున్నారు.
గర్గభాగవతములో కృష్ణశబ్దమునకు అర్థము ఈ విధముగ
చెప్పబడి ఉన్నది - "కకారః కమలాకాంతో ఋకారో
రామ ఇత్యపి । షకారః షడ్గుణపతిః శ్వేతద్వీప నివాసకృత్ ॥
ణకారో నారసింహోయ మకారో హ్యక్షరోఽగ్నిభుక్ । విసర్గో
చ తథా హ్యేతౌ నరనారాయణౌ ఋషీ ॥ సంప్రలీనాశ్చ
షట్పూర్ణా యస్మింశ్ఛబ్దే మహాముని ! పరిపూర్ణతమే సాక్షా
త్తేన కృష్ణప్రకీర్తితః॥" ఈవిషయము అర్జునునికి కూడ బాగుగా
తెలియును. కనుకనే "కృష్ణా! ఈ నా సంశయమును తీర్ప నీవే
సమర్థుడవు. ఇంకెవరికిని తెలియుటకే వీలులేదు. కనుక

నాయందు కరుణించి ఈ సంశయమును తీర్పవే” అని వేడు కొనుచున్నాడు. భగవంతునికి ఏదియును దాపరము లేదు. ఈ అనంతకోటి బ్రహ్మాండములలో సమస్తమును - అనగా కర్మలును, వానియొక్క పరిణామములును, వానియొక్క ఫలములును, సృష్టియొక్క సంపూర్ణమైన నియమములును, సమస్త లోకములలో ఏమూల ఎవడు, ఎప్పుడు, ఏమి చేయుచున్నదియును, ఏమి మాట్లాడుచున్నదియును, ఏమి తలంచుచున్నదియును, సమస్త లోకములలోని సమస్త రహస్యములను, అన్నియును ఒకే సమయములో, ఉన్నవి ఉన్నట్లు ప్రత్యక్షముగ చూచి తెలిసికొనువాడు. అట్టి భగవంతుడు కృష్ణపరమాత్మ అర్జునునియందు అనుగ్రహముచే సమాధానము చెప్పుచున్నాడు :-

శ్రీ భగవానువాచ :-

శ్లో॥ పార్థ ! నైవేహ నాముత్ర
వినాశ స్తస్య విద్యతే ।
నహి కల్యాణకృ త్కశ్చి
ద్దుర్గతిం తాత ! గచ్ఛతి ॥ ४०

ప. వి :-పార్థ, న, ఏవ, ఇహ, న, అముత్ర, వినాశః, తస్య, విద్యతే, న, హి, కల్యాణకృత్, కశ్చిత్, దుర్గతిం, తాత, గచ్ఛతి.

టీక :—

పార్థ = అర్జునా!
తస్య= వానికి (నీవు అడిగిన యోగభ్రష్టునికి),
ఇహా = ఈ లోకమునందు;
వినాశః=నాశనము (నికృష్ట జన్మగాని, నరకముగాని);
న విద్యతే = కలుగదు;
అముత్ర చ = పరలోకమునందును,
(వినాశః = నాశము, హీనగతి)
న (విద్యతే) = కలుగదు,
తాత! = తండ్రీ!
కల్యాణకృత్ = శుభకర్మ చేయువాడు
(భగవత్సేవార్థము కర్మ చేయువాడు),
కశ్చిత్ = ఎవడును కూడ,
దుర్గతిం = దుర్గతినిగూర్చి,
నహి గచ్ఛతి = వెళ్ళనే వెళడు.

తా. శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు : అర్జునా! అట్టివాని కీలోకము నందుగాని, పరలోకమునందుగాని, వినాశము లేదు. తండ్రీ, శుభ చేయువాడు (భగవత్సేవార్థముగ కర్మ చేయువాడు) ఎన్నటికిని దుర్గతి కాడు సుమా!

అమృతవాహిని :—

అర్జునా! ఇట్టి యోగభ్రష్టునికి ఈ లోకమున నాశము లేదు; పరలోకమునందును నాశనము లేదు అని

చున్నాడు కృష్ణపరమాత్మ. ఈ లోకమునందు నాశమనగా - రాగద్వేషాది వికారములకులోనై, విషయలోలుపతచే పాపము లాచరించుటలో తన్మయుడగుట. ఇది ఇతని విషయమున సంభవించుటకు వీలులేదు. శ్రద్ధకలిగి, తీవ్రకృషి కాకపోయినను మందముగానైనను కృషి సాగించుచు ఉన్నవానికి మరణము లోపల సాధన సిద్ధించి మోక్షము కలుగక పోవచ్చును. ఇంక ఒకటి రెండు జన్మలలో మోక్షము కలుగవచ్చును. కాబట్టి విడువకుండ అట్లు సాధన సాగించువాడు; పుణ్యము ఎక్కువగా చేసినను, చేయకపోయినను, తెలిసి తెలిసి పాపము చేయడు. ఇంకను, ఈ లోకమున నాశము చెందుట మరొక విధము కావచ్చును. అది పంది మొదలగు నీచజన్మల నెత్తుట. ఈతనికి అట్టిదికూడ ఎంతమాత్రము సంభవింపదని నిశ్చయముగ చెప్పుచున్నాడు పరమాత్మ.

పరలోకమునను నాశములేదు. పరలోకమున నాశమనగా స్వర్గలోక సుఖాదులులేక, నరకాదిలోకములకుపోయి, యాతనలను అనుభవించుట. ఈతనికి అదికూడ ఉండదని ధైర్యము చెప్పుచు, కారణముకూడ వివరించుచున్నాడు పరమాత్మ- "న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం గచ్ఛతి" భగవత్సేవారూపములయిన శుభకర్మలు చేయువాడు ఎవడును దుర్గతిని చెందడు.

ఈవిషయమును దృష్టిలో ఉంచుకొని చెప్పినదే రెండవ అధ్యాయములో నలుబదవ శ్లోకము-"స్వల్పమ ప్యస్యధర్మస్య త్రాయతే మహతో భయాత్" 'ఈ ధర్మము అతి స్వల్పముగ ఆచరించినను, ఇది మహాభయమునుండి రక్షించును' అని. అది ఈ పై విషయమునే ధ్వనింపజేయుచున్నది. కనుక, పరమాత్మ ఈ శ్లోకములో సాధకులకు ధైర్యమును కలిగించి, అభయమును ప్రసాదించుచున్నాడు. సాధకుడు అంతఃకరణములో కపటభావము ఏమాత్రమును లేక, తన శక్తికి తగినంతగ, శ్రద్ధాపూర్వకముగ సాధనను చేయుచుండిన యెడల, ఇక ఆ సాధకునికి ఎన్నడును దుర్గతియే కలుగదు.

అయితే, సాధుసాంగత్యము, భజనము, ధ్యానము మొదలయిన సాధనలు చేయుచునే ఉందురు. అంతటితో ఆగక విషయలోలుపత కలిగిఉండి, పాపకర్మలు కూడ చేయుచుందురు. ఇట్టివారు లోకమున చాలమంది కనపడుచున్నారు. వారిలో సరిఅయిన శ్రద్ధ లేదని ఊహించవలయును. కానిచో, శాస్త్రము యందు, మహాపురుషులయందు నిజముగ శ్రద్ధ, విశ్వాసము ఉన్నచో, పాపకర్మలు చేయుటచే రౌరవాది నరక లోకములకు పోయి, పెక్కు విధములయిన భయంకర యాతనలను అనుభవించవలసి వచ్చునని వినుచునే ఉన్నారు కదా! భజన ధ్యానాదులు చేయుచునే ఉన్నారు కదా! అట్టివారు తెలిసి తెలిసి పాపకర్మలు కూడ చేయుచున్నారనిన వారికి శ్రద్ధలేదనవలయునే తప్ప వేరేమనవలయును ?

ప్రారబ్ధకర్మయే వారిచేత పాపము చేయించుచున్నదని చెప్పరాదా అనవచ్చును.

కాని, అట్లు చెప్పరాదు. ప్రారబ్ధకర్మ పాపములు చేయించుటలేదు. పాపపుణ్యములు చేయుటలో మానవునకు స్వాతంత్ర్యమున్నది. ఆ స్వాతంత్ర్యమే లేనియెడల పరమ ప్రమాణమైన వేదము "సత్యంవద, ధర్మంచర" అని ఇట్లు విధించుటలో అర్థము ఉండునా? ప్రారబ్ధకర్మను ఎవరును దాట లేరు. ప్రారబ్ధకర్మ కధీనమై అనుభవించవలసినవి ఇష్టమున్నను, లేకపోయినను, అనుభవించియే తీరవలయును.

పాపమునకు ప్రారబ్ధకర్మ కారణముకాదు; విషయాసక్తి కారణము. ఆసక్తిచేత పాపములు చేయును. పాపములు చేయకుండ ఉండవలయునన్నచో, పరమార్థముయొక్క విలువ తెలిసి, దానియందు ప్రేమ అయినను ఉండవలయును. అథవా, పాపములు చేసినయెడల యమునిచేతిలో చిక్కి, రౌరవాది నరకములలో అనేక భయంకర యాతనలను అనుభవించవలసి వచ్చునే అను భయమైన ఉండవలయును. ఈ రెండును లేని కారణముననే మానవుడు పాపములు చేయుచున్నాడు. వానికి శాస్త్రములయందును, మహాత్ముల ప్రబోధముల యందును, విశ్వాసమును, శ్రద్ధయును లేకపోవుటయే దీనికి కారణము. భజన, ధ్యానము, మొదలగు సాధనలలో ప్రవేశించుటకు ముందు పాపాచరణము కలిగి ఉన్నను, మహాత్ముల

సాంగత్యముచేత శాస్త్రములయందును, పరమార్థమునందును విశ్వాసము, శ్రద్ధ కలిగి ఉండి, భజన ధ్యానాదులు సక్రమ పద్ధతిలో మందముగా సాగించుచున్నను, శ్రద్ధ, విశ్వాసము కలిగి చేసెడి భజన ధ్యానాదుల ప్రభావమువలన నెమ్మది నెమ్మదిగ అంతఃకరణపరిశుద్ధి కలిగి పాపాచరణమునుండి విడువబడి, ఉన్నతస్థితికే గమనము చేయుచు, ఒకటి రెండు జన్మలలో భగవత్ప్రాప్తిని పొందగలడు. వాడు ఎప్పుడును దుర్గతి చెందడు.

"అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః ॥
క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి" ॥

(గీత 9-30, 31)

'ఎంత దురాచారుడైనను, అనన్యభావముతో నన్ను భజించుచున్నవాడయిన యెడల, అట్టి చక్కని నిశ్చయము కలిగి ఉన్నందున, వాడు సాధువనియే చెప్పదగినవాడు. వాడు శీఘ్రముగనే ధర్మాత్ముడగుచున్నాడు. శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. ఓ కౌంతేయా! అట్టి నా భక్తుడు ఎన్నటికిని నశించడు సుమా! అట్లని నీవు నిశ్చయముగ తెలిసికొనుము' అని గీతలో తొమ్మిదవ అధ్యాయమున వివరించినాడు పరమాత్మ.

అవతారిక :-

యోగభ్రష్టుడు నశించడు అని చెప్పిన తరువాత, అయితే ఏమి యగును అను జిజ్ఞాసకు సమాధానము రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు -

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా
నుషిత్వా శాశ్వతీ స్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే
యోగభ్రష్టోఽభిజాయతే ॥ ౪౧

ప. వి :- ప్రాప్య, పుణ్యకృతాం, లోకాన్, ఉషిత్వా, శాశ్వతీః, సమాః, శుచీనాం, శ్రీమతాం, గేహే, యోగభ్రష్టః, అభిజాయతే.

టీక :—

యోగభ్రష్టః = యోగభ్రష్టుడైనవాడు,
పుణ్యకృతాం = పుణ్యముచేసిన వారియొక్క,
లోకాన్ = లోకములను,
ప్రాప్య = పొంది,
శాశ్వతీః = అనేకములైన,
సమాః = సంవత్సరములు,
ఉషిత్వా = ఉండి,

శుచీనాం = సదాచార సంపన్నులైన,
శ్రీమతాం = ఐశ్వర్యవంతులయొక్క,
గేహే = గృహమునందు,
అభిజాయతే = పుట్టుచున్నాడు.

తా. యోగభ్రష్టుడైన మానవుడు, యజ్ఞయాగాది పుణ్యకర్మలు చేసినవారు పోవు స్వర్గాది లోకములు పొంది అచ్చట కొంతకాలము ఉండి తరువాత సదాచార సంపత్తిగల శ్రీమంతుల గృహములందు పుట్టు చున్నాడు.

అమృతవాహిని :-

యోగభ్రష్టుడు అనగా పతితుడు కాడని ఇదివరలో నిర్ణయము చేసుకొనియున్నాము. 'యోగాచ్చలితమానసః' అనగా దేహపతనము లోపల సిద్ధిపొందని యోగి అని అర్థము చెప్పినాము. అట్టి యోగి, ఆ జన్మతో మోక్షము పొందలేదు- భగవత్ప్రాప్తి అను మహాఫలము నుండి వంచింపబడినాడు. భగవత్ప్రాప్తి అను ఫలము ముందు వేల బ్రహ్మాధిపత్యము లకు కూడ గడ్డిపరకపాటైయైనను విలువ ఈయని పరమ విరాగుల దృష్టిలో మహోత్కృష్టము, నిత్యము, అనంతము అయిన భగవదనుభవమునుండి వంచింపబడినవాడు కనుక జాలిపడదగినవాడు. అంతేగాని, సామాన్య దృష్టిలో అతడు కూడ ప్రశంశనీయుడే. ఆతని యోగము సిద్ధిపొందకము:ందే

దేహపతనము కలుగుటచే, మోక్షము మాత్రము లభించదు. ఉత్తరలోకములకు పోయినపుడు ఆతనికి ఉన్నత పుణ్యలోకములే నివాస యోగ్యములు. కాకపోయినచో ఉండునది ఎక్కడ ? ఏమి పాపము చేసినాడని నరలోకము లభించును ? నరక లోకములకును ఆతనికిని ఏమియును సంబంధమే లేదు. ఇక కామ్యముతో పుణ్యము చేయలేదుగదా ! మరి పుణ్య లోకములు మాత్రము ఎట్లు లభించును అనరాదు. నిష్కామ్యముగా భగవత్పరమైన యోగము సాధించువాడు, ఏ స్వల్పము చేసినను, అది గొప్పగొప్ప పుణ్యకర్మలు కామ్యముగా చేయుటకంటె, ఎంతో ఉత్కృష్టమైనది. అందువలననే కృష్ణభగవానుడు "స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" (గీత 2-40) ఈ ధర్మము ఎంత స్వల్పమైనను మహాభయమునుండి రక్షించుచున్నది అని చెప్పియున్నాడు. కనుక అట్టి ధర్మమును ఏ స్వల్పమో ఆచరించి దేహమును విడిచినను, మరుజన్మ ఎత్తిగాని పూర్తిచేసికొనుటకు వీలులేదు. కనుక ఈలోపల ఆతనికి ఫలముగా, మహా పుణ్యములు చేసిన వారికి లభించు పుణ్యలోకములలో గౌరవ స్థానము లభించును.

అక్కడ చాలకాలము ఆ పుణ్య భోగములు అనుభవించి, తరువాత మరల ఈలోకమున సదాచార సంపన్నులును అనగా మరల ఆతడు వెనుకటి జన్మలోని యోగమును

సాగించుకొనుటకు అనుకూలమైన సదాచారము కలవారును, శ్రీమంతులును అయినవారి ఇంట జన్మించును.

పుణ్యలోకములు కూడ రెండు విధములుగ ఉండును. కామ్యముగ పుణ్యకర్మల నాచరించి, భోగము లనుభవించుటకై పోవు పుణ్యలోకములు - అక్కడ భోగము లనుభవించిన కొలదిని వానికి సంబంధించిన సంస్కారములు అంటుకొనుచునే ఉండును. మరల ఈ లోకమున శ్రీమంతుల ఇండ్లలో పుట్టుటయును, ఇక్కడకూడ భోగము లనుభవించుటయును జరిగి, అందువలన కూడ ఆ సంస్కారములే వృద్ధియై, భోగాసక్తి పెరిగి, మరల కామ్యముగా పుణ్యకర్మలు చేయుటయును, ఆ పుణ్య లోకములలో ఆ భోగము లనుభవించుటయును జరుగుచుండును. ఇట్లే వారు పుణ్య లోకములకును మర్త్య లోకమునకును మధ్య చుట్లు పెట్టుచుందురు. ఇట్టివారి విషయము ఇక్కడ చెప్పబడలేదు.

యోగభ్రష్టులలో రెండు రకములైనవారు కలరు. యోగమును అభ్యసించుచు, దానికి తగిన దోహదములు ఆచరించకపోవుటచేతను, విషయలోలుర సంపర్కాదులచేతను, వారిలో అంతఃకరణమందు బలాత్కారముగ నొక్కిపెట్టబడుచున్న భోగాసక్తి, దానికి తగిన అనుకూల పరిస్థితు లేర్పడినప్పుడు, ఉద్రేకించి, చెలరేగి ఈ యోగియొక్క ఇంద్రియములను మనస్సును విపరీతముగా కలతపెట్టి విషయములలోనికి

పడద్రోయును - ఇదికూడ ఒకరకమైన యోగభ్రష్టత్వమే. కాని, వానిని పతితుడని అందురు. అతడు ఈ జీవితములోనే తట్టుకొని, హెచ్చరిక కలిగి, మరల పట్టుదలతో సాధన చేసిన మంచిదే. లేకున్న ఆతనికి రౌరవాది నరకానుభవము తప్ప పుణ్యలోకము లుండవు. కనుక ఇక్కడ చెప్పబడిన యోగ భ్రష్టుడు అతడు కాడు.

ఇక రెండవరకము :- విరక్త యోగభ్రష్టుడు. ఈతడు భోగాసక్తిని సక్రమ పద్ధతిలో అణచుకొనుచు, వైరాగ్యము కలిగి, యోగము నాచరించుచుండును. ఇట్టివాని అంతకరణములో దృఢాధ్యవసాయమునకు కొంచెము కొరత ఉండుటచే, మరణకాలములో, మరణబాధను తట్టుకొనలేక, యోగము నుండి మనస్సు చలించవచ్చును - యోగమునుండి చలించినదేగాని, విషయముల మీదకు పోలేదు. ఆ బాధమీదకు వచ్చినది ఆ మనస్సు. అందుచేత ఆతనికి మోక్షము లభించదు. పాపములు చేయలేదు; భోగాసక్తి అణచబడియే ఉన్నది. కనుక మనస్సు భోగముల మీదకు, కాంక్షలమీదకు పోలేదు. ఇట్టి విరక్త యోగభ్రష్టులకు పుణ్యలోకములలోనే తగిన ప్రదేశము లుండును. అక్కడి భోగములు సంస్కారమును కలిగించవు - ఈతడు మరణించునప్పటికి అంతఃకరణములో భోగాసక్తి, నశించినది నశించగా అణచబడియైనను, కొంత ఎక్కువగ ఉన్నయెడల, దానికి తగినట్లు తగినంతకాలము ఆ

పుణ్య లోకములలో ఉండును. ఈ శ్లోకములో ఇట్టివానిని గురించియే చెప్పుచున్నాడు. ఎక్కువ కాలము అక్కడ భోగములను అనుభవించి, మర్త్య లోకములో పూర్వజన్మలోని యోగమునే మరల సాగించుటకు తగిన సదాచారము కలిగిన శ్రీమంతుల ఇండ్లలో పుట్టును.

విరక్త యోగభ్రష్టులలోనే, మరణకాలము నాటికి భోగాసక్తి అతిస్వల్పముగా ఉండువారు, ఆపుణ్యలోకములలో తక్కువకాలము నివసించి, ఈలోకములో సదాచార సంపన్నులైన శ్రీమంతుల గృహములలో పుట్టుదురు. ఆసక్తి పూర్తిగ పోయి, వైరాగ్యయుక్తుడైన యోగికి మరణకాలములో అట్లు యోగమునుండి మనస్సు చలించిన యెడల, అట్టి యోగభ్రష్టుడు ఆ పుణ్యలోకములకు పోక, సరాసరి ఇక్కడనే యోగుల గృహములలో పుట్టును. ఈతనిని గూర్చియే నలుబది రెండవ శ్లోకములో చెప్పబడినది.

భరతునిస్థితి దానికి మధ్యస్థితిలో నున్నది. వైరాగ్యయుక్తముగనే, నిష్కామ్యముగనే తపస్సు చేసినాడు. కాని చివరకు మరణకాలములో అతని మనస్సుకూడ యోగమునుండి చలించినది. కాని యోగమునుండి చలించి, మమకారముతో కూడి లేడిమీదకు వచ్చినది. అతనికి పుణ్యలోకములు లభించక నీచమైన లేడిజన్మ కలిగినది. తరువాత మాత్రము ఆతడు క్రిందటి జన్మలో చేసిన తీవ్ర తపోమహిమచే

జడభరతుడై పుట్టినాడు. శ్రీమంతుల గృహములలోను పుట్ట లేదు; యోగుల ఇండ్లలోను పుట్టలేదు. యోగియై పుట్టినాడు గాని, ప్రతికూల వాతావరణములో పుట్టినాడు. అది ఆతని చలించిన కారణముయొక్క ఫలము. కాని తీవ్ర తపోబలముచే, ఆ వాతావరణము ఆతని నేమియు చేయలేకపోయినది; తరించి నాడు. ఇక్కడ చెప్పబడిన యోగభ్రష్టుడు ఇట్టివాడు కూడ కాడు.

ఈ శ్లోకములో "శాశ్వతీ స్సమాః" అనగా 'శాశ్వత మైన సంవత్సరములు' అని అర్థము చెప్పవలయునని కొంద రందురు. కాని అది సరికాదు. ఇక్కడ అనేక సంవత్సరములు అనియే అర్థము చెప్పవలయును. ఏలయన అతనికి మరల భూలోకమున పుట్టుక చెప్పబడి ఉన్నది. తిరిగి వచ్చుట ఉన్నదానిని శాశ్వతపదవి అని అనుటకు వీలులేదు. కనుక, అనేక సంవత్సరముల కాలము అనియే అర్థము చెప్ప వలయును.

శ్లో॥ అథవా యోగినామేవ
కులే భవతి ధీమతాం ।
ఏతద్ధి దుర్లభతరం
లోకే జన్మ యదీదృశం ॥ 42

ప. వి:-అథవా, యోగినాం, ఏవ, కులే, భవతి, ధీమతాం, ఏతత్, హి, దుర్లభతరం, లోకే, జన్మ, యత్, ఈదృశం.

టీక —

అథవా = లేక,
ధీమతాం = ధీమంతులైన,
యోగినాం = యోగులయొక్క,
కులే ఏవ = కులమునందే,
భవతి = (జన్మ) కలుగుచున్నది,
ఈదృశం = ఈవిధమైన,
యత్ జన్మ = ఏ పుట్టుకైతే కలదో,
ఏతద్ధి = అదియే,
లోకే = భూలోకమునందు.
దుర్లభతరం = అతి దుర్లభమైనది.

తా. లేక, బుద్ధిమంతులైన యోగుల కులమందైనను పుట్టుక లభించుచున్నది. ఇటువంటి జన్మ లోకములో చాల దుర్లభము గదా!

అమృతవాహిని :—

దీని వెనుకటి శ్లోకములో యోగభ్రష్టుని స్థితిని వర్ణించి చెప్పి, ఇప్పుడు ఈ శ్లోకములో కేవలము విరక్త యోగభ్రష్టుని గురించి చెప్పుచున్నాడు. ఆతని అంతఃకరణములోని భోగాసక్తి పూర్తిగ నశించినది. అందుచే ఆతనికి దేహా

పతనము కలుగగనే, సరాసరిగ ఈలోకములోనే యోగుల వంశమునందు జన్మ కలుగును. కాని, ఇట్టి జన్మ లోకములో చాల దుర్లభముగదా! 'అథవా' అనుచుటచే వెనుకటి శ్లోకములో చెప్పబడినవాడు గాక, భోగాసక్తి పూర్తిగ నశించిన వైరాగ్యసంపన్నుడైనయెడల, వెనుకటి శ్లోకములో చెప్పినట్లు పుణ్యలోకములలో చాల సంవత్సరములు నివసించనక్కర లేకయే అని భావము.

దేహము విడువగనే వెంటనే యోగుల వంశమునందు జన్మించి, ఆ జన్మలో ఆ కొంచెము కొరతను తీర్చుకొని, పరమపద స్థానమునకు పోవును. పుణ్యలోకములకు పోవుట అనునది ఈ రెండురకములైన యోగభ్రష్టులకును సమానమే.

మొదటివానికి సదాచార సంపన్నులైన శ్రీమంతుల గృహములో జన్మ కలుగును. రెండవవానిని గురించి, అథవా అనుటచే యోగులవంశమునందు జన్మకలుగును అని అర్థము చెప్పుటకు వీలున్నదేమో అని విచారించినారొకరు. అట్లు చెప్పుటకు వీలులేదు. పరమవైరాగ్య సంపన్నులకు ఈ ఏ కారణముచేనైనను భగవదనుభవమునకు విలంబము కలుగుటయే ఒక శిక్ష. అది వారు సహించలేరు. కనుక, వెంటనే ఇక్కడనే యోగుల వంశమునందు జన్మకలిగి, వెంటనే పూర్తిచేసుకొని పరమపదమునకు పోదురు. కాని, అట్లు జరుగుట, అట్టి జన్మ కలుగుట లోకములో అరుదు- చాలదుర్లభము.

ఈ 'దుర్లభతరం' అను విశేషణము నలుబది ఒకటవ, నలుబది రెండవ శ్లోకములలో చెప్పిన రెండు విధములైన జన్మలకును విశేషణమా, లేక నలుబది రెండవ శ్లోకములో చెప్పిన ఒక్క జన్మకే విశేషణమా అను ప్రశ్న కలుగుచున్నది. కొంతమంది ఈ విశేషణము ఈ రెండు విధములైన జన్మలకును సంబంధించును అనుచున్నారు. కాని, ఈ విశేషణము యోగుల వంశమందు కలిగెడి జన్మకు మాత్రమే సంబంధించినది అని అమృతవాహిని అభిప్రాయము. ఏలయన. ఒకే విధమైన జన్మలను గురించి చెప్పునపుడు జాత్యేకవచనముగా జన్మ అని ఉపయోగించవచ్చును. వేరు విధములైన జన్మలను గురించి చెప్పునప్పుడు ద్వివచనమో, బహువచనమో ఉపయోగించియే తీరవలయును. ఇక్కడ ఏకవచనము ఉపయోగించుటచే, 'దుర్లభతరం' అను విశేషణము యోగుల వంశమునందు కలిగెడి జన్మకు మాత్రమే సంబంధించినదని తెలియవలయును.

శ్లో॥ తత్ర తం బుద్ధి సంయోగం
లభతే పౌర్వ దైహికం ।
యతతే చ తతో భూయః
సంసిద్ధౌ కురునందన ॥ ४३

ప. వి:-తత్ర, తం, బుద్ధి సంయోగం, లభతే, పౌర్వ దైహికం, యతతే, చ, తతః, భూయః, సంసిద్ధౌ, కురునందన.

టీక :—

కురునందన = అర్జునా !
తత్ర = అక్కడ,
పౌర్వదైహికం = పూర్వదేహముతో చేసిన సాధన వలన కలిగిన,
తం = ఆ,
బుద్ధిసంయోగం = సమత్వబుద్ధితోడి సంయోగమును,
లభతే = పొందుచున్నాడు,
తతః = దానియొక్క ప్రభావమువలన,
సంసిద్ధౌ = భగవత్ప్రాప్తి రూపమైన సిద్ధికొరకు,
భూయః = విశేషముగా,
యతతే చ = ప్రయత్నము చేయుచున్నాడు.

తా. ఓ కురునందనా ! ఆ జన్మలో అతడు క్రిందటి జన్మలోని సాధనచేత కలిగిన సమత్వరూపమైన బుద్ధితో సంయోగమును పొందు చున్నాడు. దాని ప్రభావము వలన భగవత్ప్రాప్తి రూపమైన సిద్ధికొరకు మరియు విశేషముగా ప్రయత్నించుచున్నాడు.

అ మృ త వా హి ని :—

నిద్రపోయి లేచినవాడు పూర్వదినమున ప్రారంభించి, కొంతవరకు చేసి విడిచిన పనిని, మరల ప్రారంభించి ఎట్లు పూర్తిచేయునో, అదే విధమున ఈ యోగభ్రష్టుడు ఇట్లు యోగుల కులమున జన్మించి, తాను క్రిందటి జన్మలో

యోగమును ఎంతవరకు సాధించినాడో, అక్కడి నుండియే మరల ఇప్పుడు ప్రారంభించును. ఆతనికి ఈ జన్మతో సరి. భగవత్ప్రాప్తి రూపమైన సిద్ధిని పొందుచున్నాడు. ఇక ఆతనికి జన్మలు లేవు. క్రిందటి జన్మలో విడిచినది ఈ ఒక్క జన్మలో సాధించగలడా అనిన సాధించగలడు. క్రిందటి జన్మలో సాధించినదే చాలవరకు, ఉత్తరలోకములకు పోయి, దేవతా శరీరముతో, అక్కడ మహాపుణ్యాత్ములు అనుభవించు భోగములు అనుభవించుటకూడ భగవత్ప్రాప్తికి ఆటంకముగా తోచుటచే, వానిని భోగములుగా తలచక, ప్రతిబంధకములుగా తలచి, సహించలేని వైరాగ్యము కలవాడగుటచేగదా ఆ ఉత్తరలోకములకుకూడ పోకుండ, వెంటనే ఈ లోకములో మహాదుర్లభమైన యోగుల వంశములో జన్మ పొందినది! అట్టివాడు తీవ్ర ఆవేదనతో తీవ్రాతితీవ్రముగా యోగ మార్గమునందు పరుగులు పెట్టును. ఇంక వానికి, జన్మించిన చోటు, వాతావరణమును, పరిస్థితులును - అన్నియునుకూడ పరమానుకూలములుగ ఉండును. తరువాత తాను క్రిందటి జన్మమున సాధించిన యోగముయొక్క ప్రబలములైన సంస్కారములును అపరిమితముగ సహాయము చేయును. సాంసారిక మానవుడు సహజముగా భోగాసక్తి కలవాడై, ఐహిక భోగముల కొరకే ప్రయత్నించును. ఆతని సంస్కారములు కూడ గొప్పబలము కలవియై, అతివేగముతో ప్రపంచ విషయముల వైపునకే లాగుకొని పోవును. ఇంక ఆతడు

విషయములవైపునకు ఎంత వేగముగపోవునో, చూచు చున్నాము గదా! కాని, పరమార్థము వైపునకు పోవుదమని ఎప్పుడైనను తలచినను, సంస్కారములు బలవంతముగా విషయముల వైపునకు లాగుచుండుటచే, సామాన్యమానవుడు వివశుడై విషయముల వైపునకే పోవును కాని, వాని ప్రయత్నము లేక, సంస్కారములచే లాగబడుటచే కొట్టుకొనుచూ పోవును ఇక్కడ అట్లుకాక, సహజముగనే పరమార్థము కొరకు ప్రయత్నించుచుండుటయును, సంస్కారములుకూడ బలముగా అటే లాగుచుండుటయును, కారణములుగా, మొదటివాడు ఎట్లు విషయములవైపునకే, ఏ విఘ్నములును లేక అతివేగముగా ప్రయాణముచేయునో, అట్లే ఈ యోగుల కులమునందు జన్మించినవాడును పరమార్థమువైపునకే, ఏ విఘ్నములును లేక ప్రయాణము చేయును.

అ వ తా రి క :-

ఇక 'శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే' అని చెప్పబడిన మొదటివానిని గురించి చెప్పుచున్నాడు ఈ శ్లోకములో—

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య
శబ్దబ్రహ్మాతివర్తతే ॥ ౪౪

ప. వి :- పూర్వాభ్యాసేన, తేన, ఏవ, హ్రియతే, హి, అవశః, అపి, సః, జిజ్ఞాసుః, అపి, యోగస్య, శబ్దబ్రహ్మ, అతివర్తతే.

టీక :—

సః = వాడు (శ్రీమంతుల గృహములో జన్మ కలిగినవాడు),
అవశః అపి = అవశుడై ఉన్నప్పటికిని,
తేన = ఆ,
పూర్వాభ్యాసేన ఏవ = పూర్వాభ్యాస బలముచేతనే,
హ్రియతే = లాగబడుచున్నాడు,
యోగస్య = భగవత్ప్రాప్తి కొరకు చేయు ప్రయత్నముయొక్క,
జిజ్ఞాసురపి = ఆలోచన కలవాడు కూడా,
శబ్దబ్రహ్మ = శబ్దబ్రహ్మమును,
అతివర్తతే = అతిక్రమించుచున్నాడు.

తా. శ్రీమంతుల ఇంటియందు జన్మించిన యోగభ్రష్టుడు, అవశుడైకూడ, పూర్వజన్మములోని అభ్యాసముయొక్క సంస్కార బలముచేతనే భగవంతుని వైపునకు ఆకర్షింపబడుచున్నాడు. యోగమునందు నిజమైన శ్రద్ధ కలవాడు - పూర్వజన్మయందలి ఆ అభ్యాస సంస్కార బలమున యోగతత్త్వ జిజ్ఞాసువైనవాడు, శబ్దబ్రహ్మమును అనగా వేదోక్త కర్మ విధానమువలన కలిగెడి ఊర్ధ్వలోక భోగములను - అతిక్రమించి పోవుచున్నాడు.

అమృతవాహిని :—

సదాచార సంపన్నులైన శ్రీమంతుల ఇంటియందు జన్మకలిగిన యోగభ్రష్టుడు, తన పూర్వజన్మలో చేసిన యోగాభ్యాసము యొక్క సంస్కారములు బలాత్కారముగ లాగగా, మరల భగవత్ప్రాప్తి కొరకైన ప్రయత్నములో సహజముగనే ప్రవేశించుచున్నాడు. సంస్కార బల మట్టిది. ప్రతి మానవుడును సంస్కారములకు వశుడైయే లోకములో పనులు చేయుచుండును. అట్లే ఇతడుకూడ, తన పూర్వజన్మలోని సంస్కారములకు వశుడై, మరల భగవత్ప్రాప్తి కొరకైన ఆ ప్రయత్నమును కొనసాగించును. క్రమముగా, ఈ జన్మలో గాని, మరుజన్మలోగాని తప్పక సిద్ధిని పొందును. కనుక అజ్ఞుడు అనుకొనినట్లు నశించుట మాత్రము జరుగదు.

శ్లో॥ ప్రయత్నా ద్యతమాన స్తు
యోగీ సంశుద్ధ కిల్బిషః ।
అనేక జన్మ సంసిద్ధ
స్తతో యాతి పరాం గతిం ॥ ౪౫

ప. వి:-ప్రయత్నాత్, యతమానః, తు, యోగీ, సంశుద్ధ కిల్బిషః, అనేకజన్మ సంసిద్ధః, తతః, యాతి, పరాం, గతిం,

